శ్రీ

# అశ్వత్థభారతము.



రచయిత:-

'కవిరాజ' అశ్వత్థరావు,

కలుగోడు గ్రామము.

రాయదుర్గము తాలూకా, అనంతపురమండలము.

1961.





"కవిరాజ"
కలుగోడు అశ్వత్థరావు

"కవిభూషణ"
కప్పగల్లు సంజీవమూర్తిరావు

**Burgula Ramakrishna Rao,**
**GOVERNOR,**
**Uttar-Pradesh.**

Lucknow
Governor's Camp,
Uttar-Pradesh.
24-9-60.



భారతరామాయణాదులు వేదోపనిషదర్థములను సోదాహరణముగా ప్రవచించి మానవకోటికి ధర్మార్థకామమోక్షరహస్యములను సులువుగా దెలుపునట్టి మహేతిహాసములు. అందు భారతము పంచమవేదమునా బరగు ప్రధానేతిహాసమగుటచే భారతావనియందంతట నాబాలగోపాలమునకు సుపరిచితమైన గ్రంథము. దీనిని వివిధ భారతీయభాషలలో నేదోయొకస్వరూపమున పరివర్తన మొనర్చి ఆయాభాషాసాహిత్యవేత్తలు లోకోపకార మొనర్చిరి. ఆంధ్రమున కవిత్రయముచే రచింపబడిన మహాభారతము సుప్రసిద్ధము, సర్వమాన్యము. ఆంధ్రభాష ప్రపంచమున ప్రవర్తిల్లునంతవరకు నా మహాగ్రంథము చిరస్థాయియై భారతాంధ్రీకర్తలగు మహాకవుల యశశ్చంద్రికలనేగాక యాంధ్రజాతియొక్క ప్రతిభను జగద్విదిత మగునట్లు ప్రసరింపజేయుచుండు ననుటలో సందియము లేదు.

వ్యాసప్రోక్త మగు మహాభారతము పదునెనిమిది పర్వ ములు గల బృహద్గ్రంథ మగుటచేత నాంధ్రకర్తలకు దీనియను వాదమును సంపూర్ణ మొనరించుటకు దాదాపు మూడుశతాబ్దముల కాలము పట్టినది. తరువాత గడచిన ఐదుశతాబ్దముల కాలమునందును ప్రతిభావంతులగు మహాకవులు పలువురు మహాకావ్యములను వ్రాసిరి. కాని భారతకథను సంపూర్ణముగా తిరిగి కవనించుటకు సాహసింపలేదు. తదంతర్గతములగు నాఖ్యానములను, ఉపాఖ్యాన ములను కథావస్తువుగా గొని కావ్యములను ప్రబంధములను రచించి సంతృప్తిజెందిరి. కాని యంతకుపూర్వము స్వతంత్రించి సంపూర్ణ ముగా భారతేతిహాసము నెవరును రచించినట్లు నా యెరుకకు రాలే దు. శ్రీ కరణం అశ్వత్థరావుగారు యట్టి సాహసమొనర్చిన యీయాధు నికకవులలో ప్రథములుగా నగపడుచున్నారు.

శ్రీ రావుగారు "కవిరాజ" బిరుదాంకితులు. అనంతపురం జిల్లా రాయదుర్గం తాలూకా కలుగోడు గ్రామ వాస్తవ్యులు. దండక రామాయణము, గీతాదండకము, హరిగోవిందశతకము, మున్నగు రచనల గావించి భాషాసేవకు లందరికి సుపరిచితులైరి. కన్న డభాషా సంస్కృతమునందు ప్రఖ్యాతపాండిత్యముకలిగి "భావగీతెగళు" యను కన్నడఖండకావ్యసంపుటిని ప్రకటించిరి. కన్నడభాషలో సుప్రసిద్ధమగు "అనుభవామృత" మను వేదాంతగ్రంథముయొక్క పద్యానువాదన మొనరించి ఆంధ్రపాఠకలోకమున కందించి పండితు

లయొక్క యాదరాభిమానములకు పాత్రులైరి. పురాకృతసుకృత భాజనులై ప్రతిభా వ్యుత్పత్తి గల రావుగారు "అశ్వత్థభారతమును రచింపబూని విరాటపర్వమువరకు పూర్తిచేసి ప్రకటించి యున్నారు. శేషించిన పర్వములను త్వరగా పూర్తిగావించి సంపూర్ణభారతేతిహాస మును తిరిగి తెలుగున ప్రపంచించిన యశము నార్జించెదరని విశ్వ సించుచున్నాను.

భారతకథ సాగరమువంటి విస్తారముగలది. విస్తీర్ణతకు భార తము పెట్టినపేరు. అంతటి మహేతిహాసమును సంక్షిప్తమొనరించి, క్రమబద్ధస్థాయిని వహించుచున్న యాఖ్యానోపాఖ్యానముల సారమును విడనాడక నీవిధమగు రసవత్కావ్యమును రచించుట కష్టసాధ్యమని కవితావీథులందు చరించు సాహిత్యకులేకాక సహృదయులగు పాఠ కులును అంగీకరింపక తప్పదు. విరాటపర్వాంతమువరకుగల భా రతకథను చిన్నసైజు 750 పుటలలో కుదించి శ్రీరావుగారు తమ సామర్థ్యమును రుజువుచేసుకొన్నా రనుటలో సందియములేదు. ఇది సంక్షిప్తకావ్యమగుటచే దీనిని వ్యాసప్రోక్తమగు సంస్కృతమూల ముతోగాని నన్నయాదిమహాకవుల ఆంధ్రమహాభారతముతోగాని పో ల్చి కవిరచనావిధానమును లేక కవితాసామర్థ్యమును పరామర్శింప బూనుట యన్యాయమగును. విహంగమదృష్టిని సారించినేను కొన్ని భాగములను చదివి చూచితిని. కవనము బహుళ ధారాశుద్ధి గల్గి నాతికఠినమైన సరళశైలిలో కొనసాగినది. తెనుగునుడికారమునకు

ప్రాముఖ్య మొసంగబడినది. బృహద్గ్రంథములోని ముఖ్యాంశములను పంచమవేదముయొక్క ప్రయోజనమును దృష్టిలోనుంచుకొని కవి గారు సరిగా నుల్లేఖించిరా లేదా యనువిషయమును పూర్తిగా పఠించి మూలముతో పోల్చి చూచిన గాని తెలుపబడదు. అంతటి సామర్థ్యముగాని యవకాశముగాని నాకు లేనందున యీపని పండితులకును, విమర్శకులకును వదలుచున్నాను. ఏదియెట్లున్నను శ్రీరావు గారి యీ ప్రయత్న మొసర్చినందులకు హృదయపూర్వకముగా నభినందించుచు, ఆంధ్రసాహిత్యోద్యానము వారిసమోదిత కావ్యకుసుమ పరిమళముచే సువాసితమై పాఠకలోకమున కామోద మొసగూర్చు గాక యని యభిలషించుచున్నాను.

బుధజనవిధేయుడు,

(సం.) బూర్గుల రామకృష్ణరావు.



శ్రీ

# ఉపక్రమణిక.

(సుప్రసిద్ధ విమర్శకులు "శతకవాఙ్మయసర్వస్వ- సౌహ్రూకా" ద్యేత్యా-ద్యుద్గ్రంథరచయితలు నగు బ్ర॥ శ్రీ "విద్వత్కవిభూషణ" విద్వాన్- వేదమువేంకటకృష్ణశర్మగారు, మదరాసు.)

---

"కావ్యం యశసేర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యఃపరనిర్వృతయే కాన్తాసమ్మిత తయోపదేశయుజే"

అభ్యర్థనము:-

సంస్కృతాంధ్రకర్ణాటకసాహిత్యములఁ గూలంకషముగఁ దఱచిచూచి, యేతద్భాషాభిజ్ఞత కవితావీథుల నిరాఘాటపాటవమున విహారమొనరించి, దండకరామాయణానుభవామృతాశ్వత్థశాదికకృతుల రచించి, దిక్సంచయముల నచంచలయశఃచంద్రికల నించిన రాయలసీమకవిరాజు- ప్రకృతము సంక్షేపరూపమున దీపించు- సమస్తానూన మాననీయమహితధర్మరత్ననిధియు- మహారాజాన్వవాయవర్ణనాంబుధియు నగు- భారతమును రచించి సార్థకజన్ము లగు టెంతేని ప్రశంసింపఁ

డుగను. కాని యీగ్రంథమున కుపోద్ఘాతము వ్రాయఁ గృతికర్తలగు శ్రీ అశ్వత్థరావుగారు నన్నుఁగోరుట- వారికి నాయందుఁ గలయత్యంతాదరాభిమానములకుఁ దార్కాణ మగునేమో;- కాని కించిజ్జ్ఞుఁడ నగునే నందులకుఁ దగుదు నని పూనుకొనుటమాత్రము సాహసమే యని భావింతును. అయినను- ఈనెపముననేని పరమపవిత్రమగు- భారతేతిహాసామృతమహార్ణవమందలి లోఁతుపాతు లరసి, తదంతర్గత ప్రాచీనార్యజీవనవిధానమును, ధర్మమార్గానుసరణమును బరిశీలించుభాగ్యము లభించినందులకు అమందానందతుందిలహృదయుండనై- యిందులకు దొరకొంటి.

వేదవ్యాసాపరనామప్రశస్తిఁ జెన్నొందినకృష్ణద్వైపాయనుచేఁ జెప్పఁబడినమూలగ్రంథమునకును- తత్ప్రతికలనఁదగు నితరాంధ్రకృతులకును గలతారతమ్యముం దడవుటకు మున్న దానిపై వేదత్రయోదితధర్మబల మెంతగాఢముగ నుండునదియుఁ జక్కఁగబోధపడఁగలదు. కేవలముశ్రుతు లధ్యయనమొనర్చుసామాన్యుల కందని కందలి విషయము లవగాహనము చేసికొనుకార్య మంతసుకరమైనదికాదు. కానఁ జేతనైనంతవఱకు అట్లొనర్చినయనంతర మందలిపరమార్థముం గూర్చి విపులీకరింపనుద్యమించితి.

కావ్యాదికశబ్దనిర్వచనము:—

కవికృత మెద్దియో యది "కావ్య" మని యార్యవచనము. తదవాంతరభేదవివేచనముతో మన కిటఁ బ్రసక్తి యనవసరము.

"మహాభారత" మితిహాస మని పరిశోధకులలోఁ బెక్కు రిదివఱకే నిర్ణయించిరి. శ్రీమద్రామాయణభాగవతము లొక్కొక్కటియు నొక్కొక్కయంశమునుగూర్చి మాత్రమే వివరించుటకు ఉద్దేశింపఁబడినవి. ఉత్తమమానవజీవితమును బ్రతిబింబించునది శ్రీమద్రామాయణము. భగవద్భక్తియోగరహస్యములను, శతాధికభాగవతులపుణ్యచరిత్రములను బ్రకటించునది భాగవతము. కాని, ప్రాజ్ఞులు భగవదవతారప్రయోజనమును ఉటంకించు శ్రీమద్రామాయణమును, ఆదికావ్యమని పేర్కొన్నను- నాస్తికుల కనేకులకు ఆస్తికతాప్రభావ మిట్టిదని తెలుపుభాగవత మత్యంతపవిత్రవంతమైనదని వాకొన్నను- "మహాభార" తేతిహాసమునకు ఈయార్యావర్తమునఁ గల నిరుపమాన ప్రశస్తి యారెంటికిని లభింపలే దనుట సత్యదూరము గానేరదు.

వేదములప్రశంస:—

భారతీయార్యజాతీయతాప్రభావమునకుఁ దన్నాగరికతాస్ఫురణమునకు, ఆధ్యాత్మికమార్గాన్వేషణమునకుఁ గారణ మగువిజ్ఞానసంపద మన వైదికలౌకికవాఙ్మయము లందత్యంతసమగ్రముగ వెలయుచు, ఈనాఁటికిఁగూడ అనశ్వరమై విశ్వవ్యాప్తమై విలసిల్లుచుఁ జలింపనిపునాదులపై నది యాధారపడియున్నది. వేదములు హైందవులకెల్లఁ బ్రభుసమ్మితములు.

ఋగ్వేదము విశేషముగ భౌతికనిగూఢతత్త్వమును, యజస్సు దైవమానవజాతులకుఁ బరస్పరముసంబంధించిన యజ్ఞయాగాదికకర్మ

కలాపవిధానములను, సౌకుమార్యశాశ్వతమనఃపటలనిర్వాసనాపూర్వక లలిత (కళా) శాస్త్రకౌశలమును- మర్త్యలోకజీవితసాఫల్యమునకు సహకరించు చతుర్వర్గపురుషార్థసాధనములను బోధించుచున్నవి. తన్నిగదితాచారవ్యవహారములకు మనపుణ్యభూమి క్రీడాంగణము. కావున తొల్లి వేదవిదులెల్లరంతర్ముఖులు. ఆధ్యాత్మికతత్త్వాన్వేషణము వారిపరాకాష్ఠ, చింతితార్థసంసిద్ధికుపాదేయమగుసన్మార్గ మని త్రయీదేవిని వారు ఉపాసించిరి. కాని;- దురవగాహగహనసంకాశము లగు-ఆమ్నాయము లోకపట్టునం జదివియందలినిగూఢభావాభినివేశనమునం దమయాధ్యాత్మికశక్తి నాకళించుకొనసమర్థులు గానందున అందలిసారము నుజక్కగను- సులభముగను- సూటిగను- న్వానుభవమునకుం దెచ్చుకొననగుపగునట్లు ఏయంశమున కాయంశము- సంగ్రహముగ- సమగ్రముగ- స్వాంతప్రశాంతిదముగ, ఉపనిషత్తులు మున్నగువానియందు సూత్రప్రాయములుగ నిమిడ్చి, ఆర్యస్మృతులే లోకసముద్ధరణైకదృష్టితో సంక్షేపించిరి.

## ఐహికాధ్యాత్మికశక్తులు.



మనప్రాచీనగ్రంథములం బరిశీలించితిమేని మనకం దెన్నియో విచిత్రము లగువిషయము లగపడును. అవి అస్వాభావికము లని కొన్నిశతాబ్దములక్రిందటివఱకు కనుకొనుచుంటిమి కాని ' ఈనాండందుం గొన్నిప్రత్యక్షముగం గనుంగొనుచున్నారము. అనాంటిమానవదృష్టి యాధ్యాత్మికవిషయములనుండి యాంటభౌతికపదార్థశోధనమునంక

కొంకెంత మఱఁగైనది. మఱఁగుటచే గాదు ఆవెంబడికిని సౌధాసాంతర సమ్మేళనమున సాన్నిహిత్యమును, సంబంధమును సమకూర్చి, ప్రక్షుభితాత్మగర్భమును బరిశోధింపను వేర్పఱచెను. అదియే దాని కొకమహాత్మ్యవైలక్షణ్యమును గలిగించి, నవనవోన్మేషచిత్రాతిచిత్రసృష్టులకు హేతుభూత మయినది. అది ఆర్ష్యకాలమునకే వాడుకలోనికి వచ్చినను, మనము గ్రహింపఁజాల కుంటిమి.

యుగములు మారినవి:— సామ్రాజ్యములు సకలమతములు గానీ— సౌధ్వాంతముల సర్వస్వములు సంహృతములయి చనినీ— గ్రహగతులకు గాసి తటస్థింపనీ!— ప్రపంచమంతటికిఁ బ్రళయమే ప్రాప్తింపనీ!— ఆర్యర్షిగణహృదయగత దివ్యతత్త్వమాత్రము— అనుదినమంతకంటె నభ్యుదయ మందవలసినదే. అది చిరస్థాయి యయి— మర్త్యలోకమునే స్వర్గతుల్యముగ మార్చివేయఁగలదు.

ఆ నాఁటి మనపూర్వులు గాలించిచూడని యైహికాధ్యాత్మికతత్త్వరహస్యములే లేవు. ఒకఁడు స్వర్గమునకు సోపానములు నిర్మించెను. మఱొకఁడు డమరుఁలను సురలోకమునుండి నరజగతికి దిగిపంపెను. ఒకఁడు విరించి నెదిరించి, ఆతనిసృష్టికిఁ బ్రతిసృష్టి యొనర్చెను. ఒకఁడు దేవదానవసంగ్రామరంగములలో దేవేంద్రుని ఆహ్వానముం దలఁదాల్చి, యరిగి, యాతనికి సహాయపడెను. ఆనాఁటిమానవు లన్నింటను సుపర్వపరితతుల మించి చరించిరి. దానవులతో దారుణరణములు గావించిరి— వీని నభూతకల్పనము లనుకొనుఁడు!

పక్షపాతీకరణము లనుకొనుఁడు! కవితాచమత్కృతు లనుకొనుఁడు! తుదకు బుద్ధిదౌర్బల్యములే యనుకొనుఁడు! ఇంకేమైన ననుకొనుఁడు కాని, వా రన్నవి కావని మాత్రము వాదించుసాహసము నావఱకు లేదని దృఢముగఁ వచింపఁగలను.

## శ్రుతివ్యక్తవిధులు:- ధర్మములు.



ఇఁకఁ బ్రకృత మనుసరింతము:- పాంచభౌతికశక్తులను అనుసరించి- యైహికధర్మబద్ధము లగువిధుల నాచరించుట, ప్రాణి జాలమున కెల్ల సహజము. వానిఁ దప్పించుట యన్న "నేలవిడిచి సాముచేయుటవే"- యగును. ఏతత్కారణమునఁ దప్పింపరానిముప్పు లప్పుడప్పుడు దిప్పటులు గలిగించును. వానిఁ దొలఁగించు కొనుటకు ఉపాయాన్వేషణ మత్యంతావశ్యక మగుననుటమాత్రము మనము మఱవరాదు. వేదములు, వేదాంగములు, ఉపవేదములు, ఉపనిషత్తులు బ్రాహ్మణములు, ఆరణ్యకములు మొదలగునవి- అట్టియుపాయాన్వేషణార్థమే ఏర్పడినవి కాని, విద్వజ్జనైకజుష్టము లగుతత్త్వరహస్యములను తామయి పలుమఱు పఠించినను, అనుభవశూన్యులైన కుక్షింభరులయుపదేశమునను- బామరులకుఁ బనుపడు ననుట కలలోని వార్త. పారమార్థికనిగూఢతత్త్వసాధన మగు ఆత్మజిజ్ఞాస- స్వానుభవమేమాత్రము లేకయే కేవలము విషయవిత్తము లగు నుపదేష్టలచేఁ దీర్చుకొనఁనెంచుట చీఁకటిలోఁ దారట్లాడుటవంటిది. అట్టివ్యర్థపరిశ్రమచే ఆయమూల్యరత్నము చేపడదు, విషయగ్రహణము వేదపఠనో

పలబ్ధము గావచ్చుఁగాక! కాని, యనుభూతి ఆజన్మసిద్ధముగదా! దానఁ జిత్తసంస్కారము గలుగును. అట్టియెడ మర్త్యలోకముననే దైవిక శక్తులను సముపార్జించుకొన ననువగును.

శ్రుతిసూక్తసూత్రములలో సారాంశము అవగాహనము చేసికొనఁగోరువారికెల్ల- అదిసుసాధ్యము గాదని యూహించి తపోధను లైనమహర్షిపుంగవులె, తన్నిక్షిప్తవిజ్ఞానసంపదను బురాణేతిహాసకావ్య భండారముల నించి, తదపేక్షకులకు అక్షయముగఁ జూఱలిచ్చిరి. బోధ్యవిషయములు సోదాహరణములుగఁ బామరులకు సహితము మనస్సున నాటునట్లు వివరించిరి.

## కృతితతిస్వరూపనిరూపణము; భారతప్రభావము.



పదేశైకనీతి నుద్ఘాటించునెడ, దానిని బలపఱచుటకయి యుదాహరణముగ- నానఁగుపూర్వగాథగలకృతి "ఇతిహాస" మనియు, సర్గప్రతిసర్గాదిపంచలక్షణసమన్విత మైనది- "పురాణ" మనియు, అష్టాదశవర్ణనాబాహుళ్యముతోడను, కవిభావోల్బణోద్భూతాలంకారస్తోమముతోడను, వ్యంగ్యసూచితచమత్కృతులతోడను గూడినది "కావ్య" మనియుఁ దొల్లింటిపెద్దలు ఆయాకృతులయాకృతులంబట్టి నిరూపించిరి. ఈత్రివిధరచనములకుఁ గ్రమముగ- మహాభారతము, శ్రీమద్భాగవతము, శ్రీమద్రామాయణము- నిదర్శనములు. అందిట భారతేతిహాస

మే మనకుఁ బ్రసక్తమగుట. దానింగూర్చియే యించుక తెలిసికొనుట సమంజసము.

## మహాభారతేతిహాసకర్తృకము.

—O—

దీనికర్త వేదవ్యాసాపరాభిఖ్యగల కృష్ణద్వైపాయనమహర్షియే యని పలువురు విమర్శకులు చాటియుండు టటుండ, మహాభారతమే చెప్పుచున్నది. (ఈ గ్రంథమునకుఁ "పంచమవేద" మనియు "జయ" మనియు నామాంతరములుగలవు.)

విమర్శకులయభిప్రాయములకు గ్రంథస్థవిషయములుపబలకములుగ నుండ ఈకావ్యకర్తృకము మఱియొకని కెట్లును అంటఁగట్టఁజాలముగదా! మఱి సంస్కృతవాఙ్మయచరిత్రద్వితీయసంపుటమున శ్రీమల్లాదివారు కృతిపతిత్వనిర్ణయ మొనర్చుటలోఁ జాలతికమకలు పడుట విచార్యము. అందలిసత్యాసత్యములనుగూర్చి మనకిప్పు డనవసరము.

భారతాన్వవాయమహారాట్చరిత్రములను వర్ణించుటచేనిది మహాభారత మనుట యుక్తిసహము, నాలుగు వేదములలోని యావదంశములసారమెల్ల ఇందుఁ బొందుపఱుపఁబడియుండుటచేనిది "పంచమవేద"- మనం బరఁగుటయు సహజముగ సార్థకమే. కురుక్షేత్రసంగ్రామసీమఁ దుట్టతుదకు ధర్మాత్ములైనపాండుకుమారులకుఁ గలిగినజయముం గొనియాడుభాగము (యుద్ధపంచకము) "జయ"-మనియు నభిధానము నందినది. మొత్తమునకుఁ బై వివరించినపేళ్లు ప్రసిద్ధిఁగాంచిన "మహాభారతము"న కెంతేనియు తగియున్నవి.

దీనిని వేదవ్యాసమునియే వ్రాసె నని సర్వసాధారణముగ భారతీయులవిశ్వాసము. ఈవేదవ్యాసుఁడే X "కృష్ణద్వైపాయనుఁ డను ఆఖ్యతోఁ గనుపట్టెడు. కాని, కృష్ణద్వైపాయనుఁడనుభారత కర్తయు, వేదవ్యాసుఁడును ఒకేవ్యక్తియేకాక, విభిన్నవ్యక్తు లనియు, ఆహేతువుఁబట్టి— వేదవ్యాస—కృష్ణద్వైపాయనులు వేర్వేఱుమహర్షు లనియు భావించుటయే సమంజసమనియుఁ, గొందఱుపరిశోధకులు నిర్ణయించిరి. ఇందుల కాధారములు మృగ్యములు. భారతమునఁ జెప్పఁబడిన కృష్ణద్వైపాయనుఁడే వేదవ్యాసుఁడు. అతఁడే మహాభారతప్రణేత.

పర్వసంఖ్యాపరిగణనము :—

మహాభారతములోనిశాంతిపర్వకమును కృష్ణద్వైపాయన శిష్యులగు పైలవైశంపాయనాదులు వ్రాసిరని పరిశోధకులనిర్ణయము. ఎవరెవరేయేపర్వములు వ్రాసినను— మన కిట తద్విమర్శనముతోఁ బనిలేదు. గీర్వాణాంధ్రమహాభారతములు రెంటను, వ్యాసశిష్యుల ప్రస్తావ ముండుటచేఁ గాదని చెప్పనంతటితెగువ ఏవిమర్శకునికిని లేదు. తుదకాంధ్రీకర్తృత్రయములఁ దెలుఁగొనరింప శ్రీకారము చుట్టిన నన్నయభట్టారకుఁడును మూలగ్రంథకర్త, కృష్ణద్వైపాయనుఁడే యన్నాఁడు. *

---

X కృష్ణద్వైపాయనుఁడను బ్రహ్మర్షి వేదంబు లేకీభూతంబులై యేర్పడకున్న, ఋగ్యజుస్సామాథర్వంబులుగా విభాగించి— తనశిష్యులైన పైలవైశంపాయనసుమంత జైమినులం బంచి, క్రమంబునఁ జతుర్వేదసూత్రంబులఁ జేయించి వేదవ్యాసుండై"— (ఆది 1— పద్యము 30)

---

* ఇది 10వ పేజీలో అడుగున నున్నది.

మహాభారతము మొత్తముమీఁద ఒక్కలక్షశ్లోకపరిమిత మని విమర్శకులు వక్కాణించుచున్నారు. కాని, ప్రాచీనులప్రాఁతలు పరిశీలించితిమేని, శ్లోకసంఖ్య లొకదాన నున్నట్లు మఱొకదానఁ గాన్పింపదు. కృష్ణద్వైపాయనమహర్ష్యుక్త "జయ" మనుయుద్ధపంచకముమాత్రమే ఇరువదినాలుగువేలశ్లోకములుగలది. ("చతుర్వింశతిసహస్రీంచక్రేభారతసంహితాం.")

శాంత్యానుశాసనాదికాలలోఁ గథావస్తువు నాధారపఱచుకొని తఱచుయుతలు,— ఆయాయుగధర్మములు, వర్ణాశ్రమాచారవ్యవహారవిధులు, ఐహికాముష్మికసుఖసాధనమార్గములు, దుర్గకోశరాష్ట్రనిర్మాణపద్ధతులు, యజ్ఞ, యాగాదికనిర్వహణకార్యక్రమములు, లోకత్రయప్రజాప్రవృత్తములు, చతుర్వర్గప్రతిపాదితాంశవివరణములు— మున్నగునవి వివరించిరి. అవి కౌరవపాండవప్రథనవిషయముల కంటె మించియుండుటచే— దీనిని "పంచమవేద" మనుటయే యుక్తియుక్తమును, సముచితమును అగు నని వాదించువిమర్శకులును లేకపోలేదు.

---

"క. జననుత కృష్ణద్వైపా
యనముని వృషభాభిహితమహాభారత బ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచింపు మధికధీయుక్తి మెయిన్"—

(ఆది 1. పద్యము 16.)

పర్వవిభాగము:—

ఇది ఇరువదినాల్గువేలశ్లోకములు గల దనుటకును— ఆధారమున్నది. రోమహర్షణోదితమయిన వ్యాసప్రోక్త మహాభారతమందలి— ఆదిపర్వద్వితీయాశ్వాసమునఁ గలవిషయానుక్రమణికలోఁ గృష్ణద్వైపాయనుఁడు, వరుసగా, ఆశతపర్వాంతర్గతవిషయములను సంగ్రహముగఁ దెలిపియున్నాఁడు. కాని, మన కిప్పటికి లభించిన వానిలో— ఆదిపర్వము మొదలు, స్వర్గారోహణము (మహాప్రస్థానము) వఱకు మాత్రమే వ్యాసరచితము. తక్కిన దెవ్వరో పూరించినా రనుట నిక్కువము. ఇయ్యంశము ద్వితీయాధ్యాయమున నెఱుంగనగును.

"అష్టౌశ్లోకసహస్రాణి, హ్యష్టౌశ్లోకశతానిచ
ఇదం శ్లోకసహస్రాఖ్యం శ్లోకానాంపుణ్యకర్మణాం।
ఉపాఖ్యానైర్వినాజ్ఞేయం శ్రావ్యం భారతముత్తమం।
చతుర్వింశతి సాహస్రీంచక్రే భారతసంహితాం।
ఉపాఖ్యానైర్వినా తావద్భారతం ప్రోచ్యతే బుధైః
తతోప్యర్ధశతంభూయః సంక్షేపంకృతవానృషిః।
అనుక్రమణికాధ్యాయం వృత్తాంతానాం సర్వపర్వణామ్"॥—

మహాభారతకాలము:—

ఈవిషయమును ఇదివఱకే పరిశోధకులు, ముఖ్యముగ "పూనహా" నగర గీర్వాణసంస్థాపక్షమున ఉద్దండులైన పరిశోధకులు కార్వేటిపండితుని యాజమాన్యమున సిగపట్లతోఁ దమకు దొరకిన ఆధారములతోఁ బాటునఁ జాలవఱకుఁ జర్చించిరి. ఇటీవలివారును దాని నామోదించిరి. ఎప్పటికప్పుడు తాత్కాలికముగ నవి యున్నియు

విమర్శకులకు నకారణములుగనే కన్పట్టుట సహజము.

మహాభారతసమాపనకాలమునకును, ఏతద్రచనాకాలమునకును, నడుమ నెంతఅంతరమో చెప్పఁజాలము, గ్రంథకర్త కృష్ణద్వైపాయనుఁ డను వేఱుపేరుగల వ్యాసుఁడే— అనుకొన్నచో, నతఁడు కౌరవవంశము నిలిపినవాఁడగుట కథాప్రవృత్తకాలముననే మహాభారతరచనము జరిగియుండవలె నని కొందఱియభిప్రాయము. కాదనునెడ, అతనియవసానదశకుముందే తనశిష్యులకుఁ జెప్పఁగ "జయ" మను వ్యాసోక్తభాగమునాశ్రయించి, యాయవకాశమును బురస్కరించుకొని, కృష్ణద్వైపాయనోదితకథమాత్రమే కాక;— శ్రుతిని క్షిప్తసౌరాంశమెల్ల బయలువెడలి యుండవలె నని యూహింపఁదగును. కథజరిగినపిదపఁ, దాను మూలపురుషుఁ డైనకౌరవవంశము నాల్గైదుతరములవఱ కతఁ డున్నట్లు తెలియుచున్నను— అతనిచే నెఱిఁగిన శిష్యప్రశిష్యు లీగ్రంథము సమగ్రముగ బయలుపెట్టియుందురు. విమర్శకు లానడిమికాలమును వివరింపలేదు. కాని, యిది యెటుచూచినను,: హేత్వంతరములచే— క్రీ.పూ. పదునాఱవశతాబ్దమునకుఁగాని వ్రాయఁబడలే దనుట నిశ్చయము.

పర్వశబ్దౌచితి:— అష్టాదశసంఖ్యాప్రాధాన్యము.



భారతము రసవత్తరకథాఘట్టములతోఁ బ్రకాశించునట్టి యత్యంతోత్తమ మయినకృతిరత్నము, కాన, నది— చెఱకుగడకుఁ బోల్పఁబడినది, అగుట, అం దాశ్వాసములంబోలుభాగములు ఆచెఱకుగడలోని క్షణపులుగ (పర్వములుగఁ) బ్రశస్తి నందినవి.

ఈయుద్ధగ్రంథపర్వసంఖ్య పదునెనిమిది. కురుక్షేత్రమునఁ జేరినపాండవకౌరవబలములసంఖ్య పదునెనిమిది. సంగరము జరిగిన దినములసంఖ్య పదునెనిమిది. భారతాంతర్గతభగవద్గీతాధ్యాయసంఖ్య పదునెనిమిది. వేదవ్యాసున కీసంఖ్య అత్యంతప్రియ మగుటకు నిమిత్తమేమో?- అంతతో దాని నాతఁడు విడిచినవాఁడు కాఁడు. తద్రచితపురాణములు, అం దతఁడు సూచించిన, అష్టాదశవిద్యలు, అష్టాదశద్వీపములు— మున్నగునవెల్లఁ బదునెనిమిదిగనే నుడివినాఁడు దీనిరహస్య మెంతయు జ కేపరిశోధకుఁడు అంతుగనుఁగొనమి కోచ్యము,

ఆంధ్రీకరణ వైఖరులు:—

శ్రీనాథకవిసార్వభౌమునకు ముం దున్నకవు లెల్ల రాంధ్రీకరణ విషయమున ఇంచుకస్వాతంత్ర్య మవలంబించి— (అప్పటికి వ్యాప్తియందుండిన)— శ్రీమద్రామాయణాదులను గథాభాగములవఱకే మాతృకలుగా స్వీకరించిరి. పరిశీలించినంతలోఁ దెలుఁగునాఁటఁ జాలకాలముగఁ బ్రచారమునందున్న కోనబుద్ధారెడ్డి రంగనాథరామాయణమే స్వతంత్రాంధ్రీకృత (ద్విపద) పురాణ మని తోఁచుచున్నది. ఆవెనుక సుప్రసిద్ధులగుకవులు ఏయిరువదిమందియేని శ్రీరామాయణమును స్వేచ్ఛఁగఁ దెనిఁగించిరి, అందు గోపీనాథము, వావిలికొలను, జనమంచి, శ్రీపాదవారు— "తూ—చా"- తప్పక, మూలము నతిక్రమింపక, మిక్కుల శ్రమించి— భాషాంతరీకరించిరి. వీరలదఱును— క్రీ. పూ. 1850 సం॥రమున కీవలివారే— ఇఁక భాగవతమును— శ్రీబమ్మెరపోతనకు వెనుకటివా రగు మడికి, తరిగొండ, శ్రీపాద, జనమంచి మున్నగువారు తెలిఁగించిరి. అందు— పోతన

వేంకటమాంబా, కృష్ణమూర్తిశాస్త్రి, శేషాద్రిశర్మకృతములు సంపూర్ణ ములు. ఇందు వేంకమాంబది ద్విపదకావ్యము. ఇట్లు— భాగవత ము నసంపూర్ణములుగ ద్విపదలలో సాగించినవారు తేకుమళ్లరంగ శాయి, మడికిసింగనలు. వీరిలో— మొదటియతఁడు— ప్రథమస్కంధా దినాలుగు స్కంధములును, రెండవయతఁడు దశమస్కంధమును మా త్రము ద్విపదకావ్యములుగ నిర్మించిరి. ఇవిగాక. గజేంద్రమోక్షము, అంబరీషోపాఖ్యానము, ప్రహ్లాదచరిత్రము, కుచేలోపాఖ్యానము, రుక్మి ణీ కల్యాణము— మున్నగు కథాఖండములను ఇతరు లెవరేని పద్యకా వ్యములుగనో— ద్విపదకావ్యములుగనో వ్రాసియుండవచ్చును. కాని, యట్టివి యింకను లభింపమి— తెలుఁగువారిదురదృష్ట మనవలెను.

ప్రకృతము దశమస్కంధమొక్కటే రచించినసింగన— దా నిని మథురాకాండము, కల్యాణకాండము, జగదభిరక్షకాండము అని - మూఁడుభాగములుగ విభజించెను.

—: శ్రీ మహాభారతాంధ్రీకరణములు :—

ఆర్యావర్తమున మిక్కిలి ప్రచారముసొందిన శ్రీమద్రామా యణ భాగవత, మహాభారతములకుఁ గలప్రశస్తి అనన్యము. ఈ మూఁటికిని ఆంధ్రీకరణములు ఉన్నవి కాని, రామాయణమున కున్న న్ని తక్కినరెంటికిని లేవు. రామచరిత్ర మంతమనోహర మయినది. కేవలము ముముక్షుజనోపభోగ్య మగుభక్తియోగమునుంగూర్చిమాత్రమే బోధించుభాగవతముమీఁదికిఁగాని, చాలభాగము వివిధోపాఖ్యానము లతో సమస్తధర్మములు ఉపదేశించు మహాభారతముమీఁదికిఁగాని— పూర్వాంధ్రకవులదృష్టి పోలేదని కాదనుట నిక్కువము. అందును

మహాభారతమునందలి యుద్ధపర్వములపై ఆంధ్రపాఠకుల కెక్కువ మక్కువ. తక్కినవి సర్వసామాన్యముగ— ఒకపాటి అక్షరజ్ఞానము గల వారికెల్ల అవగాహన యగుట దుర్లభము. నైతికాంశబోధనములకే ప్రాధాన్యము నిచ్చు అపర్వములు అన్నియు "చాలవఱకు"— ఏతత్ ప్రాంతజసంబంధిమాత్రతే మూలమునను కవి నిరూపింపఁ బూనుకొనె ననిచూహింపవలసియున్నది. ఇది విషయాంతరము. ఈశతాబ్దమునఁ దమజీవితములెల్ల వాగ్దేవి— కర్పింపఁ గంకణములుగట్టికొని కొంతవఱకు సిద్ధసంకల్పులయినవారు:— వావిలికొలను సుబ్బారావుగారు, శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు, జనమంచిశేషాద్రిశర్మగారు. మఱికొందఱు లెక్కకు రాఁదగినవా రున్నను— వీరుతఱువాతివారుగనే యెన్నఁబడును. అందు శ్రీపాదవారు అగ్రశ్రేణిలో ముందుగఁ జేర్పఁదగినవారు. వీరాంధ్రవ్యాసులు. అపరకృష్ణద్వైపాయనులు. మఱొక్కరయినచో, వీరు వ్రాసినన్నికృతులు బయలువఱచుట కింకొక్కజన్మముగూడఁ జాల దనఁదగును. లేకున్న మువ్వురుకవులు 350 సం॥ములకుఁ బూర్తిచేయఁగా, వీ రొక్కరే మహాభారతమంతయుఁ దమ చేతిమీఁదుగా. ఒకేశైలిలో వ్రాయఁగలుగుట మనభాగ్యవిశేషము. కాని, పిష్టపేషణన్యాయముగ మూలకవి ఒకసారిచెప్పినయంశము, మఱొకసారి తటస్థించినచో, ఆమొదటిసారి వచించినదానినే చేకొనుటయు, అక్కడ ప్రయోగించినశ్లోకము లట్లట్లే యుపయోగించుటయు, వారికృతులుపరిశీలించువారికిఁ దెలియఁగలదు. దీనిని షోడశమహారాజులయొక్కయుఁ, జక్రవర్తులయొక్కయుఁ జరిత్రాదులు తార్కాణింపఁగలవు. ఆర్యర్షులువ్రాసినగ్రంథములందెల్ల సాధారణముగ

జట్టివి కావ సగుసు. క్షత్రధర్మము ననుసరించి యుద్ధముసేయఁ గురుక్షేత్రమున సిద్ధమయిన యిరుతెగలవారిపూనికకు, వైరాగ్యము నకు ఏమాత్రమయిన సంబంధము గలదా? బ్రతికినబ్రతుకునకు "భగవద్గీతాపారాయణ"— మన్నట్లు— శ్రీకృష్ణభగవానునివేదాంత బోధనము— "రామాయణముసఁ బిడుకులవేట్లాటవంటిది"— కాక మఱేమి? అది కాదన్నచో, మూలకర్త అగు శ్రీకృష్ణద్వైపాయనుఁడు అనువకాశమును దొరకపుచ్చుకొని, తా నెఱింగినఋత్యంతరహస్యము ను, శ్రీకృష్ణార్జునసంవాదరూపమున బయలువఱచెను. ఇంకెవరిమూ లమునసైన ఆనిగూఢతత్త్వమును బయలుపఱచియుండరాదా? యన్న అది వేఱువిషయము. నరనారాయణులుగ మునుపటిజన్మమున వెలసినవారే శ్రీకృష్ణార్జునులుగఁ బుట్టినప్పుడు, వారికంటె భగవద్గీత లోని పరమార్థమును వెలిబెట్టఁగలిగినవిష్ణుభక్తు లెవరు? ఇక్కారణముననే భగవద్గీతారంభప్రార్థనమున— "నారాయణం నమస్కృత్య నరంచైవనరోత్తమ" మ్మని వేదవ్యాసు లాపురాణమునఁల స్మరించుట లగ్గని ఆదేశించెను. పైఁగా, ఇటు పాండవులపక్షమునఁగాని, అటు కౌరవులపక్షమునఁగాని భగవద్భక్తులు పెక్కురుండవచ్చును. కాని, శ్రీకృష్ణుఁడే ఆభగవంతుఁ డని విశ్వసించినవారుమాత్ర మరుదే అట్టివారికి భగవద్గీతోపదేశము తగ దని శ్రీకృష్ణుఁడే వక్కాణించెను. *

* "ఇదంతేనాతపస్కాయ
నాభక్తాయకదాచన
నచాశుశ్రూషవేవాచ్యం
నచమాంయోభ్యసూయతి"

అట్టివారు ఒకవేళఁ దనమహిమం గుర్తించినను, మానవసహజ మగుదౌర్బల్యమునకు గుఱియయి, అసూయాద్వేషావలేపపూరితచిత్తముతో, నాతనియందు భక్తిఁ జూపరైరి.

ఇట్టిసందర్భములలోఁ గవిత్రయము స్వాతంత్ర్యమవలంబించెను. అందును దిక్కయజ్వ మహాకావ్యుఁడగుట, విరాటోద్యోగపర్వములను, యుద్ధపర్వములను దెనిఁగించునప్పుడు— ఆయాపట్టులలో రసభంగ మగునని వేదాంతబోధన ముజ్జగించెను. ఒక్కగద్యలో భగవద్గీతాసారమెల్ల నుగ్గడించి, తరువాతికథనుదాఁటెను.

—: తక్కిన ఆంధ్రీకరణములు :—

ఇఁక శ్రీకృష్ణభారతప్రయోజనము:—

అభినవకవిసార్వభౌమునికిని అతనికృతికిని నమోనమః! వారి భారతప్రశస్తి వారేయుగ్గడింప నెంతయు సమర్థులు, ఆది తదన్యదుర్లభము.

ఈ నవీనయుగమున శతశతాధికగ్రంథనిర్మాతలలో ఆంధ్రలోకమున నగ్రతాంబూల మందఁదగినవారు "శ్రీకృష్ణభారతకర్త"యే యని ఘంటాపథముగ వచింపఁగలను. వారు రాష్ట్రప్రభుత్వాస్థానపండితకవిశేఖరులుగ ఈవయోధిక్యావస్థయం దున్నట్లే యింకను చిరకాలము జీవించి, తెలుఁగునేలలోఁ గావ్యజాలములపంటఁ బండింతురుగాక!—

అశ్వత్థభారతము: రాయలఇతరకృతులు:—

ప్రకృత మీభారతేతిహాసము— కలుగోడుగ్రామవాస్తవ్యులు, విద్వత్కవులు, బహుళగ్రంథకర్తలు, వ్యుత్పన్నులు నగు శ్రీఅశ్వత్థ

వాల్మీకాదివే సంగ్రహముగ వివరితము. ఒకవిధముగ—ఇదితెనుఁగు రామాయణములలోనెల్ల మిక్కిలిచిన్నదగు మొల్లరామాయణమట్లు, మహాకవికృతులలోఁ జాలసంక్షిప్త మయినది. అట్లు సంక్షేపము నకుఁటలో గ్రంథకర్త కడుంగడు జాగ్రతవహించి, మూలకథకు భంగము రానీక తెనిఁగించిరని నావిశ్వాసము, గ్రంథకర్తగారిమా తృభాష కర్ణాటక మయినను సంస్కృతాంధ్రములయందును వీరు చక్కనికృషి చేసి పాండిత్యమలవఱచుకొనిరి. ఇంకఁ గవితయా, ఆజన్మసిద్ధమయినది, ఏవో యొకటిరెండుతప్ప— తక్కినకృతు లన్నియు వీరుతెలుఁగుననే వెలయించుటం జూడ వీరికాంధ్రసారస్వతము నెడ నున్న యాదరాభిమానము లెంతటిగాఢములైనవో, మనము గ్రహింపఁగలము. ఈకవితాతపస్వికిఁ ద్రవిడభాష నిత్యవ్యవహారమున లేనిదయ్యు, నందు సముచితశబ్దౌచితికుదురుటయు, ఇచ్చవచ్చినప్రౌక్తనచ్ఛందస్సునవలంబించి, యందుఁ బుటలకొలఁది, భావానుగుణసరసశైలిలోఁ గావ్యము అల్లుటయు నల్లేరుపైబండినడకవలె నలవోకగ జాలువాఱినది.

ఇంతవఱుక— వీరు వెలికిఁ దెచ్చినరచనలలో మిక్కిలి ముఖ్యములైనవి. ౧ దండకరామాయణము. ౨ అనుభవామృతము. మొదటిది దండకముగా వ్రాసిరని గ్రంథనామమే చెప్పుచున్నది. రెండవది షట్పదులలో నడచినకన్నడబాసలోనిమూలమునకు అనువాదము. రెండును లాక్షణికసమ్మతములే కాని, రామాయణము వంటి యుద్గ్రంథమును— అటు మార్గకవితగఁ జెల్లుచున్నవివిధవృత్తములనవపక— ఇటు సర్వజనోపయుక్తమగు "రగడ, ద్విపద"—

ఇట్టిదేశకవిత్వమునఁ గపడక శ్రీఅశ్వత్థరాయ లొకక్రొత్తపుంత త్రొక్కిరి.— ఏవోచిన్నచిన్నకథ లొకటిరెండు దండకములుగ నుండునేమో, కాని దండకపూర్ణికాదులు సర్వసామాన్యముగ దేవతాస్తోత్రములలోనేవాడియున్నారు. (పారిజాతాపహరణాదికావ్యములు పరిశీలింపఁదగును.) ఆఖ్యాయికలకుఁ దక్కినవి అంతయతికినట్లుగ, సమంజసముగ, సరసముగ దండక ముండదనియు, కొంతవఱకుఁ జదువఁగనే విసువు జనింపఁజేయునదిగ నుండుననియు ఊహింపఁదగును, శ్రీఅశ్వత్థరాయరచితరామాయణ మట్లుగాక, ముందునకు ఉఱకలెత్తు గజ్జలకంఖాణమువలెఁ జదువఁజదువఁ జవులూరించుచు ముందునకుఁ బరువిడుధోరణిలోనుండును. ఏభాషను గ్రంథమున కుపయోగింపఁబడని, ఆద్యంత మొకేతగణముగుదండకమును — తెలుఁగునాటఁ బ్రచారమేలేని షట్పదీవృత్తమును బ్రప్రథమమున నాంధ్రమున సద్గ్రంథముల కుపయోగించి తరించె ననుకీర్తి ఈ కవిచంద్రుడే వరించెను. మఱి ఇప్పుడు వీరు కవిత్రయమువారివలె సర్వలక్షణసంశోభిత అగు మార్గకవిత నాశ్రయించి ఈభారతమును వ్రాసిరి. కవిప్రతిభకు అతఁడుఉపయోగించినఛందస్సు ఆధారము కాదు, "ముఖేముఖే సరస్వతి" అన్నారు పెద్దలు. విషయగౌరవమునుబట్టి వీరి "అనుభవామృతము" అందలి దురవగాహవేదాంతవిషయములు ఎల్లర కందుబాటులో నుండునట్లు లలితశయ్యలో నడచినది. కర్ణాటకదేశమున షట్పదీవృత్తముల కున్నంతయాదర మిఁకఁ దక్కినవానికి దాదాపులే దనియే వాకొనవచ్చును. మనకు ద్విపద యెట్లో, వారికి షట్పది యట్లు. దీనింగూర్చి అతివిస్తర మనపేక్ష్యము.

ఏతద్భాగవతము కవిత్రయమువారికృతివలెఁ గాక— కథాంగము సంక్షిప్తము. అత్యంత ముఖ్యాంశములు విడువకుండ, కథాధోరణికి అడ్డువాకలుగలుగకుండ, అన్వయ, శబ్దార్థావబోధలకు భంగము గల్పింపకుండ, రసజ్ఞులచిత్తము లుజ్జ్వలితలగాఁగ, వినువృథుటి క్లిష్టీకరింపఁ జేయుటలో అద్వితీయ మని నాయభిప్రాయము. ఇదినిర్వచనము. పైఁగా నితఁడు:—

"పోయకపోకరాసనికి భారతభూధరణంబునందు, నా
రాయణునట్లు తానును ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు, వాఙ్మయధురంధరుఁడుఁ దనకిష్టుఁడుఁ సహా
ధ్యాయుఁడునైనవాఁ డభిమతంబుగఁ దోడలు నిర్వహింపఁగన్"

అని నన్నయ చెప్పికొన్నట్లు:—

"కప్పగల్లు"— గ్రామనివాసియుఁ, "గవిభూషణ"— బిరుదాంచితుఁడును, బళ్ళారి పురపాలకసంఘోన్నతవిద్యాలయాధ్యాపకుఁడు నగు— శ్రీసంజీవమూర్తి తనభారతసభాపర్వద్వితీయాశ్వాసము వివరించె నని యితఁడు వాకొనెను. అతనింగూర్చి గ్రంథకర్త ఈ క్రింధివిధముగ వర్ణించెను:—

"చెలియై, బావయునై, కవిత్వగురుఁడై శ్రేయోన్నతుల్ నాకుఁ గాం
దలఁచున్, నైతకుఁ బ్రోత్సహించు, నెరసుల్ దాఁ దిద్దు, నేవేళలన్
బలుకుం దియ్యమునెయ్యమేర్పడఁగ, సంభావించుఁబో శత్రుసేన్,
గలరే మాకవిభూషుఁబోలుగుణు లింక న్యూటికిన్ గోటికిన్?"

తక్కినకవ్యభిజన్మవంశక్రమాదులనుగూర్చి, కవి తానేవివరించియున్నందున, నిట మరలవ్రాయుట చర్వితచర్వణ

మని యెంచి విరమించి, గ్రంథవిస్తరభయముచే ఇంచుక స్పృశింతును. ఇప్పు డిది విరాటపర్వమువఱకు ముద్రితమైయున్నది.

పోతనభాగవతాఖ్యానముల కున్నప్రశస్తి— ఆతరువాతి వానికి లేనట్లే,— కవిత్రయకృతమహాభారతమునకున్నప్రసిద్ధి తక్కినవానికి లేకపోవచ్చును. అట్లని యీయజ్వభారతమునకు భాషాప్రపంచమునఁ దావుండ దనికాదు, నాయభిప్రాయము. దేనిప్రత్యేకత దానికిఁ గలదు. కవిత్రయభారత మహామాలాగ్రము జదువుట కవకాశములేని యీనాఁటిఖండకావ్యప్రియులకెల్ల నిది సంగ్రహముగ భారతకథను దెలిపి, భారతజాత్యాచారవ్యవహారములందు వారి కాసక్తి రేకెత్తించు ననుట కేమాత్రము సంశయము లేదు.

రచనావైచిత్ర్యము:—

ఈయజ్వభారతకర్త శ్రీయజ్వరావుగారే యయినను, వారి కత్యంతాప్తమిత్రు లగు కప్పగల్లు శ్రీసంజీవమూర్తిగారికి ఇందించుకంత పాలు గలదు. వీరుసభాపర్వమునందలి ద్వితీయాశ్వాసము రచించిరి. ఆంధ్రీకృతభారతాంశకులు చెప్పకున్న ఈభాగముసహితము శ్రీరాయలవారిదే యని యనుకొనఁదగినంత సన్నివిష్టముగఁ జెన్నారెడు.

నన్నయభట్టారకుని రచనావైశిష్ట్యము:—

భట్టారకునిసీసపద్యములు— సామాన్యయతితోఁ బ్రారంభించెనేని,— తుదివఱకు నన్నిపాదములలోను— అట్టియతియే యలరుచుండును.— అట్లుగాక, ప్రాసయతితో మొదలిడునెడఁ బ్రాసయతియే యెల్లచరణములలోను అమరియుండును. శబ్దానుశాసనునిసీసపద్య

ములు కొకప్రత్యేకత గలవు. అవి విషయప్రాధాన్యము లగుటంబట్టి శబ్దములు— కలగాపులగముగ పలుమడుపుడికిల్లగ (ఏపాదమునకా పాదము అన్వయించక) ఒకపాదాంతమునఅనుకొన్నశబ్దము పూర్తి గాక ఆవెనుకటిదానికి దూటికొనిచనుచుండును. (ఉదా:— ౧) అం తకాకాపత్తై, యూర్చి చుమరవదుల దాకి;— 2) బ్రాహ్మంబు, దై వంబు, బరగ నార్షంబు, బ్రా—జాపత్యమును రాక్షసంబు, నాసు—రంబు 3) ఆగ్నేయుం డన, రౌద్రుం డనగ శరవణోద్భ— వుండన;— 4) విక్రంబుగాకుండునెకొ? వేల్పు-లార!)—

నన్నయ ఎంతటిపట్టమహిషినైన, రాజతనూజనైన, సాధ్వీ మణినైన, అచ్చరలేమనైన— సూచింపవలసివచ్చినపుడు లఘిష్ఠసర్వ నామము లగు "అది—దాని"— అనియే నుడువును. శబ్దానుశాస నునికవనమున, వ్యంగ్యస్ఫోరకభావములు, అలంకారవైచిత్రులు ద మంత నవి వచ్చునెడ నతఁడు వలదనఁడు, కాని— అందులకై వెంపరలాడెన ట్లెందును గాన్పింపదు.—

కవిత్రయమహాభారతమున సందర్భానుసారముగ, ఆయా కవులకాలమున, వాడుకలో నుండినపదజాలము ససంస్కృతినంది ప్రయోగింపఁబడినది. (ఉదా॥ ఒండె, కోలెౘ. మెయిౘ, పొంటెౘ, తొట్టి, పెద్దకాలము, అట్లగుటంజేసి, అట్లుకానినాఁడు (కానియెడ,) కు డుసు,— మున్నగులాక్షణికరూపములు ఉపయోగింపఁబడినవి.— నన్నయభారతముసఁ దఱుచఁ ప్రెకసంధులే కాన్పించును. మధ్యా క్కరలు నన్నపార్యునికాలమున విశేషప్రచారమున నున్నట్లు గన్ప ట్టెను. అతనితరువాత భారతమును వ్రాసి పూర్తిచేసిన తక్కిన యిరువురు

కొన్ని విషయములలో- అతనియనుసంధానములలో నసువక తప్పినదికాదు.

అశ్వత్థభారతప్రశస్త్యము:—

ఇది నిర్వచనము. ఉద్గ్రంథరచయిత లీమార్గ మవలంబించినఁగాని బండినదవడు. ఇందలియాశ్వాసములకెల్ల మొదటిమంగళాచరణ మొక్కపద్యముతోనే చేయఁబడినది. పూర్వరచయిత లట్లుగాక విభిన్నపర్యాయపదములతోఁ జేయువారు.

ఈసంక్షిప్తభారతకవులలో- ముఖ్యులగు శ్రీఅశ్వత్థరాయలవారు కవిత్రయభావముల కేమాత్రము భిన్నముకాని కథావిధానము ననుసరించి, బుధసేవ్యము, శ్రోతృమనోహరము, పాఠకోల్లాసము గలిగించుసులలితశైలిలోరచన సాగించిరి. వీరు రాచికులు, శబ్దార్థాలంకారములపై వీరికిఁ బ్రీతి మెండు. వీరు భట్టారకుని గుఱిలో నుంచుకొని, అతఁడేపట్టున నేపద్యము వ్రాసెనో, ఆపట్టుననాపద్యమే రచించుచు వచ్చెనని కొన్నియెడలు పరికించుచోఁదెలియనగును. ఒండురెండు ఉదాహరణములు:—

(౧) "అనఘ! విశ్వామిత్రుఁ డనురాజతిలకుండు
బ్రహ్మర్షి కాఁ జండభానుఁ డనఁగఁ
దపియించుచుండంగఁ; దా నైషనోపక
యమరేశ్వరుఁడు కడునదలి యెడద,
"ననిమిషరాట్పదమందఁ గన్వైచె, నీ
తం" డని, యప్సరస్త్రుణులందుఁ
దిలకమౌ మేనకఁ బిలిపించి యనియె, "నీ
వేఁగి కౌశికుతప మేటఁగలిపి,

వానినియతిఁ జెఱచి సూనాస్త్రపలఁ ద్రోసి
నాకరాజపదవి నాకు నిలుపు;
మనసుపెట్టితేని మరునైన హరునైన
నింటిబంటుగాఁగ నేలికొనవె"—

"అని ప్రశంసింప, మేనక యనియె నిట్లు:—
కడఁక బడబాగ్నిఁ జొఱ నాజ్ఞ నిడుదురయ్య!
బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టిఁ బన్నె, నతని
ధాతయే యోపఁడన్న నాచేతిపనియె?"

"శాపం బతఁ డిడుఁ దడవిడఁ,
గోపింతురు తడవకున్నఁ, గ్రూరులు మీరల్!
తోపదు- ముందుతటాకము,
కూపము- వెను, కనుచు గొణిగికొని సతి నడచెన్"

(అ. భా. అ 1: పద్య 54-55-56)

"అనఘుఁడు రాజర్షియై తపశ్శక్తిమై
బ్రహ్మర్షిభావంబుఁ బడసియున్న
సన్మునీశ్వరుఁడు విశ్వామిత్రుఁ డతిఘోర
తపము సేయుచునున్నఁ, దత్తపమున
కెంతయు వెఱచి దేవేశ్వరుఁ డప్సరో
గణములలో నగ్రగణ్యయైన
దాని, మేనకయనుధవళాక్షిఁ బిలిచి, వి
శ్వామిత్రుపాలికిఁ జని తదీయ

ఘోరతపముఁ జెఱచి, కోమలి నాధైన
దేవరాజ్యమహిమఁ దిపిరి నీవు
గావు మనిన నదియుఁ గమభయంపడి, యమ
రేశ్వరునకు మ్రొక్కి యిట్టులనియె"—

ఈనితరువాతిరెండుపద్యములు (చంపకోత్పలములు) లో
ని విశ్వామిత్రునికోపప్రభావవర్ణనము అశ్వత్థభారతములో (ఒక) గీత
ము, ఒకకందములోనిమిడిపోయినది— కాని, నన్నయచంపకములో,—
"నిన్ను బొట్టి యీమునిమిములెల్ల వారికి భయంపడుచుండుదురు."—
ఇది ఇంద్రునితో మేనక వాకొన్నది— "నీవు మొదలు దేవతలంద
ఱు ఆవిశ్వామిత్రునికి భయంపడుచుండ, ఇఁకనాయట్టియబల ఆతని
యెదుట నిలువనేర్చునా? నాపూన్కి నూహించిన భస్మీపటలమైన
ర్పకయుండునా? అను ధ్వనితోడిగంభీరభావమును శ్రీరాయలవారు
ప్రధాన మని తలంచి యుండఁదగునేమో; పద్యాభిప్రాయమునకం
తటి కది జీవాతువు. కాని, వారు "బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టిఁ
బన్నె"— అనివిశ్వామిత్రునిక్రోధోద్రేకమున కుపబలకముగ వాకొనుట,
అంతకంటెఁగూడనిశితము. అయిన, -యుగములకొలఁది బ్రహ్మర్షిపద
మందుట కతఁడు నిష్ఠమైఁ దపమునెఱపెనుగదా! అట్టియెడ, మేన
కావృత్తాంతమునకు (శునశ్శేపునకై) ప్రతిసృష్టికిఁ బూనినవృత్తాంత
మునకు నడిమికాలవ్యవధి యెంత? ఏది ముందు?— ఈయంశ
మించుక పరిశీలించి క్రమాత్మసౌష్ఠము రచించి యుండవలసినది.—

ఇట్లే— మనుచంద్ర (స్వారోచిషమనుసంభవము) లో
ఆంధ్రకవితాపితామహుఁడు (అల్లసాని పెద్దన) కూడ, తాను వరూధిని

అసలు మఱచి—

"గాండీవము నీచేతిది పాండవమధ్యముఁడిఁ జేరఁ బట్టి ప్రతికిలితిమి"— అని స్వారోచిషుని అద్వయగు పరూధినినోటఁ జంద్ర దూషణములో పరాకుపడి పకిలినాఁడు. స్వాయంభువమనుకాల మెక్కడ? ద్వాపరాంతమున మనియుండినపాండవమధ్యముఁడు (అర్జునుఁడు) ఎక్కడ? యుగములే వ్యత్యాసము! "ప్రమాదోధీమతామపి."

పలుకుబళ్లు, నానుడులు. సామెతలు— మున్నగునవి ఆయాదేశీయములలోనే శోభిల్లును.—

"ముందు తటాకము, కూపము వెనుక"- దీనికిసాదృశ్యముగ— ఇతరభాషలలో— వేర్వేఱువిధములుగ నుండితీరును.— అప్పుడుదెనుగునాఁటిసామెత:—

"ఏది సేయ ముందు నూయియు, వెన్క గోయియైె" యని (ఆ. భా. స. ప. ఆ. 2 పద్యం 38) శ్రీసంజీవమూర్తిగారు ప్రయోగించినది సహజముగ నున్నది.- ఇదికిం చిత్కరము. ఇట్టివానిని రసజ్ఞులగుప్రాజ్ఞులు గణింపరు. "ఏకోహిదోషోగుణసన్నిపాతే నిమజ్జతీందోఃకిరణేష్వివాంకః."— ఈగ్రంథము సాగరతుల్యము. ఇం దేది ఉదాహరింతును? ఏది మానుదును? ఐన మచ్చులు చదువుఁడు:-

ఉ. "అందెలు గల్లుగల్లు మన నందును నిందును జిందులాడు; జో
కుందనమార నెల్లు నిడుఁ గోయిల కూసెడుభంగి; దివ్యమా—
కందరసంబుఁ జిందఁగ శుకంబటు లల్లనఁ బల్కు— గుల్కునా
సుందరి యమ్మునీశ్వరునిచుట్టును జుట్టుచుఁ బూలఁగోయుచున్"

కం. "అల సవ్వడి విని ముదిత
మెలమెలఁ గనుఁగవను విచ్చి మెలఁతుకఁ గాంచెన్;
లలి ననిలుం డాసతిమోము
పలుకను బయికెగయుఁ బ్రోసి వారక వేచెన్."

తె. "మోవి నానుచున్న మునిపతిచూడ్కులు
కనకకుంభములందుఁ గౌనునందు,
ముందువెనుక మేన నందందుఁ బరువులు
నెత్త నతనిమనసు తత్తఱిల్లె"—

ఉ. " కో! యని గండుకోయిలలు గూసెను; మారుతుఁ డల్లనల్లనన్
హాయిగ వీచె; మన్మథుఁ "డయారె! సెబా" సని యమ్ములిమ్ముగా
నాయమి నాఁటనేసె; చెలి యాకడగంటికటారి దూసె; "నా
హా!" యనిమౌని లేచి బిగియారఁ గవుంగిటఁ దార్చెమేనకన్"—
(25, 26 పే. 58, 59, 60-6 ప.)

మ. "అనుచున్ జెక్కుల ముట్టు; మైనిమురు; లో నావంగలే, కశ్రువుల్
తనుకన్ బుచ్చు; శిరంబు మూర్కొనును; గాద్గద్యంబుమైవెక్కుఁ; గో
పనమై యేడ్పుమొగంబువెట్టు; మది సైపన్లేక నిట్టూర్చు; న—
మ్మునిచంద్రుఁడు సుతానురాగభరసమ్మోహానుబద్ధాత్ముఁడై"—

ఉ. "హా! యని చేతులన్ బెనచి యయ్యగళంబున జోలెఁ గట్టు; మో
మూయనమోముఁ జేర్చు, నకటా! యని యార్చును; బేర్చుఁ గౌఁగిటన్;
ఆయనబొజ్జలో శిరము నాన్చి వగర్చును; నంఘ్రియుగ్మమం
దాయమఘాల ముంచి యిడు నశ్రువులన్ బితఁ బాయనోపకే"—
(30, 31 పేజీలు 81, 82 ప.)

సీ. "కలపంపుటిరిణాలో, కనకంపుబొమ్మలో,
చెలువారుకరువులో, చిత్తరువులో?
పికులకలకళ్ళలో, విరహికల్పకములో?
మనసిజబాణునివిజయధ్వజములో?
మరువిరిములుకులో, మరునిచేవిల్కులో,
రతిశాస్త్రమూలసూత్రార్థగతులో?
మునితపఃఫలములో, మనసుశ్శృంఖలములో,
యతనునిసంజీవనౌషధములో?

గీ. అక్షిపక్షులఁ దిగిచెడినట్టియురులో?
నాకసౌఖ్యప్రాకారలోకతతులో?
మించుతీవలో? యనఁ జనుదెంచి రచటి
కచ్చరలు మించిసభవారు మెచ్చి చూడ" (426 పే. 149 ప.)

సీ. "దివ్యవాద్యంబులు భవ్యనాదము లీనఁ,
గాళులఁ గింకిణీక్వణము లలర,
భ్రూచలనము, నేత్రభూరివిన్యాసంబు,
వదనహాసము, గళవర్తనంబు,
కటినర్తనము, భావగతి, కచకుచహస్త
పాదాభినయములభంగి; విషమ
సమరీతు లెసఁగఁగ; సుమధురగానంబు
లయతాళవిధులఁ జెలంగి మలయఁ"

గీ. గళ లొలుక, నవరసములు కరుసుదీర,
రోదసీకుహరంబెల్ల నాద మలమఁ,
దత్తదుచితంబుగా శాస్త్రతత్త్వ మొలయు
నభినయించిరి యప్సర లద్భుతముగ" (426 పే. 150 ప.)

కం. "నిలుపలుకాడిన ముత్తియ
ములు రాలునె నోట? నాఁటిమోహినివి కదే!
వలఁగొంటివి చెలి! నామది
చిలుకను; బంజరము నుడుపఁజెల్లునె యిటులన్?" (612 పే. 124 ప.)

చం. "పరసతికాంక్ష సేయ ఘనపాతక మబ్బును; వాసి మాసెడిన్;
బరము సెడున్; దొలంగు సిరి; పొసెడి నాయువు; నింద మోసెడిన్;
పరిజను లెల్ల రోసెదరు; సత్త్వముఁ గోల్పడు; సౌరమున్ జెడున్;
గరువము డీల్పడున్ గసులు గానని కాముక! మూర్ఖకీచకా!
(613 పే. 130 ప.)

ఉ. వచ్చినయట్లు; క్రేగనులవాలు నురమ్మునఁ గ్రుచ్చినట్లు; తన్
మెచ్చుచు నవ్వువెన్నెలల మేనునఁ జిల్కినయట్లు; గుబ్బలన్
గ్రుచ్చుచు నిచ్చఁ గౌఁగిటను గుప్పినయ; ట్లధరమ్ముఁ గ్రోలఁగా
నిచ్చినయట్లు; నీవి సడలించి పయిన్బడినట్లు భ్రాంతుఁడై" 620పే 125 ప.

ఉ. "నెత్తురుఁ దేక తాఁకు లిడనేర్చిన బాకిది; మేన వాతలే
బొత్తిగఁ దోఁపనీ కడచుభూరికశం బిది; మానసంబునం
దత్తి పొగల్ రగుల్ప కసువార్చెడుచిచ్చిది; కంటిఘారచేఁ
గుత్తుకఁ గోయుటింప మిదొకో! యని కీచకుఁ డార్చె దిగ్భ్రమన్"
(623 పే. 177 ప.)

గీ. "కపటమున రాజ్యమును గొని, కాంతఁ బరిభ
వించి, పాండవుల వనికిఁ బంపినట్టి
క్రొవ్వు నాయెడఁ జూపెనె? కురువిభుండు
తలఁచినాఁడేమొ నను బీదధర్మజునిగ?" 663 పే. 17 ప.

గీ. "గుంజెనా, యమునీసము? ఘోరవీర
భైరవునిచెంప వాయించెనా, రుతింప?—
మిత్తిముందలప ట్టీడ్వహత్తైనా? స
మరము నాతోడఁ గోరెనా కురువిభుండు?" 663-18.

గీ. "చప్పుబాపలు కొందఱు, జము నిప్పురికిఁ
దరలుముదుకలు గొందఱు; తక్కువైన
కులమువారలు గొందఱు— కురుధరేశు
సేనవీరులు! వీరల చెప్పనేల?"— 664-19

సీ. "రాకేందుముఖి, దివ్యరాజీవదళనేత్ర,
శస్తకపోల, విశాలఫాల,
అళినీలకుంతల, విలసితశ్రీకర్ణ,
చంపకనాస, సంచలితహాస,
కంబుకంధర, సుధాకలితబింబాధర,
శుకవాణి, నీరదసుభగవేణి,
తతకుచకుంభ, సైకతసన్నిభనితంబ,
తనుమధ్య, నెఱజాణ, కనకవర్ణ

గీ. ఉత్తరకుమారి మదగజమో యనంగ,
చూడ్కి మెఱుఁగులఁ జిమ్ముచు, వేడ్కతోడ
నల్లనల్లన వచ్చి నృత్తాలయమ్ముఁ
జొచ్చి, నిజభక్తి గురునకు జోతఁజేసె." 663-27.

శృంగార మొలికించుపట్టున శ్రీరాయలవారిలేఖిని యడ్డు మాఁకలులేనిది:—

శా. "చంచత్కాంచనవస్త్రరంజితమహాసౌభాగ్యతన్వంగినిన్,
బ్రాంచన్మంగళచారులోకనవిభాస్వన్నేత్రయుగ్మన్; లసత్
కాంచీనూపురకంకణక్వణరుణత్కారాంచ్రిహస్తాంబుజన్,
గాంచెన్ జక్రపయోధరన్, శశిముఖిన్ క్ష్మానాథుఁ డాముందటన్" ఆ.భా.

ఇదిశ్రీనాథకవిసార్వభౌముని:—

మ. "కమలేందీవరషండమండితలసత్కాసారసేవారతిన్,
గమికర్మీకృతనైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిన్ బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్
సమపీనస్తని, నస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరిన్"—

అనుపద్యముం దలపించుటలేదా?—

ఇంతకంటె ఒకమెట్టుపైఁగా, అంత్యప్రాసనియమముతో—అలంకారయుక్తముగ ఈశతాబ్దపుకవికులగురువులగు శ్రీతిరుపతివేంకటకవులు చెప్పినపద్యముకూడ గమనింపఁదగినది:—

మ. "రణదుద్యన్మణికంకణక్వణజితప్రద్యుమ్నకంఖాణికిన్
గణనాతీతకలాలసద్రవమణికిం, గాడంబినీవేణికిన్

గణికోద్యన్మణికిఁ బ్రశస్తతరరేఖాపాణికిం, బాలికా
మణికిఁ, వక్త్రసితాబ్జశీతఘృణికిఁ, మాద్యత్పికీవాణికిఁ."

శబ్దాలంకారముల కీకవికవితాకన్య మురిసిపోవుచున్నది.

—: తిక్కన కవితాప్రాశస్త్యము — అశ్వత్థభారతమహిమము :—

"తిక్కనకవితాకళయందత్యంతకౌశలము, స్వభాషయం దభిమానము, మనోధైర్యము, ఆత్మస్వాతంత్ర్యము, నిర్మలభక్తి, అద్వైతభావము బాగుగఁ గుదురుపడిన వని చెప్పఁదగియున్నది —

భారతరచనాకాలమునాఁటి కీతనికిఁ (తిక్కనకు) గవితావిలాసములేగాక, కవితాతత్త్వమేబోధపడినది. దానివలనఁ గలుగు నానందమునకుఁ బరవశుఁడై భారతరచనకుఁ గడఁగెను. కావున నాతనికిఁ గోచరించినకవితాతత్త్వస్వరూపము ఆతనిభారతమునఁ బొడకట్టకమానదు. బాగుగఁ బరిశీలించినచో, నుత్తమకవితాప్రధానలక్షణంబు లగు రసావిష్కరణము, తత్తద్రసౌచిత్యరచనాకౌశలము, ప్రౌఢత్వము, స్వభావోన్మీలనాశక్తి, ఉచితానుచితపరిజ్ఞానము, నీమొదలగునుత్తమగుణంబుల నసమానచాతుర్యముతో వెలయించుటంజేసి భారతరచనాకాలమున కాతనియంతఃకరణ మెట్టిమహత్పరిపాకమును బొందినదో, తెలియఁగలదు."—

ఈమహత్పరిపాకమునకులక్షణములుగ - (విశ్వవిద్యాలయమునఁ బనిచేసి ప్రకృతము విశ్రాంతి గైకొనుచున్న శ్రీ కోరాడ రామకృష్ణయ్య యం. యే. గారు తమ "ఆంధ్రభారతకవితావిమర్శనము" న సూచించియున్నారు. అం దొకరెండుమూఁడుఅంశములు దక్కఁ దక్కినవన్నియు ఈగ్రంథకర్తకవితాకళయందు నిండుకొనియున్న

ననుటలో విప్రతిపత్తి యించుకేనియుఁ గానరాదు.

## — విరాటపర్వరచనావైదగ్ధ్యము. —

ఇంపగుకవిత, రసానుగుణశబ్దములతోఁ జెంగుజెంగున నృత్యభంగిమలతో నొయ్యారముగనడచు గజ్జెలగుజ్జుమట్లు చక్షుఃప్రియము, శ్రవణపేయము నయి, మనసున కాహ్లాద మాపాదించును.- విరాటపర్వము పూర్తిగ నశ్వత్థరాయప్రణీతమని. యందలి— కవితారీతులు, శబ్దాలంకారవైచిత్రులు, స్వతంత్రభావావిష్కరణములు, క్రొంగొత్తపోహణలు, మృదుమధురధారాసారస్య, శయ్యాలాలిత్యములు— చెప్పకయ చెప్పెడు.

తిక్కనలోని కథాసంవిధానచాతుర్యము, మహోన్నతవిచిత్రభావగాంభీర్యము, అల్పతరశబ్దానుగమ బహుళతరవిషయోద్ఘాటనాసామర్థ్యము— సునిశితముగఁ బరిశీలించువారి కవి, ఆయాఘట్టములయందు దిద్దితీర్చిన మెఱుఁగులట్లు గన్పట్టును. పాత్రానుగుణముగ శబ్దౌచితిఁ బాటించు రసజ్ఞులకు ఉభయకవిమిత్రునికవితాధోరణి నిసర్గమాధురీమహితమై తన్మయత్వ మాపాదించును.

సోమయాజికవితాసుధను— ఆకంఠముగఁ గ్రోలి త్రేంచిన అశ్వత్థరాయలు, తాను దనివినుటయగాక ఆంధ్రప్రజానీకమునకుఁ గూడఁ బంచిపెట్ట సంకల్పించెను. ఆదృఢసంకల్పమే ఈసంగ్రహభారతసృష్టికి మూలకందమయినది.

కాని తిక్కననాఁటికి— నేఁటికి ఎన్నిశతాబ్దములవ్యవధియేర్పడినది? దేశకాలపాత్రానుగుణములుగ, నెన్నిమార్పులుతటస్థించినవి?— ఈహేతువులన్నియు సమాకల్యముగ, సావధానముగ బరి

కించిత్తిమేని, ప్రాచీనకృతులు నవీనములుగ— జాతీయతాస్ఫూర్తిప్రా బల్యమునను, సాంఘికపరిస్థితులమూలమునను, నూత్నసంస్కరణా తిశయాభిరుచులకతమునను— రచయితలు కృతులు వెలువఱింపవల సినయవసర మేర్పడినట్లు గ్రహింపఁగలము. తిక్కననాఁటికళావిలా సమున కాతనికావ్యనిర్మాణకౌశలమే, తగినదోహద మొసఁగి, అది సార్వకాలికము, సార్వజనీనము అగుటకు దారిఁజూపినది. ఆనాఁ టికవిపుంగవు లాకవిబ్రహ్మయామోదముద్ర తమకావ్యములపయిఁ బడిననేతప్ప లోకమునఁ జెల్లుబడికానేరవని తలంచెడివారు.——

ఈవిషయమున యజ్వకు సన్నిహితాంతేవాసిగ నొప్పారి నకేతనః— "కవితచెప్పి యుభయకవిమిత్రు మెప్పింప నరిదిబ్రహ్మ కైన"— అని యుగ్గడించినాఁడు. అతఁ డిది తిక్కనార్యునిమెప్పన కుఁగాదు చెప్పినది. సర్వథాసత్యము. కవితాకళాభినివేశముగల తిక్కన కక్కాలమునఁ దిక్కనయే సాటి! ఈనాఁడన్ననో,— ఆతని ననుసరించి, అనుకరించి గుఱితప్పక ఆతనియడుగుజాడలలో నడచి మహాభారతమున అత్యంతరసభరితములగు తొలినాలుగుపర్వములు బూర్తిగావించినయుభయభాషానిధి యనందగు అశ్వత్థరాయల కశ్వత్థ రాయలేసాటి యని నే నందును. కాదందురా? అశ్వత్థభారతమును సునిశితమతి నవలోకింపుఁడు.——

కవులకు సహజముగఁగలస్వాతంత్ర్యము ననుసరించి,— నూత్నభావోద్రేకము పెల్లుబికిఁ గథాధోరణికొకక్రొత్తమెఱుఁగుఁ జేకూ ర్చునేని, దానిని వారు విడనాడుకొని— కేవలము— మూలమునకే దాసులు గారాదు. ఔచిత్యమంతటను బాటించుచుఁ కథకు అమో

రుద్ధముగ రచించుటయే వారికర్తవ్యము.—

ఇందులకు దిక్ప్రదర్శనములుగ ఈరెండుకృతులకు (శ్రీమదాంధ్రమహాభారతాశ్వత్థభారతముల) కెసగు తారతమ్యములు గొన్ని యీదిగువ సూచించుచున్నాఁడ:—

౧) తమతోనున్నవిప్రవరులుమాత్ర మజ్ఞాతవాసదీక్షకుముం దే వీడ్కొలువడయుదురు. పరిజను లగువంటలవారు మహానసాధ్యక్షులు, సారథులు మున్నగువారు తదనంతరమా ధర్మతనూభవునాజ్ఞానుసారము వెడలిపోవుదురు. కాని, ధౌమ్యుఁడుమాత్రము పాండవులు విరటునగరముఁ బ్రవేశించునంతవఱకు వారితోఁగూడ నుండినట్లు:-

"తమ్ములు, ధౌమ్యుఁడుఁ జెలియు, బానసవమ్ములతోడఁ బ్రోశమా
త్ర మ్మొకచోటి కల్గఁ జని ధర్మతనూభవుఁడు" అని-(తిక్కన)

కాని, అజ్ఞాతవాసమునకుమున్న తక్కినవారితోబాటు ధౌమ్యు నగ్నిహోత్రసహితముగఁ బంపివైచినట్లు— (అశ్వత్థరాయలు)

౨) అగ్నిహోత్రరక్షణార్థము నియుక్తుఁ డగుధౌమ్యుఁ డెట నుండవలెనో— ధర్మతనూభవుఁడు చెప్పలేదు— (అనిరెంటను గలదు)

౩) పాండవు లొకనిశ్చయమునకువచ్చినపిదప సేవాధర్మములనుగూర్చి ధౌమ్యుఁడు వారి కుపదేశించును. (తిక్కన) అశ్వత్థభారతమున ఆధర్మములప్రస్తావమే లేదు.

౪) అజ్ఞాతవాసయోగ్యప్రదేశములనుగూర్చి అర్జునుఁడు సూచించును (తిక్కన). అట్టిదేశములను ధర్మజుఁడే పేర్కొనును. (అశ్వత్థరాయలు)

౫) మత్స్యదేశము తా ముండుటకుఁ దగిన దని ధర్మజుఁడు

పఱ్ఱించినది. (తిక్కన)

కాని, తమనివాసయోగ్యప్రదేశము మత్స్యరాజ్య మని అర్జునుఁడే వచించెను. (అశ్వత్థరాయలు)

౬) జమ్మికొమ్మకు ధర్మజుఁడే యెక్కి తమయాయుధముల నిక్షిప్తమొనర్చినట్లు— రెంటను ఒకేవిధముగ నున్నది. కాని, మూలమున:— ఒకవ్రాఁతిలో:—

"తాముపౌరుహ్యానకులో
దనూంష్యభ్యాదదత్స్వయం
యానితస్యావకాశాని
దృశ్యరూపాణ్యమన్యత"

అని నకులుఁడు శమీవృక్ష మధిరోహించి ఆయుధములు వ్రేలగట్టినట్లును,— మఱొకప్రతిలో:—

"తతోయుధిష్ఠిరోరాజా
సహదేవమువాచహ
ఆరుహ్యేమాంశమీవీర
విధత్స్వేహ్యాయుధానిచ"

అని ధర్మజునాజ్ఞ, ననుసరించి, సహదేవుఁడే— ఆకార్య మొనర్చినట్లును గన్పట్టెడు.— ఈఅశ్వత్థభారతకర్త చాలవఱకుఁ దిక్కన కృతిపై నాధారపడినవాఁ డగుట, మూలాభిప్రాయమును గైకొని యుండఁడు.

౭) శమీతరునిక్షిప్తాయుధాధిదైవతములంగూర్చి ప్రార్థించుచో:— "నరునకు నాకుం దక్కఁగ నోరులకు మీరూపుసూపకున్నది".—

అనెఁ (తిక్కన)

"కవలోకపతిగోరినచోఁ,
దవులుం; డిభీముఁ డెజ్జితజనేని మిముఁ
దవులఁగ వచ్చినఁ జిక్కక,
దవుదవ్వులఁదొలఁగిపొంచు"— (అని— అశ్వత్థరాయలు)

౮) తిక్కనఈసందర్భమునఁ గవలప్రసక్తిఁ గొంచెమేని దీసి కొనిరాఁడు. తాను ఆయుధాధిదైవతములఁగూర్చి ప్రార్థించునెడ, తన కు నరునకుఁ దప్ప భీముఁడుమున్నగువారికి ఆయాఆయుధములు గనఁబడరా దన్నందుల కాతఁడు మనస్సున నొచ్చుకొనునేమో యని— అతనిండాసి సాంత్వనవచనములతోఁ గౌఁగిలించికొన్నట్లును ఆరీతి అధిదైవతములఁ బ్రార్థించినయన్నవయుఁ గినుకఁబూనినట్లును దిక్కన వచింపలేదు. అంతియగాక అగ్రజునిఁ బలైత్తుమాట అనఁ డు.— (తిక్కన) కాని, యీయశ్వత్థభారతమున ధర్మజుఁడు జమ్మి చెట్టుపై- ఆయుధాధిదైవతములఁ బ్రార్థించుచుండఁగనే భీమసేనుఁ డు అన్న తన్నుఁ గొంచెపఱచెననిభావించి—

"ఉద్దామాగ్రహుఁ డగుచు"— "పాండుతనయులు మీరల్; నేమాత్రము కౌరవ్యుఁడనే?— మంచిది, చూతు మీదునియమములెల్లన్"—
"సురసందోహమె యడ్డుఁగాక, యసురస్తోమంబె మారొడ్డి సం-
గరమున్ సల్పెడుగాక, యేకమయి లోకంబుల్ పదిన్నాల్గు భీ-
కరమై పైఁబడుఁగాక నామ్రుడుఁడె వీఁకన్ దాఁకెడుఁగాక, ని-
ర్భరమైమించుచు మద్గదాయుధము నేఁ బాణిన్ గ్రహింతున్ జుఁడీ."
(అశ్వత్థరాయలు)

ఇదియొకవిధముగఁ దనజ్యేష్ఠభ్రాతపయి తిరుగుఁబాటుగఁ దోఁచెను. కీచకునిమాటలు అతనిధీరోద్ధతికిఁ దగినవి కావు.—

౯) విరటునిఁ గొల్వఁ— దమతమసంకేతముల ననుసరించి మాఱురూపములతో- పాండవులు ఒకేదినమున వెంటవెంటనే యేఁగినట్లు (తిక్కన)

చం. "మఱియొకనాఁడు కొల్వుఁగొని మత్స్యమహీపతియుండవచ్చెల
బురుషుఁడుగాక, కేవలముఁ బొల్తిగనొప్పక". —

అర్జునుఁడు విరటునియాస్థాని కరిగెను. ఈవాక్యమున "మఱియొకనాఁడు" అనుటవలనఁ బాండవులొకేదినమునఁ గాక, వేర్వేఱుదినములలో విరాటుం జూచినట్లు— (అశ్వత్థరాయలు)

౧౦) ద్రౌపదిపయి మరులుగొన్నతనతమ్మునితో సుధేష్ణ:—

"నిన్ను ననురక్తిఁ గొలుచున న్నెలఁత యుండ,
నీరసాకార సైరంధ్రిఁ గోరఁదగునె?"

అని అదివఱకే కీచకున కనేకులు ఉంపుడుగత్తెలు (భార్యలు?) ఉన్నట్లు— (తిక్కన)—

"చూచి నేనె తగినసుందరి నొనగూర్తుఁ
దక్కుదీని; మించుచుక్కఁదెత్తుఁ;
బెండ్లిచేసికొనుము. పెడదారిఁ జనకుము"– అని (అ॥భా)

ఈతెఱఁగున రెంటికిఁ గలతారతమ్యములు వివరింపఁబూనుచో, అదియే యొకభారత మగు నని, యింతతోఁ జాలింతు —

ఇట్లే, తిక్కనవిరాటపర్వమునకు దీనికి చిఱుతుకభేదము లున్నవి. కాని, తిక్కన ఆకాలపరిస్థితుల ననుసరించి సాంఘికమర్యాద

లతిక్రమింపక ఆంధ్రప్రజానుమోదముగ రచించెను.- తిక్కనవలెనే యశ్వత్థరాయలును ఈనాఁటితెనుంగుజనాళికముల కుల్లములు పల్లవించునట్లు రచించెను:- తిక్కనవలెనే అశ్వత్థరాయలునుబహూత్రాక్యుడు. ఒక్కనిదర్శనముం గనుడు:- అజ్ఞాతవాస మారంభించు నాఁటికెల్లరను ధర్మజుఁడుస్వస్థానములకుఁ వెడలనాజ్ఞాపించెను. కాని, ధౌమ్యు నగ్నిహోత్రసంరక్షణార్థము నిలిపెనే కాని, అతఁ డా సంవత్సరమంతయు నెక్కడవసియింపవలెనో- ఏమాత్రము ఈభారతద్వయమున నెచ్చోటను సూచనములు గానరావు. దీనివలన వర్ణాశ్రమధర్మపరిపాలనాదక్షు లగుఱేండ్లు- ఆనాఁడు (తిక్కనకాలమున) దముతోఁగూడఁబురోహితునిసహితము దీసికొనిపోయెడివా రని తెలియవలసియున్నది. ఏల యనఁ, వైదికకర్మకలాపము లవసరమయినపుడు వారియుపదేశానుసారము రాజులు నడపుకొనువారు. అందును అట్టి వానిపై అత్యంతమాస్థ గలధర్మజునివంటి ప్రభువులకుఁ బురోహితులెల్లసమయముల వెన్వెంటనేయుండుట తప్పనిసరియని వేఱచెప్పనేల?- కాన అగ్నులఁగావ నియమితుఁడైనధౌమ్యునకు ధర్మజుఁడు స్థలనిర్దేశముచేసినవాఁడు గాఁడు. ఏతత్కారణమున అతఁడావిరటునగరపరిసరములలో నుండియుండుననుట వాస్తవము. కాన, పాండవులు విరాటుని గొల్చునెడ అనుసరింపఁదగుసేవాధర్మములను గూర్చి ధౌమ్యుఁడు పాండుకుమారులకు ఉపదేశించెను. (తిక్కనభారతము)-

అశ్వత్థభారతమున అట్లుగాక, తమ్మనుసరించి చరించుపరివారమును వీడ్కొన్నట్లే, అగ్నిహోత్రసహితముగ ధౌమ్యునికూడ

యడెవ్వ్రిష్టుబ్వృత్తి. ఆశ్వాసమునందే కాంచగలము— "అండయును దుష్ట
విశ్వవ్యాప్తముంతరమున। నసుజాలను ద్రౌపదిని సాహసించి రధమెక్కి। తనర
శస్త్రాస్త్రములు గొని ధర్మజుండు"— అనిరచింపఁబడినది— కాని,
అలవి నేసా ధర్మోపదేశమునకు అవకాశమేర్పడినది. కావుననే అశ్వత్థ
రామాలు బహుపారోక్ష్యఁ మని వైజఁజెప్పెరి. ఇదియు (౧) సంఖ్య క్రిం
దపెసరించిన విషయము గనుఁడు. తిక్కన ధౌమ్యునిఁ బాండవు ల
యుధిష్ఠిరుతో వెడలినవారిగఁ దెలిపెను.

## — విరాటపర్వములోని ముఖ్యపాత్రలు. —

ఇక విరాటపర్వము కథాసంవిధానమున కత్యంతముఁ
జోడ్పడుపాత్రలస్వభావములను దత్కవులు ఎట్లు చిత్రించిరో ఇంచుక
పరిశీలింతము:—

సుధేష్ణ:- మూసినముత్తెమువలెఁ బైకెఁ ఉత్తమరాలియ
ట్లొప్పెడిది. తోఁబుట్టు వగుకీచకునిమౌర్ఖ్యమున కెదురాడునౌహస
వంతురాలు కానున్నను, అతనిపౌష్ట్యమునకుఁ బాంచాలి యొగ్గవ
గునేని ఆమె పతులగుగంధర్వులచే అతని కెట్టికీడు మూఁడునో య
నుభీతిమాత్రమూమెకు లేకపోలేదు. తుద కెట్లయిన ఆతని యిచ్చ
కుఁ బ్రతికూలముగఁ జరించుచో (అతనిసైన్యాధిపత్యమువలనగెలి
చిన) రాజ్యమునుండి- తత్ప్రభుత్వమునుండి తొలఁగిపోవలసివచ్చు
ననువిషయ మూమె యెఱుంగును. అంతియగాక, ద్రోవదిమీఁదివల
వంతచేఁ గృశించియేని, ఆమెపొందుచేయ నుద్యమించుటచే గంధ
ర్వులకుఁ జిక్కియేని కీచకుఁడు మరణించుటతప్పదు.- కాన అతని
కోర్కె నెఱవేర్చుట కాలసింపరాదని నిశ్చయించుకొనెను.- ఈవిషయ

యము తిక్కనకంటె అశ్వత్థరాయలే విపులముగ స్పష్టమొనర్చెను. చూడుఁడు:—

"వినఁడే క్రూరుఁడు, మమ్ముఁగూడదుడుకన్ పీఁడెంచుఁ, జావెట్టులీ తనికిందప్పద."— అని— అభిప్రాయపడును.

ఇఁక ద్రౌపదిని గీచకునింటికిఁ బంపుట కామెపన్నిన యుపాయము:—

"తతస్సైరంధ్రిమాహూయ సుధేష్ణావాక్య మబ్రవీత్,

గచ్ఛ సైరంధ్రిమత్తీత్యాకీచకస్యనివేశనమ్" (మూలము)

ద్రౌపది యీకార్య మొనర్ప సమ్మతింపనందునఁ— దాను రాణి నను అధికారగర్వముతో బలాత్కరించి యామెను గీచకునింటి కంపఁ జూచును:—

"అవశ్యంత్వేనగంతవ్యం కిమర్థంవా విపక్షసి,

ఉక్త్వాచైనాం బలాచ్చైవ వినియుజ్యప్రభుత్వతః."

అపుడు పాంచాలి:—

"అబ్రవీత్ శోకసంతప్తా నాహంతత్రప్రజామివై"—

అనుటతో— సుధేష్ణకు గుండెలు దిగజాఱును. అప్పుడె— ఆమెకుఁ బట్టువల యెక్కుడయి ద్రుపదతనయపై తన "జులుం" చూపి, అధికారము చెలాయించును. ఈఘట్టమునఁ దిక్కనార్యుఁడు ఆసు ధేష్ణవంటియుత్తమనాయికకుఁ బెట్టుపోకుండు వెరవున ఉదాత్తవ చనరచన ఆమెనోటివెంట వెలువఱచును- ఈసందర్భమున అశ్వత్థ రాయలు:—

"పోవ నే నోపనచటికి దేవి, నీదు। సోదరుఁడు దుండగీఁ డమ్మ"—

సైరంధ్రి అంతఃపురపరిచారిక. అట్టిది, తన్నుఁ బోషించు ప్రభ్విని తోఁ, ద్రౌపది సమానమన్న— అదిజనసహజము, లోకాతిరిక్తము నగుపించుచుము. అందువలన అనుమానముగనే, ద్రౌపదిశీలముమీఁద నే వెల్లడించినసుధేష్ణ:—

"తన పెనిమిటి బుద్ధి పరుల చిత్తములఁ బెట్టి
లోపల దలఁతువు, దాని నెప్పునేమి?" (ఆ॥ భా॥)

సుధేష్ణాదేవికిఁ దమ్ముఁ డట్టివాఁడని చక్కఁగఁ దెలియును; అంతఃపురమందు కుదురుగొకండుకామనములుగ రాణివాసము పీడని సైరంధ్రి స్వభావమును ఆమెకు దెలియును. అట్లుండ "ఘనగుణముఁ బట్టి"— ఆసైరంధ్రిసాధ్వీత్వమును శంకించుటకంటెఁ, ప్రత్యక్షముగఁ దన కాలరాంగిని గూర్చి చెప్పుటకై తన్నే వేఁడిన తమ్మునింటికి ఆ సైరంధ్రినే పంపుచోఁ గించిత్తయిన సంశయించనిసుధేష్ణ కపటాత్మురాలేకదా!

మొత్తముమీఁద— సుధేష్ణ ఒక సామాన్య సంసారిణిగనే మూలమును— అశ్వత్థభారతమును పరిశీలించినవారికి దెల్లమగును. తిక్కన ఆమె నొకయుత్తమస్వభావము గల నరపాలాన్వయసంజాతగఁ దీర్చితీర్చెను. ఆమె (సుధేష్ణ)— మాయలాడి; జంత. తనవారి నృపు నెంతమట్టులనేని ఆదరించునది. కపటస్వభావముగలది. సురాపానాదినీచపుటలవాట్లుగలది:— "పంపవచ్చునె నీచంపుఁబనులఁబోవ" (అని - అశ్వత్థభారతము.)— "నీచముల య్యేడుపనులకు నాచాలమి యెఱిఁగి మన్ననకుఁ బాత్రముగా"— (అని శ్రీమదాంధ్రమహాభారతము.)- సప్తవ్యసనములలో సురాపానము, ద్యూతము, కాఞ్చనవే

అది నీచమయినది. ఉల్లాసమున కెప్పుడేని త్రావినఁ ద్రాక్షభావల్ల భులుండవచ్చునేమో!— తృష కలిగినపుడెల్లఁ ద్రావువారు వారుణీ కుంభములుగనో— "సారాపీపాలు"— గనోయుండవలయు!— సుధేష్ణ మదిరాపానోన్మత్తచిత్తవృత్తి గలది. ఆమె కది సంక్రమించుటకుఁ గీచకుఁడే కారణమేమో! దానికిఁ బ్రతిఫలముగ అతనిమరణమున కామెయే కారణముగాలేదా? రాజశ్రీవి, గాంభీర్యము, దయాస్వభావము, ప్రశాంతప్రవర్తనము ఆమెపదవికి ఉచితమయినగుణములు. అవి మత్స్యదేశమహారాజ్ఞియందుఁ గలికమునకయినఁ గానరావు.—

కీచకుఁడు:— మహాబలవంతుఁడు. విరాటరాజుసేనలకన్నిఁటికి దండనాథుఁడు. చపలస్వభావుఁడు. ఏ రవంతరూపసి యగుకాంతయేని అతనికంటఁబడఁగూడదు. అట్లుపడెనా, ఆనాఁటితో— ఆయువతిసచ్ఛీలమునకుజలాంజలియే. పేరునకుమాత్రమే విరాటరాజు మత్స్యదేశపరిపాలకుఁడు. సింహాసనమును దనబావమఱఁది యనుగ్రహమున నెక్కఁగలిగినరాతివిగ్రహము— వంటివాఁడు. (అతనిభీరుత్వమే పుత్రరూపమునఁ జనించినఉత్తరుఁడు.) అంతటిపిరికుఁడుగనుకనే కీచకుఁ డాతని ఏమాత్రమును సరకుసేయఁడు. అక్కయగు సుధేష్ణయం దున్నగౌరవముకూడ అతనికి బావగారియందులేదు. దిగ్దిగంతములకు దండయాత్రవెడలి— ఎంతటిబాహుబలసంపన్నులనేని జయించునేర్పు క్షత్రియుల కాజన్మలబ్ధ మయిననేతప్ప సామాన్యముగ అరివీరులమెకందల కడలువొడమఁ దొడరునేర్పు అలవడదు. ఈదృష్టితోఁజూచుచో, విరటుఁ డంతటిపరాక్రమము గలవాఁడుగఁ దోఁపఁడు. విధిలేక, కీచకమరణానంతరము విరాటాధిపతి సుశర్మతోయుద్ధమొనర్చి

జయించెను. వాస్తవము చెప్పవలసివచ్చనేని అతఁడుగాఁడు విజేత; మాఱువేసములతో అతనిని ఆశ్రయించి, సేవించుధర్మ భీమ నకుల సహదేవులు, అర్జునుఁడు పేడి యగుటఁ బోవఁజాలఁడయ్యె.— ఇట్టి శౌర్యహీనుఁ డగుబావపై కీచకుని కభిమాన మెట్లుకలుగును? అతనిదృష్టి కాభూపతి యొకగడ్డిపఱకతో సమానుఁడు.—

కీచకుఁడుసుదభిమాని.— సైరంధ్రిః—

"నాపతులసమబలాఢ్యో
ద్దీప్తులుగంధర్వు; లిద్దితెలిసిరయేనిఁ
ఓప్పుడురె త్రిమూర్తులేని నోగవా రలుగఁ?" (అ॥భా॥)

అనుటయుఁ, గీచకుఁడు.—

"సిచయరాని, యాపయిన నీపతు లెల్లర నోర్తుఁ గాని, యీ
వాదము మాను, మాయముఁడె వాలిసలిలగఁ గాలరాచనే?" (॥ఆభా॥)

అనును. తనబాహుబలమునం దంతవిశ్వాసము గలవాఁడు. శ్రీమ దాంధ్రమహాభారతమున నన్నయో, సుధేష్ణయే "సైరంధ్రీభర్త లగు గంధర్వులప్రశంసఁదెచ్చి— కీచకుని వారింప యత్నించును. అప్పు డతఁ డామెమాటలు జీరికింగొనక;—

"....    ....    ....    ....    చతుర్వారాశిమధ్యంబునఁ—
ఘనబాహాబలమొప్ప నన్ను నెదురంగా నొక్కఁడుఁ లేమి, యె
వ్వనికిందెల్లముకాదె, దానిమగలఁ వజ్రాహతిం గూలు శై
లనికాయంబన మద్భుజాసమదలీలం గీటడంగించెదఁ" (తిక్కన)

కీచకుఁడు యుక్తాయుక్తపరిజ్ఞానము లేనివాఁడు. కేవలము పశుప్రా

యుఁడు. సిగ్గు బిడియములు లేనివాఁడు. ఎంతటి కామవశుఁ డయినను మానవత్వము విడనాడి తనవలచిన కాంతకొఱకు వీధులవెంట ఆమె ననుసరించి పలువిడి, రచ్చకెక్కునా? ఆమె నెట్లేని, తనకుఁగూర్చి పెట్టు మని— పూజ్యురా లయిన అక్కను బ్రతిమాలునా?— ఆమె కబ లలచిత్తవృత్తిని గూర్చి జుగుప్సాపూరితాసహ్యావాక్యములు వెలువ రించునా?— క్రింది (మూలములోని) కీచకునివచనము లించుక గమ నింపుఁడు:—

"నచత్వమనుజానాసి, స్త్రీణాంగసహ్యమనుత్తమమ్
పుత్రంవా, కిలపౌత్రంవా, భ్రాతరంవా మనస్వినమ్
రహసీవా నరంద్దృష్ట్వా నానాగంధవిభూషితమ్
యోనిరుత్క్లిద్యతేస్త్రీణాం సతీనామపిచశ్రుతమ్
మాం నిరీక్ష్యానులిప్తాంగం సర్వాభరణభూషితమ్
వశమేష్యతిసైరంధ్రీ మన్మథేనాభిపీడితా"—

తనకు జ్యేష్ఠురాలగు అక్కతోఁ బలుకఁదగిన మాటలాఇవి?— ఆత్మగౌ రవహీనుఁడైన— తమ్మునివంటివాని నోటినుండి— తనపదవినయిన గు ర్తింపక, ఆభిజాత్యమునేని తలంపక సుధేష్ణవంటిది ఆలింపఁదగి నపలుకులా ఇవి?—

కీచకుఁడు అహంభావభరితుఁడు, ఆత్మాభిమానవిరహితుఁ డు; (మానవ)— తత్రాపి రాజధర్మాతిక్రాంతుఁడు, మూర్ఖస్వభావుఁడు, చపలచిత్తుఁడు, అన్యకామినీవాంఛాభిరతుఁడు, రహస్యగోపనోపాయా నభిజ్ఞుఁడు. అనవరత వ్యసనవస్త కాత్యంతలాంపట్యము గలవాఁడు. కర్ణునితో భారత మన్నట్లు కీచకునితో విరాటపర్వము రక్తికట్టినది.

జన్మింప చుము- తిక్కనాశ్వత్థభారతముల సావధానమతి నిశితముగఁ బరిశీలించువారికి విస్పష్టముకాఁగలదు.

భీముఁడు:- మహాకవికాళిదాసు వాకొనినట్లు:- సూర్య వంశప్రభువులేకాక పరమపావనచంద్రకులోద్భవులును- ఆధృష్యు లు; అభిగమ్యులును, అందులకాదర్శప్రాయుఁ డీభీముఁడు. స్వ ప్రతిజ్ఞానిర్వహణమునం దెక్కుడుపట్టుదల గలవాఁడు. సంగ్రామ ము తటస్థించుచో అతనికిఁ బెనుపందువు. సాహసకృత్యముల కెం తేని తెగించువాఁడు.—

ద్రౌపది తనభంగపాటుఁగూర్చి నివేదింపఁగనే, క్రోధావేశ పరవశుఁడై- యతఁ డాయాజ్ఞసేనితో:-

"మదమునఁ గీచకాగ్రజుఁడు మార్కొని సిల్చిన వీఁకమై మెయిం
గదిసితిమేని నప్పుడు ప్రకాశరహస్యవిభేదబుద్ధి నా
కొదవునె? యైన నేఁ దలఁచి యోపినభంగి నిరూఢవృత్తిమై
బదిలము గల్గి తిన్ననియుపాయమునం దెగఁజూతు నాతనిన్" (తిక్కన్న)

అనివక్కాణించెను. తాత్కాలికముగ భీమసేనుఁ డాడినయీమాట ద్రౌపది కూఱట కలిగించెను. కాని, అంతయుద్రేకపూరితముగాని యీతిక్కనరచనకంటె అశ్వత్థరాయఁభారతభాగములోనిది- మేలుఁ గని తోచెడు. అశ్వత్థభారత పద్యమిది:—

"చించెదఁగీచకున్; గనలుచెందినమాత్స్యుని ద్రుంతు; నన్నుగు
ర్తించినఁగౌరవవ్రజము వ్రేల్చెద; నగ్రజుఁ డడ్డెనేని ల
క్షించెదనే? సహోదరులఁగిమ్మననిత్తునె? శౌరిమీఱి కో
పించిన మించనే? ప్రతినవట్టితి; నీచుఁడు చచ్చెఁ బొమ్మికన్!"-

భీముఁడు బహ్వాశియు, వేగిరపాటును గలవాఁడు. కాని, ఉత్తమనాయకలక్షణము లన్నియు నాతనిలోఁ బుంజీభవించి యుండెను. తన్ను గోరిన అవివాహిత యగు హిడింబి, రాక్షసియయినను దన్నువలచినప్పుడు నిరాకరించినవాఁడు గాఁడు. విగ్రహరాజతుల్యుఁడగుటకతనికి జ్యేష్ఠసోదరుని యానతి నిశితాంకుశప్రాయము.-

తక్కినతమ్ములవలె భ్రాతయెడ నితఁడు వినమ్రుఁడయి యున్నట్లు శ్రీమదాంధ్రమహాభారతము. కాని, లోకసామాన్యముగ సమిష్టికుటుంబములోనియున్నదమ్ములవలె, వృకోదరుఁ డన్నను గొన్నిపట్టులలోఁ దిరస్కరించువాఁడుగ, ఈయక్షభారతము నిరూపించును. ఇంతకును మూలము నించుకవ్యతిరేకించినవారయి తిక్కనాశ్వత్థరాయకవీంద్రు లిరువురుఁ గొంతవఱకు స్వాతంత్ర్యము నవలంబించినారు- అనుటనిర్వివాదాంశము. ద్రౌపది (సైరంధ్రి):- హోమాగ్నిసంభవ, యగుట నేమో, తాను రాజ్ఞియయ్యును రాణివాసమునఁ గొన్నినియమములకుఁ గట్టువడి సైరంధ్రీవృత్తి నవలంబింతు నని యనఁగా, సందులకావిరటుపత్ని యంగీకరించెను.- యజ్ఞ, వహ్నికుండోదిత,- అయోనిజ- యగుటచేఁ- బాంచాలి, దుర్వ్యాప్తులగువారిదృష్టి కగ్గమయ్యెను, అందును జగద్విఖ్యాతజారుఁడుగఁ జేసమోసిన కీచకునికంటఁబడెనఁ దప్పక ఆపదలు సంభవించుననుశంక మున్ముందుపసిగట్టి అక్షివానినుండి తప్పించుకొనుటకుఁ దగుమార్గమునుగూర్చి చింతించి, తానయేప్రతనిష్ఠ నెట్లెట్లు పూనుట యుక్తమో ముందుగనే ఆలోచించి సుధేష్ణ యాటంకపఱుపకుండునట్లు వానింగూర్చి యామెకు వివరించును:—

"అనఁ, గృష్ణ పలుకు,— నీచపుఁ
బనులకుఁ జన, గరిత నగుదు, వలయుఁకలపప్పుం
బనులకు. విరు లల్లుటకును
సనుఁ గొనుమా?"— (అశ్వత్థభారతము)

దీనిని మదాంధ్రమహాభారత మింకను విస్పష్టపఱచెడు:—

"నీచమతి నన్ను నెవ్వఁడు
సూచిన నారాత్రిలోనఁ జూతురు దెగఁదా
రాచపలు హరిహరాదులు
గాచిన, బలవిక్రమము లఖర్వములైనన్" (తిక్కన)

అని బెదరించును. దానికి సుధేష్ణయు భీతిలి పాంచాలిం గోరుకీచకుని కావిషయ మెఱింగింప నతఁ డేమాత్రము చలింపఁడు. అతని బలపరాక్రమముల విషయమున ఆమె కుండినగాఢవిశ్వాసమే అందులకుఁ గారణము. ఈకారణముం బురస్కరించికొనియే ద్రౌపదిని (నీచమయినను) దమ్మునింటికి వెడలి సుర తె మ్మనె, ద్రౌపది పోవ నొల్ల నన్నది.— ఒల్ల నన్న— ఊరకవిడుచునదికాదు సుధేష్ణ. ద్రౌపది అత్యంతమాత్మాభిమానము గలది. నయభయములు సూపి కీచకుబారినుండి తప్పించుకొనఁ దలఁచినది. వల దీకార్య మని ప్రార్థియపడినది. రావణాదులదుర్గతి స్మరింపు మన్నది. తాను దేవకాంత ననియు, గంధర్వులకళత్ర మననియు వాకొన్నది. అన్నిటికి (తగిన సవాళ్లు) అన్ని నుడివినది. కాని, కీచకుఁడు పడుకువానకుఁ జదరఁడు; జంకఁడు; కొంకఁడు; చలింపఁడు. ఇఁక వీనితో మాటాడి ప్రయోజనములే దని స్థిరపఱచికొని:—

"ప్రుచ్చదె. నో, రిటు, నీచత

నుచ్చారణసేయఁ? గుక్కయోజఁ జరింపఁ౯

వచ్చునె? కీచక"— (అ||భా||) అని కోపముతో నిష్ఠురము లాడును. అంతియుగాడు. "కీచకు దండించెద, వసటను మాను"– సుధేష్ణ యోదార్పఁబూనుకొనఁగా పాంచాలి– "నీకేటికి దండింపఁగ? నాకాంతులు దీర్తు రది" (అ||భా||) అని నిశ్శంకముగ– నిశ్చయముగ– (సుధేష్ణతో) అనును.

సైరంధ్రీవేషమున ఉన్న పాండవపత్ని– తన్నుంచుకొన సుధేష్ణాదేవిం గోరఁగా, ఆమె పాంచాలి కులశీలాదులు గూర్చి ప్రశ్నించును. అట్టియెడ అశ్వత్థరాయలకంటెఁ దిక్కనయే ఎక్కుడుగ విపులీకరించెను. అతఁడు సుధేష్ణాద్రౌపదుల సంభాషణమును దాదాపు ఇరువది పద్యములలో వ్రాయఁగా, అశ్వత్థరాయలు ఏఁడెనిమిది పద్యములలో ముగించెను. అందుఁ బైనచూపిన పద్యమొక్కటే పాంచాలి నుడువులపిండితార్థము. చూడుఁడు:—

యాజ్ఞసేని, రాజ్ఞీమణితో–

"నేను సైరంధ్రీజాతిసంభూత; నభిధానంబు మాలిని. పురుషపంచకసనాథనై యుండుదు; నొక్కకారణంబున నుద్ధతులగు విరోధులచేతం బతులసన్నిధిం దలవట్టియీడ్వంబడి, వనంబున కరిగి, వ్రతంబుమై వల్లభసహితంబుగా వన్యాహారంబులం గాలంబు గడపుచు బ్రహ్మచర్యవ్రతంబు నడపితి: నిటమీఁద నియమాచరణంబునకు నొక్కసంవత్సరంబు గొలంతగలదు" (తిక్కన).

"ననుఁ గుచ్చితంపుఁబనులకుఁ
బనుపక, యెంగిలికి లోనుపఱుపక, తగుమ
న్ననతోడ సరయువారల
కనుదాగము సెఱపి నడతు రస్మత్పతులుఙ" (తిక్కన)

అని వచించును— ఇట్టినియమములవలన వనకుఁ గలుగఁగబోవు కష్టపాటును దరికిజేరకుండునట్లు ప్రయత్నించును. ఇందుచుఁబట్టి ఆమె "కీడెంచి మేలెంచు"— దూరదృష్టిగలదియని ద్యోతక మగును. "నీరూపము సూచి మాస్వపతి యుష్విళ్లూఱు"— అని విరాటరాజు— నిల్లాలన్నప్పు డాద్రౌపది యామెతో—

"నాదుపతులు వెరవులాపు నలఘు విక్రమంబు గ
లుగుగంధర్వు లేమఱరు నన్ను సొక్కమాత్రమైన" (తిక్కన)

అనెను— ఇట్లనుటచే భర్తను దనయదుపులోఁ బెట్టుకొనవలె ననియుఁ గానిచోఁ గడగండ్లపాలు గావలసివచ్చు ననియు పాంచాలి సుధేష్ణకు సూచించుచున్నది.— శత్రుహననదీక్షయందుఁ బాండవు లలో అత్యంతపౌరుషముగలవాఁడు ఒక్కభీమసేనుఁడే యనియు, అతఁడుతప్పఁ దక్కినవా రెవరు అంతకుఁ దెగింప రనియు ఎఱిఁగిన దగుట అర్ధరాత్రమున మహానసమున నిద్రించుచున్నభీముసిం దరిసి యెల్లవృత్తాంతములు నివేదించెను. వారిరువురుఁ గార్యమాలోచించి, తుదకు నర్తనాగారము నిర్జనప్రదేశము గాన, అక్కడికిఁ గీచకుఁ దరుదెంచువన్నాగముతో సర్వసన్నాహము లొనరింపఁ దీర్మానించు కొనిరి.

ద్రౌపది చాలగడుసరిః గాంభీర్యము గలది. కీచకునిదుర్వృత్తి

ధర్మ, అర్జున. నకుల, సహదేవు లందఱవలెనే యెఱుంగుదురు. కాని ప్రత్యేకముగ ద్రౌపదియెడ నాతనిప్రవర్తన మింతేని వా రెఱుంగరు. ఇవ్విషయము ముందే ధర్మతనూజునికిఁ దెలిపిన కీచకసంహారము జరుగనీఁడు. అట్లేజరిగియున్నచో కథ మఱొకవిధముగ నుండెడిదేమో!-

సహజముగ యాజ్ఞసేని సాధుశీల కాని, ఆమె యాత్మాభిమానము దెబ్బతిన్నచో, ఇఁక నందులకుఁ బ్రతీకారము చేసినఁగాని, ఆమెమనస్సు శాంతింపదు. పాండవకౌరవద్వేషము జ్ఞాతిత్వహేతుజాతము. అది సర్వసామాన్యము. నాఁడుకాదు; నేఁడుకూడ— "జ్ఞాతిశ్ఛేదనలేనకి" మ్మనునీతి యుగములుగఁ బ్రచారమం దెసఁగుచున్నదేకదా!-

పాండవులు ద్యూతమునఁ దమసర్వస్వము గోలుపోవుట, తద్రాజసూయయాగమున కరిగియుండిన దుర్యోధనుని భంగపాటున కా ద్రౌపది కారకురాలయినందుననే కదా! ఆయవమానమును భరింపఁజాలనికౌరవేంద్రునియమర్షమే పాండవుల "ఓకాపకీరులనుగ" దమ మేనమామ యగుశకుని కుతంత్రముచేఁ జేయించి, వారి నడవులకుఁ దఱిమివైచెను. అంతకుమున్నె ద్రుపదునిమీఁదికి గురునికోరికను అనుసరించి దాడివెడలినపాండవులలో అర్జునుఁ డాతని యుద్ధమున నోడించి బంధించి గురువున కర్పింపఁగా— అతఁ డాతని యవినీతికిఁ దగినట్లు బుద్ధిగఱపి ద్రుపదుని విడిపించెను. అప్పు డాతఁడు ద్రోణునిఁ జంపుకొడుకును అర్జునుని వరించుకూఁతును గోరి యజ్ఞ మాచరించెను. ఈకారణమున అర్జునుఁడు- ఎవ్వరును సాహసించి, కొట్టఁజాలని మత్స్యయంత్రమును గొట్టెను కాన, ద్రౌపది పాండవుల

నొత్తయ్యెను. ద్రోణునిఁజంపునంతటిశక్తి సామర్థ్యములు లేకున్నను (అర్జునుఁడు నేలఁగూల్చ సమాధియందున్న) ద్రోణుని శిఖండి తలద ఱిగెను. ద్రుపదునియభీష్టములు రెండును సిద్ధించినవి.— ప్రళయాంతక మగుకౌరవపాండవయుద్ధమునకు హేతుభూత పాంచాలి. ఆమె మహాశక్త్యపరావతారము. "ద్వాపరేద్రౌపదీశక్తిః కలౌశక్తిః గృహేగృహే"— యనువాక్య మెంతసార్థకమయినదో గమనింపుఁడు—

ఈరీతి వ్రాయుచుఁబోయిన భారతమువంటి యుద్గ్రంథమే యగును.— ఇంతటిగ్రంథమును సంగ్రహముగఁ, బండితపామర రంజకముగ, మృదుమధురముగ సలక్షణభాషాసముచితముగ, లలిత శయ్యాసుభగంబుగ వ్రాసి, కొమ్ములుదిరిగిన గొప్పవిద్వాంసులనుగూడ ఆశ్చర్యచకితులనుగఁ జేయుసేర్పు ఈశతాబ్దమున ఒక్కశ్రీఅశ్వత్థరాయలకే చెల్లినది. పదగుంఫనము, భావసైశిత్యము, రచనాచమత్కృతి— వీరి కెన్నఁడో లభించిన వ్రతని ఈ అశ్వత్థభారతమే వేనోళ్లఁ జాటుచున్నది. అచ్చికప్రయోగములయందు అశ్వత్థరాయలు అద్వితీయుఁ డని ఈ భారతపద్యములే తెలుపఁగలవు. ఇందేపట్టుదీసికొని చదివినను పాఠకులయుల్లములు పల్లవింపఁజేయు రసభావాలంకార రచనాంచితముగ భాసించును.

కవిత్రయభారతమునకువలెనే, దీనికిని సర్వాంధ్రజగద్వ్యాప్తనిశ్చలయశఃకౌముదీద్యుతు లెసలారఁగల వని మూఁటికి ముమ్మాటికి హృదయపూర్వకముగ విశ్వసించుచున్నాఁడను,—

—: అశ్వత్థరాయ సంజీవమూర్తిగారల కవితా తారతమ్యము :—

మొత్తమునకు శ్రీరాయలవారియొక్కయు శ్రీసంజీవమూర్తి

గారియొక్కయు కవిత్వములు పరామర్శించుచోఁ దారతమ్యముం ద్రడవఁ జాలము.— శబ్దసిద్ధియందుఁ బరిణతిచెందినవారే ఈయిరువురు భాషారాధకులు.

శ్రీరాయలవారికవిత అమృతస్రవంతి యన్నచో,— శ్రీసంజీవమూర్తిగారిది గంగాప్రవాహము. సమాససంఘటనమునందు రాయలవారిది ఆఱితేరినచేయి యగుచో,— శ్రీమూర్తిగారిది లక్షణసంయుతము. శ్రీరాయలవారు అలంకారములకు మోజుపడువా రన్నచో, శ్రీమూర్తిగారు అన్వయక్రమముగఁ గథ నడుపుటయందు అగ్రగణ్యులు. శ్రీరాయలవారు మూలమునకుఁ బ్రాధాన్యమిచ్చువా రనిన— శ్రీమూర్తిగారు వర్ణనాదులపట్ల స్వకపోలకల్పనములకు అగ్రస్థానమొసంగువారు.

శ్రీఅశ్వత్థరాయలవారు ఈకృతియందును ద్విపదలకును— దండకములకును బాపు కల్పించిరి. కొన్నిపట్ల మాలికలుగూడఁ గథాగమనమధ్యమున నుపయోగించిరి. కాని, యట్లొనర్చినవారు చాలనరుదు. అట్టికవీంద్రులలో— సవ్యాఖ్యగ వాల్మీకిరామాయణము రచించిన బ్ర॥ శ్రీ॥ జనమంచిశేషాద్రిశర్మగా రొకరు, ప్రాచీనకవిప్రణీత కృతులలో ఇట్టిమాలికలు మందునకేని కానరావు.

—: శ్రీసంజీవమూర్తిగారి కవితావిశేషములు :—

వీరు (కవితావైఖరినిబట్టి పరిశీలించుచో) శ్రీరాయలవారికి దరిదాపుగా వత్తురు. "వీరికవిత శ్రీరాయలవారికవితకు అతికినట్లున్నది." అని చదువఁగనే ఒకనిర్ణయమునకు వచ్చితిని. కాని, పూర్తిగఁ బరిశీలించినతరువాత, రెంటికి అభేదముగానవచ్చినది. కావున

"ప్రారంభకుల కవనమున నిది లీనమై– శ్రీరాయలవారే– [illegible] వ్రాసెరి" అనుతీర్మానమునకు రావలసివచ్చినది.

శ్రీమూర్తిగారికి భావములపైఁ గలమోజు అలంకారములపైఁ బోవనిపద్ధతి, తత్కవితయందంతటఁ గాన్పించును. సునిశిత ధిషణాచతురిమ ముద్దీపింప, సూక్ష్మభావములపై పరిపుష్టిని "నల్లేరుపై బండిపోఱినట్లు" పోఱుట వింతగొల్పెడు. రాయలకాలపు నికవులలో– శ్రీరాయలవారితోఁబాటు ప్రఖ్యాతినార్జించు కవితాపాటవముగల శ్రీమూర్తిగా రింతదనుక నేస్వతంత్రకావ్య రచనకును బూనికొనకుంట తెలుగునాఁటి రసజ్ఞవిసరముయొక్క దౌర్భాగ్యము. ఉల్బణ ముప్పెత్తుగఁ జెలరేఁగినపుడు– కాలమునకుఁ దగు తెలుఁగు సేఁత ఎంతదప్పుగనున్నను– ఆరెంటికి సమన్వయము గలుగునట్లు గలసంజీవిమూర్తిగా రిట్లు మౌనముద్రాలంకృతులై యూరకుండక తమకవితాకన్యకు ఆంధ్రలోకము క్రీడాంగణ మగునట్లు సుకృతికర్తలై,– తమకును, ఆసుకృతికిని జిరయశ మాపాదించి ధన్యచిత్తు లగుదురుగాక.!–

శ్రీరాయలవా రన్ననో– "జగమెఱిఁగినబ్రాహ్మణులు" శక్తి సిద్ధి, శుద్ధి– వారి కాజన్మసిద్ధములు. అంతటి (మహాభారతమువంటి) అత్యుత్కృష్టజాతీయజీవనము (ప్రతిపదమునను.) బోధించు కృతి సంక్షేపముగ– తెనుఁగువారికిఁ గానుక ఇడుటకును ఉద్యమించుట ఇహపరసార్థకము. పరమేశ్వరుఁ డింకను వారిచేఁ బెక్కు కావ్యరత్నములు వెలువడునట్లు వారికి చిరాయురారోగ్యభాగ్యము లనుగ్రహించి, రక్షించుఁగాక!——

ఇప్పటికే యీ ఉపక్రమణిక, దొలుత నే నూహించిన దానికంటెఁ జాలవఱకుఁ బెఱిగిపోయిన దని విచార మొకవంక బాధించుచున్నను, ఈసందర్భమును బురస్కరించుకొనియైన- నవిమర్శగఁ జెప్పఁదగిన విషయములెల్ల :సంగ్రహముగనేని చెప్పఁగలిగితి నని సంతృప్తిఁ జెందుచు. శ్రీమూర్తిగారికవిత నించుక పాఠకులకుఁ జవిచూపి విరమించెద—

"అచ్చెరువుఁ భయంబు మది నావహిలఁ ధృతరాష్ట్రుఁడాత్మజుఁ
మెచ్చక!– "జూద మెవ్వరికి మేలు ఘటించు; నిదేటి కోర్కె; యే
పొచ్చములేనివంశమును ముంచెదవేయపకీర్తివార్ధి; నీ
చిచ్చు దహించు నందఱ వశేషముగా, విను నాహితోక్తులఁ"
"ఎదురుండొప్పునె? ద్రోణుఁడీకొనెడునే? భీష్ముండు సైరించునే?
తుది నీకేనియు నమ్మతంబె? యకటా! దుర్మార్గు లెవ్వారొ నీ
కిది బోధించిరి; మాను మీతలఁపు; లెదే వేఱుమార్గంబు, నీ
కొదవల్ దీర్చుకొనంగఁ? బాండవులు నీకుఁ లాఁతివారే సుతా!"
"అంతకుమించినసభ ని
ర్మితమము; జన్నంబుసేయ మేకొండము, వా
రెంతఁగని, రంతయును గని
సుంతయుఁగొదలేక మను యశోవంతుఁడవై"
అనుచు జనకుండు నొడివిన యంత, న్యుతని
పలుకు ములుకై చెవిఁ దూఱ, వంతనొంది
యాతఁ డిట్లను; దండ్రి! దాయాదిచేత
నాకుఁ బరిభవ మగుటయు నీకు హితమె?"

"ఆశాంతసకలదేశాధీశు లరుదెంచి
వేర్వేఱఁ గాన్క లర్పించుచుండ,
మౌనీంద్రగణవేదమంత్ర ఘోషలు దిశా
వలయంబుఁ దాఁకి మిన్నులముచుండ,
సురపౌది సకలనిర్జరపాళి గుమిగట్టి
దివినుండి యాశీర్వదించుచుండ,
హరిసహస్రాక్షుఁడై యందెందు నేలోటు
పొరయన ట్లఖిలంబు నరయుచుండ,

గీ. మయవినిర్మితాద్భుత మహామండపమున
సింహపీఠి ధర్మజుఁడు భాసిల్లుచుండ,
నిఖిలలోక వైభవ మొక్కనెలవునందె
వాలె నన మించెఁ బాండవ ప్రాభవంబు"

"అపుడు తానె యుర్వినంతయు నేలి న
ట్లోరగంట నొక్కసారి నన్ను
మూదలించుచున్న ముసి నవ్వుతోఁ గన్న
భీముచూపు నెట్లు విస్మరింతు?

"తినఁగఁబోవుచు రుచులవర్ణన లవేల?"

"జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః"

మదరాసు.
30—11—59

భాషాజీవి:—
(సం) వేదము వేంకటకృష్ణశర్మ.

ఆంధ్రసాహిత్యఅకాడమీ ఉపాధ్యక్షులు అగు-

[బ్ర॥ శ్రీ॥ కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణగారు, ఎం. ఎ,]

ప్రిన్సిపాల్ — కరీంనగరుకాలేజి.



ఇది యొక క్రొత్త భారతము. రామాయణము లనేకము లున్నవి. కాని భారతము లనేకములు లేవు. రామాయణము లనేకము లుండుటకు "యదిక్షుణ్ణంపూర్వైరితిజహాతి రామస్యచరితమ్" అను నది పెద్దకారణము. ఇది బయటికిఁ గనిపించుకారణము. తెలుఁగులో ననేకములైన రామాయణములు వెలయుటకు భారతము లనేకములు వెలయకుండుటకు నాంతరప్రబలకారణ మొక్కటి కలదు. నన్నయతిక్కనలను మించి వ్రాయలేకపోవుటయు, భాస్కరుని మించి వ్రాసినచో వ్రాయుటకు సాధ్యమైయుండుటయునే కారణము. భాస్కరుఁ డేమి తక్కువచేసెనా? యనిప్రశ్నించుచో రామాయణము రసభూమి. భారతము భావభూమి; శిల్పభూమి. భావమునందు, శిల్పమునందు నన్నయతిక్కన్నలను మించువారు తెలుఁగుభాషలో పుట్టరు. ఒకవేళ పురాకృతబహుసుకృతవశమున వారిద్దఱను మఱెవ్వఁడైన మించి వ్రాయవచ్చును. ఆమించుట యేకదేశముందే జరుగును, ఎప్పటికి నన్నయతిక్కనలు సర్వజగదతిశాయిప్రతిభా

సమేతులో అచ్చట నెవ్వరును మించలేరు. వారియుద్ధశిల్పమార్గములు, రెండుమహోత్కృష్టస్థానములం దున్నవి. వానిని మించుట మనుష్యసాధ్యముకాదు. రామాయణము రసభూమి యగుటచేత "నాధ్యేవౌరసోయథాతథంకవిభిః." అనుటచే రామాయణమును పలుమంది వ్రాసిరి. వ్రాయుచున్నారు. వ్రాయఁగలరు. అం దతిశయము లగువిషయములు భాసింపవచ్చును. భారతమట్లుకాదు. నన్నయతిక్కనలందు కొంద అనౌచిత్యాదిదోషములు జూపించినను ఆ దోషము లెక్కపభాగము నిలుచునవి కావు. "ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతి." అదియుకాక వారియందు దోషములుచూపించుట తండ్రులయొక్కదోషముల నెన్నుటవంటిది. నన్నయతిక్కనల భారతము వెలసి కొన్నివందలయేండ్లైనను తెలుఁగులో పెద్దనాదిమహాకవులు పుట్టినను భారతమును మరలముట్టుకొనలేదు. నాచనసోమన్నయే తాఁకలేదు. తక్కినవారిమాట యెందులకు?

కాని నేఁటికాలమున భారతమును స్పృశించినవారు కలరు. వానిగుణాగుణములు పఠితృలోకమునకు భావుకజగత్తునకు వదలిపెట్టవలయును. ఇది యింకొకభారతస్పర్శము. ఈభారతము మరల వ్రాయఁబడుటకు రెండుకారణములు చెప్పఁబడుచున్నవి:—

"మహితుఁ డొక్కఁడు శౌరిమహిమఁ గొండాడినఁ
బరుఁ డింక నటు సేయఁ బాపమట్టె?"—

ఇది మొదటికారణము. భారతమునందు శౌరిమహిమ లేదనుటకు వీలులేదు. కనుక నీవాక్యమును కాదనుటకు వీలులేదేమో!- రెండవకారణము:-

3

"ఆకవిత్రయము పుట్టఁ బల్లనేరనికవి
భారతము రచింప నేర మగునె?"-

ఈకారణమునకు నేమనవలయునో తెలియదు. అగునని కొంద అన వచ్చును. కా దని కొంద అనవచ్చును.

ఈభారతము ఆదిసభాపర్వములు అరణ్యపర్వములోనొక యాశ్వాసము గ్రంథకర్తయైన కలుగోడుఅశ్వత్థరావుగారు పీఠిక వ్రాసిపెట్టుమని నా కాఱునెలల క్రిందఁ బంపించిరి. ఆఱునెల లీగ్రంథము నాబల్లమీదనున్నది. కళాశాలకు సెలవులువచ్చి నాకు తీఱిక యైనది. ఇంతయాలశ్యము చేసినందులకు కవిగారు నన్ను క్షమింతురు గాక. నాకాలముసగము పీఠికలు వ్రాయుటతో సరిపోవుచున్నది. కాదనుటకు వీలులేదు.

ఈభారతరచన వేఱు. సర్వవిధముల వేఱు. ప్రధానముగా గథావిషయముఁ జాల కుదించి వ్రాయఁబడినది. ప్రధానకథయేతప్ప నుపాఖ్యానములు లేవు. భారతావతరణమునందలి బహూపాఖ్యానములు లేవు. గరుడకథ, సర్పయాగము లేవు. మొదలుపెట్టుచునే వ్యాసజననముతో నారంభింపఁబడినది. తరువాత దుష్యంతునికథ. వెంటనే భారతకథ యారంభింపఁబడినది. శంతనుఁడు మొదలైనకథ. ఇట్లే కథయంతయు నుపాఖ్యానములు వదలఁబెట్టఁబడినవి. ఒక్కసుందోపసుందులకథమాత్రము దీనియం దున్నది. ద్రౌపదిని పాండవు లైదుగురు భార్యగాఁజేసికొనుటలో నాకథ చెప్పకున్నచో వారిలో వారికి పోరుపు కలుగునని కవి యుద్దేశపడియుండవచ్చును.

ఏకవియైనను తాను కొంతక్రొత్త చేయలేనివాఁ డుండఁడు. ఆ చేసినక్రొత్తఁదనములోఁ గొన్ని యధికగుణవంతములు సమర్థులైన కవులయందు భాసించును. ఈకవి కవితయందుఁ గొన్ని చమత్కార ములు కలవు. శిల్పదృష్ట్యాచమత్కార జనకహేతువు లైనరచన లున్న వి. భారతాదియందు పూరువంశము చెప్పఁబడవలయును. వంశవ ర్ణనము పరిహరించిన యీకవి యదృష్టముగా వానిని తొలఁగించక ఆ రాజుకొడు కతఁడు, అతనికొడు కతఁడు మొదలైనపేర్లు రెండుచోట్ల సీసమాలికలలో వ్రాసెను. ఇది మిక్కిలి క్రొత్తయైనవిషయము. ఈ గ్రంథమునందు వచనము లేదు. అందుచేత నట్లు చేయకతప్పదను టకు వీలులేదు. ఆసీసమాలికలకు బదులు వౌతికవృత్తములు వ్రా యవచ్చును. అట్లు వ్రాసినచో సీసమాలికలు వ్రాసిన విలక్షణత్వము పుట్టదు. ఇట్లే ధర్మజరాజసూయమునందు, భీమార్జున నకులసహదే వుల దిగ్విజయవర్ణనములందు ద్విపదయు, దండకము, గీతమాలి కయు, షట్పదీవృత్తమును తీసికొని రచించెను. ఇదియు తాదృ గ్విలక్షణతాజనకహేతువు. కనుక కవి తెలిసిచేసిన శిల్పము కాని గ్రుడ్డిద్రవేటుతనము కాదు.

ప్రధానకథ నెంతనవలంబించినను కవి తనయొక్క స్వా తంత్ర్యమును చేయుచునే యుండెను. పాండురాజునకు సుతులు క లుగుచున్న సమయమున నొకపుత్రునితో సంతోషించక యైదుగురు పుత్రులనుకనుటకు ప్రతిపత్తులు లోకసహజముగాఁ గల్పింపబడినవి.

"సిరియును, విద్యయు, సుతులును
మరి యెంతఁ జాలు నను వెఱ్ఱిమనుజులు కలరే?

తరలాక్షి! నాకు నీ(క నొక

వరసుతుఁ బడయంగ మదిని వాంఛ జనించెఁ"—

"నాకొకఁడు, నీ కొకఁడు మరి

లోకమ్మున కొకఁడు కీర్తిలోలుఁడు వలదే?"— యని యర్జు నోదయమునకు ప్రతిపత్తి.

"చంక నొకఁడు, కేలు లంకించి యొక్కఁడు

నాణెమొప్పవలదె నాకు నీకు?

నలుగు రైనఁగాని కలుగదా మాదిరి"— యని నకులజన్మయందు పాండురాజు కుంతిని ప్రోత్సహించెను. ఆయనయీపుత్రవాంఛకు సమృద్ధి కలుగఁజేయుటకువలెఁ గవలు పుట్టిరి. ఈకల్పన చమత్కారముగా నున్నది.

దుష్యంతునికథ కవి యొకక్రొత్తతీర్పు తీర్చెను. కొంత భారతకథ నవలంబించెను. కొంతవఱ కభిజ్ఞానశాకుంతలము నవలంబించెను. ప్రియంవదానసూయలు లేకపోయినను శకుంతలవద్ద నొకచెలి యుండెను. శకుంతలాజన్మకథ యాచెలికత్తెచేతఁ జెప్పించెను. నన్నయగారు శకుంతలచేతనే చెప్పించిరి. అం దాధునికదృష్టి నౌచిత్యలోపము కన్పించును. వేదకాలపుదృష్టితోఁ జూచినఁగాని నన్నయ్యరచనయం దౌచిత్యము భాసించదు.

పాండవులు లక్కయింట చనిపోవునప్పుడు ధర్మరాజు తన కారహస్యము తెలిసినతరువాత దుర్యోధనుని యసూయనుగూర్చి విస్తరించును. ఈభారతములో చేసినమార్పులవలన నన్నయతిక్కన్నల భారతములో నున్నధృతరాష్ట్ర ధర్మరాజాదుల స్వరూపమే మాఱిపోయి

యతఁడు తనమనోభావమును జెప్పఁడు. ఈదుర్యోధనుఁడు తానే మాటాడును. మరియు పూర్వభారతములో ధృతరాష్ట్రుఁడు పాండవులను బిలిపించి ఇంద్రప్రస్థమిచ్చినతరువాత రాజసూయానంతరమున దుర్యోధనునకు మాత్సర్యముకలిగెను. పాండవులు ద్రుపదునింట నుండఁగనే దుష్టచతుష్టయముయొక్క కుటిలోహాలిందుఁ జెలరేగును.

ఈకావ్యములోఁ గావ్యవైఖరి యెక్కువగానున్నది. ఇంద్రప్రస్థపురవర్ణనము విస్తరించి చేయబడినది.

ఈకవి కొన్ని నన్నయగారిపద్యములకుఁ బద్యములు వ్రాసెను

మ. "మదమాతంగ తురంగకాంచనలసత్ మాణిక్యగాణిక్యసం
పద లోలిం గొనితెచ్చి యిచ్చి"— అన్నపద్యమునకు:—

మ. "సరగన్ సప్తసముద్రముద్రితధరాచక్రంబునంగల్గుభూ
వరు లత్యుత్తమహేమరత్నచయముల్ భద్రేభఘోటంబులున్
వరవీర్యధ్వజినీవితానములు సద్వస్త్రప్రకాండంబులున్
బరఁగన్ గాన్క లొసంగి కొల్చిరి సభాభద్రాసనున్ ధర్మజున్."-

ఇట్లే సభాపర్వములో—

"సీ. వృద్ధుఁ డీతం డనుబుద్ది పూజించితే
వసుదేవుఁ డల్లదే ఁమెనఁగుగాదె"— అన్న పద్యము పద్యమునకు మాఱుపద్యము. ఇట్లు కొన్నిపద్యములు కలవు. వీనివలనఁ గవియొక్కయహంప్రత్యయము గోచరించుచున్నది.

"కం. అవి సింహామె, యివి కుక్కలె?
ముదిపగ్గా! మేలుమేలు బుద్ధిచిగిరె, నీ

వాఁ డలుఁప గ్రామహవాహ ము

గుడువ, కురునాథునింటఁ గూటికిఁ బనుపుట" –

అని శిశుపాలుఁడు భీష్ముని దూషించును. శిశుపాలుని కోపిత్వము తెలియును. నోటికివచ్చినట్లు మాటాడును.

శ్రీకృష్ణుఁడు పాండవులను వచ్చిచూచి వెళ్లుచున్నాఁడు.—

"గీ. ఎంతదవ్వు చూడ్కి కేఁగునో యంతదాక
నిక్కి హరిని, రథము, టెక్కెయమును,
ధూళిఁ జూచి, ధ్యానమూలించి పాండవుల్" – నసిరి.

ఈపద్యము కంకంటిపాపయ్యను స్మరింపఁజేయుచున్నది. ధ్యానమూలించుట విశేషము.

"గడచినకాలంబే మేలు వచ్చుకాలముకంటెన్" అన్న నన్నయ్యగారిచరణమునే తీసికొనెను. కుమారాస్త్రవిద్యాప్రదర్శనము నందుఁగాని, భీముఁడు బకహిడింబులతోఁ జేసినమల్లయుద్ధమునందు గాని. కుస్తీపట్టుటను, ఈకవి విస్తరించివ్రాసెను. మఱియు ద్రౌపదిస్వయంవరమునప్పుడు వచ్చినయతిథులకు వసతులు నిర్మించుట యెక్కువగా విస్తరించి వ్రాసెను. లోకమునెక్కువగాఁ జిత్రించవలయునన్న కవిదృష్టి వీనియం దెక్కువగా భాసించుచున్నది. ఇంక సభాపర్వము మూఁడాశ్వాసములు; ప్రథమాశ్వాసము అశ్వత్థరావుగారు వ్రాసిరి. రెండవయాశ్వాసము కవిభూషణబిరుదాంకితులగు సంజీవమూర్తిగారు వ్రాసిరి. సంజీవమూర్తిగారు అశ్వత్థరావుగారి చెలియు, బావయు, కవిత్వగురుఁడు, శ్రేయోన్నతుల్ గల్గఁగోరువాఁడు. ఈసంజీవిమూర్తిగారికవిత తిక్కన్నగారి నెక్కువ ననుసరించుచున్నది.

"అడిసకలం బోకెత్తు; సభయం డటుభంగముఃనొందుసన్ను ద్రౌ
పది గని, నైజగౌరవమె వావియె, యొండుగణింప కక్కటా!
మదమున గేలుదట్టి నగి, మాయనిగాయము చేసె లోన; నా
డుది సగ, నోర్చునాపురుషుండుఃబురుషుండె; యిదొక్క యెత్తుగా;"
ఈపద్యము వారిమార్గమున కుదాహరణము. ఊహయు రచనయు
సర్వంబును తిక్కన్నగారివరవడి, ద్రౌపది సభాపర్వమునందే కృష్ణునితో
తనపడినపాటును చెప్పుకొనును. మఱియు వీరు వ్రాసినభాగమునందు
గూడ నన్నయగారి కథనుండి చాలమార్పులుకలవు:

నన్నయ్యగారిభారతములో ద్రౌపదిధర్మసందేహ మడుగఁగా
ధర్మరా జేమియు మాటాడలేదు. ఇచ్చట ధర్మరాజు తాను ధర్మనిర్ణ
యముచేసిచెప్పెను .... .... .... అర్జునునకుఁ గోపమురాఁగా "అగ్ని
పుత్రితోడ నసిలాత్ముజుఁడు చేరె యిఁక ధనుంజయుండు నేఁచు టరుదె"?
అన్నచమత్కార మొకటి,

ద్రౌపది కృష్ణునిగూర్చి విస్తరించి సభలో ప్రార్థనము
చేయుట, ద్వారకలో పాచికలాడుకృష్ణుఁడు అక్షయమనుట. మొదలైన
లోకములోనికథ ఇందు పొందుపఱపఁబడినది; ఈరెండుశైలులు
నొకదాని కొకఁ డెట్లుపొసగు నని విచారణచేసినచో నొకటిరెండువిష
యములుచెప్పవలయును. సంజీవమూర్తిగారిరచన తిక్కన్నగారివర
వడి యని చెప్పితిని. అశ్వత్థరావుగారిరచనలో నందందు నన్నయ్య
గారిపద్యములకు బద్యములు, పాపయ్యగారిభావములవంటి భావము
లుండినను దవచ్చును గాని యాయనరచన స్వతంత్రమైనది, ఒకరి
ననుసరించునది కాదు. తనకున్నశబ్దజాలముతోఁ దనభావములు

తానేచెప్పికొనిపోవును. ఆరచన కెట్టిస్థితి యున్నదన్నచో, సహృభావుకులు నిర్ణయింపవలసిన విషయము. ఒక్కటిమాత్రమున్నది, ఇట్టిరచన పోనుపోను మెఱుగుతేఱును, ఈకవిరచన తొలిరచనకంటెఁ దరువాతరచన నిక్కముగా మెఱుఁగుతేఱినది. ఎంతమెఱుఁగుతేఱిన దనగా సంజీవమూర్తిగారిరచనతో తులతూగుచున్నది.

ఇందలిభాషావిషయము నేను వ్రాయఁదలఁచుకొనలేదు, ఈగ్రంథమువలన లోకమున కొకమే లున్నది, కవిత్రయముయొక్క భారతము పాండిత్యమును, ప్రౌఢియు శిల్పరహస్యములు, భాషారహస్యములు తెలిసినవారికే దానిలోనినిగ్గులు తెలియుటయు మొదలైనకష్ట మున్నది. ఈభారతము సులభముగా నున్నది. కొంత ప్రమాణమైనభాషాజ్ఞాన ముండినచో గ్రంథము సులభముగా సస్థమగును. ఈకవి యీగ్రంథమును పూర్తిచేసి లోకమునకు మేలుచేయుగాతమని వాంఛించుచున్నాను. ఈగ్రంథమునచ్చొత్తించుటయందువారులు సౌఖ్యపడుదురుగాత. ఈకవులకు పరమేశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యైశ్వర్యము లిచ్చుగాత. నేనింతజాగుచేసినను కోపించని యశ్వత్థరావుగారికి మత్కృతజ్ఞతానమస్కారములు.—

(సం) విశ్వనాథసత్యనారాయణ,

బెజవాడ.

2—4—58

[శ్రీ ఆచార్య జి. జె. సోమయాజులు, ఎం. ఎ. ఎల్ టి.
ఆంధ్రభాషాశాఖాధ్యక్షుఁడు; ఆంధ్రవిశ్వకళాపరిషత్, వాల్తేరు.]



పంచమవేదమై భారతీయనాగరకతా విజ్ఞానములకు నిధియై ఆసేతుహిమాచలం బగుభారతావనిని అమృతరూపంబునఁ బ్రవహించి ఖండాంతరంబులకుఁబ్రాకి ప్రపంచమున చిరస్థాయియైనది మహాభారతము.— ఏకాగ్రచిత్తులై మహర్షులు తపోబలమున ననుభవించిన పరబ్రహ్మస్వరూపమే వేదములయందు వెలయింపఁబడినది. అట్టిబ్రహ్మమునకు పారమార్థికవ్యావహారికంబు లనెడిరెండుదృష్టుల స్వరూపనిరూపణముచేయునది భారతీయదర్శనవ్రాతము.— అట్టివేదశాస్త్రములసారములంతటిని తనలోనిముడ్చుకొని మానవజీవితసమన్వయస్వరూపమును లోకులకు ప్రదర్శించుటకై వ్యాసమహర్షిచే భూలోకమున అవతరింపఁజేయఁబడినది యీపంచమవేదము.—

సంస్కృతభాష పండితైకశరణ్యముకాఁగా పామరులు దేశభాషలనుమాత్రమే యాశ్రయింపఁగా భారతాదిగ్రంథములు దేశభాషలలోని కనువదింపవలసివచ్చెను. ఇట్టి ప్రయత్నము తమిళ కర్ణాటకాంధ్రాదిభాష లన్నిటియందు జరిగినది. ఆంధ్రవాఙ్మయ

రూపమున సరస్వతిప్రచారమొనర్చుటకు మొదలిడినప్పుడు వేసినమొదటి యడుగే ఆంధ్రమహాభారతము. నాటినుండి నేఁటివఱకును భారత ము అనేకవిధముల ననేకులచే వ్రాయఁబడుచునేయున్నది. కావ్యము లుగను, యక్షగానములుగను, నాటకములుగను, హరికథారూపము నను భారతోపాఖ్యానములు వేలువేలుగా వ్రాయఁబడుచున్నవి. కొం దఱు దీనిని ద్విపదరూపమున వెలయించిరి. ఒక్కరే భారతమునంత టిని తెనిఁగింపవలెనని పట్టుపట్టి కవిసార్వభౌములు శ్రీపాద కృష్ణ మూర్తిశాస్త్రులవారు అసాధారణకవితాధోరణిలో వెలయించిరి.

ప్రకృతము అట్టియాశయముతోడనె అశ్వత్థభారతమును రచియింప వలయునని సంకల్పించి రచన సాగించుచున్నవారు శ్రీకలుగోడు అశ్వ త్థరావుగారు. శ్రీకృష్ణదేవరాయాది మహా మహులపోషణచే నెల్లప్పు డును నాంధ్రవాఙ్మయము నాదరించి యుపాసించుచున్న రాయల సీమలోని రాయదుర్గముతాల్లూకా కలుగోడుగ్రామము వీరివాసస్థాన ము. ఆంధ్రమున యువతీవివాహభాగ్యోదయము, మయూరధ్వజము అనునాటకములను, మఱికొన్ని యితరగ్రంథములను వీరు రచి యించి ప్రచురించినారు. కొలఁదికాలముక్రిందటనే వీరు ప్రక టించిన అపూర్వగ్రంథము దండకరామాయణము. రామాయణము నెందఱో యెన్నియోరూపముల తెనిఁగించియుండ దండకరూపమున గ్రంథమునంతటిని వ్రాయసమకట్టి కృతకృత్యు లగుటమిక్కిలి ప్ర శంసనీయమే గాక అపూర్వము నయి యున్నది. వీ రిట్టిఅసాధారణ సంకల్పములను నెఱవేర్పఁగలుగుటకు భక్తిప్రధానమైన వీరి చిత్తమే హేతు వని చెప్పకతప్పదు.

ఇఁక ఈభారతము ననువదించుటలో పూర్వులయనువాదము లెల్లను వానిపయివిమర్శనములు లన్నియును వీరికి మార్గదర్శకము లు. మూలమును తెనిఁగించుపట్ల పూర్వు లనుసరించిన మార్గము స్వేచ్ఛానువాద సరణియేగాని మక్కికిమక్కి గాదు. అట్టిమార్గమునే వీరును అవలంబించిరి.

ఈరచనయందు కవికి స్వాతంత్ర్యము కలదు. ఆతనిప్ర తిభకు ప్రయోజనము చూపట్టును. కల్పనాశక్తి కుంఠితముగాదు. దేశీయములై పాఠకులకు పరిచితములైన తత్తజ్జాతీయవిశేషములను మూలములోనికిఁ జొప్పించి రూపముచెడకుండ హృదయంగమమైన రచనచే పాఠకులకు నానందము గొలుపుటకు ఈమార్గము మిక్కిలి యుపయుక్తము. ఇందలికవిత్వము హృదయంగమముగా నున్నది. తెలుఁగువారిచెవులలో చల్లనిఅమృతంపుసోనలు కురిపించినట్లుండు ను. దీర్ఘములైచదువువారు గ్రుక్కత్రిప్పలేనట్లు వ్రాయంబడిన సం స్కృతసమాసప్రౌఢరచన తెలుఁగుకానేరదు. సంస్కృతపదములఁ బరిహ రించి శేషించిన అచ్చాంధ్రపదపల్వలమాత్రమున స్వేచ్ఛమెయి కవి సంచరింపఁజాలఁడు. పదసంఘాటము చాలనిరచన నే యార్థాదిదోష ములకుఁ తప్పక నెలవగుచుండును. ఇట్టి రెండువిధములను విడిచి పెట్టి తెలుఁగుపదముల స్వరూపము గుర్తించి సంస్కృతపదములను బరిహరింపక. జాతీయములచవు లొలికించుచు, వాక్యములను దీ ర్ఘములుచెయక, అన్వయమున క్లేశముకల్పింపక, సూటిగా, తేటమాట లతో వ్రాయఁగల్గుటయే సరియైనతెలుఁగుసేఁత. అట్టిరచనమునే మన సునందుంచుకొని అశ్వత్థరావుగారు గ్రంథము ననువదించిరి. స్వీయ

పాండిత్యప్రకర్ష యీయనకు ప్రకృతముగాదు. సందర్భమున కనుకూలమై రసమునింపుపదములకూర్పు వీరియెడలోనకోక్కు. ఇది గ్రంథమునం దెల్లయెడలను మిక్కిలి స్పష్టముగాగోచరించుచున్నది.

ఆదికావ్య మయినరామాయణమును తెనిఁగించి కృతకృత్యులయినకవిగారు భక్తిప్రధానమగు భాగవతము నయితము పరివర్తించి భగవత్ప్రీతిని సంపాదించి పరమభాగవతోత్తములైన వృత్తంబుతో కృతార్థు లయ్యెదరుగాక.—

వాల్తేరు.
10–9–53

(సం) విద్వాన్ గంటిజోగిసోమయాజి,
ఆంధ్రభాషాశాఖాధ్యక్షుఁడు.
ఆంధ్రవిశ్వకళాపరిషత్తు.



## ఆంధ్రసాహిత్యఅకాడమీ సభ్యులు అగు-

[శ్రీ డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు ఎం. ఎ. ఆనర్సు.
పి. హెచ్. డి. ప్రొఫెసర్, ఉస్మానియా విశ్వవిద్యాలయము;
హైదరాబాదు.]



శ్రీమద్రామాయణ భారత భాగవతములు భారతీయులపాలిటి పెన్నిధులు. అందు భారతమునకొక్కదానికే పంచమవేదమను పేరున్నను నిక్కమునకు పూర్వేమూర్త్యంతర శోభాభాసమానములగు వేదములని చెప్పుటలో నతిశయోక్తి లేదు. అవి కావ్యములు, పురాణములు, నీతితత్త్వధర్మశాస్త్రములు, లక్ష్యసంగ్రహములు— వేయేల సర్వతోముఖవిజ్ఞానసర్వస్వములు. భారతీయ సంస్కృతివల్లరికవి తీర్చిదిద్దిన యాలవాలములు. అవి పూచిన పూలతావులు. దిగంతవ్యాప్తములై నేటికిని వివిధ చిత్తవృత్తులు గల విద్వాంసుల కాప్యాయము కూర్చుచున్నవి. తదీయధర్మవాసనలు గుబాళించునంతదనుక భారతీయసంస్కృతికి భంగపాటు వాటిల్లదు. ఇట్టిమహత్త్వాతిశయము కలవగుటచేతనే వానికి భారతీయభాషలయందే కాక వైదేశికభాషలందును అనువాదములు, అనుసరణములు బయలుదేరినవి. అవి కావ్యములుగా, నాటకములుగా, పాటలుగా, పదములుగా,

గద్యములుగా, గేయములుగా విశ్వవ్యాప్తుఁడగు విష్ణుదేవునివలె వివిధావతారములు దాల్చినవి. —

వ్యాసరచితమైన భారతమును ప్రతిభాపయోనిధులైన కవిత్రయమువా రారంభమునందే యనువదించి యాంధ్రభాషా యోష కపూర్వాలంకారము నర్పించినారు. ఆధునికయుగమున కవిసోదరులు దానిని యథామూలముగా ననువదించి సంస్కృతము రాని తెలుఁగుపాఠకుల కపారమైన మేలు జేకూర్చినారు. భారతము వివిధ కథోపాఖ్యానములతోడను, నీతిధర్మతత్త్వ ప్రసంగములతోడను, విజ్ఞాన విషయ విస్తరణముతోడను గూడి నైకలతా వృక్ష గుల్మ వల్మీక సంకీర్ణమైన గహనమువలె నుండును. అంగివిషయముకంటె నంగవిషయవివరణ మం దధికము. కావుననె కేవల కథను పొందవ కథాధారనే యనుసరింపనెంచువారికది యించుక క్లేశము కలిగించును. అట్టికోరిక గల వారికి సంతృప్తి కలిగించుటకై చేయఁబడిన యత్నములలో నీయశ్వత్థభారత మొకటి.—

దీనిని రచించినవారు రాయదుర్గం తాల్లూకా కలుగోడు గ్రామ నివాసులైన శ్రీఅశ్వత్థరావుగారు. కవిరాజ సార్థక బిరుదాంకితులు. మాధ్వమతావలంబులు. ఆంధ్ర కర్ణాట సంస్కృతభాషలలో నారితేరినవారు. వీరు బడగలనాడు కర్ణాటకులు. కన్నడమే వీరి మాతృభాష. ప్రాంతీయభాషయగు నాంధ్రముఁగూడ నేర్చుకొనిరి. నేర్చుకొనుటయేకాదు, అందుఁ గవిత్వముచెప్పి కవిరాజబిరుదము సార్థించిరి. అసలుఆంధ్రులకును గన్నడమువారికిని మొదటినుండియు సన్నిహిత సంబంధమున్నది. ఆంధ్రులు పలువురు కన్నడ

కవులైరి. అట్లే కన్నడులును పెక్కురాంధ్రమునఁ గవిత చెప్పియుం దురు. నన్నయకు సహాధ్యాయుఁడై భారతరచన నాతనికిఁ దోడయిన నారాయణభట్టు సంస్కృత, కర్ణాట, ప్రాకృత. పైశాచి, కాంధ్రభాష లందుఁ బండితుఁడేకాక కవిరాజశేఖరుఁడని ప్రసిద్ధిఁ గన్నవాఁడు. శ్రీఅశ్వత్థరావుగారు ప్రాచీనమైన యాసంప్రదాయమున కాధునిక ప్రతినిధి. "మూఁడవతరగతి ముగిసెఁ దెన్గున" నని వారు వ్రాసికొ న్నారు. ఆమూఁడవతరగతి మహిమయెట్టిదో నాకుఁ దెలియదు. ముద్దులొలుక భారతమే రచింపఁజేసినది.

శ్రీఅశ్వత్థరావుగారి నింతకుఁ బూర్వము నేనెఱుంగను. యాదృచ్ఛికముగా నేను రాయదుర్గమున కరిగినప్పుడు వారిపరిచయ భాగ్యము లభించినది. వారెంతవిద్వాంసులో అంతవినయధురీ ణులు. ఎంతవినయవంతులో అంతధర్మపరాయణులు. ఉన్న యా కొలఁది నిమిషములలో నేను వారినిగూర్చి తెలిసికొన్న దంతమా త్రమే. వారు సంభాషణమునఁ బ్రయత్నపూర్వకముగ మాత్రమే తెలుఁగు మాటాడుదురు. కవితలో నాప్రయత్న మిసుమంతయుఁ గానిపింపదు. వీరు బహుగ్రంథప్రణేతలు. దండకరామాయణము· అనుభవామృతము— మయూరధ్వజాదినాటకములు, గీ తోత్తరగీతా దండకములు, హరిగోవిందాది శతకములు, కొన్ని కన్నడకృతులు వీరిరచనలు. రామాయణ పారాయణము వారి దినచర్యలలో నొకటి. దానికి ఫలమే మహాకవిత్వ కౌశలము. ఇది ప్రాగ్జన్మకర్మ విలసన మని వారన్నారు. ప్రాగ్జన్మపుణ్యవిలసన మని నేనందును. కవిగారు శ్రీవిదురాశ్వత్థదేవ నారాయణస్వామి ప్రసాదైక సంభవులు. రామా

యణ పారాయణము, పూర్వజనిపుణ్యవిలాసము, దైవప్రసాద సం భూతి— అను మూఁడును వారిని గవిరాజుగఁ గావింపఁజాలెను.

కవిత్రయమువారి భారతముండఁగా మరల భారతమును రచించుటా? యను ప్రశ్న బయలుదేరుట సహజము. కవిగారికిని అసందేహముతోఁచినది.

"దొఱకు పరమాన్నముఁ జ రుచిమరఁగి చేతఁ

గలుగు వరి యన్నముఁ ద్రోయఁగలమె రోసి?" యనియు—

"మాఱుకాలముఁ బట్టి మాఱదే కవితఘనత?"— యనియు వారు దానికి వినయముగఁ జెప్పిన సమాధానము. దీనికిఁ దోడు కురు పాండవకథనే ప్రధానముగాఁ జెప్పవలయునను నభిలాషముసుగూడఁ జేర్చవచ్చును:—

"ఉ. పండితమాన్యమౌ తెనుఁగుభారత వార్ధి మథించి గర్వితా

ఖండ రమా సుధా మణులఁ గైకొనశక్యమె? సర్వసౌఖ్యమై

యుండఁగ సంగ్రహంబెసఁగ నొండొకక్రొత్తగఁ గూర్పనొప్పదే?"—

అనివారిసమర్థనము. ఇదిసత్యబద్ధమై యెంతో సహజముగా నున్నది.

ఈఅశ్వత్థభారతమున నింతవఱకు నాలుగుపర్వములే రచింపఁబడినవి. ఇది నిర్వచనము. ఇందును సభాపర్వమునందలి ద్వితీయాశ్వాసమును గవిగారికి "చెలియు, బావయుఁ, కవిత్వగురుఁడు" నైన శ్రీకప్పగల్లు సంజీవమూర్తిగారు రచించిరి. వీరుబళ్లారి నగరపా లకోన్నతపాఠశాలలో నుపాధ్యాయులుగాఁ బనిచేసి విరమించినారు. కవిభూషణ బిరుదాంకితులు. వీరిరువురికిని జీవితమునసే కాక కవి త్వమునఁగూడ స్నేహబాంధవ్యములు కుదుదుట ముదావహమైన

విషయము.

కవిగారిది సంగ్రహభారతమని యవతారికలో మొదటనే చెప్పియుండిరి. కురుపాండవుల కథయే యిందుఁ బ్రధానముగ గ్రహింపఁబడినది, కానఁ గథలు, ఉపాఖ్యానములు, తత్త్వవిషయములు కొన్ని పూర్తిగా విడిచివేయఁబడినవి. ఉదంకుని చరిత్ర, యయాతి చరిత్ర మున్నగునవి త్యక్తములైనవానికిని, రామోపాఖ్యానము, సావిత్రిచరిత్ర, యక్షప్రశ్నలు మొదలగునవి మిక్కిలి సంగ్రహింపఁ బడినవానికిని నిదర్శనములు. అరణ్యపర్వమున పెక్కువిషయములు విడువఁబడినవి. ఆకారణమున నిది మూలముతోఁ బోల్చినపుడు చాల చిన్నదిగాఁ గన్పించును.

భారతమునకు మూఁడుపక్రమములు సంప్రదాయసిద్ధములై వచ్చుచున్నవి. భారతమును గొందఱు మన్వాదియనియుఁ, గొంద ఱాస్తీకాదియనియుఁ, గొంద ఱుపరిచరాదియనియుఁ జెప్పుచున్నారు. నిజమున కుపరిచరాదియైన యుపక్రమమే సహజమైనది. పైమూఁ డుపక్రమములలో మొదటిది వ్యాసునిది. రెండవది వైశంపాయను నిది; మూఁడవది సౌతిది. వ్యాసరచనభారత ముపరిచరవసువు వృత్తాంతముతోనే యారంభించియుండును. అంతకుఁబూర్వమున్నవి చెప్పినవారు (వైశంపాయనసౌతులు) ఉపోద్ఘాతపూర్వకముగాఁ జేర్చినవి. కవిగారు ఉపరిచరుని వృత్తాంతముతోనే యీభారతము నారంభించిరి. భారతకథను సంగ్రహించునప్పు డుచితజ్ఞులు చేయవలసిన మార్పే యిది.—

సంస్కృతభారతమును గవిత్రయమువారు పెక్కుచోట్ల

సంగ్రహించిరి. కవిగారు తెలుఁగుభారతమును గూడ బలుచోట్ల సంగ్రహించిరి. ఒక్కసభాపర్వమునమాత్ర మీక్రమము వ్యత్యస్తమైనది. నన్నయభారతమునందలి సభాపర్వ మాశ్వాసద్వితీయపరిమితము. అందు సుమారు 600 పద్యగద్యములున్నవి. అశ్వత్థభారతమున 700 పద్యములకుఁబైఁగా నున్నవి. దీనికిఁ గారణము కవిభూషణ సంజీవమూర్తిగారి ద్వితీయాశ్వాసము విస్తృతముగా నుండుట. వారందుఁ బలువిషయములను బెంచి వ్రాసిరి. వస్త్రాపహరణసందర్భమున ద్రౌపది కావించిన గోవిందస్తోత్ర మిందుకొక యుదాహరణము. నన్నయ "కోమలి కృష్ణుఁ దలంచె భీతయై" యని యూరకుండెను. సంస్కృత భాగమున నిచ్చటఁ గొన్ని యధికశ్లోకములున్నవి. శ్రీ సంజీవమూర్తిగారుకూడ ద్రౌపదికృతస్తోత్రమును బెంచి వ్రాసిరి. ఆవేశము గల కవులెవ్వరును అఘట్టమున స్తోత్రమును బెంచక యూరకుండరు. నన్నయమాత్ర మక్కడ చాలనిగ్రహము చూపెను. అతఁడిట్లు నిగ్రహము ప్రదర్శించినచోట్లు చాలనున్నవి.

శ్రీ అశ్వత్థరావుగారు కవిత్రయమువారి భారతమును జాల సన్నిహితముగా ననుసరించిరి. కొన్ని సన్నివేశములందు వారి భాషములనే అనువదించిరి. దుష్యంతోపాఖ్యానమునందలి:—

"ఎంతయు సూనుసూతులకు నెక్కుడు బావి యొకండు"—

ఆది. 108 అను పద్యమును,— ఘోషయాత్రయందలి:—

"అన్నా యెన్నఁడు నిట్టిసాహసము చేయంబోకు" అర. 3. 215 అనుపద్యమును, విరాటపర్వమునఁ గీచకసంహారఘట్టమందలి "పెటపెటలాడఁ బండ్లు, కనువిప్పుల నిప్పులురాల" విరాట. 186

పద్యమును ఇందుకు నిదర్శనములు. మూలభారతకథయందలి ప్రధానాంశములు సురఁగి పోకుండఁ గవిగారుచేసిన యత్నము చాలపట్టుల గోచరించును. కథాకథనము సహజమును రమ్యమునై యొప్పుచున్నది.

కొన్ని ఘట్టముల నాంధ్రభారతమునందలి కథాపద్ధతికి నూత్నాంశములను జేర్చుటయుఁ గానవచ్చుచున్నది. ఉదాహరణమునకు విరాటపర్వమునందలి ఒకటిరెండువిషయములను బేర్కొందును.

1) భీముఁడు విరాటుకొల్వున జెట్టిమల్లుల విఱిచి యోడించిన విషయము తిక్కనభారతమున నున్నది. అచ్చట వచ్చిన జెట్టిమల్లుల పేరుగాని, యూరుగాని చెప్పఁబడలేదు. అశ్వత్థరావుగారతనికి జీమూతమల్లుఁ డని పేరుపెట్టిరి. దుర్యోధనునిచేఁ బాండవుల గుర్తింపఁ బంపఁబడినట్లును సూచించిరి.

2) ధర్మరాజుఁ డాయుధములమోపునుజమ్మిచెట్టుపైఁ బెట్టి —

"............... నాకు నీపార్థునకున్
జేపడుఁడు; తదితరులకున్
రూపింపఁగరాక భయదరూపులుగండీ" —
"కవలోకపరిఁ గోరినచోఁ
దవులుం; డీభీముఁడెట్టితటినేని మిమున్
దవులఁగ వచ్చినఁ జిక్కక
దవుదవ్వులఁ బొలఁగి పొందు తప్పకుఁ" డని ఆయుధాధిదేవతలఁ బ్రార్థించెను. ఆమాటకు "భీముఁ డుద్దామాగ్రహుఁడగుచు; బాండుతనయులె మీరల్? నేమాత్రము కౌరవ్యుఁడనే? మంచిది చూతు మీమనియమములెల్లన్" — అని పలికి గదను విడుచుట కంగీకరింప

కుండ, ధర్మజుఁ డతనిఁ గౌఁగిలించుకొని యూఱడించెనని అశ్వత్థ భారతమున నున్నది. తిక్కన భారతమునఁగూడ ధర్మజుని కాయుభిప్రాయ మున్నది కాని, దాని నాతఁడు పైకిఁ జెప్పలేదు. భీమునకావిషయము తెలియదు. అందుచే నాతఁడు విజృంభించుట కం దవకాశ మేలేదు. ఇట్టి కల్పనలు కవిగారు స్వయముగానే కావించిరో, లేక పంపాదుల రచనలనుండి గ్రహించిరో తెలియదు.—

విరాటపర్వమునందలి కీచకప్రణయ వర్ణన విషయము నఁగూడఁ గొంతవిశేషమున్నది. అశ్వత్థభారతమునందలి పద్ధతి సంగ్రహమయ్యుఁ గొంత ప్రబంధమార్గమును బట్టినది. కీచకుని మనస్తత్త్వము వర్ణించుపట్లను, సుదేష్ణశీలమును జిత్రించుపట్లను కవిగారు కొంత యధికశ్రద్ధచూపినట్లు పఠితలకు వ్యక్తము కాకమానదు. ద్రౌపది, కీచకానుగతయై విరటుని కొల్వుకూటమున కరిగిన తఱి, భీముఁడు వృక్షమును బెఱుక నుంకించుట, కీచకుని మదమడంచుట కుఁగాక, యధర్మము జరుగుచుండఁగా నిరోధింపని విరటుమాంద్యము నడఁచుట కన్న ట్లిందు వ్రాయఁబడినది. రసపోషణమునఁ గవిగారికిఁ గలనేర్పుదుష్యంతోపాఖ్యానము, నలచరిత్ర, కీచకవధ, సౌగంధికాహరణము మున్నగు ఘట్టములందుఁ జక్కగా వ్యక్తమగుచున్నది. ఇంకఁ గవిగారి శైలినిగూర్చి రెండుమాటలు వ్రాసి విరమించెదను. ఎచ్చటను దీర్ఘ క్లిష్ట సమాసముల జోలికిఁబోక తియలంతి యలంతి పదములతోడనే కవిగారు రచన మంతయు సాగించిరి. కవిత సర్వత్ర ప్రసన్నమై ధారాశుద్ధిశోభితమై, వీనుల విందుగా జాలువాఱుచున్నది:— "తేనెసూఁత లగు కత్తులు, కప్పయెలుంగు

హాములు" మొదలైన జాతీయోక్తు లెల్లడఁ గానవచ్చును. బృహన్నలా కారముతో వి రటునికడకరిగినయర్జునుఁడు "బృహన్నలాఖ్య నరుండఁ" అనుటయు, నర్తనశాలలో భీముఁడు కీచకునితో;— "సురనారిసౌఖ్య ముఁ గూరుచు"— ననుటయు ధ్వనిపూరితములై యద్భుతముగా నున్నవి. ద్రోవది సైరంధ్రివేషముతో సుధేష్ణను జూడ వచ్చినప్పుడు:- "మొగిళుల్ కప్పిన చంద్రబింబమటు లింపుఁదక్కుచుఁ, మంచుచే సొగసుందప్పిన నీరజాతమటులఁ సోంపేది, ధూళ్యావృతం బగుపూదీవటు మాసి, ప్రాంతసు మఱుంగౌ మానికంబట్టు" లుండెనని చెప్పఁబడినది. ఇట్టిరమ్యములైన యుపమానములు గ్రంథమంతటను గానిపించును. శకుంతల యాశ్రమమును వీడి యేగునప్పటి: —

"హా! యని చేతులఁ బెనచి యయ్యగళంబున జోలెగట్టు; మో
మాయనమోముఁజేర్చు, నకటా! యని యార్చును; బేర్చుఁ గౌఁగిటఁ
ఆయనబొజ్జలో శిరమునుంచి వగర్చును; సంధ్రియుగ్మమం
దాయమ ఫాలముంచి యిడు నశ్రువులఁ బితఁ బాయనోపకే"

అనుపద్యము సహజమై శకుంతలభావమును సమగ్రముగా వ్యక్తముచేయుచున్నది. కవిగారింత యుదాత్త రచన చేసినవారు కావుననే సరసశేఖరులైన శ్రీఅనంతకృష్ణుల హృదయమునావర్జింపఁ జాలినారు.

"....................... ముందుసృష్టి
వరదు శ్రీరాముదృష్టి; మద్భాగ్యపుష్టి
నెనఁగు గృతిభర్త వరకృపామృత సువృష్టి"— సని యశ్వత్థరావుగారు భవిష్యద్రచనా భారమును భగవంతునిపైమోపినారు. ఎట్టి

నను వారీభారతమును బూరించుట ఆంధ్రభాషకును, ఆంధ్రజనులకును మేలుచేకూర్చును. వారూరకపూనినఁ జాలును. భక్తజనవత్సలుండైన భగవంతుఁడు సర్వభారమును దానే వహించును. అశ్వత్థరావుగారు దైవప్రసాదసంజనితులు. రామాయణ పారాయణులు. వారియెత్తి కోలు తుదిదాఁకక మానదు. వారీయుదాత్తకావ్యమును రాయడి గ్గము శ్రీ వేంకటేశ్వరస్వామి కంకితము చేయుటచేతః—

"కలిగెఁ బదియాఱువన్నె బంగారమునకుఁ
బద్మరాగంబుతోడి సంపర్కలబ్ధి."—

వారచిరకాలమున శేషభాగమును గూడఁ బూరింపఁగలరుగాక యని ప్రార్థించుచున్నాను.

హైదరాబాదు.
9–6–60

(సం) దివాకర్ల వేంకటావధాని.



[శ్రీ "విద్యారత్న" శ్రీనిడుదవోలు వేంకటరావుగారు ఎం.ఏ.,
ఆంధ్రభాషాశాఖాధ్యక్షుఁడు — విశ్వవిద్యాలయము; చెన్నపురి.]



శ్రీవిదురాశ్వత్థదేవ నారాయణస్వామి ప్రసాదసంభవులును, వసిష్ఠగోత్రులును, నాద్యతనాంధ్రమహాకవిశ్రేష్ఠులును నగు "కవిరాజ" కలుగోడు అశ్వత్థరావుగారు నేఁడు "అశ్వత్థభారతము" అను మహాకృతి నాంధ్రవాఙ్మయక్షేత్రమున నవతరింపఁజేసిరి. అశ్వత్థరావుగారు ఇదివఱకే యనుభవామృతాది గ్రంథరచనముచేతనేగాక సుప్రౌఢశైలిని "దండకరామాయణము"ను రచించి యాంధ్రవిద్వల్లోకమున "కవిప్రతిష్ఠ" వడసినవారు. సారస్వత చారిత్రకదృష్ట్యా పరిశీలించిన, వారిదండకరామాయణము "దండకము" అనువాఙ్మయశాఖను కిరీటమువంటిది. దానిని మించినదిగాని దానితోసరిపోల్పఁదగినదిగాని మఱియొక దండకకృతి లేదు.

రామాయణము "నైకధారావాహికగా దండకరచన చేసిన అశ్వత్థరావుగారు "భారతము"ను గూడ, పద్యకృతిగా సంతరించుట యాంధ్రులభాగ్యవిశేషము. గ్రంథకర్తలు "కృతివిషయము"ను ప్రస్తావించుచు నిట్లు దెలిపిరి:—

"క. నౌరకవిత్రయ విరచిత
భారతముండంగఁ బ్రతిగభారతమా? యహో
రౌరా కావరమా? యిది
నేరం బని యాడికొంట నే వినుచుంటిన్."

అని ప్రారంభించి,

"దొరకు పరమాన్నముల్ రుచిమరిగి చేతఁ
గబుగు వరియన్నముల్ ద్రోయఁగలమె రోసి?"

అని వితర్కించి,

"........ ........ ........ ........ తత్కథమాత్రలక్ష్యమై
యుండఁగ, సంగ్రహంబొప్పఁగ, నొండొకకొత్తగఁ జెప్ప నొప్పదే?"

అని నిశ్చయించి, వినమ్రతతో:—

"క. దూఱకుఁడు, తప్పుకుఁడు నను
వేఱుగఁ, బ్రాగ్జన్మకర్మఫలననమిది, తత్
ప్రేరితమగుకృతి దేహక-
వారణవిధి యనుచు"—

శిరమువాంచి "అశ్వత్థభారతము"ను వినిపించినారు.

అశ్వత్థభారతకృతికర్త లింతదూరము తమరచనను సమర్థించుకొన నావశ్యకములే దని నాతలంపు. ఎవరితోఁ బోల్చినను తమ సాహితీవిమర్శకు లాంధ్రభారతసంహితను పరిశీలించిన— అశ్వత్థభారతమునకు ముందు, భారతరచన లెన్నిపోగినవో తెలియఁగలదు.

— కవిత్రయ భారతము. —

ఇది జగత్ప్రసిద్ధము. క్రీ. శ 1050 ప్రాంతమున ప్రారంభమై

క్రీ. శ. 1300 నాఁటి కీభారతము సంపూర్ణమైనది, ఇది చంపూపద్ధతిని రచితమైయుండుట సర్వజనవిదితము. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన- అనుమువ్వురు ఋషికల్పులు దీనిసృష్టికర్తలు.

* — ద్విపదభారతము —

ఇది పైకవిత్రయభారతమునకు ద్విపదానువాదము. దీనిని తిమ్మయ, బాలసరస్వతి, సోమన అను ముగ్గురుకవులే సంపూర్తిగావించుట చిత్రమైనవిషయము.

— త్యాగరాజమొదలి మహాభారతము —

జన్మముచే తమిళుఁడై, వృత్తిచేత "ఇంజనీయరై" తెలుఁగున విద్వత్కవియశస్సు నార్జించిన త్యాగరాజమొదలి (1833-1879) భారతము నంతయు ప్రశస్తపద్యకృతిగా సంస్కృతమునసుసరించి రచించియున్నాఁడు, ఇందలి విభాగములు సాధారణపర్వవిభజనతో పాటు కథావృత్తసందర్భము ననుసరించి. ప్రారంభపర్వము- ప్రద్వేషపర్వము, ప్రధ్వంసనపర్వము, ప్రశమనపర్వము- అను స్థూలవిభాగము

---

* ఈ మహాగ్రంథమును తంజావూరి మహారాష్ట్రరాజైన శహాజీ కాలమున, నాతనియాజ్ఞచే సింబాజీ యనునతఁడు తాళపత్రములపై వ్రాయించినాఁడు. శహాజీకాలము క్రీ. శ. 1684-1712. కావున నీగ్రంథరచన, యంతకుముందుకొంతకాలమునాఁటిది. దీనిని నాలుగుసంపుటములలో నాంధ్రవిశ్వకళాపరిషత్తువారు ప్రకటించియున్నారు.

గావించినాఁడు. ఈ భారతకృతి † అముద్రితము. సాహిత్యచరిత్రకారుల కపరిచితము.

— మహాభారతనవనీతము —

విద్వత్కవులును వ్యాస నామధేయము గలవారును నగు ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రులవారు (1856-1916) "ఆంధ్రవ్యాస భారతనవనీతము" అను పేర, మహాభారతమును సంపూర్ణముగా నాంధ్రీకరించినారు. ఇం దావిధార ముద్రితమైనది. ఇది సంస్కృతమునకు సరియగు తెలుఁగుసేత.

— శ్రీకృష్ణభారతము —

వ్యాసమూర్తిశాస్త్రులవారి తరువాత కవిబ్రహ్మలును ఆంధ్రాస్థానకవులు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులవారు భారతమంతయు నాంధ్రీకరించి "శ్రీకృష్ణభారతము" అనుపేర వెలయించినారు. ఇది యీనాఁటివారికి సుపరిచితమైనది.

— ఒక వచనరూపముగా రచితమైనభారతములు. —

క్రీ. శ. పదునెనిమిదవశతాబ్దియందలి వానివచనములివి.

1. మధురలో విజయరంగచొక్కనాథునాస్థానమందున్న కుంపర్తి వేంకటాచలకవి వచనము. ఇది లభ్యముకాలేదు.

† ఈ త్యాగరాజమొదలి "విద్వత్కర్ణామృతము" అనుకృతివలన వీరేశలింగకవిజీవితములోనికెక్కినాఁడు. కాని భారతానువాదవిషయము లందులేవు. నే నీకృతియందలి, శకుని జూదమునకుఁ బ్రోత్సహించు సందర్భమునగల ముప్పదిరెండుపద్యములను విశ్వవిద్యాలయపరిశోధనపత్రికలో ప్రకటించితిని. 1945 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో నీకవి యుదంతము లోకమున కెఱిగించితిని.

2. మైసూరుసంస్థ దండనాయకసామంతుఁడగు కళువె వీరరాజు, తుమకూరు అనంతభూపాలుఁడు- ఈ యిరువురు రచించినది. ఇందు సభాభీష్మపర్వములు ముద్రితములైనవి.

3. పందొమ్మిదవశతాబ్ది ఉత్తరార్ధమునకు కొంచెము ముందు కాలమునుండి యీక్రింది భారతవచనములు ముద్రితములైనవి కన్పట్టుచున్నవి.

1817. వైయాకరణము రామానుజాచార్యులు. ఆదిపర్వము.

1872. నేలటూరి వేంకటసుబ్బశాస్త్రి.

1888. సోరి నరసింహశాస్త్రి.

1890. మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి.

1895. శ్రీ పి. రాఘవాచార్యులు.

పైవానిలు పూర్ణభారతములై ముద్రితములైనవి.

క్రీ. శ. 1911లో కమలసంపుటముగ కమనీయవచనరచనతో తంజనగరము తేవప్పెరుమాళ్లయ్య దేవరాజసుధీగారు భారతమును కొన్ని సంపుటములుగ వెలయించిరి.

శ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రిగారి భారతవచనము మూఁడుసంపుటములుగా ముద్రితమైనది. శ్రీ ఆకొండి వేంకటశాస్త్రి గారి వచనభారతము నేఁడు వ్యాప్తిలో నున్నది.

నేఁడు ఆంధ్రపత్రికసారస్వతానుబంధము మూలమున శ్రీ పిలకా గణపతిశాస్త్రిగారు ప్రకటించుచున్న వచనభారతము ఆంధ్రులందఱును పఠించుచున్నదే కదా? కాబట్టి పద్యరచనలవలె వచనరచనలందును భారత మీనాఁడు వెలవడుచున్నదనుట అపవాదములేని సిద్ధాంతము.

భారతీరచన లిప్పి వెలయుచుండఁగా, నేఁ డశ్వత్థరావుగారు తిరిగి దానిని రచించుటలో దోస మే మున్నది?— వారు "పాతారా కావరమా" అని యాడికొంట విన్నారఁట! నేనిట్లందును:— పాతారా యదియకా "వరము".— గ్రంథకర్తలు పరప్రసాదులు!

అశ్వత్థరావుగారి భారత మనేకవిధముల విశిష్టత గలిగి యున్నది:—

1. విశాలాంధ్రమున— తూర్పుగోదావరిమండలమున— కవిత్రయభారతము ప్రారంభమైనది. నెల్లూరుమండలమున సమాప్తమైనది. తక్కినభారతములు, వ్యాస శ్రీకృష్ణభారతములు— గోదావరి మండలమునఁ బుట్టినవి. ద్విపదకృతి, వచనరచనలు తెలిపి దక్షిణాంధ్రవాఙ్మయమునకు సంబంధించినవి. తరువాతవానికి చెన్నపురి జన్మస్థానము. ఇఁక అచ్చముగా "రాయలసీమ" వారి కొక భారతము వలదా?— దానిని అశ్వత్థభారత మందించినది. *

2. వ్యాస శ్రీకృష్ణ భారతములవలె స్వనామముద్రతో (అశ్వత్థ) దీని ననుసంధించుట.

3. కవిత్రయ భారతమువలె చంపూపద్ధతిగాక నిర్వచనముగా రచించుట.

4. కవిత్రయముతరువాత నాటినుండి వందలయేండ్లలో వెలువడిన పద్య గద్యభారతములు అనువాదములు. కాగా, కవిత్రయము ననుసరించుచు— వారి శ్రీ మదాంధ్రమహాభారతమునకునే "స్వతం

---

* ఈ నడుమ బోధార్థేందులు కల్లూరి వేంకటనారాయణరాయమహాశయులు పంపాభారతమును వెలయించిరి. అది వేఱుకృతి.

త్రమహాపద్యకావ్యముగా, సంగ్రహముగా, సులభగ్రాహ్యముగురీతి భారతకథను దెలుపుట-

5. కవితారచనయందు ప్రాచీనసంప్రదాయముల ననుసరించుట.

ఆంధ్రుల కైదవవేదమైన భారతము పైరీతిని యైదుగుణములు విలసిల్లునట్లు రచితమైనది అశ్వత్థభారతము.

ప్రస్తుతము ముద్రింపబడిన గ్రంథమున ఆది, సభా, ఆరణ్య, విరాటపర్వములుగలవు. ఆదిపర్వమున నాలుగు, సభాపర్వమున మూడు, ఆరణ్యపర్వమున నాలుగు- విరాటమున నైదు- మొత్తము పదునాఱాశ్వాసములు- 3223 పద్యములుగలవు.

నవీనపద్ధతి ననుసరించి, నాందిప్రస్తావనలో గ్రంథకర్తలు తమచరిత్ర సంగ్రహముగ దెలిపిరి, ఇది నాఁబోటి సారస్వత చరిత్రకారుల కత్యంతము నుపయుక్తము. ఇం దింకొకవిశేషము గలదు. ఆనాఁడు నన్నయభట్టునకు, నారాయణభట్టు సహాయముచేసెనని నన్నయయే తెలిపియున్నాఁడు. (ఉ. పాయకపాకశాసనికి....) ఆ సహాయము మనకుఁ దెలియరాదు. సరికదా, సందేహములకుఁ దావొసంగినది. ఈనాఁడు అశ్వత్థభారతమున- గ్రంథకర్తలు- కవిభూషణబిరుదాంకితులు, కమనీయ కవితారచనావిశారదులు ‡ "కప్పగల్లు సంజీవమూర్తి" గారిని సముచితోక్తులతో సంభావించుచు, సభాపర్వమున ద్వితీయాశ్వాసము వ్రాసి సహాయముచేసిన విషయమును

---

‡ రాయలసీమయందుఁ బుట్టిన కవిరత్నములలో సంజీవమూర్తిరావుగా రొకరు. ఈనాఁడు వారిప్రశంసయే కన్పట్టదు. అశ్వత్థభారతమున నిది వెల్లడియైనది. సాహిత్యప్రియుల కిది సంతోషవార్త.

గ్రంథాదిని వెల్లడించి తమకృతజ్ఞతను దెలిపినారు. ఇది యెంతయుఁ బ్రశంసనీయము, గ్రంథకర్త సహృదయత నిది సుప్రకటము సేయుచున్నది.

## — కవితారచన. —

ఇందలి పద్యములు చదువుచున్నప్పుడు, మనకు నన్నయ తిక్కనాదికవుల రచనలు- కన్నులకు గట్టినట్లుండును. మనము సొంతముగ కవనము చెప్పుట సులభము, కాని, మహాకవుల పోకడలనే యనుసరించుచు, వారిపదముల నూఁతగొనుచు, తన ప్రత్యేకతను నిలుపుకొనుచు కవిత సాగించుట దుష్కరము. [illegible] నందలి కవితాధార, యొకేరీతి నొడుదుడుకులు లేక సాగును, పదములు [illegible]. పదములు, భావములు, తమంతటతామే దొరలిపోవును. ఇదియే గ్రంథమునందలి కవితానైపుణ్యము,

ప్రాచీనపద్ధతి ధారణమునఁ గ్రంథకర్తకుం బ్రాచీనకవుల యెత్తుగడలు పరిపాటియగుట సంభావ్యమే. అయినను కవిరాజుగారికి బమ్మెరపోతనకవియందు ముఖ్యముగా భక్తియున్నట్లు తెలియుచున్నది. పోతన:— "పూర్వకవిజన సంభావనంబు గావించి, వర్తమానకవులకుం బ్రియంబు పలికి, భావికవుల బహూకరించి"న రీతినే, ప్రస్తుతభారతకర్తయు:-

"శబ్దానుశాసన సంస్తుతుల గొలిచెంచి ......మనస్సుల ధ్యానించి,
మొన్న నిన్న వన్న మునుపుల నెంచి,
ఉన్న, పుట్టనున్న కవులకుఁ" గేలుమోడ్చినారు.

ఇంతియేకాదు- ఎత్తుగడలలో పోలికలు గలవు:—

"త్రిజగన్మోహనమౌ సభాభవన ముద్దీపింప (అ.భా.స.భా. 1-16)
త్రిజగన్మోహన నీలకాంతి తనువుద్దీపింపఁ (పోతన ప్రథమ 218)
పాదద్వంద్వము నేలమోపి పవనుఁ బంధించి (పోతన అష్టము)
పాదాంగుష్ఠమునూఁది నిల్చి ముఖముఁబైకెత్తి (అ.భా. అర 100)

అరణ్యపర్వము తృతీయాశ్వాసము- హనుమంతుఁడు తనశరీరమును పెంచిన సమయమున, అశ్వత్థరావుగారు, పోతనరచితమగు వామన త్రివిక్రమావతారఘట్టము ననుసరించి యెంతో మనోహరముగా రచించియున్నారు.

"వనుఁ ఛత్రమునై, శిరోభరణమై, ఫాలాంకమై, హారమై,
కరపాత్రమ్మయి, కట్యలంకరణమై, కాలందెయై, పాదుకా
పరమై తోఁచెఁగ భానుమండలము, సంపర్ధిల్లుచుఁ జూడ్కికిఁ
భరమై పొల్చెఁ ద్రివిక్రమాకృతిని విశ్వంబెల్ల నిండారుచుఁ,"

నా చూచిన భారతములలో నిట్టిది కానరాలేదు. అశ్వత్థరావుగారిచేసిన భక్తశిఖామణులు.

— ఛందస్సు —

సర్వజనగ్రాహ్యము లగు జాతివృత్త ఛందస్సులతో గ్రంథము రచితమైనది. అయినను- ద్విపద- షట్పదీవృత్తములు ప్రవేశ పెట్టఁబడినవి. మఱియు, గీతమాలిక, దండకము, మత్తకోకిల, తరల భుజంగప్రయాతము, మున్నగు ఛందోభేదములు, చదువరులకు విశ్రాంతిని గూర్చుచున్నవి.

ఈ భారతగ్రంథమున నింకను చూపవలసిన విశేషములు విశేషముగా నున్నవి. కాని గ్రంథవిస్తరభీతిని విరమించెదను. దీని నామూలాగ్రముగ నేఁ జదివితి. చదివినయంతట నే నెఱిఁగినంతలోఁ గుదురు కొన్ని భావముల నిట నుట్టంకించితిని.

భారతకథ యాంధ్రుల కత్యంత ప్రీతిపాత్రమైనది. అట్టి భారతకథను, పద్యరూపమున ప్రపంచించిరి- ఆశ్చర్యకరముగా పదునాత నాంధ్రసారస్వతమున మహాకవిస్థానము నలంకరించినారు. వారు తక్కినపర్వములను నట్లే "వరపురాణమును" రచించి, సంపూర్ణభారతముచే వాఙ్మయవీథిని సమధికముగ నలంకరింపఁజేయుదురు గాక!

ఇతి శమ్-

ఇట్లు
(సం.) నిడుదవోలు వెంకటరావు ఎం.ఏ.
విద్యారత్న:
చెన్నపురి విశ్వవిద్యాలయాంధ్ర-
భాషా శాఖాధ్యక్షుఁడు,



["విద్వాన్; విశారద, బాలకవిభూషణ" శ్రీయుత కె. హెచ్. సత్య
నారాయణరావుగారు, తెలుఁగుపండితులు, పరిషదున్నతపాఠశాల,
ఆలూరు.]

—⁂—

స్వాగతము! ఆశ్వత్థభారతమునకు స్వాగతము!!

కవిత్రయభారత మాంధ్రసారస్వతాకాశమున ధ్రువతారయై యద్వితీయప్రభల వెదఁజల్లుచుండ మఱియొకభారతమా? ఇది యెంతసాహసము? అని కొందఱందురేమో! అననిండు—

"పెద్దనవలెఁ గృతిఁజెప్పినఁ
బెద్దనవలె; నల్పకవినిఁ బెద్దన వలెనా?
ఎద్దనవలె, మొద్దనవలె"— అని పలికిన పూర్వకవి నుడులను ఆధారమొనర్చుకొని- ఆతక్కెడతోఁ దూఁచి చూచినచో నేటికవు లెందఱు నిలువఁగలరో తేల్చి చెప్పఁగలవారెవరు? సామ్రాజ్యమున ననేకసామంతరాజు లుండునట్లు, కవితాసామ్రాజ్యమునఁ దండోపతండములుగఁ గవు లుండవచ్చును. సార్వభౌముఁడు రత్నఖచితదివ్యసౌధమును నిర్మించుకొనఁగల్గిన దక్షతగలవాఁడైన, సామంతరాజు చంద్రశిలానిర్మితమగు భవననిర్మాణ మేలచేసికొనరాదు? అట్లే

యీకృతినిర్మాణముగూడను. అశ్వత్థరావుగారీకృతిని రచించి ధన్యజ
న్ములైరి.—

ఇతిహాస పురాణముల రచన సాహసికులకుఁ బరీక్షవంటిది. తద్రచనాసమగ్నుఁడగు కవికిఁ బౌరాణిక ధర్మప్రవృత్తులయెడఁ బ్రేమా
దరము లుండితీరవలెను. నాఁటివ్యక్తులవలెఁ దాను మాట్లాడవలెను. నాఁటిజనులకుఁ గలిగిన నమ్మకములందు నీతనికి విశ్వాసముండవలె
ను. "నమ్మిపోదురుకాక నాకేమిసిగ్గు" అని కవి బిఱ్ఱబిగిసికొని కూ
ర్చుండలేఁడు. ప్రస్తుత "అశ్వత్థభారత" గ్రంథరచయితలగు శ్రీయుత కవిరాజ అశ్వత్థరావుగారి కట్టివిశ్వాసము కలదు. సంవిధానముగల సుందరకవితాశిల్పము వీరిహస్తగతము, అవియె వీరి నీమహాప్రయత్న
మునకుఁ బ్రేరేపించినది.—

నవ్యభారతనిర్మాణమునకుఁ బూనుకొన్న యీకవిపుంగవుఁడు కవిత్రయభారతమునుఁగాని సంస్కృతమాతృకనుఁగాని యథాతథము
గ ననువదింపలేదు. మూలకథలో నెడనెడ నుపాఖ్యానప్రకరణములు పొడచూపుచు భారతకథాస్రోతస్వినిఁ గలసికొనుచుండును. ధర్మ
సంస్థాపనము నాఁటిఋషుల ధ్యేయమై యుండెను. అందుల కేర్పాట్ల
మిదియని చూపుభారత మవతరించినది. దానికి నుపాఖ్యానము లుద్దీ
పకములుగ నిలిచినవి. కాని యశ్వత్థభారతమున నవి చాలవఱకు
విడువఁబడినవి.—

కవి స్వతంత్రుఁడు. వానిచేతిదోఁడి కవిత్వము. అట్టి
స్వాతంత్ర్యమును వీరు చాలవఱకు వినియోగించుకొనిరి. వీరికి బు
రాణపురుషులందును, ఋషికులమునందును మెండగు గౌరవము

కలదు, అందుల క్రిందిసమర్థనమే యుదాహరణము:-

దాశరాజుపుత్రిక- మత్స్యగంధి యొకనాఁడు తెప్పనడపుచుఁ బరాశరునికంటఁ బడినది. ఆ యన్నులమిన్నను గాంచి పరాశరుఁ డుక్కిరిబిక్కిరి యైనాఁడు. ఈతనికీచెడుబుద్ధి యేలకల్గెనో యని ఆమె కును ఆశ్చర్యము కలిగినది. "ఇది సిగ్గుచేటగుఁజా" అని మందలించి సదికపాట. అప్పుడు మదనశరవివశుఁడైన పరాశరుఁ డిట్లనుచున్నాఁడు-

"........సిద్ధి దైవకృత మో
వనితా! వెఱపేల? నుఱకవాఱెడు నాకుఁజ
ఘన సిద్ధి జగద్ధితంబగు
ఘనకారణ మొందఁగలుగఁగా నోపుఁ జుమీ!"- ఇట్టిది యీ కవిపతంగునకు మునీశ్వరునియందు గల అమలినవిశ్వాసము. ఈ సమర్థన నన్నయ రచనయందు లేనిది. వీరనినట్లు జగద్ధిత మగు ఫలమే కలిగినది. అదియే వ్యాసభగవానుల జననము.

కవిరాజుగారు శకుంతలోపాఖ్యానమునఁ గొన్ని మార్పు లొనరించిరి. భారతమున శకుంతలాదర్శనము దుష్యంతునకుఁ గణ్వాశ్రమోపాంతమునందు యాదృచ్ఛికముగ జరిగినది. ఇఁక అభిజ్ఞానశాకుంతలమున దుష్యంతు నుపస్థితి నెఱుంగని శకుంతలను ఒక తుంటరి తుమ్మెద బాధించును. తన్నివారణార్థము దుష్యంతుఁడు శకుంతలను సమీపించును. కాని యక్షభారతమున దుష్యంతుఁడే పోయి:- "ఎవరునిచట- చనుదెంచు" అని- బిగ్గరగఁ జీరును. దుష్యంతునకు శకుంతలాజన్మవృత్తాంతమును శకుంతలచేతఁగాక ఒకచేటి చేఁ జెప్పించిరి.- కణ్వుఁడు శకుంతలను మెట్టినింటి కంపుఘట్టమున

అభిజ్ఞానశాకుంతలము ననుసరించిరి. ఇట్లే కుంతీచరిత్రమునందునను.-

కన్యయగు కుంతి సూర్యుని సమంత్రకముగ నాహ్వానించినది. వానివరమున సద్యోగర్భమున నొకశిశు వుదయించెను. వంశమర్యాద లేటఁగలసినవే యనుశంక లామెను బాధించినవి. దైవఘటనావశమున నొక మందస మటువైపునకే వచ్చినది. కవార్మిష్ఠపుత్రుని- భాస్వత్తనూవిభవుని విడువలేక కుందినది. ఆమె మాతృహృదయమున కది యొకశాపము. అప్పటఁ గవిగారు చేసిన పోకడలు కమనీయములు.

ఏకలవ్యుఁడు ద్రోణునిపై గురుభావము నుంచి- అపారధనుర్విద్యాపాటవమును గడించుకొన్నాఁడు. ద్రోణునిలో మత్సరము వెఱ్ఱితలలువేసినది. దాని కాహుతియైన దాతనిదక్షిణాంగుష్ఠము. వానిత్యాగమును గని:-

"కనుల ముత్యములు దొరఁగఁగఁ

గని యర్జునుఁ డేకలవ్యుఁ గౌఁగిటఁ గ్రుచ్చెన్."- అని వర్ణించి కవిగారు నరుని నేకలవ్యునిపై నుంచిన యసూయాభావమును మఱుఁగు పఱచి సహృదయునిగాఁ దీర్చిదిద్దిరి.

సభాపర్వ ద్వితీయాశ్వాసము లెక్క తక్కిన గ్రంథమంతయు శ్రీ అశ్వత్థరావుగారే నిర్వహించిరి. వీరిధార యొకవిలక్షణతను బుణికి పుచ్చుకొన్నది. నాతికఠినములగు మృదుపదములును, సుదీర్ఘములు గాని సమాసములును, గొంతకొంతకు సంతమొందు వాక్యములును వీరికవిత కొకప్రత్యేకత నాపాదించుచున్నవి.

తనలోఁ బొంగెడు భావోద్రేకము నేకవీంద్రుఁడు చాలసుల

భముగఁ బ్రస్ఫుటీకరించును. దానికిపలయు సుందరపదసంపత్తి వీరికిఁగలదు. ఇందుల కుదాహరణము:—

కోరివచ్చిన దేవవేశ్యను నరుఁ డుపేక్షించినాఁడు. ఆమె విషయవాంఛాపూరితహృదయము నెఱుఁగక— "నీదురాకన్ మనికి కృతార్థంబునయ్యెమాతా!" యనినాఁడు— "మాతృస్థానముభావింపని వాఁడు మనుజపశు" వని యేమేమో విచారింప మొదలిడినాఁడు. అప్పుడామె:—

"…. ….వేశ్యలయందున్
బ్రణవార్థవిచారమట్టె? రతికూటమునన్
గనుటె స్వరాక్షరగణితము?
మనుశాస్త్రమె దేవలోకమహిళలపట్లన్?"— అని చక్కగ నోరు మూయించినది. ఇట్టివిశేషములు గ్రంథమున నెన్నియేని గలవు.

వీరిపద్యములందు అన్వయక్లిష్టత కానరాదు. అట నట నొక్కొకపద్యమున రెండుమూఁడువాక్యము లుండుటయుఁ గలదు.—

పరిస్ఫుకపోలకల్పితము లగు ఉపమోత్ప్రేక్ష లతిమనోహరములుగ నుండును:—

కణ్వాశ్రమమున— "ఈనినపులులు చన్నిచ్చు నాఁకలిగొని పిలుఁడఁజేరెడు లేడిపిల్లలకును."— సమబలులైన బకభీములు పోరునపుడు:— "ప్రక్కలొత్తఁగ భూమి తక్కెడై తూఁగినది."— భీమ కిమ్మీరుల సమరమున:— "అభ్రముదిగ్భ్రమఁజెందినది."—

దమయంతీవిరహతప్తుఁడై, కలిపీడాసంత్రస్తుఁడై బాహుకుఁడుగ నున్న నలుఁడు ఏవేవో కలవరించినాఁడు. జీవలుఁడు దానినిఁ

బసిగట్టి యడుగః-

"ఈరూపునకుం గాంతమె?
మారుని తాపంబె?- సఖుఁడ! మునుసగుటను శృం
గారగ్రంథములో నిది-
నేరిచినది చెప్పినాఁడ- నిష్ఠుర వామిణ"— అని చక్కఁగఁ జెప్పి

కొన్నాఁడు.

సౌగంధికాపహరణాఖ్యము అరిగిన భీమునకు నాంజనేయుఁడు తటస్థించినాఁడు. అప్పుడు మారుతి భీమునిఁ బరీక్షించి, కడకు మెచ్చి, వాని యిచ్ఛఁ దీర్పఁ బొంది విశ్వరూపమును జూపినాఁడు. శ్రీ అశ్వత్థరాయ కవిరాజుగారు తమ ఉపాసనాదైవ మగు సమీరకుమారుని విశ్వరూపమును చక్కని పురాణశైలిలో:-

"వరుసన్ ఛత్రములై, శిరోభరణమై, ఫాలాంశమై, హారమై,
కరసూత్రమ్ములయి, కట్యలంకరణమై, కాంచీమణియై, పాదుకా
వరమై తోఁపఁగ భానుమండలము సంపద్వృద్ధిగన్ జాఙ్మికిన్
భరమై పొల్చెఁ ద్రివిక్రమాకృతిని విశ్వంబెల్ల నిండారఁగన్"-

సాక్షాత్కరింపఁ జేసిరి.

ఇఁక విరాటపర్వమునకుఁ వత్తము. ఇది భారతమున పర వధ్యములలో నొక్కటి. ఇట సదసద్వృత్తములను చికన్యతోఁ చని సుధేష్ణపాత్రకలదు. ఆమె సాధ్వి; సాధుశీల. తమ్ముని కామ వివశతను ఓర్వదు. వాని నిందగిన అంతఃపురములో ఉంచుటకై వాని మాటలను గీటునఁ బుచ్చినది. తగదన్న నుడిగెడివాఁడు కాఁడు కీచకుఁడు. కార్యమేమి యని వెతఁజెందినది. వాని నెన్నియోవిధముల

నూరార్చినది. తుద కధర్మము వైపునకే వాలుచూపినది.— "మధువుఁ దెమ్ము చూతము నీదు గమనవేగంబుఁ"— అని సైరంధ్రి కాజ్ఞాపించినది, పాపము! ఇంతయైనను ద్రౌపదిగ్రహింపలే దనుకొన్నది. అందులకుఁ గృష్ణ:— "పోవనే నోఁప నచటికి దేవి! నీదుసోదరుఁడు దుండగీఁడమ్మ" అని కసరుకొన్నది. కాదుమఱి?— ఆమె అగ్ని జ్వాల— జ్వాలముఖవరప్రసాదినికదా?— సుధేష్ణ యింకనుఁ జిక్కులఁ బడినది. తమ్మునిగౌరవమునుఁ గాపాడవలె, అందులకె— "తనగుణముఁబట్టి పరులు నుత్తములుఁ జెట్ట— లగుదు రంతియ"— అని సమాధానించినది. ఇట కవిచాతురి స్తవనీయము!—

ఈ కవికి హాస్యముపై నొకకన్నుఁగలదు. సరసమగు హాస్యమునుఁ బ్రకటించు నవకాశము దొరికినచో నీతఁ డూరక పోనీయఁడు. పార్థునిచే బంధింపఁబడిన పాంచాలపతినిఁ జూచి ద్రోణుఁడు— "వీరెవ్వరయ్య! ద్రుపదమహారాజులె"— యనినాఁడు. ఈకవియు నన్నపార్యుని నించుమించు ననుకరించెను.

ఇఁక మీనయంత్రభంగము:— ద్రుపదుఁడు ద్రౌపదీ స్వయంవరమును జాటినాఁడు. భూరిదక్షిణలు దొరకునని యొకబాపఁ డాసఁజూపఁ— జాతముని పాండవులును బోయిరి. కృష్ణనిసైగల యంతరార్థ మెఱిఁగిన బ్రాహ్మణవేషధారి- అర్జునుఁడు- విల్లందు కొనఁ బోవునాఁడు. అప్పుడు:—

"ఇంత" మని చూప విలునొకఁ,
"దండుకఁగా, దతఁడుపోవు సల్పాచమనం

— విభ్రమకు లోనైనాఁడు. దీనినిఁ గని పాండవులు ద్రౌపదిసహితముగ నగిరి. కాని సంజీవమూర్తిగారు:— "ఎవరొనగినన వ్వదేపాపమెఱుఁగని ద్రౌపదిది"— అటం చెంచినాఁడు. అని రచించిరి. కవిత్రయభారతమున ద్రౌపదినవ్వినట్లున్నది. శ్రీసంజీవమూర్తిగారొనర్చిన యీ మార్పు ద్రౌపదీశీలమునకు మఱింత మెఱుఁగుఁగూర్చినది. వీరికి ద్రౌపదిపాత్రయెడఁ గలఆదరానుభూతు లట్టివి.

ద్రౌపది ధర్మసందేహములను ధర్మజుఁడే తీర్పసమర్థుఁ డని భీష్ముఁడు సూచించును. నన్నపార్యునిరచనలో ధర్మజుఁడు మిన్నకుండును. కాని యీభారతమున ధర్మతనయుఁడు సంశయనివారణము నర్చును. ఇ దెంతేని సమర్థనీయముగా నున్నది. ధర్మావతారుని— ధర్మసందేహము గల్గినచోట— మూఁగివానిని గావించుట— ధర్మవిరుద్ధమగునని సత్కవితాకల్పవిశారదులైన సంజీవమూర్తిగారిలేఖిని యప్రయత్నముగ లిఖించినట్లున్నది. భేష్! వీరు కవిభూషణులేకాక ధర్మభూషణులునైరి.

ద్రౌపది యేపాపమునెఱుఁగదు. ఉత్తమశక్తు లామెనుఁ గష్టపెట్టినవి. అసమానులైన మాన్యపుమగలు కట్టెదుట నున్నారు. మూర్తిఁగొన్న ధర్మము లనఁదగు భీష్మద్రోణులు సముక్షమందే యున్నారు. కాని వారందఱు ధర్మబద్ధులు. ధర్మజునియుపన్యాసముతో దా నాశించినధర్మమును నెదురుతిరిగినది. ఇప్పు డామె కేదుగడ యొక్క నర్వేశ్వరుఁడే!— నిజమానరక్షణార్థ మామె మొదటఁ బెనఁగులాడినది. ఎటన—

"పదిలంబుగ వలువను మొయిఁ
గదియింపఁగఁ బెనఁగు బుడిగి కరములరెంటిన్
గదియించె నొసటిపైఁ దన
హృదయస్థితు కృష్ణుకడనె దృష్టినిలుపుచున్."-

కృష్ణభగవానుని ధ్యానించినది. ఈపోకడ కడురమ్యము. బలముడిగి నిస్సహాయుఁడై మొఱలిడు కరిరాజు పునఃతలఁపునఁ బారును.

ఈకవిగారికి ద్రౌపదిపట్ల మిక్కుటమగు పక్షపాతము గలదు. ఆమెపై నాచరింపఁబడిన యవమానము నీకవి యెంతో ఖండించినది. స్వీయముగఁ గ్రుప్తమైయున్న పద్యమిది:—

"ధర్మనిష్ఠ నొక్క పాతివ్రత్యమున నెంచి
గరిత నొక్కరుని బలిగా గణించి
తాఁకుమీరి నొల్చి ధర్మ మెప్పుడైనదార
కున్న, సతిసతీత్వ మూరకున్నె?"

ఆహా! యెంతసుందరమగు భావము! - ధర్మనిష్ఠుల ప్రగాఢ విశ్వాస మిట్టిదే!-

దుర్యోధనుఁడు ద్రుపదనందనను దోడ్తేర, దుశ్శాసనునిఁ బంపినాఁడు. దయాశూన్యహృదయుఁ డగు వాఁడు పాంచాలిఁ దఱిమికొనుచు వచ్చినాఁడు. ఆదృశ్యమును గాంచలేక కవిగారు—

"వనితఁ దెచ్చుచుఁ జనుచుండఁ బైకెగసె
ధూళి భూనభోంతరాళ మలమె"- అని చెప్పి ఆహాదృశ్యమును మనకుఁగూడఁ గనఁబడకుండఁజేసి రక్షించినారు.

ఈ కవీశ్వరుఁడు అలతి యలతి పదములతోడనే చాలసూటి మాటలాడును. క్రోధమెఱుఁగనిధర్మజుఁడు, దుర్యోధనుఁడు దురోదరమున కాహ్వానింప వలదనును. వాఁడు పరుషములాడును.

"హిమకిరణునియందును వే
డిమి పొడసూపెనొ యనంగ డెందమురవులఁ
యమతనయునియందునుఁ గో
పము" పొడసూపినది- అప్పుడు ధర్మజుఁడు పలికినతీరు-

ఆపలుకులలోని వాడిదనము- అద్భుతములు.- "బావురుగానికిఁ జిటిచిలుకపడంతి నోటఁజిక్కినకైవడి"- మున్నగు నుపమానము లతిరమణీయముగ నున్నవి.-

మొత్తముమీఁద- కవిరాజ, కవిభూషణులు తమతమరచనాభాగములను రమ్యముగ నిర్వహించిరి. సరసమలమృదుమధురపద్యశోభితమైన యీయిరువురి కవనము పండితపామరజనసులభమై సర్వజనాదరణమునొందఁగల్గిన దని చెప్ప టత్యుక్తి కానేరదు. ఇది సర్వవిధముల "సుబోధాశ్వత్థభారత" మనఁదగినది.-

కవిత్రయభారతమును బఠించి యానందింపఁ జాలని వారు ముప్పుందుగా నీసుబోధాశ్వత్థభారతమును జదివి భారతకథామృతపానమొనర్చి యానందకందళిత హృదయారవిందు లగుదు రనుటలో నాకెంతయు సందేహము లేదు.

## కృతి

కవిద్వయ విరచిత మగు నీకృతి యాంధ్రవాఙ్మయాకాశమున ధ్రువతారయై విలసిల్లుగాక!-

శేషించిన చతుర్దశపర్వముల విరచించి ప్రకాశన మొనర్చుటకు వలయు నాయురారోగ్యైశ్వర్యములను, సత్కవిహృత్పంకజ నిలయుఁ డగు సర్వేశ్వరుఁడు "కవిరాజ" అశ్వత్థరావుగారికిఁ బ్రసాదించుఁగాత!-

ఇట్లు
విద్వత్స్నిగ్ధవిధేయుఁడు,
(సం.) కరిచేడు హేమాద్రి సత్యనారాయణ రావు,
(విద్వాన్- రాష్ట్రభాషావిశారద.)
ప్రధానాంధ్రపండితుఁడు,
పరిష దున్నతపాఠశాల, ఆలూరు.



•

[శ్రీ నండూరి బంగారయ్యగారు, బి. ఎ. బి. యల్; అడ్వకేటు;-
రాజమహేంద్రము.]



మధ్వశ్రీ "కవిరాజు" అశ్వత్థరావుగారికి,

ఆర్యా, నమస్కృతులు,

అశ్వత్థభారతమున మీరు పంపిన 4 పర్వములను సావధానముగ బఠిచింతిని.

మొత్తముమీద మీయిరువురికవిత్వమునను ధారాశుద్ధి- కథనచమత్కృతి- సంగ్రహీకరణనైపుణ్యము మున్నగు అపురూప సద్గుణములు గోచరించుచున్నవి.

కవిత్రయభారతము సంస్కృతభారతమునకు సంగ్రహ స్వరూపము. అశ్వత్థభారతము కవిత్రయభారతమునకుఁగూడ సంగ్రహస్వరూపము. మీయరణ్యపర్వము అప్రస్తుతములగు ఉపాఖ్యానములను, ధర్మబోధను, పరిహరించుకొని కవిత్రయకృతారణ్యపర్వముకూడ ఇంకను ఎంతసంక్షిప్తపరచుటకు వీలుగనున్నదో సూచింపజాలియున్నది. భారతమంతటి భారీఎత్తుగలగ్రంథమును రచించుటకు సామర్థ్యము మీయిరువురకు నున్నదనుట నిస్సంశయము.

కవిత్రయమువారిభారత ముండగ మరల మీభారత మెందు కనుప్రశ్న సమంజసముకాదు. సహృదయుల కుదయింపదగినదియుఁ గాదు. "ముఖేముఖేసరస్వతి" యనిగదా? భారతమంతటిరసాస్పదము

పవిత్రమును నగువస్తువును పునఃచమత్కరించి రచింపఁ బూనుకొనుట మీసంస్కారౌన్నత్యమునకును సామర్థ్యమునకును నిదర్శనము.

కవిత్రయకవితామహత్వమునందు మీకుఁగలభక్తి మీభారతమే వేనోళ్లఁ జాటుచున్నది. కవిత్రయమువారి ప్రత్యేకసుడికారమును, కొన్నికొన్ని విశిష్టప్రయోగములను మీరాయాఘట్టములలో యథాతథముగ పునరుద్ధరించుకొన్నారు. నన్నయరచనకు మకుటాయమానము నలోపాఖ్యానము. ఎఱ్ఱనరచనకు ధర్మవ్యాధచరిత్ర, సావిత్ర్యుపాఖ్యానము. తిక్కనయారణ్యపర్వము నెంతసంక్షిప్తపరచినను ఈ మూటిని మీరు విడువలేరు.

శకుంతలోపాఖ్యానము, భీష్మచరిత్రము, సత్యవతీచరిత్రము, బకవధ, ద్రౌపదీస్వయంవరము, కిరాతార్జునీయము మున్నగునాయాఘట్టములలో రసమునకు కథకును కీలకములగు నంశములను విడువకుండ, ఔచితీప్రధానముగ చిత్రించుటకు మీరు సలిపినకృషి చాలప్రశంసార్హము. మీరు పాత్రపోషణమునఁగూడ ప్రత్యేకశ్రద్ధ వహించుచున్నారు.

శ్రీసంజీవమూర్తిగారిశైలి తేటదేరియున్నది. మానసికప్రవృత్తిచిత్రణమునను, శిల్పపుష్టియందును మేలుచేయి.

ఈతీరుగను, ఇంతకంటెప్రశస్తముగను మీరు భారతము నంతను ముగింపవలెనని ప్రార్థించుచున్నాను. మీకు నాహృదయపూర్వకమైన అభినందనములు.

విజయదశమి:
22—10—58

చిత్తగింపుడు.
(సం) నండూరి బంగారయ్య.

—౦—

[శ్రీ పి. శరభాచార్యులు, బి. ఎ. యల్. టి., (అష్టావధాని):
జిల్లావిద్యాశాఖాధికారి, ఆదోని.]



శ్రీ అశ్వత్థరాయకవిగారు రచించిన ఇతఃపూర్వకృతులు "దండకరామాయణము, అనుభవామృతము" కొంతచూచుట తటస్థించినది. అట్లే వారి అశ్వత్థభారతముకూడఁ జూడఁజాలితిని.

ఇందలికవనము, సరళము, ధారాళము, మనోహరమునై ఉన్నది. ఆయాసన్నివేశముల కనువైన శైలి, భావవిన్యాసము, కావ్యమునకు ఔచిత్యశోభను కల్పించి పాఠకులచిత్తము నలరింపఁగలిగియున్నవి. గుణరూపములయందు వీరికృతులు పెద్దఁదనము సంతరించుకొని కవికి, భక్తితత్వములపైఁ గల మెండగుప్రీతికి నిదర్శనములై యున్నవి. ఈభారతకృతికూడ రాయదుర్గమువేంకటరమణుని నామమును ప్రత్యాశ్వాసముయొక్క ఆద్యంతములయందు స్మరించుచునే పాఠకలోకము ఎదుట ప్రత్యక్షమగుచున్నది.

కవిత్రయకవితలతోఁ బూర్ణరూప మందిన భారతమును శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారివలె వీరును ఒక్కరై సంక్షేపరూపమున, ఆంధ్రలోకమున కందించుట ముదావహము. భారతము "భూదేవకులాభితర్పణమహీయఃప్రీతి" గల రాజరాజొక్కఁ డుండినందున, అతనియాజ్ఞానుసారము నన్నయ్యవ్రాయుటలో— మిక్కిలిగా, కొన్ని

వర్ణములపొగడ్తలు, కొన్నింటితెగడ్తలు, వర్ణధర్మములఁ బ్రపంచిం చుపట్ల గర్హణీయవ్యత్యాసములు ప్రతిపాదింపఁబడినవి. నేఁటిసమా జమునకు వీనిప్రయోజనము శూన్యము. కావున కథాసంక్షేపణలో ఆధునికులు ప్రస్తుతసమాజమునకు వలయుసందేశములనే ఏరికొను ట, అట్లే చిత్రించుట అవశ్యకము. కావుననే కాబోలు వీరు:—

"అవలషోడశదానంబు లాచరించి;
ఇష్టమృష్టాన్నములను సంతుష్టిఁజేసి,
అచటఁ జేరిన సర్వుల నుచితరీతి
గారవించెను ద్రుపదుండు వేలు వేఱ"—

అని సర్వగౌరవమున, శ్లాఘనీయముగాఁ బేర్కొనిరి. "విప్రుల నుచి తరీతి" అని మాత్రమే ఆదికావ్యమునఁ బుష్కలముగాఁ గన్పడు చుండును.

కవిభావనాశక్తి ప్రశంసనీయ వైచిత్రి కలదనుటకు దార్కాణముగా:—

192 పుటలో:— "సింగారమె పురి యయ్యెనొ"?—
108 పుటలో:— "తిలసమానాణుమణి కోటి దిద్దితీర్చి
తనువొనర్చుట" .... .... .... ....
"మొలిపించె నలువ నలుగడ
నలుమొగముల నింతిఁ గాంచ" .... .... .... ....

ఇత్యాదులు పేర్కొనఁదగినవి.

కవి లోకోక్తులను రమణీయముగా, వాడుటలో, మిగుల కుశలుఁడు. సహజముగా సులభముగా, నానుడులవలె తనదలంకృతులు

కుదించి వ్రాసియు హృదయముల నలరింపఁగలఁడు. 424 పుటలో:-

"అలస్యాదమృతం విషయమ్ముగద! యిష్టార్థమ్ము సాధింపఁగా"-

"తరుణి ధవునకు హర్షసంధానకరణి"—

"కాంతలు కారణముగ మతిమంతులునుఙ జెడుదురు"—

"ఒకయుదరమునుండి పండియూడినవారల్"—

"అమరపతి యాజ్ఞకన్నను, అతనిసుతుని
ప్రేమరసికత్వమునకన్న వేయిరెట్లు
మిన్నతిగిచెను నీనుడు".—

"కన్నులలోనఁ గన్నులిడి"—

అని లలితమనోహరముగా వ్రాయుశక్తి కవికి అవ్వారిగాఁగలిమికి పైవన్నియు మచ్చుముక్కలే— 426 పుటలో:—

"అరవిరిముల్కులో, మరునిచేచిల్కలో"—

"అక్షిపక్షుల తిగిచెడునట్టి యురులో?"—

అని అప్సరోముగ్ధలఁగూర్చి వ్రాసినసీసము పాఠకుని చిత్తమును ముగ్ధమొనర్పఁగలదు.

సర్వరసప్రధానమైన కరుణమును వీరు చిత్రించుతీరు ఎటుల నుతిపాత్రమైనదో చూడుఁడు.— విరాటపర్వమున ద్రోవది:—

"బిట్టుగ నశ్రు లురలి చను
కట్టుపయిఙ మిట్టియాడఁ, గడుఁగొని గుండెల్
కొట్టికొనఁగ దడదడ యని,
యట్టియొఱిగె భీమసేను నడుగుల మీఁదఙ"— అనిమగుష వగపును మనయెదుట నిలిపి మనలను అర్ద్రమానసులఁ జేసినాఁడు.

ఇఁకరౌద్రమున— "సింగంబాఁకటితో గుహాంతరమునన్
జేడ్పాటుమైనున్న"— అని, అర్జునుని తిక్కన రూపించిన తీరును—
"ఆఁకటితో గుహాంతరమునందున డాగి, మదేభయూథపుం
రాఁకనుగాంచిదూఁకు మృగరాజముగా"— వీరును నిరూపించినారు.

సభాపర్వమున:—

"ధర్మజునైన జూదము లోఁగొనఁగఁ జాలె
సన్యులమాటయే మనెడువారు,
భీమార్జునులఁగూడ విధి బానిసలఁజేసె,
నద్దాని కెదురేది యనెడువారు"—

అనిపలువు రందందు అనుకొనిన చందమును సౌజమునఁ బ్రజాభిప్రాయ
ప్రవృత్తుల నెఱిఁగినవారుగాఁ జిత్రించిరి. 557 పుటలో సావిత్రిచే:-

"కరణములమూఁట సంతః
కరణము ముఖ్యంబు; దానఁ గైకొన్న మనో
హరుఁ బాయుకంటె సాధ్వికి
దురిత మధికమున్నె? హెచ్చుదుఃఖం బున్నె?"—

అని అనిపించి తిరుగులేని ప్రమాణము నేరి చూపిరి.

ఏవంవిధ బహుగుణగరిష్ఠమైన వీరి భారతము, ఆంధ్ర
భారతగ్రంథశ్రేణిలో— అర్వాచీనకృతులలో మిక్కిలి వన్నెఁబడయఁగల
దని నావిశ్వాసము.

ఈదృశ బృహద్గ్రంథము రచించిన కవిశక్తి సంస్తవనీయము.

(సం) పు. శఠగోపాచార్యులు.

—❋—

[శాస్త్రవిశారద, సాహిత్యాచార్య. లాక్షణికశిరోమణి, దర్శనాచార్య, నవవిద్యానాథ, మహోపాధ్యాయ, అభినవానంద, సాహిత్యతీర్థ, విద్యాభాషాప్రవీణ, ప్రసన్నభరతభట్టారక—
**Sadasya; Sahitya Acadami & Academic Council,**
బ్ర॥ శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు,]
గుంటూరు.



— జయవాదము. —

శ్రీగీతాకృష్ణుడు వృక్షములలో నశ్వత్థమైనాడు. కావ్యమశ్వత్థవృక్ష 'మైనది. కవిహృదయ భారత బీజము వృక్షాకృతి కావ్యమై పత్రపుష్పసుందరమై రసభోజులకు ఫలరస మిచ్చును. అశ్వత్థ భారతము కావ్యము. ఇది యొక పుమర్థశాస్త్రము. కావ్యచ్ఛాయ కల శాస్త్రము, శాస్త్రచ్ఛాయాన్విత మైన కావ్యము. ఇది సుహృత్సమ్మితమయిన కావ్యము. లోకసమ్మిత మైన యధునాతనము.

నేటిలోకము ప్రభుసమ్మితము నూఁకొట్టదు. మిత్రసమ్మితము నాలింపదు. కాంతాసమ్మితమునును వాపట్టదు. లోకసమ్మితమును చేపట్టునో? లోకులు పట్టనీ! పట్టనీకుండనీ! వారి నిది హృదయంపట్టి పాలింపగలదు, లాలింపగలదు.

"యన్న భారతే తన్న భారతే"

అని మన మందుము. అనిపింతుమును. తెలుగునాడు భారతమును స్వకము చేసికొనినది. అశ్వత్థభారతము వచ్చినది. ఇందలి రచనా ప్రసాదము లోకభిక్షాకులకు ప్రసాదము.— జయభారతముండగా "భారతమంజరి" నిచ్చిన క్షేమేంద్రుడు లోకమునకు క్షేమమైంద్రము ద్యోపింపజేసినాడు. ఆంధ్రకర్ణాటము కర్ణాటాంధ్రము భారతదేశములో భారతదేశన మిచ్చినది. కర్ణాటచ్ఛందములోని గతిరమ్యతలు కర్ణాటములు కాగా భారతము ద్విపదమగుటయు తెలుగు లెఱుంగుదురు. అశ్వత్థ భారతము సర్వము సంపాదించుకొని తనకు తానుగ నేను నే ననగలుగునో? అట్లనగలుగుట మిత్రాలోకము. అశ్వత్థభారతములో కథావేగమున్నది. బహుకావ్యధర్మమున్నది, ప్రతికథము కావ్యధర్మమున్నది. ఇట్లుండవలయు ననియె అశ్వత్థబోధము. ఇట్టిదానికి మరి ఇట్టిదీనికి అన్యసంవాదమున నేమి? విసంవాదమున మాత్రము మరేమి? స్వమాత్రసౌష్ఠవమును– కావ్యవిత్తు లూహింతురు. సంపన్ననిసౌరస్వతతపము— "ప్రబ్రవామి శరదశ్శతం" అనును. మూలకథను సంగ్రహించి గ్రహించి అశ్వత్థము కథాసంధాన మొనరించినది. అముక్తవర్ణన మయిననిది సందర్భౌచిత్యము నందించుచునే యున్నది.

మా తాతలు ముత్తాతలు వారల తాతలును సంపన్నులుగ భావసంపన్నులుగ నున్నప్పుడు శిష్టులు విశిష్టులునై పరిసరముల రసమయమనసులు కలవారల కందరకును భారతాదులను— పురాణరీతి నుద్బోధించెడివారు. ఆయుద్బోధములో వ్యాసభావమునకు జృంభణ ముండెడిది. వాచావిజృంభణమంతయు వారి వారి శబ్దశక్తిర

శోభ. ఆశువుగా పద్యము పలికి స్వయంవ్యాఖ్యాతలై బహుశ్రుతులు శ్రోతలకు శ్రుతిభిక్ష పెట్టిరి. అశ్వత్థభారతకర్త యిట్టివారిని మరి యిట్టివారిని స్మరింపఁజేసిరి. వారి పరిసరమంతయు సౌరస్వతోద్భాసముగా నుండవలెను.

ఆశ్వత్థభారత మిట్లు సుప్రకాశమగుచున్నది. సంపూర్ణ శోభతో నిదిస్వయంప్రకాశముతో లోకప్రకాశముపొందుటను నే నాశింతును. అస్తు.

గుంటూరు.
28–6–60

(సం) మాధవరామశర్మ.



[బ్ర॥ శ్రీ ఉప్పల వెంకటశాస్త్రిగారు— శతావధాని.]
ముడివేముల. (మార్కాపురం తా॥)
10—1—52.



శ్రీ శ్రీ కలుగోడుకరణం అశ్వత్థరావుగారు రచించిన భారతమును గూర్చి నాయభిప్రాయము వెల్లడించుచున్నాను. "నానృషిః కురుతేకావ్య" మనుపూర్వోక్తిఁబట్టి ఋష్యంశములేక కావ్యము వ్రాయఁజాలఁడు. మఱియు నీకవి దండకరామాయణానుభవామృత కావ్యము లింతకు మున్నే రచించి ఆంధ్రదేశమున కీర్తివహించినాఁడని కలాచతురులకు విదితమైయున్న కారణమున నే నితనిఁగూర్చి ప్రశంసింప నక్కరలేదు. కాని యీతనిభారతమునుగూర్చి ప్రశంసింపక తప్పినదికాదు. కారణమేమన, నతని లలితసుకవితాధార, సుధారసముఁబోలి నావీనులకు విందుగావించుటచేతనే—

గీ. విశ్రమమ్ములు ప్రాసముల్ వృత్తములను
మొలచినట్లు యథాస్థానముల నలంక
రించినవి, గ్రంథకర్త యత్నించివానిఁ
గూర్చినటు దోఁచదీపద్య కోటివినిన,—

మఱియు ననపేక్షితములగు యతిప్రాసములచే నలంకరింపఁబడుట యే కాక కొన్నిచోట్ల నీయశ్వత్థభారతమున పద్యములు—

కం. నటదభవశీర్షగంగా
తటినీదీర్ఘత్తరంగతతిఁ బోలి మహా
స్ఫుటగంభీరలసత్పద
పటలమ్ములఁ బొలిచె పద్యపాళి యయారే!—

ఈభారతమునఁ గొన్నిచోట్ల కవి కథాఘట్టములయందు స్వతంత్రించినాఁడు. స్వతంత్రించినను కథాభంగము గాకుండ, నాధునికులకు శ్రావ్యముగానుండునని భావించెద. మఱియు నీకవియందతిశయ మేమనగా, పురాకృతపుణ్యముచే నీతఁడు భాగవతము రచించిన బమ్మెరపోతనకవిగారిఁబోలి సహజపాండిత్యకలాలలితుఁడై ఇట్టి మహాకావ్యముల రచించి రాయలసీమ కవితాసరస్వతికి జన్మభూమి యనువాసిఁ జేకూర్చినాఁడు.

అథర్వణాచార్యులవారు తమచిత్రభారతమున నర్జును ప్రశంసించునపుడు:—

క. "శ్రీకంఠుఁ డెదురునప్డు వ-
నౌకధ్వజ, మింద్రమకుట, మర్జునతురఁగా
నీకము, దివ్యశతాంగం
బాకవ్వడి కబ్బెనని యతఁ డేమగునో?"—

అన్నట్లుగా నీకవి బాల్యముననుండి గురుముఖంబున గీర్వాణాంధ్ర భాషాభ్యాసంబు గావించి యిప్పటివలె పండితభాషాపరిచయంబు

గలిగినచో నీ కెంతబాగుగా వ్రాయునోకదా? మఱియు నొకపద్యము వేమనగా:—

మ. అకలంకస్థితి భారతాగమము నీయాంధ్రమ్మునన్ వ్రాయ నే
రికిధైర్యమ్ము లభించు, జన్మముఁ గృతార్థీభూతమున్ జేసె దం
డకరామాయణమున్ రచించి కవికాండంబెల్లఁ గీర్తింపఁ బు
ణ్యకథాకావ్యకరప్రసిద్ధిఁగొనె మాయశ్వత్థరా వీయెడన్.

కం. కపివై, దూరీకృతకా
కవివై, రుచిరాచ్ఛకీర్తి కలితుఁడవై ,స
త్కవిలోకవిధేయుఁడవై
యవనిన్ భాసిల్లు మిటుల నశ్వత్థకవీ!—

(సం) ఉప్పల వెంకటశాస్త్రి.



"కాయకమే కైలాసము."

WORK IS WORSHIP·

**B. JOOGAPPA,** M·A.I.A.S·,
Retired Collector,
Chairman- District Shelter
(Social Walfare Board)
President:- Srisaila Veerasaiva Sangha.

BHAKTHA VIHAR,
ARAVINDA NAGAR
ANANTAPUR
17-7-60.

నేను "ప్రొబేషనరీ రివిన్యూఇన్స్పెక్టరు"గా— (1924 సం॥ము) రాయదుర్గములో పనిచేయునప్పుడు శ్రీకరణం అశ్వత్థరావు నాకు, తానురచించిన కొన్నిపద్యములు, నవలలు, రాత్రివేళలయందు— మాఉద్యోగపుపనులెల్ల ముగిసిన తరువాత— చదివి వినిపించుచుండెడువాడు. అతనియందు కవితాలహరి దేవదత్తముగా ప్రవహించుచున్నదని గ్రహించి, దైవానుగ్రహముచేత లభించిన కవితాశక్తిని కృషిచేసి, పూజించి, పెంపొందించవలెనని అతనిని పురికొల్పితిని. అతడు అప్పటికే— బాలకవిగా, ఆశుకవిగా, చాటువుగా పద్యములల్లి మమ్ములను ఆశ్చర్యానందమగ్నులను జేసెడివాడు. ఆబాలకవిచంద్రుడు నానాటికి వర్ధిల్లి— కవిరాజై— దండకరామాయణము, అనుభవామృతము, మున్నగు కావ్యములురచించి, పండితప్రకాం

డుల— విద్వత్కవుల మెప్పుబడసి, తెలుగు సాహిత్యమాతసేవను జేయుచుండుట చాలాముదావహము.

ఇప్పుడు వీరు రచించిన "అశ్వత్థభారతము" వీరే విన్నవించు కొన్నట్లు:—

"పంచమవేదమైపరగు భారతమందలి భక్తి పెంపుచే
నెంచకనాకొలంది, రచయింపఁగఁబూనితిఁ దోఁచునట్లుగఁ,
గ్రించుదనంబొ, సార్థకమొ?— కృష్ణునిసత్కథనుంచు నీదినా—
సంచితమంచుఁ బొంగెదఁ;— ప్రజామత మేగతిదైనఁ గానిరే!"—

వీరువ్రాసిన "అశ్వత్థభారతము" కవిత్రయముువారి కీర్తిని ఇనుమడించి వెల్లడిచేయుప్రయత్నమా? యని తోచెడిని! ఏల యన ఈకవిరాజే ఈక్రిందిపద్యము నం దిట్లునుడివినాడు:—

"పండితమాన్యమౌ తెలుఁగు భారతవార్ధి మథించి, గర్హితా
ఖండ సుధా రమా మణులఁ గైకొనశక్యమె? సర్వసౌఖ్యమై
యుండఁగ హారసూత్రమటు లుండెడు తత్కథమాత్రలక్ష్యమై
యుండఁగ, సంగ్రహంబెసఁగ, నొండొకక్రొత్తగఁగూర్చ నొప్పదే?"—

ఇతనికి సంతానములేని కొఱత ఇతనికావ్యములే తీర్చుచున్నవి. కన్నడమహాకవి:— షడక్షరకవిసార్వభౌముడు:— "ప్రజ లెట్లు ఇతరుల బిడ్డలను చూచి తృప్తిపడక, స్వంతసంతానప్రాప్తి కొఱకు ఎటుల పాటుపడెదరో, అటులనే, కవులుకూడా, యితరుల కావ్యములను జదివి తృప్తిపడక, తామే కావ్యములను స్వయముగా రచించుట వారి స్వభావజన్యనైజగుణ" మని, యుక్తియుక్తముగా సూచించినాడు. అటులనే ఈకవిరాజు తాను "తనప్రౌఢిగస్వకర్మవిల

సన" మైన— దైవప్రేరిత మైన, కావ్యకన్యను కని, పెంచి, సర్వగుణ సుందర సువర్ణమణి యాభరణములచే నలంకరించి— అశ్వత్థభారతిని సాలంకృత కన్యాదానమును రాయదుర్గనిలయుఁడౌ శ్రీవేంకటేశప్రభువునకు సమర్పించుచు— మకరందమాధుర్యము లగు కందములందు ముద్దులొలుకుపలుకులతో భక్తి నిండార, కవిహృదయసమర్పణజేసి కృతార్థుడైనాడని వేఱుగ చెప్పవలయునా? చదువుడు:—

"ఇహపరసాధకమగునట
స్పృహ రచియించితిని దీని నీగతిఁ; బ్రీతిఁ
గ్రహియింపుము;— నన్నునను
గ్రహింపుమీ దేవదేవ! కారుణ్యనిధీ!!"—

"నాయిలువేలుప! యిదొ కై
సేయుము పాణిగ్రహణముఁజేసి కృపఁ— శ్రీ
రాయాద్రివేంకటేశ్వర!
ఆయత మశ్వత్థభార తాఖ్యానసుతఁ!!"—

శ్రీవేంకటేశప్రభుకృపచే ఈకృతి తెలుగుతల్లికి నవనవోన్మేష సుగంధపుష్పమాలయై వెలుగొందుగాత!!



## — అపూర్వ పర్వము. —

["అభినవకాళిదాస—మధురకవి" — శ్రీ వెళ్లూరి శ్రీనివాసమూర్తి గారు.]



శ్రీసీతారాముల ఆదర్శజీవిత దివ్యకథామృతము చంపక చ్ఛందమునగూర్చి విశిష్టకవితాయశస్సునార్జించిన శ్రీ కలుగోడు అశ్వత్థ రావు— మేఘప్రతిసందేశకావ్యమును కన్నులగట్టినట్లు అనుభవించి రసజ్ఞులమన్ననకు పాత్రులైన శ్రీ కప్పగల్లు సంజీవమూర్తిరావు—... బదరికావనమున వినిర్మలతపము గావించి ధన్యులైన నరనారాయణులవలె ఈ భారతకవితా తపస్సున జన్మల తరింపజేసికొన్న మహా మహులు.

అశ్వత్థభారతము, ఆదిసభారణ్యపర్వములు— పైపెచ్చు విరాటపర్వము సొంతముగసాగిన రచన. ఈ రచనాప్రవాహమున శ్రీసంజీవమూర్తిగారి దినమేర— సభాపర్వమున ద్వితీయాశ్వాసము మాత్రము. మిగిలినవాగ్ధార. సర్వస్వము అశ్వత్థరావుగారి చేతిమీదుగా నడచినదే. ఇందులో ఒకరిది సంగ్రహనైపుణి; ఒకరిది భావవిస్తరణ మార్గము. ఒకరికవిత రసదృష్టికిలోబడి నడువగా— ఒకరికవిత్వము ఆనందోపాసకులమీద నమృతవృష్టి గురిసినది. ఒకకవీశ్వరునిహృద

యము భారతీయధర్మావలంబనమున సుఖ్యాతలూగినది. ఒకకవిచం ద్రునియెడద కళామర్మానుషంగియై జాలువాఱినది. ఒకయద్వైత శోభ, ఈకవిద్వయము నాశ్రయించి– ఈభారతకవిత సత్య శివ సుందర స్వరూపమున కొనసాగి, కొమ్మలుసాగిన మహావృక్షమువలె తెలుగుసాహిత్యలోకమున సాక్షాత్కరించినది.

తెనుగువారికి "భారతకథ" కావ్యరూపమున లేకపోలేదు. అది కవిత్రయమువారు, సారస్వతక్షేత్రమున పండించినపంట. యుగములు– కల్పములు– అనంతకాలము, లోక మనుభవించినా తఱుగనిరాశి!– అశ్వత్థభారతరచయితలు ఈ త్రిమూర్తుల నారాధించిరి. వీరిరచనలో నాయాపోకడలు ప్రస్ఫుటములు.– ఆంధ్రభారతసాహిత్యమేకాదు; కమ్మనిషట్పదీవృత్తముల గానముజేసిన కర్ణాట కవితల్లజులు, కుమారవ్యాసులభారతముగూడ వీరిసాహితీసముద్ర ప్రయాణమున చాలవరకు దారిచూపినయోడ!—

అశ్వత్థరాయనికవితలో సందందు "శకుంతలా, దుష్యంతులకథ– భీష్మజననము" వంటి రసవత్తర ఘట్టములుగలవు. వీరివిరాటపర్వమున తిక్కనకవిత ప్రతిబింబించుచునేయున్నది. భాషాధికారముకలిమి భావనిర్మాణచాతుర్యమున సిద్ధహస్తులైన కవ్వగల్లువారిది ఏకధారాప్రసవంతి.

కథాదృష్టితో పరిశీలించితిమేని ఈభారతమున ప్రధాన కథయేకాని, ఉపకథ లంతగా కానరావు. ఉన్నవి కొన్ని ప్రధాన కథాపోషకములు. ఇది ఈరచనలోని నవ్యత,

ఈకవితాస్రష్టలు చిరకాలముగా ఆంధ్రసాహితీసమర్చనలో నానావిధరచనల పురోగమించిన అదృష్టవంతులు. నే డీభారతము సృజించి తమకావించినసృష్టిలో చక్కనిమెఱుగులు సంతరించి రనుట పరమసత్యము.

పెద్దలెందఱో అశ్వత్థభారతము చదివి తదంతర్గతకవితా వైవిధ్యము విపులమార్గమున సమీక్షగావించిరి. ఈభారతమువంటిదే నాఈసమీక్ష ఇందలిసుగుణముల సూత్రప్రాయముగ తడవినది.

బహుధా లోకాదరణపాత్రమై రాణింప వెలువడిన ఈ నాల్గు పర్వములు తెలుగుప్రజకు అపూర్వపర్వసదృశము కాగలదు.

కల్యాణదుర్గము.

3—1—1960

(సం) బెళ్లూరి శ్రీనివాసమూర్తి.



Mahakavi – Saraswathi Putra, Puttaparthi Narayana Charlu.

Cuddapah. 24–10–60



మిత్రులు, రసికులు, శ్రీ అశ్వత్థరావుగారిసన్నిధికి సమాంసి;–

భారత రచనలో తమసాహసము గొప్పది. గ్రంథమును స్థాలీపులాకముగ చూచినాను. రచన లలితముగానున్నది. సులభముగ నన్వయమగును. శైలి రసానుబంధి.

ఈరచనలో వ్యాసభగవద్రచిత మగు భారతమునే– యథాతథముగ పరివర్తించిన బాగుండెడిది.

ఇక కావ్యగుణముల కెక్కడికిమితి?

"పీటికొలదిలోతు"

నమస్కారము.

(సం.) పుట్టపర్తి నారాయణాచార్యులు.



[మహామహోపాధ్యాయ, విద్యావారిధి, అవధానశిరోమణి
వేదమూర్తి కాశీ కృష్ణాచార్యులు, గుంటూరు.]

--※--

మహాశయా!

ఆశీరాద్యుపరి.

తమ "అశ్వత్థభారత" మను గ్రంథరాజమును నాల్గురోజులు, పర్వత్రయమునందుగల పద్యములలో కొన్నికొన్నిపద్యములను శ్రద్ధామోదములతోఁ జదివితిని. ప్రస్తుతపు నావయస్థితినిబట్టి ఏగ్రంథమును జూచుటకును శ్రద్ధ జనించుట లేదు.

ఒక కవి నాయభిప్రాయమును గోరి తన్గ్రంథమును నాకుఁ బంపినపుడు, దానినిఁ జూడకుంట అసమంజసమని తోఁచి, చూచినను అయిదారుపద్యములు చూచునప్పటికి ఉన్నశ్రద్ధయు నశించుచుండెను. కాని మీగ్రంథమును, కొలఁదిపద్యములను జూడఁగనే శ్రద్ధామోదములుగలుగ నారంభించినవి.

సాంతముగఁ జూచు నోపిక లేదు. చూచుటయు అనవసరమే. మల్లెపూదావి జన్మతోనే ఉండునుగదా!

నాటిమీకవితకన్న ఈనాటికవిత మిక్కిలి పక్వతకెక్కినది. కొరతలేదు.

(సం.) కాశీ కృష్ణః.

[ఆంధ్రఆస్థానకవులు- సంస్కృత, హిందీ కర్ణాటక, మహారాష్ట్రపరిష దధ్యక్షులు నగు- మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ, వేదవిద్యావిశారద—

బ్రll శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు.]

సుదర్శనభవనము; — రాజమహేంద్రవరము.



శ్రీ కలుగోడు అశ్వత్థరావుగారు తనరచించు నశ్వత్థభారతమును గొంతచదివి వినిపించినారు. వీరికవిత్వము మృదుమధురముగా నుండునని మున్ను వీరిదండకరామాయణ దర్శనకాలముననే చెప్పియున్నాఁడను.

ఈభారతకవిత్వముకూడ నట్లే మృదుమధురముగా నున్నదనియే నాయభిప్రాయము.

ఈగ్రంథరచనయందు వీరు మిక్కిలిజాగరూకులై సంస్కృతము ననుసరించుచుఁ గథాసంవిధానమునందు వ్యత్యయ వినిమయములు గలుగనీయకుందురుగాక యని కోరుచున్నాను.

మీయీగ్రంథము అచిరకాలమున ముగిసి ముద్రింపంబడి లోకాభరణాయమానంబగుఁగాక యని కోరుచున్నాను.

కర్నూలు.
14-1-53

(సం) శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

[బ్ర॥ శ్రీ శతావధాని— వేలూరి శివరామశాస్త్రిగారు.]



భారత మొకసముద్రము. సముద్రమంతయు తిరిగి రాఁజాలనివారికి దాని నొకసరస్సుగాఁజేసి చూచుకొనుట సులభము. అటులే క్షేమేంద్రుఁడు మొదలగువారు భారతమంజరి, బాలభారతము, భారతచంపువు మొదలగు సరస్సులను నిర్మించిపోయిరి.

తెలుఁగుభాషలోఁగూడ ఇటులే ఆయాయీకాలములందు కొంతప్రయత్నము జరిగెను. ఇపుడును జరుగుచున్నది. ఇంకను జరుగఁగలదు.

ఎన్నినగలుచేసినను బంగారము వట్టిపోదు. శిల్పుల ప్రావీణ్యముకొలఁది నగలవిలువ,

శ్రీకరణంఅశ్వత్థరావుగారిభారతము చెలువో కంటెయో కాఁగలదని తలఁతును.

(సం) వేలూరిశివరామశాస్త్రి.



[విద్వద్వర్యులు— విమర్శకాగ్రేసరులు— అగు "గానకళాప్రపూర్ణ"
శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు.—]

—✿—

తెలుగులో రామాయణము పరంపరగా పలుతెఱగుల వెలసినది; వెలయుచున్నది; వెలయఁగలదుఁగూడఁగాబోలు.

కాని, కవిత్రయము తరువాత మహాభారతము స్వతంత్ర మహాపద్యకావ్యముగా పునరవతార మెత్తుట కుత్సాహము ఆరువందల యేండ్లలో శ్రీఅశ్వత్థరావుగారియందు మొలచినది, మొలక పెద్దగా పెరిగి చెట్టైనది. మహావనస్పతియు కాగలదు.

శ్రీ అశ్వత్థరావుగారిచిత్తవృత్తి అశ్వత్థవృక్షమువంటిది. దానివ్యాపారము సడ్డగించుట అసాధ్యము. దానిమూలబలము అనన్యసామాన్యము.

"చిచ్చునకుఁదోడు కరువలి వచ్చుగతిన్" శ్రీకప్పగల్లు సంజీవమూర్తిగారు, పట్టిమాటలుగాక రచననుఁగూడ కలిపి శ్రీ అశ్వత్థ రావును అన్నివిధముల ప్రోత్సహించినారు.

ఫలముగా ఈఅశ్వత్థభారతము పుట్టి పెరుగుచున్నది. ఇప్పటికే— మొదటినాలుగు పర్వములకే— ఈగ్రంథము 3225 పద్యములు వెలువరచినది! మరి యికముందు ఎంతగా పెరుగునో!

తిక్కన్నగారి యుత్తరరామాయణమువలె ఇది నిర్వచనముగా నిర్వహింపబడినది.

రచనలో కవిగారికిగల ప్రసాదగుణము, ధారాళత, భావములఆర్జవము, భాష, జాతీయసంప్రదాయము ఇత్యాది గుణములు తెలుగురసికులచవికి ఇదివరకే స్పష్టముగా నందినవి. దానికితోడు కవిత్రయమువారిరచనపై వీరికిగల గౌరవాభిమానములు ఇందు అద్యంతమును ప్రతిఫలించి దోహదమిచ్చినవి. ఆకవీశ్వరుల అనుగ్రహము, అనుసరణము, ఎంతో విస్మయావహముగ ఇంపెన్నియో సందర్భములందు రసికులుచూచి అనుభవింపగలరు.

ఈమహాకార్యము కొనసాగునట్లు శ్రీనివాసుడు అనుగ్రహించుగాక.

(సం.) వాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.



["సరసకవి– సాహిత్యరత్న" అధివక్త–
శ్రీమోచర్ల రామకృష్ణయ్యగారు– (B.A.B.L. Advocate)
"కవితానికేతనము" అత్తితోటఅగ్రహారము, నెల్లూరు,]



పూజ్యమహాశయు లగు శ్రీ కలుగోడు అశ్వత్థరావుగారికి నమస్కారములు:—

దయామతి మీరంపిన తమ యశ్వత్థభారతము నచ్చటచ్చట చదివితిని. ఆనందించితిని. భారతము రచింపఁబూనుకొన్న మీగుండె దిటవు కొండాడఁదగియున్నది. ఉపక్రమించి పర్వచతుష్టయరచనము నిర్వహించుటయు ముద్రింపించుటయు జరుగుట మీ పూర్వపుణ్యఫల విశేష మని నా విశ్వాసము.

ప్రధాన కథాప్రవాహమున కడ్డుదగులు ఆఖ్యాయికలను వదలి భారతేతిహాసస్వరూపమును మాత్రమే చిత్రించు రచన ఆంధ్రులకు, ముఖ్యముగా ఆంధ్రవిద్యార్థులకు అత్యవసరమని తలంచువారిలో నే నొకఁడను. అట్టి యక్కఱ తీర్ప మీరు వహించిన యుద్యమమును నే నభినందించుచున్నాను.

కన్నడము మాతృభాషగాఁగల మీరు ఇంతచక్కని చిక్కని తెలుఁగుఁపలుకుబడి నలవఱచుకొని యనర్ఘమైన యిట్టి సుదీర్ఘ కావ్య

మున్వ్రాసి యాంధ్రుల కిచ్చుట వలన గలిగిన యశస్సుఆచంద్రార్క ము నిల్చుననుట యథార్థకథనము. "కాలగతిశబ్దబ్రహ్మమందు న్విలీనములైనిద్రిలు ప్రాక్కవీశ్వరవచోనాదంబులన్" మీ యశ్వార్థభారతము మేల్కొల్పుచున్నదని నాయభిప్రాయము.

పరమేశ్వరి మీచే ఈగ్రంథరచనము సొంతముచేయించి యేతత్కృతి సర్వాంగసుందరముగా ముద్రితమగునట్లును ప్రకాశితమగునట్లును అనుగ్రహించునుగాత! భగవతి మీకు చిరాయురభ్యుదయములు ప్రసాదించుఁగాత,—

విధేయుఁడు,
(సం.) మోచర్ల రామకృష్ణయ్య.



MAHAKAVI-SATAVADHANI,
G. Venkata Sesha Sastry, M.L.C.
Member:
Andhra Pradesh Sahitya Akademi.

'SIVA BHARATH'
D. 23 Co-operative Colony
PRODDATUR.
(Cuddapah Dt) A. P.

—: అ భి న ం ద న ము :—

శ్రీయుతులు, కలుగోడు అశ్వత్థరావుగారు నాకుమిత్రులు, దండకరామాయణానుభవామృతాది కృతులచే నాంధ్రసాహిత్యలోక మునకుఁ జిరపరిచితులు. వారిరచనలలో నుద్గ్రంథమనఁదగిన దీ యశ్వత్థభారతము.

కవిత్రయరచన తరువాత మహాభారతమును మరలఁ దెలుఁగున వ్రాయవలెనను తలంపుఁగలవారిలో శ్రీఅశ్వత్థరావుగారు బహుశః రెండవవారేమో! బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు మొదటివారు. ఆరేడువందలయేండ్ల దీర్ఘకాలము గడచువరకు నాంధ్రకవుల కెవ్వరికి నిట్టిసంకల్పము కలుగలేదన్నచో, వీరి యంతస్సౌరాభిరుచు లట్టి వనవచ్చును; మహాభారతేతిహాససౌందర్య ము లట్టి వనవచ్చును; ఏమైనను అశ్వత్థరావుగారిసాహితీయజ్ఞము నకు మహా సంకల్పముచేసిన దీక్షితులు. వారిశ్రోత్రియత యట్టిది. పైగా, శ్రీకప్పగల్లు సంజీవమూర్తిగారి సహకారముగూడ నిందుఁ జేరినది. ఇది మిక్కిలి హర్షింపఁదగిన విశేషము.

భారతకవులపై వీరి కెంతో గౌరవముగలదు. కాని పెక్కుతావుల వీరు తిక్కన ననుసరించిరని చదువరులు గ్రహింపఁ

గలదు. "తన కావించినసృష్టి తక్కొరులచేతఁ గాదునాఁ" అని ప్రబంధపరమేశ్వరుఁడు, కవిబ్రహ్మను ప్రశంసించినను, "తత్ప్రచస యకా" అరణ్యపర్వశేషమును బూరించి నన్నయగారిపైఁ దనభక్తి నావిష్కరించినాఁడు. తిక్కనయుత్తరరామాయణమునుపలె అశ్వత్థ రావుగారు భారతమునంతయు నిర్వచనముగా నిర్వహింప నిశ్చ మించుకొనుటేగాక, ఆయనకవితారీతుల నన్నియునంతచముగ నొప్పె యచ్చువేయ నుత్సహించినారు. సందర్భసన్నివేశముల నుంచుకొను టలో, జాతీయములు పలుకుబళ్లు సంతరించుటలో, అలతి యలతి తెలుఁగుపలుకులతో భావము సంగ్రహించి బంధమున నిలుపు చూ పుటలో వీరు తిక్కన కనుయాయు లనుటకుఁ బెక్కు లుదాహరణ ము లిందుఁ గన్పట్టును. సరళపదప్రయోగముతో సూటిగా భావము నందించుమెలకువ వీరికి మిక్కిలి పరిచితమైనది. ఇట్లే తిక్కనపోకడ లెన్నో వీ రిందుఁ బ్రదర్శించిరి.

ఈభారతరచన యింకను సాగవలసియున్నదిగదా! ఈమహా ప్రయత్నమున వీ రచిరకాలముననే కృతకృత్యు లగునట్లు భగవానుఁడు వీరికిఁ జిరాయురారోగ్యములఁ బ్రసాదించుగాక యని కోరుచు, నీసా హితీసపర్యను హృదయపూర్వకముగ నభినందించుచున్నాను.

మ. వితతాత్మీయ మహాకవిత్వమహిమావిశ్వోన్నతంబౌ కవి
త్రితయంబిచ్చిన యాంధ్రభారతము రక్తిన్ నేఁటి కశ్వత్థభా
రతమై పెద్దలకూర్మి కెక్కినది; సారస్ఫారవాణీకృపా
యతమై నీకృషి ధన్యమయ్యె, సుకవీ! అశ్వత్థరాయా! కృతీ!

(సం) గడియారము వేంకటశేషశాస్త్రి.

•

K. SUBBARAMAPPA M.A.B.Ed.
Head of the department of Telugu,
University of MYSORE.

—O—

శ్రీకలుగోడు అశ్వత్థరావుగారు దండకరామాయణాద్యనేక గ్రంథములమూలమున నాకు చిరపరిచితులు. వీరు కన్నడభాషలో కూడ పండితులు. కన్నడమునుండి వీరు తెలిగించిన మహలింగ రంగపండితుని "అనుభవామృతము" పండితపామరులను మిక్కిలి ఆకర్షించినది. కన్నడదేశమునగూడ వీరి తెలుగుసేతను అనేకులు ప్రశంసించియున్నారు.

రామాయణమును దండకరూపమునవ్రాసి కృతకృత్యులైన అశ్వత్థరావుగారు భారతమునుగూడ వ్రాయుటతో వీరికీర్తి యినుమడించినది. ఈరచనమూలమున ఆంధ్రసాహిత్యరంగమున వీరి పేరు చిరస్థాయిగ నిల్వగలదు. అటువంటికృతినే సమర్పించియున్నారు. దీనికి కవిసామ్రాట్టులు పీఠిక వ్రాసియుండుట మిక్కిలి సముచితము.

వీరు అచిరకాలముననే మిగిలినపర్వములనుగూడ వ్రాసి తెలుగుసాహిత్యసేవ చేయుదురుగాక! వీరికి భగవంతుడు ఆయురారోగ్యములను ఐశ్వర్యమును ప్రసాదించుగాక!

ఇట్లు:— సాహిత్యాభిమాని,
విద్వాన్ కె. సుబ్బరామప్ప, ఎం.ఎ.బి.ఇడి.,
తెలుగుభాషాశాఖాధ్యక్షుడు,
మైసూరువిశ్వవిద్యాలయము.

SOMASEKHARA SARMA,
Lucturer in Eapigraphy,
Andhra Univercity, Waltair.



మీరు ప్రేమాదరములతో పంపిన గ్రంథరాజములను కృతజ్ఞతాపూర్వకవందనములతో అందుకొన్నాను.

మీరురచించిన "అశ్వత్థభారతము"ను స్థాలీపులాకన్యాయముగ పరిశీలించి చదివితిని. అనర్గళమైనకవితాధారతో, మృదుమధురములైన పదజాలముతో, తేటతెల్లమైనచక్కనిశైలితో మీ "అశ్వత్థభారతము" మురువుగొల్పుచున్నది,

పంచమవేదమనాఁబరగు మహాభారతగాథను పఠనశ్రావణయోగ్యముగారచించి ఆంధ్రులకుసమర్పించి మీజన్మము చరితార్థము కావించుకొన్నారు,

మీకు నా అభినందనములు.

53. శరవణపెరుమాళ్ వీధి
పురశవాకం, మద్రాసు,

(సం) మల్లంపల్లి సోమశేఖరశర్మ.



["ఆంధ్రకర్ణాటక కవికేసరి- మహాకవి- కవిసవ్యసాచి"-
శ్రీయుత రెడ్డి భీమరాయగౌతము-
ప్రెసిడెంటు రాయలకళాపరిషత్తు, హిందూపురము.]

—O—

మిత్రమహాశయా!- నమస్కృతులు. ఉ॥ కు॥ లో॥—

తాము దయతో నొసఁగిన అశ్వత్థభారతమును సొంతముగఁ జదివితి. పరమానందము నొందితి.

మీకవిత్వపుపోకడ రచనాసౌరళ్యము నన్నూరకుండనిచ్చి నదికాదు. తత్ఫలమే ఈక్రిందిపద్యములు. చిత్తగింపుఁడు:—

చం. ఉచితపదప్రయోగము, మహోన్నతభావము లొప్పివెల్గు నీ
రచన నుతింపఁజాలఁ, గవిరాజ! భవత్కృతభారతంబు ని
ర్వచనపుటాకృతిన్ గని విరాజిలుచుండెడిఁ; బూర్వపుణ్య మీ
రచనసౌసర్ప సల్పె ననురక్తివచోవిభవంబుఁ గూర్చుచున్.

గీ. కుంటువడనిధార, కోమలశబ్దముల్
వెన్నుతోడఁబుట్టె నన్న నీకు!
మూలభారతంబు పోలికఁ గథనెల్ల
సొగఁజేసినావు చవులుగులుక.—

గీ. పలయుకదల స్వతంత్రించి పలికినాఁడ
వర్థమింతయేఁ జెడకుండ నతులితముగ
సార్థకంబు సీబిరుదంబు సముచితంబు
బడగనాధ్వంశతిలక! నాప్రణతు లివిగో. —

ఆ. వె. కత్తిమీదిసాము, కాలాహితోఁబొత్తు
నెఱపవచ్చుఁగాని నిన్నుఁబోలె
దండకంబుపైన దాడిని సలుపుచు
జయముగాంచు టరుదు సత్కవీంద్ర!

ఆ. వె. అనుభవామృతంబు నాంధ్రులుఁగ్రోలఁగ
షట్పదములఁగూర్చి సర్వులకును
బంచిపెట్టి మించి యంచితమౌకీర్తి
గాంచినట్టి నిన్ను నెంచనగునె? —

గౌతమనికేతనము.
కి రి కె ర. }

(సం) రెడ్డి భీమరాయ గౌతమ.



["ఆంధ్రవాఙ్మయచరిత్రము - అశోకచరిత్రము - పంపాభారతము"-
ఇత్యాద్యుగ్రంథకర్తలు — అగు
"బోషార్ణేందు"- శ్రీకల్లూరి వెంకటనారాయణరావుగారు,
యం.ఎ,యల్ టి.,- రిటైర్డ్ డి. ఇ. ఒ.]



శ్రీరాళ్ళపల్లివారిదయగడించిన "కవిరాజ" అశ్వత్థరావుగారు వ్రాసిన ఆశ్వత్థభారతము నందందు తిలకించి పులకించితిని,

భారత మొకమహాసముద్రము, తుదముట్ట నీకాలమున జదువువారేలేరు. అట్టివారిభాగ్యము పండినది. ముఖ్యకథాంశములన్నియు వీసరవోవకుండ వర్ణితములైనవి. కవిత్వము సరళమై "పండుగనుండుగ" విస్తృతికలదై పూర్వమహాకవుల సంవిధానముల ననుసరించుచు, మధురముగ, మంజులముగ, జాజిమల్లెతీవవలె సాగిపోయినది.

"ఎంతాపిన" మున్నగువానికి "నిరంకుశాఃకవయః" యను నానుడి యాధారము.

"లలితాలింగనస్మితలలితముగ"— ఒక్కొక్కచో "నారభటి శరధిగ" బొల్చిన కవిశైలి హృదయంగమమై యున్నవి.

మా రాయలసీమలో యక్షగానభారతకవులేకాని, కావ్యభారతభారతిని గైసేసి లోటుదీర్చిన శ్రీఅశ్వత్థరావుగారు సర్వధా ధన్యులు; సర్వదామాన్యులు.

అనంతపురం.
4—8—59

(సం) క. వెంకటనారాయణరావు.

శ్రీ "అభినవతిక్కన" తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు,

అ ప్పి క ట్ల.



పూజ్యులు, మహాకవులు అశ్వత్థరావుగారికి,

వందనములు.

మహాశయా!

మీలేఖ చేరినది. నాయభిప్రాయమును నాల్గుమాటలలో వ్రాసెద.

మీభారతమును చదివితిని. పరమానందము నందితిని, మీరచన ప్రవాహమువలె నడచినది. అన్వయములు సరళములు, భాష ప్రౌఢము; మహాకావ్యమునకుదగినది.

శ్రీసంజీవమూర్తిగారికి లాక్షణికదృష్టి పుష్టి హెచ్చుగానున్నది. మీమైత్రి ప్రశంస్యము.

విధేయుఁడు,

(సం) తుమ్మల సీతారామమూర్తి చౌదరి.



[శ్రీ విద్వాన్ ఉత్తనూరు నారాయణరావు గారు, ప్రథానాంధ్రపండి
తులు, మండల పరిషన్మహోన్నత పాఠశాల, రాయదుర్గము.]



శ్రీ విదురాశ్వత్థేశానుగ్రహ ప్రభవు లైన వరకవులు శ్రీ కలుగోడు అశ్వత్థరావుగారు. భైరవాన్‌తిప్పప్రాజెక్టుక్రింద రెండువందల యెకరముల మాగాణికి వీరు భూస్వాములు. విలువయైన యింతవిస్తారము గల యాస్తి గలిగియు వీరికి గర్వము నాస్తి. అంతేకాదు వీ రాస్తిక శిఖామణులు. సంధ్యానుష్ఠానము, దేవతార్చనము, రామాయణపారాయణముదేవర్షిపితృతర్పణము, కవితారచనము, గ్రంథావలోకనము వీరి దిన చర్యలలో ముఖ్యవిధులు. వీరుత్యాగులు, భోగులు, రాగులు. ఇట్టి యోగులు రోగభాగు లగుటకుఁ గారణము పూర్వజన్మదుష్కర్మము. పలుకు పరుషము; మనము మార్దవము. వీరిభవనమొక సుందర సౌరస్యతోద్యానవనము.

లక్ష్మీ సరస్వతు లన్యోన్య నైజ విద్వేషముల విస్మరించి యిక్కవిశిరోమణి పాణి వాణుల నెలకొని విలసిల్లుట వీరి పురాకృత పూజాఫలము. వీ రాగర్భశ్రీమంతులు. సహజపాండిత్యప్రతిభా సమన్వితులు. బాల్యముననే సౌకుమార్య సౌజన్యధన్య యగు కవితా కన్యచే వరింపఁబడిన పుణ్యులు. పూజ్యశ్రీ కవిభూషణ కప్పగల్లు సంజీవ మూర్తిరావుగారికి వీరికి దేహాత్మ బాంధవ్యము మాత్రమేకాక

కవితాసంబంధసందర్భమునూ సంధించియుండుట పాటింపఁదగిన విశేషము.

శ్రీ సంజీవమూర్తిగారు స్వధర్మానుష్ఠాననిష్ఠాగరిష్ఠులైన బ్రాహ్మణశ్రేష్ఠులు. సహృదయులు; సంపూర్ణారోగ్యముగల మహాభాగ్యవంతులు; విద్యావినయభూషణులు; మనకవిభూషణులు. ఇమ్మహాకవు లిరువురును పూర్వాచారపరాయణులనుటచేఁ జాదస్త్రబ్రాహ్మణులని తలంపరాదు. ఎంతఆచారపరులో, అంత నాగరకతానిపుణులు.

గంగాయమునల సంగమమువలె నీకవిపుంగవుల కవితాతరంగిణుల సాంగత్యము మంగళకరము; ఆనందప్రదము. ఈరెంటిని వింగడించి విమర్శించుట నా కంగీకరింపని పని. విమర్శనమెక్కొకప్పుడు విపరీతార్థముల కెడమిచ్చుటయుఁగలదు, అభిరుచిభేదము, అధికారభేద మందులకు మూలము.

"గంగాస్నానమ్- తుంగాపానమ్." అనునది ప్రసిద్ధార్యోక్తి. కాని గంగాజలము స్నానమునకుమాత్రమె తగినదా? పానమునకుఁ బనికిరాదా? అను ననర్థమున కాస్పదమున్నది. ఒక్కొక శుచి రుచులకుఁ బ్రాధాన్య మీయఁబడినది.

పావనము (మహత్వము)నకు గంగ; పానము (మాధుర్యము)నకు తుంగ యనియే యందలి గర్భితభావము. పావనత్వము తుంగకు లేదని కుయుక్తులు కొనసాగింపరాదు. మహిమమున తుంగకన్న గంగ మిన్నయనియే దాని యర్థము. ఇట్టి శంకాతంకములు విమర్శనలలో వెఱ్ఱితలలు వేయుట సహజము. విమర్శనములు సృష్ట్యాదినుండి జరుగుచునేయున్నవి. సిద్ధాంతరాద్ధాంతములు హద్దుప

ద్దులు మీఱుచునేయున్నవి. కనుక పరీక్షలు 'పనికిరావనికాదు నాయభిప్రాయము. కవితావిమర్శకుని బాధ్యత మిగులగొప్ప' ది. నిష్పాక్షికత, సహృదయత, సత్యదృష్టి, పాండితీప్రతిభలు విమర్శకున కుండవలసిన ముఖ్యమహితగుణములు. విమర్శనాశక్తి తపఃఫలము. సత్కవివలె సద్విమర్శకుఁడును ఋషితుల్యుఁడుఁ గావలెను. అట్లయ్యును పక్షపాత, బుద్ధిదోష పిశాచముల బారినుండి తప్పించుకొనుట దుస్తర మనియే నా యభిప్రాయము. ఇట్టుండ నావంటి సామాన్యవిమర్శకున కాభయము సహజము.

ఈ కవిద్వయమునందు నాకు గౌరవప్రతిపత్తులు మిక్కుటములు. కనుక ఈసంగడీఁడుల కవిత్వసౌంగత్యమును వింగడింపక మొత్తముగ నీ మహాకావ్యమును గూర్చి నాయభిప్రాయ మొకింత వ్యక్తపఱచుచున్నాఁడను.

శ్రీ వేదవ్యాసకృత జయనామ మహాభారతమునకు స్వతంత్రానువాదము కవిత్రయాంధ్రభారతము. దానిని మూలముగాఁగొని సల్పిన స్వతంత్రానువాదము "ఆశ్వత్థభారత" మహాకావ్యము. ఇయ్యది ప్రకృతకవిద్వయ మహితకవితాకళోపాసనాసంసిద్ధి సాక్షాత్కారము. పూజ్యాంధ్ర కవిత్రయ పరమానుగ్రహ ప్రతీకము. అశ్వత్థభారతాంతర్గతకవిత్వ మయ్యెయ్యెడల మహామహీధరాగ్రనిర్గతనిరర్గళ రమ్యగంభీరజలప్రపాతము. కొన్నితావుల నది ప్రకృతిశోభారంజిత సువిశాలసమప్రదేశగామిని యగు శాంతసుందరవాహిని. పద్యములు హృద్యములు. భావగర్భితములు. అన్వయకాఠిన్యరహితములు, సరళ సుందర సమాసోపేతములు. దేశ్యపదము లుపొందిక పసందై వీనుల

పిందొనర్చును. కావ్యమాద్యంత మకుంఠితధారాబంధురము. ఎడ నెడ ప్రతిభా పౌండితీ ప్రత్యేకతలు ద్యోతకములు. తెలుఁగుబాసయందలి యింపుసొంపులతో. జిగిబిగువులతో. నిండలి కైత కమనీయమై మహనీయమై మాధురీమయమై సర్వకాలీనమగు భారతమహాకావ్య స్వరూపమై ఆంధ్రసారస్వతసర్వంసహావలయమున వెలయఁగల్గినది.

రాయలసీమ కవిరత్నములసీమ. ఆంధ్రప్రబంధకవితా శామాలలామ సువిలాసవిస్ఫురణముగ నాట్యమాడిన కళారామము. ఇట్టిరాయలసీమ వాఙ్మయక్షేత్రమున అశ్వత్థభారత మహామహీరుహము ప్రభవించుట తత్సీమవాసుల గర్వకారణము. ఇమ్మహాకావ్యమును, తత్కర్తలగు మహాకవిద్వయమును గన్నరాయలసీమామతల్లిధన్యురాలు. ఈ పూజ్యకవిద్వయమునకు – వారిమహాకావ్యమునకు నా నమోవాకములు.

శ్రీ శుఁడు వీరికి సంపూర్ణాయురారోగ్యభాగ్యముల నిచ్చి రక్షించుఁగాత!!

ఇట్లు
విద్వద్విధేయుఁడు
ఉత్తనూరు నారాయణరావు.

రాయదుర్గము.
5-12-1960



—: శ్రీనివాస ప్రసీద :—

# విజ్ఞప్తి.

"పూజ్యాయరాఘవేంద్రాయ సత్యధర్మరతాయచ!
భజతాంకల్పవృక్షాయ నమతాంకామధేనవే"!!—

శ్రీ అశ్వత్థభారతావతరణమునకు గారణము:— కవిత్రయము వారి— అందును "దిక్కన"గారి "మహత్వకవిత్వపటుత్వసంపద"ను నేను జవిమరిగిన ప్రభావమే యనుట సత్యసమ్మతమైనమాట, అంతకుమున్ను, ఆంధ్రమహాభారతమును అంతగ— అర్థవంతముగఁ జదివి చొక్కవడిన భాగ్యవంతుఁడను గాను.

ఒకవివాహసందర్భములో— భూపసముద్రగ్రామమునకు బంధుమిత్రులతోఁబాటు శ్రీ "కవిభూషణ" కప్పగల్లు సంజీవమూర్తి రావుగారును వచ్చియుండిరి. మిత్రులకోరికపైన వారు ఆంధ్రమహాభారతమున విరాటపర్వమును దమ మృధుమధురకంఠముతోఁ జదివి సదస్యుల ముగ్ధులఁగావించిరి.— కవిభూషణుని రసనాగ్రమున నటించెడు ఎట్టిపద్యగద్యమైనను శ్రోతలశ్రుతిపుటంబులఁ దేనెయూఁటలఁ జింది, డెందములకు విందుల నందించును. ఆకళలో— నారితేఱిన వారిలో వారొకరు.

కవిత్రయమువారి కవిత— కవిభూషణుని "గమక"— కళద్వయమకరందపానమత్తమన్మనోభృంగజృంభిత ఝంకారనిసదవ్యాఖ్యానమే అశ్వత్థమహాభారతోపాఖ్యానము!—

మా కవిభూషణుని ప్రోత్సాహము, నా ఉత్సాహము,— ఋషితుల్యులగు శ్రీమాన్ రాళ్లపల్లిఅనంతకృష్ణశర్మగారి వాత్సాల్యపూర్ణాశీర్వాదము,— శ్రీకృష్ణ— కన్నడకుమారవ్యాసభారతముల ఉపబలము,— శ్రీమదాంధ్రమహాభారతమూలబలము— కవిత్రయమువారి అనుగ్రహము; నా అనుకరణము; అనుసరణము అశ్వత్థభారత ప్రథమచతుష్టయ పర్వపూరణము! !—

మూర్తిత్రయ మనదగు కవిత్రయమువారి అమోఘము— అనర్ఘము నగు భారతమునందువలె నూత్నోన్నతభావములు— క్రొంగ్రొత్తపోకడలు రచించుట సృష్టిలోని తదితర కవిస్రష్టలకు గానిపని!— కనుక, చాలవఱకు వానికే నాభాష దొమగఁ గడఁగితి,— అమ్మహనీయులున్న "మక్కికిమక్కి"గగాక, వ్యాసులవారిభారతముమూలముగ, ఎంతవఱకో అనుకరించి, అనుసరించియుందురు. కాని, అది విశ్వసాహిత్య స్వతంత్రమహాకావ్యము!— అశ్వత్థభారతమునకు మూలము శ్రీమదాంధ్రమహాభారతము!!—

శ్రీవిదురాశ్వత్థనారాయణుఁడు నాజన్మప్రదాత!— ఆస్వామినిందు నాందిలో— ముందుగ ధ్యానించితిని. శ్రీరామచంద్రుని— నాయారాధ్యదేవుని మనసాస్మరించితిని. శ్రీవేంకటేశ్వరుఁడు మాయింటిదేవుఁడు. ఆతని కిది అంకితముచేసితిని. శ్రీగురురాఘవేంద్రులు గురులకుగురువులు. నిజభక్తకోటిపాలిటి కామగవి కల్పవృక్షములు!!—

మంత్రాలయములో— నాకుఁగలలో గనిపించి కటాక్షించిన కరుణా సింధులు— వారి నిందు భక్తిభావనలఁ బూజించితి. "గానకళాప్రపూర్ణ" శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు పవిత్రఋషులు— సరసశేఖరులు— సంగీతసాహిత్యవిమర్శకళాప్రపూర్ణులు. నాకు వారియెడ భక్తిమెండు! వారికి నాయెడ వాత్సల్యము నిండు!!— శ్రీవారినిఁ దలఁచితి. నా కవితాగురువు, బంధువు, "కవిభూషణ" కప్పగల్లుసంజీవమూర్తిరావుగారి గుణమెంచితి. నావంశాదికమును వివరించితి. మిత్రులసందేహమును— నాసమాధానమును బొందుపరచితి. ఇదియే యిందలి నాందిప్రస్తావనంపు బరమార్థము.

అప్పుడప్పుడు నేను "బలారి" నగరమున కేగినపుడు— మా "కవిభూషణ" సంజీవమూర్తిబావగారికి, నాసలిపినంతరచన విని పించుచుండెడివాఁడను. అతఁడును ఆకర్ణించి ఆదరించుచుండెడివాఁడు. అట్లు ప్రారంభమునుండి సభాపర్వప్రథమాశ్వాసాంతమువఱకు జరిగినది.—— అదేమికారణమోగాని, ఆక్కడినుండి నారచన ముందంజవేయలేదు. ఇట్లు మాసత్రయము గడచినది. అటుపై నొకనాఁడు— ఒకపనిపై బళ్లారికిపోయియుండి, మాకవిభూషణునితోఁ గలిసితిని— ముచ్చటలు, మురిపెములు ముగిసినమీఁదట "నీభారత మెంత వఱకు నడచినది"? అని అతఁడడిగెను.— "నీవువిన్నంతవఱకే" అంటిని.— అతఁడు చిఱునవ్వుతో— "ఐతే, ఇదివిను!" అని, ఒకవ్రాఁత ప్రతినిఁ గొని చదువమొదలిడెను. నేను విస్మయుఁడనై వినఁదొడఁగితిని. అది "ద్రౌపదీమానసంరక్షణ" భాగము. నారచనతుదినుండి అది మొదలిడఁబడినది. "ఏమాశ్చర్యము?" అంటిని.— "నేనుప్రయ

త్నించి వ్రాసినదికాదు. నీ రచనవిని నారచనవస నింత చూతమని- అప్రయత్నముగ దొరలివచ్చినదానినే కాగితముపైనుంచితిని" అనెను. "నాభారతమునకు దీనిఁ దీసికొనవని" మ్మంటిని.- "నీ రచనకిది వచ్చు నా"? అనెను- "మెఱుఁగిచ్చు" నంటిని.- "ఐనఁ గొననిచ్చగింతువా?" అనెను. "కృతజ్ఞతతో"- నంటిని.- "నీపేరనే ప్రకటించుకొనుము" అని దాని నా కొసఁగెను- "అది నాకనిష్టము! మీపేరనే ప్రకటింతును" అని, సెలవుఁగొని వచ్చితిని.

అశ్వత్థభారతము క్రమాభివృద్ధి నొందుచు అరణ్యపర్వమునఁ గూడఁ గొంతరచన నొగించుకొన్నది. నన్నయగారి రచనాంతపుపట్టును దాదియును ఏగినది. ఒకనాఁడు నే నక్కడినుండి రచన కుపక్రమించఁగా అకస్మికముగనా బలభాగమున పక్షవాతము పట్టినది.- "ఆయెం బోయె" ననిపించినది. దేవునిదయవలన- పెద్దల ఆశీర్వాదమువలన- వైద్యులచికిత్సవలన_ "ఆయెఁబోయె" నన్నట్లు అదియును అరిగినది. కాని, అంతరాయములేక నుడువుటకు- కొంత నడచుటకు- సుంత వ్రాయుటకు మాత్రము నాకు బలముకలిగినది. ఇప్పటికిని అంతే;- ఈయవాంతరములో, నాఫలినే నాభారతమును మూలఁబట్టినది. దీనికిఁదోఁడు బంధుమిత్రులు నన్నయగారికథ జ్ఞప్తికిఁదెచ్చి భీతిఁగొల్పుటయు జరిగినది. ఈవిరామకాలములోనె గీత- ఉత్తర గీత మున్నగు నాచిన్నచిన్న రచనలు అవతరించుటకు అవకాశమును గల్గినది!—

ముందురచనను స్వస్తిఁజెప్పితిని. కాని, అంతవఱకు వ్రాగిన నా భారతమును ముద్రింపవలెనను ఉబలాట నాతల నుఖ్యాత

లూఁపఁ జొచ్చినది. కొందఱు మిత్రులసహాయమునను— రాగులపా డు శ్రీ కరణంఅప్పాజీ నరసింగరావు,— శ్రీ నింబగల్లు కొంకావీరప్ప— శ్రీ రాయంపల్లి యన్. సి. శేషాద్రి, యం. యల్. ఎ.— శ్రీ ఉరవ కొండ ముద్దలాపురం రామప్ప— శ్రీ పాకం చిన్న వెంకటరాములు— చి॥ శ్రీ గౌరానారాయణప్ప— నాఆప్తమిత్రుఁడైన వృప్పశెట్టియల్లప్ప పుత్రుఁడు చిరంజీవి శ్రీవీరణ్ణ— వీరలవాక్సహాయమునను గొంతధనము ను లభించినది. ఆదాతలపేర్లపట్టిక ఇందు ముందు ప్రకటింపఁబడి నది. ఆసహృదయసంపన్నులకు నాహృదయపూర్వక వందనములు. రాయదుర్గం "జడేసిద్ధేశ్వర" ముద్రాపకులు గ్రంథముద్రణకుఁ గుది రిరి; ప్రారంభించిరి.— కాని, పీఠికమాటయేమి? భారతమువంటి మ హాగ్రంథమునకుఁ బండితపరామర్శాత్మక మగు పీఠిక లేకపోవుటా?— నాఁటికి నేఁటికి ప్రాచీనార్వాచీన ప్రసిద్ధగ్రంథములును విమర్శక పక్ష ప్రతిపక్ష సిద్ధాంత రాద్ధాంతములకుఁ బాల్పడుట, సభా పత్రికా ముఖముల మనము సమీక్షింపుచుండుట లేదా?— మహామహాకవు లును విఖ్యాతవిమర్శకుల ప్రశంసనీయ పీఠికాభిప్రాయాదులకై ప్రాఁకులాడుచుండుటలేదా?— లోకోపకారదృష్టితో— నిష్పాక్షిక సమీ క్షగంధబంధుర సుందర మందారకుసుమమాలికల సత్యసరస్వతీకంధ రసీమ నలంకరించి దక్షులు యారాధించుచుండుటఁ గనుటలేదా?— అట్టి భాగ్యము నాగ్రంథమునకు వలదా? ఇట్టి తలంపులు నాలో వెట్టితలలు వేయఁదొడఁగినవి.

వెంటనే వ్రాఁతప్రతులు వ్రాయించి— వినయవిజ్ఞప్తులతో— ఉద్దండపండితులకుఁ బంపుకొంటిని. "ఈకొంచెమునకుఁ బీఠికయేమి?"

గ్రంథముముగిసినమీఁదట ఆమాట" అని, శ్రీరాళ్లపల్లివారువ్రాసిరి. "త్రికబొత్తిగాలేదు; పెద్దలనడుగుఁడు" అని వ్రాసియు, అభిప్రాయ ముఁగూడవ్రాసి శ్రీవేలూరివారు పంపిరి.- "మహాకవి" శ్రీగడియార మువారు "క్రొత్తకవులకు అభిప్రాయములుగాని, లబ్ధప్రతిష్ఠులకు మీకేల? ఆశ్రమమాకేల?" అని, కణేకల్లులో- సారస్వతసభలో కలిసి నప్పుడు ఛలోక్తిగా సెలవిచ్చిరి.- పూజ్యులు విఖ్యాతవిద్వద్వరేణ్యు లు, ప్రతిభాపూర్ణులు అగు బ్ర!శ్రీ॥ "కవిసామ్రాట్" విశ్వనాథసత్యనా రాయణగారును, ఆంధ్రవిశ్వకళాపరిషదాంధ్రభాషాశాఖాధ్యక్షులు ఆచార్య శ్రీ జి. జె. సోమయాజులుగారును దయామతితో దివ్యపీఠికా సమీక్షలు ప్రసాదించిరి. అమ్మహనీయ సుకవిబంధులకు నా వందన శతంబులు.—

రాయదుర్గమునకువచ్చియుండి- బ్ర॥ శ్రీ॥ "శతావధాని" ఉప్పల వేంకటశేషశాస్త్రిగారు నాభారతమును సాంతముగ నాలకిం చి- స్వీయగద్యపద్యాత్మ కాభిప్రాయము నొసంగుచు- "అరణ్య పర్వశేషమును- అభిమన్యువివాహముతో విరాటపర్వాంతముగ, మీ భారతము- మంగళాంతముఁజేయుఁ" డని సెలవిచ్చిరి. మా కవి భూషణుఁడును అట్లే ప్రోత్సహించెను. ఆప్రబోధమే- నాయం దా శాంకురమై "ఇంతింతై" భావాకాశముదాఁక విస్తరింపఁజొచ్చినది. అంత నేను సుంతచింతించి, తిరుపతికిపోయి మాన్య శ్రీ "గానకళా ప్రపూర్ణ" అనంతకృష్ణశర్మగారియింటనే బసచేసి ఒకదినముండి— కొండపైకేగి, శ్రీనివాసునిదర్శించి (9-3-57 శనివారము) ఆ మా ఇలువేల్పునకు అంకితపద్యములు వినిపించి, మనసార్పించి-

ముందురచనకు అనుజ్ఞ నర్థించి అంతరాత్మతృప్తుఁడనై 3-4 దివసము లక్కడనే- దేవుని సాన్నిధ్యమున స్వస్థమతి నుండి- క్రిందికి వచ్చి, మా శ్రీశర్మగారి సంగీతసాహిత్యవిమర్శకళాసుధాలహరిలో మున్కలిడి- ముదితుఁడనగుచు- 'తఱిదొరకినప్పుడు నాభారతము నందందు వినిపించి- ముందఱిరచనాభిలాషఁ దెలిపి, వారియాశీర్వాదమునందితిని.

19-3-57 మంగళవారము రాయదుర్గమునకు వచ్చి కృతిభర్తయగు శ్రీవేంకటేశ్వరుని దర్శించి- అంకితపద్యముల నర్పించి- ముందురచనకు మార్గ మర్థించి- గ్రామముఁజేరి నాభారతపూరణమునకు మొదలిడితిని. అంత నిరంతరాయముగ- విరాటపర్వాంతమువఱకు- నాసంకల్పము మేఱకు రచన శరవేగమున సాగినది. మఱల నాయనారోగ్యస్థితివలన అఁగినది. నాకోరికయు నెఱవేఱినది!- 8-9-58 తేది మఱల నేను తిరుపతికిపోయి పర్వచతుష్టయముద్రిత అశ్వత్థభారతప్రతిని శిరసావహించి, స్వామిగట్టెదుట అంకితపద్యములు చదివి సమర్పణముచేసి, శ్రీరాళ్లపల్లివారినిదర్శించి రెండుదినములందుండి వచ్చి అట్లెరాయదుర్గముశ్రీనివాసులసర్చించి గ్రామముఁ జేరితిని.

కాని, కవిసామ్రాట్టులయొక్కయు, గంటివారియొక్కయు, పీఠిక లసమగ్రములగుట సమగ్రపీఠికకై శ్రీరాళ్ళపల్లివారిని, శ్రీ విశ్వనాథవారిని అచ్చుపొత్తముల నంపుచుఁ బ్రార్థించితిని. రాళ్లపల్లివారు- "ఈవయసున- ఇప్పటినాఅనారోగ్యస్థితిలో మూఁడువేలకు శ్లోకసగలపద్యములు సావధానముగ చదివి పీఠికవ్రాయుట కానిపని.

యనియు, పీఠికాభిప్రాయము లనావశ్యకము లనియు- వ్రాసిరి. తుదకు నాప్రార్థనాబలవంతముపై అభిప్రాయమునుమాత్ర మను గ్రహించిరి— శ్రీ విశ్వనాథవారు తొలుత "అనివార్యకార్యములున్నవి, సౌధ్యములేదు" అని వ్రాసియు, మఱల నాప్రార్థనపై ఎట్లో అంగీ కరించిరి కాని, కొంతవడికి- తాము కరీంనగరుకాలేజికి వెళ్ళుచున్నా మనియు- క్రొత్తఫక్కిలో మీభారతమునకుఁ బీఠిక వ్రాయనుంటిమ నియు,- ఈబదిలీలో ఆపని యెంతమాత్రము జరుగఁజాల దనియు, వలసినచో- తొలిపీఠికనే ముద్రించుకొనవచ్చు ననియు,- వ్రాయుమ ని నాకుచిరపరిచితుఁడైన, బెజవాడలో చదువుచున్న- శ్రీవారి శిష్య కోటికిఁ జేరిన "కిశోర్" శ్రీ పి. తిమ్మారెడ్డికి తెలిపి, వారు కరీంనగరుకు వెళ్ళిరఁట- ఆచిరంజీవి నా కావివరములు వ్రాసెను. తుదకు సహృ దయశిరోమణులు బ్ర॥ శ్రీ "విద్వత్కవిభూషణ- విద్వాన్" వేదము వేంకటకృష్ణశర్మగారు నావిన్నపమును మన్నించి, శ్రమయనక గ్రం థము.నామూలాగ్రముగ పఠించి, సమగ్ర పీఠికవ్రాసి, నావంతఁదీర్చి వందనీయులైరి.

ఆంధ్రప్రదేశ్ఆస్థానకవులు శ్రీ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి కవిసార్వభౌములు 1953వ సం॥రం అలంపూరు సారస్వతసభలకు విచ్చేసియుండి, నాప్రార్థనపై దర్శనసంభాష ణావకాశముఁ గల్గించి నాభారతమున నొకటిరెంకుఘట్టములు విని- ఆశీర్వదించి అభిప్రాయ పత్ర మనుగ్రహించిరి- విమర్శకాగ్రేసరులు శ్రీ సందూరి బంగా రయ్య (బి. ఎ. బి. యల్. అడ్వకేటు) గారు- నామనవిని మన్నించి పక్షవాతముచే మంచముఁబట్టియుండియు, నాగ్రంథమును సొంతముగఁ

దిలకించి- విమర్శనాత్మకమగు అభిప్రాయమునొసంగి ఆదరించిరి- "అభినవతిక్కన" శ్రీ తుమ్మలసీతారామమూర్తిగారు - కల్యాణదుర్గ సౌరస్వతసభకు వచ్చియుండి - నాభారతము నింతవిని - సంతసించి తమయమూల్యాభిప్రాయము నను గ్రహించిరి. రిటైర్డుకలెక్టరు శ్రీ బి. జూగప్ప ఐ. ఎ. యస్. గారు,- జిల్లావిద్యాశాఖాధికారి శ్రీ పి. శరభాచార్యులు (శతవధాని) బి. ఎ. యల్. టి. గారు,- విద్వత్కవులు "కవిత్వవేది- బోధార్షేందు" బ్ర|| శ్రీ|| కల్లూరి వేంకటనారాయణరావు యం. ఎ. యల్. టి. గారు,- మహోపాధ్యాయాది మహామహాబిరుదాంకితులు శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు,- చారిత్రకపితామహులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు,- బ్ర|| శ్రీ శతావధాని ఉప్పల వేంకటశాస్త్రిగారు,- శివభారతమహాకావ్యకర్తలు, "మహాకవి- కవితావసంత" శతావధాని శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రి గారు,- "అభినవకాళిదాస- మధురకవి" శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి గారు,- ఆంధ్రకర్ణాటకకవికేసరి, రెడ్డి శ్రీ భీమరాయగౌతమగారు,- "సాహిత్యరత్న- సరసకవి- అధివక్త" శ్రీ మోచర్లరామకృష్ణయ్య "అడ్వకేటు" గారు,- మైసూరు విశ్వవిద్యాలయాంధ్రభాషాశాఖాధ్యక్షులు శ్రీ కె. సుబ్బరామప్ప యం. ఎ. బి. ఇడి, గారు,- "విద్వాన్, విశారద" బాలకవిభూషణ" శ్రీయుత ఆలూరు కె. హెచ్. సత్యనారాయణరావు గారు,- మదరాసు విశ్వవిద్యాలయాంధ్రభాషాశాఖాధ్యక్షులు శ్రీమాన్ "విద్యారత్న" నిడుదవోలు వెంకటరావు (ఎం. ఎ.) గారు,- "మహాకవి- సరస్వతీపుత్ర" శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు,- "మహామహోపాధ్యాయ, విద్యావారిధి, అవధానశిరోమణి" వేదమూర్తి

మధ్వశ్రీ కాశీకృష్ణాచార్యులవారు,— ఉత్తరప్రదేశగవర్నరు రాజశ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు— ఈ ప్రముఖ పండితాగ్రగణ్యులు, అడిగినంత అభిప్రాయములు వ్రాసిపంపిరి— అవ్యాజకరుణతోఁ దమ యమూల్యకాలమును నాగ్రంథమునకై వెచ్చించిన పీఠికాభిప్రాయ ప్రవాతలను అశక్తుఁడనగునే నెట్లు సముచితరీతి గౌరవింప నేర్తును?- సారస్వతారాధన దీక్షులగు నీదక్షులు గౌరవప్రతిఫలముల నాశింతురా? నాకుఁ గృతఘ్నతాపాపము సోఁకకుండుటకై అమ్మహనీయులకు మనసా నమస్కృతు లర్పించెదను,-

ఆలూరు ఆంధ్రసారస్వత మహాసభలో నాకు "కవిరాజ" బిరుద మిప్పించుటకు శాయశక్తుల సాహసించిన మిత్రులు "విశారద- విద్వాన్" శ్రీ కరిచేడు హేమాద్రి సత్యనారాయణరావుగారి అని మిత్రప్రేమతో- స్వపరముగాఁ జోస్యడి అనుగ్రహించిన "మహాకవి" బ్ర॥ శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రులవారి ఉపాసనమును, గుణగ్రహణపారీణతను, ఈసందర్భమున స్మరింపకున్న నా ఈ విజ్ఞప్తి పరిపూర్ణత్వమునొందదు. విమలప్రవాతలగు ఉదితపయోమాన్య కవిపండితప్రకాండులెల్లరకు— అప్పుడుండిన మిత్రబృందమునకు ఇందుమూలముగఁ గృతజ్ఞతాభివందనసమర్పణము సలుపుచున్నాఁడను.

ఈ ముద్రణలో కంప్యూలుకంప్యూలుగాఁ దొరలిన తప్పులు, శుద్ధప్రతితయారుచేసిన స్నేహితులపైనను,- వ్రాతప్రతిని పరిష్కరించి యిచ్చిన మిత్రులపైనను.- ముద్రాపకులమీఁదను, అచ్చుతప్పులు దిద్దిన అష్టులమీఁదను మోపి, అశాంతినొప్పనిచ్చునటులనిచ— కన్నుగానని సోమరితనమున- పనిఁజెప్పుకొని పలవింపు నన్ను నేను నిందింపు

కొనుటకంటె గత్యంతర మేమున్నది?- ఇదేటిమాట? నిరాశ నిర్వీర్యత నాపాదించును!- పండితులు. పాఠకులు, సహృదయులు; గుణగ్రహణ పారీణులు! అమ్మహనీయులకు నా అంజలులు!!-

అచ్చుతప్పుల గుఱించి అగాధముగ నాలోచించుచుండఁగా- నా మేనల్లుఁడు చిరంజీవి శ్రీ గొల్లపల్లికరణము నరసింగరావు- ఆభారమంతయుఁ దానే వహింతునని వచనమిచ్చి- కళాశాల సెలవులలో పినతమ్ములు (పినతండ్రికొమారులు) చిరంజీవులు:- ప్రహ్లాదరావు, బి. ఎస్. సి., భీమసేనరావు బి. ఎస్. సి., ఈ సోదరద్వయమును నన్నును తనస్వగృహమందుఁ జేర్చి- సకలసౌకర్యములు సమకూర్చి- దాదాపు మాసద్వయము- మమ్ము మృష్టాన్నపానసంతుష్టులంజేసి- అశ్వత్థభారతప్రతు లన్నింటియందును అతికింపులుఁ దిద్దులు జరిపించి నన్నలరించెను. ఆచిరంజీవి త్రితయమునకు నా నిండు దీవనలు!.

అప్తమిత్రులు, రాయదుర్గము, మండల పరిషన్మహోన్నతపాఠశాలా ప్రధానాంధ్రోపాధ్యాయులు విద్వాన్, శ్రీ వి. నారాయణరావుగారు ముద్రణా స్ఖాలిత్యములు దిద్దుటలోఁ గొంతవఱకు పాల్గొని, గ్రంథముపై అభిప్రాయమును గూడ నొసంగిరి. వారికి నా అభివందనములు.

ఈ నా భారతగుణాగుణములు ప్రసిద్ధపండితులు పీఠికాదులందు సమీక్షించినారు. పత్రికలుఁ, ఐతిహ్యలోకము, సహృదయ విమర్శకబృందము పరామర్శ పరిశీలనములు జరుపును. ఇఁక నే నేమి విశేషించి వాకొనఁగలను?- "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన" అను గీతాచార్యుని యాదేశమును దృఢముగ నమ్మి- కర్మమును (కృతిని) కర్మఫలమును శ్రీనివాసునకు సమర్పించి- కవి

నాయకునకు పురస్కృతి తిరస్కృతులు తప్పనిసరి యని నిర్ధరించి- ఆరెంటిని నొకటిగాఁజూచు ప్రజ్ఞ నొసంగు మని భగవంతునిఁ బ్రార్థించి- "లోకాస్సమస్తా స్సుఖినోభవంతు" అని త్రికరణములఁ గాంక్షించి,- నా ఈ విజ్ఞప్తిని విరమించుకొనుచున్నాఁడను.

కలుగోడు.
శార్వరి,
వినాయకచతుర్థి.

ఇట్లు సజ్జన విధేయుఁడు
క. అశ్వత్థరావు,
గ్రంథకర్త.



☞ సవరణల పట్టిక ఆయా పేజీలక్రింద ముద్రింపబఁడినది. ప॥ పద్యము;- పా॥ పాదము;- అ॥ అక్షరము అని గుర్తింపవలెను. ఆయాచోట నుండు అక్షరములకు బదులు ఈ సవరణాక్షరములను చేర్చుకొనవలయును. అక్షరము క్రింద- (అడ్డగీత) ఉన్నచో ఆపైయక్షరము కొట్టివేయఁబడినదని గ్రహింపవలెను.

అశ్వత్థభారతమునకు ధనసహాయమొనర్చిన దాతలు:—

రు. 116-00 శ్రీ పోసిన వెంకటరెడ్డి, రాగులపాడు. } స్వ పరహస్తములతో—
శ్రీ కరణంఅప్పాజీ నరసింగరావు.

రు. 116-00 శ్రీ వెంకటరామరావు, చీకలగుర్కి.

116-00 ,, బి. కె. రమణప్పశ్రేష్ఠిగారు, బెస్తరపల్లి.

100-00 ,, జయంతి రామచంద్రప్ప శెట్టి అండ్ బ్రదర్స్, రాయదుర్గం.

100-00 ర్యాకట్లగ్రామం నుండి.

50-00 శ్రీ దేవినేని పెద్దరామప్ప, రేణిమాకులపల్లె.

50-00 ,, ఊరువాకిలి సంజీవప్ప, వెంకటమ్మపల్లె.

50-00 ,, కూరాకుల హనుమంతప్ప, వెంకటంపల్లె.

40-00 ,, ఉప్పుశెట్టి వీరణ్ణ, (తనతండ్రి యల్లప్పకు) కలుగోడు.

40-00 ,, కొంకా ఈరప్ప, (స్వపరముగా) నింబగల్లు.

40-00 ,, నిడుగల్లు గోవిందప్ప, తురకబొమ్మపల్లె.

30-00 ,, కరణం రామరావు, (నేత్రపల్లి గ్రామమునకు)

30-00 ,, కరణం విరుపాక్షప్పగారు, కల్యాణదుర్గం.

30-00 ,, యస్. యస్. వీరభద్రాచారి, కలుగోడు.

25-00 ,, పలకలగోవిందప్ప, మైసూరు.

25-00 ,, కరణం రామరావు, కొత్తపల్లి.

25-00 ,, సొప్పేమల్లికార్జునగౌడు, కలుగోడు,

25-00 ,, చిందనూరు నాగప్ప శెట్టి రాయదుర్గం.

---

రు. 100-00 శ్రీ రాచేపల్లి గోవిందప్ప, వెంకటంపల్లి.

25-00 శ్రీ పెరుమాళ్ చనమల్లప్ప కొ॥ పెద్దవీరణ్ణ, రాయదుర్గం,
25-00 ,, పటేలు వై. తిమ్మప్పగారు, తురుకబొమ్మపల్లి.
20-00 ,, ళక్కా చిన్నపరెడ్డిగారు, కణేకల్లు.
20-00 ,, జయంతి గోవిందప్పకు (కొ॥ రామచంద్రప్ప) రాయదుర్గం.
20-00 ,, కోదండరామాచార్లు, బేలోడు.
20-00 ,, కామవరం సూర్యనారాయణ (P.W.D.) ఆల్లవరం.
20-00 ,, ముద్దాపురం రామప్ప, ఉరవకొండ.
20-00 ,, పాకం యర్రెప్ప బ్రదర్స్ ఉరవకొండ.
60-00 (యితరులతో) శ్రీపాకం చిన్నవెంకటరాములు, ఉరవకొండ.
20-00 శ్రీ నెలపాటి చంద్రప్ప, నింబగల్లు.
20-00 ,, రాచేపల్లి తిమ్మప్ప, వెంకటంపల్లి.
15-00 ,, సిడుగల్లు దానప్పగారు, తురుకబొమ్మపల్లి.
15-00 ,, ముత్యాల సిద్దప్ప, గొల్లపల్లి.
10-00 ,, గోవిందరెడ్డి, కొత్తపల్లి.
10-00 ,, రా. తిప్పయ్యశ్రేష్టి, బెళగుప్ప.
10-00 ,, పా॥ హనుమంతరెడ్డి, పల్లేపల్లి.
10-00 ,, కరణం నరశింగరావు, జాజరకల్లు.
10-00 ,, కరియప్ప సన్స్, ఉరవకొండ.
10-00 ,, దేశంశెట్టి భీమప్ప, రాయదుర్గం.



# విషయానుక్రమణిక.



ఆదిపర్వము-: చతుర్థాశ్వాసము.



సభాపర్వము- ప్రథమాశ్వాసము.



సభాపర్వము- ద్వితీయాశ్వాసము,

సభాపర్వము — తృతీయాశ్వాసము



అరణ్యపర్వము — ప్రథమాశ్వాసము

ఆరణ్యపర్వము — ద్వితీయాశ్వాసము,



అరణ్యపర్వము — తృతీయాశ్వాసము



అరణ్యపర్వము — చతుర్థాశ్వాసము



శ్రీవైకుంఠమునందు బోలెఁ గలిలో శ్రీకాంతతో నిచ్చలున్
భూవైకుంఠము తిర్పతిన్ వెలయువే పూజ్యుండవై! యావిధిన్
భావంబందు భజించు భక్తులకు సర్వాభీష్టముల్ గూర్పవే?
సేవింతున్ నిను రాయదుర్గనిలయా శ్రీవేంకటేశప్రభూ!

-: శ్రీ రామచంద్రాయ నమః :-

# అశ్వత్థ భారతము.

## నాంది ప్రస్తావనము.



శ్రీవాణీశుఁడు మూలమందు; నడుమన్ శ్రీనాథుఁ; డగ్రంబునం
దావాసింప శివుండు; భక్తతతి యత్యంతంబు భావించి సం
సేవింపన్ "కలి" యందుసర్వశుభముల్ సేకూర్చుమూర్తిత్రయిగా
భావన్, మజ్జనప్రదా[illegible], విదురాశ్వత్థేశుఁ బ్రార్థించెదన్. 1

కూరిమి నారసి శుభములఁ
గూర్పప, విఘ్నములఁ జెఱుపఁ గొలిచెద నియతిన్
భారతి, మాసతిఁ, బార్వతిఁ
దీరుగ శ్రీగణపతిన్, సతీశివసూతిన్. 2

### * ఇష్టదేవతా ప్రార్థనము *

శ్రీమత్ సంక్షేపాత్మక
రామాయణమును దినంబు శ్రద్ధాభక్తి
ప్రామాణ్యతఁ బారాయణ
నేమము గలనేను రాము నెమ్మిఁ దలంతున్. 3

### * వేదవ్యాస స్తుతి. *

శా. వేదంబుల్ విభజించి, శాస్త్రతతి సంవేద్యంబుఁ గావించి, యా
మీఁదన్ బంచమవేదసద్రచన ధీమించంగ సాగించి, స
మ్మోదం బారఁగ "గీతఁ" జేర్చి, పరితల్ ముక్తిన్ గనం జూచుచు
ర్యాదన్ బోయిన బాదరాయణుఘనున్ బ్రార్థింతుఁ సత్యార్థినై

తే. ఆదికవివర్యు వాల్మీకి నభినుతించి,
కాళిదాసాదిసంస్కృతకవివతంస
బృందముఁ దలంతు, శబ్దార్థ మెసఁగి రసము
మించ మత్కృతి, నన్ను దీవించుఁ డంచు.

### * ఆంధ్రకవిస్తవము. *

సీ. శబ్దానుశాసను సంస్తవ మొనరించి,
వలఁతిఁ గవిబ్రహ్మఁ దలఁచి కొలిచి,
భక్తియుక్తిఁ బ్రబంధపరమేశ్వరు నుతించి,
సహజపాండిత్యుని సంస్తుతించి,
రంగనాథునియశఃప్రాభవంబు గణించి,
భాస్కరు నెమ్మదిఁ బ్రస్తుతించి,
కవిసార్వభౌమునిఁ గైవార మొనరించి,
సోమభీమనల సంస్తుతు లొనర్చి,
సూరన, మారన స్తోత్రంబుఁ గావించి,
కవితాపితామహు గణుతిఁ జేసి,

తే. రాయలను, ముక్కుతిమ్మన, రామకృష్ణ,
మూర్తిసుకవుల ధ్యానించి, మొన్న నిన్న
చన్నమత్కవులజుల నెంచి, యున్న, పుట్ట
నున్నకవులకు గేల్మోడ్చి విన్నవింతు :— 6

సీ. రాజి "అనంతపురము" జిల్లు; రాయదు
ర్గమ్ము తాల్లూకు; కల్లుగోడు
గ్రామముకరణము; బ్రాహ్మణ వర్ణము
సాధ్విలక్ష్మాంబిక జనని — ఘనుఁడు
వెంకోబరాయండు పిత; మధ్వరావు, గుం
డూరావు లగ్రజుల్ చేరిరి దివి;
మధ్వమతస్థుఁడ, మంత్రాలయస్వామి
శ్రీగురురాజాంఘ్రిచింతనుండ;
రూఢవసిష్ఠగోత్రుఁడ, నాశ్వలాయన
సూత్రుండ, విబుధశుశ్రూషకుండ;
శ్రీవిదురాశ్వత్థ దేవనారాయణ
స్వామిప్రసాదైకసంభవుండ;
అలక్రీస్తుశక నిర్వదనశతాబ్దము (25–7–1901)నఁ; బ్ల
వాధికాషాఢమా, సాదిపక్ష
నవమిని, గురురాత్రి, నవుచతుర్దశఘటి
కల, ననూరాధనక్షత్రమందుఁ
దొలిపాదమందు సంధిలునట్టి శుభలగ్నమందు
నే జననంబునొందినాఁడ;
మూఁడవతరగతి ముగిసెఁ దెన్గున; స్వయం
కృషివిద్యమారుతికృపనుగంటి;

4వ పాద-౦ అర్ధాంగినరసాంబ, అక్కలుముగురిలో వెంకమాంబయును జీవించియుండ్రు;
ఫలదాయి యల్లమ్మ కులదైవతము; వేంకటేశ్వరస్వామి మా యింటివేల్పు;
తిరుపతికొండ నెక్కరు దొంగలంట మావార; లెక్కినని ముష్మాలులేరి;
ఏడుకొండలవేల్పు యికడౌట- మా రాయగిరిపతి కిద్ది యంకితము నిడిత:

| పద్యం | పాదం | అక్షరములు |
|---|---|---|
| 7 | 14 | వసు చిజాపౌధానఁ బ్రథమపక్ష |

రాజితకీర్తి శ్రీ "రాళ్లపల్లి అనంత
కృష్ణశర్మ" దనఁగడించి నాఁడ
ఘనబడగలనాడుకర్ణాటకుఁడ, నాకు
సంతతి యనఁ గృతిసంతు లంతె;
రెండవయన్న సుతుండు వెంకోబరాఁ
యఁడు పితృభక్తి నాయందు గలఁడు;
కరణీకమ్ముఁ గృహకార్యమ్ముఁ దీర్చును
దనయంత; నామాట దాఁటఁ డెప్డు;
పుత్త్రుఁ డాతఁడె నాకుభూస్థితి తగియుండె,
జీవనమున కేమిచింత లేదు;
అతనికిఁ బుత్త్రికు లార్గురు; పుత్త్రిక
లిరువు రీనాఁటికిబరఁగువారు;
రామాయణమ్ము పారాయణముఁ గృతిర
చనవిధుల్ నాదినచర్యలందు;
నామాతృభాష కన్నడముతో నేర్చితిఁ
బ్రాంతీయభాష నాంధ్రమును బ్రేమ;
మహిత "హిందీప్రేమి" మండలి, "యాంధ్రసా
రస్వతసమితి" పూర్ణానుమతిని (9–5–54)
ద్వాదశవార్షికోత్సవసభ "ఆలూరఁ"
గవిరాజబిరు దిచ్చి గారవించె;

తే. గీ. నన్ను "అశ్వత్థరా" వందు; రెన్ననాకు
నెసఁగు నేబదినాల్గేడు లీడు; రెండు
వర్షముల వెన్క నా పేర భారతంబు
వ్రాయ శ్రీకార మిడితి శ్రీరాము నెన్ని. –

కం. వెలయు సభాపర్వంబున
నలరు[illegible]కుంబు నైనయాశ్వాసము వ్రా
సె లలిని "కవిభూషణ" బిరు
దలనఁడు "సంజీవమూర్తి" యత్యనురక్తిన్. 8

కం. తనయూరు "కప్పగల్లు" గ,
పనిఁ జేరి బళారి "మునిసిపల్ హైస్కూలన్"
దనరి యుపాధ్యాయుఁడుగాఁ,
గని విరమణ నేఁడు సుఖముగా నతఁ డుండున్. 9

మ. చెలిస్సై, బంధుఁడై, కవిత్వగురుఁడై, శ్రేయోన్నతుల్ నాకు
దలచున్, గైతకుఁ బ్రోత్సహించు, నెరసుల్ దాఁ దిద్దు, నే వేళలన్
బలుకున్ దివ్యము నెయ్యమేర్పడఁగ; సంభావించు పో శత్రు నేన్
గలరే మాకవిభూషుఁ బోలు గుణులింకన్ నూటికిన్ గోటికిన్? 10

* కృతివిషయము. *

క. సార కవిత్రయ విరచిత
భారత ముండంగఁ బ్రతిగ భారతమా? యా
ధారా శావరమా? యిది
నేరం బని యాడికొంట. నే వినుచుంటిన్. 11

ప॥ 10 పా॥ 1 ల॥ 22- (గా; ప॥ 10 పా॥ 2 ల॥ 2- లః

సీ. ఆదికవి రచిత మదిరమా కేలని
రామాయణము మానిరా స్పృశింపఁ?
మహితుఁ డొక్కఁడు శౌరిమహిమఁ గొండాడినఁ
బరుఁడింక నటుసేయఁ బాపమట్టె?
భక్తుఁడు హరికృతి పద్య పుష్పార్చనఁ
జేయ మాధవుఁడు గై సేయఁడొక్కొ?
ఆ కవిత్రయ మటులల్ల నేరనికవి
భారతము రచింప నేరమగునె?
తే.గీ. దొరకు పరమాన్నముఁ రుచిమరఁగి, చేతఁ
గలుగు వరియన్నముఁ ద్రోయఁగలమె రోసి?-
ఆయదృష్టమె నేఁడు విద్యకును? మాఱు
కాలముఁ బట్టి మాఱదే కవితఘనత?. 12

ఉ. పండిత మాన్యమౌ తెనుఁగుభారత వార్ధిమథించి గర్భితా
ఖండరమాసుధా మణులఁ గైకొన శక్యమె? సర్వసాధ్యమై
యుండఁగ హారసూత్రమటు లుండెడు తత్కథ సూత్రలక్ష్యమై
యుండఁగ, సంగ్రహంబెసఁగ నొండొక కొత్తగఁ గూర్పనొప్పదే? 13

కం. దూఱకుడు తలఁపకుఁడు నను
వేఱుగఁ; బాగ్జన్మకర్మ విలసన మిది; త
త్ప్రేరిత మగుకృతి దేహి క
వారణవిధి యనుచు వినుతు వాంచి శిరంబుఁ. 14

సీ. బాల్యమాదిగ నాంధ్ర భారతిఁ గృతిపుష్ప
మాల నర్చించితిఁ జాల; నందు
"యువతీవివాహ భాగ్యోదయము"ను, మయూ
రధ్వజ నాటకరాజము, మఱి
త్రివిశి ~~సరవి~~ "అశ్వత్థేశ త్రిశతి"యు, "దండక
రామాయ, ణానుభవామృతము" లు
బ్రకటితంబులు; నీఁకఁ బది నామమాత్రావ
శిష్టంబులై ధరఁ జెల్లి పోయె;
నమరగీతాదండకము - దండకోత్తర
గీత రచించితిఁ జేతమలరఁ;
దనర "గీతాసారదండకము" మఱి "సో
మేశ్వర శతకము" నేనొడివితి;
"భావగీతెగళు" నేఁబల్కితిఁగన్నడ
బా, సది నాతల్లి బాసయగుట;

తే.గీ. నిప్డు "డశ్వత్థభారత"కృతిని మొదటి
మూఁడుపర్వము లల్లితి; ముందుసృష్టి-
వరదు శ్రీరాముదృష్టి - మద్భాగ్య పుష్టి-
నెసఁగుఁ గృతిభర్తృ వరకృపామృతసువృష్టి!! 15

# అంకితము.



శా. శ్రీవైకుంఠమునందు బోలెఁ గలిలో శ్రీకాంతతో నిచ్చలున్
భూవైకుంఠము తిర్పతిన్ వెలయు వే పూజ్యుండవై! నానావిధిన్
భావంబందు భజించు భక్తులకు సర్వాభీష్టముల్ గూర్చవే?
సేవింతున్ నిను రాయదుర్గ నిలయా శ్రీవేంకటేశ ప్రభూ! 1

ఉ. పంచమవేదమై పరఁగు భారతిమందలి భక్తి పెంపుచే
నెంచక నాకొలంది, రచియింపఁగఁ బూనితి దో[illegible];
గ్రించుదనంబొ? సార్థకమొ? కృష్ణుని సత్కథ యంపు, [illegible] నా
సంచిత మంచుఁ బొంగెదఁ బరిజామత మేగతినైనఁ గానిలే. 2

క. ఇహపరసాధక మగున
న్స్పృహ రచియించితిని దీని నీగతిఁ; బ్రీతిన్
గ్రహియింపుము! నన్ను నను
గ్రహింపుమీ దేవదేవ! కారుణ్యనిధీ!! 3

క. నాయిలువేలుప! యిదొ కై
సేయుము పాణిగ్రహణముఁ జేసి కృపన్ - శ్రీ
రాయాద్రి వేంకటేశ్వర!
ఆయత "మహాభారతాఖ్యానసుతన్". 4



# అశ్వత్థ భారతము.

## ఆదిపర్వము, ప్రథమాశ్వాసము.



క. శ్రీనయితా! త్రిదశార్చిత
పాదా! శ్రితవరద! ధర్మపథసంచరణా!
వేదవినోదన! దుర్జన
భేదన! శ్రీ రాయదుర్గ వేంకటరమణా!. 1

శా. శ్రీవర్ధిల్లెడు నైమిశాటవి మహా క్షేత్రంబునన్, శౌనకుం
డావేదప్రతిమాన మౌని సభలో, నాసూతపౌరాణికుం
భావంబారఁగ వేఁడఁ, బుణ్యకథలన్ వాక్రుచ్చుచున్ బంచమ
శ్రీవేదం బగు భారతం బతఁడు వర్ణించెన్ మహాప్రీతుఁడై. 2

క. జనమేజయ ధరణీధవుఁ
డనుమోదముతోడ వేఁడ, నాకథ మఱిలన్
వినిపించెను వైశంపా
యనుఁ, డాకల్యాదియందు నది యెట్లన్నన్. 3

*జనమేజయుఁడు వైశంపాయనని భారతము వినుప వేఁడుట.*

చ. జనకునిఁ దక్షకుం డెనసి చంపెను నా విని, శోకరోషముల్
పెనఁగొనఁ బాఁపజాతి నొకఁ బ్రేల్మిడి నాశ మొనర్చు పూన్కిలోఁ
గని,జనమేజయుండు, బుధగణ్యుఁడు, మానిజనాను మోదితా-
పనిగనె నొక్కచోట నొకవాసర మందున సర్పయాగముౕ. 4

ఆ.వె. ఋషులు మునులు ద్విజులు ఋత్విజులును నెల్ల
బుధులుఁ జేరఁ, దనదు పూర్వపుణ్య
వశముచేత బుద్ధి వ్రాలుట సత్కథా
శ్రవణమందు జిక్కి జనవిభుండు. 5

క. మునితిలకుని సత్యవతీ
తనయుని, శ్రుతి స్మృతి పురాణ తత్త్వజ్ఞునిఁ, బా
వన తేజు, బాదరాయణుఁ
గని జనమేజయుఁడు మ్రొక్కి గౌరవ ఫణితిౕ - 6

చ. భరతకులాబ్ధిచంద్రులగు పాండవులుౕ ధృతరాష్ట్రపుత్రులుౕ
బోరి నెఱిమాని సోదరులు పోరి తమంతట నాశ మొందుటే?
హరియును, మీరు, భీష్ములును నాపఁగఁబోర లె? లోకనాశసం
గర మదె? చోద్యమయ్యె, వినఁగాఁ దలఁపయ్యెడు తద్విధానముౕ 7

క. సారమతి! విస్తరంబుగ
భారత చరితంబు వినఁగ భావము వొంగెౕ

గూరిమిఁ దెలుపఁగదే నీ
చారుచరణయుగళిఁ గొల్తు సద్భక్తిమెయిన్. 8

క. అనఁ - గృష్ణద్వైపాయనుఁ
డనుపమ చరితంబు భారతామ్నాయంబున్
జనమేజయునకు వినుపఁగ,
ముని వైశంపాయనునకు ముదలనొసంగెన్. 9

క. అనఘుఁడు వైశంపాయనుఁ,
డనునయమతి భక్తి నెఱఁగి, యవనతశిరుఁడై
యనుమతిఁగొని వ్యాసునిచే,
జనమేజయుఁగాంచి వచన చతురత మెఱయన్ 10

క. మనుజాధిప! విను! భారత
మును వివరించుటకు ముందు ముని వ్యాసుని సం
జననము నభివర్ణించెద,
ఘనభారతమున కతండ కర్తయగుటచేన్. 11

* వ్యాసుని జన్మ వృత్తాంతము. *

సీ. ఉపరిచరుం డన నొప్పారు వసురాజు
సురపతి కృపఁజేసి ధరణి వెల్గి,
గిరికను బెండ్లాడి, యరుసంబుతో నుండ
మృగయార్థమై వనిన్ మెలఁగఁజొప్పఁ

పితృదేవతలు; తనప్రేయసి నెడఁబాసి
యడలొంది, కడుఁగుంది, యుడివిపొచ్చి
తలపోయఁ దన్వీని, దమిమీఱి వీర్యంబు
విరిసిన, నొకపుటాంతరమునందు

ఆ. దాని సంగ్రహించి, తనచెంత నడ యూఁడు
డేగ కొప్పఁజెప్పి; యేగి తనదు
దారకీయ వేఁడెఁ; దనకాళ్ల నదిదానిఁ
దగులబఁట్టి, మింటిదారి కేగెసె. 12

చ. చరణపుటంబునన్ బొదవె సారతరామిష మంచు, డేగదెబ్బఁ
దురవడిఁ దాఁక, రెంటికి మహోగ్రరణం బెసరేఁగె, నప్డెసం
గరమున, డేగపాదములఁ గల్గిన పర్ణపుటంబు వ్రీస్సి, భూ
వరు వసువీర్య, మాయమునవారిఁ బడన్, గని మీను
మ్రింగఁగన్. 13

క. నిర్భర నవమాసంబుల
గర్భంబున నుండ మీను, గడుకొని వలలో
దుర్భరముగఁ దగిలిచికొని,
రార్భటమున జాలరుల్ మహాశ్చర్యముగన్. 14

ఆ. దానిపొట్టఁ జీల్పఁ దనయుండుఁ, దనయయు
నుంటఁగాంచి కొంచు వెంటనె చని,
మత్స్యవిభున కీయ మగబిడ్డఁ గొని, దాశ
రాజునకు దమిన్ దనూజ నొసఁగె. 15

ఉ. పుత్రిక దాశరాజప్రియపుత్రికయై పెనువృద్ధినొందుచుం,
ధాత్రిని మత్స్యగంధి యనునామము, సత్యవతీసమాఖ్యయుం
బాత్రముగా, జనుల్ పిలువఁ బొల్పడి తండ్రి యనుజ్ఞచే, దివా
రాత్రము, లాపగాసలిలరాశిని నోడను ద్రిప్పుచుండఁగన్. 16

క. వరమౌని శక్తిపుత్త్రుఁడు,
పరమతపోనిధి, వశిష్ఠపౌత్త్రుఁడు సుగుణా
కరుఁ, డురుశాపానుగ్రహ
ధురీణుఁడు, పరాశరుండు దోషహరుండున్. 17

క. కోరిక మీఱఁగ దీర్థవి
హారార్థము వచ్చి, చొచ్చి యారేవు, నటన్
మారుని దిగ్భ్రమఁగొల్పెడు
నారిని, నాదాశరాజనందనఁ గనియెన్. 18

ఉ. ఒప్పులకుప్పమోముజిగియొక్కటఁ గన్గవఁ గుట్ట, గిండ్లు నా
చొప్పడు నుబ్బు గుబ్బకవ సూనశరాహతుఁ జేయఁ, గొప్పునుం
గొప్పది యౌనితంబమును గోరిక లీరిక లెత్తఁ జేయఁగాఁ,
జొప్పడి యత్తపోధనుఁడు చూడ్కి మరల్పక చూచి సుందరిన్. 19

ఆ. శాంతునైన, మిగులదాంతునైనను, సుధీ
మంతునైన, విజితకంతునైన,
నెంతవానినైన, నేఁచి కాంతాగోష్ఠి
భ్రాంతునిగ నొనర్చు బళిరె! యనుచు. 20

క. ఉక్కిరి బిక్కిరియయి ముని
యెక్కంబడన, నదియుఁ గదలె నిటునటు సరిలోన్;
దక్కకచూచుచు నచ్చెలి
ప్రక్కనఁ గూర్చుండె, సమయనువర్తనమతియై. 21

చ. తనమది విప్పి చెప్పఁగ, నితంబిని జాలరికన్నె నేను, నా
తను విది మత్స్యగంధ మిదు, తాపసశేఖర! తండ్రిదాశు క
న్యను, గనయుంగఁ గోర నగునా? చెడు నాదగు కన్యకాత్వ, మీ
జనములు చూతు, రెట్లురతి సల్పఁగ నా నిట సిగ్గుచేటుగన్? 22

క. అన; నిదిదె వక్రత మో,
వనితా! వెఱపేల? నుఱకవాతెఱుగు నాకున్
మన సిది; జగద్ధితం బగు
ఘనకారణ మొండు గలుగఁగా నోపుఁజుమీ! 23

మ. అని; నేఁ దాఁకినయంత నీతనువు దివ్యంబైన గంధం బిడున్
వనితా! క్షత్రియవర్యుఁడైన వసురాడ్వంశాంకురం బీవు సూ!
నిను గన్యాత్వము వీడనట్లు వరమున్ నేనిత్తు! భోగక్రియల్
గన నెల్లేరును గాఢమైన తమమున్ గల్గింతుఁ గన్గొమ్మనన్. 24

క. కూడె నటఁ జిమ్మ చీఁకటు
ఱాడిచనెన్ మీలకంపు; నోడలన్ బూవుం
బోడికి సుగంధ మొలసెన్
గూడెను ముని చేడె పదిని గోరికలూరన్. 25

క. చెలఁగెను సద్యోగర్భము,
గలిగెను బ్రహ్మాంశభవుఁడుగా వ్యాసుఁడు, నా
చెలి యోజనగంధి యుదరన్
వెలసె; సుతుఁ డమోఘకాంతి విలసితుఁ డయ్యెన్. 26

ఉ. పుట్టినతోడనే జనని పూజ్యపదంబుల మ్రొక్కి, కోరఁగా
నెట్టన వత్తు నీ యెడకు నిశ్చయ మంచని పల్కి, పోవఁగాఁ
గట్టడ మాతచేతఁ గొని, గన్యని దండ్రినిఁగూడి, దారిఁ దాఁ
బట్టెఁ దపోవనంబునకు వ్యాసుఁడు లోకహితంబుఁ గోరుచున్. 27

సీ. వేదంబు ననువార విభజించి నాల్గుగా
శాస్త్రపురాణముల్ జతనపరచి;
భారతాఖ్యానంబు పదపడి రచియించి
తనశిష్యులైన జైమినినిఁ, బైలుఁ,
దనర వైశంపాయనుని, శుకుఁ జదివించి
యిలపైఁ బ్రబోధింప నిడియె నాజ్ఞ;

గీ. కృష్ణవర్ణుండు నగుటచేఁ గృష్ణుఁ డనఁగ,
శ్రీయమునదరి నుంట ద్వైపాయనుఁ డన,
వేదములకెల్ల వ్యాసముల్ వెలయఁ జేసి
వ్యాసుఁ డనఁ, బేర్మి వడసి ప్రఖ్యాతిఁ గాంచె. 28

క. తను బారాశర్యుం డనఁ
గను, సాత్యవతేయుఁ డనఁగఁ గనె జన్మముచేన్; —
చనె బాదరాయణుం డన
వనిపావనబదరికన్ దపంబుండుటచేన్. 29

ప॥ 28 పా॥ 3 అ॥ 4 ఖ్యానంబు; ప॥ 28 పా॥ 8 అ॥ 10- ద్వై;
ప॥ 29 పా॥ 3 అ॥ 1- చనె;

ఉ. భారతవంశ వర్ధనుని, భారతసత్కృతికర్త, వ్యాస భ
ట్టారకు జన్మకీర్తనఁ గడంక నొనర్చితి నాంధ్రిలో; నిఁకన్
భారతముల్ వచించెదను, పంచమవేదము, శ్రీమనోహరా
కారము, సద్విచారము, వికారవిదూరము, నీతిసారముల్.

* పూరువంశానుక్రమము. *

సీ. అవ్యక్తమహాబ్రహ్మమందు బ్రహ్మజనించె
నతని యక్షి మరీచి యవతరించె;
నంగుష్ఠమూలంబునందు దక్షుఁడుపుట్టె
నామరీచికిని గశ్యపుఁడు గలిగె,
నలదక్షుసుత యగునదితికిఁ గశ్యపు
నకుఁబుట్టె భానుండు సంపనుగను,
మనువు వైవస్వతుఁ డన రవి కుదయించె
రవిసుత యిల పురూరవుని గనియె,
నతనికి నాయువు; నతనికి నహుషుండు
నాతనికి యయాతి జాతుఁడయ్యె,
నాయయాతికిఁ బురు యదుముఖ్యు లొదవిరి
పూరువంశము ప్రబ్బెఁ బూరువలన,
యదువుచే వర్ధిల్లె యాదవవంశంబు
పూరుకౌసల్యల పుత్రుఁడ నగ
జనమేజయుఁడు గల్గి, ఘనహయమేధముల్
విశ్వజిద్యాగంబు పేర్మిఁ జేసె,
న తనికి మగధేశుసుత సునందనియందు,
నొనరెఁ బ్రాచీన్వంతుఁ డనెడుకొడుకు,

వ॥ 30 పా॥ 4 అ॥ 11- రవిదూరము; వ॥ 31 పా॥ 9 అ॥ 3- నికినాయువు;

ఆతండు యదువంశజాత యశ్మికియందు
గనియెను సంయాతి యనుతనయుని,
అతనికి గృతవీర్యసుత భానుమతియందు
సార్వభౌముండు సంజాతుఁ డయ్యె,
అతనికిఁ గేకయపతిపుత్రి సందర
యందు జయత్సేనుఁ డనఁగ నొడమె,
అతఁడు విదర్భాధిపాత్మజ సుశ్రవ
యెడ నపరాచీను బుడుతఁ బడసె,
అతఁడు వైదర్భినాసతియందు గాంచెను
నందను నొక్కని "నరిహ"నాము,
అతనికి "నాంగి"నానతివకుఁ బొడమెను
వరపుత్రకుఁడు మహాభౌముఁడనఁగ,
అతఁడు ప్రసేనజిత్సుత సుయజ్ఞవలన
నయుతనయాఖ్యుఁ దనయుఁ గ్రహించె,
అతఁడుఁ బృథుశ్రవక్షితినాథసుత భాస
వలన నక్రోధనుఁ గలిగి వెలసె,
అతఁడు కళింగభూపతిపుత్రి కండువు
నందు దేవాతిథిఁ బొంద నొప్పె,
అతఁడు విదర్భరాట్సుత యగుమర్యాద
చే ఋచుం డనుసుతశ్రేష్ఠు నొందె,
అతఁ డంగపతిజాత యగువామదేవి గ
ర్భమునందు ఋక్షు నుద్భవిలఁ జేసె,
ఋక్షునామకుమ దక్షసుతజ్వాల
కంత్యనారుండునా ననఘుఁడొడమె,

ఒదవె సరస్వతీనదికి నాతనికిని
ద్రస్నుండు నా గుణాఢ్యుఁడు ఘనుఁడు,
అతనికిఁ గాళిందియందు నివిలుఁడబ్బె
నతనికి దుష్యంతుఁ డవతరించె,
తే. గీ. అలభగీరథసుత లాక్షియందు నతఁడు
గాంచె జనమేజయుని, మఱి గాధిసుతుని
తనయ యగు శకుంతల యను తరుణియందు
వంశవర్ధను భరతు దేవాంశుఁ గనెను. 31

క. అనివైశంపాయనుఁడనవిని
జనమేజయుఁడు నల్కె - విశ్వామిత్రుం
డనఘుఁడు సుతనెటుకనె? నా,
వనితను దుష్యంతుఁ డెట్లుపరిణయమాడె? 32

క. వారితనూజునిభరతుని
పేరనె భరతాన్వయంబు పెంపారెనె? యా
సారతర పుణ్యకథ మన,
మారఁగ విననలతు నన్న నాముని పలికెన్ 33

* దుష్యంతుఁడు వేటాడఁబోయి, మున్యాశ్రమమున శకుంతలను దర్శించుట. *

క. కురువంశార్ణవశశియై
ధరనాలుగుచెఱఁగు లేలె దర్పోద్ధతుఁడై

చిరయశము వెలయ, ధర్మము
వఱలఁగ దుష్యంతభూమిపాలుండనఘా! 34

శా. ఆతం డొక్కదినంబునందు మృగయాహ్లాదంబునన్ బోయి,బల్
భీతిన్ బాఱఁగ ఘోరవన్యమృగముల్ బెంపారఁగాఁగత్తి చేఁ
గోతల్ గోయుచుఁ,జెక్కుచున్,జమరుచున్,గుమ్మెట్టుఁ జెండాడు,చా
రీతిన్ జండపచిప్రదీప్తుఁడయి, నిర్భీతిన్ జరించెన్ వనిన్. 35

క. కాటెనుబ్బోతులఁ, బులుల్
మీఱినశరభముల, ఖడ్గమృగముల బలిమిన్
జీరుచు- నెలుగులఁ బందుల
నారణ్యమృగంబులన్ లయంబొనరించెన్. 36

క. వెఱచఱచి గములు దేరుచు
నఱిముఱిఁ బరువిడఁగ మృగము లందంద ధరా
వరుఁ డరిగి, తఱిమి తరమిడి,
నఱకెను, బిరబిరన. కత్తినాలుక సెలగన్. 37

చ. ఇటులతిదూరముల్ జని,మహీపతిగాంచెను,ముందటన్. మహో
త్కటవరవృక్ష, గుల్మ, లతికా ఫలపుష్ప గణాభిరామమై,
చటులసుసారభానిలవశాంతవిహారవిలాసభూమియై
స్ఫుటమధురామృతోదక మూర్జిత కూపతటాక మావనిన్. 38

ప॥ 35 పా॥ 2 అ॥ 10 న్య; పా॥ 3 అ॥ 1- గోఁతల్; అ॥ 17- మ్యో;
ప॥ 36 పా॥ 1 అ॥ 4- పో; ప॥ 38 పా॥ 4 అ॥ 9- కనమూర్జిత;

చం. అతిథికిఁ బోలె భూరుహములల్లన నీడలొసంగెఁ; బక్షిసం
తతులు ప్రియోక్తిస్వాగతవిధమ్ములు దెల్పెఁ బథశ్రమంబునన్;
నతివలు ప్రీతి సేస లిడినట్లు సుమంబులు రాల్చె, నుర్చె మా
రుతుఁడు ఫలంబులన్ గుడువ; మ్రొక్కుసఖుల్ తరుశాఖ
లూగుచున్ 39

కం. ఒకగుజ్జుమావిగున్నకు
నొకమల్లియతీవ యొయ్యనొత్తిలి పెనవే-
సికొనె లలి నల్లిబిల్లిగ,
శకునం బిది శుభము! ముందు జను మనుసఖులన్. 40

సీ. ఈనినపులులు చన్నిచ్చు నాకలిఁగొని
పిఱుఁదఁ జేరెడి లేడిపిల్లలకును,
సింగంబు లేనుఁగుల్ చేరి రేవొక్కట
నాపోవనీరమింపారఁ ద్రావు;
నెలుకలు పిల్లులు నెలమిమై గవఁగూడి
వేడుకఁ జెఱలాడు వింతలోఁప;
నెమిళులుఁ బాములుగుమిగూడి తమలోనఁ
గ్రీడించు నెప్పుడు జోడువిడక;

గీ. పిట్టలును డేగలును జతగట్టియాడు;
వైర మం దెందు వెదుక దీపంబు నూని,
మందునకునైన దొరకదు మహిమ యౌర!
యిది తపోభూమి యని, [illegible] కేగి కాంచె. 41

ప॥ 39 పా॥ 4 అ॥ 22- లూఁగు; ప॥ 41 పా॥ 1 అ॥ 10- నాఁకలి;
ప॥ 41 పా॥ 10 అ॥ 9- దక;

సీ. శిష్యులకు శ్రుతులుసెప్ప నొజ్జలు, విని
శారికాకీరముల్ చదువు నేర్వ;
హరిణాజినముపైనఁ బరఁగుమానులఁ జుట్టి
ముట్టి లేళులగముల్ మూర్కొనంగ;
మహితవ్రతస్థులై మంత్రతంత్రములతో
విప్రశేఖరు లగ్ని వేల్చుచుండఁ;
త్రిషవణస్నానముల్ దీరిచి గట్టెక్కి
సంధ్యాదివిధి విప్రసమితి సలుపఁ;

గీ. కొంద ఱధ్యయనంబుల సందడింప,
వరుసఁ గొందఱు పాఠముల్ వల్లెవేయ;
నెవరిపనులందు వారలు దవిలియుండఁ
జూచి, మదిలోన ఱేఁ డతిచోద్య మంది. 42

కం. కని పర్ణశాలచెంతన్,
మనుజులు లేకున్కిఁ జేసి, మహిపతి పేరె
ల్గున బిలిచె "నెవరు గలరిట
ననుదెం" దని దెసలు మరల సవ్వడి నీయన్. 43

కం. ఆ కేక విని కుటీర
ప్రాకారమునుండి వచ్చె, వనదేవతయో,
యాకంతునిసతి రతియో,
యీ కాంత యనంగ నొక్కయిభయాన వడిన్. 44

సీ. రంగారుబంగారు పొంగారునునుమేను
కావివస్త్రములోనఁ గా[illegible],
పైడిగిండ్లన నొప్పు పాలిండ్లజిగిబిగి
పొలుపుపయ్యెదను దోఁబూ[illegible],
రుదురాకపూసలఁ గుదురాడుకుత్తుక
తెలిసంకునీటుల దీ[illegible];
కడకంటిచూడ్కులబెడఁగులు నునుచె[illegible]
టద్దాలతోడఁ స[illegible];
గీ. నవ్వువెన్నెల నల్గడ నివ్వటిల్లఁ,
దుమ్మెదలచాలు ముంగుఱు[illegible],
బెంటిరాయంచ యడుగులనంటఁ, [illegible]
కన్నె చెలితోడ నచట నా[illegible]చి :- 45

ఉ. "ఇయ్యది కణ్వునాశ్రమ; మిదే సమిధల్ గొని [illegible]
రయ్యలు వత్తు రింతకు; ధరాధిప! మీ కిట [illegible]; [illegible]
కియ్యగ నర్ఘ్యపాద్యము లివే! యని పూజ[illegible]
విద్యము లైతి; రింకఁ బనివిన్పుఁడు; మీ [illegible]!"
46

కం. అన, దుష్యంతమహీధవుఁ
డను నే వేఁటాడ వచ్చి డస్సితిని; తపో
వని దీనిఁ గాంచి వచ్చితి;
వనితా! నీ వెవత, వేల వసియింతు విటన్? 47

ప॥ 45 పా॥ 3 అ॥ 1- రెఁడి; ప॥ 45 పా॥ 7 అ॥ 1- [illegible]

కం. ఎవరితనూజవు? పాయకతవిలెను
నీయందు మనసు; తాపసవృత్తిన్
నవలావణ్యవతీ! యిట
నవయంగా నేల, తెల్పునా’’ కనునంతన్. 48

కం. “జనపతి విను! మునిపతి క
ణ్వునిసుతను, శకుంతలాఖ్యఁ బొలిచెడిదానన్;
వినియుంటెని నిను, నేఁడిటఁ
గనులారఁగఁ గంటి; నేను గన్యక, ననినన్. 49

గీ. తన్వి! యూర్ధ్వరేతస్కులై తనరుకాశ్య
పులకుఁ గులపతులకుఁ నెట్లు పుత్రి వైతి,
వట్లయగునేని, నాహృదయమ్ము వీత
ధర్మపథమున నీపయిఁ దవిలె నెట్లు? 50

కం. అనుమాన మయ్యె, నీచరి
తను వివరముగాఁగఁ దెల్పు ధవళాక్షీ! [illegible]
ముని, యసువు తలఁగినను - వ్రత
మును దొలఁగండనినఁ బొలఁతి ముసిముసినగుచున్ - 51

కం. తనకతఁ దెలుపఁగఁ గనుసైఁ
గను దనచెలి కెచ్చరింపఁ గని, యొండొరులన్
బెనఁగొనె మదు; లిదితగునద -
నని, చెలి పురికొల్పు నెంచి యనె చాతురిమై - 52

◆ శకుంతల జన్మవృత్తాంతము ◆

కం. జనవర! మున్నొకనాఁ, డొక
మునివరుఁ డరుదెంచి కణ్వమునితో ననె నీ
కొను జూపి, యెవ్వరిది, నీ
తనయ యగుటయెట్టు? లనినఁ దాఁ బ్రవచించెన్.

సీ. అనఘ! విశ్వామిత్రుఁ డనురాజతిలకుండు
బ్రహ్మర్షి కాఁ, జంటఘోనుఁ జేసఁగఁ
దపియించుచుండంగఁ; దా నైఁప నోపక
యమరేశ్వరుఁడు కడునడలి యొంకఁప
ననిమిషరాట్పద మందఁ గన్నెంచె నీ
తండని, యప్సరస్త్రీజనములలోఁ
దిలకమౌ మేనకఁ బిలిపించి యనియె, నీ
వేఁగి కౌశికుతప మేటఁ గలిపి

ఆ. వాని నియతిఁ జెఱచి, సూనాస్త్రునలఁ ద్రోసి,
నాకరాజపదవి నాకు నిలుపు!
మనసు పెట్టితేని మరువైన హరువైన
నింటిబంటుగాఁగ నేలికొనవె?

గీ అని ప్రశంసింప, మేనక యనియెనిట్లు :–
కడఁకఁ బడబాగ్నిఁజొరనాజ్ఞ నిడుదురయ్య

బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టిఁ బన్నె, నతని
ధాతయే యోపఁడన్న నాచేతిపనియె. 55

క. శాపంబతఁడిడుఁ దడవిన-
కోపింతురు తడవకున్నఁ గ్రూరులు మీరల్!
తోఁపదు - ముందు తటాకము,
కూపము వెను, కనుచు గాణిగికొని సతినడచెన్. 56

క. మలయానిలుఁడును మదనుఁడుఁ
జెలఁగి వసంతుఁడునుఁ, దన్నుఁ జేరి నడవఁగాఁ,
జెలి కౌశికాశ్రమమునకుఁ
గులుకుచు, జనుదెంచి, మౌనికుంజరు దరిసెన్. 57

ఉ. అందెలు గల్లుగల్లుమన, నందును నిందును జిందులాడు, జో
కుందనమార నెల్గునిడుఁ గోయిల కూసెడు భంగిఁ! దివ్యమా
కందరసంబు జిందఁగ శుకంబటు లల్లనఁ బల్కుఁ గుల్కు! నా
సుందరి యమ్మునీశ్వరుని జుట్టును జుట్టుచుఁ బూలగోయుచున్. 58

క. అలసవ్వడి విని మునిపతి
మెలమెలఁ గనుఁ గవను విచ్చి మెలఁతను గాంచెన్;
లలి ననిలుం డాసతిమెయి
వలువను బయికెగయఁ ద్రోసి వారకవీచెన్. 59

ఆ. మోవి నానుచున్న మునిపతి చూడ్కులు
కచకుచంబులందుఁ, గౌనునందు

---

ప॥ 56 పా॥ 2 అ॥ 1- ఁగో; ప॥ 57 పా॥ 4 అ॥ 3- కు;
ప॥ 58 పా॥ 4 అ॥ 18- లు;

ముందు వెనుక మేన నందందు పరువుల
నెత్త నతనిమనసు తత్తఱిల్లె. 60

ఉ. కోయని గండుకోయిలలు గూసెను, మారుతుఁ డల్ల నల్లనన్
హాయిగవీచె, మన్మథుఁ "డయారె సెబా" సని యుమ్మలిమ్మెగా
నాయమి నాటనేసె, చెలి యాకడఁగంటికటారి దూసె, నా
హా! యని మౌని లేచి బిగియారఁ గవుంగిటఁ దార్చె మేనకన్, 61

గీ. నిండె నవమాసములు చూలుపండె ననఁగ,
పసిమి మిసమిసలారెడు నిసువుఁ బడసి,
యెత్తి మేనక మునిపతి కీయఁబోవ,
గరములను నంట, కాతండు కసరికొసరి,— 62

క. అతివా! తపముం జెడియెను,
ధృతి చెడియెను వ్రతముఁ జెడియెఁ, దీరెను నాస
ద్గతితతి నీకతన; నెవరి
సతివే? సుత యెవరి? దనుచు సంయమి చనియెన్. 63

చ. శిశువును డించి యందె, సతి చేరె దివంబు; తొలంగఁగా విప
ద్దశయు శకుంతసంతతి హితంబుగ ఱెక్కలఁ గప్పి, ప్రేమకున్
వశమయి బాలఁ గాచె; విధివర్తనచే సమిధల్ కొనంగ నా
దిశ కరుదెంచి, కాంచి, కొని తెచ్చితిఁ, గాచితిఁ గంటిరెప్ప నై, 64

గీ. అనద యగుదీనిఁ దొలుఁదొల్త నట శకుంత
కులము లాలింప, నిడితి శకుంతలాఖ్య

---

ప॥ 60 పా॥ 1 అ॥ 5- ను; అ॥ 14- బ; ప॥ 61 పా॥ 3 అ॥ 8- జె;
ప॥ 62 పా॥ 2 అ॥ 1- ఁబ;

దీని కని కాశ్యపులు దేటతెల్లముగను
వినిచె నామునిని, కవు డేను వింటి నృపతి! 65

క. కని నాతం, డన్నం బిడి
మనిచినయాతండు, భయము మానిచినతఁడున్,
జనకులు వనితకు ముగురని
వినిచెడు స్మృతి, యగుట నీ మెపిత యితఁడయ్యెన్, 66

క. అని చెలి చనఁగ, శకుంతలఁ
గని, మది సందియము వాసి క్ష్మావిభుఁ డంతన్
"జనునే క్షత్రియకన్యకు
మ్మునివేషము; ననువరించి పొందుము సుఖముల్" 67

క. అనఁగ, శకుంతల :- సతికిన్
జనదు స్వతంత్రతయె, తాళు, జనకుఁడు వచ్చున్;
మనపయినఁ గనికరించిన
విను! పాణిగ్రహణ మగును విధ్యుక్తముగన్! 68

సీ. అనిన దుష్యంతుఁ డావనితతో నిటులను
"సతిన! బ్రాహ్మము, దైవ, మార్షమనియు,
నటులె ప్రాజాపత్య, మాసురమును, రాక్ష
సంబు, గాంధర్వ, పైశాచములన
వైవాహికవిధులు వర్తిల్లు నెనిమిది;
దాన రాక్షసము, గాంధర్వ విధము
లుత్తమంబులు క్షత్రియుల, కంచు స్మృతి చెప్పు;
నందు గాంధర్వ మత్యంత గోప్య

---

ప॥ 66 పా॥ 2 అ॥ 3- చిన; ప॥ 67 పా॥ 4 అ॥ 4- ష;

గీ. మగువిధి! యది యమంత్రకమగును; కన్య
దాన మీయంగ నర్హమయాఁ దన్ను దాన;
చుట్టములు పక్కములులేరు నూపె దాన;
నట్టిగాంధర్వ మిట మన కర్హమనిన. 69

చ. "అనఘవిచార! శాస్త్రహిత మంటివి యవ్విధి సమ్మతించితిన్
ఘనమతి మత్తనూజునకె ఖ్యాస్థలి పట్టముఁగట్టగా వరం
బును దయసేయఁగావలయుఁ, బుట్టెనునామది నిట్టికోర్కె"
చన, "న వ్వఁగాకనీసుతుఁడె యయ్యెడురాజుగ నాకుఁబిమ్మటన్". 70

మ. అని; గాంధర్వవిధిన్ వరించి, మది నత్యంతప్రమోదంబునన్
జననాథుండు, సుఖోపలాలనముల్ సంరంభ మేపారఁగా
వనజాతేక్షణఁగూడియాడె, "నిను బిల్వంబంచెదన్ శీఘ్రమే -
ననుఁ బుత్తెంచుము నేఁటి" కంచు సెలవున్ గైకొంచుఁ దా
నేఁగఁగన్. 71

చ. తనుగొనకున్న పెండ్లి యనితండ్రి తలంచునో? ధర్మమాట నీ
కొనునో? యటన్న చింతను శకుంతలయుండఁగఁ గందమూలముల్
గొని సనుదెంచి కణ్వుఁ, డనుఁగుంసుతవైఖరిఁగాంచి, యెల్లలోఁ
గనుఁగొని దివ్యదృష్టిని ముఖంబు వికాసమునొంద నిట్లనున్. 72

క. "తల్లీ! నాకోరిక కగు
వల్లభు వరియించి తీవు! త్వద్గర్భగతుం
డెల్ల జగమ్ములనేలుచు
నుల్లసిలున్ దనయశంబు నుర్విని నిండన్. 73

ప॥ 69 పా॥ 1 అ॥ 15 గ; ప॥ 70 పా॥ 3 అ॥ 21- యం;
ప॥ 71 పా॥ 1 అ॥ 8- థి; పా॥ 3 అ॥ 10- షి:

ఆ. మెచ్చినాఁడ నీకు నిచ్చెద వరముల
నడుగు మనెడు మాని నామృగాక్షి
ధర్మమందె మనసు తనకుండఁ గొమరుండు
వంశకర్త గాఁగ వరము వేఁడె. 74

క. కోరినట్టికతిఁ గొమిరెకు వరమిచ్చె,
జంద్రనిభుఁడు సుతుఁడు సతికిఁ గలె;
జాతకర్మవిధులఁ దాత కణ్వుఁడు తీర్చె,
భరతుఁ డనెడు పేరు వడసె బుడుత. 75

శా. మూఁడేండ్లప్పుడె వ్యాఘ్రసింహముల మూఁపుల్ వట్టియూఁగాడుచున్
వీడంబోవక ముక్కుఁ ద్రాళ్ళు లిడుచున్, వీపెక్కి కూర్చుండి తా
నాడున్,స్వారియొనర్చుఁ, గ్రూరతర వన్యానేక సత్వంబులన్
దోడన్ బట్టుచుఁ గట్టితెచ్చు బలిమిన్ దోశ్శక్తి బాలుండొగిన్. (76

ఆ. సర్వశక్తి దమనశక్తిసంపదఁ గాంచి
తనరె నతఁడు సర్వదమనుఁ డనఁగ;
దిన దినాభివృద్ధిఁ గనుచుండె; నొకనాఁడు
తనయుతోడఁ గణ్వముని వచించె. 77

* కణ్వుడు శకుంతలను దుష్యంతు కడకుఁ బంపుట.*

క. సతి కేడుగడయు పతియగు;
సతి యెంతటిసాధ్వియైన జనకునియింటన్
బతి వీడి యుంట ధర్మ
వ్యతిరిక్తం, బపయశంబు వచ్చునుతల్లీ! 78

ఉ. కావున, నిక్కమారుఁ గాని కామిని! నీపతిచెంత కేగుమా,
నీ వెనువెంట వచ్చెదరు నిన్ విడిరాఁగ మదీయశిష్యులున్,
భావ మెఱింగి భర్త కనువర్తినివై, స్వజనాళి కిష్టమౌ
పూ నయి, తెమ్ము సద్యశము బుట్టినయింటికి, మెట్టినింటికిన్. 79

సీ. పతివంక వారిని బితవంక వారని
చూడుమా! మదిఁ బ్రేమఁ జుట్టికొనఁగ,
దల్లిదండ్రులవోలెఁ దగ నత్తమామల
సేవింపుమా! వారిచిత్త మరసి,
భర్త కిష్టముగానిపని సేయకుము పుత్త్రి!
మితభాషణము గల్గి మెలఁగు తనయ,
అనువుగా నీయింటిపనులఁ బాగొనుసుతా,
పనిలేక యుండను జనదు బిడ్డ.
తే.గీ. శీలమును బాయుకంటె నిల్లాలి కెందు
బ్రాణమైనను బాయుటే భాగ్యమమ్మ,
శిష్టపథమును వీడక చెలఁగుమమ్మ,
నన్ను మఱవకుమమ్మ నన్గన్నతల్లి!. 80

మ. అనుచున్ జెక్కులు ముట్టి, మై నిమురు లో నాపంగలే కశ్రువుల్
దనుకన్ బుచ్చి, శిరంబు మూర్కొనును, గాఢద్వ్యంబుమై వెక్కి, గో
పనమై యేడ్పుమొగంబు పెట్టు మదిసైపన్ లేక నిట్టూర్చు, న
మ్మునిచంద్రుండు సుతానురాగభరసమ్మోహానుబద్ధాత్ముఁడై 81

ఉ. హా! యని చేతులన్ బెనచి యయ్యగళంబున జోలెఁగట్టె. మో
మాయనమోము జేర్చు, నకటా! యని యార్చును, బేర్చుఁ గౌఁగిటన్
ఆయనబొజ్జలో శిరము నాన్చి వగర్చును, సంక్షోభియుగ్మమం
దాయపు ఫాల ముంచి, ఋఖుడు నశ్రువులన్, బితఁ బాయనోపకే. 82

---

ప॥ 80 పా॥ 7 అ॥ 14- ను సుతా; పా॥ 10 అ॥ 1- ప్రా;
ప॥ 81 పా॥ 1 అ॥ 2- ను; అ॥ 15- నాఁప;

క. కొని పెంచినట్టిపాకే
మనసొప్పదు సుతను బాయ, మహిలో నింకన్
కని పెంచిన తలిదండ్రుల
కనికర మనుష్యరము నష్టఁ గంజజువశమే"?- 83

చ. అని యొకకొంత తెప్పతిలి యాయమఁ దేర్చి, యనుంగుబుత్రునిన్
గని, కొని, కౌఁగిలించి, చుబకమ్మునునొసలిచు, ముద్దులాడి, యా
మునిపతి - బుద్ధులన్ గఱపి పుత్రికి, మన్నని కొంతొ ప్రీతి దీ
వనలిడి, శిష్యు లంటిచనఁ బంచెను - నించెను కంటనీళులన్. 84

గీ. చనిచని వారలు దుష్యం
తునిపురి కరుదెంచి, తేఁడునున్ సభదీరన్
విని, వాకిటవిడి వారిని,
చనిరి వటులు సభకు లోనసరభసవృత్తిన్. 85

క. కని జేసిన్ దీవనలిడి,
మునిప్రుఁడు కణ్వుండు, నీదు పుత్రున్, బత్నిన్
నినుఁ జేర్ప నాజ్ఞ మాకిడి,
తననుడు లిటు తెలుపు మనియె ధాత్రీరమణా!- 86

ఉ. పువ్వుల కేము దవ్వులకుఁ బోయిన వేళ, మదాశ్రమంబుసం
దవ్విధి, నాఁడు, మత్తనయ, నట్లు, కరగ్రహణక్రియావిధం
బొవ్వఁగఁ జేసి, నిల్పకట, పోయితి నవ్వడె పత్ని వీడి; మే
మన్వుల వింటి మాకథను, హర్షము వొంగి చెలంగఁగా మదిన్. 87

ప॥ 83 పా॥ 3 అ॥ 1- గ; ప॥ 84 పా॥ 2 అ॥ 15- నంటుచు:
ప॥ 85 పా॥ 4 ...

శా. మాయాశోకకుసుమంబు లెవ్వి డెసఁగున్ మాన్యంబుగా మూర్ధమం,
దే యాయాసము గల్గనీక, శుభ మెంతేనీకుఁ జేకూర్పఁగా;-
జాయన్ బెద్దగఁ బుట్టినింట విడువన్ సామాన్యమా భర్తకున్,
న్యాయంబాఁ బతినీడఁ బత్నిమను; టల్లాటన్ సతిన్ బంచితిన్. 88

క, భూభువనభరణదక్షుం.
డీభరతుఁడు నీకుమారుఁ; డీనాసుత నీ
సౌభాగ్యలక్ష్మి సుమి! మా-
మీభాగ్యము బాంధవంబు మేలిమిఁ గూర్చెన్. 89

క. అని తెలుపు మసిరి; యదె నీ
తనయుఁడు, నీపత్ని, యుండె, ద్వారముకడ, నీ
యనుమతికై వేచిరి; తో
డ్కొనిరాఁ, దగువారిఁ బంపు, కౌతుకమున్ బడఁతిన్. 90

చం, అని వినిపింప; భూమివిభుఁ డావిషయంబె యెఱుంగనట్లు తా
నను: సతియంట! యెవ్వరును నారయనట్లు వివాహకర్మ మే
గని, సతి వీడినాఁడట! నిగారపుబిడ్డఁడు గల్గెనంట! వి
మనముల దీని నమ్ముదురె! మాన్యసభాసదులార! వింటిరే?. 91

క. వటులార! స్వప్నమామని
యటు గనెనో? నాదు మెడకు నతివనుగట్టన్
మటుమాయ లిటుల పన్నెనొ?
కటకట యిటువంటి సుద్ది కల్గునె యెందున్? 92

క. పెంచిరి మానిసులండ్రె;
కొండికవానిన్ నెలంతఁ గొని యిఁక; జను లీ
పెండిలికత విని, కడుపులు
పుండులుగా నగరె? మీదుపున్నెము చనుఁడా! 93

క. మ్రొక్కెద మీకును, మునికిని;
నక్కాంతాతిలకమునకు, నాకొమరునకున్
బెక్కులు నాదీవన; లిది
నిక్కంబో కాదొ? తెలుపు నిలుకడ మీఁదన్; 94

క. నటులేగి, రంత సభ్యులు
నటనట గుజగుజలు వోయి; రాసతి సుతుఁడున్
నటులును నట కేతెంచిరి!
యటుసూచియుఁ జూడకుండ నవనిపుఁడుండెన్. 95

♦ శకుంతలా దుష్యంతుల వివాదము, ♦

చ. మఱచెనొ? మాంద్యమో? ధవునిమాదిరియేయొకమాక్షినుండె! నా
దరము ననుగ్రహంబును ముదంబును జూపఁడు! తీక్ష్ణదూషతన్
గఱచెడు! తేనెపూఁతలగు కత్తులు, కప్పయెలుంగుపాము, లీ
నరపతులో నవప్రియులు! నమ్మగవచ్చునె వారినెవ్వరున్? 96

చం. అని ధవుదిక్కు నిక్కఁగని, యాయమ "కణ్వమునీంద్రునాశ్రమం
బున నటు, నాకరగ్రహణమున్, బరిపూతరహస్యమాక్రియన్
గని, కొనిపోదుమీఁద నని. కాంతను నన్నట వీడి, యొంటి నీ
వనఘ! యనంతభోగముల నందుట యోగ్యమె? నాదుభాగ్యమే?97

క. నాఁకొఱకు యౌవరాజ్యముఁ
జేకొనఁగా బాస నిచ్చి చేపట్టవె న,
న్నీకొఱకు నీకుమారునిఁ
గైకొని యువరాజుఁ జేయఁగదె నాథ! యనన్. 98

క. "ఏ నెఱుఁగ నిన్ను, బుడుతనిఁ
గానను; వీఁడెవఁడో? యింతగడబిడి తగునా?
మానిని! మరియాదగ నీ
సూనునిఁ గొనిపొమ్ము! చాలు సుద్దులు ముద్దుల్." 99

క. గర్జింప నిటుల, మానిని
జర్జరితముగాఁగ మనసు, జాఱఁగఁ గన్నీ;
రూర్జితతీక్ష్ణేక్షణయై
తర్జనిఁ జూపుచు వచించెఁ దల నాప్పు చికుర్ - 100

క. తెలియనివారికి తెలుపుట
సులభము; మఱచినను దెలుప సుకరము యగుఁ; నీ—
వలె దెలిసి తెలియమను నట
కులతలఁపులఁ దేర్పనజునకును వశమగునా ? 101

సీ. ఎవ్వ రెఱుంగ రంచిట్లాడ నీకౌనె,
తేలును బవళులు లేవె నాథ?
కర్మసాక్షియు లేఁడె? కనులెల్ల నొడలుగా
జంద్రముఁడుండఁడే చదలఁ బొంపలో?
దివిభువులును లేవె? దిక్కులెన్నిది లేవె?
దిక్పాలకులు లేరె తెలియమునల?

ధర్మంబు లేదె? వేదంబులు లేవె? సం
ధ్యలుఁ బంచభూతంబులరయ లేవె?
తే. లేఖకులు చిత్రగుప్తులు లేరె? కృతము
కొలఁది ఫలమొసఁగెడునంతకుండు లేఁడె?
అన్నిఁటినిఁగను భగవంతుఁడంధుఁడొక్కొ?
అంతయేటికి మనయంతరాత్మ లేదె? 102

ప్రేతమైన వాని వెన్క నెవ్వియు రావు,
వచ్చునేని కాటివఱకె కాని;
యెందుబోవఁగాని పొందువాఁడనిదొక్క
మేనుపంచుకొన్న చాన సూవె! 103

సగము మెయి భార్య; తనయుం
డగుఁదన ప్రతిబింబమనుచు నాగమ వచనం
బగుఁ; దెలియఁ ధనుభయపక్షం
బగు వీరివలన వృద్ధి యవనీనాథా! 104

క్షితిరాజ్యమున్న, లక్ష్మీ
పతివైనను, నింద్రభోగ భాగ్యము లున్నన్
సతిసుతులు లేనిబ్రదుకది
వితథమగు, మసనమునఁ గాయు వెన్నెల మాడ్కిన్, 105

సుతువలన వంశవృద్ధియు,
నతులిత సద్యశము జగతియందుఁ బితరకగున్!
గతపితరుల కగు సుగతులు,
సుతుచేఁ బున్నామమలము సోఁకదు నిజమై. 106

---

ప॥ 104 పా॥ 3 అ॥ 5- దెలియ నుభయ; పా॥ 4 అ॥ 5- వలననెవృద్ధి;

ఉ. సత్యము దైవరూప మగు; సత్యముకంటెను లేదు ధర్మముల్;
నిత్యము వేదపాఠమును, నిర్మలతీర్థపవిత్రయాత్రలున్.
అత్యధికంబు నౌతపము, త్యాగవిరాగసుయోగయాగముల్
సత్యముతోడఁ దూఁగ వనిశాస్త్రముఘోషిలుసత్య మొల్లవే!– 107

ఉ. ఎంతయు నూరునూతులకు నెక్కుడు బావియొకండు సూనృతా! నూ
రంతలు బావులైన నొకయజ్ఞముతోఁ దులఁదూఁగఁజాల; విం-
కంతటినూరుజన్నముల కత్యధికుండు సుపుత్రుఁ డొక్కఁడౌ!
నంతటిపుత్రసంఖ్యశత మాఁగదుసూనృత మొక్కదానికిన్– 108

తే.గీ. కనులు తెఱచి ననుం బ్రేమఁ గనుము? వినుము!
కణ్వమునిసుత; నర్ధాంగి-గాన నీకు?
పేరున శకుంతలను; నీకుమారుఁ గనుము!
నమ్ము మీతండు నీసుకృతమ్ముఫలము! 109

క. అనఁగా; దుష్యంతుం డను -
విననొల్లను పొమ్ముపొమ్ము వెడగుపలుకులన్;
గనివిని మున్నెఱుఁగను మిము;
వనితల నృత వాదినులని వాకొనరెబుధుల్? 110

చ. అనఁగ! హతాశయై యువిద, యట్టె విషాదపవాగ్నిఁ గ్రాఁగునా
వనమునఁ, గావికంటిజడినాన్పుల నొత్తుచుఁ "బుట్టినప్పడే
ననుఁ దలిదండ్రులున్ విడిచి; నాథుఁడు నేఁ డిటు త్రోసిపుచ్చె! నో
చినఫల మిద్ది! యేఁటికిఁకఁ జింతిల! ధర్మమె పాపకర్మమే? 111

---

ప॥ 108 పా॥ 1 అ॥ 6- ఋ; పా॥ 2 అ॥ 1- ఱం; పా॥ 3 అ॥ 6- ఋ;
ప॥ 109 పా॥ 3 అ॥ 1- బే; ప॥ 110 పా॥ 2 అ॥ 6- బొ; పా॥ 2 అ॥ 11-వెడఁగు;

క. అని దృఢనిశ్చితిని మదిఁ గని,
తనతలిదండ్రుల స్మరించి, ధవునిఁ దలఁచి, క -
ణ్వుని నెంచి, యూర్ధ్వముఖయై
తనరఁగఁ గరయుగళి మోడ్చి తా నిట్లనియెన్. 112

మ. జగతిన్ ధర్మమె కాచు నేని, ఋతమే సర్వేశురూపంబ యేన్,
దగ మాకృత్యముల్ దిగీశ్వరులు నిత్యం బెంతు రేనిన్. జయిన్
భగవంతుం డొకఁ డుండె నేని, మఱి నేఁ బాటింప నానాథ్వి నేన్,
గగనోక్తుల్ ప్రకటించుఁగాక నిజమున్ గంభీర మేఘార్భటిన్— 113

క, మేఘంబు లుఱిమె, బలముగ
నాఘోషణగర్జ లెసఁగె, నటఁ జంచలల్ -
ప్యోఘంబు లొలసె, దివిని ని
రాఘాటం బైనయొక్క రవము సెలంగెన్. 114

చం. తలఁప నిర్టన్ శకుంతల ఋతమ్మె వచించె నరేంద్రచంద్ర! యీ
లలనకు నీకుఁ గల్గె గుణరాజితుఁడౌ తనయుండు; సాధ్వి యీ
చెలువ భరింపు; మీ వపుడ సేసితి బాసను గట్టు పట్ట మీ
యిలకుఁ గుమారుఁడౌ తని; కి దేటివినోద మటంచు మి న్ననెన్. 115

* శకుంతలాదుష్యంతులు గలిసికొనుట. *

ఉ, వింటిరె సభ్యులార! యిది విన్ను వచించినసత్యవాక్కు! నే
నొంటిగఁ గణ్వునాశ్రమము నొయ్యనఁ జేరి, చెలిన్ వరించి కే
లంటితి మున్. రహస్యవిధి; నన్ను లెఱుంగమి, లోకనిందకున్
గంటి భయంబు; నే స్వయముగా నిది తెల్పఁగ, లోన జంకితిన్. 116

క. అని దిగ్గున లేచి, సుతుఁ
మనమారఁగఁ గౌఁగిలించి, మఱిమోదాశ్రుల్
దనుకఁగ ముద్దులుగొని, శిర
మును మూర్కొని యెత్తికొని ప్రమోదం బెసఁగన్!- 117

చ. లలనకరంబుఁ దాఁ గరములన్ గొని, నెయ్యము దియ్య మేర్పడన్
చెలియ! క్షమింపు నేరమును జేసితి నీయెడ, దాని నీమదిన్
దలఁపకుమింక నంచనఁగ [illegible]న్విమనోహరు పాద మంటి "నా
పలుకుదురుక్తులన్ సయిపు ప్రాణపతీ!" యనె భీతచిత్తయై. 118

క. సతి పతి సుతుఁడును గలసిరి
కతిపయకాలమున భరతు క్ష్మాస్థలికెల్లన్
బతిఁగాఁ జేసి తపోవని
కతఁడేగెన్ మోక్షసాధనాసక్తమతిన్. 119

చం. భరతుఁడనంతభూభువనపాలనదక్షభుజప్రతాపుఁడై,
నిరత మనేకయజ్ఞముల నిర్మలదివ్యనదీతటంబులం
దరుదుగ నిష్ఠమై సలిపి, యాతతభూసురకోటి కిచ్చెఁజూ!
ధరణి, మదేభ,.వాజి, గృహ, దారల, రత్నసువర్ణరాసులన్.120

క. శిరమున నిడి కణ్వాజ్ఞన్
ధరణికి సామ్రాట్టగుచును దనరారె సుమీ!
మఱి వంశకర్తయునునై
చిరకాలము మనియె యశముఁ జేకొని; పిదపన్- 121

సీ. ఎలమి భరతునకు కాశేశు నందన సునం
దనయందు సుతు "భుమన్యు"ని (బడెసెను;
వానికి దాశార్హవంశసంజాతయా
విజయ యందు "సుహోత్రు"(డు జనియించె;
వానికి నిక్ష్వాకువంశసముద్భూత
యా సువర్ణకు( గల్గె హస్తినాము(;
డాహస్తి పేర నె యీహస్తినావతి
బహుళప్రశస్తత(బర(గ( గాంచె;
నతనికిని( ద్రిగర్తపతిజ "యశోధర"
కును వికుంఠను( డను కొడుకు గల్గె;
నాతనికి దశార్హజాత "సుదేవ"కు
"నజమీఢ"నామకు( డవతరించి—
గాంధారి, కైక, ఋక్షలయందు నిరువేల
నన్నూటనలుగురను దనయుల( గనియె(;
బర(గ ఋక్షజు(డు "సంవరణుండు" రవిపుత్రి
తపతియందున "గురు"నృపతి( బడిసె,
వానికి దాశార్హవంశజాత శుభాంగి
వలన "విదూరథు(" డిలను బొడమె;
నతనికి మాగధియైన "యమృత"యందు(
కీర్తిమంతు(డు "పరీక్షిత్తు" పుట్టె;
నతనికి బాహుకసుత "సుశయ"; వలన
"భీమసేను(డు( గల్గె భీమబలు(డు;
అతనికి కేకయపతి జాత సుకుమారి"
సతియందు వా "పర్యశ్రవు(డు" వొడమె;

తే. నతనికిఁ "బ్రతీప్రుఁ" డనియెడునతఁడుఁ గల్గె,
అతఁడు శిబిపుత్రిక "సునందయందు నొందె
నరుస దేవాపి, శంతను, బాహ్లికుల ను;
సురనదికి శంతనునకు భీష్ముండుఁ బుట్టె!- 122

క. అన, శంతనునకు గంగకు
జనియించె నదెట్లు సుతుఁడు? సంగమ మెటు ల
య్యెను నదికి మనుజునకు? నను
జనమేజయునకు వచించె సంజయమి ప్రీతిన్. 123

* భీష్ముని జనన వృత్తాంతము. *

మ. భరతశ్రీకరవంశరత్నము, యశోభద్రుండు, దీనావనుం
డురుసత్త్వాత్ముఁడు, శంతనుండు భుజవీర్యప్రఖ్యాతిమై భూవనీ
భరమున్ దాలిచి; రాజసూయమఖముల్ భాసిల్లఁగాఁ జేసి, తా
సురరాజప్రతిమానుఁడై, విబుధసంస్తుత్యాత్మసంశీలుఁడై! 124

క. భూజనులు పొగడ, ధరణీ
రాజన్య కిరీటకోటి రాజితపదుఁడై,
యీజగమేలెను, ధర్మమె
యీజోకన్ రూపమొందెనేమొ యనంగన్. 125

క. మృగయార్థ మొక్కనాఁడా
జగతీశుఁడు శంతనుండు చని, శ్రాంతుండై -
దగఁ గూర్చుండెంతఁగల యా
పగపొంతకు బోవఁ,గనులభాగ్యం బనఁగన్; 126

శా. చంచత్కాంచనవర్ణరంజితమహాసౌభాగ్యతన్వంగినిన్,
భ్రాంచన్మంగళచారులోకనవిభాస్వన్నేత్రయుగ్మన్, లసత్
కాంచీనూపురకంకణక్వణరుణత్కారాంఘ్రిహస్తాంబుజన్
గాంచెన్ జక్రపయోధరన్, శశిముఖిన్, క్ష్మానాథుఁ డామందటన్. 127

క. కని కనుల తనివివో! మదిఁ
గొనిదిగ్భ్రమఁ; గొంతవడికిఁ గోల్కొని; దటిపుం
జని చెలి, జనపతి-గౌరవ
ఫణితిన్! సతి కనియె మధురవాక్యప్రౌఢిన్. 128

క. చెలువా! యెవ్వరిదానవు?
చెలు లెవ్వరులేక తిరుగఁ జెల్లునె యిటులన్?
తలిదండ్రు లెవరు? నీవల
పులఁ దేలెడు సుందరాంగుఁ బురుషుఁ బడసితే? 129

ఉ, నరకాంతామణివో? సురాంగనవొ?కన్యాత్వంబొ? పత్నీత్వమో?
యరయం దెల్పుము! నీదుచెల్వు మదికాహ్లాదంబుఁ గల్గించె!భూ
వరుఁడన్ శంతనసార్వభౌముఁడ, వరింపన్‌జూడు; మెల్లప్పుడున్
బరమప్రీతిని గంటికద్దికొని సంభావింతు బింబాధరా! - 130

మ. అన, విని, హర్షమొంది సతి, యామనుజాధిపుతోడఁబల్కు, నో
ఘనగుణ! నన్వరింప మదికల్గిన నీకు, మదీయవర్తనన్
గని, యదియప్రియంబయినఁ గా దనరాదు; ప్రియంబునాకుఁ గ
ల్గనిపనికూడ; దీసమయలాభము నా కిడు దేని భూవరా! 131

క, పాణిగ్రహణ సువిధిఁ బ్రి
వీణతఁ గవగూడ సౌఖ్య వీచీకోలన్
బూనిక సంసారాంబుధి
మానుగ నినుఁ దేల్చు దాన మహితగుణగణా! 132

ఆ. సమయభంగమైనఁ జనెద నిన్నెడఁబాసి,
దీని కిచ్చగింతువేని వలతు
నన, విరాళిఁ గొన్న జనపతి గాంధర్వ
గతినిసతి వరించెఁ బ్రీతిన సలిపి.– 133

ఆ. పట్టమహిషిగాఁగఁ బడఁతినిఁ జేపట్టి
క్షీరనీరమట్లు చేరికేరి,
పవలురేయి యనక, చవులూరఁ దమిమీఱ
హాయిగా సుఖంబు లనుభవించె.– 134

శా, పుత్రల్ పుట్టినతోడనే, శిశువులన్ బోఁద్రోయు సప్రీటిబోఁ,
బుత్రుల్ శత్రులొ నాఁగనుందరి; మదిన్ భూపుండుస్సైచెన్, సతీ
మైత్రిన్ బాయఁగనోప, కాసమయమున్ మన్నించి; యుల్లేసుగుఁ
పుత్రుల్ సచ్చిరి;యష్టముండుగలుగన్, భూకాంతుఁ డాకాంతతో.–135

క. కందులనెల్లనుఁ జంపితి
వెందులకో, పుత్రఘాతివే, రక్కసివే ?
చందిరుని బోలునీనా
నందను విడు! మారి నీవు నారివె? యనినన్. 136

ప॥ 132 పా॥ 1 అ॥ 7 విధిని; ప॥ 135 పా॥ 1 అ॥ 2- త్రులే;
ప॥ 136 పా॥ 1 అ॥ 9- ప;

సీ. ప్రాణనాథ! సమయభంగంబయ్యె; నేజహ్ను
తనయను, దేవహితంబుపొంటె,
వరియించితిని నిన్ను; వసువులీ యెనమండ్రు
మునివసిష్ఠుని శాపమునను జేసి
క్షితి బుట్టువారలై, బ్రతిమాల్క జననినై
కలిగినప్పుడె యసువులకుఁ బాప
నే నియ్యకొని, యిట్లు నేర్పున మెలఁగితి;
వినుమింకఁ బనితీరెఁ జనెద నేను;
తే. వసువులం దష్టముఁ డితండు వసుమతీశ!
నీకుఁ గూర్చుకుమారుండు, లోకహితుఁడు,
చిరము జీవించు యశముచేఁ జెలఁగు నంచు
తనయుతోఁ గూడి సతి తిరోధానయయ్యె— 137

క. దిక్కేమియుఁ దెలియక నలు
దిక్కులుగని, నాతిఁగనక, దీనవదనుఁడై,
వెక్కసపడి పడి, పిమ్మటఁ
దక్కను కాలంబుతోడఁ దానాచింతన్— 138

మ. చన నిట్లేండ్లును బూండ్లు, నొక్కదినమా ప్రాణనాథుఁ, డాగంగ చెం
తనువిశ్రాంతిఁ గొనంగ నేగి, మునుపా తన్వంగి యీచోట నే
కనుగొంటిఁగద! నేడు నాకునటులే కన్పింపరాదే! యయో!
ఘనపుణ్యంబది యెట్లుగల్గుననుచున్ గన్నొత్తి వీక్షింపఁగన్, 139

తే.గీ. గంగ కట్టుల నిట్టుల గట్లుగలయ
బాణమ్ముల లీలగా మీటి, యానగట్టి

గంతులిడుబాలు నొక్కనిఁ గాంచి యుధిష్ఠిరుఁ
డబ్బురంపడి, యాచెంత కరుగునంత - 140

కం. అంతర్ధానము నొందెను
కంతునిభుఁడు, చిట్టిపట్టి; క్ష్మానాథుం, డా
వింతకు వెలవెలవో, నొక
కాంత తనయుతోడఁ బోలిచి కని ధరణీశుక్ - 141

ఉ. జ్ఞాపకమున్న దే రమణి! గాదిలినందను గంటె, నేమమై;
భూపకులేంద్ర! నీసుతునిముద్దుగఁ బెంచితిఁ, బెద్దఁజేసితిక్;
తేఁపగఁ బూనుపీనిఁ, గులదీపకుఁ డీఁతఁడగుక్, గుణాఢ్య! యీ
పాపఁడు నిన్నుఁబోలుఁ జుమి! బాహుబలంబునఁ, బెంపు పెంపునక్

సీ. చదివె వసిష్ఠుచే విదితంబుగా నెల్ల 142
వేదంబులను మది వెలయునట్లు;
నేర్చె శాస్త్రార్థముల్ నెఱి దేవదాన వా
చార్యులయొద్ద విచారసరణి;
పడెసె ధనుర్విద్య, కడదాఁక నలవోక
దర్పితుం డగు జామదగ్న్యువలన;
మొనసి యాధ్యాత్మ మామూలంబు గుఱిగొనె
సనక సనందనమునులయొద్ద;
తే. సాటి లేరెందు వీఁడెవో! మేటిసర్వ
విద్యలందును, గళలందు, విశ్వమందు
పేరు దేవవ్రతుండు, గుమారుఁడింక!
అనుచు సుతు నప్పజెప్పి మాయంబు నగుడు. 143

తే. పలుకరించియు మఱుమాట నడయ లేక,
పట్టనుంకించి బఁడులును బట్టిపట్టి,
చూచిచూచియుఁ దిశలెల్లఁ జూడ్కు లనియు,
ఓర్పు మిఱిమీఱ నొక్కనిట్టూర్పు పుచ్చి – 144

క. చెంతఁ గలనందనుని గని,
యెంతయుఁ దమిఁ దిగిచి, ముద్దు లిడి, మఱియు చెదరన్
సంతోషించుచుఁ, గాంతా
భ్రాంతిని విడి, వీడు జేరె, రాజు సుతునితోన్. 145

ఆ. పుత్రుఁ దెచ్చి; సర్వమిత్ర బాంధవబుధ
ప్రతతిఁ గూర్చి యౌవరాజ్యమునకుఁ,
బట్టమొప్పఁగట్టి పట్టికి, వైభవో
పేతముగను ధాత్రినాతఁ డేలె, 146

* శంతనుఁడు గంధవతిని మోహించుట. *

ఉ. నాలుగువత్సరంబు లిటు నందనుతో విడకుండి; ఱేఁడు తా
లీలఁ నొక్కఁడే యమున రేవున కొండొకనాఁడుఁ బోవఁగన్;
వాలి వినూత్న సౌరభము వాయువశంబున, నాసికాపుటం
బేలిన, నల్గడల్ గలయ నేపునఁ గన్గొన,–నొక్క తావునన్. 147

సీ. మహనీయ సౌందర్య లహరియే యగుదాని,
నగమొగంబునఁ జంద్రుఁ దెగడుదాని,
కడలకు జూడ్కులఁ గడుమెఱుం గిడు దాని
గలకండ లొలికించు పలుకుదాని,

---

ప॥ 144 పా॥ 1 అ॥ 9- ఋ; ప॥ 145 పా॥ 4 అ॥ 8- డుఁ;
ప॥ 147 పా॥ 2 అ॥ 13- ఁగొ; పా॥ 3 అ॥ 12- వశం; పా॥ 4 అ॥ 5- ల్గ;
ప॥ 148 పా॥ 3 అ॥ 1- ఁగ; పా॥ 4 అ॥ 8- కిం;

తళ్కు_బెళ్కులఁ జిల్కుకుల్కు గుల్కెడిదాని,
మేలైన చెక్కుటద్దాలదాని,
కంతునైనను బంటుగా నేలఁదగుదానిఁ
గలదులే దనవొప్పుకొనుదాని,

తే. గబ్బిగుబ్బలయుబ్బునఁ గ్రాలుదాని,
అంచలకుఁగూడ నడక నేర్పించుదాని,
బదియునార్వన్నె పైఁడిమేల్ పసిమిదాని
నోడఁ గడపుచునున్నట్టి ప్రోడఁ గనియె, 148

క. కనిశంతనుఁ డాచోటికేఁ
జని, యుల్లము పల్లవింప సోకినదానిన్,
కను, మనసుకలవ్రదీఱఁగఁ
గనియె నెగాదిగఁ, బడంతి కని వెడనవ్వెన్. 149

ఆ. ఎన్ని, పలుకరాని, చిన్నెలవన్నెల
యన్నుమిన్న నాదుకన్నుఁ బొలిచె;
నక్కజంబుగాఁగ నజునకు మాఘ్రోడ్డి
మరుఁడు దీనిఁ జేసె మాయఁ గానె!, - 150

చం. అనితలపోసి, తేఁ డనియె నామెకు, నూత్నతనూవిలాసినీ!
ఘనకుచ! చారునీలకచ! కాంతివిలోలవిశాలలోచనా!
అనుపమభూరిచక్రజఘనా! కరియాన! సుధాకరాననా!
గుణాధన! వెన్నరీవనినఁ గోమలి యిట్లనునల్లనవ్వుచున్. 151

ప॥ 148 పా॥ 1 అ॥ 1 ·ఁద; పా॥ 3 అ॥ 1-ఁగ;
ప॥ 150 పా॥ 3 అ॥ 6- గాఁగఁ;

ఆ. పొగడి తీవు మనసు పగిది తేఁటగ; నాదు
మ్రొక్కు నీకు. నీదుపొగడికలకు!
నిన్ను నెన్నిపొగడ నే నంతచాతుర్య
వతినె; సతులుమానవతులు సుమ్ము!. 152

ఆ. దాశరాజుముద్దుతనయను; కన్యను;
పేరగంధవతిని; పితృనియోగ
మందియోడఁగడపుచుందునిం దెప్పుడు
వలతువేని, నిన్ను దెలుపు మనిన- 153

క. శంతనుఁడ, ధరాకాంతుఁడ
కాంతా! వరియింప నిన్నుఁ గాంక్షించితి, వి
భ్రాంతవిలోకన! కుచగిరి
ప్రాంతమునం దెత్తి నన్నుబాలింపు మనన్- 154

ఆ. వాంచి శిరము సిగ్గువారి, నేలను కాలి
వ్రేల వ్రాయు చప్పుడు, వెలఁది పల్కె,
నీవెఱుంగరానినెఱి యున్నె! కన్నె స్వ
తంత్రి గాదు; పొమ్ము తండ్రికడకు. 155

చ. అన నగుఁగాక, యంచపుడె యాతడుపోయి యభీప్సితార్థముల్
వినుపఁగ; దాశరాజు:- పృథివీరమణా! నినుబోలుఱేఁడు నా
యనుఁగుసుతన్ వరించి, యిటులల్లుఁడు నాకగుటెల్ల భాగ్యమౌ;
అనఘ! మదీయ మానసమునం దెసలారు నభీష్టమొండిటన్ 156

ప॥ 153 పా॥ 1 అ॥ 11- గ; ప॥ 154 పా॥ 2 అ॥ 13- క్షిం;
155 పా॥ 1 అ॥ 10- ఱి; అ॥ 14- గా; ప॥ 156 పా॥ 1 అ॥ 13- తఁ;

క. "నాపట్టి కుద్భవించెదు
నాపట్టియె నీకుఁ బిదప నవనీతలముౕ
జేపట్ట నీవు సమయం
బీపట్టునఁ జేయఁ గూతు నిత్తు" ననంగౕ. 157

ఆ. "పెద్దకొడుకు గల్గ పిన్నవాని కదేట్లు
కట్టవచ్చు రాజ్యపట్ట మనఘ!
నీతిగాదు, శాస్త్రరీతిగా దీకోర్కె
మాని తనయు నొసఁగి మనుపు" మనిన – 158

ఆ. రాజు పల్కు వాశరా జొల్లక శిరమ్ము
నడ్డముగఁ గదల్చి, యాననమ్ము
మఱొకవంక ద్రాల్చి జరుగ దివ్యాది యున
జేఁడు చిన్నవోయి వీడుఁజేరె. 159

ఉ. కామినిపై విరాళిఁగొని కాయజసాయక బాధితాత్ముఁడై,
భామనితాంతసంస్మరణ భావమహావిరహాగ్ని దగ్ధుఁడై,
యామనుజేంద్రుఁ డంతిపురమం దొకహర్మ్యమునందు నొక్కెడి
వ్యామలహంసతూలిక నిజాంగమువాలిచి, సోలిసుక్కుచుౕ.160

క. ఆడఁడు మాటల, నేరిౕ
గూడఁడు; దరిఁజేరఁ గనఁడు గొడుకుౕ; గడకుౕ
జూడఁడు సచివుల, మలమల
మాడుౕ మదనాగ్నిచేత, మానినిచింతౕ. 161

* భీష్ముఁడు గంధవతిని దెచ్చి తండ్రికప్పగించుట. *

శా. ఆ దేవవ్రతధీరుఁ డాజనకు నభ్యర్థించి, తత్కారణం
బేదో యింతగ్రహింపనేరకయ లో నెంతేనిఁ జింతించి సాం
పేదన్ గుందుచునుండ; గంధవతిపై నిష్టంబుచే రాజు లో
ఖేదంబుం గనుటెంచి మంత్రి తెలుపన్ ఖిన్నుండునై సర్వమున్. 162

మ. విని, యీమాత్రకె యింతవుట్టె ననుచున్ వే దాశరాజున్ గనన్
జని తా వచ్చినకార్యమున్ వినుపఁ గా; సమ్మోదియై దాశరా
జను: నాయాత్మజనందనుండె, క్షితిరాజ్యం బేల నీవొప్పచో
విను మత్పుత్రి వరించు నీజనకు, పో వేతైనఁ గారా దనన్. 163

మ. విని యాశాంతనవుండు పల్కె "సమయం బే నేని దే సల్పెదన్
గాన నే రాజ్యము నీసుతాత్మజునకే గూర్తున్ మహీపట్టమున్
గనుమా! నీమది మాను సంశయ మనంగా దాశరా జాడు: నో
యనఘా! యట్టిఁడవీవు నీసుతులు నీయట్లుందురే యుందురే? 164

మ. అన; గంగాత్మజుఁ "డే వివాహవిధి నే యాశింప కాజన్మమున్
ఘనశం బూనితి బ్రహ్మచర్యమునుదీక్షన్ జూ వె చంద్రార్క భూ
మ్యనలాద్యష్టదిగీశసాక్ష్యముగ సత్యం" బంచు సల్పెన్ బ్రతి
జ్ఞను నగ్గాయత మేఘగర్జనము నా సర్వాశల న్నిండఁగన్. 165

క. కురియించి కుసుమవృష్టిని
సరగన్ దేవవ్రతుండ! సత్యవ్రత! నీ
సరిలేరు లేరు లేరని
యరుదారఁ బ్రశంసఁ జేసి రమరులు మింటన్. 166

ఉ. అంతట దాశరాజు తనయన్ గొని తెచ్చిన, భీష్ముఁ డామె క
త్యంతముభక్తి మ్రొక్కి "దయ నమ్మరో! నాఁ జనకున్ వరించి, మా
వంతలఁ దీర్చి, వంశమును బావనమున్ బొనరింపుతల్లి! యం
చెంతయు వేఁడ, నామె రథ మెక్కినఁ దా నరదంబుదోలుచున్. 167

ఆ. వచ్చి గంధవతినిఁ దెచ్చి తండ్రికొసంగెఁ;
"గలఁడె యిట్టిపుత్రుఁ డిల మఱొక్కఁ"
డనుచు మెచ్చి సుతున కాతఁడు స్వచ్ఛంద
మరణమిచ్చి యాయమను వరించె. 168

సీ. ఆరీతి శంతనుఁ డాసత్యవతిఁ బెండ్లి
యాడి యాసతిఁ గూడి క్రీడసల్పి,
చిత్రాంగదుండు, విచిత్రవీర్యుండు నా
కొడుకుల నిరువురఁ బడసి, పుడమిఁ
గడువెల్గి, పిమ్మటఁ గాలధర్మము నొంద,
భీష్ముఁ డంత్యక్రియల్ పితకు సలిపి,
తల్లి యానతిని జిత్రాంగదు సామ్రాజ్య
పట్టాభిషిక్తుఁగాఁ బరఁగఁ జేసె;

తే. దుండగీఁడయి, యతఁడు ప్రచండవృత్తిఁ
గండుమీఱుచు, బలమదోద్దండుఁ డగుచు,
వీఁక గంధర్వపతితోడఁ దాఁకి పోరఁ;
గడఁక వానిని భువిఁ గూల్చె ఖచరవిభుడు. 169

---

ప॥ 167 పా॥ 2 అ॥ 12- మ్మ; ప॥ 168 పా॥ 2 అ॥ 11- త్రొ;
ప॥ 169 పా॥ 4 అ॥ 1- ఁగొ; పా॥ 12 అ॥ 15- భుఁ;

క. అది తెలిసి శాంతనవుఁ డా
పినపఁ బాలుని విచిత్రవీర్యుని, కురురా
ట్పదమున నిల్పి, స్వవశంబుగ
సదమలమతి రాజ్య మేలె జనులు నుతింపఁ. 170

క. శ్రీకాంత, కీర్తికాంత,
క్ష్మాకాంతలు దోడువిడక సలిపెను గ్రీడల్
సాకారమార, వరధ
ర్మాకార బ్రహ్మచారి యగుభీష్ముఁ డహో! 171

♦ భీష్ముఁడు కాశీరాజు కూఁతులఁ దెచ్చుట. ♦

సీ. ప్రాప్తయౌవనుఁడయి పరఁగువిచిత్రవీ
ర్యునకుఁ బెండిలిసేయు మనసువొడమి
విని కాశిరాజ నందనలస్వయంవరం
బని; యొక్కఁడే భీష్ముఁ డరిగి యచటకు,
నాస్వయంవర రంగమందు సాహసమునఁ
జొచ్చి విచ్చలవిడి చూచి యేచి
నిండినరాజులగుండె లవియఁ బెండ్లి
కూఁతుల ముగుర సంప్రీతిఁ బట్టి
తే. యెత్తి రథమునఁ బెట్టి చేయెత్తి చాటె;
నీస్వయంవరకన్యల నిదిగొ నేను
గొనుచుఁ జనియెద మత్సోదరునకుఁగూర్ప;
ధర్మ మిది; క్షాత్రవీరసత్కర్మ మిదియు,- 172

ప॥ 171 పా॥ 2 అ॥ 4- లఁ; ప॥ 172 పా॥ 10 అ॥ 2- న్వ:

క. గుంపెగలమగలుఁ గలిగిన
తండ్రీకన్యలఁ గొనన్ ధురం బొనరింపన్;
చెండుచుఁ బ్రచండమార్గణ
తండములన్ దులుపు నరివితానశిరోధుల్." 173

చ. అనివిని సాళ్వుఁడాదిగ మహాభుజశౌర్యబలోద్ధతుల్, నడిన్
గదిసిరి యస్త్రశస్త్రము లఖండముగాఁ గురియించి భీష్ముపైఁ
గుదులఁగ దిగ్దిగంతములు కో యని యార్చుచు మిన్నుమన్ను నే
ఁజది గుఱుతింపరానటుల నాతఁడు తీవ్రశరాగ్ని వేల్చినన్- 174

సీ. దిక్కేమితోఁపక, గుక్కిన పేలట్లు
మెదలక, భూమిపై నొదగువారు,
కాళ్ళు సేతులు దెగి త్రెళ్ళిధరాస్థలిఁ
బొరలుచుఁ బ్రాణముల్ దొరఁగువారు,
అసువులతీపిచే నందందుఁ బరువెత్తి
డిల్లిచ్చుకొని నేలఁ గూలువారు!
తలకొని నాటునమ్ములధాటి కోర్వక,
బిట్టుగా మొఱ్ఱలు వెట్టువారు;
కొనయూపిరులతోడఁ గొడుకుల నిల్లాండ్రి
మఱిమఱి తలపోసి మఱఁగువారు;

తే. నయ్యె, స్వయంవరమండప మతిభయంక
రముగఁ ద్రుటిలోన సంగ్రామరంగభూమి
విహ్వలాక్రందనధ్వనుల్ వెల్లివిరియ
రక్తమాంసాశన పిశాచగాఢమయ్యె. 175

ప॥ 173 పా॥ 2 అ॥ 10 దు; ప॥ 175 పా॥ 6 అ॥ 2- లి;

మఱిమఱి యుఱికెదు వైరుల
నఱకెఁ గఱకుకుటంపరల, ఘనంబుగఁ దుములం
బఱిముఱి సేయఁగ, నెఱిసెడి
వెఱచఱచిరి యుద్ధభూమి విడివడి పగతుల్. 176

అంతట సాళ్వుం డెదిరి, దు
రంతంబుగఁ బోర, భీష్ముఁ డాతతబాణా
క్రాంతునిఁ జేయ నతఁడు వి
భ్రాంతుండై యుఱికె సతులు పకపక నవ్వన్. 177

పోర నేరక యరుల్ పాఱిన, భీష్ముండు
నరదంబు దోలించి, కరినగరికి
నరిగి, కాశీశుకన్యల ముగ్గుర విచిత్ర
వీర్యున కనురక్తిఁ బెండ్లి సేయఁ
దలపోయుచుండ, నా చెలులఁ బెద్దదియైన
యంబ భీష్మునితోడ ననియె ననఘ!
వరియించె నను సాల్వవసుధేశుఁ, డతనికిఁ
దండ్రిచే నేఁ బూర్వదత్తనైతి;

ఆ. నిందు నీవు ధర్మహితుఁడవై వర్తింపఁ
దగు నటంచు కలవిధమ్ముఁ దెలుప,
నతఁడు బ్రాహ్మణానుమతమున నంబను
సరగ విడిచిపుచ్చె సాళ్వకడకు. 178

క. అంబాలికాంబికల శశి
బింబాననలను విచిత్రవీర్యున కిచ్చుచు౯
సంబరమారఁగ, వైభవ
మంబరతలమంటఁ బెండ్లి యతఁ డొనరించె౯ 179

ఉ. రూపసుధాసతీమణులరూపకళల్ మది నంటి విభ్రమా
రోప, విచిత్రవీర్యుఁడు విహారవినోదవిచారశీలుఁడై,
యేపున రాజ్యకార్యము లొకింతయుఁ జూడక, మారరాజ్యచిం
తాపరుఁడయ్యె కాముపరితప్తునకా పరిసౌఖ్యచింతనల్ ?? - 180

ఆ. ఆవిచిత్రవీర్యుఁ డనయంబు నెపపక
కామభోగములను గనుటఁ జేసి,
హేయ మగుచు కాయ, మాయువు క్షీణించి,
పసితనంబునందె, యసువు లెడలె. 181

తే. విప్రబాధవలతిఁ గూడి భీష్ముఁడతని
కౌర్ధ్వదైహికకర్మల నాచరించి,
పుత్రశోకార్తమై మది బొగులుచున్న,
తల్లిని౯ దనమఃజపంద్ర దరిసి పలుకు. 182

ఉ. పక్షులు గొన్ని వృక్షమున వ్రాలి. పదంపడి దిక్కు-దిక్కుల౯
బక్షము లార్చి కొంచుఁ జనుభాతి. సతీసుతబంధులాదిగా -
నీక్షితిఁ గూడివీడ్వడుట లేర్పడు; శాశ్వతముండఁ బోదు; ప్ర
త్యక్షమ కాదె యెల్లరకు, నారట లేమిటి కిట్టివానికె. 183

---

ప॥ 180 పా॥ 1 అ॥ 4- లా; ప॥ 182 పా॥ 3 అ॥ 8- ది;

క. ఎంతగ శోకించిన నా
వంతయు ఫల మున్నె? పడయవచ్చునె మృతులన్?
శంతను వంశము రూపఱు
నంతటిగతిపట్టె నరయఁ డాకార్యంబున్. 184

క. అని యూఱడఁబల్కిన కొడు
కును మదిలో మెచ్చి; యనుఁగుఁ గోడండ్రఁ బురం
బున నిలిపి, యనల గాంగే
యునితో సత్యవతి గుప్త యోచనము వొయిన్. 185

♦ వేదవ్యాసునిచే పూరువంశముద్ధరింపఁ బడుట.♦

ఉ. ఈ వనిఁ (?) బ్రహ్మ మొదలిప్పటిదాఁక సమృద్ధినున్న యీ
పావనమైన యన్వయము పాడ ఱుదుస్థితి వచ్చె! నిల్చె నా
వీవొకరుండ; వెంచ బరువెల్లను నీతలపైఁ బడెన్ గదా!
యేవిధినైనను వంశ మభివృద్ధియొనర్పక యీవ జంకినన్- 186

క, పాపంబునుఁ దుడిఁ బశ్చా
త్తాపంబును దుర్యశంబుఁ దప్పవు నీకున్;
ఓపిక భరించి రాజ్యము;
దీపింపఁగఁ గులము సంతతిని బడయు మనన్. 187

ఉ. తల్లివి, ధర్మమూర్తివి, యథావిధిరీతి నెఱుంగు జ్ఞాని, వీ
చెల్లనికార్య మూనుమనఁ జెల్లునె! నావ్రతభంగ మోర్తు వే!
చల్లనదైన నగ్ని రవిశైత్యముఁగన్న నభంబుజా తౌనే
నల్లన భూమి పైకెగసియాడిన నాదుప్రతిజ్ఞ తప్పునే? 188

ప॥ 186 పా॥ 1 అ॥ 4- వ; పా॥ 4 అ॥ 6- మ్ము;
ప॥ 188 పా॥ 3 అ॥ 4- నై;

క. ఇది కానిపనియః వేఱుప
గిది యున్నది, నాఁడు నేఁడు క్షితిదేవుఁడు నె
మ్మది క్షాత్ర క్షేత్రము సం
దుదయింపఁ జేయు టొప్పు నొగిసంతతులన్. — 189

క. ఇదియాపద్ధర్మం బగు,
నిది శిష్టాచార మయ్యె, నిది క్షత్రియులం
దొదవె సనాతనవిధిగా
మదిఁ జూడుము తల్లి! నీకుమత మగు నేనిన్. — 190

క. అనుభీష్మునిపలుకుల మదిఁ
దనిసి పలికె నిటుల నామె తనయునితోన్,
మును జరిగిన దొంతొకకథ
విను! మదిమనకార్యమునకు వెరనగు నేమో. — 191

సీ. కన్నెనై నేనున్న కాలమం దొకనాఁడు,
మునిపరాశరుఁడు, నాంతనుప్రసంగతి
నాదుకన్నెఱికంబు వోదంచు వరమిచ్చె,
నంత సద్యోగర్భమందు నాకుఁ
గలిగెను బుత్రుండు, కానీనుఁడగుచు నా
రాయణాంశన్ బాదరాయణుండు; —
"పనివడితలచుచో వత్తు" నంచనినాకు
వచియించి తాఁ దపోవనికి నేగె;

తే. పాత్రిఁ జాతసిచే నీదుభ్రాతృసతుల
యందు సంతతిఁ బడయ యోగ్యంబయేని
తెలుపు, మాబిడ్డనిన్ బిల్తుఁ దలచునంత
వచ్చి మనచింత నతఁడు వోఁబుచ్చు ననఁగ. - 192

క. చేతులు మొగిడిచి భీష్ముఁడు
దాతయ యగువ్యాసమౌని తాఁ గురుకులమున్
బ్రీతిఁ బ్రతిష్ఠించుట మన
కాతతభాగ్యంబకాదె యనిపల్కంగన్, 193

మ. తలచెన్ సత్యవతీసతీమణి మునీంద్రస్వామినిన్, దోడ - ముం
దలఁ బ్రత్యక్షతనొప్పెఁ దా, జలదగాత్రి జ్యోతులేపార, నం
ఘ్రులమేరన్ జటలార, శ్మశ్రువులు బారుల్ దీర, చర్మాంబరం
బలరన్ దండకమండలమ్ములు స్వహస్తాబ్జంబులన్ శోభిలన్. 194

క. మోదాశ్రు లురల, సుతునిన్
సాదరమునఁ గౌగిలించె సత్యవతి; వెసన్
బాదముల వ్రాలె మునిపతి;
యాదరమునఁ దీర్చె భీష్ముఁ డర్ఘ్యాదివిధుల్ 195

చ. "తలఁచినకార్య మేమి" యని తల్లిని వేఁడఁ "బవిత్ర పూరుని
ర్మలినతరాన్వయక్షయకరం బగుకాలము వచ్చెఁ; భీష్ముఁడో,
తలకొనె బ్రహ్మచర్యమును; దక్కెను నీక! విచిత్రవీర్యు దే
వులవలనొప్పు క్షేత్రములఁ బుత్రక; సంతతిఁ గల్గఁ జేయుమా. 196

క. అన; వ్యాసుం డను తల్లీ!
చను నిది శ్రుతిసమ్మతంబ! జన్నియు యొక యేఁ
డొనరింపఁ దత్సుతులు, సుతు
లను నేఁ గలిగింతు దేవరన్యాయమునన్. 197

చ. "ధరణి యరాజకంబయిన ధర్మము నాశమునొందు;దుర్మతుల్
నెరసి బుధాళి కెగ్గు, లవినీతినొనర్తురు; వృష్టిశూన్యమౌ;
పరువడినీతిబాధలు ప్రవర్థములౌఁ; దడయంగరాదు, వే
ధరపరిపాలనార్థముగ ధర్మముఁగాన సుపుత్రు నీఁగదే!- 198

క. నీకరుణఁగలుగుసుతులు వి
వేకముఁగనుదాఁక, ధరణి భీష్ముండెలమిన్
జేకొని పరిపాలించును;
నాకట్టడ యిద్ది నీకు నందన! యనుచున్.- 199

చ. తనయున కొప్పఁజెప్పి వెసఁ దాఁజని యంబికఁ జేరిపల్కు–"నో
వనితరో! క్షేత్రజుండయినవాఁడె సుపుత్రుఁడు; ధర్మమైననా
పనుపు భరింపు; మీభరతవంశము నీయెడ నిల్పు నీనిశన్
ఘనుఁ డరుదెంచు దేవరుఁడు, గన్గొని తుష్టుని,జేయుమాతనిన్."200

క. అని కోడలి నొడఁబడఁగా
వినిచి; ధరామరులకెల్లఁ బ్రియ మలరారన్,
దనియఁగ మృష్టాన్నం బిడి;
ఘనమోదముతోడ నుండఁగా; నారాత్రిన్.

ప॥ 197 పా॥ 1 అ॥ 8- ద; ప॥ 198 పా॥ 3 అ॥ 1- (బ;.

తే. అంబికాదేవి శయ్యా గృహంబునందు,
అనసరజ్ఞుఁ డగుచు వ్యాసుఁ డవతరించి,
తజిమఁగ, వికృతరూపునిఁ దపసి రోసి,
కన్నుఁగవ మోడ్చి యంబిక మిన్నకుండె. 202

ఆ. ముని యనుగ్రహించి ముగుదను, వెలివచ్చి
యనియె జననితోడ "నధిక బలుఁడు
కొడుకు గలుగుఁ గాని గ్రుడ్డివాఁ డగుఁజుమి!
మాతృదోషమునను మాత! వింటె", 203

ఉ. చాలవిషణ్ణచిత్త యయి, సత్యవతీసతి, పుత్రుఁ గాంచి యం
బాలిక కొక్కనందను గృపాదయ సేయఁగ వేడిఁ పోయిచు
బ్బాలిక కొప్పజెప్పె;- మునివర్యుఁడు డగ్గఱఁ గాంత, వెల్లనై
సోలినఁ, బుత్రదానమిడిసుందరికిన్; జని మాని, మాతతోన్. 204

క. తల్లీ యంబాలిక కొక
పిల్లఁడు వంశప్రవృద్ధవీరుఁడు వాఁడమ్మున్.
తల్లి దయినదోసముచే
వెల్లని దేహంబుగలుగు విను! మని చనియెన్. 205

♦ ధృతరాష్ట్ర పాండురాజుల జననము ♦

క. అసదృశ బాహు బలాఢ్యుని,
నిసువున్, వరకురుకులాఢ్యునిన్, ధృతరాష్ట్రున్
బిసరుహలోచన యంబిక
ప్రసవించెను నెలలునిండి ప్రజ్ఞాచక్షున్. 206

---

ప॥ 204 పా॥ 2 అ॥ 18- వేఁడిఁ; ప॥ 205 పా॥ 3 అ॥ 1- ద;

క. ఆసమం బాలిక కనియెను
ధీయుత, ధర్మజ్ఞు, సుగుణదీపితు భుజవీ
ర్యాయుతుఁ, బాండురగాత్రుని
శ్రేయమాంచితుఁ బాండురాజు శ్రీమానితు నిట్. 207

క. ధృతరాష్ట్రపాండులకుఁ దా
నతిముదమున జాతకర్మ మాదిగవిధు లా
తతముగఁ దీరిచె భీష్ముఁడు
క్షితిసుర బాంధవులఁ గూడి చెన్నలరారన్. 208

ఆ. గ్రుడ్డివానిఁ బాండ గూఫుని దిలకించి
సత్యవతి మనంబు చాలనొచ్చి
తనయు నమితవినయుఁ దలఁపఁ బారాశర్యుఁ
డాక్షణంబు తోఁచె నంబ యెదుట. 209

తే. అట్లు ప్రత్యక్షుఁ డైననిజాత్మజాతుఁ
గౌఁగిలించి ప్రియం బెదఁ గ్రాల నతని
తలయు మొమ్మును హర్షాశ్రుతతిని ముంచి,
కొడుకునకు నేకతంబున నుడివె నామె. 210

తే. పుట్టుగ్రుడ్డియుఁ బాండవు బోలుచుతనయు
లేల? గొడ్రాలితన, మొర వింతకంటెఁ;
గాన నంబిక కిఁక నొక్కసూను. నిడఁగఁ
దగదె? యనుతల్లిమాటను దలను దాల్చె. 211

ప॥ 210 పా॥ 2 అ॥ 16- గ్గని; పా॥ 3 అ॥ 3- ను;

శా. అంతన్ సత్యవతీసతీమణి, మహోహర్షంబుతో, నంబికా
కాంతారత్నము జూచి, వార్త వినుపంగా; నవ్వ డాతన్వి లో
నెంతే గోసి వికారవేషధరు మౌనీంద్రున్! తగన్ దాసి నే
కాంతాలంకృతఁ జేసి, తార్చె శయనాగారంబునన్ బాన్పుపై. 212

క. మునివరుఁడు పడకటింటికిఁ
జని, తల్పము జూచి, — దాసి సరసక్రీడన్
దనుఁదనుప, మెచ్చి చూలిడి
వనితకు దాస్యంబు తొలఁగ వరమిడి చనియెన్ 213

క. మాండవ్యమౌని శాపం
బుండుట, ధర్ముండు వొడమె నుర్విని దా, శూ
ద్రుండయి, ధర్మవిదుఁడు విదు
రుం డన, వ్యాసమునికరుణ రుచిరప్రతిభన్. 214

♦ ధృతరాష్ట్రపాండురాజుల బాల్యక్రీడావిశేషములు: ♦

తే. బాలురై యుండి ధృతరాష్ట్రపాండురాజు,
లింతలింతలుగా నభివృద్ధి నొంది
ఆపగాత్మజరక్షితులై కడంగి
విద్దెలందుఁ బ్రసిద్ధులై వెలసి రెలమిఁ. 215

చ. అమరనదీతనూజభుజ మానినకౌరవరాజ్యలక్ష్మి యు
ద్యమపరులు మెచ్చనచ్చునడె, న్యాయమునన్గడ వెల్గె భూజనుల్
సుమనసులై సుఖాభిరతిఁ జొక్కిరి పాడియుపంటలారఁగా
క్షమ తృణసస్యపుష్పఫలసంగతమై జలపూర్ణమై తగెన్. 216

ఉ. "నాలుగు మోములున్ వలయునా విధికింబలె? నంచు నప్పుడున్
లీలఁ గ్రుక్కఁ ద్రిప్ప, కటులే తలక్రిందుగ నైన - వేప, మా
మూలము నొప్పఁ జెప్పెదరు భూసురు, లయ్యెడ నగ్నిహోత్రము
ల్కాలముల౯ భజింత్రు, కలకాల మొనర్తురు యజ్ఞయాగముల్. 217

ఉ. పుణ్యనదీతటాకతట భూసుర దేవనివాసభూమిఁ బ్రా
మాణ్యపవిత్ర దేశముల మానక స్వస్తిపదాదివాక్యముల్
గణములై సెలంగె, వినఁగా ననువయ్యెను వేదమంత్ర, మా
రణ్యమునీంద్రవాసముల, రాజ్యసమృద్ధివిసూచికంబులై. -218

తే. అతుల బ్రహ్మాస్త్రముగఁ బ్రజాభివృద్ధి -
సస్యవృద్ధిగ క్షితియొప్ప; సార్వభౌమ
పదవి నప్పాండునకుఁ గట్టి,- విమలబుద్ధి,
విల్లుతనదిగ. రాజ్యంబు భీష్ముఁ డేలె, 219

చ. ధరణి సమస్తరాజులు సతంబును దన్ భజియింప, భీష్ము [illegible]
ర్ధరతర బాహుదండ పరిర[illegible]డై తగఁ బాండుభూవిభుం,
డజశోఅలేక రాజ్యమును, హస్తిపురంబది రాజధానిగాఁ,
బరతరకీర్తి నేలె, ప్రజభక్తినయంబుఁ బ్రియంబుఁ జూపఁగ౯.220

రాజు జనుషాంధుఁ డెందుఁ గారాదు గనుక,
పట్టమును నుండి పాండునృపాలుఁ డెపుడు,
రాజశాసన మాధృతరాష్ట్రు చేత
బరఁగ, బ్రజ నేలెఁ దనదు సౌభ్రాత్రి మెసఁగ. 221

ప॥ 218 పా॥ 3 అ॥ 2 ణ్య; ప॥ 220 పా॥ 1 అ॥ 24- ధు;
ప॥ 220 పా॥ 2 అ॥ 13- క్షకు; పా॥ 4 అ॥ 9- ఁబ;

తే. ప్రాయ మొప్పారఁ గా ధృతరాష్ట్రునకు, వి
వాహ మొనరింప, గాంధారభర్త సుబలు
తనయ, గాంధారి యనుకన్య తగు నటంచు
దలఁచి భీష్ముండు, విదురుతోఁ బలికె నిట్లు 222

క. కుసంతతివిచ్ఛేదముఁ
బరికింపఁగ లేక. సత్యవతి ప్రార్థింపన్—,
నెఱి నుద్ధరించె మఱలన్
పరమేష్ఠిసమ ముండు వ్యాసభగవానుఁడిలన్. 223

తే. అట్టివంశాభివృద్ధి నా కభిమతంబు:
సుబలసుత యైనగాంధారి, సుతశతంబ
నడయు హరుచేత వరములఁ బడసెనంట!
దాని ధృతరాష్ట్రునకు గట్ట నగదె విదుర. 224

సీ. అని సమాలోచించి, యతనిసమ్మతిఁ గొని,
పనిచె బ్రాహ్మణుల సుబలునికడకు;
వారలు గాంధారపతిఁ గాంచి, యనుమతి
వడసి, భీష్మున కది వలుక, నతఁడు
సర్వసన్నాహముల్ సమకూర్చి, కుతుకంబు
మితిమీఱ గాంధారపతిని జేరి,
యతనిచే సన్మాన మంది, చేతఃప్రీతి
యలర, ముహూర్తంబు నరసి దరిసి.

ప॥ 223 పా॥ 4 అ॥ 1 బ; ప॥ 224 పా॥ 4 అ॥ 11- ఁద;

తే. యతివ గాంధారినిఁ మఱి సూనెచెల్లి
యంద్ర నెల్లరఁ బదియునొక్కండ్ర విడక,
శడకధృతరాష్ట్రునకుఁ దెచ్చి కడుఁబ్రియమునఁ
బరిణయ మొనర్చె విద్యుంకు లరసి మురియ. 225

క. పెండిలి ధృతరాష్ట్రమహీ
మండలపతికిం బొనర్చి మహినెగ్గెడల్
బంధువులవిందు లిడె భీ
ష్మం, డాఖండలముఖుల్ ప్రమోదము నొందన్. 226

తే. ఆసతులఁ గూడి యువ్వారి యనుగుభ్రాత
యైనశకునియుఁ. వెనువెంట నరుగుదేఱ,
బంధువుల గూడి, భీష్ముండు పదనమగుచు,
హస్తిపట్టణమును జేరి స్వస్తినుండె. 227

♦ కుంతి చరిత్రము. ♦

సీ. యదువంశసంజాతుఁ డౌ సూరసేనుఁ డన్
వసుదేవుజనకుని వరతనూజ,
"పృథ" కుంతిభోజుని పెంపుడుకూతురు,
దుర్వాసుఁ డనుమునిఁ దుష్టినొంద,
నిష్టమృష్టాన్నంబు లొసక మొసవ[illegible] నిడ,
హాని మదిని మెచ్చి మగువ కప్పుడు,
దివ్యమంత్రముఁ బ్రసాదించి "యేవేల్పునే,
నామంత్రణముఁ జేయ నతఁడు పొలిచి

ప॥ 225 పా॥ 4 అ॥ 5 ము: ప॥ 226 పా॥ 2 అ॥ 15- ల్లై;
ప॥ 227 పా॥ 1 అ॥ 11- ‹గు; పా॥ 2 అ॥ 16- ర;
ప॥ 228 పా॥ 3 అ॥ 13- కూఁ; పా॥ 5 అ॥ 14- ‹గ;

తే. పుత్రదానము నిమ్ము, నని పోయె నాతఁ!
డొక్కనాఁ డామె జాహ్నవియొడ్డుఁ జేరి
జలము స్పృశియించి, భానుని దలఁచిభక్తి
మంత్రజపమును జేసెను మగువ తెగువ. 228

క. గగనంబునుండి తోడన
జగజగమనె జాఱి భువికి సతిఁ గనుగొని యా
భగవానుఁడు నగునగుచును,
మగువా! సుతుఁడన్న నింతమరులే? యనినన్ 229.

చ. నడకుచుఁ గుంతి వల్కె:- "భగవానుఁడ! నాయదితప్పసైప్రమా
దుడికితి బాలగానఁ గడుదోస మొనర్చితి! కన్నియన్ జుమా!
బుడుతలఁ గన్నియల్ ప్రసవమున్ గనఁబోలునె? నింద పాయునే?
కడఁగితి మంత్రశక్తిఁ గనఁగా;" నని కోమలికేలు మోడ్చినన్. 230

చ. "వెఱవఁగ నేల బాల! విధివేడజమిద్యది రిత్తవోవునే?
మఱచియొ, మెచ్చియో, యిటుల మంత్రముచే నను నామతింపఁగాఁ
దరుణిరో! నచ్చితిఁ విఫలతన్ గనఁబో దది కన్యకాత్వమున్
దఱుగదు నీకటంచు సుతదానము చేసి దినేశుఁ డేగినన్.- 231

క. వెలసెను సద్యోగర్భం
బలరఁ గవచకుండలంబు లంగముతోడన్
గలుగఁగఁ గర్ణుఁడు రవిశత
విలసిత తేజంబు దెసల వెలుఁగ జనించెన్. 232

తే. ఒక్క త్రుటి దిగ్భ్రమను జెంది యక్కుమారి
తేరి, చూడ్కులు పసికందుదిక్కు వాఁటి,
మోము వికసింప మదిమది మురిసి, మురిసి,
అక్కునఁ దార్చి సతి హాయి హాయి యనుచు. 233

తే. అక్కుమారునిఁ గనికని నిక్కి నిక్కి
చెక్కిళుల నంటి, ముద్దులు లెక్కలేని
యన్ని కొని, కన్నకడుపోట; యశ్రులార్చి
ఉన్నదున్నట్టు క్షణమూరకుండి యూర్చి. 234

ఉ. అక్కట! యెట్టిదాన నిటులారడి నైతిని! యేటిజన్మ మిం
కెక్కడికీర్తి? యీశిశువు నింటికిఁ గైకొనిపోదు నెట్లు? లే
దిక్కని యెందువీడుదు; విధీ! యని చేష్టలఁదక్కి కుందె; నా
చక్కికి మందసంబొకటి చయ్యననీళులఁ దేలి చేరరాఁ. 235

ఉ, కోమలి దానిఁ బట్టి సుమగుచ్ఛములన్ జిగురాకుటేఁకలన్
ప్రేమను దెచ్చి పేటికనుఁజేర్చి, కరంబులఁదార్చి చూచి యా
లేమ, కుమారు నెత్తి జిగిలేఁ తగుబుగ్గలనిగ్గు గాంచి, బల్
ప్రేముడి నశ్రువుల్ గురిసె, పిల్లనిమోమునఁ జిందులందగన్. 236

తే. తల్లిదుఃఖంబుఁ దనగతిఁ దలఁపలేఁడు;
నగుమొగముతోడఁ దిలకించు గగనతలము.
బొటనవ్రేలొండు నోటిలోఁ బూన్చి "యుంగు
రుంగు" రను తల్లి నూరార్చుభంగి తోఁప. 237

---

ప॥ 233 పా॥ 2 అ॥ 2 ఊ; ప॥ 235 పా॥ 1 అ॥ 11- ఱ;
ప॥ 236 పా॥ 2 అ॥ 10- బే; పా॥ 4 అ- 22 దఁ;

తే. చిట్టినాయన్న! దాఁగి నాపొట్టనున్న
మొప్పు రతనాలపేటి! నాయూర్పు! నాదు
కొంగుబంగారు! నానోముకోదమ! నాదు
కనులసింగార మని చెలి కౌఁగిలించె. 238

తే. చిన్నికాళులు చేతులు; చిన్నిబొజ్జ;
చిన్నినెన్నడుమును నోరు; చిన్నినాస;
చిన్నియన్నకు నన్నియు జిన్నవైన
నురము నొసలునుఁ గన్నులు విరివిఁదనరె; – 239

తే. చిట్టినాన్నకు గన్నులు చేరలంత,
పొట్టినాపట్టి నుదు రది పట్టెడంత.
బుడుతనాకూన నవ్వుపువుల్ పుట్టెడంత,
లనుచు నునుముద్దులను బాల కొనుచుఁ గనుచు. 240

ఉ. అంతటికుంతిభోజసుతయై సుతు నోమఁగలేక దైవమం
దెంతొ తెగింపఁజేసె సహింపఁగలే, కపకీర్తియాతనన్
గుంతి, మహాపరాధ కటుక్రూరిత దురంతదరిద్రి యిట్టివా
రింతులు సింకఁ గల్గుదురె? యేమనవచ్చు విధాతచేఁతకున్. 241

ఉ. మందసమందుఁ బెట్టి సుకుమారశరీరుఁ గుమారు మాతయే
కందువు నిన్ను విష్ణుపదిగర్భమునన్ దిగనెట్టుచుంటి; నా
కందొనవిందుగాఁగ నిను గందునె ముందొకనాఁడు? నూపిరుల్
డిందక నిన్ను కావఁగలఁడే యొకదీనదయాసముద్రుఁడున్? 242

చ. కలవర మేల రక్షకుఁడుఁ గల్గఁడె? కానిదిగాదు; పోదుకాఁ
గలఁపది, యేదియెట్లగుటఁ గానము కాని వృథాప్రయత్నముల్
దలఁకొనకుండ మాన, మదిధర్మము మానవకోటికెల్ల, నీ
కిల బుజామిఁక నున్న నది యేటికిదప్పు భుజిక్షోసుతా! 243

తే. "అని మనసు రాయిగాఁ జేసి" తనయు మంద
సంపునం దిడి కని యశ్రుసలిల మార్చి
కనికరపుఁ గెరటములు కన్నకడుపుకడలి
గలఁపఁ గలఁగుచు నాపెట్టె తలుపుమూసె. 244

తే. మందసముఁ గొని, మోకాలిమట్టునీళ్ల
నిలిచి, భానునిఁ దిలకించి నెలఁత మ్రొక్కి—
ఓజగద్బాంధవా! నీతనూజు వీని,
గాచుభారంబు నీయదే! చూచుకొనుము!! – 245

తే, తల్లి గంగాభవాని! యీపిల్లవానిఁ
బూని నీపొట్ట నేయి పాల్ పోసికొంచు
కాచికొని వీని చల్లగా గట్టుచేర్చి,
ప్రీతి నేతల్లిచేతనో పెట్టవమ్మ. 246

డే, అనుచు మందస మానది యందు నెట్టి,
గుండె డిగజారి పొట్టలోనుండియుబికి
పైకిఁ బరతెంచు శోక మాఁపంగలేక,
హా! యనుచు నామె వావిచ్చె నబలగాన. 247

---

ప॥ 243 పా॥ 4 అ॥ 18- జింపకో: ప॥ 244 పా॥ 3 అ॥ 10- ల్లు;
ప॥ 246 పా॥ 3 అ॥ 1- ఁగా; అ॥ 8- ల్లఁ;

తే. అటుతరంగావళులఁ బెట్టె యొట్టెయొట్టె
కొట్టుకొనిపోయె; చూపానకొలఁది వెలఁది
కాంచె; నటుపైన నది చూడ్కి మించి చనియెఁ;
జేయునదిలేక చెలి యిల్లు చేరుకొనియె. - 248

ఆ. సూతుఁ డొక్కరుండు జూచి యానది నీఁదు
దివ్యపేటకంబుఁ దిగిచి తెచ్చి,
మూఁతనూడ్చి, లోనమురిసెడుసుతుఁ దెచ్చి
సతికి రాధ కిచ్చె; సాకె నామె. 249

క. వసునివహముతో వచ్చుట
వసుషేణుం డనఁగఁబరఁగె; వసుధాస్థలిలో
నెసఁగెను రాధేయుం డన
వెసఁ గర్ణుఁడు సూతునింట వృద్ధిఁ గనుచుఁ. 250

క. ఆకుంతిఁ బృథాభిఖ్యను
గైకొనుచు స్వయంవరమున, ఘనుఁడా పాండు
క్ష్మాకాంతుఁడు భువిపొగడఁగ
వీఁకను బెండ్లాడె నామె భీష్మునియాజ్ఞన్. - 251

తే. మద్రరాజతనయ మాద్రినాబడుకన్యఁ
దగవరించెఁ బాండుధరణివిభుఁడు
భార్యలిరువురందు బద్ధానురాగుఁడై
భోగభాగ్యములను బొందుచుండె. 252

ప॥ 248 పా॥ 2 అ॥ 7- ఁజూ; ప॥ 249 పా॥ 1 అ॥ 8- చూ;
ప॥ 251 పా॥ 4 అ॥ 4- జె; ప॥ 252 పా॥ 1 అ॥ 10- నాఁ;

క. అనివినిచిన వైశంపా
యను, జనమేజయుఁడు గాంచి యతిమోదమునన్
వినమితశిరుఁడై చెప్పం
గనువేఁడెను ముందునడచుకత కుతుకమునన్.



♦ ఆదిపర్వము ప్రథమాశ్వాసము —
సమాప్తము. ♦

శ్రీ శ్రీ శ్రీ.





-: శ్రీ రామచంద్రాయ నమః :-

# అశ్వత్థ భారతము.

## ఆదిపర్వము, ద్వితీయాశ్వాసము.



శ్రీదయితా! త్రిదశార్చిత
పాదా! శ్రితవరద! ధర్మపాలన! శుభదా!
వేదవినోదన! దుర్జన
భేదన! శ్రీరాయదుర్గ వేంకటరమణా! 1

విను మని వైశంపాయనుఁ
డనె జనమేజయునితోడ, నాపాండువిభుం
డను దినము ధరణినేలుచుఁ
దనరారెను బ్రజలు దన్ను దద్దయఁ బొగడన్. 2

దిక్కులనెల్ల నంటఁ జని దిగ్విజయం బొనరించి, పాండురా
జొక్కట రాజలోకమును నోర్చి, ధనాంబర రత్నరాసులన్
బొక్కసమందు నించె; తలమున్కలుగాఁ దనివొంద భూసురుల్
చక్కటి యజ్ఞయాగముల సల్పెను, నిల్పె యశఃపతాకలన్. 3

♦ పాండురాజు కిందమునిశాపముం బొందుట. ♦

మ. ఒకనాఁ డాతఁడు భార్యలిద్దఱును గా, నుత్సాహియై వేఁటకై
నికటారణ్యముఁ జొచ్చి యందు నొకఁ డేనిన్ సత్త్వముం గానకే
వికలాశామతి నుండ; నిట్టిజత బల్ ప్రీతిన్ రతిక్రీడయై
నొకచో నుండఁగ, నమ్ము నేసె నతఁ డాయుగ్మంబు గూలన్ శరన్. 4

తే. అందు మగయిఱ్ఱి ఱేనితో ననియె నట్లు:–
కిందమాఖ్యుఁడ ముని నేను క్రీడ తెలమి
మృగములటు గోరి సతితోడ మెలఁగుచుంటిఁ;
గరుణయే లేక చంపి తోఁకతిసహ్యాదపు!– 5

తే. నిస్పృహాను నున్న, పఱవంగ నేర కున్న,
జాడ్యమున నున్న, ప్రసవకష్టమున నున్న,
పెంటితో నున్న మృగముఁ జంపెదరె యెఱుక
లైన, నీ వొక్కఁడవు దక్క నవనిలోన? – 6

తే. ఏ సతీసంగతిని నుండు టెఱిఁగి యెఱిఁగి
చంపి; తట్టులె నీ వింక సతిని గవసి
నప్పుడే చత్తు, విధ్యుది తప్ప దనుచు
శాపము నొసంగి మేన్ వాసె శ్మామునుబందు. 7

ఆ. శిష్టు నేని, మిగులశీలవంతుని నేని,
విజ్ఞు నేని, కాలవేత్త నేని,
నెంతఘాని నేని వింతగా వెన్నంటి
కట్టికుడువఁ బెట్టు కర్మఫలము. – 8

వ॥ 6 పా॥ 1 అ॥ 7- (బ; పా॥ 2 అ॥ 7- (బ : పా॥ 3 అ॥ 1- (బి;

చ. ఇదియొకమంచిపాత్రముగ నేర్పడె నాకని యేఁ దపః“తుచ్ఛమా
మది సహాసంగతిన్ దవిలి మానక యుంటిని; బుద్ధివచ్చె; నేఁ
డిది మొదలేను నిష్ఠమెయి నీవనమందె తపంబు సల్పెదన్;
ముదితలు హాస్తినాపతికిఁ బొం డని భార్యల కాజ్ఞ నిచ్చెఁగన్. 9

చ. విని పతిపల్కు లాసతులు “పీడక నీజతనుండి సేవ లే
మనసుమునఁ బ్రీతి సల్పఁగల, మార్యపథంబున నన్న సిద్ధియున్
జను ”నని యొప్పి, యింపయిన సంగతులన్ వినుపింపఁ జారులన్
బనిచెను వీఁటి; కాపిదప బాండువిభుండొకనాఁడు కుంతితోన్. 10

తే. యజ్ఞమున దేవఋణము; స్వాధ్యాయమున బ్రహ్మ
చర్య, తపముల ఋషిఋణచయము సమయు;
పితృ ఋణము - శ్రాద్ధముల, సుతవృద్ధివలన;
సత్యమున, దానమున, మనుష్యఋణ మడఁగు. 11

తే. అన్నిఋణములుఁ దనువుతో నంతమగును,
సుతునితోఁ గాని తీఱదు పితృఋణంబు;
చెలఁగి నామదినీచిచ్చు కలఁచికాల్చె,
సుతుఁడు గలిగెడిమార్గంబు సొరదు నాకు. — 12

క. అనపత్యుం డిహపరములఁ
గనలేఁ డని శ్రుతి వచించుగద! మృగశాపం-
బనయము నను బాధించెడు;-
చను ధర్మస్థితిని నీవు సంతతిఁ బడయన్. 13

ప॥ 11 పా॥ 2 అ॥ 16- యుఁ; పా॥ 4 అ॥ 15- డఁగు;
ప॥ 12 పా॥ 1 అ॥ 1- అ; ప॥ 13 పా॥ 4 అ॥ 1- ఁజ;

సీ. "క్షేత్రజ, దత్తక, కృత్రిమ, కానీన, గూఢ -
జన్మాపవిద్ధులన్ జనెడుసుతులు
నార్గురు బంధుదాయాదులు నయ్యేద;
రోలి కానీన, సహోఢులు మఱి
జ్ఞాత, స్వయందత్త, క్రీత, పౌనర్భవుల్
లను సుతుల్ బంధువులగుచు రంతె-
దాయాదులును గారు; తనయులలో నెల్ల
క్షేత్రజుం డౌరసపుత్రసముఁడు-
తే. దేవరన్యాయజాతుండె పావనుండు
కాన నస్మన్నియోగంబుకతన నీవు
క్షేత్రజుని, ధర్మవిధి నూని పుత్రుఁ బడసి
పుణ్యగతు లీగదే నాకుఁ బ్రోలఁతి" యనుఁడు. 14

♦ పాండవ కౌరవుల జననవిశేషములు. ♦

క. నీయట్టి పుణ్యమూర్తికి
జాయన్, బరపురుషుఁ గవయఁజాల ననంగన్;
దోషయ నఘము, పతియానతిఁ
జేయందగు నంచు భర్త చేయన్ బలిమిన్. 15

మ. పతియాజ్ఞామతి యాటకంటె సతికిన్ భావింపఁగా నెందు సు
వ్రతమొం డుండదు; నాకు మంత్రమును దుర్వాసుండుమున్నిచ్చె నా
మతి సేయంగను దోడఁ బుత్రు నొసఁగున్ మన్నాథ! యేదేవుచే
సుతునిన్ గాంతునటన్నఁ గోల్వు మనియెన్ సూర్యాత్మజున్ ధర్మునిన్. 16

మ. సతియాకుంతి యొసర్ప్ ప్రదక్షిణనమస్కారంబులన్ భర్త కా
తతమాభక్తి నొసర్చి, యాజ్ఞఁగొని, లో ధ్యానించె మంత్రంబుచే;
నతఁ డంతన్ నరయోగమూర్తిఁగొని ప్రత్యక్షంబుగా నామెకున్
సుతుఁ డౌనట్లు వరంబు నిచ్చెఁ బృథయున్ జూలుంట నొక్కబ్దమున్.

ఉ. మంచిదినంబునందు, నొకమాన్యగ్రహస్థితి గల్గులగ్నమం [17
దంచిత మాసుయోగమున, నష్టమి నాఁ,డభిజిన్ముహూర్తమం
దెంచఁగ ధర్మునంశమున నీజగ ముబ్బ,దిశల్ వెలుంగఁగాఁ
గాంచెను గుంతి, పాండునృపకన్నులచల్లఁగఁ బుత్త్రు ధర్మజున్. 18

క. అచ్చట శతశృంగంబున
మచ్చిక బ్రాహ్మణులచేత మంచిదినమునన్
ముచ్చటగ జాతకర్మము
నమోఁ
అచ్చుపడన్ దీర్చెఁ దండ్రి యాశిశువునకున్

క. కురుకులపతియై ధర్మముఁ
దిరముగ ధరఁ బ్రోచుటన్ యుధిష్ఠిరనాముం
బరుదారు నీసుతున కని
యిరవుగ నాకాశవాణి యెలుఁగిడెఁ దెలుపన్, 20

క. “ఒకక, నొకసుతునిన్, తె
క్కుకుఁగానఁదగ దండ్రి కలిగి కెలుగనియడె; నీ
వికఁ వాయ్వంశునిఁ దనయుని
నొకనిఁ బడయు” మనుచుఁ గుంతి కొగిఁ బతి తెల్పన్. 21

మ. పతియాజ్ఞన్ సతి కుంతి కొల్చె ననిలున్ భక్తిన్ మదిన్, మంత్రసం
గతన్మై; మారుత దేవుఁ డారమణికిన్ గాన్పించి, తా నిచ్చె స-
త్సుతుఁ డావిర్భవ మొందఁగా వరము; చేతోమోద మేపారఁగన్
బతియున్ బత్నియుఁ బుత్రసంజననమున్ భావించు చొప్పారఁగన్. 22

తే. వాయుదేవ ప్రసాదిత వరముచేతఁ
గుంతియొకయేఁడు గర్భంబుసంతరించి,
వీర్యశౌర్యప్రధానుని, భీమసేను
ననముఁ బ్రసవించె జనము నల్దెసల నెసఁగ. 23

తే. అనిలసుతుఁ డుద్భవించిన దివమునందె,
కనియె దుర్యోధనుం డనుతనయు, మఱియు
దినదినం బొక్కనిగ నూర్వురను సుతులను:
దనయ నొకతను, బడెసె గాంధారిదేవి. 24

తే. సరిగ దుశ్శాసనుడును, దుస్సహా, వికర్ణ,
దుష్ప్రధర్షణ, దుర్ధర, దుర్ముఖాది
నామములఁదాల్పు నూర్గురునందనులను;
దనయ దుస్సల యనుపేరు దాల్చి తనరె. 25

క. ధృతరాష్ట్రుఁడు పడసెను సుత
శత మని విని మదిని జాల సంతసపడి, తా
సుతునిన్ బడయఁగ నాసుర
పతిసమునిన్ గోరి పాండుపతి పృథ కనియెన్ 26

ప॥ 22 పా॥ 2 అ॥ 2- రి; ప॥ 24 పా॥ 3 అ॥ 16- అనుఁ;
ప॥ 25 పా॥ 1 అ॥ 7- ను; పా॥ 3 అ॥ 14- లు; పా॥ 4 అ॥ 7- య;

క. సిరియును, విద్యయు, సుతులును
మఱి యిఁకఁ జాలు ననువక్షిమనుజులుఁ గలరే?
తరళాక్షి! నాకు నిఁక నొక
వరసుతుఁ బడయంగ మదిని వాంఛ జనించెన్, 27

క. నాకొకఁడు, నీకొకఁడు, మఱి
లోకంబునకొకఁడు కీర్తిలోలుఁడు వలదే!
పేఁకారెడునటు లోకసుతు
నాకాధిపుకరుణ నడసి నాకిడు మనినన్. 28

తే. పతినియోగముచే సురపతిని గొలిచె
మంత్రమాధారముగఁ గొని మగువ కుంతి;
ఆక్షణం బింద్రుఁడనియెఁ బ్రత్యక్షు మగుచు
నస్మదీయాంశమునఁ బుత్త్రుఁ డగు నటంచు. 29

తే. పరఁగ నుత్తరఫల్గునీ ప్రథమపాద
మందు లోకోత్తరుని నరు,హరి మఱఁదిని,
వంశకరు, దేవసన్నిభు, భానుతేజుఁ
బడసెఁ గొమరుని త్రైలోక్యభద్రయశుని. 30

ఉ. ఎంచఁగఁ గార్తవీర్యుని జయించెడు శక్తిని, నర్జునుండనన్
మించెడు; దేవనాథు నని మించి దహించెడు ఖాండవంబునన్
గాంచఁగ రాజసూయసుమఖంబును ధర్మజుచేత ఖ్యాతిఁ జే
యించెడు,నంచుమిన్నులుధ్వనించెను; మ్రోసెను దేవదుందుభుల్. 31

ఆ. పాండురాజుఁ గుంతి పరమహర్షంబున
సుతులు ముగుర తోడఁ జూచుక మొంద;
మాద్రి సుతులు లేక మదిఁ గుందుచుండి, యే
కాంతముగనుఁ దెలిపెఁ గాంతుతోడ. 32

ఉ. కుంతి సుతత్రయంబుఁ గనెఁ గోమలి యాధృతరాష్ట్రపత్నియో
అంతకునంత పుత్రశత మట్టులఁ గాంచెను; నేన పాపి నః!
కాంతకుఁ గడ్పుపూచి తగఁగాయలుగాచిన యట్టు లౌనె యా
శాంతధరిత్రిపాలనమె యబ్బిన, స్వర్గమె నత్తి కైవసఁగా! 33

క. అనలే, ననుభవ భరమును
గొనలే నీబాధ తాళికొనలే ననఘా!
మనలేను గొడ్డుమాద్రినై;
అనుమతి నిడు కుంతి మంత్రి మది నా కీడఁగఁగా". 34

తే. మాద్రి వెతఁ గాంచి నాథుండు మదినిమరగి
"చిచ్చు గతినుండె నాకు నీచింత కాంత!
కుంతితోఁ జెప్పి మాన్తు నీవంత" యనుచు
నంతఁ బృథఁ జేరి యనియె నేకాంతమందు. 35

ఆ. "చంక నొకఁడుఁ, గేలు లంకించియొక్కఁడు
నాకె మొప్పవలదె నాకు – నీకు;
నలుగురైననఁగాని కలుగ దామాదిరి;
కడమవడియెఁగాదె కాంత యొకఁడు. 36

చ. "కొడుకులు ముగ్గురైరి విను! కోమలి నీకిఁకఁ జాలు; చూడుమా
కడుదయ నీదుచెల్లెలికిఁ గందువ్వ లేదుగదా; దయామతీ!
ఒడఁబడి మంత్ర మి మ్మదియు నొండును రెండును గాఁగ సంతతిన్
బడయుఁగ నిమ్ము! వేఁడ్కొకత్రిభద్రము గోరుచె మానవత్వమా". 37

చ. "నిజ మిది నాథ! యిప్పుదియె నిన్నడుగన్ దలపోయుచుంటి, న
క్కజ మనరాదు దానికినిఁ గల్గవె కోర్కెలు మాకుఁబోలె? నీ
గజిబిజి యేల; సోదరికిగా నిది నా కుసురైన మేలె? నా
నిజ మిదిఁయంచు గుంతి చని నేర్పెను మాద్రికి మంత్రరాజమున్. 38

తే. తన్మహిమ మాద్రి ధవునాజ్ఞఁ దలఁచె నాశ్వి
నులఁ, బ్రిసన్నులుకా వారు,లలన వడసెఁ
గవలబిడ్డలఁ, బిలిచె నాకాశవాణి
నకులసహదేవు లనియెడినామములను. 39

తే. అలయుధిష్ఠిరుఁడును, భీముఁ, డర్జునుండు,
నకుల, సహదేవు లనియెడు నామములను
బంచపాండవు లాబాలవరులు వెడసి,
సురవరులవరబలముల వఱలి రెలమి. 40

మ. క్షితిఁ బేరాశతశృంగ పర్వతమునన్ సేమంబుగాఁ బాండుభూ
పతి తద్భార్యలఁ గూడి ఘోరతపమున్ భావించుచున్ గాంచె స
త్సుతులన్ దేవవరప్రసాదముల సంతుష్టాత్ముడై యంచు సం
గతి నాలించి మఱంది శాయనుజకున్ గావింపసన్మానమున్. 41

క. వసుదేవుఁడు బలువెలగల
వసనంబు, లమేయరత్న వరభూషణముల్
పసఁ బంపెను గశ్యపుఁడను
వసుధామరుతోడ; ద్విజుఁడు పాండునృపునకున్. 42

ఉ. మంగళసూచకంబుగ సమర్పణఁజేయఁ గ్రహించి యాతఁడా
భంగికి మెచ్చి, కశ్యపునిఁ బాద్యము నర్ఘ్యము నిచ్చి తన్పి, ప్రే
మం గని సత్కరింపఁగఁ గుమారులకందుపవీత ధారణా
ద్యంగములెల్లఁ జేసి ద్విజుఁ డాతఁడు విద్యల నేర్పుచుండఁగన్. 43

చ. అటులటనుండి పాండువిభుఁ డావనిలో నొకనాఁడు మాద్రితో
నటనట జోడువీడ్వడక, హారవిహారము సల్పి శ్రాంతి, ను
త్కటవనమల్లికారుచిరకాంతి వికాసప్రఫుల్లచంపక
స్ఫుటనటనానిల ప్రకట సుందర దివ్యలతాగృహంబునన్, 44

ఉ. ఉండఁగ; మాద్రి దివ్యరుచిరోన్నత దేహవిలాస సూని, శ్రీ
మండితనేత్రహాసగతి భ్రమాన్పడి, చంద్రనిభాననంబు న
ప్పాండువిభుండు గాంచి, మరుబారికి లోనయి, తాళలేక యు
ద్యండజ మానఁ బట్టె! సతి "హా" యని మాన్పినఁగానివానకే. 45

క. కిందముని ఘోరశాపం
బుందలఁపఁడు; మాద్రికోసరఁ బూన్కి విడఁడు, లో
నందలఁకఁడు, విధివశుఁడై
కందర్పుని కేళిఁ దేలి కాఁపుమువాసెన్. – 46

ఉ. నెత్తిని నోరు మొత్తికొని నిర్భరదుఃఖముతోడ మాద్రిగొం
తెత్తియహా! యటంచు నడగియేడ్చె దిశల్ మఱిమ్రోఁగఁ గుంతితా
నత్తఱి సద్ధరామరసురార్చన నుండి యెలుంగు నెంచి బల్
తత్తర మెత్తి పాఱె ధ్వనితంబగుచోటికి బిడ్డ లంటిరాన్. 47

క. చని కని పతిభరశేముపయిన్
వనితామణి కుంతి వ్రాలి వందురె దిశలన్
ధ్వని సెలఁగ మునులు విని సని
కని మోదార్పంగఁ మాద్రిఁ గని యాయమతోన్. 48

క. పతితో సహగమనవిధి సు
గతిఁ గాంచెద సుతులనెల్లఁ గాచికొనుచు స
మ్మతి నిలుదీర్పుము నా కను
మతి నిమ్మనుపృథను గాంచి మాద్రి వచించున్. 49

చ. "పరతరధర్మయుక్తిఁ గురువంశముని ల్పితి వెప్డు మానసం
బరసి చరించి భోగము లపారముగాఁ దనియించి భర్త సం
బరపడఁజేసి తీవు! కడుపాపిని నాథునిమిత్తె నైతి నే
నరిగెద మత్ప్రియున్ బరమునందునన్నై ననుఁ బ్రీతుఁజేసెదన్. 50

క. నను నడ్డకు మని దృఢమతి
మునిజనులకు మ్రొక్కి మాద్రి పూనికఁ బతితోఁ
దన దేహ మగ్ని కాహుతి
గను నిడి ప్రాణములు వాసెఁ గని యడి వారానుల్, 51

క, పుడమిని స్వజనమును విడిచి
యడవులఁ బడి మనలఁగూడి యతులతపంబుల్
గడుసలిపి దివికి నడచెను
గొడుకులఁ బడతి నిట విడచి కురుపతి కంటే. 52

క. వీరలఁ బాండుసుతులఁ గురు
వీరుల కర్పింపవలయు, నెడలుం డనుచున్,
జేరె సహస్రాధికముని
వారం బరుదెంచి హస్తిపట్టణము వెసన్. 53

ఉ. రాజులు మాకటంచు సురరాజ ముఖామరసత్ప్రసాదవి
భ్రాజితమూర్తు లంచుదయ రాజిలఁ దమ్ము భరించినట్టి రా
రా జగుపాండురాజసుతరత్నము లంచుఁ బ్రజాళిరాపిడిన్
రాజిలి గుంపులై పఱచి రాసుతులన్ గనవచ్చి రొక్కటన్. 54

ఉ. వచ్చినకుంతినిన్ సుతుల వచ్చి యెదుర్కొని భీష్ముఁ డాదిగాఁ
బొచ్చెములేనిభక్తి మెయి మ్రొక్కి మునీంద్రుల కెల్లఁ బ్రీతిఁదో
డ్తెచ్చి "సవారి" నంతిపురి డించఁగఁ, బాండునృపాలుచావు వా
క్రుచ్చిన నాలకించి కడుఁగుందిరివందురి మిత్రబాంధవుల్, 55

తే. పారలౌక్యంబులెల్లను బాండుపతికి
విదురు ననుమతిఁ దీర్పించి మదిని వనరు
బంధుసంబంధు లూఱడఁ బలికి వ్యాసుఁ
డాడె నాసత్యవతితో రహస్యగతిని. 56

---

ప॥ 52 పా॥ 2 అ॥ 9- అఁ; ప॥ 55 పా॥ 1 అ॥ 16- రొ; పా॥ 4 అ॥ 10- దుఁ;

క. గాలిఁ బెలిఁగెడిదీపము
వోలెఁ జంచలము మేను; వోల్బును మృగతృ
ష్ణాలీల సుఖము; గడచిన
కాలంబే మేలు వచ్చుకాలముకంటెన్. 57

క. సారాచారవిచారవి
దూరులు ధృతరాష్ట్రసుతులు దుర్వర్తను; లా
కూరులు వీరుల పాండుకు
మారులతోఁ బోరి కడకు మ్రిందెడివారల్. 58

క. దారుణకథ యుదిధర్మా
కారుల నంబాలికాంబికలఁ గొని యడవిన్
జేరి తపముండుఁ డన న.
వ్వారలతో వనికి సత్యవతి పెసఁ జనియెన్. 59

♦ పాండవకౌరవుల బాలక్రీడావిశేషములు ♦

క. కన కేమాత్రము భేదము
తనసుతులను బాండుసుతులఁ దగ నొక్కమెయిన్
గని పెంచెను ధృతరాష్ట్రుఁడు
మనసు పలుకు నడత యొక్కమాదిరి కాగన్. 60

క. కవియు నెడఁ బఱచు నెడఁ బిఱు
తివియు నెడన్ బెనఁగు నెడలఁ దెగబడు నెడలన్
బవనజున కోపరాకౌ
రవశత మొకటయ్యునన్ ధురంబునఁబడెనన్. 61

---

ప॥ 60 పా॥ 4 అ॥ 15- కాఁ; ప॥ 61 పా॥ 2 అ॥ 14- గఁ; పా॥ 4 అ॥ 11- దు;

క. ఆటల మాటల వేఁటుల
బోటుల బాహాటమైన పోరాటములన్
ఓటమివడి కౌరవ్యులు
పాటించిరి ద్వేషబుద్ధి పవనాత్మజుపై. 62

సీ. నీరాటలో బల్మిఁ గౌరవ్యులను బట్టి
నీలుగున ట్లవలీల ముంచుఁ
బోరాట మొదవినఁ బొదవి నూర్గురఁ దన్నుఁ
గాలుసేతుల గుప్పిమ్ము నేలఁబొరల;
మారినెక్కఁ గనుపెట్టి మారికు నల్లలలార్చుఁ
బండ్లతో ధరణి నవ్వారు దొరల;
మారి దుర్యోధను నూని ముష్టినిఁ బట్టి
గుద్దు నెత్తురు కన్నుఁగుడ్లఁ దెరల;
తే. తడవఁ డొరులను ద న్నారుల్ దుడికిసేనిఁ
గడక నోడితి మనుదాఁక బడియు మోదు;
బాపిదుర్యోధనుం డది సైఁపలేక
భీము నన్నైన సమయింప వెరవులరయు. 63

సీ. స్మృతిదప్పి నిద్దురసేయుమారుతిఁ ద్రాళ్లఁ
గట్టి తోయించె గంగాహ్రదమున;
ఘోరవిషాన్నంబుఁ గుడువంగఁ బెట్టించె
వాయుజునకు వంటవానిచేత;

పః 62 పాః 2 అః 1- (బో; పః 63 పాః 3 అః 1- బా;

దాఁచుపాములఁ దెచ్చి యేఁచి కాటిడఁజేసె
నేమఱినిద్రించు భీమసేను;
గ్రాలఁగి మాఁకులఁ బన్ని బలుపూరిఁ గఱచెను
పవనాత్మజుని జంపఁ బట్టుపట్టి,
తే. కడఁకదుర్యోధనుని కృతకంబు లెల్ల
బూదివేల్చినయాజ్యంబువోని వయ్యె;
భీమసేనుఁడు స్వబలంబు నోముఫలము
వెంట మనెఁ గాక బ్రదుకు వేఱొంటఁ గలదె? 64

క. కౌరవులును బాండవులును
గూరిమి లేకునికి యయ్యుఁ గూడి మెలఁగిరా
ధీరుని భీష్ముని యోగము
కారణముగ విద్య తెలియఁ గఱచుచుఁ గృపుచే. 65

తే. ముని శరద్వంతుతనయుఁ డత్యనుపమాస్త్ర
శస్త్రవిద్యాభిరతుఁ డతిసాహసుండు
శంతనుఁడు కూర్మిఁ బెంచినసద్విజుండు
గురుఁ డగుచు విద్య వారికిఁ గఱపెఁ గృపుఁడు. 66

క. కందుకముఁ బూని యొకచో
నందఱు రాసుతులు గూడి యాడుచు నుండన్
అం దొకని వ్రేటుపడి యా
కందుక మొకనూతఁ బడినఁ గళవళ పడుచున్. 67

---

ప॥ 64 పా॥ 3 అ॥ 1- జ; ప॥ 67 పా॥ 4 అ॥ 7- నూఁ;

ద్రోణుఁడు పాండవకౌరవులను శిష్యులుగా గ్రహించుట.

తే. దాని బుచ్చుకొనఁగఁ దామోప కాబావి
చుట్టు ముట్టి తొంగి చూచుచున్న
బాలకులనుగాంచి బాటవెంబడిఁబోవు
పాఱుఁ డొక్కఁ డటకు వచ్చి కాంచి. 68

చ. వరభరతాన్వయోద్భవవిభాస్వరు లీరు మహాస్త్రవేదినా
స్థిరతరకీర్తిఁ గన్నకృపశిష్యుల రయ్యును, నూఁతఁబడ్డయీ
చిఱుతగుకందుకంబుఁ గొనుచెద్దుమెఱుంగక చేష్టఁదక్కి యి
ట్లరయుచునుంట చన్నె? యని యాతఁడు బాణపరంపరాగతిన్.69

క. ధాటిని నాకందుకమున్
దాటించుచుఁ దిగిచి రాజతనయుల కియ్యన్;
బాటించి భీష్మునెడ కా
మేటినిఁ దోడ్తె నతండు మేలిమితోడన్. 70

క. కని యాతని వృత్తాంతము
విని సన్మానంబు సలిపి వినమితశిరుఁడై
వినయమున నడుగఁ బాఱుఁడు
తనకథ భీష్మునకుఁ దెలుపఁదలఁకొనె నిటులన్. 71

తే. వరభరద్వాజ పుత్రుండఁ, బరశురాము
పరమశిష్యుఁడఁ, గుంభసంభవుఁడ, దివ్య
చాపనిపుణుఁడ, మీకృపాచార్యుఁ తోడఁ
బుట్టు కృపిభర్తఁ; బడసితిఁ బుత్రునొకని — 72

క. పేరశ్వత్థామ యను కు
మారుండతఁ; డగ్నివేశమౌని గురుఁడుగాఁ
గోరి, సహాధ్యాయులమై
నేరిచితిమి ద్రుపదుఁ డేను నెఱి మును విద్యల్, 73

తే. పృషతనామునిఁ బాంచాలవిభునిసుతుఁడు,
తోడిచెలికాడు సహపాఠి ద్రుపదుఁడతఁడు!
ఎప్పుడు నను వీడకయ కూర్మి నెసఁగుచుండు
నాతఁ డానాడు నాతోడ నాడెనెలమి. –

శా. "రాజై నేధర నేలునాఁడు కనఁగా రావయ్య! నాతోడుగా
రాజే నీవనునట్లు చేతు, సుఖసామ్రాజ్యాధిపత్యంబు నే
రాజిల్ గట్టెద" నంచు వీటి కరిగెన్ రాద్ధాంతమున్ జేసి; నే
నాజోలిన్ జనకుంటి; విప్రులకు రాజ్యం బేమి స్వాధ్యాయమే?. 75

క. కడచనెఁ గొన్నేండ్లటుపై
బుడుతఁడొకం డై కుటుంబపోషణ భరమై
కడగానకుంటి; ధనికుల
కొడుకులు పాల్ గుడువఁ జూచి గోడిడె సుతుఁడున్. 76

క. దారిద్ర్యభరము నెటులో
యోర్చితిన్; గొడుకుపోరు నోపక, ద్రుపదో
ర్వీరమణుఁ డన్నపలుకుల
కూరిమిఁ దలపోసి మదినిఁ గోరిక లెసఁగన్. 77

ఆ. యాచనంబుకంటె నధమ మేదియు లేదు
ధరణిలోన మానధనున కెందు!
నైన నేమి ద్రుపదుఁ డాత్మసఖుండౌట
నగడుగాదు మిత్రు నడిగికొనుట— 78

క. ధన మొసఁగఁడేని పోనీ
తనయున కొకపాడిమొదవుఁ దా నీఁ లేఁడే?
యనునాస నరిగి, దరియం
జని కని కట్టెదురఁగరము సస్నేహమునన్. 79

ఉ. నేమమె? యగ్నివేశమునిశిష్యులమై మనమున్ననాఁటియా
ప్రేముడిఁ బ్రోదిసేయుదువె? పిన్నటిప్రేమయె ప్రేమపో; సదా
నీమహనీయమూర్తి మది నిల్చి కనుంగవఁ బొల్చునాకు; రా
రా! మనసారఁ గౌఁగిటికి రమ్ము సఖా యన నాతఁ డల్గుచున్, 80

ఆ. ప్రభుఁడ నేన దేడ? బాపఁడ వీ వేడ?
కొలఁదు లెఱుఁగ కిటులఁ బలుకఁదగునె?
సమత గల్గనట్టిసఖ్యంబు చెల్లునే?
బడుగువిప్ర! నిలక వెడలు మింక! ! 81

క. రాజులకుఁ బనులుగ లిగెడు
నోజన్ సఖ్యంబు పొలుచు నూరక రొకళుల్
భాజనులె నృపులమైత్రికి?
పేజత నాకేమి యనుచు నీల్గుచుఁ బదరెన్. 82

క. మానసమే చెడు ననమా
నానలమునఁ జేసి వెడలి యాపురి; సతితో
సూనునితో నే తెంచితి,
దానికిఁ బ్రతిసేయు వెరవుఁదలకొని యనిశన్. 83

క. విని, వెద్యకులీన కాళులఁ
బెనఁగొనినటు లుబ్బి మదిని బ్రియ మెసలారన్.
గని భీష్ముఁడు గుంభభవున్
ధనధాన్య సమృద్ధుఁజేసి తా నాదృతిన్. 84

ఉ. వ్రేలిడిచూపి మన్మలను; వీరల కీవ ధనుర్గురుండవై
మేలగు నస్త్రవిద్యల నమేయులుగా గడిదేరఁగూర్పు; నీన్
బోలఁగ బాహువిక్రమ విభూతిని శస్త్ర మహాస్త్రవిద్యలన్
జాలఁడు జామదగ్న్యుఁడని చాలఁగ విందు ననంగ ద్రోణుఁడున్. 85

తే. ప్రీతి నబ్బాలురకు విద్య లాంతతముగ
గఱపు చొకనాఁడు వారలఁ గాంచి పలికె,
దలఁపుగలదొండు నాకు నద్దానిఁ గూర్చ
ధీరుఁ డెవ్వండు మీలోనఁ దెలుపవలతు. – 86

తే. పలుకుఁ డంచన్న; గౌరవుల్ వలికె రిట్లు
"కార్యభారంబు దెలుపక కఠినప్రశ్న
నిటుల వేయంగ' మాటిచ్చు టెటుల? శిష్యుఁ
డుత్తయాసల గురునెత్తి కెత్తఁజన్నె? 87

తే. అచ్చోటు నిశ్శబ్దముగ నుండె; నల్లనల్ల
చూడ్కు లేపార నలుదెసల్ చూచి యొజ్జ
కడఁక నీ శిష్యకోటిలోఁ గలుగఁ డొక్క
గురునభీష్టంబు దీర్చెడునరుఁడె?” యనిన. 88

క. అది యెట్టిదైనఁ గూర్చెద
నిదివో నిశ్చయము! ప్రాణ మిడియైనను గో
విద! శంకఁ దక్కు మని యొక
పద మది వినవచ్చె గురుఁడు బమ్మెరవోవన్. 89

క. పొదలుమది గురుఁడుఁ గనఁ, గ
ట్టెదు, రెడగాఁ బొలిచి నిలిచి, యింద్రజుఁ డెలమిన్
గుదురుగ నదె, యదె పలికినఁ
గదిసి ఘటోద్భవుఁడు నరునిఁ గౌఁగిటఁ గ్రుచ్చెన్. — 90

క. అది మొదలర్జునుపై నతఁ
డుదితస్నేహంబు వెలయ నొప్పె; నృపసుతుల్
పదపడి చేరిరి పలువురు; —
గదిసెను గర్ణుఁడును విద్యఁ గఱవ గురునెడన్. — 91

క. ఆరాధేయుఁడు కర్ణుఁడు
కౌరవులను జేరె నరునికార్ముకవిద్యా
సారమును మచ్చరించుచుఁ
గూరిమి దుర్యోధనుండు గూర్పన్ బెలుచన్. 92

చ, ఒకనిసివేళ నింద్రసుతు డోగిరముఁ గొనుచుండ గాలిచే
వికలతనొంద దీపశిఖ వీడ్వడకల్లెభుజించి "యిట్టులే
సకలములైనవిద్యలును సాధనచే సమకూరునంచుఁ దా
నికరముఁజేసి చీఁకటిని నిత్యము బాణము లేసినేర్చెఁడుఁ. 93

క. కనిద్రోణుఁడు మది నుబ్బుచు
నను ముల్లోకముల నీకు నధికతరుండెం
దును గల్గనట్లు విలువి
ద్యను గఱపెద నంచు నింద్రతనయునితోడఁ. 94

క. కరితురగ భూ రథంబులఁ
బరఁగుచు దృఢచక్రగతులఁ బఱపఁగ శరముల్;
సరి ద్వంద్వ యుద్ధమర్మము
లురవగు బలువ్యూహ భేదనోపాయములుఁ. 95

క. శరసంప్రయోగముల సం
హరణరహస్యార్థముల మహాశస్త్రగతుల్
గఱపెగురుఁడు నరున;కితని
సరియే భార్గవుఁడునైన సమరంబుననాఁ. 96

♦ ఏకలవ్యుఁడు ద్రోణునకు గురుదక్షిణగా చేతిబొటనవేలిఁ
గోసియిచ్చుట. ♦

క. కౌరవపాండవులుఁ భట
వారము వరసారమేయవారము దేరఁ
జేరిరి మృగయార్థము భయ
దారణ్యము నస్త్రశస్త్ర హస్తయుగళులై. 97

తే. మేటిపోడిమి గలవారి వేఁటకుక్క
యొండు కనుదప్పి; వెదుకుచునుండ వారు
వచ్చె నచ్యాదిమోమునఁ గుఱిచ్చుకొనిన
బాణసప్తకమునఁ గడుబాధపడుచు, 98

క. సుఱిక్కుచు వచ్చెడిశునిఁ గని
నిక్కఁగ గరలాఘవంబు నెఱిబాణము లే
డెక్కిడి చాపము నొక్కఁటఁ
గుక్కకు నిటుగుఱిచ్చినట్టికోవిదుఁ డెవఁడో? 99

క. అని యచ్చెరువున, శునకము
మునుసనఁగా వెనుకజాడ మునికొనివారల్
సనిచని ఘనభయదాటవిఁ
గని రొకచో రాజసుతులు కనుఁగవ సెదరన్. 100

చ. ఖరతరచాపహస్తు, దృఢకాయు, మహోన్నతవక్షు, ఘోరభా
స్వరముఖు వజ్రకర్కశభుజాయుగళున్, మృగచర్మవస్త్రినిన్
శరవిషయప్రమోదు ఘనసత్త్వుని ముందటఁ గాంచి వారు మ
చ్చరపడి "యెవ్వఁడీ"వనహాసమ్ముఖుఁడై యనువాఁడు వారితోన్ 101

క. ఘనుఁ డా హిరణ్యధన్వుం
డనెడునిషాదేశుసుతుఁడ, నస్త్రగురుఁడు ద్రో
ణునిపరమశిష్యుఁడను, పే
రనఁగా నే నేకలవ్యుఁ డనఁబడువాఁడన్. 102

---

ప॥ 98 పా॥ 2 అ॥ 9- ద; ప॥ 99 పా॥ 2 అ॥ 6- లా;
[illegible] ప॥ 101 పా॥ 4 అ॥ 12- న్న;

క. అది విని చని గాశ్చర్యము
మది గదురఁగ వారు ఫ్రరికి; మంతనమునఁ దాఁ
గదియుచు నొజ్జనుఁ జూచుచు
పదములఁ బ్రణమిల్లి లేచి పలికె మృదూక్తిన్. 103

ఆ. "చాపవిద్య నీకు సాటి లేకుండఁగాఁ
గఱపువాఁ" డంచుఁ గరుణ మెరయఁ
గడఁక వలికి నారకాదె ధనుర్ధరా!
తథ్యముగను గొంటిఁ దత్ఫలంబు. 104

క. నాకును, మీకు ధనుష్మ
ల్లోకమునకు మించు, నొదు లొంగనియస్త్ర-
శ్రీకలితు నెఱుకఁ గంటిని,
మీ కగునఁట శిష్యుఁ డతఁడు, మీ రెఱుఁగరఁటే"? 105

క. అదరిపడి ద్రోణుఁ "డర్జున!
ఎది? యెవరది? యేడ?" ననిన ; నిదె రండనుచున్
బదపడి గురుఁ గొనిచనఁ ;గని
కదియన్ బఱతెంచి గురునికాళులపైనన్ 106

ఉ. చాగిలి, యేకలవ్యుఁ డను "చాపగురూ! భవదీయదర్శన
శ్రీగతి ధన్యుఁ డే నయితి శిష్యుని నన్ బనిపంపు" మన్న "నే
నీగురుఁ డెట్లు? కాన,విన నేనిను నెన్నఁ డటన్న" వాఁడు వి
ద్యాగురుఁ డీవ దేవ! యవధారు మహాత్మ! యటంచు నమ్రుఁడై. 107

---

ప॥ 104 పా॥ 3 అ॥ 4 (బ; ప॥ 105 పా॥ 2 అ॥ 15- వి;
ప॥ 107 పా॥ 1 అ॥ 10- (జా;

చ. మరచితి రీరు నాగురుతు మాన్యచరిత్ర! యొకప్పుడే భవ
చ్చరణయుగంబు వ్రాసి "ననుసమ్మతి శిష్యునిగా గ్రహించి, శ్రీ
కరకరుణాకటాక్షముల కల్మిని మీ రలనుగ్రహింపు డుచున్,
నరశరశస్త్ర విద్యలను బారగుఁ జేయరె" యంచు వేఁడితిన్. 108

తే. నే నిషాదుండ ననియెడు నెపముచేత,
పరమశస్త్రాస్త్రవిద్య, కపాత్రుఁ, డంచుఁ
దరిమితిరి కాదె! మీకృపఁ దల ధరించి,
నేనిచట నిల్చి విలువిద్య నేర్చికొంటి. 109

మ. అదె, మీయాకృతి మృత్తికాప్రతిమ! నే నద్దాని నే మీరల
న్మదితోఁ గొల్చుచు మ్రొక్కుచన్నిశరసంధానప్రయోగాదులన్
విధిగా నిత్యము నేర్చుచుంటి, ననురేన్ విద్యాప్రవీణత్వ మో
సదయా! శ్రీగురుసత్కటాక్షగతి దుస్సాధ్యంబె కల్గెనం నే. 110

క. అనఁ; గుంభోద్భవుఁ డది విని,
మనమున నచ్చెరువు నొంది, మాన్పడి, తేరన్
గని "గురుదక్షిణ మాకి
మ్మని పల్కిన, నేకలవ్యుఁ డతిముద మొదవన్. 111

చ. ఇదియె మదీయభూరితను, విద్యదె మత్పరివార, మిద్దిసం
పద! యిదియే మహావిపినపర్వత దేశము నాదురాజ్య;మిం
కెది వలయు న్మహాత్మ! యివియెల్ల గ్రహింపుఁడు; మీఁదఁగోర్కె యిం
కెది కల, దట్టె యాజ్ఞ నిడి యీరొకశిష్యు ననుగ్రహింపుఁడీ! 112

ప॥ 108 పా॥ 1 అ॥ 2- అ; ప॥ 109 పా॥ 2 అ॥ 1- (బ; అ॥ 11- (తు;

క. అన; "నీ దక్షిణహస్త
మ్మునఁగల పెనువ్రేలిఁ ద్రుంచి పొలుపుగ గురుద
క్షిణ నిమ్మన", దక్షిణమే
వనచరుఁ డది కోసి గురుని పదముల నైచెన్. 113

క. ఊఁచెను పార్థుం డౌసలఁ:
నాచార్యుం "డౌదధీచి" యని మూర్ఛిల్లెన్;
ఆఁచికొని గురునిఁ దోడనిడి
వీచెను వస్త్రమున నెఱుక వెడవెడ భీతిన్, 114

ఉ. మేలుకొనెన్ గురుండు; గని మేవడిఁబల్కె "మహాత్మ; జాలియి
ట్లేల? యనుగ్రహించి దివిజేంద్రతనూభవు కీర్తి నోమఁగాఁ
జాలితి రిట్లు; క్షత్రియులశౌర్యము ధర్మపుటూఁతయౌను; నేఁ
బోలుదునే? యధర్మపరబుద్ధిఁ గిరాతుఁడ, దుర్మదాంధుఁడన్. 115

ఉ. మానివి, ధర్మమూర్తివి, ప్రమాదము స్వార్థము లేనిబుద్ధి; వ
జ్ఞానుఁడ, నీచవర్తనుఁడఁ, గల్మషఘోరవిషోరగాత్ముఁడన్;
జ్ఞానసముద్రు లీరగుట, గాఢతరం బగుధర్మవర్తనా
నూనమతిన్ జరించితిరి; న్యూనత గల్గునే? నిర్మలాత్మకా. 116

క. అన నెఱుక; కని గురుం డా
వనచరు దీవించెఁ బొదలువాత్సల్యమునన్;
గనుల ముదశ్రులు దొనఁకఁగఁ
గనియర్జునుఁ డేకలవ్యుఁ గౌఁగిటఁ గ్రుచ్చెన్. 117

క. ఎఱుక యొసఁగు డీద్విజునితోఁ
"పరమార్థము గూర్చి ధరకు పార్థివసుత! నీ
చరితము నొకముని తెలుపఁగ
నరసితి ననె; యంతవార లరిగిరి పురికిన్" 118

తే. ఎలమి గురుకృపఁ గడియించె నింద్రతనయుఁ
డఖిల శస్త్రాస్త్రవిద్యల నమితముగను;
భీములావును, నర్జునువింటినేర్పు
మచ్చరించిరి కౌరవుల్ మదిని మిగుల. 119

♦ ద్రోణుఁడు శిష్యులవిద్యానైపుణ్యము పరీక్షించుట.

సీ. శిష్యుల నెటుఁ బరీక్షింప గురుఁడొక్క
వృక్షశాఖాగ్రమం దెసఁగుచున్న
భాసంబనెడు పక్షిఁ బరఁగంగ గచియించి,
యందఱ కదియ లక్ష్యముగఁ జూపి
మెల్లఁ బాణంబు లెక్కిడ గాఁ జెప్పి,
"యొకరొకరే మీర లొగినిఁ బక్షి
తలఁ దెగనేయుఁడు తగనాదుపనుపున"
నని ధర్మజునిఁ బిల్చి యతనిఁ దొల్త;
తే. "వృక్షశాఖాగ్రమునఁ గలపక్షిఁ జూడు"
మనినఁ "జూచితి" ననె; "మ్రాని?" ననిన "గంటి"
ననియె; "నీభ్రాతల?" నటన్న "నరసినాఁడ"
ననఘ! యీపక్షితో మిమ్ము ననియె నతఁడు. 120

అది విని "దృష్టిచలించెను
బద పద" యనిధర్మసుతునిఁ బనిచిగురుండా
పిదప నొకొక్కరి నడుగఁగ
నదె యదె యన "మీరుచాల" రనియర్జునుతో. 121

"కంటె మముఁ! బక్షితల" ననఁ
"గంటిఁ, గపోతంపుశిరముఁగా కెది కన" నా —
"వింటఁ గలశరము విడు" మన
వెంటనె నరుఁ డేసి కూల్చెఁ బిట్టశిరమ్మున్. 122

నరునసదృశలక్ష్యముఁ గని,
గురుఁడు మహానంద మొంది, గురశస్త్రాస్త్ర
స్థిరతరమర్మము లాదిగ
గఱపె ధనుర్విద్యహాస్తగతమై వెలయన్. 123

ఒకనాఁడాగురుఁ, డెల్లఛాత్రతతితో నోజన్ జలక్రీడనా
గక, గంగానదిఁ జల్పుచుండఁగ మహోగ్రగ్రాహ మాచార్యప
ద్యకసద్వారిజముంగ్రహింప, నతఁడెంతేశక్తి లేనట్లుగా-
నకటా! గ్రాహము పట్టెఁ బాద" మని శిష్యశ్రేష్ఠులన్ జీరినన్. 124

శరసజ్యచాపశోభిత
కరులై ధృతరాష్ట్రసుతులు గ్రాహము నుడుపన్
దొరకొని, నేరక - వివశత,
నరవాయి గొనంగఁ గాంచి యర్జునుఁ డంతన్, 125

క. శరముల నేనిఁట, నీటన్
దిరముగ గురునకుగుఁ బట్టి దిగిచెడు మొసలిన్
అఱనఱలొనర్చి విద్యా -
గురు, బ్రాహ్మణుదోర్గ్రహుఁ గాచెఁ గూర్మి చెలంగన్. 126

మ.కో. కాంచి ద్రోణుఁడు మించునర్జును కార్ముకాంచితవిద్య, లో
నెంచియుబ్బుచు దివ్యబాణములిచ్చి మెచ్చి, భువిన్ నినున్
మించువీరులు గల్గరంచును మేటిదీవన లిచ్చి మో
దించె; ధాత్రి గణించెనిందఱిజు దివ్యకీర్తినరోత్తమా! 127

♦ కుమారాస్త్ర విద్యాప్రదర్శనము. ♦

క. సుతులధనుర్విద్యను గను
కుతుకమునన్ భీష్ముఁ, డంధకురుపతియుఁ, సమం
చితమగుతావునఁ జేరిరి
సతి, సుత, హిత, సచివ, భృత్యసముదయములతోన్. - 128

మ. వరశస్త్రాస్త్రకరాగ్రులై పిఱుద నొప్పన్ ఛాత్రవర్గంబుతో
సరగన్ వచ్చెను రంగమధ్యమున కాచార్యుండు శుక్లాంబరా
భరణుండై సుమమాల్యగంధరుచివిభ్రాజచ్ఛరీరుండునై,
పరమంబౌ నుపవీతసంగతభుజాభ్రాజిష్ణుఁడై ద్రోణుఁడున్. 129

క. గురుననుమతి నాశిష్యులు
కరమరుదుగ నపుడు కుంతఖడ్గ గదాత్రో -
మరకౌశలమును, బరతర -
శరలక్ష్యసవాహ్యాసవఁరచాతుర్యంబున్. - 130

క. అరుదారఁ జూపి; రయ్యెడఁ
గరిబృంహిత! శరనినాద, గళగర్జనముల్
బరఁగె దెసల్ మ్రోగఁగ, బం
ధురముగ దినమందె తమము దోఁపఁగ మిగులన్. 131

క. భీముఁడు దుర్యోధనుఁ డతి
భీమంబుగ గదల నూని భీభత్సముఖో
ద్దాము లగుచును సుహృద్రణ
భూమిఁ బ్రవేశించి రపుడు పుడమియుద్రువఁగన్. 132

చం. పటపట పండ్లుఁగీటుచును, బాదహతిన్ భువిసంచలింప, భ్రూ
కుటినటనాతిరేకముల గొబ్బునఁ గంటిమెఱుంగులాడ; ది
క్తటము లగల్పహుంకృతులు; గాఢగతిన్ భుజయుగ్మమున్ మహో
త్కటముగఁ దట్టుచున్ జలిపి, తారు చరించిరి కొంతవింతగన్. 133

సీ. వంగి కరాగ్రముల్ పట్టి పరస్పర
మును లాగఁబడి తప్పుకొనుచు; నెదిరి
గళము బాహువుచేత వలఁగొని నొక్కుచుఁ,
బడనేలఁ ద్రోయుచు, నెడపదడప
పదములఁ ద్రొక్కుచుఁ, బట్ట నుంకించుచు,
నంకించి బొంకించి యడరఁగనుచు,
ఒకరొకళులప్రక్క లొత్తుచు, హత్తుచుఁ
[illegible]క్కుచుఁ దారుచు నిక్కఁగనుచు,

ప॥ 131 పా॥ 3 అ॥ 1- వ; ప॥ 134 పా॥ 8 అ॥ 1- ఁద;

తే. గదల నెత్తుల మొత్తుచుఁ గడఁక గరిడి
పల్లటీల్గొని పట్టులఁ బట్టి విడుచు
బెడిదముగఁ దాఁకి పిడికిళ్లఁ బొడుచు చలరి
భీమదుర్యోధనులు బల్మి పెనఁగి రెలమి. 134

క. కరికరి గిరిగిరి శరనిధి
శరనిధి యొండొంటిఁ దాఁకుసరణి గిరఁగిరఁ
దిరుగుచుఁ బోరిరి చిలికెడు
తఱి నంబుధి మంధరమును దలపించుచు బోఁగిఁ. 135

ల.వి. ఇల చలన మొందె నటులిటుల; దెస లెల్లఁ గనఁ
దలఁకె; దివి బోరుమని ధ్వని నిశిమె సూర్యుం
డలజడినిఁ బడియె సుర లడఁచిపడి యుభ్రమునఁ
గలసి చనుదెంచి, రది కనుఁగొనెడి వేడ్కన్;
కలఁగె శరధుల్ గిరులు గదలె, పగలే తమము,
కలిగె; భువి రిక్కలవి కడుఁ దొరలె;సభ్యుల్
దలఁకి; రది కుంభజుఁడు తలఁచి వెస రంగమునఁ
దొలఁగుఁ డని చెప్ప, విని తొలఁగి రటు వారల్. 136

మ. అరుదెంచెన్ గురునాజ్ఞ రంగమున దివ్యస్వర్ణసద్రత్నసుం
దరహీరాగ్రకిరీటకుండలతనుత్రాణుండునై, మేఘబం
ధురగాత్రద్యుతినై మహోగ్రశరహస్తుండై నరుం డుగ్రసిం
ధురగంభీరత, సింహగర్జనల, విద్యుచ్చండమార్తాండుఁడై. 137

అల్లనఁ గరతాళధ్వని
పెల్లెగసెఁ బ్రజాప్రశంస విశ్రుతరవముల్
సెల్లెను సభ; ధృతరాష్ట్రుం
డల్లరి యిది యేమి సంజయా! యనిబెదరెన్. 138

నరుఁ డురుకార్ముకవిద్యా
పరిణతిఁ బ్రకటించుకొఱకు వడిరంగమునన్.
జరణం బిడ సభ కేరుచుఁ
గరతాళము లిడియె రవము గగనంబంటన్. 139

అన సంజయుఁ; డాకురుపతి:-
మన ముబ్బగ వీను లలరు మాటల వింటిన్
దనయులఁ బాండుకుమారుల
గనఁ గన్నులు గలుగ వనుచుఁ గటకటపడియెన్. 140

జలదాస్త్రంబున గుప్పు మేఘచయమున్; జండాగ్ని బాణంబునన్
బ్రళయాగ్నిన్ బరపించు; వారుణమహాబాణప్రభావంబునన్
జలవర్షంబును నించు; వాయుశరమున్ సారించి ఘోరంబుగా
నొలయించున్ విలయానిలంబు నరుఁ డత్యుద్దండసత్వోండుడై 141

పృథ్వి నున్నటులుండి విన్ననన్ బొడకట్టు;
చూడఁజూడఁగ భువిఁ జొచ్చివచ్చు;
మేఘమండలినుండి మెఱపులో మెయిఁజూపు;
శైలరూపముఁ దాల్చి లీలనడచు;

స్థూలంబు దీర్ఘంబు సూక్ష్మదేహములొందు;
నంత నదృశ్యుఁడౌ నస్త్రమహిమ;
రథగతుఁడై తోఁచుఁ బృథ్విపైఁ బర తెంచుఁ;
గడఁగి యెల్లెడలందుఁ గానుపించు;
తే. మించు లొలికించుఁ; దమమున ముంచు; నచ్చె
నెంచమాటును శరతతి; నిలుకు నభము;
నభమునకు భూమి తోఁపఁజెనాగ భ్రాంతి
నడరఁ జేయును చూపఱ కర్జునుండు. 142
క. ఇటు లస్త్రవిద్య నభ్యుల
మటుమాయామోహితులుగ బ్రమాన్పడఁ జేయఁగ,
గటకటపడి మచ్చరమున
నట కాకర్ణుండు వచ్చె నర్జును దాఁకన్. 143
చ. భుజయుగ మప్పళించుచును, భూరిబలాఢ్యుఁడు కర్ణుఁ డర్జునున్
భుజబలభూతిఁ దాఁకఁ గన; బోయి కవుంగిటఁ దార్చి హృద్వ్యథా
రుజఁ గురురాజనందనవరుం, డటఁ గర్ణునిఁ బ్రోత్సహించి తా
నిజమతి నూలుకొల్పె; నరు నిట్టలుకం బడి పోరిమీఱఁగన్. 144
క. సమబలురయి కర్ణార్జును
లమరులు వినుతింపఁ బోరి రతిభీకరులై;
తమకించె భువియు దివియును; —
సమరంబున వారిమధ్యఁ జని కృపుఁడాడెన్. 145

---

ప॥ 142 పా॥ 4 ఆ॥ 11- ని; ప॥ 144 పా॥ 2 ఆ॥ 11- బో;

కురవంశాంబుధిచంద్రుఁ డు
నరుఁ; డాతనితోడఁ బోర న్యాయముసూతా!
నరవంశజులకుఁ; గాన వి
వరముగఁ ద్వత్కులముఁ దెలుపవలె స్పష్టముగన్. 146

అన, దుర్యోధనుఁ డాడు సత్కులము శౌర్యంబున్ మహాసేనయున్
అనువై నాతఁడె రాజనామమున కత్యర్హుండుపో! యీతఁడో
ఘనబాహాబలుఁడౌట నర్జునుని దాకన్ రాదె? రా దందురేన్,
గనుఁ డం చాతని నంగరాజ్యపతిఁగాఁ గావించె నా వెంటనే. 147

అంగాధిపుఁ డమితభుజో
త్తుంగుఁడు కర్ణుండు; నరునితో సరిపోరన్
సంగతుఁ డయ్యె ననంగాఁ
బొంగుచు దుర్యోధనుండు పొడగనెఁ గృపునిన్. 148

అంగాధిపుఁ డానృపుతో;
మంగళమూర్ధాభిషేకమహితుండై "నీ
సంగతి విడఁ, దఱియఁగుచో
నంగము నేనిత్తు నీకు నని కరమంటెన్. 149

తే. అతని ఱెప్పవాల్ప కెటి కన్నతోడనె
చన్నుపాలుచేఁప, సహజకవచ
కుండలాంచితుండు కొడు కర్కజుండని
మఱిగెఁ గుంతియితరు లెఱుఁగనటుల. 150

---

ప॥ 147 పా॥ 3 అ॥ 5- బలుఁడౌట; ప॥ 148 పా॥ 2 అ॥ 15- పో;

క. ఉదయాద్రినుండి భానుం
డదెపనిగా గగనతలమునంతయుఁ జుట్టన్
మదిరోసి, స్నానమాడఁగ
నద నని చనె ననఁగఁ బశ్చిమాంబుధిఁ గ్రుంకెన్. 151

క. రవిచుస్తమింప, భీష్ముం
డనలన్ సభనాఁప, నంద ఆరగిరి పురికిన్;
గనఁగూడి కర్ణుఁ డాకౌ
రవవర్యుని వెంబడించె రాజసన్మూర్తిన్. 152

క. వరశరవిద్యాకోవిదుఁ
డురుబలుఁ డగుకర్ణుమైత్రి యొనరుటకతనన్
నరునలనిభీతి నీగుచుఁ,
గురుపతి మదిహాయిఁ గన్నుఁగూర్కెడఁజాలెన్. 153

♦ "ద్రోణుండర్జునునిచే ద్రుపదుంగట్టి తెప్పించుట"

ఆ, వె. గురుఁడు శిష్యవరులఁ గురుదక్షిణన్ గోరి,
"ధనమదాంధు ద్రుపదు నని జయించి
కట్టి తెండు మాకు ఘనగురుదక్షిణ
ముట్టు — వే ఆదేమి ముట్ట" మనిన — 154

సు:వృ, ఓలి రాజపుత్రులెల్ల నోజఁగూడి, రజ్జులన్
బేర్చిలి కొంచు సైన్యమెల్ల వెంబడింపఁ, జాలఁగాఁ
గాలి నేల యీనినట్లుగాఁగ వేగసాగిపాం
చాలుపీటఁ జేరి కేరి చక్కముట్టడింపఁగన్. 155

ఎల్లరను గడచి కౌరవ
వల్లభుఁ డాద్రుపదుపురికి వడివడిఁ జని తాఁ
గొల్లగొనఁబోవ నాతఁడు
బల్లిదుఁడై తాఁకెఁ గౌరవప్రభు సేనన్. 156

అసిదండకుంతముద్గర
ముసలగదాతోమరాది ముఖ్యాయుధముల్
ప్రసరింప కురుబలముపైఁ
గసిమసఁగెను ద్రుపదుసేన కడుమగఁటిమితోన్. 157

శరశతసహస్రసంహతి
సరభసగతిఁ బఱపి యురులఁ జదుప్రచు ద్రుపదుం
డఱకొఱఁగానక పోరెను
కురువీరులు బెదరి చెదరి కుయ్యాడి పఱవన్ 158

ధృతరాష్ట్రసుతులు నడుమన
హతమాఱ్చుచు ద్రుపదు కఱకుటంపఱలను, స
ద్భుతముగఁ బోరాడఁగ నతఁ
డతిసాహసమునఁ బెనంగె నరితతి బెగడన్. 159

బహువిధశరనికరంబులు
బహుముఖములఁ బఱపెఁ బగరు పరువ్రలిడంగన్
దహియించుచు బాణాగ్నిని
విహరించె రణాగ్రమందు విచ్చలవిడిగన్. 160

ఆ.వె. ప్రళయకాలకాలభైరవునటు సేనఁ
జొచ్చి యార్చి పేర్చి త్రెచ్చి వ్రచ్చు
చున్న ద్రుపదుదాడి కోర్వక కౌరవుల్
భీతిఁ బరచి ద్రోణు వెనుక కొదుఁగ- 161

ఆ.వె. అర్జునుండు నగుచు నవ్వారితో నను
గురునితోడి వాఁడు గురుబలుండు
కలన ద్రుపదుఁ డంతసులభుఁడఁటే? యని
గురుయుధిష్ఠిరులకు నెఱిఁగె భక్తి- 162

ఉ. భీముఁడు దోడుగా నడవ వెంబడి మాద్రికుమారు లంటి నా
నామహనీయవైరిసుభటాంబుధిఁ ద్రచ్చఁగ నర్జునుండు బల్
దీమసమూని తాఁకి వెసఁ దీకొనె! దూఁకి యరాతివాహినిన్
దామరసాకరంబు సమదద్విపమట్లు కలంచె భీముఁడున్. 163

ఉ. దంచును శత్రుసైనికవితానపదాతులు దద్దఱిల్లఁగన్
జించు మదద్విపప్రతతిఁ జెండు మృగేంద్రసమూహమెల్ల సా
గించును దాడి వాజిరథకేతనరాజిపయిన్ బదాహతిన్
మించి మృగేంద్రగర్జనల మేదిని బొంగరమట్లు లాడఁగన్. 164

చ. కవలు తెగించి ఘోరతరకార్ముకపఙ్క్తి వెలార్చి పేర్చుచున్
కవకవశత్రుకోటులపటాలము నంటి హుటాహుటించుచున్
యవిరతితోడ పోరిడి జయధ్వనిఁ బిట్టుగఁ జెట్టి దిట్టలై
జవజవఁ గొట్టి గట్టె యరిసైన్యము బట్టఁగఁ జెట్టుగుట్టలన్. 165

ప॥ 161 పా॥ 4 తే॥ 4- అ; ఔ॥ 164 పా॥ 2 తే॥ 21 మట్టునా;

భుజం. నరుం డంతఁ బాంచాలనాథాగ్రగణ్యున్
దురంతాస్త్ర శస్త్రాళిదోశ్శక్తి నేయన్
కరంబల్గి యాతండు ఖండించి వానిన్
మఱిన్ ముంచె బాణాగ్నిమంటల్ చెలంగన్. 166

క. దండధరుఁబోలి నరుఁ డు
ద్దండతఁ జాపంబు నెత్తి తాఁకుచు ద్రుపదున్
చండాశుగాగ్నికీలా
కాండములన్ బరపె నరినికాయము బెదరన్. 167

క. నరుఁ డేసెడిశరసంహతి
నఱుకను ద్రుపదుండు; నరుఁడు నడుమ హరించున్
గుఱికొని ద్రుపదుఁడు బఱచెడు
కరకు కడిఁదియంపరల వికావికలై పోన్. 168

చ. ఇరువురు వీరవిక్రములు నిర్భరు బాహుబలాఢ్యు లస్త్రసం
హరణవిధుల్ ప్రయోగగతు లారసి పోరిరి శాతసాయకాం
తరముల నంతకంతకును దర్పము న్ద్రుపదుండు దూలె సం
గరమున మిన్నుముట్టె నరు కార్ముకజృంభణ మెచ్చె స్వేచ్ఛగన్ 169

క. నరుఁ డాద్రుపదునివర్మము
కరకార్ముకశరము రథము ఖడ్గముసూతున్
జఱిచఱినఱుకఁగ ధరకత
దుఱికి నరుని డాసి పట్ట నుంకించు నేడన్. 170

ప॥ 166 పా॥ 3 అ॥ I- గ; పా॥ 4 అ॥ 10- మాలల్;
... 170 పా॥ 2 అ॥ 8- ...

క. కరికుంభస్థలి కడరెడు
హరిశాబకమట్లు పార్థుఁ డడరి ద్రుపదుపై
నుఱికి తిరిగిచి బాహువు లఱి
విఱిచి రథాక్షమునఁ గట్టె విక్రమము మెఱయన్. 171

క, వెఱచఱచి పఱవ శత్రులు
పఱదారుచు పార్థుఁ డంత నాద్రుపదధరా
వరుఁ గొని సరభసమున
గురుచరణాబ్జములఁ ద్రోసె గురుదక్షిణగన్. 172

ఆ. వె, నరునివిక్రమంబు గురుఁ డవలోకించి
యమితహృష్ట హృదయుఁ డగుచు మిగుల
హర్ష బాష్పధార లార షేన్గరుపాఱఁ
గౌఁగిలించి: పిదపఁ గాంచి ద్రుపదు. 173

క, వీరెవరు? ద్రుపదరాజులు
గారా? మాకాళ్లఁ బట్టుకర్మమె? యౌరా
వీరలుగారా? యహహా, మ
హారాజ్యశ్రీయె నిత్య మనుభ్రమ విడిరా! 174

ఆ. వె. మమ్మునిప్పుడైన మది గురుతింతురా?
యనుచుఁ బరిహసించి యతనిఁ బుచ్చెఁ;
క్షణముమాత్రగాక తృణహుతాశనమును
త్మానురాగ్రహమును శాశ్వతములె? 175

ద్రోణునిచే విముక్తిఁ గని దుర్భరకోపమహాప్రతాపదా
వానలమానసుం డయి మహార్తిఁ బ్రతిక్రియ సేయ నెంచి లో
లోన నె కుంభసంభవుని రోయుచు నా ద్రుపదోర్వినేత, తా
మానక సాధనాంతర మమర్షత నారయఁ జొచ్చె నిచ్చలున్, 175

యమసుతుఁడు రాజ్యరక్షా
క్రమదక్షుఁడు గాఁగ విదురగాంగేయప్రబో
ధము మదిఁ గొని ధృతరాష్ట్రుఁడు
ప్రమదంబునఁ గట్టె యౌవరాజ్య మతనికిన్. 177

తమ్ములు దిక్కుదిక్కులను దర్ప మెలర్ప జయించి బొక్కసం
బిమ్ముగ నింప ధర్మసుతుఁ డేఁగి విశుద్ధయశోవిశాలుఁ డై
సమ్మద మొంద ధాత్రి బుధసన్నుతుఁ డై యువరాజె యయ్యు నా
నిమ్మహిఁ సార్వభౌముఁ డవ నేఁపు గడించె ధరిత్రి నెల్లెడన్ 178

అనిలజు బాహువిక్రమము నర్జునుదివ్యతరాస్త్రవైభవం
బనితరసాధ్య లాఘవలసద్భుతశౌర్యము ధర్మసూను స
ద్వినయవివేకముల్ గనిన విద్విషులుల్ దలలూఁప వీరితో
నెనయగువారె లేరని గణింపఁ ద్రిలోకయశంబు చేకురన్. 179

భారద్వాజుఁడు నరుని య
పారబలంబునకు శుద్ధవర్తనమునకున్
గేరుచు బ్రహ్మశిరంబను
ఘోరాస్త్రము నిచ్చి పుచ్చి కొనటలుఁ గఱపెన్. 180

---

ప॥ 179 పా॥ 4 అ॥ 23- అన్; ప॥ 180 పా॥ 4 అ॥ 10- న:

ఉ. తొల్లి "యగస్తి" నాతపసితొట్టి మహాత్ముని యగ్ని వేశుచే
జెల్లఁగఁబెట్టె వారు దయ శిష్యునకిచ్చిరి నాకు; నీకు నే
నుల్లము మెచ్చియిచ్చితిని యోగ్యుఁడవౌట; మహాస్త్రమిద్ది నీ
వల్లన దీన నోర్వనగునయ్య త్రిలోకములైన నర్జునా! 181

త. మానవులపైనఁ బరపఁగ
మాను! జగము నేచికాల్చు! మఱి పగతురు నీ
ప్రాణం బానఁగవచ్చినఁ
బూనుము; హరునైన నోర్వఁ గోలును దీనన్. 182

తే.గీ. అయిన నాకొకమాటియ నగును నీవ!
యేను నీమీఁద ముందుగా నేయువఱకు
నలుగు నాపైనఁ దొలఁగకు మనిన గురుని
పదయుగళి నంటి నరుఁ డట్లె పాసఁజేసె. 183

## పాండవులను ఇంద్రప్రస్థపురంబునకు పంపుమని దుర్యోధనుఁడు ధృతరాష్ట్రుని నిర్బంధించుట.

తే.గీ. యమసుతుఁడు గొంట యావరాజ్యాసనంబు;
నర్జునుని భీముఁ గవలవిఖ్యాతి యలమి
మూఁడులోకంబులందెల్లఁ బొగడఁబడుట;
నోగులుదగులఁగ దుర్యోధనుండు పొగిలి— 184

తే,గీ. మాతులుని శకుని! నాతనిమంత్రి గణికు;
భ్రాత దుశ్శాసనునిఁ గర్ణుఁబ్రీతిఁ జేర్చి
మంతనంబుండి యొకనాఁడు మది దహించు
వేదనము వారితో నిట్లు వెడలఁగ్రక్కె. 185

ఉ, ఆయుధవిద్యలన్ బరతరాస్త్రవిభూతి నజేయు లంచు వా
రాయత బాహువిక్రము లటంచు రణోద్ధతు లంచు నామదిన్
బాయనిభీతి నుంటి నలపాండుకుమారుల నెంచి మించి మా
నాయన చేసె ధర్మజుని నాథునిగా యువరాజ్యలక్ష్మికిన్ 186

ఆ,వె. వ్రక్కబల్లెమట్లు పగతుఁడు నిక్కఁగ
మానధనుఁడు శాంత మూనఁగలఁడె!
హితులు మీర నాకు గతిఁ జూపి తెలుపుఁడు
మంత్రి మనిన శకునిమంత్రి యనియె- 187

క. ఆపద హెచ్చినకొలఁదిని
నోపిక ధైర్యంబుఁ బనుల నురుదీక్ష తగున్.
భూపతికి నాత్మరక్షన
మాపిత మగుఁ మంత్రిరక్షయత్నము వలయున్. 188

క, నమ్మిక గలిగియు నొరులను
నమ్మక తగఁ దత్త్వబుద్ధి నానాగతులం
దిమ్ముపడ నాత్మరక్ష వి
ధమ్మున మెలగఁగ నగును ధరణీశుఁ డిలన్. 189

ఆ. వె. అహిత మెంచు చెనఁటి యాత్మీయుఁడైనను
గురుఁడైన వానిక్రూరగతిని
శాసనంబుసేయఁజను జను తెలుగంగ:
తడవుసేయఁ దగదు, తాల్మి చనదు. 190

ఆ. వె. విపుల సామ దాన భేద దండవిధాన
గతుల ధర్మపథులుగాఁగ జనులు
పాలనంబుసేయఁ బ్రభుఁ డొప్పు; ప్రజలను
వర్ణవృత్తి మరసి వర్తిలంగ. 191

క. అరిమిత్రభావవిరహిత
వరమతి న్యాయైకపరత వల్లభుఁ డెలమిన్
గురుశాసనముల ధరణిన్
బరిపాలింపంగ నొప్పుఁ బరతరదీక్షన్. 192

క. అలుకయుఁ గూర్మియు సమయము
గలపట్టులఁ జూపవలయుఁ గాడ్పును బిడుగున్
ఫలకాలముతటి వీచుట
నిలఁబడుటను జనుల కెఱుఁగ నేర్పెడుభంగిన్. 193

క. అపకారి యల్పుఁ డనియెడు
నెపమున నిర్లక్ష్యమూన నేర్పె? ముల్లిం
తఁ బదమున నలుసుకంటను
విపరీతముగాదె యోర్వఁ బృథ్వి నెవరికిన్? 194

అనలకణ మించుకం చన
జను నె? మహాటవులన్ గాల్పఁజాలదె యది? కా
వున నరుల నుపేక్షింపక
కనుఁగల్గుట యొప్పు నంచు గణికుఁడు చెప్పెన్. 195

ఒడఁబడి గణికుని నుడులకు
విడఁబడి కర్ణాదిసఖుల; వేదనమదిలోఁ
గడఁకొన, దుర్యోధనుఁ డటు
నడచెను ధృతరాష్ట్రనృపుని నగరికిఁ దోడ్తోన్. 196

జనకు నగరివాకిటికిన్
జని ద్వారికునిఁ బంపఁ, జని వాఁడు వెసన్
వినిపించి తేనిఁజనుమతి
వెనుకొని చనె నతని దూత, పితృసన్నిధికిన్. 197

జనకుని చరణాబ్జంబుల
కు నమస్కారంబుఁ జేసి కొమరుఁడు, దన్నున్
వినిపించి దప్పనిలువం
గను, డగ్గఱఁ జీరి చీఁకుఱ్ఱావిభుఁ డంతన్:- 198

చక్కని బాహుదండములఁ జూచి కుమారుని జేర్చి యంకమున్
జెక్కులు లంటి, మూరుకొని శీర్షము; హర్షముమీఱ నక్కునన్
గ్రక్కునఁ దార్చి పొందెడుసుఖంబునకంటె ముదంబుఁ గూర్చునిం
పెక్కనదొండులేదు పిత కిందున నందున నెందుఁజూచినన్. 199

క. అని నందనుపై దడవుచుఁ
దనమోము వికాస మొందఁ దర్దయుఁ జిత్తం
బున వాత్సల్యము విరియఁగఁ
దనయునిచుబుకంబు నంటి తా నిట్లనియెన్. 200

తే. సౌఖ్యమే నీకు, నీకూర్చుసఖులకెల్ల?
సచివులున్ భటులు నీప్రీతి సలుపువారె?
పరిజల నరయుదె? పేర్మింత వారుతనయ!
కొఱఁత లెవి యున్న రారాజుకొమరునకును? 201

శా. ఎన్నం డర్జునువింటిబల్మి మదిలో నేమేని లెక్కింపఁడే!
తన్నే మెచ్చెడు స్వాభిమాని, శరవిద్యాశేముషీశౌర్యసం
పన్నుం, డాఘను జామదగ్నికృప సంభావ్యోరుశస్త్రాస్త్రుఁడై
కన్నాకై నిను గాచు నంగపతి యాకర్ణుండు సౌఖ్యంబెగా! 202

తే. నేనె తా నని చెప్పెడునేర్పు కాఁడు,
బుద్ధినెంచ బృహస్పతిఁబోనివాఁడు,
మాయలకొటారు, నీకూర్మిమామ శకుని
సేమముగ నున్నవాఁడఁటే? చిన్నికుఱ్ఱ! 203

తే. మేను లరయఁగ రెండైనఁ, బ్రాణమొకఁడె
యని మెలఁగు తోడునీడ, నీయనుఁగుభ్రాత
శౌర్యసాహసికుండు దుశ్శాసనుండుఁ,
గడమతమ్ములు సౌఖ్యంబు గలుగువారె? 204

సీ. దేవాంశభవులు యుధిష్ఠిరాదులు, పాండు
సుతులు సుసుఖులె! వా రతులబలులు
నీతిపరుల్ ధర్మనిరతులు, నీమెడఁ
బ్రీతులే? భీముఁడు వీరబలుఁడు
వెఱ వెఱుంగనిదిట్టఁ డరయు నే నిను గూర్మి!
దుశ్శాసనుని వాఁడు దునుకఁబోఁడె!
నరుఁడుఁ గర్ణుఁడుఁ బరస్పరమైత్రిగలవారె?
కనలు మీఁదెసఁ గూర్మిఁగలరె మిగుల?
తే. గురుఁడు నరునకుఁబలె మీకుఁ గూర్చు వాఁడె?
కృపుఁడు మిముఁ బాండవులఁబోలెఁ గృపను గనునె?
తాత భీష్ముఁడుఁ గురుకులతాత్రిప్రేమ
నోము నే మిమ్ము నెల్లర నొక్కమెయిని? 205

క. అనుతండ్రికి దుర్యోధనుఁ
డను "నీనుడు లాత్మసంశయప్రతికృతులై
కనఁబడు; లో తంతియు; యిది
కనికని నీ వింత సేయఁగాఁ దగునయ్యా? 206

క. పుత్రులకుఁ బితలు గూర్తురు;
పుత్రులకై ప్రాణమైనఁ బోఁబుత్తురుగా!
ధాత్రిని దండ్రులు; నీ కేఁ
బుత్రుఁడనో, కాక శత్రుపుత్రుఁడనొక్కో? 207

క. కట్టా! నట్టడవులలోఁ
బుట్టి పెరిగి చెట్టు గుట్ట పుట్టలఁ దిరుగం
బట్టినకష్టులఁ బెట్టితి
పట్టణమున నాకుఁ బ్రిక్కబల్లెంబట్టుల్.. 802

ఆ.వె. మాఱుపలుకలేక మది సైచితిమి నాఁడు;
పిదప యౌవరాజ్య పదవి నిచ్చి
ధర్మతనయు నామతలకెత్తితివి! భార
మంచునైనఁ గొడుకు నెంచనైతె? 209

ఆ.వె. చీఁకునైననీకుఁ గాక రాజ్యేందిర
పాండురాజుబాహుపక్షమూనె!
నతని యశమెసంగె క్షితి నద్దెసల; నీదు
పేరె లేదు ఱేఁడ! పృథ్వినెందు. 210

ఆ,వె. ఎల్లవిధులఁ జెల్లు నేనుండ ధర్మకాంతఁ
గట్టినావు జమునిపట్టి కీవు!
రెండుతలలు మాకె జేసెల్లు నా కబ్బు?
రుచిమఱుంగువారు రోయువారె? 211

ఆ.వె. రాజుపెద్దకొడుకె రాజ్యాధిపతి యౌట
నాఁటినేఁటి రాచపాటి యయ్యో!
తరతరములఁ జేతఁ దగిలినలిబ్బిని
గాలఁదోయఁ జాలుబేల కలఁడె? 212

మ. వినుచుంటిన్ జనులాడికొంటఁ జెవులన్, బృథ్వీస్థలీపట్టమున్
గాను దుర్యోధనుఁ డెట్లు? భూవిభుఁడు కాఁ గుంతీసుత జ్యేష్ఠుఁడే
చను! నిం కిద్దిపరంపరంబుగ నటే సాగింపనౌ నంచు;- నే
మన సామంతులు మంత్రు లిట్టిరుల! నెయ్యా గేలవాక్రువ్వఁగన్ (213

క. చేరరు మముఁ బాండవు, ల
వ్వారలతో మాకుఁ బొత్తునడ; దొక్కొడ మ
మ్మారీతిఁ జేరఁ గోరుట
పోరాటకె కాక, పొందిపొసఁగుట కగునే? 214

క. బలవంతులు భుజశక్తిని,
బలవంతులు బుద్ధిశక్తి వారలు; బలవం
తుల మేమును; బలవంతుల -
బలవంతులపొందు ముందుఁ బగలకు వింతా! 215

క. అనుతనయునిపలుకులు దవ
మనమున ములుకులుగ నాటి మలమలమాడ్పం -
గను నొచ్చి పలుకు "నిన్నియు
మును నేఁ గలఁగన్న యట్టిపోకలె సుమ్మీ! 216

మ. విను మోపుత్ర! షడంగసంగతముగా వేదంబు నల్లించియున్
అనువారఁగను నర్థశాస్త్రమును నాద్యంతంబు శోధించియున్
జనుపాంధుండు రణప్రయుక్తవిధులన్ శక్తుండు గాకుంటచే,
వను రాజౌటకు నర్హుఁడంచు సచివుల్ న్యాయంబు సూచించిరన్ 217

ఉ. లోకులు జీకు నఁగొనఁగ రోసినఁ, దమ్ముఁడు ప్రేమబంధుఁడై
పీఁకను, రాచగద్దె నను బెట్టి కడంక జగజ్జిగీషుఁడై
చేకొని రాజ్యసంపదవిశేషము గూర్చె, శిరమ్ము దాల్చె నా
వాకుల; సేవఁజేసె భయభక్తులఁ బాండువిభుండు నామెడన్. 218

క. వీరల, వీరులఁ, బాండుకు
మారుల, ననుజన్ము సుతుల మహితగుణశ్రీ
స్ఫారుల. సుకుమారుల, ని
ష్కారణముగఁ ద్రోయు బుద్ధికలుగదు తండ్రీ! 219

క. అని దుఃఖించెడు జనకుని
కను:- నీ విట్టులైన నింక యమసుతుపిదపన్
గొను భువి నాతని తనయుఁడు,
జను నట్టులె మాకులేద! జనకా వింటే! 220

తే. ధరణిపాలనగా కొండుతగనిపనియ
క్షత్రియులు మాకుఁ; గావున క్షాత్రలంబొ,
గరళమో - చూడు! వేఱొక్కగతి కలుగునె?
తండ్రి! తగు నెద్ది? తలపోసి దాని నిమ్ము !! 221

క. ఇటు లాడినతనయునకను
గటకటపడి చీఁకుతేఁడు "కట్టా! యిటులన్
గటువుల నాడుదె? నాపని
యటమటమయి యడవివెన్నెలటు లయ్యెఁ గదే! 222

క. మీరలువారలుఁ జేరిక
నీరము క్షీరంబునట్లు నెగడెద రనుచుఁ
గోరితిఁ గొండంతగ; నీ
ఘోరము మదిఁ దలఁపనైతిఁ, గోన కిట్లగునే? 223

క. తనయునకు విసమిడుదురఁట
దనుజులయినఁ? జిరము మనుము తండ్రీ! యది నేఁ
గోని కనుమూసెద, నావిద
పనుమీరును వారుఁ బొందు ప్రారబ్ధగతిఁ! 224

తే. అనిన; నంతటఁ బనిదీఱు నయ్యెఁ! యీవు
పోయినంతన పగయెట్లుపోవునయ్య? -
చెలఁగి కాల్పదె యార్పనిచిచ్చు దీని(
నోపుదువు నీవు; మాముప్పు వాపు తండ్రి! 225

తే. ఏమి నే నేర్తు నని మది నెంచవలదు;
వారణావత మేలఁగాఁ వారిఁ బంపు,
మేను యువరాజు నయ్యెద నిందు, ముందు -
వరుసఁ బనులన్ని సమకూర్పవచ్చునయ్య! 226

సీ. అన; ధృతరాష్ట్రుఁడే నదిమదిఁ దలఁచియు
భీష్ముఁడెట్లోయను భీతినుంటి!
గురుఁడు కృపుండు విదురుఁడు పాండవులంద
కేడుప్రేమ నుండుటఁగంటి; నట్లె

మంత్రిసామంతులమత మాట నెఱిగితిఁ;
ప్రజకు ధర్మజుపైని భక్తి పెద్ద!
అట కేఁగుఁ డన వార లెటుతలంతురొ నన్ను!
భీముఁడు నాయాజ్ఞ వినునొ వినఁడొ?

తే. యిట్టిచటులుండె! నాపని యెంతయేని
దోసమును మోసమును నొటఁ జేసి, మున్ను
వారణావతమును వారు చేర నాన
తీయ వెఱచితి; నిపు డేమిసేయవచ్చు!. 227

క. ఎటుచేసిన నెటుముంచునొ?
కుటిలత ఫలకారి యగునె? కొన కది మనకే
ఘటియించునొ పెనుముప్పును?
తటకున నెదియైన సేయఁదగునె కుమారా! 228

సీ. అనియెడుతండ్రికి ననుఁగుసుతుం డను –
నిటులేల భీతిల్ల నిభపురీశ!
సురనదీసుతునకు జూరదు భేదముసుమ్మ!
ప్రేమ సములు వారు నేముఁగూడ
గురుపుత్రుఁ డన నాకు నురుమిత్త్రుఁడై యుండె;
ద్రోణుండు తనయునితోడివాఁడు!
గురుకృపుల్ బందుగుల్; గురునట్లు కృపుఁడౌట
నతఁడు నైతము మనహితుఁడు గాఁడె!

తే.గీ. ఒక్క విదురుఁడు మాత్రి మాదిక్కువాఁడె
కాని భయమొందఁ బనిలేదు కన్నుగలిగి
మెలఁగు టొప్పగు; దీపంబు వెలుఁగునపుడె
యిల్లు సవరింపనగును జాగేల యింక ? 229

## ధృతరాష్ట్రుఁడు పాండవులకు యింద్రప్రస్తమునకు బోవనాజ్ఞ నిడుట.

క. ధృతరాష్ట్రుఁ డెట్టకేలకు
సుతునుడులకు లొంగి పాండుసూనులఁ దఱుమన్
మతిఁజేసి "దానికిన్ దగు
తతి వలయును దాళు" మనుచుఁ దనయునిఁ బంపెన్. 230

తే.గీ. అంత దుర్యోధనుఁడు తనయాప్తసఖులఁ
బనుప వారలు వారణావతముఁగూర్చి
వలనుగ గ్గెడునపుడెల్లఁ బాండుసుతులు
బ్రిమయునటు దెల్పి రెలమిఁ దద్వర్ణనముల. 221

తే.గీ. పాండవులు దాని నీక్షింపవలచు తెఱఁగు
వినినసచివులు దుర్యోధనునకుఁ దెలుపఁ
దెలిసి యతఁడది తండ్రిని బలు తెఱఁగుల
నొత్తిడినిఁ జేసెఁ గార్యంబు నెత్తికొనఁగ 232

శా, "ఆలస్యాదమృతం విష" మ్మగద? యిష్టార్థమ్ము సాధింపఁగా
లోలుంగాదొకొ? వారలొప్పి రటకుఁ బోవంగ; జాగేల ? నా
లీలన్ వైశమ వారణావతము ప్రోలిన్ జేర వారే గుహో
మేలౌ మాపను లింపు నంచనఁగ నామీఁదన్ నృపుం డప్పుడే.-233

శా. ఆకౌంతేయులఁ బిల్వఁ బంచె సభకట్లవ్వార లేతేరఁగన్
జోరన్ దగ్గర దీసి చెందముగదున్ స్రుక్కంగ గొప్పంబువుల్
పొంకన్ పీఁకఁగ పోలయుగ్మముపయిన్ దుఃఖించుచున్ దమ్మునిన్
వాకొం చాతనిభ క్తిశ క్తి సుగుణవ్రాతంబు లగ్గించుచున్. 234

ఉ. ఆతనికంటె మచ్చికలునచ్చికబుచ్చికలెచ్చుగన్నవి
ఖ్యాతులు మీరు తమ్ము నటులాపఁటఁగంటిరి నన్ను మీఁపయిన్
బ్రీతియుఁ బెద్ద; యట్లగుటఁ బ్రేముడిఁ బంచెదఁ గీర్తిసౌఖ్యముల్
బ్రాఁతిగఁ గోరి; మీర లది భవ్యమతిన్ నెరవేర్పఁజూడుఁడా! 235

చ. అమరనదీతటిన్ వెలఁగియూర్యనుతం బగువారణావతం
బమరులవీఁడుబో డనఁగ, నాయులకాపురి హారిగేరి బల్
విమలసుఖాలవాల మయి విశ్రుతి కెక్కిన దందుఁ బొందుగన్
బ్రమదముమీఱఁ గొంతపడి వాసముసేయుఁడు మీరు కుంతితోన్- 236

క. ఎంతలు మీ కనువగు న
య్యంత సచివభృత్యవర్గమంతయు మీతో
సంతసపడఁ గొనిచని యా
ప్రాంతముఁ బాలింపుఁ డెల్లభాగ్యము లలరన్. 237

ప॥ 233 పా॥ 4 అ॥ 15- మీఁ; ప॥ 234 పా॥ 2 అ॥ 21- షా:

సీ. ఆదిపశుపతివాస మగుట సత్క్రియలకుఁ
దగియుండె వీరా రటఁ దండ్రిప్రేతకము
గాఁగ హిరణ్యగోగణముఖదానముల్
ధరణీసురుల కిచ్చి తర్పణములఁ
జేసి పుణ్యులుగఁ దము చెలఁగి; కొండొకకాల
మున మిమ్ము రప్పింతునని ముదమున
వినఁ జెప్ప విదురుఁ డాతని కను విప్పడేల
నీరి నయ్యెడ కంప ధారుణీశ!
తే.గీ. ఎదుట వసియింప, నొప్పఁ బోషింపవీరిఁ
దమ్ముఁ గూరిమిబిడ్డలఁ దగునటయ్య
నెట్టదవ్వుల నంతేమిపుట్టిమునిఁగె
నటకునిట కని యిక్కోటి కటమటింప, 238

క. అన; భీష్ముండను బాల్యా
బునుండియె వీరువీరు పౌనరఁగ మైత్రిన్
మననగు విడినడఁదగునా
పెనువృక్షము వంగఁగలదె పిన్నటఁ బోలెన్. 239

క. ఘటసంభవుఁ డను " నీవా
క్కట నెల్లట నసువులట్టఁగను; పాండుపుల
క్కట! నీసుతు లేగద; విడు
మిటు భేదం బనుజుఁ బాండునెంచియు నైనన్. 240

---

ప॥ 238 పా॥ 1 అ॥ 1- అ; పా॥ 5 అ॥ 3- పుణ్యులు;
పా॥ 9 అ॥ 1- ఎదుట–చేరి ప॥ 239 పా 4 అ॥ 6, వంగఁగలదె;

తే.గీ. అనఁగ ధృతరాష్ట్రుఁ డను " మీరలకట! యిట్లు
లేనిపోని కుశంకల లేపనగునె ?
వాఁడువీరును నావార! వేఱుగలరె ?
అసువులును దేహ మవ్వార, లాత్మ నేన. 241

సీ. అంద ఱొక్కెడనుండఁ బొందేమిపొసఁగును ?
నెడనెడఁ గూడుటయే సుఖంబు;
మదిగల్గవలెఁగాక గుదిఁగట్టినంతన
ప్రేమ పుట్టించునంటపిచ్చిమాట!
మావంశ మట్టిద, యిది మీర లెఱుఁగరే ?
ఘనమతుల్ నా కొడుకుల్ గలిగినారె ?
నే నుంటి నిం తేటి కానుకూల్యముఁ గూర్పఁ
జెడు నెటు ; సుతు లంతె నెపఁగుమాటె ?

తే.గీ. వారణావతమున కేగి పాండుసుతులు
రారొ యిచటికిఁ ? జూడరో మీరు వారిఁ ?
దగునె మీ కిది ? గోరంతదానిఁ గొప్ప
కొండగాఁ జేసి చెప్ప నేముండె నిందు ? 242

## పాండవులు ఇంద్రప్రస్థపురమునకు బోపుట.

మ. అన నాధర్మజుఁడాడు వారలకు "మీయత్యంతవాత్సల్య మే
మన? ముగ్ధాత్ముల మైతిమట్టి కడుభాగ్యంబయ్యె మీరెప్పుడీ
ట్లనె మాయందు ఘనానురాగమతులై లాలించిపాలింపుఁ డీ
రన మాతాతలు వంశనేతలును విద్యాదాతలుగా గారొకో? 243

క. అయ్యలును నెయ్యురును సగు
నయ్యలుమీ రెల్ల మీకునంజలు లివె మా
యయ్యకు మాఅయ్యగఁ బె
ద్దయ్యయె మము ప్రోచె నేలనది తలిర్వంగన్? 244

క. ఈతనిపను పొసరించుట
లాతతభాగ్యంబ మాకు; నది యట్లుండెన్,
ఈతఁడు విసమే యిడినం
బ్రీతియ; మా కమృత మదియ శ్రీకృష్ణునయన్ 245

సీ. వారణావతమును జూడఁగోరియుండు
మామనమ్ముల నెఱిఁగినమాడ్కి విభుఁడుఁ
బ్రీతి నచటికె యంపుటప్రియముగాదె ?
యింతకంటెను మా కేమిత్ప్రాప్తికలదు? 246

ఉ. కోరిక యుండె మాకు మదిఁగొప్పగఁ జొప్పడి వారణావతం
బారయఁ, గోరకేమునుపె యయ్యయె మామదిఁ గన్నయట్లు చే
కూరఁగఁ జెప్పిపుచ్చెఁగద! కూరిమికూడునె యిట్లు? మానమ
స్కారము మీకు నెల్లరకు సన్మతులార! యనుగ్రహింపుఁడీ? 247

ప॥ 244 పా॥ 4 అ॥ 6- ఁబో; ప॥ 246 పా॥ 2 అ॥ 14- డు: పా॥ 3 అ॥ 1- ప్రి;

సీ. అని తమ్ములును దాను సాయుష్యకును మ్రొక్కి-
తాత గాంగేయుపాదములఁ బట్టి,
ఆచార్య ద్రోణుని యడుగుల స్పృశియించి,
కృపుచరణంబుల కెరఁగి; విదురు
దరికేగి వీడ్కొని గురుపుత్రుపద మంటి;
యందున్న పెద్దల నరసి మ్రొక్కి;
దుర్యోధనుని. వానితోఁబుట్టువుల, శకుని,
కర్ణ, వికర్ణులఁ గౌఁగిలించి;

తే.గీ. సచివ హిత బంధు సుభట ప్రజలకునెల్ల
పరుసఁ గైమోడ్పుఘటియించి, వారికెల్లఁ
దముము అవకుండఁ, గుశలవార్తలను బంప,
వచ్చిపోవంగ నటకు; వారు్రచ్చి యంత- 248

ఉ. కుంతియుఁబుత్రులుల్ వెడల; గ్రుక్కలుద్రిప్పక స్వస్తివాక్యముల్
వంతులవల్క భూసురులుఁ బౌర్జ్యను భీష్మకృపాదులంటిగా,
నంతిపురంబు వీడుకొని; రల్లనహారతులెల్ల వీధులన్
క్రొంతల వింతగా వెలిఁగె రమ్యతరంబుగ మ్రోసె వాద్యముల్, 249

---

ప॥ 248 పా॥ 8 అ॥ 1- ఁగ; ప॥ 249 పా॥ 2 అ॥ 5- వ; అ॥ 10- లు, పా;

ఉ. మిద్దెలమేడలన్ నిలిచి, మేలిదుకూలవిభూషణావళుల్
సద్దులుసేయ, స్త్రీయముఖచంద్రులకోటికి దాఁటి బోటులున్
బెద్దగ నేత్రహాసరుచివీక్షణపంక్తినివాళు లిచ్చుచున్
సద్ద, యుధిష్ఠిరాదులకు ధారలుగాఁ బువులెత్తి రత్తఱిన్. 250

తే.గీ. సుములుగుములుగ జనములు గూడికూడి
పాండుపుత్రులతోడన పయనమైరి
పెల్లుగా వావ్యాముల, బండ్లఁ తల్లిపిల్లఁ
లెల్లసామగ్రి లేతేర నల్లనల్ల. 251

ఉ. పాండుసుతాళిఁ బాసి కడుపాడఋపట్టణ మేలమాకుఁ వా రుం
డెడుచోటె యుండుటకు యోగ్యము రం డని పౌరు లాడఁగాఁ
బాండవముఖ్యుఁ డి ట్లనియె "భావ్యమె మీ కిటులాడ? నట్లు మా
దండకు మీరు చేరు నెడఁ తప్పని మా కపకీర్తి యిచ్చుటన్? 252

క. వచ్చెదము రాకపోదుమె ?
యచ్చెరువునఁ జూడనేల ? నాఁగుఁ ఢనంగన్
మెచ్చి ప్రజ పెక్కుదీవన
లిచ్చుచుఁ జనఁ బందుగులకు [illegible] 253

ఉ. అందఱు నిల్వుఁ డంచు నయమాతఁగ్గఁ బల్కి నమస్కరింప వా
రందఱు నేగ, రంతట యమాత్మజుతోడ రహస్యవృత్తిమై
పాండుగఁ బల్కి వెన్క కెఱుపోయె వడిన్ విదురుండు; నంతవా
రందఱు పాదలమ్ములు గజాశ్వరథమ్ముల నెక్కిపోవఁగన్. 254

ప॥ 250 పా॥ 1 అ॥ 14- కూ; ప॥ 251 పా॥ 3 అ॥ 11- ద;
ప॥ 252 పా॥ 4 అ॥ 11- ద; ప॥ 254 పా॥ 3 అ॥ 1. ‹వో;

ఆ.వె. మార్గమధ్యమందు మదినిల్పుకొనలేక
కుంతి యిట్టు లనియెం గొడుకుం జూచి
"విదురుం డేమిచెప్పె వినరాదొ మే మెల్ల?
ననినం బలికె నిట్లు యమసుతుండు.

సీ. ఇట్టుం గార్యగతులెల్ల నెఱుంగుదు, పైనను
విదురుం డిచ్చినపల్కు వినుము తల్లి!!
పనిలేక మి మ్మొడబాపె నీకురురాజు
హితునట్లె యుండి మీా కెగ్గుసేయం
గావున నొడలెల్లం గనుం గల్గిమెలం గుండు
ఘోరవిషాగ్నులు చేరకుండ
సప్రమత్తులరయి చట్టనుండి మఱిరండు
జతపీడకుండుం డేసమయమైన

తే.గీ. ద్రోహి దుర్యోధనుండు సేయుదుష్క్రియలను
దెలిసి తగినప్రతీకారములనుగూడం
దెలియ[illegible] తెలుపువాండ
గు ప్తము[illegible]నె గుణధనుండు,

క. అన విదురునివిశ్వాసము
మనమున భావించి, మించి మాతయుం దమ్ముల్
వినుతించిరి; కావించిరి
కమగలిగి మెలంగం దగినకట్టడం దమలోన్.

క. అని వినిచిన వైశంపా
యను జనమేజయుఁడు గాంచి, యతిమోహమునన్
వినమితశిరుఁడై చెప్పం
గను వేఁడెను ముందు నడచు కత కౌతుకమునన్ - 258

ఆ వె. మునిమనోబ్జభృంగ! ఘననీల రుచిరాంగ!
సదమలాంతరంగ! సాధుసంగ!
గాఢమద్రివాస! రవికోటిసంకాశ!
విబుధహృన్నివాస! వేంకటేశ! 259



## ఆదిపర్వము ద్వితీయాశ్వాసము-

## సంపూర్ణం.

# అశ్వత్థ భారతము.

## ఆ ది ప ర్వ ము.

## తృ తీ యా శ్వా స ము.

క. శ్రీదయితా! త్రిదశార్చిత
పాదా! శ్రితవరద! ధర్మపాలన! శుభదా!
వేదవినోదన! దుర్జన
భేదన శ్రీరాయదుర్గ వేంకటరమణా! 1

క. మునిపతి వైశంపాయనుఁ
డనె జనమేజయునితోడ నాకౌంతేయుల్
సనవారణావతమునకు;
విను, మాగజపురవిశేష విషయము లెల్లన్. 2

* పాండవులు వారణావతములో లక్కయింటవాసము చేయుట. *

ఉ. ఇంతకుమున్నె పాండుసుతు లేగుదురంచు నెఱింగియుంట, దు
శ్చింతకుఁ డా సుయోధనుఁడు శిల్పిపురోచననాముతోడ నా
ద్యంతముఁ జెప్పి, కార్యభర మాతనిపై నిడి పంపెఁ; శిల్పి తా
నంతటవారణావతమునందున జేరి స్వకార్యధుర్యుఁడై.— 3

తే.గీ. లాక్షసర్జకమిశ్రిత తైలాద్రిమైన
మృత్తికాపద్యములఁ మిఱుమిట్లుగొల్పు
వరచతుశ్శాలఁ, దత్సమీపమున నస్త్ర
శాల నిర్మించె నాపురోచనుఁడు గడఁక. 4

తే.గీ. పాండవులు రాగ, వారణావతముప్రజలు
స్వస్తివాక్యముల్ మంగళవాద్యములును
గంధపుష్పాక్షతలు మేలుకప్పురంపు
టారతుల నెదుర్కొని తెచ్చి రంతిపురికి. 5

తే.గీ. రాణమీఱంగ నప్పాండురాజసుతులు,
హితపురోహిత సచివసమ్మతముగాఁగ
రాజకార్యంబు లెలమిమై నోజఁ గనుచు,
నచ్చుమెచ్చుగ నుండిరి యచటిప్రజకు. 6

తే.గీ. ఆపురోచనుఁ డొకదిన మటకు వచ్చి,
భక్తి యమసుతు దర్శించి, స్వకృతమైన
యాచతుశ్శాల వర్ణించి, యందువిడియ
వేఁడ, నాతండు దమ్ములతోడఁ బోయి— 7

చ. కని, నయనాభిరామముగఁ గ్రాలుగృహంబును, మోద మొందుచున్
దనియఁగ శిల్పి చాలధనధాన్యము లిచ్చి బహూకరించుచున్
తను నిజజన్ములున్ గొలువ ధర్మజుఁ డొప్పుముహూర్తమందు బ్రా
హ్మణులకు భోజనంబిడి గృహంబుఁ బ్రవేశము సల్పె సద్విధిన్. 8

సీ. ధర్మమర్మజ్ఞుఁ డౌ ధర్మజుఁ డొకనాఁడు
సంశయపడి చతుశ్శాలఁ జూపి
పట్టాభ్యనిలితి మహాసౌరభంబు రహించు
మాయాగృహంబుగా మదికిఁ దట్టుఁ;
గంటె! కుడ్యములు లాక్షాగర్భములు, నాజ్య
తైలగంధు లును; శస్త్రాలయంబుఁ
పరిసెఁ; నాగ్నేయమాంతప్ప దిద్యాది; మదిఁ
దెలిసియె విదురుండు తెలిపియుండు

తే.గీ. నరయ దుర్యోధనునివశుఁ డగుటఁ జేసి
యీపురోచనుఁ డొకకీడు నెంచి మనకు
దీనిఁ గట్టెను; మనల నిద్దానఁబెట్టి
యగ్నినిడఁబోలు నన, భీముఁ డనియె నలుక- 9

ఆ.వె. ఇంతెఱింగికూడ నిందేల వసియింపఁ?
గర్మ మేమివచ్చెఁ గాలి కూల?
చెనఁటియీపురోచనునితోడ నిలుగాల్చి
పోద మనిన ధర్మపుత్రుఁ డనియె. 10

చ. తెగవటుసేసినన్ బవనుదప్పదె? యంతన ద్రోహు లెంతయున్
దెగి మఱియేమిపన్నదరో? తెంపది మేలె? రహస్యరీతిగన్
పగతుర మోసగించుటయు పాడి వినుండిఁక జాగరూకతన్
పగళు లవేఁట, రాత్రులఁ గృపాణములన్ గొనియుంట యొప్పగున్. 11

ప॥ 9 పా॥ 1 అ॥ 12- నాఁ; పా॥ 7 అ॥ 8- ఁద;
ప॥ 10 పా॥ 3 అ॥ 1- ఁజె; ప॥ 11 పా॥ 3 అ॥ 1- బ;

వ. విదురుఁడు సెప్పెఁగాదె, పనివిన్పెద నెప్పటికప్పు డంచు; న
ల్లని మనకొప్పఁజేయఁ బ్రతియానె? యతం డెటులాజ్ఞఁబంచునో
కదె? మదిఁ దాళి యట్టివిధిఁ గాంచుట కర్జము మా "కటన్న, వా
రది మొన లప్రమత్తులుగ నట్యేడ నుండఁగ; నొక్కనాఁడటన్ - 12

చ. విదురుఁడు పంప వచ్చితిని విన్ము! యుధిష్ఠిర దేవ! లక్కయి
ల్లిది! నిసి నీచతుర్దశి దహింపఁగ మీాపు పరున్న వేళఁ, దా
నవయత గ్రుడ్డిరాజుకొడు కాజ్ఞ నొసంగుట, నీవురోచనుం
డదినెఱవేర్పు నిక్కముగ, నద్యది తెల్పఁగ ముందువచ్చితిన్. 13

ఉ. ఈగదినుండియే పెలికి నేగను, రాను, సొరంగ మొండు నే
బాగుగఁ ద్రవ్వినాఁడ; స్మృతిపాల్పడకుండఁగ ముందె, యెందు నే
నేగఁగవచ్చు గోప్యముగ; నే ఖనకుండ" నటంచు ముందటన్
వేగరిపొల్చి యొక్కరుఁడు, వేగిరపా టొనరంగ నీగతిన్.- 14

మ. అని, యవ్వారికిఁ జూపి మార్గము;రహస్యం బిద్దియంచాడి తాఁ
జనియెన్ బిమ్మట నాచతుర్దశిని, నోజన్ గుంతిపుత్త్రాంగనా
జన సేవ, ద్విజపూజ,భోజనవిధిన్ సల్పెన్ దగన్; వేఁగుజా
మున నాయింటికి నంటఁ బెట్టియనలబున్ భీముఁ డా మీాఁదటన్. 15

క. ఖనకునకు వినిచి సర్వము
జననిన్ సోదరులఁ గొని వెనన్ బిలముఖమున్
గొని, చనిచనియొకభీకర
వనమధ్యమునందుఁ దేలె భద్రిం బెసఁగన్. 16

సీ. అట- లక్క యింట, బోయత యాపురోచను
ప్రేరణచే వచ్చి పృథయు నాసి
గానుండి, గృహమునఁ గల్గుకృత్యంబుల
నలపురోచనునకుఁ దెలుపుచుండు;
నేపునసుతులు నయ్యంతియు నారాత్రి
మధుపానమత్తులై విధివశమున
నాయింట భుజియించి యం దొకతావున
నొడలెఱుంగక పండియుండి రకట;

తే.గీ. నాపురోచనుఁ డారేయినందె పండె
నిప్పు నాగది కంటించు నెపముచేత;
వీర లేద్దురుఁ గాలిరి భీమసేను
కోపదావాగ్ని యాహుతిఁగానె ననంగ. 17

తే.గీ. అటుల లాక్షాగృహంబు, శస్త్రాలయంబుఁ
గాలి భస్మంబుగా నేలఁగూలఁ, బ్రజలు
పడిన శవముల నెంచిరిపాండుసుతులు
గుంతియును నాపురోచన హంతగాఁగ. 18

తే.గీ. పాండవులమృతిఁ దలపోసి వ్యథను గాంచి
మించి శోకించి, కౌరవ వంచనంబు
గాఁగఁ బ్రజ లెంచి, మృతివార్తఁ గరిపురికిని
దెలియఁ బంపిరి ధృతరాష్ట్రుఁ దిట్టిపోసి. 19

క. అంతకుమును పేయావృ
త్తాంతము ఖనకుండు తెలుపఁ దా విని విదురుం
డంత నిజ మెఱిఁగియును గడు
వింతగ శోకము నటించె విన్న దనమునన్. 20

ఉ. పాండవు లగ్నిదగ్ధు లగువార్త భటుల్ ధృతరాష్ట్రుఁ డాసభా
మండపమందునిండుగ సమాత్యపురోహితభీష్మముఖ్యస
న్మండలినుండఁ జెప్ప విని భ్రాన్పడి, తేరి విషాదకీలలన్
గుండియ కాల నొచ్చిమది,గోండ్రనియాలటులార్చి యేడ్చుచున్. 21

ఉ. ఎంతయు జీవజీవమటు లేడ్తెఱఁ గాచెను నన్ను పాండుభూ
కాంతుఁడు, నెన్నదన్ని జనిఁగాంచినతమ్ముఁడు, కుద్ధ్యుఁగూర్కులన్
వంతుల నాఁడనంతరమె పాల్గొను నట్టిఁడు చావునందునీ
యంతిరు వెంచఁడయ్యె నకటా! యని కుందితి నాఁడు; నేఁడయో! 22

ఉ, ఆతనికంటెఁ బ్రీతి ననునారయు; పేవమువోలె నాదువా
క్యాతతభక్తి సల్పు! నకటా! యమనందనుఁ డట్టివానిఁ జే
సేతను జంపుకొంటి, నిటుచేద్వఁడు టెంచకపోతి, దుర్మతీన్,
ఘాతకుఁడన్; మహాఘు మొడిఁ గట్టితిఁ ద్రొట్టితి లోకనిందలన్. 23

ఉ. చిచ్చదిచుట్టుముట్టఁ గని చీరెనొ "హా! పెదతండ్రి" యంచు;లో
నొచ్చెనొ నాదుదుష్కృతికి; నూరకెయూరున నున్న మమ్ము-నే
పొచ్చెము లేనిబిడ్డలను బొమ్మని యిందునఁబుచ్చి, మృత్యువున్
దెచ్చెనటంచు వావిడిచి దిక్కుదికానక యెంత యేడ్చెనో! 24

ఉ. ఈకురువంశముం నిలుప నెంతటిపాటునకైన నోర్చి, మేల్
చేసిరె సంచు నుబ్బితిని చే టిటు మూడెను నం చెఱుంగ; నా
నీకది కాపజెంబె; విధివేడబమే యగుగాక వేఱుగా
వాకొనరా, చటంచుఁ గడుసందురె నాతఁడు చింద నశ్రువుల్ 30

ఉ. ఆగురుఁ డాడు "నగ్నికిటె యాహుతి? మిత్రియ యేని భీముఁడే
రేగిన, నిల్వనేర్చునటె? లేచి విచారుప, నగ్గిగ్గికా
లాగునె, పాఱ, కా[illegible] కిది యావిధికృత్యము! మెట్టకేల కే
లాగునో శిష్యుఁ డర్జునుఁ డిలన్ దలఁదాచిన సంతసింతుఁ బో". 31

క. "కడచినపనియిది దుఃఖము-
విడువుం" డనెఁ గృపుఁడు కనుల విడుచుచు నశ్రుల్
సుడివడె నశ్వత్థామయుఁ,
గడుఁ దుర్యోధనుఁడు శోకగతి సూచించెన్. 32

సీ. అక్కట! పాండవులంతటివీరులు
చచ్చిరే! యనియె దుశ్శాసనుండు;
చావు సిద్ధంబెకా జన్మధారులకిలఁ
గలదె యచ్చెరు? వంచుఁ గర్ణుఁ డాడె;
నలఘుధర్మాత్ముల నగ్ని దాఁకుట యన
సాహసం బగు నని, శకుని గొణఁగె;
తా నొండుతలఁచిన, దైవ మొండెంచుట
వేద్యంబెకా! యని విదురుఁ డనియె;

---

ష॥ 31 పా॥ 3 అ॥ 7- ఱ; పా॥ 4 అ॥ 17- సంతసింతు; పా॥ 7 అ॥ 1- ఁదా;

తే.గీ. అంతిపురమున నేమిపు లధికమయ్యె;
నోముజూచినఁ బురిని నాళ్రింపమ్మలు
కౌరవులఁ దిట్టుటలతోడ మేరమీఱెఁ;
బృథకును, సుతులకు తేఁ డంత్యవిధులు సలిపె. 33

ఉ. అచ్చటఁ బాండుపుత్రులు ఘనాటవి నానిశఁ బాదచారులై
వచ్చుటఁజేసి, మేనిశ్రమవాడుఁగ. మారుతిఁ దప్ప నెల్ల ఱుల్
జెచ్చెరఁ బొక్కి కూర్కిడిరి; చెంగట భీముఁడు కాచుచుండి, లో
నొచ్చుచు వారలన్ గని మనోవ్యథఁ గుంది యిటందు రోగడున్. 34

చ. ఎవఁడు కటాక్షమాత్రమున, నీత్రిజగంబుల నేలఁ జాలు, నిం
కెవఁడిలన్యాయధర్మములె యీజనిఁగాంచె ననంగఁ బోలు, నా
ప్రవిమలశాంతిశీలుఁ డగుపార్థివచంద్రుఁడు ధర్మపుత్రుఁ, డి -
ట్లవశతఁ గూర్కెఁగర్కశతలావని నేమన ధాత చేఁతకున్? 35

ఉ. కుంతి, విచిత్రవీర్యవిభుకోడలు, శ్రీవసుదేవుచెల్లెఁ త్మా
కాంతకులప్రసిద్ధుఁ డగుకౌరవ నాథునికాంత, వీరవి
క్రాంతులఁ బుత్రులన్ బడసి ఖ్యాతి గడించెను, గోమలాంగి శు
ద్ధాంతపుహంసతల్పమున నందదు గూరుకుఁ జొక్కె నేలపై. 35

ఉ. ఇంద్రునినేని నేలఁగలయేపుగలండు నరుండు; సద్యశ -
స్సాంద్రులు నీకవల్ మృదులశయ్యలు, దివ్యదుకూలజాలముల్
సాంద్రపుఁబాన్పు లేక కరసారసముల్ తలదిండ్లుగాఁగ, ని
ద్రేంద్రియముల్ ముడుంగువడ నిందు బరుండిరి కాల మేమనన్? 37

క. ధృతరాష్ట్రుఁడుఁ దత్సుతు లీ
గతిఁ గూర్చిరి మాకు, దురితగతి కోడక! దూ
హాతకులఁ బరిమార్పఁగ యమ
సుతుఁ డడ్డమటంచు ముందుఁ జూచెదునంతన్. 38

సీ. అలమోము నెలచేత ననువసనిసినైన
చంద్రిక వెదజల్లఁ జాలుదానిఁ
కడగంటెఱుఁగుచూడ్కిఁ గడువాడి యడిదమ్ము
గడఁజిమ్మి మగగుండెఁ బొడుచుదాని,
ముసిముసినవ్వు వెలుతురుల్ పసరించి దిశదిశల్
నడయాడుదివిజు నాఁబఱచుదాని,
కుచగిరిద్వయమధ్యకోదండ మెత్తిన
మరుఁడు వ్రాలయునట్టి మహిమదాని,
తే.గీ. కప్పుకాటుకకొండయా గొప్పకొప్పు,
బిరుసు బిరుద్దగుపిఱుఁదు సంబరముఁ గొప్ప,
నడబెడంగుల నంచల నడఁచు మెప్పు
గలపడుచుదాని భీముఁడు గాంచె నెదుర. 39

ఉ. కామినిఁ గాంచివాయుజుఁడు కామశరాఘనిపీడితాత్ముఁడై,
భామినిపై విరాళిఁగొని; పాఢక యూసుకుమారమూర్తిఁ గం
దామరఁ బుక్కిలింతగొనఁ దత్పరతన్ గడుఁజొక్కె; నామెయున్
భీముని సుందరాననముఁ జేరురమున్ ఘనబాహుసంపదన్. 40

క. గంభీర నేత్రదీప్తుల
సంభావనఁ జేసిచేసి, స్మరపీడితయై,
యంభోరుహాక్షి సంభ్రమ
సంభృతమతి నతనిఁ జూచె స్మయమగుచూడ్కిన్. 41

ఉ. భీముఁడు వల్కె నామె కిటు "భీతమృగేక్షణ! యిట్టులొంటి నీ
భీమవనిన్ జరించెదవు, వేలుపుఁబట్టివొ? నాగకన్యవో?
యేమిపనిన్ గడంగితివొ? యెంచ నలంతిచలించెచిత్తము
ద్దామయశుండఁ బాండవుఁడఁ, దథ్యము నే ననిలాంశజాతుఁడన్, (42

క. భీముఁడ; భీమ పదాఖ్యుఁడ;
భీమపరాక్రముఁడ; నిన్ను వినుపు" మనఁగ, న
క్కోమలి యను; నాసురి నేఁ
గామించితిఁ బతిగ నిన్ దిరికరణములొకటన్. 43

ఉ. ఆవటవృక్షమందుగలఁ డాసురుఁడైన హిడంబ నాముఁ, డా
దేవవిరోధి మిమ్ము గొని తెమ్మనిపంచెను సోదరిన్ ననున్,
భావజరూప! నీసొబగు భ్రాంతిని గొల్పెఁ బురాకృతంబుచే,
నావుడు నవ్వియాతఁ డను నాకుఁ బురాకృతభాగ్య మిద్దియో. 44

ఉ. రక్కసి వైననేమి యుడురాజముఖీ! నినుబోలురూపు నిం
కొక్కటియెందునేఁ గలుగనొప్పనె? మేలికసాసినామ్మ! ఓ
చక్కెరబొమ్మ! నిన్ గనుట సార్థకమయ్యెను బుట్టు" వన్న నా
రక్కసుఁ డంతలోఁ నవ్వులరాఁ, గని భీముఁడు భీమరూపుఁడై 45

మ. అదె దైత్యుండిటు వచ్చు రాకమునుపే నచ్చోటికే పోయి పో
రెద నిర్జించెద భీతి నొందకుము నాకే! వీరుఁడౌదువ్వు; లీ
సుదతీరత్నము నాదుతల్లి, నిదురన్ జొక్కెన్ సుమా, దీవ్రీ
వనమున్ భ్రమ గాచియుండు మని సంభావించి సంరంభియై 46

క. అచ్చటినుండి యా భీముఁడు
చెచ్చెరఁ గుప్పించి యెగసి సింగంబటులన్,
వచ్చెడి దైత్యునిపైఁ దా
నచ్చెరువుగ దూఁకి తాఁకె నవని చలింపన్. 47

సీ. అగ్నిగోళంబుల ట్లలరుకన్నుల వెంట
భుగభుగమని మంట సెగలు రేగ;
మేరుభూధరమటు మెయిదోఁప; నాపయి
శిఖరంబువలెఁ దల చెలఁగియుండ;
సపుదారుగహ్వరంబటు లాననంబొప్పఁ;
గర్ణముల్ గపుడిపక్షములఁబోలఁ;
గరములు తాడులగతి నున్నతినిఁ గ్రాల;
పీఠభూమిని నేలఁ బేరురంబు;

తే.గీ. కాళ్లు నిడుపాడువులవాన కాళ్ల విధాన;
నాదివామనునడుగు లట్లడుగులార;
తెగువ బ్రహ్మాండభాండంబు పగులనార్చి
పఱచి బలమొప్ప భీమునిఁ బట్టె నసుర. 48

ఉ. పట్టిన భీముఁ డాయసుర బాహువులన్ బిగఁబీఁకి, కంఠమున్
గట్టిగ నొక్కి యెత్తి భువిఁ గాళులసోఁకగనీక యప్పుచే; వాఁ
డట్టులె మూర్ఛనొందె వెలియాడక యూపిరి కౌంతి [illegible]
ప ట్టెడలించి రక్కసుఁడు పావనిపైఁబడె బిట్టడల్చుచున్. 49

క. ఆపాటున కట మేల్కొని
రా పాండవు; లంతఁ గుంతి కను నాసుద "నే
నాపాపిదైత్యు చెల్లెల;
మీ పావని యాజ్ఞనుంటి మిము గాఁచు చిటన్. 50

ఉ. దైత్యుఁడు మిమ్ముఁ దెమ్మనుచుఁ దానను బంచిన వచ్చి [illegible]
సత్యము భీముపై మనసు సాగెను నా [illegible]
పత్యధికమ్ముఁ బ్రేమగలఁ డమ్మరొ కోడలుఁగాఁగ నన్ను [illegible]
స్మృత్యమతిన్ గ్రహింపు మని తోడన [illegible] (51

క. విని కథ పృథ సతికిన్ దీ
వన లిడె; వెస నర్జునుండు పావనికిట్లనున్
జని "యదె నిసి యేగెను నిఁక
దనుజునిఁ బరిమార్పుమయ్య వడవేటి" కనన్ 53

క. వడముడి యాదైత్యునిపై
నడరి కడఁక నలమి బలిమి నలజడి నిడుచున్
గడగాలువట్టి గిరగిర
వడివడిగా నూరుమార్లు వారకత్రిప్పెన్. 52

---

ప॥ 49 పా॥ 2 అ॥ 18- యూఁ; ప॥ 50 పా॥ 4 అ॥ 12- గాచు;
ప॥ 53 పా॥ 4 అ॥ 7- ఱు;

ముక్కున వాతను నెత్తురు
గ్రక్కఁగ బడఁగొట్టి నడుమఁ గాలిడి శిరము౯
దక్కొని పదములఁ గూర్చి పు
టుక్కున వెన్నెముక విఱిచి దులిచె నసువుల౯- 54

సీ. అట్లు చిత్రరీతి నాదైత్యుఁ బరిమార్పఁ
గని హిడింబఁ గూడి జననియనుజు
లెల్లరాఁగ భీముఁ డొల్లనిమాదిరి
నసురిఁగాంచి యాడెఁ గసరి కనలి- 55

మ. రక్కసి రాకుము మానెను వెంటన
రణ్యములంబడి పొమ్మటకే౯
ని
తక్కితివాఖిను నీసహజన్ముని
తావునకంపెదఁ జూడుమిఁక౯
దిక్కెవరిక్కడ నిక్కముఁ దెల్పితిఁ
దేకుము కోపము నాకెడఁద౯
జక్కన నేగుము సుద్దులు ముద్దులు
చాలును నాయెడ సాగ వన౯- 56

వడవడ వడఁకుచు నాసతి
యడలునఁ బృథ వెనుక నడఁగ నాయమ యంత౯
దుడుకకు మని వారించుచు
వడముడిఁ గనుఁగొనుచు నిట్లు వాకొనెఁ గరుణ౯- 57

ఉ. "అసురి యటంచు నీవుగడు నల్కనహించితివన్న గోలయీ
వసరుహనేత్ర తా నెడఁదఁ బ్రేమ వరించెను నిన్నె నమ్మి నీ
వసమగుదీని ధర్మపరిపాలన మొప్పదె? తమ్ముఁ జేసినా
డసురు విభీషణున్ మనుపఁడా రఘురాముఁడు మున్న ప్రాపుఁడై

క. చేపట్టుము సతిగా మన
కేపట్టునఁ గీడుసేయ దిది గుణమణియై
మాపట్టి నమ్మె నిన్నెదఁ;
గాపట్టము లేదు పాణి గ్రహియింపుము నేన్.

తే.గీ. "చంపదగిన దైత్యుఁ జంపితి ధర్మున
ముగుద నిట్లు కినియఁ దగునటయ్య!
ఆత్మరక్షకంటె నగ్గలంబగుధర్మ
రక్ష! యార్త దీని రక్షవిధియ.

క. ఇడుములఁ దోడరిన ధర్మము
విడగా సరిగాదు ధర్మవిదులకు; నీవీ
పడతి నిపుడు కొనుటయె నయ;
ముడుగుము కోపంబు; తల్లి సూక్తులు వినుమా!"

ఆ.వె. అనియె ధర్మపుత్రుఁ; డనిలజుఁ డోడఁ బడె
జననిపల్కు నగ్రజన్ముపల్కుఁ
గల్కిచిల్కపల్కుఁ గాముని ములికియుఁ
గలఁచ మదిని నలికి యులికి తలఁకి.

చ. తల్లియు నాహిడంబయు ననుమ్ములుగా, యమసూనుఁ డేగి వే
యల్లన శాలిహోత్రునివరాశ్రమమందు వసింప; భీముచేఁ
జెల్లఁగ గర్భ, మప్పుడ కనెఁ జిన్నికుమారు హిడింబ; తోడనే
పెల్లుగ భీమరూపుఁడయి వెల్గె ఘటోత్కచనామ ముప్పగన్. 63

తే.గీ. పరఁగ శస్త్రింపు గాత్రుఁడు పరివృతుండు,
కామరూపుండు నౌ ఘటోత్కచుఁడు పితకుఁ
"తలఁప వచ్చెద" నని మ్రొక్కి తల్లితోడఁ
జనియెఁ బాండవులను వీడుకొని తనంత.- 64

తే.గీ. పరఁగ నా శాలిహోత్రునాశ్రమమునందుఁ
గొన్ని నాళ్లుండి, యతని వీడ్కొని విదర్భ
మత్స్యదేశాదులెల్లను మలఁగి యేక-
చక్రపురిఁ జేరి పాండవుల్ సమ్మదమున- 65

క. నటు వేషంబులఁ గొని వా
రట నొక విప్రునిగృహంబునందు విడిసి రా-
క్కటస్మృతి శ్రుతి పాఠనము
త్కటులయి భిక్షంబె కుడుపుగా ననుదినమున్. 66

ఉ. జోలియ లూనిపుత్రకులు తెచ్చి గృహంబు గృహంబు, నోగిరం
బోలినిఁ దెచ్చి యిమ్మఁ బృథ యొప్పుగ భాగముఁజేసి దాని సా-
బాలిడి భీమసేనునకుఁ భాగము నిల్పినదానఁ బ్రీతిమై
చాలఁగఁ దానుఁ దత్సుతులు సాపడువారలు ప్రాటప్రాటకున్. 67

తే.గీ. ఇటులఁ బ్రచ్ఛన్న వేషులై యెసఁగుచుండ,
నింటనందఱు నొక్కనాఁ డేద్వఁ గడఁగ,
నావడిని నున్న పృథ విని చకితయగుచు
భీము నీక్షించి పల్కె స ప్రేమ నిట్లు- 68

తే.గీ. కంటె! రోదన మీవిప్రు నింట నేమి
యప్రియంబు ఘటిల్లెనో? యరసి వేఁగఁ
దత్ప్రతీకారముం జేయఁ దగదె భీమ!
మనకుఁ దావిచ్చి యీతండు మనిచెఁగాఁడె?- 69

క. ధర నెందు నేని మానిసి
కరయంగాఁ గృత మెఱుంగు టది ప్రాయమగుక్,
సరిచేత మధ్యమంబగుఁ,
బరమంబగుఁ గృతికిఁ బెద్దవడి సేయుటయుక్- 70

క. అన; భీముండను నీవే
చని కనుమది యెట్టికడిఁది సాహసమైనక్
జననీ! తీర్చెద విను! వి
ప్రుని దుఃఖం బనినఁ, గుంతి పోయి గృహముసక్- 71

తే.గీ. శోకపరవశులై సుక్కు చున్న యట్టి
విప్రు నాతని బంధుల విషయమెల్ల
నడుగ, నామాట వీనుల నిడక కడఁగి
యుద్ధరాముఁడ ద్గాంగి కనియె నిట్లు- 72

క. సార విహీనము, భయదా
కారము శోకాకులపరికారముఁ; గారా
గారముఁ; జంచల మీసం
సారం బను టెఱిఁగి నమ్మఁ జాలరు తజ్ఞుల్. 73

క. డంబుగ సంయోగ వియో
గంబాసీ ద్వంద్వగతులు ఘటనం బగు దే
హంబు గల దాఁకఁ బ్రాక్క
ర్మంబులచే నెట్టియోగ మహితునకై నన్. 74

క, ఇది తగని చోటు, వేళా
పదమున కేగుద మటంచుఁ బడియుంబదిగాఁ
బదరితి! సతి వినద; మహా
పద! కర్మవిపాక మిదియ! పాయఁగ వసమే?- 75

సీ. సహధర్మచారిణి సతి ప్రజావతి దీని
దనుజునిభుక్తికై యనుపనగునె?
ధర్మాభివృద్ధిగా దాన మీఁదగు సుతఁ
మెక్కంగ నిడుదెట్టు రక్కసునకు?
కుల ముద్ధరించెడు కొడుకు ననుంగును
దైత్యునాఁకలి కీయఁ దలఁతు నెటులు?
నొక్కతె మత, సుతుం డొక్కఁడు, యీసతి
గాఁక "నా" యనువారు కలరె యొకరు?

తే.గీ. దుర్భరం బగు విధవాత్వదోష మోపఁ;
దనయునిఁ గూర్మితనయను మనుపఁ బెనుప
నోప; నోపుదు విన్నియు, నోపి కరుణ
నాకు ననుమతి నీఁగదే నాథ! యనియె. 79

తే.గీ.—"పరుల కీఁబడు కన్యనుఁ బతున కిచ్చి
పితృ ఋణము నీగుఫలము వినాసుతకు నాకు
ననరఁగూర్పఁడు నాతల్లి పండ్రఁలార!
కని మనిచినట్టి కడుపునఁ గరుణవిరాజ- 80

క. రక్కసుని చక్కి కేగెద,
మెక్కంగా మేను నిడెద మిడుకకుఁడీ! నే
మ్రొక్కెద మీయడుగులఁ బడి;
యక్కరతో ముదల నోసఁగుఁ డని సుత. యనియెన్. 18

క. విడ్డూరంబుగ వారల
కడ్డముఁ జని చిన్నితనయుఁడయ్యా! అమ్మా!
బిడ్డఁడునుంటిని బకునిన్
గొడ్డంటను నతికి మీఁదు గోడుడిగింతున్. 82

క. అని పలికి చిఱుతగోలన్
గొని నడచెడు బుడుతవానిఁ గొని, యొడినిడి కం
టను దడి వెట్టెడు విప్రుని
గనుఁగొని కనికరము దోనఁకఁగాఁ బృథ పలికెన్- 83

తే.గీ. బ్రాహ్మణోత్తమ! మీకు నాపద యదేమి
చెప్పఁడేమొ? దాని నాకును జెప్పరాదె?
దాని తీర్చెద నది యెట్టి దైన మాన
ననెను గుంతిని గని విప్రుఁ డనియె నిట్టుల:-

సీ. మనుజుల కేరికి మానుపరాని దీ
యాపద నీకు నే మందు తల్లి!
ఆకొండపై నుండు నసురుఁడు బకుఁడు ము
న్నీపురిజనుల భుజించుచుండ
బురిపెద్ద లవ్వాని దరిసి ప్రార్థనఁ జేసి
నిత్యము నొక్క మానిసిని వానికి [illegible]
రెండెను బోతుల బండియన్నంబును
నియ్య నిల్వారుసగా నియ్యకొనిరి.

తే.గీ. నాఁటినుండియు నారీతి నడచు; మాకు
నేఁటివంతని తలవరి చాటె; వింటెఁ
బిడుగు నడునెత్తిఁ బడునట్టి నుడుగు విప్రుఁ
డనుచుఁ గుందెడు విప్రునిఁ గనుచుఁ గుంతి.-

తే.గీ. "ఇంత యేగాదె? మదిని నిశ్చింత నుండు;
నీకు సుతుఁ డొక్కఁడే యుండు; నాకుఁ జూడు
నైదుగురు పుత్రులుండిరి, యందునొకని
ననుపునకు భుక్తిగా నేనయంపుదు" నన,

క. విని చెవులు మూసి విప్రుఁడు
ఉమశకుచు; నిదియెంతమాట తల్లీ!మాకై
తెనయుని నీగుడె? నే నొడి
గొనఁ జూతునె బ్రహ్మహత్య ఘోరాగ్ని నిటుల్? 87

తే. స్మృతివిహీను, సుప్త, దీను, నభ్యాగతు,
నతిథి, భీతు, నార్తు,నబల, నబలుఁ
గొల్చువాని, మిత్రుఁ గూల్చెడుపాపికి
నిహముఁబరముఁ గలుగ దిది నిజంబు! 88

ఆ. వె.ఎఱిఁగి యెఱిఁగి దీని కెటుసమ్మతింతును?
మానరాని దగుట మాకు దీన
నాత్మహత్యవలని యఘ మంట దటుగాన
నేన పోవువాఁడ నీల్గువాఁడ ! 86

ఆ, వె.అనిన భూసురేంద్రుఁ గని కుంతి యేనును
విప్రవధను గాంచ వెఱచి, మదినిఁ
దెంపుఁజేసి తనయు నంపుదు నింపారఁ
జంపఁ గ్రూరదైత్యుఁ జెంపుమీఱ- 90

క. అతిలోకవీరుఁ డాతఁడు
హతమార్చుఁ బెక్కురాక్షసాళిని; దానఁ
సుతుఁబంపుదుఁ;దల్లి తనకు
శతసుతు లుండినను నొకనిచావోర్చునొకో? 91

చ, అని యిటు భీముఁ జేరి, కథ నంతయుఁ జెప్ప, నతండు నుబ్బుచోఁ
గనుఁగొని విప్రుతోడ ననుఁ, గమ్మగ వంటలవండి, పండిగాఁ
దినఁగను నాకు నిండు; మఱి తెండెనుబోతుల బండెడన్నముల్,
దునిమి దురాత్ము నాయసురుఁ దోడనవచ్చెద వినాయ మెచ్చఁగన్,

క. అన, బ్రాహ్మణుఁ డోడఁబడె, నం 92
తన వచ్చిరి భిక్షఁ గొనుచు ధర్మార్జును, లా
ఘనులు నకులసహదేవులు
విని రాకత నెల్లఁ దల్లి వినిపింపంగన్. 93

క. అనఘుండు ధర్మపుత్రుం
డనుమోదముతోడఁ బృథకు "నమ్మరో! యిది యె
ల్లను, బకులయార్తి నుడుపుట
సను; వడముడి యంతశక్తిసంగతుఁడ" యనెన్. 94

ఉ, పప్పులు పిండివంటలును, పాయసముల్, వడియంబు, లప్పముల్
దప్పళ మప్పళంబులును దైలఘృతాంచిత శాకపాకముల్
జొప్పడ నెక్కి పాల్ పెరుగు జుణ్ణియు దెచ్చగ, బన్నబండిపై
నొప్పగ నేగియేగి బకునున్కికి దవ్వులఁ జేరఁబోవుచున్— 95

క. యమునా నదియొడ్డున శక
టము డిగి మెయిఁ గడిగి తాఁ గడంకను దనుజా
ధముఁ జేరి, వారిఁ గొని యా
చమనంబున్ దీర్చి పవన సంభవుఁడంతన్— 96

ఆ.వె. దనుజుఁ డపుడు దేరఁ దడవగు; నందాఁక
దాళనేల? యనుచుఁ దర్ప మెసఁగ
బండి నిండ నున్న భక్ష్య భోజ్యంబుల
మెక్కెఁ జొచ్చె స్వేచ్ఛ మెయిఁ గడంగి. 97

ఉ. బండిని జూచి వంటకము భక్షణఁ జేయుచు గోలరించు దో
ర్దండుని భీముఁ జూచి, మది రక్కసుఁ డల్గుచుఁ జండకోపియై
మండుచుఁ,బండ్లు గీటుచును మ్రాన్పడ దిక్కులార్చికొంచు, ను
ద్దండత నెచ్చి ముష్టిఁ గొని తద్దయు భీముని గ్రుద్దె నుద్ధతిన్. 98

తే గీ. హీన సత్వునిఁగా దైత్యు నెంచి, మించి
గ్రుద్దు లందుచు భీముఁడు గుడుపు నుడుగ
కెడమచే నెత్తి చెంపవాయించెఁ గడిమి,
దిర్ధిరన దిర్గి మూర్ఛిల్లె దేవవైరి. 99

తే. గీ. అంత సాపాటు ముగియించి యనిలజుండు
యముననీరానివచ్చె, నయ్యసురుఁ డంత
మూర్ఛఁగడ తేరి పెనుమ్రానిఁ బూని తెచ్చి
యుద్ధృతంబుగ భీముపై నురల వైచె. 100

ఉ. దానినిఁ గేలఁబుచ్చుకొని దర్పమెలర్పఁగ భీముఁ డిట్లనున్.
మానవరక్తమాంసముల మత్తిలి బొత్తిగ కన్నుగానవో-
దానవ! క్రొవ్వడంచెదను దంచెదఁ, బంచెదఁ గాలుప్రోలికిన్,
బూనిక నిల్వు మంచెగసి ముట్టఁగఁబోయినఁ దప్పి తెప్పునన్-101

ప॥ 100 పా॥ 3 అ॥ 5- తేఱి; ప॥ 101 పా॥ 2 అ॥ 17- ఁగన్ను:

క. మిన్నను మిద్దెకుఁ దాఁకెడుఁ
గన్ననిలువు కంబ మనఁగఁ గడునిక్కుచు రా,
నన్నీచునిఁ గని వడముడి
సన్నద్ధుండయ్యెఁ మల్ల సరణి రిపుఁడున్– 102

సీ. తివురు హుంకృతులకు దెసలు బీటలువాఱె,
వడఁకొందె భువి భుజాస్ఫాలనముల;
నెగయుల నింగి పైకెగఁద్రోయఁబడెఁ; బాద
ఘట్టనలఁ శేషుఁ డట్టె ముడుఁగెఁ;
దాఁకిడు ప్రేఁగున లోక మాకుల మొందె,
గ్రుద్దుల నామేరుకుధర మదరెఁ;
బ్రిక్కలొత్తఁగ భూమి తక్కెడమై తూఁగె;
డీ లిచ్చుతఱి భువి డిల్లు పడియె;
తే. గీ. నుదధు లూటాడెఁ; దేజంబు నుడిగె ద్యుమణి,
వ్రాలె రిక్కలు, వృక్షముల్ నేలఁగూలె,
వసుధ కంపించె; బలముగా బవన సుతుఁడు
బకుఁడు నొండొరులుం బోరుభరముచేత. 103

చ. ఇటులఁ బెనంగి కొంతతడ, వేఁపున కోపనిదైత్యుఁ బట్టి, తా
వటునిటు కాలుఁగేలుఁదల పట్టుతె ముద్దగఁ జుట్టి తొట్టి యు
త్కటముగ ముష్టిఘాతములఁ దద్దయు ముక్కున నోటనెత్తురుల్
ఘటమున గ్రుమ్మరించినటు గార్చి తొలంగఁగఁ జేసె బ్రాణముల్. 104

క. పోతులబండిని గొని యా
వాతాత్మజుఁ డేకచక్రి పట్టణముఁ జొరన్,
పోతులఁబెట్టుమఁ బ్రజ లతి
కౌతుకమునఁ బొగడి రతిసికరుణన్ బలమున్. 105

క, అనిచెప్పిన వైశంపా
యను జనమేజయుఁడు గాంచి యతిహర్షితుఁడై,
వినయమున వేఁడఁ, జెప్పం
గను నారకొని ముందుఁగలుగు కత కుతుకమునన్. 106

క. ఘనుఁ డావైశంపాయనుఁ
డని జనమేజయునితోడఁ, నటుగౌంతేయుల్
మన నేకచక్రిపురినొక
దినమున విను చతిథివితతి తెలుపఁగ వార్తల్- 107

తే.గీ. పరఁగఁ బాంచాలపతికూర్మిపట్టి కృష్ణ
కగు స్వయంవర మనువార్త నాలకించి,
ధర్మజుఁడు సోదరులతోడఁ దల్లితోడ
విప్రవేషంబులన్ దాల్చి వెడల నపుడు- 108

తే.గీ. బాటఁ జనుదెంచు బ్రాహ్మణ వరులఁ గాంచి,
యెందుఁ బోయెదర య్యా! యెందేమివింత?
తెలియఁ బలుకుఁడు మాకు సద్విజవరేణ్యు
లార! యను ధర్మజునకు బ్రాహ్మణుఁ డొకండు- 109

తే.గీ. క్షత్రిపాలుఁడ! వినలేదె వింతవార్త?
చాటినా రెల్లకడ లేక ధాటిసోఁక
నాఁడయోనిజ పాంచాలి కగుస్వయంవ
రంబు రండంచు మిగుల సంరంభ మెసఁగ-

క. అన;ధర్మజుఁ డావిప్రుని
కనియెః- నయోనిజగ నెట్టు లాకన్యక సం
జననమునొందెను? చిత్రము
వినవలెఁ దాను దెల్పు మన్న విప్రుం డనియెన్-

సీ. నరునిచేఁ బట్టించి పరిభవించి తనంత
ద్రోణుండు విడువగా, ద్రుపదుఁడంత
ద్రోణు వధించుపుత్రునిఁ బార్థుఁ బెండ్లాడు
సుతఁగోరి మఖము సమ్మతి నొనర్ప,
సవనాగ్ని నుదయించె జ్వాలనసన్నిభమూర్తి
సహజవర్మకిరీట చాపఖడ్గుఁ,
డతఁడె ధృష్టద్యుమ్నుఁ,డాతనితోఁ బుట్టె
బాల సద్గుణజాల భవ్యశీల;

తే.గీ. అప్పుడె యశరీరి, ద్రోణుని యసువు లూఁచు
ఈకుమారుండు; కూఁతు రీకృష్ణ నరుని
పాణిగ్రహించి మీరెండు వంశములకు
చిరయశంబును గూర్చు భూవర! యనంగ -

తే. గీ. నగున కాకన్య నీయ సంబరము గలిగి
నిక్కమది నుండెఁ; బాండవుల్ లక్కయింట
మండి రనివిని కాన కింకొండు త్రోవ,
చాటె నీస్వయంవరము పాంచాలుఁడిపుడు- 113

క. రమ్మా! ద్రుపదుం డర్థుల
కిమ్ముగ ధనమిచ్చు; బ్రహ్మ యేర్పడ నీఫా
లమ్మున లిఖించి యుండిన
కొమ్మను గొనవచ్చుఁ బెండ్లి కొడుకా! నీవే- 114

క. విధి లిఖిత మేని యాశీ
ర్విధి విప్రుఁడు దిద్దునంట విధ్యుక్తము; స
ద్విధి దక్షిణ నిమ్మనఁగా
యుధిష్ఠిరుఁ డొసంగె విప్రుఁ డొొఁగి దీవించెన్. 115

తే. గీ. వీడుకొని రాత్రిఁ బాండవుల్ విప్రజనులఁ,
గొఱవి దివ్వెగఁ జేఁబూని నరుఁడు ముందు
నడవ వెనువెన్క నవ్వారు నడచి; దవుల
నాపగన్ గాంచి స్నానార్థ మచటికేగ- 116

తే. గీ. అందు క్రీడార్థమై సతీ బృంద మొప్పఁ
బరఁగు గంధర్వుఁ డంగార పర్ణనాముఁ,
డటకుఁజనుదెంచు నాపాండవాళిఁగాంచి
యులిగి మార్గాని కడఁకమై నాడె నిటుల- 117

క. అలకాపతిప్రియమిత్రుఁడఁ,
దలఁపఁగ గంధర్వవిభుఁడఁ, దరుణులతోడన్
జలకేళినుంటిఁ, గన్నులు
దలకెక్కెనె? రాకుఁ డట్టె తలఁగుఁడు వీరల్!— 118

క. నడురేయిఁ దిరుగ మానవు
లాడ లెఱుఁగరె? సురలు మలయు చుండెడు ప్రొద్దున్
నడతురె? వచ్చినవారిం
బడిపోం, డే నలుగఁ దొలఁగుఁ బ్రాణము లనినన్— 119

క. విని నరుఁ డాగంధర్వున
కను, సంధ్యలు రేలునడవ జలతోలు భయముం
గనుదురు, వీరవరేణ్యుల
కును వెఱవే? యిది నెపంబె కోపింపంగన్.?— 120

క. అదిరా! మీయవియే యీ
హ్రద, శరనిధు; లబ్బసొమ్మె? యమరతటిని యి
య్యది లోకసేవ్య యగు! పరుఁ
గదియకు మనఁ గన్నుకుట్టె? కావరమట్టే?— 121

సీ. హరిపాదమునఁ బుట్టి యభ్రగామిని యయి
హరుజటాజూటాగ్ర మధిగమించి;
హిమవన్నగోత్తుంగ హేమశృంగమునుండి
యలభగీరథుపూన్కి నిలకుడిగ్గి,

పాతాళమును జొచ్చి భస్మితసాగరు
లనుదాఁకి దివి వాసమును ఘటించె;
త్రిభువన చారిణి, దివిజాది సంసేవ్య,
మను ముని మనుజ సన్మాన్య, ధన్య!

తే. గీ. అఖిల తీర్థాధివాసిని, నిఖిలఘోర
పాపమోచని, జాహ్నవి, పరఁగ దీన
స్నానవిధిఁ దీర్చ నుంటిమో జ్ఞాన హీన!
వెఱపు లఱపులు చెల్లవు తరలు! మనిన- 122

క. విని గంధర్వుఁడు గోపముఁ
గొని, శరతతిఁ గురిసె; నరుఁడు గొఱవిన్ గోలల్
దునిమి, యనిల బాణమున, గ
గన చరుఁ జెఱవట్టి యన్నకడ కేతెంచెన్. 123

మ. కని గంధర్వుని ధర్మసూతి, మదిలోఁ గారుణ్య మేపారఁగన్,
జని యాకట్టుల నూడ్చి గౌరవగతిన్ సంభావనన్ జేసి, యి
ట్లనె:- నీయట్టిఁ డకార్యమూననిఁకఁ జేయన్ వచ్చునే; యొరినే
మనఁ గావచ్చు? నటన్న సిగ్గున నతం డాధీరుతో నిట్లనున్- 124

క. ఆసేతు సీతనగముగ
వాసిలఁ గన్నట్టి మిమ్ముఁ బాండవుల నిటుల్
జేసితి రోయఁగ స్త్రీసహ
వాసినగుటఁ; గాము శక్తి వచ్చునె తోరియన్?- 125

క. నరుమైత్రిని గోరెద నో
కరుణాకర! ధర్మపుత్ర! కలిగింపు మనన్;
నరుకరము ఖచరుకరమును
సరినొకటిగఁగూర్చె ధర్మసంభవు డంతన్. 126

క. అంగార పర్ణుఁ డర్జును
సంగతిఁ గని పాండవులను సరస ఫణితి నా
లింగనముఁ జేసి వీడ్కొనె;
గంగా స్నానంబు దీర్చి కడుఁగొని యంతన్— 137

తే. గీ. విప్రవేషంబులన్ బాండవేయు లరిగి
పట్టణంబుల నడవులఁ బర్వతముల
దాఁటి పాంచాలపురిఁ జేరిఁ దానఁ గుంభ
కారునింట నడఁగిరి సౌకర్య మొదవ.

సీ. కడఁక స్వయంవర కార్యార్థ మాపురి
కైసేయఁ బడుచుండె ఘనతరముగ,
రచ్చలు వీథులు రాచబాటలు, సందు
గొందు లాదిగఁ గంటి విందుఁ గొలుప
వెలయించి, పన్నీటి కలయంపిఁ జల్లించి,
యింపు తావులు గుబాళింపఁ జేసి,
పచ్చతోరణములఁ బందిళ్ళు వేయించి,
విరుదులు నెలకొల్పి వేన వేలు;

తే.సీ. ప్రాసిగుళ్లను, వేల్పుల పూజదీర్చి,
యిష్టమృష్టాన్న నై వేద్య మిడఁ గఁజేసి,
గృహగృహంబునఁ గడునలంకృతు లొనర్చి
పొలుపుగావించి రిందుగ్రని పురము నాగ. 129

ఉ. ముత్తెపుగుత్తు లత్తమిల, మోహనవజ్రమణీఘృణిప్రభా
భిత్తి కవాటముల్ వెలయు, విశ్రుతరత్నవిలాస కక్ష్యదీ
ప్తోత్తరమై విశాల శత యోజన మైన స్వయంవరప్రియు
క్తోత్తమ మండపం బొకటి నొప్పగ నప్పుడె కట్టి రప్పురిన్. 130

తే.సీ. డిగ్గ వసతుల; నీటికిఁ దగ్గవసతి;
భోజనవసతి; తిరుగరాఁ బోవ వసతి;
యున్న, వలసిన, తలఁచిన, కన్న, విన్న-
యన్నివసతులఁ గల్గించి రన్ని యెడల. 131

క. అటఁదృటియుఁ దృటియుఁగడుఁగిట
కిటయయ్యె స్వజన,పరజనకీర్ణంబయి, యు
త్కటముగ రాఁజొచ్చిరి ది
క్తటములరాజులును బ్రజలు- తండంబులుగాన్- 132

క. తనర స్వయంవరమండప
మును దరిసి ముహూర్త మరసి పొలుపుగ నట, నా
సనములు గై సేసిరి తగ
జనపతులున్, జనులు, మునులు సన్మానితులై. 133

తే.గీ. క్షత్రియులు వైశ్య శూద్రులు ధాత్రిసురలు,
స్త్రీలు వేర్వేఱ బారులుదీరి రంగ;
వందిగాయకనటవిట బృందమంతఁ
జూపి రవ్వారివిద్యల నేర్పుమీఱ. 134

క. కరమునందుఁ బుష్పదామం
బిరవొందఁగఁ గృష్ణ నడువ ధృష్టద్యుమ్నుం
డురుచాపమూని పల్కెనఁ
వరుసగను భూపతులఁజూపి పాంచాలి కనుమా — 135

సీ. తమ్ములు నూర్గురు తనుఁగొల్వఁ జనువాఁడు
దుర్యోధనుఁ డతండె తోయజాక్షి!
కర్ణ కుంభజ కృప గాంగేయ ముఖ్యులు,
భూరిశ్రవాది భూభుజులు వారె!
గాంధారపతి, జరాసంధ శల్య విరాట
సోమదత్తాదులు చూడు వారె!
సారణ సాత్యకి సాంబ సంకర్షణ
కృష్ణాది యాదవ శ్రేణి యదియె!
వృష్ణిభోజాంధక వీరులు, శిశుపాల
చేకితానాదులు చెల్లి, వారు!

తే. గీ. జయ జయద్రథ, భగదత్త చంద్రసేన
వరభగీరథ, శిశుపాల వత్సరాజ
వరులు, వారలు పౌండ్రక వాసుదేవ
ప్రభృతులు; లానేతు శీతాద్రి పతులు వీరె.

అని మఱి ధృష్టద్యుమ్నుఁడు
ఘనాఘనగంభీరగర్జగతిఁ గడంక మెయిన్
ధ్వను లెసఁగ దిక్తటంబుల;
వినఁగ సభాసదులు పలికె విస్తరఫణితిన్- 137

మానిత ఘన సభామండితులార!
దానమానజ్ఞానధనులార వినుఁడు!
అంతరిక్షమునందు నదిగో యున్నాఁడు
నింతమీన మొకండు విడక యెల్లపుడు!
ఇల జలపాత్రి మాయెదురనే యుండు,
కల దమ్మ్యోడనె కొండగతి విల్లొకండు;
విలుచెంత నలుగులు వెలసె నాల్గొకటి,
తిలకింపుఁ డీర లాతీరు బల్ ధాటి!
జలమునఁ గాంచుచుఁ జలియించునట్టి
యల చేపపైదృష్టి యానంగఁ బెట్టి,
విల్లు నెక్కిడి పూన్కి వెలరార వీఁక
నల్లెత్రాటిని గూర్చి యలుగులు దాఁక
నైదింట నామీను నవలీలఁగొట్టు
నాదంట నే కృష్ణ యలరి చేపట్టుఁ!
వాఁడఁగుఁడు వీరులు తొందరపడక
కడుకొని తఱినిఁ జేఁ గడచిపోవిడక. 138

తే.గీ. వాద్యములు మొరసెఁ; నాకాశ భాగమందు
దివిజముఖ్యులు పంక్తుల దీఱిరి; రపుడు
విల్లు నెక్కిడ నొక్కొక్క రల్లనల్ల
రాజులు ప్రయత్నములు సల్పి రోజమీఱ!— 139

సీ. చవ్వాల వింటిని దరిసించి యిది పెను
గొండరా! యని యందె గొణఁగువారు,
కరమునంచి కదలించి తరముగాకుంటచేఁ
దలవంచి ప్రక్కకుఁ దొలఁగువారు,
జోకునవచ్చి యెత్తఁబోఁకి పెనంగి
యటిముటిఁబడి వెన్క కరుగువారు,
మోకాలివరకెత్తి మూల్గి ముందోఁపక
దిగజాఱ విల్విడి వగచువారు,

తే.గీ. కడఁగి మూఁపు కీలు బెడకె నంచనువారు,
నొరగి ధరకు మన్నుఁ గఱచువారు,
వెన్నుఁ గాలుఁ గేలు విఱుఁగఁ బొర్లెడువారు
నయిరి రంగభూమి నవనిపతులు.

తే.గీ. శల్య శిశుపాల వరజరాసంధముఖ్య
భూభుజులు విల్లు నెత్తంగఁ బూని వరుస
మాష, యవ, ముద్గ, తిల లంత మాత్ర ముడిగి
నారిఁ గూర్పంగ, మోపెట్ట నేరరైరి.

క. ఘన రాజసు దుర్యోధను
శాసనమున విల్లు నెత్తఁగడఁగెద జయమే
కోరిక ఫలితమతనికే
చేసెద" నని కర్ణుఁడాడి చెచ్చెర ధనువున్— 142

ఉ, తాఁకి కరంబు మోపి బెడిదంపుఁగడంకను నెత్తి, నారినిన్
జేకొని, కూర్చి కోపున, విచిత్రగతిన్ సభ కేరికూడు, న
ల్లాకను నెక్కిడన్ శరము రాక, విభగ్నమనోరథుండునై
నీఁక దొఱంగి వాలె నట వెన్కకు వింటిభరంబు నోపకే. 143

క. "కుటిలత, నవమతి నృపులకు
ఘటియింపఁగ, ద్రుపదుఁ డిట్లు గలిగించె నిసీ!
మటుమాయ" యని ముసలి తా
నటు విల్ ధరియింగఁ జూడ, హారికనుసన్నన్— 144

ఉ. వారణఁజేసి; చెంతఁగొని "వావిఁ దలంపవు, భూభుజాళికిన్
గూరిన దూరువాప నిటు గూడనియీపని కుద్యమింతువే?
ఆరయ, కృష్ణచెల్లెలగు నర్జునుఁబోరచి యిద్ది, యగ్రజా!
యూఱడు మంచుఁ గర్ణమున నూదిన నాహలి శౌరికిట్లనున్ 145

తే. గీ. "పాండవులు లక్కయింటిలో మండిరపుడె;
చచ్చిపోయిన నరుఁ డెట్టు వచ్చుమఱల?"
ననినఁ "జావరు పాండవు, లర్జునుండు
గలఁడు గలఁ" డని హరియాడ; నబ్బురమున— 146

తే.గీ. "కలఁడె నరుఁ డిల, శౌరి?" యను హాలికి శౌరి
"ఎందొ కాదిందె" యనె; నటు లిరులఁ గాంచి
"చూపు మెం?" దన"నొక్కింత సేపు సైఁపు"
మనె; హాలియు నూదవ్రులు విల్లుఁజెనకఁ శౌరి. 147

ఉ. అన్నకు మ్రొక్కి యాజ్ఞఁ గొని యచ్యుతుఁ డంత నిష్ణురం జేయఁ
న్నన్న నెఱింగి, జోతనిడి చయ్యన విప్రసభామధ్యమం
దున్న నరుండు లేచె సభ యుత్సుకతన్ గనె; శౌరి వ్రేలితో
నన్నకు విప్రవేషధరు నప్టను జూపె రహస్య సంజ్ఞతోన్. 148

క. "ఇంద" మని సూప విలు నొకఁ
"డందుకుగా, దతఁడు వోవు నల్పాచమనం
బుం దీర్ప" ననె నొకఁడు; సభ
యందు నిలుచునరునిఁ జూచి యందఱునవ్వన్. 149

తే.గీ. "కొమ్మఁ గని బాపని కదే మొ రిమ్ము పుట్టె;
భూరి భోజనభుక్తిచేఁ బొగరువట్టె;
నేమిగా మత్స్యయంత్రింబు నెంచినాఁడొ?
తెలియఁ జెప్పరె!" యని సభ కలకలించె. 150

తే.గీ. బ్రాహ్మణకులంబున కితండు పరువుసెఁ దెచ్చు
ననుచు, గెలిచి యశంబును బెనుచు ననుచు;
నేమొ యేపుట్ట నెంతటి పాము గలదొ?
యనుచు నందందు గొణగొణ ధ్వనులు సెలఁగె. 151

మ. అటు లా వేదిక డాయ మత్తగజమట్లాతండు విచ్చేసి, యు
త్కటశైలంజననొప్పునాధనువు చేతందాల్చి మోపెట్టి, తా
నటె యేనమ్ముల మత్స్యయంత్రమును వ్రయ్యన్ జేసె, నాఘాటిడి
క్కటముల్ మ్రోసె;నహీంద్రుడూఁగె;సభ యుత్కంపించె సంభ్రాంత
(క్రీడన్- 152

తే.గీ. లీలఁగైకొన్నయరవిరి మాలఁ దెచ్చి
యర్జునునికంఠమునఁ గృష్ణ యట్టివైచె,
నది సహింపక కౌరవులాది గాఁగ
ధారుణీశులు నరునితోఁ బోరఁదొడఁగ:- 153

తే.గీ. అనిలజుఁడుఁ గవలుఁ దోడ్తన కైరి తోడు;
"తొలఁగు డక్రమ" మని కౌరవులను బదరి
శౌరి యాదవబలముతోఁ జేరెఁ బార్థు,
ద్రుపదుఁడర్జును జతయయ్యెఁ ద్రుటినిఁగడఁగి— 154

తే.గీ. శల్య శిశుపాల వరజరాసంధముఖ్య
భూభుజులుఁ గౌరవులఁ జేరి పోరిరెలమి;
పాండుపుత్త్రులు వారల పస నడంచి
ద్రౌపదిని గూడికుంతిని దరిసి మ్రొక్కి— 155

క. "మే మొక్క" భిక్షఁ దెచ్చితి
మో మాతా! యనినఁ గుంతి "యుపయోగింపుం
డీ, మీరలేవు" రని, విని
యామీఁదటఁ గథను, కృష్ణ నారసి భీతిన్— 156

ఉ. అక్కట! ధర్మదూర మిది యాడితి, నానుడి బొంకువోవునే?
తక్కదు వీరు నాపలుకు; దైవ మిటుల్ పలికించె" సాచు లోఁ
బొక్కెడుతల్లినిన్ శమన పుత్రుకుఁ జూడఁబల్కె; నంతనా
చక్కికి వచ్చునాహలిని శౌరినిఁ గన్గొని పాండు నందనుల్ - 157

ఉ. వెన్నిధిఁగన్న పేదయటు పేర్మి నెదుర్కొని కౌఁగిలించుచున్
సన్నిధిఁ జేర్చి సేమపుఁ బ్రసంగముఁ జేసిరి; రామకృష్ణు లా
యన్నునఁ గుంతిపాదయుగమంటిరి; యామెయు బాష్పధారలా
కన్నులఁ జాఱ నల్లురనుగౌఁగిటఁ గ్రుచ్చె ససంభ్రమంబుగన్. 158

క, కౌరవుల దుర్ణయంబులఁ
గూరిచి చింతించి పిదపఁ గుంతిహరికనున్:-
జేరికగ ననుభవింపుం
డీ రేవురునంటి సుతుల; కెఱుఁగక కృష్ణన్ - 159

క. లోకమునఁ బలువు రోకసతిఁ
జేకొనరే కద, యిదెట్లుఁ జేయుఁగవచ్చున్?
నీకంటె గురుఁడు దైవము
మాకుండఁడు చెప్పుమనిన, మాధవుఁ డనినన్ - 160

క. అది యట్టిద! నీనుడి వో
వదు వృథ; విధికృత్యమిదియు పలు కీటు కాడలేన్;
మది వగవనేల, కాగల
యది తప్పునె? యనుచుఁ జూచె నాధర్మజునిన్ - 161

ఉ. అతఁడు శౌరితోడ ననుఁ "నచ్యుత! ధర్మముఁ దప్పఁ బోని నా
చేతనుఁ గృష్ణపై మఱిగె చేయున దే" మనెఁ; దప్పఁ గల్గు రా
రీతిని మాకు సంచనిరి; కృష్ణుఁడు కృష్ణను జూచి, నాకమెయుఁ గా
బీతి జనించె నేపుకను భేదమెఱుంగను మాధవా! యనెన్. 162

తే. గీ. దైవ ఘటనంబుఁ దలపోసి, తల్లియాజ్ఞఁ
దలను దాలిచి, కృష్ణుని పలుకు నెంచి,
పాండు సుతులేవు రొకకృష్ణ పరిణయంబుఁ
జేసికొననొప్పి, రది కాదు దోసమనుచు. 163

క. అల కుంభకారు నింటన్
హాలి హరి వీడ్కొని సనంగ నాపాండవులన్,
దెలవాఱె నంతకంతకుఁ
గలకలమని కూసె పక్షి గణములు పెలుచన్. 164

మ. ద్రుపదుం డానిసి నిద్రలేక యిదిపో దుష్ప్రాప్తి! రాకన్నియన్
అపసవ్యంబుగఁ గట్టె విప్రునకుఁ గట్టా! బ్రహ్మ; యజ్ఞేశు సత్
కృపచేఁ బార్థునికై గడించితిని; యిస్సీ! పోలునే కాకికే
యపురూపంబగు రత్నహార మని యత్యంతంబుఁ జింతించు

తే. గీ. కాలమున్ బుచ్చఁ దెలవాఱెఁ; గాలకృత్య [చున్ - 165
ములను దీఱిచి, భూషణమ్ముల ధరించి,
వందు లుదయగీతమ్ములఁ బాడుచుండఁ
గొలువు కూటమ్మునకు నచ్చి కూరుచుండి- 166

తే.గీ. పెండ్లిసన్నాహ మొనరించి; పిలువఁబంచె
విప్రవేషుల నాపాండవేయ ఘనుల;
గజహయమ్ములు, వాహ్యముల్ కానుకలఁ గొని
సచివ పౌరోహితాదు లచ్చటికిఁ జనిరి. 167

క. చని కుంభకారునింటికిఁ,
గొని తెచ్చిరి పాండుసుతులఁ గుంతీ కృష్ణా
వనితలతో నందలముల,
ఘన మంగళ రవము లెసఁగఁగా విభవమునన్. 168

క. వచ్చెడివియ్యము వారిని
మచ్చిగ నెదురేగి తెచ్చి మాన్యంబుగ నం
దుచ్చతరాసనములఁ దగ,
నిచ్చెను గూర్చుండ ద్రుపదుఁ డెంతయుఁ బేర్మిన్. 169

తే. గీ. అచట యదువృష్ణి భోజాంధకాది నృపులు
సచివ సామంత హితబంధు సర్వజనులు
నిండు పేరోలగం బుండ, మండపమున
నెలమి మంగళ వాద్యముల్ జెలఁగు చుండ- 170

క. పెండిలి కొడుకును రమ్మనఁ,
బాండవు లేవురును వేదిపై కెక్కిరిగన్,
నిండు సభ వెలుఁగుపడె; ద్రుప
దుండున్ మదిఁ జోద్యమంది తుదకిట్లనియెన్:- 171

ఉ. కానరొ పెండ్లి నెప్పుఁడును? గానరొ ప్రాత సనాతన క్రియన్?
గానరొ శాస్త్ర ధర్మమును? గాదన కీరిటు లేక యొక్కటన్
బూనిక సాగివచ్చితిరి, పోలునె! యంత్యముఁ గట్టినాతఁడే
తానగుఁ బెండ్లి కీఁటకు; ధరామరులార! పరాకు మాననే! 172

క. అన; విని నరుఁడను:- శాస్త్రము
ల నెఱుఁగుదుము, పెండ్లివిధముల నెఱుఁగుదు మో
జననాథ! యన్న లుండఁగ
జను నే పిన్నలకుఁ బెండ్లి సమ్మత మగునే? 173

క. అన "నదిమత మగుచో రా
జనుసీవేదికకు నగ్రజన్ముఁడె మీలోఁ
జను డెంచుత" మను ద్రుపదున
కనెనిటు ధర్మజుఁడు మృదులమగు వాక్యగతిన్:- 174

ఆ. వె. అన్న నేన! వీరి ననుజుల విడనాడి
సతినిఁ గొనఁగ నాకు మతముగాదు;
కృష్ణ నేగురము వరింపక తప్పదు
మాత యాజ్ఞ యగుట మాకు నధిప!" 175

ఉ. అక్కజమైన యీపనికి నాద్రుపదుం డెటు వాలువోక, తా
నొక్కెడఁ జూచి పాండవుల "నుర్విని పత్నిశతంబు నేని యొ
క్కొక్కఁడు గొంట ధర్మమగు; నొక్కనిఁ గాదని భర్త లేగురన్
నెక్కొనఁ గొంట ధర్మమగునే సతికిన్? మును జూచినార మే?-

క. అసప్పృశ శస్త్రాస్త్రులు మఱి
వసుధామరు లీరు! మాఱు పలుకఁగ వెఱతున్;
పసి మీరాయీప్సిత మొనరుప
నసమంజస మగుట నెఱతు" నని హరిఁజూచెన్. 177

చ. ద్రుపదుని గాంచి శౌరియను "దొడ్డవిచారము; భూసురేంద్రులీ
నెపమిడినార; లెంతకును సేస్తురు విప్రు" లటన్నఁ "గూడదీ
యుపకృతి; నీరివీడి మరియాద నెఱుంగు మఱొక్కతేనికో
నృపవర! పెండ్లి సేయఁదగుఁ గృష్ణ" నటంచు జయద్రథుం డనెన్, [178

క. "అటులగుచో దుర్యోధను
నటువంటి మహీంద్రుఁ డున్నె? యాతనికి నీ
కుటిలాలక నిం" డని యు-
త్కటమతి దుశ్శాసనుండు తా నాడె సభన్. 179

తే.గీ. అట్లు సభలోన కలకల మగుచు నుండ;
పాండవులు పెండ్లి పీటల నవలకుండ;
నెడఁద ద్రుపదుఁడు తికమక పడుచునుండ
నచటి కేతెంచెఁ బూజ్యుఁడౌ వ్యాసమౌని. 180

ఉ. వచ్చెడివ్యాసమౌనిఁగని పాండవులున్ ద్రుపదుండు మ్రొక్కుచున్
దెచ్చిన,నాసనంబుఁ గొని, తెల్పెను "విప్రులుగారు వీరు! నీ
మెచ్చినయల్లుఁ డర్జునుఁడె మీనముఁగొట్టెను; లక్కయింటిలోఁ
జచ్చుట కల్ల పాండవులు క్ష్మావర! వీరలె చూడుమా!" యనెన్. 181

తే, గీ. హరుఁడు ప్రత్యక్షమై వరం బడుగు మనిన
నేను మారులు "ఐతి" యనె; నీశ్వరుండు
"మగలు జన్మాంతరంబున నగుదు రేగు"
రని పలికె; నెట్టులది తప్పు నతివ కనుచు- 185

ఉ. న్యాయము మాని చెప్ప హరి యౌ నన; నాదలలూఁప విజ్ఞులున్
ఆయత ధర్మతత్పరత నాద్రుపదుండు 'వరాయ విష్ణురూ
పాయ' యటంచుఁ బాండవుల పాదసరోజములన్ సురాపగా
తోయము వోయుచున్ గడిగి తోడనె మూర్ధముఁ జేర్చెఁదీర్థమున్.

క. జానగు హేమాంబరములఁ
బూనిచి, మణిభూష లెసఁగఁ బుత్రినిఁ గన్యా
దానముఁ జేసెను ద్రుపదుఁడు
మానితముగఁ బాండవులకు మహిఁ గొండాడన్. 187

తే. గీ. అవల షోడశ దానంబు లాచరించి,
యిష్ట మృష్టాన్నములను సంతుష్టిఁ జేసి
యచటఁ జేరిన సర్వుల నుచితరీతి
గారవించెను ద్రుపదుండు వేఱువేఱ. 188

తే. గీ. వినుము! ద్రుపదుండు పాంచాలి పెండ్లిఁ జేసి
తనరెడు ననర్ఘ్యమణిఖచితమ్ములైన
భూషణాంబర శయ్యలఁ బొసఁగ నొసఁగి
యల్లురకు రథగజముల నరణ మిడియె. 189

క, చతురంబోధి పరీత
క్షితి లక్ష్మికిఁ మూలమై, విశేషాదరణన్
సతి ద్రౌపది యత్నను దన
పతులను సేవించె భక్తి భావము పేర్మిన్. 190

క. అరివీర భయంకరులై
పరఁగుచుఁ బాంచాలువీటఁ బాండవు లుండన్
నరసుర దైత్యాదుల భయ
మరయం డాతేఁడు; దేశ మది సుఖమొందెన్. 191

మ. అట దుర్యోధన కర్ణ సౌబలులు సౌఖ్యంబొప్పఁ గౌంతేయులుం
డుటయున్ దారలు పన్ను వ్యూహములునోటుంజెందుటల్ గాంచియో
క్కటియున్ దోఁపక, సైపలేక మదికాఁ కన్బోయి వారెల్ల రొ
క్కటిగా తేనినిఁ గాంచి మ్రొక్కి తెలుపంగన్ దమ్మవేర్వేఱుగన్.

క. సుతు నొడికిన్ గొని యాతురు
పతి మిగిలినవారిఁ దగిన పగిదినిఁ గని బల్
హితము మదిఁ బొదల "నిటురాఁ
గత మెయ్యది? మీరు శాంతిఁ గందురె?" యనినన్- 193

ఉ, అంతము లేని భోగముల నందుచు దాయలు మామగారి శు
ద్ధాంతమునందు భార్యసహితంబుగ, బాంధవ మిత్రమంత్రి సా
మంతులు గొల్వ,సౌఖ్యముగ మైమఱపొందుచునుంటఁగాంచి వి
శ్రాంతని, శాంతినిన్ గొనునె రాజకుమారుఁ డదెన్నఁడేనియున్?194

క. పాపన్నిప యుపహితంబులె
పాపై యున్నతిసిం గూర్చి పగతుర; కవె మా
కాపాదించెను దుఃఖం
బాపాపపు విధివిధాన మది యెట్టిదియో? 196

క. రేయిం బగళులు విదురుఁడు
నీయంతనె యుంటచేఁ బనివడియుఁ గడు ద
వ్వైయుంటి; మిన్ని నాళ్లకు
నిహాయిష్టముఁ దెలుపఁగా సమయము లభియించెన్. 196

క. విదురుం డావలు మను ప
గిది నెఱిఁగియు పీడవతనిఁ; గీడిది యని నీ
హృది నెంచవు; కడుహితునిగ
మదిఁ గను, దేకత మొ? వింతమత మో? వ్రతి మో? 197

క. చేదిపతి వృష్ణి భోజులు
యాదవు లాదిక్కువార; లాపై దు్రపదుం
డో, మహిత నొసఁగె; బలిసిన
మీఁదట సాధింప శక్యమే శతు్రవులన్? 198

సీ. అని సుతుం డాడ, నాయంధ నృపాలుండు
వల్కు:- మీవలె నేను వనరుచుందు;
విదురున కీనాడు హృదయంబుఁ దెలుపక
యురయుదు నవ్వాని యాత్మగతుల;

వాడు నిజంబుగా వారినే కొనియాడు
ద్రోణాదులును మిమ్ము దూఱువారు;
న్యాయ మెట్టుల నున్న నాత్మనందనుని య
భ్యుదయంబుకొఱకె నామది తపించుఁ;
ఆ.వె. గాని, తమ్ము సుతులఁ గడఁజేయఁగాఁ జాల,
వారు చెడక నీవు బాగుపడవు;
దైవబలము గలిగి తనరారు నావారి
నేమి సేయవచ్చు నింకఁ జెప్పుమ? 199

అనఁగ, దుర్యోధనుఁ డను, యదు వృష్ణి భో
జాంధకు లవ్వారిఁ బొందకుండ;
ద్రుపదుండు వారలతోఁ బొత్తువడకుండఁ
గిన్క నైనఁ గల్గించియొండె;
కౌంతేయ మాద్రేయ కలహాంబుదలసూప
భేదంబుఁ దమలోనఁ బెట్టియొండె;
పాంచాలి కవ్వారి పట్ల విరక్తిని
బుట్టింప బుద్ధులు పోసియొండె;
ఆ.వె. తగినవారిఁ బంచి తఱివేఁచి తగురీతి
బోధఁజేసి లేని పోనివన్ని,
పగలు వారిలోనఁ దగులఁగా రగుల్కఁగాఁ
బన్నవలయుఁ జతురుపాయములను. 200

క. అన; కర్ణుండను నిటులా
యనుజులలో భేదబుద్ధి యుంటదు; ద్రుపదుం
డును వీడఁడల్లురను; శౌ
రినిఁ బార్థునిఁ బాప నేర్తురే సురలేనిఁ? 201

చ. ఇదియు వృథా ప్రయాస మగు; నిట్టి ప్రయత్నము మానుఁడింక,నీ
యదనును పీఁడరాదు రిపు నభ్యుదయం బది మేలుఁగాదు, పె
ల్లొదవ బలంబు లెత్తి కొని యొక్కమెయిం జని ఫూని సోమకుం
జదిపి పృథా సుతాళిఁ గొని చయ్యన నత్తము; శౌరిమీఱితిన్ -

క. పాండవుల నండఁ గొనిమొద
ముండుము నీ వనుచు నతఁడు నూఱడ మాయల్
నిండిన నీతుల గోఁతుల
దండిగఁ ద్రిప్పుదము వినక తక్కిన యేనిఁ- 202

క. ఎన్నటికైనను బవరముఁ
బన్నంగావలయు నేము వారలు నగుటన్
బిన్నట నిప్పుడె దానికి
సన్నద్ధుల మగుట మేలు సర్వ విధములన్- 704

చ. అన; ధృతరాష్ట్రుఁ డాడు నిజ మట్టిద! యైనను ద్రోణభీష్ములున్
మనవిదురాదులున్ బలుకు మాదిరి విందము; పోరువారొ; న
ల్లని మెదువారొ? వారిమది లారయవచ్చును; వేఱమైనఁ బ్రీ
తినిఁ దగఁ జూపి; పాండవులఁ దెత్తము భాగము నిత్తమంచు నేన్ .205

క. అంతరవు గలదు మీకుఁ
గుంతీసుతపంచకమునకుఁ; వారు యశో
వంతులు ధీమంతులు, బల
వంతులు; వగలగును పగలు భ్రాతలు మీలోఁ– 206

క. అన విని దుర్యోధనుఁ డను
జనకా! నేవెకలి నొక్కొ సమరముఁ గోరఁ–
మునుమున్నే కనుఁ దెఱచుచు
మను టెన్నటికైన మనకె మంచిది కాదే? 207

చ. బలమును బుద్ధియుఁ గలుగు భ్రాతలె? నీతు లివన్నియుఁ సరే!
చెలఁగిరి మమ్ము మించి, యిది చేటగుఁ గాదొకో రాజరాజు నా
వెలసిన నాకు? నిద్దియుర వే? యొఱవే యొఱనొంట రెండు క
త్తులు జొనుపంగ? జీవితము దుఃఖదమేఁ మరణంబె మేలుకా?–208

క. " నీపలుకుఁ గర్ణు పలుకును
నాపలుకును నెఱియ దైవనైమేయము యేఁ;
లోపించు నటుల కాదే
నేపండితుఁ డొప్పు నిది యిటే యని గీయఁ? 209

ఆ. వె. తమకుఁ దోఁచినట్లు తామాచరించెద
రర్విజనులు; దైవ యోగముండి
ఫలముఁ కూరఁగఁ దమ ప్రతిభయే యందురు;
భవ్య మెఱిఁగి నడచు ప్రాజ్ఞుఁ డేడి? 210

ఆ. ఇంక మీర లేగుఁ డీపార్ద్రై సభదీరి
పిదప దూతఁ బుత్తుఁ బిలువ మిమ్ము;
కలసి యెల్లవారు కలరూపు మాటాడ
వచ్చు" నంచు ఱేఁడు వారిఁ బుచ్చి- 211

ఉ. అంతనఁ బిల్వఁబంప సభ కందఱు రా, విని గుడ్డిరాజనుక్,
వింతగ "గిట్టిపుట్టి" రన విందుము నానుడి, మాకు నేఁడు సి
ద్ధాంతము నయ్యెఁ బాండవులు దస్యులునై మఱిఁ దోఁచిరన్న నా
స్వాంతము ఖేదమోదముల వారక దాగురుమ్మాత లాడెదుక్.212

క. జీవింప వారు మేలే
మావారే వారు నాఁడు మ్రింఁదఁగ నగ్నిక్
మావాఁడె చేసె నంటిరి!
దైవంబే చెప్పె నద్ది దబ్బర యనుచుక్. 213

సీ. వారలు వీరలు జేరరు దానికై
యెంతయో వంతఁ జింతింతు మదిని
దుర్యోధనుం డన్న దుందుడు కందురు,
కలహప్రియుఁడుఁ గాఁడె గాలి పట్టి?
పుట్టె దాయాదుల కెట్టులో స్పర్ధలు;
గూర్పంగఁ గలయట్టి నేర్పెఱుంగ,
అనికి నను జ్ఞ వీ రడిగిరి మీరొడఁ
బడినచో నేనొప్ప వాఁడ నంటి!

ఆ.వె. పెద్ద లీర, నాకుఁ బ్రియమంత్రిలును మీర!
బలగ మన్న మీర! బలము మీర!
శత్రుపక్ష మెంచి సామ్రాట్టును దలంచి
కార్యగతుల నాకుఁ గఱపుఁ డయ్య! 214

క అన; భీష్ముం "డరి నిగ్రహ
మును సలుపఁగ విగ్రహంబు బుద్ధియ! కుంతీ
తనయులు మన శత్రువు లఁటె
మన మెప్పెనె యిట్టివ్రేటు మాటల దూఁటఁ? 215

క. ధృతరాష్ట్ర పాండు తనయులు
మతిఁ దలఁపఁగ నాకు నొక్క మాదిరివారే!
పితృధనమగు రాజ్యము నీ
సుతులకుఁ బలె వారి సొంత సొమ్మే సుమ్మీ! 216

ఆ. వె. పుట్టు గ్రుడ్డి నిన్ను బొందక వారల
తండ్రికబ్బె ధరణి; తండ్రిసొమ్ము
తనయు లదియ; తండ్రి ధనమున భాగము
జ్యేష్ఠసుతుఁడ వగుటఁ జెల్లు నీకు! 217

ఆ. వె. తండ్రిలేనివారు తమ్ముని కుఱ్ఱలు
నీకుఁ బ్రోచుటొప్పు; నీకుమారు
లకును నాకు నెల్లరకుఁ బాడి; తెగనాడ
వలదు వారిపాలు వారికిమ్ము. 218

క. తాతల తరతరముల నె
న్నోతలలుగ వచ్చినట్టి యుర్వి నొసంగన్
జేతువె యోజన? భిక్షుకు
లే తలపఁగ వారు? నీకు లేదే దయయే? 219

క. అని తత్సుతుఁ గని "పైతృక
మును నీవలె వారుఁ గోరఁబోలరె? లోకం
బను వారిదె రాజ్యం బని,
విను! తడసిన మొదలు చెడ్డ బేరం బిదియా-— 220

ఆ. వే. పాడి యుండనిమ్ము; వారును మీరును
చేరి మనుట మేలు; చేర రేని
పిలిచి పాలొసంగి తొలఁగించుకొను మిది
మాకు మతము!! నింద మాయు నీకు!!! 221

మ. జనుసాంధుండు నృపుండు గాఁ దగదు శాస్త్రంబిద్ది! యట్లౌటనీ
జనకుం బాసి ధరాధిపత్యము ప్రశస్తమ్మొంది నాపాండు; నా
టను, రాజ్యం బవిభాజ్యమాట నదిచూడన్ మీకురా దేమియున్
మనుశాస్త్రక్రమరీతిఁ బాండవులె యీరాజ్యమ్మొందలేశుల్ సుమీ! 222

శా. న్యాయం బేగతినున్న రాజ్యమిది వత్సా! పైతృకంబౌటయున్,
దాయల్ మీరలు స్పర్ధలంగనుట నేఁ దర్కించి శ్రేయంబుగా
న్యాయంబిట్టులఁ దీర్చితిన్ సగము రాజ్యం బీరు వారొందుచున్
బాయుం డింతట వైరముల్; మనుఁడి సౌభ్రాతృత్వ మేపారగన్, 223

---

ప॥ 219 పా॥ 4 అ॥ 3- లఁ; ప॥ 220 పా॥ 4 అ॥ 11- డ్డ;
ప॥ 223 పా॥ 1 అ॥ 8- న్న; పా॥ 4 అ॥ 21- రఁ;

క. తనకీర్తి ధరణి నెంతటి
దనుకన్ విలసిల్లు నంత దాఁకన్ నాకం
బున సుఖము లొందు నరుఁడని
వినిచెడి శాస్త్రోక్తి నింత వినవే యెప్పుడున్? 224

ఆ. వె. లక్కయింట వారి లయ మొనరింపఁగఁ
గడఁగితి ననునింద గలదు నీకు!
దానిఁ బాపుకొనఁగ; ధర్మపరత్వంబు
చాటనీకు మంచి సమయ మిదియె! 215

క. చిక్కెను పుడిసిట రాజ్యము
దక్క ననుచు దలఁతో? వినుము తమపైతృకమున్
ముక్కున నూపిరి యుండఁగఁ
దక్కుదురే వారు వజ్రిధరుఁ డెదురైనన్? 226

చ. అన విని కేరి, యంధనృపు నారసి ద్రోణుఁడు పల్కె "నిక్కవం
బనియె నదీసుతుండు! సుగుణాఢ్యులఁ బాండుసుతాళిఁ బిల్వఁగాఁ
బనిచి సగౌరవంబెసఁగ వారి నిటన్ వెసఁ దోడి తెచ్చి నే
లను సగబాలొసంగి సుతులన్ సుఖులై మనఁజూడు భూవరా! 227

చ. ఇదివిని కర్ణుఁ డిట్టులను "నీగతి మేలె యమాత్యు లిట్టిరే?
ముదిమదిఁ దప్పినారు పెడ బుద్ధులఁ బోదురు; బెట్టుల్కిలన్
ఎదిరిని సంస్తుతింత్రు; సరియే వైరులన్ దరిఁ జేర్పఁ జెప్పవా
రిదికద ద్రోహబుద్ధి! ప్రభుభృత్యులపాడి నెఱుంగ రీబుధుల్. 229

క. ఆ మాటకు ద్రోణుండను :-
మేమహితులు; హితుఁడ వీవె? మేల్ మేల్ సూతా!
నీమాట విన్న కౌరవ
లేమాడురొ ముందు తెలియు! నిపుడేటికి?" కనెన్. 229

సీ. వారల నిద్దఱ వారించి విదురుండు
ధృతరాష్ట్రుతో నిట్లు తెల్పె" నధిప!
లోకోత్తరుండు గంగాకుమారుఁడు సుమ్ము!
ధర్మజ్ఞుఁడీ ద్రోణ ధరణిసురుఁడు!
తథ్యవాదులు నీతి తత్పరుల్ వీరు నీ
హితముఁ గోరెడివార లిది నిజంబ!
దుర్యోధనుఁడు, కర్ణ దుశ్శాస నాదులు
బాలు రెఱుంగరు మేలుఁ గీడు;
ఆ. వె. లట్టివారి పల్కు లాదరింపకు; ద్రోణు
భీష్మపల్కు లెంచి పిలువఁబంచి
పాండుసుతులఁ బ్రీతి పాటించి సగపాలు
నవని నిమ్ము! వేర మాడవలదు! 230

క. వార లజేయులు స్వయముగ;
వీరుఁడు పాంచాలుఁ డయ్యె వియ్యము; భుజవి
స్ఫారుఁడు ధృష్టద్యుమ్నుఁడు
వారల వాఁడయ్యెఁ జెనక వచ్చునె వారిన్? 231

క. నలునకు బితయగుహరియే
చెలి, చుట్టము, సచివుఁడగుచుఁ జేదోడై, వా
రలసారథియై, కార్యం
బులఁ దీర్చెడుఁ బాండుసుతుల పున్నెముఁ గంటే!- 232

సీ. యమపుత్రుఁ డల్గిన సమరాన నిల్వఁగా
సురపతి యైనను సుఖుకవఁడె?
పేర్చి యార్చిన వీరి వ్రేలదే నభము, భీ
ముం డాజికాల రుద్రుండె కాఁడె?
మునుకొని ముల్లోకముల నేనిఁ గాల్పఁడే,
పగఁబూని తెగనేనిఁ బార్థుఁడనిని?
గద లెత్తి వచ్చినఁ గలన నోర్తురె సురా
సురయక్ష పన్నగేశ్వరులు నేని?

ఆ.వె. అట్టిపాండు సుతుల మట్టి జయంబును
గొనుట మింటిపూవుఁ గనుట సుమ్ము!
బ్రిదుకఁ గోరువాఁడు పాండవేయులతోడఁ
దలఁపనగున పోరు కలనునైన!- 233

ఆ.వె, శకునియుక్తి మనకు సమకూరుపదు ముక్తి;
కర్ణభుజముక లిమి కాదు బలిమి;
నీతనయునిపాటు నిజకులానికె చేటు;
పొందుటొప్పు వారి పోరుతప్పు! 234

క. అది విని ధృతరాష్ట్రుఁడు తన
మదిఁ దాఁచుచుఁ బల్కె "మీదు మనసు నెఱుఁగఁగా
నదనిది యని యడిగితి నే
నదయుఁడనే పరుల పంచ ననుఁగులఁ ద్రోయన్?— 335

క. వృద్ధులు వయసున గుణమున
వృద్ధులు, కురువంశమునకుఁ బెద్దలు, తగవౌ-
బుద్ధులు సెప్పితి; రాజ్ఞా
బద్ధుఁడ నే నింక మీదు పనుపొనరింతున్." 236

క. అని పలికి సభాముఖమునఁ
దనయులు విన, విదురునకు నతం డిడె నాజ్ఞన్-
జని పాంచాలుని వీటికిఁ
గొని తేఁ బాండవులఁ బృథనుఁ గోడలితోడన్. 337

చ. విదురుఁడు వెంటనే ద్రుపదు వీటికిఁ దేరునఁ బోయి చేరె; నా
యదనునఁ బాండవేయులు మురాంతకుఁడున్ ద్రుపదుండునున్ సభా
సదనమునందు నుండఁగని సర్వులకున్ మణిభూషణావళుల్
విదురుఁ డొసంగె; వారలతి ప్రీతిని నాతని గారవింపఁగన్- 238

క. కొని యాసనమును, దేరం
గని యాసభఁ, బాండుసుతులఁ గని, తనచూడ్కుల్
తని వొంద శౌరి యాననె
మ్మును గని, యతఁ డాడు ద్రుపదు మోమును గనుచున్. -239

మ. బలవంతుండవు, భాగ్యవంతుఁడవు సద్వంశంబు శీలంబుచే
వెలయంగన్న మహానుభావుఁడవు! నీవియ్యంబు చేకూరి ని
స్తులహర్షంబునఁ బొంగువారు ధృతరాష్ట్రిందుఁడున్, నదీనందనుం
డలకుంభోద్భవుఁడున్, గృపుండు, మది నత్యంతంబు నుర్వీశ్వరా! 240

ఉ. ఎన్ని దినంబులో గడచె నిష్ట సుతాళినిఁ బాసి, కాంచఁగాఁ
గన్నులు కాఁక రేగినవి, కౌఁగిలి కాత్మఁ దపించు చుండ్రి నీ
వన్ని గ్రహించు కోవిదుఁడ, వల్లురఁ గుంతినిఁ గృష్ణఁ దోడితే
నన్నిటఁ బంపినారు! జన నాయక వేగననుజ్ఞ నిమ్మనన్. 241.

క. నాకూఁతు నిచ్చినంతన
యాకురుపతికంటె నాప గాత్మజు కంటెన్,
నీకంటె గురుని కంటెను
ఈ కౌంతేయులకు నేన యెక్కుఁడె విదురా? 242

క. మనయందఱ కంటెను నీ
వనజాక్షుఁడె పాండవులకుఁ బ్రాణంబగుటన్,
ఘనుఁ డతని పనుపు హిత మని
యనె ద్రుపదుఁడు; వాసుదేవుఁ డంతటఁ బలుకున్— 243

క. ఏవార లేమి సేయుదు
రీవిదురుఁడు దండనుండ నీపాండవులన్,
ఆవంత చింత సేయకుఁ
డీ పేరికనంగ; ననియె నిటు ధర్మజుఁడున్— 244

క. కృపసన్నద్ధుఁడు భీష్ముండును, వి
దురుఁడుఁ, ధృతరాష్ట్రవిభుఁడు,ద్రుపదుఁడు, గుఱుఁ, జే
గురు లటఁ జేరఁగ నొప్పిరి;
మురహరి త్రిజగద్గురుండు ముదల నొసంగన్- 245

సీ. అనుమాన మిఁక నేల నని, వారి వీడ్కొని
తమ్ములు, తల్లియుఁ, ద్రౌపదియును,
వారియు ధృష్టద్యుమ్న పరివారములు దన
వెంటరాఁ గదలి యా భీష్ము మొప్ప,
మణిరథారూఢుఁడై చనిచని కొన్నాళ్ల
కాహస్తినాపతి కరుగుదేర;
విని ధృతరాష్ట్రుండు భీష్ముండు ద్రోణుండుఁ
గృపుఁ డాదిగా నెల్ల రేఁగుదెంచి,
తే.గీ. యెదురు సని తెచ్చి పురమున నెంతయేసి
యుత్సవంబుగఁ బ్రజలునత్యుత్సుకమున
వెంట నరుదేర, వారల విడిదిఁ జేర్ప,
లలినిఁ బాండవు లచ్చోట నిలిచి రెలమి. 246

క. అని వినిచిన వైశంపా
యను గని జనమేజయుండు హర్షముతోడన్
వినమితశిరుఁడై, చెప్పం
గను వేఁడెను ముందునడచు కథ కుతుకమునన్ 247

ఆదిపర్వము, తృతీయాశ్వాసము, సంపూర్ణం

# అశ్వత్థ భారతము.

## ఆదిపర్వము.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీదయితా! త్రిదశార్చిత
పాదా!శ్రితవరద! ధర్మపాలన! శుభదా!
వేదవినోదన! దుర్జన
ఖేదన! శ్రీరాయదుర్గ వేంకటరమణా!. 1

* ధృతరాష్ట్రుఁడు పాండవుల కర్ధరాజ్య మిచ్చుట *

క. ఘనుఁ డాజనమేజయనృపుఁ
గని వైశంపాయనుండు; గజపురిఁగృష్ణుం
డును బాండవు లుండఁగ;నొక
దినమున సభదీరి యిట్లు ధృతరాష్ట్రుఁ డనుఁ— 2

క. సాక్షులకు సాక్షి యాశ్రీ
వక్షుఁడు హరిసాక్షిగాఁగఁ బాండవులకు నే
నీక్షితి సాబాలిచ్చితి,
సాక్షులు వినుఁ డెల్లవారు సభ్యులు మీరల్. 3

క. అని సంతోషమ్మున యమ
తనయునిఁ బట్టంబుఁగట్టి తమ్ములతోడన్
జను డింద్రప్రస్థంబున
కనఁగా, సభమోసె జయజయ నినాదంబుల్. 4

మ. ధృతరాష్ట్రానుమతిన్ యుధిష్ఠిరుఁడు, శ్రీకృష్ణుండు, తోబుట్టువుల్,
సతియున్ మాతయుఁ దోడరా; సురనదీ జాతుండు, ద్రోణుండు, బం
ధు తతుల్, దీవనలియ్యఁగాఁ, విదురుఁ డెంతో ప్రీతి వీడ్కోల్పనా
తత సంరంభముతోడఁ జేరెనతఁ డింద్రప్రస్థమున్ వేడ్కతోన్. [5

క. వ్యాసానుమతముచే నట
వాసమునకు దగినచోటఁ బద్మాక్షుఁడు తా
శాసింప, మయుఁడు గట్టెను,
వాసవ నగరోపమాన భవనంబొకటిన్. 6

శా. మిన్నొత్తంగల కోటలున్, శరనిధిన్ మేటిల్లు ఖేయంబులున్,
ఔన్నత్యంబున శీతశైల శిఖరా లట్లొప్పు సౌధంబులున్,
విన్నత్తంజను వజ్రగోపురములున్ వీథుల్ మహావాటికల్,
చెన్నైయున్న హ్రదంబులున్ సరసులున్ జెల్వారు సప్పోటిలోన్. 7

క. ఆపురి రవిచంద్రులగతి
నాఁపుట గుడిగోపురములు, నాసరినుడుమన్
దోసపడి యెడమై నడచుట
చూపడు నేఁటికిని దివినిఁ జూచితి మేనిన్. 8

క. సహిమై రాట్సుతు లందఁగఁ
సహతేహాసద; మేడ లెక్కి దాములు చేతం
గ్రహియించుట, రవిచంద్రుల
గ్రహణం బనిరంతే! వేఱు గ్రహణము గలదే? 9

సీ. సాలభంజికలను, స్త్రీలను నాపురి
గురుతింపఁ గారాదు మరున కేని,
వెన్నెల యిది యని, వెలఁది న వ్విది యని
తెలిసి చంద్రుండైనఁ బలుకలేఁడు,
క్రొక్కారు మెఱుఁ గిది, కుల్కుకల్కి యిదంచు
వరుణున కును జెప్పఁ దరముగాదు,
వీణాస్వన మిదంచు, వెలఁదిగాన మిదంచు
నారదునకును గా దారయంగ,

తే. గీ. చిలుకపలుకును జిన్నారి చెలువపలుకు,
వలపు చెలిచూపుఁ బూవిల్తు వాడితూపు,
ముద్దుశశిమోము మురువగు ముగుదమొగము,
తలఁపఁగఁ రాదు సృష్టికర్తకును నచట. 10

క. సింగారమె పురియయ్యెనొ,
బంగారపువాన కురిసి బలిసెనొ? నిధులు
ప్పొంగి నవరత్న రోచులు
చెంగున నట వీచెనేమొ? చెప్పందరమే ?

క. ధనవంతులు, గుణవంతులు,
ఘనదాంతు లుదారమతులు గణనీయ గతుల్
మనెదరట మగలు; సాధ్వీ
మణులానగరమునఁ గల్గు మానిను లెల్లన్.

సీ. పతిభక్తి, పితృభక్తి, భ్రాతృ మాతృ స్వామి
భక్తి, సజ్జన సాధుభక్తిఁ గలిగి,
అతిథి యభ్యాగత, హిత, సతీ, సుత, గతి
హీనులందు సమాన హితముఁ గలిగి,
దానధర్మములందు జ్ఞానమానములందు
నీతినిష్ఠలయందు నెనరు గలిగి,
కమనీయ ధర్మార్థకామ మోక్షములందుఁ
గల్పనైన మూఢుని కన్నుగల్గి,
తే. గీ. ఇహసుఖములందు మదిని నిస్పృహను గల్గి,
పుత్రపౌత్రాభివృద్ధినిఁ బొందఁ గల్గి,
నిత్య శోభనములు గల్గి పవిత్రహంబు
వెలుఁగు చుందురు రాపురిఁ గలుగు జనులు,

మ. ఫలపుష్పంబులతో వనావళులు విభ్రాజిల్లు నెక్కాలమున్;
ఇల ముక్కారులు బండు పాడికలుగున్ వృష్టుల్ వడున్ బైరుప
చ్చలశోభిల్లు వసుంధరాతలము నిచ్చల్; జారచోరాది దు
ష్కలుషుల్ గల్గ; రకాలమృత్యువులు రోగంబుల్ జొరన్ జోవటన్

క. ఆరభటి శరధియగు పుర
ఘోరార్భటి మించ మీట గుణము నృపసుతుల్;
ఆరెంటిని వేదాధ్యయ
నారవముల మాటువార లాపురివటువుల్. 15

క. వణిజులు చేటలఁ బెట్టఁగఁ
దృణమటు పోఁదోయఁ గాంచి; తెలివిని శూద్రుల్
మణుల గవాక్షులఁ బోతు ర
గణితంబుగ ద్విజులయిండ్లఁ గనుఁగొని నిశలన్. 16

క. అది యింద్రప్రస్థపుర
మ్మదియే తనరాజధానియై రహియింపన్
అవిరా! యని జనులు ఘనులు
మది మెచ్చ యుధిష్ఠిరుండు మహిఁ బాలించెన్. 17

క. శాత్రవులఁ బోరిగెల్చుట
స్తాత్రంబే? యనఁగ, ధర్మసంభవుఁ డెలమిన్
ధాత్రినిఁ బాలించెను ని
శ్శాత్రవముగఁ దా నజాతశత్రుబిరుదుతో. 18

ఆ. వె. ఇట్లు కొంత కాలమేగఁగ "నారదుఁ
డింతలోనె వచ్చునిటకు, నతని
వాకులట్టు మీరు వర్తింపుఁ" డని పాండ
వులకుఁ జెప్పి శౌరి వోయెఁ బురికి. 19

క. తనవోయిన కొన్నాళ్ళకుఁ
జనుదే నారదుఁడు నెదురుసని పాండవు లా
మునిఁ దెచ్చి యర్ఘ్యపాద్యము
ల నిడ సుఖాసీనుఁ డగుచు లలినాతఁ డనె౯:- 20

చ. పరతర ధర్మమూర్తులరు పార్థివచంద్రులరిట్టి మీకు నే
గుర కొకధర్మపత్ని సమకూరెఁ బురాకృతముంట; మీకు నీ
తరుణికతంబ విప్రియము తార్కొనఁగూడదు; మున్ను భ్రాత లి
ర్వురుఁ దమలోనఁ బోరి చనిపోయిరి కాంత కతంబ వింటిరే? 21

సీ. సోదరుల్ సుందోప సుందులు దైత్యులు,
ధాతను మెప్పించి తపమొనర్చి;
పరులచేఁ దమ కెందు మరణంబు గల్గని
వరమొండు వడసి గర్వమున, నరుల
సురల మౌనుల నెల్లఁ బరిభవింప దివిజు
లజునితో మొఱలిడ నతఁడుఁ దోడ
మయున కాజ్ఞాపింప మయుఁడు తిలోత్తమ
యను సతి౯ సృజియించె నాక్షణంబ;

తే. గీ. తిలసమానాను మణికోటిఁ దిద్దితీర్చి
తను వొనర్చుట నది తిలోత్తమ సమాఖ్యఁ
దనరె; జనిఁ గాంచి తొడన ధాతసభకు
సతి ప్రదక్షిణమును భక్తిఁ జలుపుచుండ- 22

క. మొలిపించె నలువ నలుగడ
నలుమొగముల నింతిఁగాంచ; నాకేశుఁడు మై
నిలువునఁ గనులు వడసె నన
జెలిసొబగే నొక్కనోటఁ జెప్పంగలనా ? 23

క. మొగ మెల్లఁ గన్నుగా ముని
లోగ్రిగిఁ జూచిరి; చెప్పవాల్ప నొల్లక దివిజుల్
తెగి కనిరి; మన్మ్మఖుఁడు గొ
ముగఁ గనె; గనెఁ బేసికన్ను మూసి హరుండున్. 24

ఉ. ఇంతి ప్రదక్షిణంబు ముగియించి విధాతకు మ్రొక్కి నిల్చినన్
గాంతనుగాంచి యాతఁ డను "కామిని! సుందుని వాని సోదరున్
భ్రాంతులఁజేసి వారలకు వారని వైరముఁబెట్టి దాన వా
రంతమునొందఁజేయుము మదాజ్ఞ యిదే" యని తన్పిఁబంచినన్.

క, సుందరి చని వింధ్యాచల
మందున నివసించుచున్న యసురవరుల నా
సుందోపసుందులను గనె,
నిందుముఖిని గాంచి యొడళు లెఱుఁగక వారల్- 26

ఁ. ఒక కంచమునఁ గుడుచుచు
నొకమంచముపైఁ బరుండి యొక మందిరమం
దొకపంచ నుండి మనువా
రొకయుదరమునుండి పండి యాడినవారల్

క. ఈ కాంత నాది యని యొకఁ,
డీకామిని నాది యనుచు నింకొకఁ డిటులన్
వాకాడి యిరువు రొక్కటఁ
దాఁకిడి చేకొనిరి నారి దక్షిణకరమున్.

క. "నవమోహిని! మాయిరువుర
నెవరిని వరియింతు సెప్పవే!" యని యన, నా
పువుఁబోఁడి మీర మీలో
నెవఁడు వోడిచినిలుచు వానినే యని యనినన్—

గీ. తగులుపడి వార లొండొరుల్ తద్దషాద్దు
లాడఖలెఱుఁగక పోరిరి కడిఁదిఁగడఁగి
కడకు మడిసిరి యిరువురు కఠినముష్టి
ఘాతనిర్ఘాతములను నానాతికొఱకు.

క. కాంతలు కారణముగ మతి
మంతులునన్ జెడుదు రగుట, మఱి మీరు సుధీ
మంతుల రొక్కసమయ మీ
యింతికిఁ గాఁ జేసికొనుటయే యొప్పును-నాన్.

సీ. నారదుపల్కు విచారించి పాండవుల్
తగునంచుఁ దమలోనఁ దలఁచి, వార
లొక్కరొక్కరితోడ నొక్కొక యేఁడుగాఁ
గృష్ణ వేశ్మ మగు గృహములందు
వరుసగా నుండ; నెవ్వని యింట సతియుండు
మఱినల్వు రచ్చోటి కరుగకుండ,
నెఱుఁగక చొరునాతఁ డెఱిఁగి ద్వాదశమాస
ములు తీర్థసేవల సలిపి పిదప
తే. గీ. వచ్చునట్టుల నమ్మునివర్యు నెదుర
సమయమును వార లేగురు సలిపికొనిరి,
నారదుం డేగెఁ; బాండుకుమారు లెలమిఁ
బుడమి నేలుచుఁ గాలంబుఁ గడుపుచుండ- 32

క. ఒకనాఁటి రేయిఁ బార్థుఁడు
నికటమునఁ గూకవినికి నెదురుగఁ జనఁగా
నొక విప్రుఁ డనె; ధేనువు
నొకముచ్చదె కొనుచుఁబోవు నోము" మటంచున్.

సీ. గోరక్ష భూసురుగో డుడుపుటయును
మించుధర్మములుగా నెంచి మదిని,
చనవిల్లు ద్రౌపదీ ధర్మజుల్ పండిన
యింట నుండుటఁ జింతనింతఁ జేసి,

మెట్టకేలకు లోనికేగి విల్లమ్ములఁ
గొనివచ్చి యాద్విజుఁ గూడిపోయి
ముగ్రిచ్చు వధించి విప్రునకిచ్చి గోవును
ధర్మపుత్రునిఁ గాంచి తనదు సమయ
గీ. భంగ మొనరించినట్టి యా పగిది వినిచి
వేఁడెఁ దాఁదీర్థ సేవన మాడఁబోవ;
ధర్మజుం డాడె ధర్మతత్పరత సల్పు
కృత్యము లె వేని పరతర కృత్యము లని. 34

గీ. నుడుగు జరుపనిచో వచ్చునడి యటంచు
నడికి మేలగు మృతియంచు నుడివి పార్థుఁ
డన్న యానతిఁ గొని, తోడ ననివినుతులు
రాఁగ వేగమ తీర్థయాత్రలకు వెడలె. 35

సీ. అఖిలపురాణేతిహాసముల్ వినిపించు
విప్రులచదువుల వీనులిడుచు,
ధరణీసురేంద్రులఁ బరమయోగీంద్రులఁ
గని మ్రొక్కి వారిదీవనలఁ గొనుచుఁ,
దీర్థంబులాడి నదీతోయములయందు
పిండోదకంబులఁ బితల కిడుచు,
నాగమోచితవిధి భూగోహిరణ్యాది
దానముల్ భూసుర తతికి నిడుచు

గీ. నిత్యనైమిత్తికములందు నియతిఁ గొనుచు
నతిథ యభ్యాగతుల హితమలరఁ గనుచు,
నిష్టమృష్టాన్నములఁ గ్రోల నిడుచు నడచి
తీర్థయాత్రలఁ బార్థుండు దివిరిసలిపె. 36

మ. ఒకనాఁ డాతఁడు స్నానముఁ జలిపి విధ్యుక్తంబుగా నాపగా
సికతోర్విస్థలి హవ్యకవ్యము లనుష్ఠింపన్ గనన్, నాగక
న్యక క్రీడావతివచ్చి పార్థుఁ గనికన్నారంగ; సూనాస్త్రుచే
వికృతాంతఃకరణాత్మయై రమణి నిర్విణ్ణాకృతిన్ నిల్చుచున్- 37

ఉ. "మారుని గేరురూపము సమానములేని విలాస వైఖరిన్
చేరలుమీఱు గన్నులును శీతకరున్ నగుమోము గల్గు, శృం
గారమనోహరాకృతిని గంటి నటంచని, యింద్రజాల వి
ద్యారభటిన్ నరున్ గొనుచు నంతిపురంబును నారి చేరినన్:-38

గీ. అతఁడు వీడక యగ్నికార్యంబుఁ దీర్చి,
కట్టెదుటనిల్చి కనుసతిఁ గనుచు నగుచుఁ:-
జాన! నీవెవ్వ రింతటి సాహసంబు
నేలఁ జేసితి? వనఁగ నబ్బాల యనియె:- 39

క. పేర నులూపిని, నాగకు
మారినిఁ, గౌరవ్య సుతను; మనసిజుచేతన్
బ్రేరేపితనై తెచ్చితిఁ
గూరిమి నను నీవ యేలుకొమ్మన, నరుఁడున్:-

క. ద్వాదశమాసిక మగువ్రత
మేఁ దవులుచుఁ దీర్థసేవ నేచ్ఛఁ జరింతున్,
నీదు మనోరథ మేగతి
నేఁ దీరుప నేర్తు? ననిన నింతి వచించెన్:- 41

క. నిన్నెఱుఁగుదు; మానాగుల
కన్నెలు నీయశముఁ బాటగాఁ బాడంగా
మున్నెఱుఁగుదు; ద్రౌపదికై
కొన్నవ్రతం బెఱుఁగుదాన, గుణరత్ననిధీ!-

ఆ. కారణాంతరమునఁ గైకొన్నవ్రతమును
బ్రహ్మచర్య మనఁగఁ బాడికాదు;
సకలధర్మములును జాలవందురు ప్రాణ
దానమునకు నాకు దాని నిమ్ము! 43

క. అని ప్రార్థించు నులూపినిఁ
గని ప్రేమఁ దదీప్సితమును గడదీర్చెను, నా
వనితకు సద్యఃకాలం
బున ననిరావంతుఁ డనెడు పుత్త్రుఁడు వొడమెన్. 44

క. ఆరాత్రి చన; నులూపియె
చేరుపఁగాఁ బార్థుఁ డపుడె చేరెను గంగా
తీరము; తనతో వచ్చిన
వారగు భూసురుల కెల్ల వార్తను వినిచెన్. 45

అతఁ డటనుండి బ్రాహ్మణులతో నైమిశా
రణ్యంబుఁ జొచ్చి నారాయణుఁ గని
తరలి యందుండి యుత్పలిని నాగాశికి
నందన, నపనందనలను గాంచి,
గయ గంగలఁ గని, గంగావార్ధి సంగమం
బును డాసి చని క్షేత్రములను గనుచుఁ,
బోవుచుఁ బోవుచుఁ బూర్వసాగరతట
ముననుండు పురుషోత్తమునకు మ్రొక్కి,

గీ. దరసిచని మహేంద్రగిరి, గోదావరిని గని
తరలి భీమేశ్వరమును శ్రీగిరినిఁ జూచి,
తిరిగి దక్షిణ సాగరతీర మెల్లఁ
గాంచి కావేరి శరధిసంగమముఁ గడచి- 46

చ. మునికొని పోయిపోయి పదుమూఁడగుమాసమునందుఁ జేరెఁదా
మణిపురమన్న పట్టణము; మాన్యుఁడు తత్పురరాజు చిత్రవా
హనుఁడు సమాదరించె నరు; నా ప్రభుపుత్రినిఁ గాంచి కోరు న
ర్జునునకుఁ జిత్రవాహనుఁడు చూపి తదీయ తనూ విలాసినిన్-47

ఉ. ఇది చిత్రాంగదనామకాత్మసుతయి ద్దేవపుత్రుఁడున్ బుత్రియున్
ఇదిమావంశపరంపరాగతము సుమ్మీ! యొక్కరే పుట్టుటౌ,
టిదిమావంశము నిల్పఁగాఁ జనును; నట్లీకాంత కీయుంకు వీ
యఁ దలంతేనిఁ గుమారి నిత్తు ననఁగా నట్లొప్పి పెండ్లాడుచున్-

ప॥ 46 పా॥ 9 అ॥ 2- రి; అ॥ 15 రిఁగని;
ప॥ 47 పా॥ 1 అ॥ 2- ను; ప॥ 48 పా॥ 3 అ॥ 4- వం;

క. హరుషమున సతియుఁ బతియును
బరఁగుచునుండంగ బభ్రువాహనుఁ డనఁగన్
వరసుతుఁడు గలిగె; వారల
నరుఁ డట విడిసాపె ముందునానాయాత్రల్: 49

క, దారిని బోవుచుఁ గాంచెను
భారద్వాజాది తీర్థ పంచక; మందున్
నీగాడదలఁచి దూఁకెను
సారామలభక్తి సవ్యసాచి ముదమునన్. 50

ఉ. ఒక్కొకతీర్థమందుఁ గల యొక్కొకగ్రాహము తాఁకి పట్టఁగా
నుక్కడఁ జంపెఁ పార్థు; డవియొప్పఁగ నచ్చరలై ముదంబుతో
మ్రొక్కుచు "శాపమోచనముఁ బొందితి మేగెద" మంచుఁబల్కి తా
రక్కడినుండి నాకమున కభ్రపథంబున నిర్గమింపఁగన్. 51

క. అకడ విడివడి చనిచని
గోకర్ణముమీఁద దారిఁగొని పశ్చిమ ర
త్నాకరముదరిఁ బ్రభాస
ప్రాకటతీర్థంబుఁ జేరి పార్థుండంతన్- 52

♦ సుభద్రా పరిణయము, ♦

క. ద్వారక తత్తీర్థమునకుఁ
జేరువనే యుండు టెఱిఁగి శ్రీహరిఁ జూడం
గోరి; తిలోత్తమ సొబగును
మీరిన దని విని సుభద్ర మీఁది మమత చే- 53

క. మూఁడఁగ సతిముదవును, బలు
కాడఁగఁ బ్రియమారఁ, బెండ్లియాడి యిరువురన్
గూడుచు నాలుం మగలుగ
వేడుక సంసార సౌఖ్య వీచులఁ దేలన్- 54

చ. మదిఁ దలపోసిపోసి మెటు మార్గముగానక దేవదేవునిన్
సవనుని సర్వరక్షకుని సర్వనిరంతను సాక్షిసాక్షి, శ్రీ
ప్రదు, మఘవాది దేవగణ వందితపాద సరోజు, భక్తిమై
మదిసిఁ దలంప నర్జునుఁడు, మాధవుఁ డచ్చట నిల్చె ముందటన్.

సీ. భూరి జపతపముల నేండ్లు బూండ్లుఁ గొలువ
సుర మునుల కేనిఁ గనరాని పరముఁ డట్టె
ఫల్గునుం డెంచు మాత్రానఁ బాఱివచ్చెఁ
బార్థగత జన్మనరతపః ఫలము గాదె? 56

క. వచ్చి హరి నరునిఁ గౌఁగిట
గ్రుచ్చఁగ, నెద నట్టె చొక్కుఁ గొనియెను నావి
వ్వచ్చుం; డది కని కృష్ణుఁడు
వృచ్చెను ధారలుగఁ గనుల మోదాశ్రువులన్, 57

క. తాఁ దేరి నరుఁడు హరిఁ గని
"ద్వాదశ మాస వ్రతంపు ఫల మిది మీ శ్రీ
పాదయుగము దర్శించితి
నాదుమహా భాగ్య మేమొ నారాయణ" నాన్. 59

చ. ముసిముసినవ్వి శౌరి యను ముద్దులముచ్చటలాడ నెంచితో?
పొసఁగె సుభద్రయోగమది! పున్నెము చాలఫలించె తీర్థయా
త్ర సలుపు కారణంబు మెయిఁ దాలుపుమా జడదారి వేసముల్
సుసమయ మిద్ది ద్వారకను జొత్తము మానివి కమ్ము రమ్మనల్ 59

ఆ. మాధవుండిదేమొ మర్మోక్తు లాడెడు
నామనంబు నరసి నాఁడొ? సర్వ
మెఱుఁగువాఁడు నన్ను నెఱుఁగఁడే? భ్రాంతి నా
కేల జరుగుచెల్లఁ గృష్ణలీల!. 60

క. యతి కమ్మనె నేకతమో?
మతిచలనము మానుపించు మతమో? వ్రతమో?
సతిశుద్ధాంతముఁ జొరనగు
యతికే యని తెలుపుపథమొ? హరి కది హితమో? 61

క. ఉడుగక యాతం డెటువలె
నడపిన నటు నడచువాఁడ నాకేమిటి కీ
గొడవ యని కపటయతియై
వెడలెను నిశ్చింత నరుఁడు వెన్నుని వెనుకన్. 62

ఉ ద్వారక చెంత రైవతక పర్వతరాజముఁ జేరి రాత్రి న
వ్వారట నిద్రఁ జేసిరి, ప్రభాతముకా నరుసం దెడించి వేఁ
జేరి పురంబు రైవతక సేవకుఁ గృష్ణుఁడు చాటఁ జేసినన్
బౌరులు సంభ్రమం బెసఁగఁ బర్వతయాత్ర కుపక్రమించుఁడుర్ 63

క. యదు భోజాంధక వృష్ణులు
సుదతీ సుత సహితు లగుచు సుఖయానములం
దుఁ దనరుచుఁ జనిరి; యాన ని
నదములు చదలంటె వాద్యనాదము లొఱలెన్. 64

క. సారణ, సాత్యకి మొదలగు
వీరవరులు యదుకుమార వితతియు హలియున్,
శౌరియు వేర్వేఱుగ రథ
వారముల్ జనిరి వార్ధి పఱతెంచెనొ నాన్.

ఉ. అందఱికన్నముం దఱిగి యంపల మాపటి వీడి, దేవకీ
నందనుఁ డానగాంతరమునన్ దనుగాచెడు క్రీడితోడుతన్
బొందుగఁ జేరి గేరుచును, ముచ్చటలాడుచు మానివేష మిం
పొందె నటంచు నవ్వుచు మహోత్సుకతన్ విహరింప నచ్చటన్. 66

ఆ. హాలియు మిగతవార లాఁగిరి వేఱొక్క
నెలవునందు డిగిరి; చెలులతోడ
నల సుభద్ర గిరిని నర్చింపఁగా నచ్చె,
హారియు నరుఁడుగూడియాడు కడకు. 67

క. అంచలపిండులో? బిసుల
సంచుల ముట్టింప నెగసి చను మిణుగురులో?
పంచాయుధు తేజీలో?
మించులొ, నా వచ్చుచున్న మెలఁతల నడుమన్- 68

క. సురుచిరమణి కంకణ నూ
పురకింకిణి కుచవిహార ముక్తాహారో
త్కర కాంచి ఘంటికా సు
స్వర సూచితయై సుభద్ర వచ్చె నచటికిన్. 69

ఉ. ఉల్లము పల్లవింపఁ గను లొక్కటమూఁతలువార దిగ్భ్రమం
బల్లనఁ బైకొనంగ నరుఁ డాహరి నెయ్యపు గోష్ఠి మాని, మో
మెల్లను నేత్రయుగ్మముగ నింతినిఁ గాంచి సుభద్ర నిక్క మీ
ఫుల్లసరోజనేత్ర యని పొంగుచు విస్మయమందు చుండఁగన్ 70

ఉ. కామవికారుఁడైన నరుఁగన్గొని వెన్నుఁడు వెన్నుఁ దట్టి "మా
స్వాములవారికన్ను యదుబాలికపైఁబడె మేలు మేలు! క
న్గాము విరాగితత్వమును" నా, నరుఁ డౌదల వాల్చినిల్చె, సు
త్రామజుఁగౌఁగిలించుకొని తామరసాక్షుఁడు పల్కెనిర్మలిన్. 71

క. ఓడకుము నీయభీష్టముఁ
గూడంజేయంగనుంటిఁ గౌతుకకు మని తా
నాడఁగ; బలదేవాదులు
నాడకు రా, దవ్వులఁగాంచి హరి తక్షణమే- 72

క. కౌఁగిటిపార్థుని విడి, యటె
సాగిలిపడి నరునిపాద జలజముఁ బట్టెన్;
వేగము చని హరిఁ గని, హాలి
చాగిల్లెను యతిపదముల సాష్టాంగముగన్. 73

ఆ. మ్రొక్కి నిలిచి శౌరి మోడిచి కరముల
హరిని గనుచుఁ బలికె యతులు వీరు,
మాటలాడఁబోరు మౌనవ్రతమటంచు
నిలను వ్రాసి నాకుఁ దెలిపినారు. 74

ఆ. అనియె శౌరి; పార్థుఁ డౌనని తలనార్చి;
హస్తయుగళి మోడ్చి యతిని మునలి
వేఁడె తనదు పీట విడిసి తా నిచ్చెడు
పూజ లెలమిఁ గొనఁగ నోజమీఱ. 75

ఆ. నరుని జూచి భక్తి నారాయణుఁడు వల్కె
" నగ్రజుండు నాకు హలి యితండు;
మీర లితనికోర్కెఁ దీరుప నగు " నన,
మౌని యూఁచెఁ దలను "మౌని" యనఁగ. 76

మ. వచనంబుల్ బచరించి యెల్లరును నాపై ద్వారకన్ జేరఁగన్
బ్రియమొప్పన్ బరిచర్యలాయతికి గావింపన్ సుభద్రాసతిన్
నియమించెన్ హలి కృష్ణుసమ్మతిని, నన్నీ రేజపత్రాక్షి తా
భయముల్ భక్తి నయంబులున్ గదుర సేవల్ చేసెనమ్మౌనికిన్

క. దినమొకపరి బలభద్రుఁడు
చని మునిదర్శనముఁజేసి చను; హరి తఱినిన్
జని యేకాంతము సురపతి
తనయునితో నాడు నెడప దడప నుడుగకే. 78

మ. మెఱుఁగుఁదీవనుబోని యాతరుణి తా మిట్టాడుచున్ జుట్టుచున్
బరిచర్యల్ దగఁజల్పఁ జూచి మది విభ్రాంతుండునై మానిసుం
డరుఁ డా యాతఁడె దేవతార్చనను నిత్యాగ్నివ్రత ప్రక్రియన్
మఱచున్ మంత్రముమధ్య మోహమతి గామా! ప్రోవుమా యం-

సీ. కట్టెదురన హరి ఘనవిగ్రహమెగాని చనుఁ(79
చూపు సుభద్రసై చూచుచుండు,
నోట మంత్రము దాఁటు పాటి యయ్యెనుగాని
మదనతి స్మరణంబు మానకుండు,
నక్షుల హరిమూర్తి నద్దిమ్రొక్కునుగాని
చెలి నెమ్మొగముననే తలఁపునిలుపుఁ,
బడఁ జల్లు నరవిరుల్ ప్రతిమనెత్తిన గాని
యతివ కాంతతలఁబ్రాలటంచు నెంచుఁ,
గీ. గొనును హరిపాదతీర్థంబు వనజనేత్రి
మోవిపానకముఁగ నెంచి మోహవశత;
నద్దు శ్రీపాదరేణుక నలదు నెదకుఁ
గాంతకుచలిప్త కస్తూరిగంధ మనుచు. 80

క. యతి యిట్లతినియతిని సతి
మతిఁ గొని నిముసంబు యుగము మాదిరి గడపున్;
యతివరురూపాసతిమతి
ధృతిఁ దూలిచి భ్రాంతఁ జేయుఁ దృటిదృటిఁ దిటమై. 18

చ. యతిఁ గనకున్న నోరువ దహర్నిశముం గనుఁగట్టి చూచు సా
యతివ తపించు విన్కలిని నర్జునునే వరియించి యున్న నా
మతి యిటు సాధ్విప్రవృత్తి కనుమానము దెచ్చె. నితండు నిక్కముం
యతియొ? మహాల్యకై యతిసమాకృతిఁ గొన్న సురేంద్రుసూతియో?

క. తండ్రి గుణంబులె సుతునకు
నం డ్రితఁడును నేర్చెనొక్కో యాబుద్ధులనే?
తీండ్రించు రాజతేజం
బీండ్రింపరె యిట్టియతులు నింతుల నిసిసీ! 83

క. కనిమెద నని యొకనాఁ డా
వనితామణి మునిని డాసి భయభక్తుల సే
వనఁ జేసి నిలిచి పలికెను
మునివర! మిమ్మొక్కవిషయమునఁ బ్రశ్నింతున్. 84

ఉ. దేవరవారు చూడని ప్రదేశము లుండవు ధాత్రిలోపలన్,
వావిరి మీరు పాండవుల పత్తన మీవలఁ జొచ్చియుంటిరే? .
శ్రీవిలసిల్ల నాన్నృపులు సేమముగా మనువారె? కుంతియున్
ద్రోపదియున్ సుఖాంబునిధిఁ దోఁగుదురే? యతిలోకశేఖరా!

ఉ. అత్తటఁ దీర్థయాత్రవిధిమై ధరఁజుట్టెడునంట! కొత్తరూ
పెత్తిన చిత్తజాతుఁడఁట! యింద్రునిఁ జంద్రుని మించుకీర్తిసం
పత్తి జగత్త్రయిన్ వెలయువాఁడఁట! యర్జునుఁడంట! నాకు మే
నత్తకుమారుఁడంట! యెట్లైనను గంటిరె? వార్త వింటిరే?- 86

క. ఎక్కడ నెక్కడఁ దిరుగునొ?
చిక్కెనొ యాకటను నిద్రచెడి వెతఁబడెనో?
అక్కట! సుకుమారత్వము
[illegible] 87

క. అనఁ; బార్థుఁడు ముసిముసినగి
యనె; నింద్రప్రస్థమందు నరుసం బెసఁగన్
మనవారలు మనువారలు;
వనితా! మనయింట నరుఁడు వసియించుఁ గదే! 88

క. అన; భ్రాంతిని "నరుఁ డెది? యెది?"
యన; "నదె యదె" యనుచు జూపె నతఁ డొకదెస; నా
వనిత యటు దిరుగ, నాక్షణ
మున సతికరమున్ గ్రహించి ముద్దిడె నరుఁడున్. - 89

చ. సతి విద లింపఁ దత్కరముస్పర్శము చేయుటఁ, జెమ్మగిల్లి యా
తతకుచకుంభముల్ గగుర్లెఁ;దన్మయతన్ మెయివొంగె; బాలయా
యతి నరుఁడంచులోఁ దలఁచి యందెలు గల్లన గుండె జల్లనన్
యతి వెలవెల్లవో వడిన నల్లన నల్లన నిల్లుఁ జేరఁగన్- 90

క. ఇది కని సత్యారుక్మిణు
లది మున్నె వినుటకతన నచ్యుతువలనన్;
బదరి సుభద్రను మఱి ముని
పదసేవకు నునిచి హరికి వార్త వినుపఁగన్- 91

చ. నరుఁడుసుభద్రయున్ బ్రణయ నవ్యసుధాంబుధిఁదొప్పదోగుటన్
హరివిని, పార్థుతోడఁ బని నంతయుఁ జెప్పి, మృగోత్సవంబుకై
యరుగఁగ నెల్లవారలు నియామక మాపురిఁ జాటనిచ్చి, వే
యరిగి హలిప్రధానులగు యాదవులెల్లరుఁ దోడఁగూడి రాన్ -92

క. అంతర్ద్వీపముఁ జేరెను;
యంతఃపురమందు విడుట యతిసేవకు న
క్కాంత సుభద్రను నరుఁ డే
కాంతమునసతిగ గ్రహించె గాంధర్వవిధిన్. 93

మ. యతివేషంబును వీడి యింద్రసుతుఁ డుద్యత్కార్య సంరంభుఁడై
సతితోఁగూడి,రథాధిరూఢుఁడయి తాసాపెన్ బ్రయాణంబు నా
గతి కడ్డంబయి నిల్చి సైనికులు " మాకన్యన్ గొనెన్ధూర్తుఁడీ
గతి బాధ్యం" డని కూడి కూకలిడి వికాంతిన్నరున్ దాఁకినన్-

ఉత్సా. వారినెల్ల సవ్యసాచి పాఱఁదోలె ననిమొనన్; 94
తేరుఁ దోలె నాసుభద్ర తీరి సారథిగ; మహా
వీరసైన్య వారమెల్ల వీడిపాఱెఁ గలన; నా
వీరపత్ని వీరబలుఁడు వెళ్ళి వీఁడుఁజేరఁగన్- 95

ఉ. వచ్చిన యానవధూవరులఁ బాండవు లాపుర పౌరముఖ్యులున్
జెచ్చెరఁ దామెదుర్కొని యశేషమహా విభవంబుతోడుతన్
దెచ్చి గృహంబుఁ జేర్చిన యుధిష్ఠిరముఖ్యులకున్ బుధాళికిన్
అచ్చికఁ గుంతికిన్ బ్రణతులర్పణఁ జేసిరి నూత్నదంపతుల్ 96

క. వా రిడి రాశీస్సుల; మన
మారంగ సుభద్ర కృష్ణ యదుగులకు నమ
స్కారములిడ; దీవన లిం
పారఁగ నిడి కృష్ణ నరుని యదుగుల మడఁగెన్. 97

---

ప॥ 95 పా॥ 2 ఆ॥ 1- దే; ప॥ 96 పా॥ 2 అ॥ 4- దా;
ప॥ 97 పా॥ 4 అ॥ 16- డిఁ;

సీ. కృష్ణ నాలింగనముఁ జేసి యిందిరసుతుఁడు
సాధ్వి! నీయాజ్ఞ లేక యీసతినిఁ గొంటిఁ
బతియగుట నన్ను మన్నించి; సతిసుభద్రఁ
జెల్లెలుగఁ జూడు " మనఁ గృష్ణ చెప్పె నిటుల- 98

గీ. నాథ! యుపచితి నాకిది; నన్ను మీఱ
లక్ష్మి కొనసానె? నేను మీయడుగుదాసిఁ
గానె? హరిముద్దుచెలియ లీకాంత చెలిమి
కలిమిఁ గంటిని మీయనుగ్రహపు బలిమి. 99

క, ఈగతిఁ బాండవు లత్యను
రాగంబుఁ బరస్పరంబుఁ బ్రకటించి ముదా
వేగమునఁ బార్థు దిగ్విజ
యాగమనపు ఘోష నెఱపి రాప్పురి నెలమిన్. 100

చ. అట హలి ముఖ్యు లిందిరసుతుఁ డట్లు సుభద్రఁ బరిగ్రహించి వి
స్ఫుటగతి విక్రమంబెసఁగఁ బోయె ననన్ విని మెల్ల యాదవుల్
అటమట లొంది కూడుకొని యర్జును తాఁక నుపక్రమింపఁగాఁ
బటుశరముల్ ధరింప; హలి పద్మదళాక్షునిఁ గాంచి యిట్లనున్-

చ. మునియయివచ్చి ప్రచ్ఛగుచు మోసము చేఁగొనిపోయెఁ జెల్లెలన్
ఘనమె యీయకృత్యములు గట్టికి? మాకును లోకువయ్యె; నే
మవె? మనయాదవాన్వయసుధాబ్ధి కళంకితమయ్యె! కృష్ణ! యీ
యనయుని గిమిచేసిన నయంబగు నా హరి నవ్వి యిట్లనున్. 102

ప॥ 99 పా॥ 2 అ॥ 2- ఊ; పా॥ 4 అ॥ 12- హపు:
" 102 పా॥ 4 అ॥ 5- నే;

చ. భరతకులాబ్ధిచంద్రుఁ డగు పార్థుఁడు మేనమఱందలిన్ స్వయం
వరగతిమై గ్రహించుట [illegible]? యిద్ది నృపాళి ధర్మమా!
మఱి మన పూర్వబాంధవము [illegible] లోకువయే? సమర్థుఁడై
నరుఁడు తగన్ భరించె నిది నాతల నీతల నున్న భారమున్. 103

క. ఏకమయి సురలు డీకొన,
నీఁకను జీకాకు పఱచు విజయుం డాజిన్,
నీకును నాకును సాధ్యుఁడె?
యీకాని తలంపు మాను, మిఁకఁ బనివినుమా! 104

తే. గీ. మేమె యటకేగి వారల సేమ మరసి
చెలిమి నాటించి పెండిలిఁ జేయవలయుఁ;
బాండవుల యాదవుల బాంధవంబుఁ బెంపఁ
బరఁగు న్యాచేత ధర్మదేవతకె యూఁత!- 105

మ. అని, భోజాంధకవృష్ణియాదవులతో నాదేవుఁడాయత్తుఁడై
చని, కౌంతేయుల పట్టణంబు దరియన్; సంరంభులై వచ్చి, తో
డ్కొని యాపాండవు లుత్సవం బెసఁగ వీడున్ జేరి యన్యోన్యమున్
బ్రణతాశీర్వ్యపగూహన ల్సలిపి రిర్వంకల్ మనః ప్రీతితోన్.106

తే. గీ. వారు వీరును సంతోషవార్ధిఁ దోఁగి,
[illegible] శుభముహూర్తంబునందు,
నర సుభద్రల పెండిలి జరిపి రెలమి
దెసదెసలయందు తమ జస మెసక మెసఁగ, 107

క. యాదవులకుఁ బాండవులున్
యాదవు లాపాండవులకు నాదర సత్కా
రాదులు సలుపఁగ వీడ్కొని
యాదవు లా ద్వారకకుఁ బయనమై రేలమిన్. 108

క. హరి యింద్రప్రస్థంబున
నరుతోడన నిలిచియుండి నానా గతులన్
మరియాద[illegible]న్నలతో
నరుస మనెడు కడలిఁ దేల్చె నాపాండవులన్. 109

గీ. నరునకు సుభద్రకుం గల్గె నందనుండు
అసమ రణవిక్రమక్రముఁ డమలయశుఁడు
ధీరుఁడభిమన్యు నాముఁడు దివ్యమూర్తి
పాండవాన్వయ వారాశి పార్వణ శశి! 110

క. సుతజననోత్సవ సంభ్రమ
మతిని యుధిష్ఠిరుఁడు చేసె మహి కొండాడన్
క్షితి, గో, ధన, ధాన్యాది వి
తత షోడశ దానములను దగువారలకున్. 111

క. ఆ పాపడు శ్రీ కృష్ణ కృ
పాపాత్రుం డగుచు వేద పాఠాదుల ధౌ
మ్యాపాదితుఁడై వెలసెను;
దీపింప మహాస్త్రవిద్యఁ దేజెఱ బితచేఁ. 112

తే. గీ. పాండవులయందు పాంచాలి వరుసమీఁఱ
శూరుఁ బ్రతివింధ్యునిఱ, శ్రుతసోమ నాము,
నెఱని శ్రుతకీర్తినిఱ, శతానీకు మఱియుఁ
బడసె శ్రుతసేనునిఱ సుత పంచకమును. 113

క. సుతులుఱ సతులుఱ దల్లియు
క్షితియు విభూతియును విమల కీర్తియుఁ దనరఱ
నుతియింప బుధులు ధర్మ
స్థితిఁ బాండవు లేలి రిలను జెన్నలరారఱ. 114

## ♦ ఖాండవ దహనము. ♦

ఉ. మిట్టపు గుండఁ గ్రీడి హరి మించు తమిఱ యమునా మహానదీ
ఘట్టసువీచి శీతల సుఖంబును గోరి యుధిష్ఠిరాజ్ఞ చేఁ
బట్టి మహేంద్ర ఖాండవపుఁ బార్శ్వమునందొక చంద్రకాంతపుఱ
కుట్టిమ దివ్య వేదిపయి గోష్ఠిని [illegible] నట్టివేళలోఁఱ — 115

క. ఎట్టనయి పండువాఱిన
బిట్టారుచు నిట్టనిక్కు పెద్దయొడలితో
మిట్టైన మేక తత్తడి
నుట్టూగుచు వచ్చె విప్రుఁ డొక్కఁడు చటికిన్. 116

ఉ. వచ్చినవిప్రసత్తముని వారలు గాంచి నమస్కరించినన్
మచ్చిక దీవనల్ సలిపి మాన్యులు మీరలు దృప్తిగాఁగ నా
యిచ్చకు మెచ్చు భోజనమునిం డన నాతనిఁ గాంచి వారు నీ
మెచ్చెడుయోగిరం బెదియొ మే మిడనుంటిమి చెప్పు మంచనన్ 117

క. ఏనగ్ని నగుదు, నింద్రుని
మానిత ఖాండవము మెసవ మదిఁగోరితి నాన్,
లో నచ్చెరువడి పార్థుఁడు
దానినిఁ గూలుఁతువ దేల ధర్మాత్మ! యనన్- 118

ఉ. శ్వేతకి నాన్నృపాలకుఁడు చేసెను వర్షశతంబు సధ్వరం,
బాతఱి నేను హవ్యమగు నాజ్యముఁ గ్రోలుటచేత జాడ్యమున్
ఆతతశక్తిహీనతయు నంటగ, నే నజుఁ జేరి వేఁడినన్
ధాత నచించె ఖాండవము దాహముగాఁ గొన; నే దదాజ్ఞపై 119

శా. నానాసత్త్వగతిన్ మహౌషధతతిన్ నవ్యంబునౌ ఖాండవం
బే నంతన్ భుజియింపఁ బూనఁ గని దేవేంద్రుండు మేఘంబు లె
న్నో నాపైఁ బరపించి వర్షములచే నొప్పించెఁ నే నేడు మా
హానంగాఁజని నిష్ఫలుండనయి తద్వ్యాపార భారంబునన్ 120

క. మొఱ వెట్టితి ధాత్రను; నతఁ
డరసి మదిని. కృష్ణపార్థులన నాదిమునుల్,
నరనారాయణులుర్వరఁ
బరఁగుచు నీకోర్కెఁ దీర్చువా రని నుడివెన్. 121

ఆ. నాఁడు మొదలు వేచి నాఁడను మీకునై;
తనదు ప్రియసఖుండు శ్వేతకాహ్వ
యాగవనంబునందు నధివసించుటఁ బ్రాణ
మ్రాఁకు దానిఁ బ్రోచు నమర విభుఁడు. 122

మ. అనఁ; బార్థుండను వజ్రినేని ననిలో నాకట్టుఘోరాస్త్రముల్
ఘనమై యున్నవి, మద్భుజాబలిమి కాఁగన్ జాలు కోదండ మొ
డను వో దివ్యరథంబు నశ్వములు లే; వవ్వానినిన్ నాకుఁ, గృ
ష్ణునకున్ శస్త్రములియ్యనిన్నుఁబరితుష్టుం జేతు మంచాడినన్. 123

చ. వరుణు నుతించె నగ్ని; వెస వచ్చి యతం డటు నిల్వ, వహ్ని తాఁ
గరములు మోడ్చి భూరితర గాండివ, మక్షయదివ్యబాణముల్
నరజననాశ్వవారథముఁ బార్థునికియ్యఁగఁ; జక్రమున్ గదన్
హరి కిడ వేఁడెః నవ్వరుణుఁ డప్పుడు వారల కిచ్చి యిట్లనున్:-

మ. అజనిర్మాణము నై శశాంక కర సేవ్యంబౌచు నన్ జేరె. నీ
భుజవీర్యంబున కొప్పునిద్ది కొనుమీ పొల్పారు గాండీవమున్;
త్రిజగంబుల్ వెగి తాఁకినిల్చినను నిర్విఘ్నంబుగా నోర్చునో
విజయా! యక్షయదివ్యబాణనిధు లివ్వే పూను మే నిచ్చితిన్.

క. శ్వేతాశ్వవాహ్యమై కపి
కేతనమై భయద రవ నికృత్తాహితరాట్
చేతనమై, దిగ్విజయో
పేతం బగురథముఁ గొనుము విభవం బెసఁగన్. 126

మ. అని; శ్రీకృష్ణునిఁ గాంచి "కోటిరవి దీవ్యద్భ్రాజమానంబునై
చను, శత్రుక్షయ కారియై, శరణరక్షాదీక్ష దక్షంబునౌ
ఘనచక్రంబు, సుదర్శనంబును, గదన్ గౌమోదకిన్, ధీరతన్
గొనుమా! పంచిన కార్యమున్ జలిపియేగున్ గర్త చేదమ్మికిన్"

క. అని యిచ్చిన హరిపార్థులు
గొని "నిర్జరకోటితోడ గోపతి సమరం
బునకెత్తి వచ్చె నేనియు
నినుఁ గాతుము గడఁగు మింక నీవని" కనినన్- 128

క. తవిలి హుతాశనుఁ డావని
రవులుచు నింతింత చుట్టు ప్రక్కలఁ గడలన్,
జివచివఁ బ్రాకుచుఁ బూర్ణము
గవలఁగొనుచు ఖాండవమును గాల్పఁ గడంగెన్. 129

ఉ. నింగికి నేల కేకమయి నిల్చి వనంబును వహ్ని కాల్పఁగా
బంగరు కొండవ్రక్కలయి వాటి పెకీలని మ్రోగసాగెనాన్
చెంగున నాలుకల్ దెసలు చేరఁగఁ జాచుచు ఖాండవంబులో
నం గల యెల్ల పక్షిమృగ నాగసమూహముఁ గాల్చెఁ బెల్లుగన్.

గీ. శౌరి చక్రము చేఁబూని, సవ్యసాచి
దివ్యగాండీవధారియై తివిరి యుభయ
పార్శ్వముల నిల్చి రక్షింపఁ, బావకుండు
ఖాండవ వనంబు దహియించు చుండె నెలమి. 131

క. వనరక్షకసైన్యం బా
యనలము నార్పంగ రాఁగ నర్జునుఁ డంతన్
ఘననిశితశర పరంపరఁ
దునిమె; ననలుఁ డనిలుఁగూడి దుర్భరుఁ డయ్యెన్. 132

క. సురుచిర ఫలపుష్పాంచిత
తరులున్ వరగంధనృత్తకేలి శిఖిఁ గూలెన్;
సురగరు డాదులుఁ గమరిరి
నరశర, హరిచక్ర, వహ్ని నాల్కల సెగలన్. 133

క. కాలెడు ప్రాణులఘోషలు,
వ్రీలెడు తరుగిరుల యుఁయిలు, వినుచను పక్షుల్
జ్వాలఁబడి కూయురొదలును
జాలెన్ దిగ్దంతికర్ణ జాలము చీల్పన్. 134

క. సలసలఁ గ్రాఁగెడు సరసుల,
వెలవెల నై దగ్ధదేహ వితతులతోడన్
గళగళలాడెను జ్వలనుఁడు
పలురకముల నుడులు నొడలు వడసిసలీలన్. 135

చ. దివిజులు విన్నవింప విని దేవవిభుండు మహోగ్రహార్ధతిఙ్
జవజనఘోరవారిధర సంచయముఙ్ బఱపించి వర్షముఙ్
తవులఁగఁ జేయ, దివ్యశరధార గృహాకృతి పార్థుఁ డానరిఙ్
హావణికఁ జేసి మేనఁ జినుకాడఁగ నీయక నిల్పఁ గాచినఙ్. 136

గీ. ఆవనిని నున్న యహిసుతుఁ డశ్వసేనుఁ
డడలి తనతల్లి పుచ్ఛంబు నంటి దివికి
నెగయఁ గనుఁగొని పార్థుఁ డాశుగము ద్రుచ్చె,
తల్లితలఁ ద్రెంచె నది; పిల్ల తప్పిచనియె. 137

క. అప్పగిది నశ్వసేనుఁడు
తప్పి శరమునుండి దివికిఁ దరలఁగ, నలుగుల్
గుప్పింప మఱలఁ జూచెడు
నప్పార్థుని నాఁపె వజ్రి యద్భుత మాయఙ్. 138

మ. సురనాథుం డురివోసి శస్త్రవితతిఙ్ సుక్కింపఁగా నేయఁగా,
నటికెఙ్ వాని సుతుండు; వేఁ గదిసి పైనఙ్ దూఁకనుంకింపఁగా
సురగంధర్వులు; కృష్ణపార్థులొకటై జోఁకార చక్రింపు దు
ర్ధరధారాగతి, బాణసంహతిని పాఱఙ్ మొత్తి పెల్లార్చినఙ్. 139

క. దిక్కేది దేవనాథుం
డుక్కిరి బిక్కిరియయి మది యోచన సేయఙ్,
ఒక్కరవ మెసఁగె గగనఁపు
దిక్కున; విని నాకవిభుఁడు దిగ్భ్రాంతుండై :- 140

ప॥ 136 పా॥ 3 అ॥ 1- ద; ప॥ 137 పా॥ 4 అ॥ 1- ఁద:
ప॥ 139 పా॥ 4 అ॥ 14- బా; ప॥ 140 పా॥ 3 అ॥ 8- గగనపు;

మ. నరనారాయణు లాదిమానవరు లోనాకేశ! వీ రెన్నఁగా;
సురదైత్యప్రతిఘాతమం దసురులన్ సృక్కించి మి మ్మేలరే?
తరమే వీరల నోర్వ? నీసఖుఁడు నెత్తత్ తెలియుండు నా
కురుభూమిన్ సుఖమొప్ప;ఖాండవమిటుల్ కూలెన్ విధాతేచ్ఛమై'

సీ. అదివిని నాకేశుఁ డాశ్చర్యమగ్నుఁడై
యాలింగనముఁ జేసి హరిని నరుని;
పరికించి పార్థుని వరము వేఁడు మనంగ
నస్త్రంబు లిమ్మని యతఁడు గోరె;
అమర లోకేశుఁ డైంద్రాస్త్రంబు మొదలుగా
నర్జునునకు నిచ్చి యచ్చు వడఁగ;
హరిఁ జూచి " నరుచెల్మి ననవరతంబును
వీడకు " మని,వారి వీఁడుకొనియె!

గీ. అంత హరి పార్థు లత్యంత హర్ష మొంది
సింహ గర్జలఁ గడిమిన్నై జేయ, దాని
ఘాటి దిగ్దంతి కర్ణముల్ పోటులెగసి
పాటవము చెడి చెవుడు సంప్రాప్తమయ్యె. 142

క. ఆసమయంబున ఖాండవ
వాసి యసురశిల్పి మయుఁడు వనము వెడలిరాఁ
జేసి హరి చక్రమెత్తిన;
వాసవి శరణంబుఁ జొచ్చె వాఁడు భయమునన్. 143

ప॥ 141 పా॥ 3 అ॥ 12- ఢనౌతత్; ప॥ 142 పా॥ 3 అ॥ 1- ఐ:
ప॥ 142 పా॥ 8 అ॥ 8- వీడు; పా॥ 10 అ॥ 10- మెఁజేయు:

క, అనుచుఁ గృతాంజలియై మఱియుఁ
డనఁగా హరిమోముఁ బార్థుఁ డవలోకించెన్,
మనమున నిం తాలోచనఁ
గని వనజాక్షుండు మఱుమొగంబును గనుచున్- 4

ఆ, అట్లు నీకుఁ బ్రీతినైన నీకురుపతి
ధర్మనందనునకుఁ దగినయట్లు
మూఁడుజగములందు నీ వెన్నఁగా రాని
కొలువుకూట మొండు నిలుపుమనిన- 5

ఉ. వల్లె యటం చతండు "వృషపర్వునికై సభ నొండుగూర్చుచోఁ
దొల్లి చిరత్నరత్నములఁ ద్రోసితి బిందుసరోవరంబునన్
గొల్లగ వానిఁ జేర్చి యొనగూర్తు యుధిష్ఠిరుకొల్వుకూటమున్
ఎల్లసురాసురుల్ నరులు నెంతయువిస్మయ మంది చూడఁగన్. 6

క. వాసిగ ఘో్మవిజయంబును
జేసి, మహాశంఖమున్ విచిత్ర గదన్ దా
వేసెను వృషపర్వుఁడు ము
న్నాసరసిని వానిఁ దెత్తు నవి మీ కిత్తున్. 7

చ. అనుచు హరిన్ యుధిష్ఠిరుని నర్జునువీడ్కొని యామయుండు వెం
టనె చనె; ద్వారకావతికి నందకుమారుఁడు వోయె; శిల్పితాఁ
జనిచని ప్రాఙ్ముఖుండయి వెసన్ రజతాద్రికి నుత్తరాశయం
దున గల శ్రీహిరణ్యవరదుర్గపుశృంగశిలాతలంబునన్- 8

సీ. ఎచ్చోట భూతేశుఁ డీరేడుజగముల
సచరాచరము సృష్టి సలుపఁగల్గె,
నెచ్చో భగీరథుం డెంతేఁ దపంబును
బచరించి గంగను బడయఁ గల్గె,
నారాయణుండను నరుఁ డనుమును లెందు
నురుజపతపముల నుండి రెలమి,
గురుతర మగుదీక్ష సురనరశేఖరుల్
సత్రయాగాదులఁ జలిపి రెందుఁ
గీ. జై
చెలఁగి యెచ్చోట రత్నవిచిత్రయజ్ఞ
శాలలును స్వర్ణమయయూపజాల మెసఁగు,
శ్రీమహావిష్ణు వెయ్యేడఁ జేసెఁ దపము
నట్టి యాబిందుతీర్థము నరసె శిల్పి. 9

గీ. ఆసరసిలోన దాఁచినయట్టిదివ్య
పరికరము లంది యాతండు పురికి వచ్చి
యెసఁగ సుముహూర్తమందునఁ బొసఁగ నిలిపె
శంఖమును దేవభూసురార్చనలఁ జలిపి. 10

గీ. కనకమణిమయస్తంభముల్, కక్ష్యములును
కుడ్యములు, దూలములు, దివ్యకుట్టిమములుఁ
బొసఁగఁ బ్రాకారములు, వేదు లెసఁగఁగాఁ, గ
వాటములు దీర్చె నాకొల్వుకూటమందు. 11

---

ప॥ 9 పా॥ 9 అ॥ 1- చెఁ: ప॥ 11 పా॥ 2 అ॥ 1- గు:

ఉ. కృత్రిమ మైనద్వారములుఁ గృత్రిమకక్ష్యలు వేదికుడ్యముల్
కృత్రిమమాసరస్సులును గృత్రిమవారిచరంబు లెంతయున్
గృత్రిమదుర్గముల్ వనులు గేవలసత్యము లంచుఁ దోఁచుచున్
జిత్రముగాఁగఁ జూపరులఁ జిత్తము తత్సభభ్రాంతిఁ గొల్పెడిన్.

మ. ఫలపుష్పాంచితమై నిరంతరము శోభన్ గూర్చునుద్యానముల్;
నెలపై నిల్చి సరస్సులన్ జలచరానీకంబు వీఁకారెడున్;
చలువల్ గాలియు నెండ హాయినిడునిచ్చల్;దివ్యసౌరభ్యముల్
మలఁయున్; ద్రిమ్మరిచిత్తమున్ దనుపుచుంపారున్ గనన్ దత్సభన్

గీ. దశసహస్రకరంబుల దనరు చదురు [13
విరివిని; సహస్రకరవిభావిలసితముగ
దివ్యతరమణిఘృణులచేఁ దేజరిలుచు
కొలువుకూటంబు దెసదెసల్ వెలుఁగఁగాంచె. 14

సీ. ధర్మరాజున కాశిల్పి దానినొసఁగి;
వైరివిపళనదక్ష మాభూరిగదను
భీమునకు నిచ్చి; శత్రుహృద్భేదకరవ
మై దనరుశంఖము నొసఁగె నర్జునునకు- 15

మ. త్రిజన్మోహన మాసభాభవన ముద్దీపింపఁ, బౌరోహిత
ద్విజబంధువ్రజమంత్రిమిత్రతనయస్త్రీయుక్తుఁడై స్వస్తివా
గ్జయాశీస్సులు దివ్యవాద్యములు మ్రోయన్ మంచిమూర్తంబునన్
విజయంచేసి యుధిష్ఠిరుండు కొలువొప్పెన్ నిర్జరేంద్రుండు నాన్.

---

ప॥ 12 పా॥ 3 అ॥ 20- దోఁ; పా॥ 4 అ॥ 4- గాఁ; పా॥ 4 అ॥ 9- లచిత్తము;
ప॥ 13 పా॥ 3 అ॥ 1- జ; ప॥ 16 పా॥ 1 అ॥ 1- త్రిజగన్మో;

క. కొలువుండి ధర్మతనయుఁడు
సలిపెను ధరఁబాగడ షోడశము లగుదానం
బుల; మధురభక్ష్యభోజ్యం
బుల విందొనరించెఁ దృప్తిఁబొందఁగ జనముల్. 17

మ. సరగన్ సప్తసముద్రముద్రితధరాచక్రంబునన్ గల్గు భూ
వరు లత్యుత్తమహేమరత్నచయముల్ భద్రేభఘోటంబులన్,
వరవీర్యధ్వజినీవితానముల, సద్వస్త్రప్రకాండంబులన్
బరఁగన్ గాన్క లొసంగి కొల్చిరి సభాభద్రాసనున్ ధర్మజున్. 18

సీ. మహితమార్కండేయ, మాండవ్య, శౌండిల్య,
కౌండిన్య, మైత్రేయ, కౌశికులును;
నాత్రేయ, దాల్భ్య, రైభ్యక, కణ్వ, గౌతమ,
శునక, మౌంజాయన సువ్రతులును;
బక, సిలీవాక, భాలుకి, కుత్స, హారిత,
పైల, పర్ణాద గోపతిమునులును;
శఠ గోప వేషులు, ఘట జానక వ్యాస
హారిక, యాజ్ఞవల్క్యాది ఘనులు;
గీ. సత్వ, జతుకర్ణ, తిత్తిరి, జైమిని, శుక,
వరబలీవాక, లుక, మందపాల, వాయు
భక్ష్య, భార్గవముఖ మానివరులు, ధర్మ
సుతుని సభకేగి మిగుల సత్కృతులఁ బడసి- 19

ప॥ 19 పా॥ 1 అ॥ 1- మ; పా॥ 2 అ॥ 11- లును: పా॥ 12 అ॥ 12- భక్ష్య:

క. కోరిక వేదోపనిష
త్సారపురాణేతిహాసధర్మంబుల నా
భూరమణమణికిఁ దెలుపుచుఁ
గూరిమి దీవించి వీడుకొనుదు రనిశముఁ. 20

♦ నారదుఁడు రాజసూయముఁజేయ ధర్మజునకుఁ
దండ్రియాజ్ఞను దెలుపుట. ♦

సీ. తనముఖదీధితి దినమణికోటితే
జంబు డిందించి కరంబు వెలుఁగఁ,
దనకడగంటిచూడ్కినిఁ గరుణావీచి
దోఁబూచులాడుచుఁ దొనకుచుండఁ,
దనహాసవిన్యాసఘనమోహసరసిలో
మునుకొనిలోకముల్ మునిఁగి తేలఁ,
దనదివ్యగానామృతమున మ్రోళ్లు చిగుర్పఁ,
గరఁగియేఱులుగ దుర్గములు పాఱ,

గీ. తనవచోధార వేదతత్త్వంబు దనర,
నరుస రైవత పర్వత పారిజాత
వరమునీంద్రులు పార్శ్వముల్ పట్టిరాఁగ
దేవముని నారదుం డరుదెంచె నటకు. 21

క, వాసవు బ్రత్యుత్థానముఁ
జేసి మునికి మ్రొక్కి తెచ్చి, చెలు వగుపీఠిన్
వేసి. సుఖాసీనునిగాఁ
జేసి విభుం డర్ఘ్యపాద్యసేవల సలిపెన్. 22

---

వ॥ 21 పా॥ 9 అ॥ 1- ఁద; వ॥ 22 పా॥ 1 అ॥ 1- వాసిగఁబ్ర;

క. నారదముని దీవన లిడి,
భూరమణుని గుశలప్రశ్నముల నడిగి, ప్రియం
బారఁగ క్షత్రియధర్మపు
మేర లరసి, మంత్రితంత్రమితి వివరించెన్. 23

సీ. బంధుమిత్రులపైనఁ బాటింపఁదగుకూర్మి;
క్రిందియుద్యోగులయందుఁ బ్రేమ;
మంత్రులతోఁ సల్పుమంతనంబులరీతి;
యరులందు వర్తింప నగువిధంబు;
ప్రజపట్ల జేఁడు చూపఁదగువాత్సల్యంబు;
నీతినిష్ఠల నంటి నెగడుక్రమము;
ధర్మరక్షణపరత్వము, వేదశాస్త్రాను
శోధనం బాంతర్యశుద్ధిబుద్ధి;
గీ. ధర్మకామార్థమోక్షసంధానదీక్ష,
శాంతిదాంతిదయాశీలసత్యనియతి,
ఈగి, కష్టసహిష్ణుత, భోగ, భక్తి
విధుల ధర్మజునకు వినిపించె మౌని. 24

చ. మునిఁ గని ధర్మజుండు కరముల్ ముకుళించి నటించె"ధర్మమం
దనయము బుద్ధినిల్పియున్న తాధ్వగుఁడెప్పుడుఁగాక, త్వాదృశుల్
విని చెడుసత్యమార్గమున వేదమతానుగతిన్ జరించుచున్
మనిమెదఁ జుండి! మీకృపఁ బ్రమాదము చేరనిమానసస్థితిన్."

క. అనఁగా "నీకుఁ బ్రమాదము
లును గల్గునె, ధర్మతనయ! లోకేశ్వరుఁడౌ
ననజాక్షుఁడె నిను నీపను
లను దిద్దుచునుండ; సుకృతరాశివి సుమ్మా! 26

గీ. అనఁగ "మునివర! సాధుసజ్జనులయాశి
షము లై, నను వృద్ధినొనరించె; సర్వలోక
రక్షకుండైన హరియనుగ్రహము గలిగె;
భవదసమసత్కృపాదృష్టిభాగ్య మిదియ- 27

క. మునివర! యిది మయ నిర్మిత
మనగుసభయు, కాంచినారె? ముల్లోకములం
దునఁ గలుగు కొలువుకూటము
లను గంటిరి! దీని దెట్టిలా గగు నొక్కో?- 28

క. అనుధర్మజుపల్కుల విని,
ముని కని యాకొల్వుకూటమును గనులారన్;
గనుఁగొని ధర్మజునానన
మును గడుఁగౌతుకము మదినిఁ బొదల వచించెన్- 29

చ. "ఇదియ యమానుషంబుసుమి! యిద్దియపూర్వమహావిచిత్ర సం
పదవిభవోజ్వలోన్నతము, భాసురరత్నచిరత్నశోభ, ని
ట్టిది మఱియొండు గల్గుట కడింది జగంబులమూఁట నెందునేన్
మదిఁగన నీదుభాగ్య మసమానము; మాధవజీవబాంధవా! 30

ఉ. కాంచితి దేవనాథుసభఁ, గాంచితి నగ్నియమానిలాళిది
వ్యాంచితమా సభాంగణము, లాకమలాసనుకొల్వుకూటమున్
గాంచితి; నవ్వి యీసభకుఁ గావు సమంబులు; గాంచ నెంతయున్
మించెడుసుంద రాకృతి నమేయవిభావిభవాదికంబులన్. 31

చ. మఱచితి నీకుఁ జెప్ప నొకమాట, యుధిష్ఠిర! నూపరేతరా
ద్వారసభ, నీదుతండ్రి యగు పాండు ధరాధిపుఁ డుండె,నన్ను దా
నరసి వచించె శక్రసభ నవ్యథసౌఖ్యము లొందువార, లే
ర్తెఱ ధర రాజసూయ మను దివ్యమఖం బొనరించినట్టిరుల్. 32

చ. ఇల కిటనుండి మానివర! యేగి, మదీయసుతుఁ యుధిష్ఠిరుఁ
సలుపఁగ రాజసూయము పెసఁ వినిపింపుము దాన నాకునుఁ
గలుగు దివంబు! మత్సుతు లగణ్యబలాఢ్యులు, దేవతావరం
బులఁ బెనుపారువారు, హరిపూర్ణదయాపరిలబ్ధవైభవుల్. 33

క. నా కగును పితృపితామహ
లోకముతోఁ పాటు నాకలోకప్రాప్తుల్;
నీకు నమస్కారము లివె!
నాకోర్కెను దీర్పు మనుచు నను బ్రార్థించెఁ. 34

గీ. దాని వినుపంగ వచ్చితి ధర్మతనయ!
దాన నీపితకగుదివి; ధరణిదిగ్వి
జయముతోఁ బాటు ధర్మరక్షణయు, యశము,
నిహపరంబులు నగునీకు నిద్ధచరిత! 35

క. అని పలికి వారి వీడ్కొని
చనె హరిసంకీర్తనంబు సలుపుచు, వీణా
స్వనమునకు నిజగళస్వన
మును జేరిచి, తాళమానముల, దాల్గరఁగఁ. 36

చ. మునిపతి పోవ; నాశమనపుత్రుఁడు, భ్రాతలు బంధుమిత్రులున్
దనరఁగ, వ్యాసధౌమ్యులునుదన్ బురిఁ గొల్వఁగ సల్పు యజ్ఞమున్,
మనమున నుబ్బుభక్తి మెయి మాన్యుని సర్వశరణ్యు భక్తపా
లను హరిఁ దోడి తేఁబనిచె, రమ్యరథంబును నాప్త నొక్కనిన్. [37

క. ఆతఁడు ద్వారకజని, హరి
కేతద్వృత్తాంత మెల్ల నేర్పడఁ దెలుపన్,
ఆతం డపు డారథమున
నేతెంచి మనోజవమున నిష్టులఁ గాంచెన్. 38

ఉ. కుంతికి నాయుధిష్ఠిరునకున్ బ్రియమారఁగ మ్రొక్కి, భీమున
త్యంతముఁ గౌఁగిటన్ బొదవి; యర్జున మాద్రితనూభవుల్ పదా
క్రాంతులు కాదయార్ద్రమతిఁ గాంచి; కరంబులు మోడ్చు ద్రౌపదీ
కాంతకు దీవనంబు లిడఁగా, హరికాసనమిచ్చి భక్తిమై- 39

గీ. అర్ఘ్యపాద్యంబు లిడి, సేమ మడిగి, ధర్మ
నందనుఁడు ప్రీతి దరిఁ జేరి, పొందిపొసఁగి,
మంతనములాడి రుక్మిణీకాంతుతోడ
వినయ మొప్పార నిట్లని విన్నవించె:- 40

చ. కల దొకవిన్నపంబు విను, కంజదళేక్షణ! దేవమౌని తాఁ
బలికెఁ, బరేతరాట్సభను బాండునృపాలుఁడు దెల్పెనంట, నేఁ
జలుపఁగ రాజసూయమును, స్వర్గసుఖం బొనగూడి సౌఖ్యమై
తనరెద రంట మత్పితృపితామహవర్గము, తత్ఫలంబుచే. 41

క. పితృసందేశ మవశ్యము
సుతులకుఁ దీర్పంగవలసి శ్రుతి ఘోషించున్;
సుతజన్మ ఫలముగా మ
త్పితృహితముగఁ గ్రతువొనర్పఁ దెలిసితి బుద్ధిన్. 42

క. జగదుద్ధారకమూర్తీ!
నిగమాగమవేద్య, నిత్యనిర్మలకీర్తీ!
తగ నీయాదేశమె నా
కగు విధి; తలపోసి యీవె యానతి! యనినన్- 43

(శ్రీ)కృష్ణుఁడు భీమార్జునులను జరాసంధు వధకుఁ గొంపోవుట. ♦

ఉ. శక్తుఁడ వీమహాక్రతువు సల్పఁగ; భ్రాతలు వీరు వీరులున్,
దిక్తటముల్ జయింపఁ గల ధీరులు; కాలముఁ గూడె, సేయు లే
యుక్తము; దుష్టనాశనము యోగ్యజనావనమున్ ఘటిల్లు; మా
శక్తులు ధారవోసెదము, సందియ మొందఁగ నేటికో ప్రభూ!. 44

క. అనఁ గృష్ణుఁడు; సభ్యులు నౌ
నని యాదట లూఁపఁ, దమ్ము లత్యుత్సుకులై
తను బురిఁగొల్పఁ, యుధిష్ఠిరుఁ
డనుమోదముతోడఁ గాంచె హరియాననమున్. 45

సీ. హరి యనె " విను! తొల్లి నపగతక్షాత్రమై
పరశురామునిచేత ధరణి యొప్పెఁ;
గననాఁటఁగోలె నిక్ష్వాకైలసంశముల్
దప్పఁ, గృత్రిమములై తగియెఁ గడమ

క్షత్రియ వంశముల్; సరియగు తొలిరెంట
నేకోత్తరశతంబు లెసఁగె; మఱియు
భోజ యయాతి సంపూజ్యవంశములచే
నొగిఁ జతుర్దశశాఖ లొలసె; నట్టి
గీ. క్షత్రియాన్వయములనెల్ల సాహసమున
నోడిచి, మూర్ధాభిషిక్తుఁడై యొప్పు నేఁడు,
నుక్కుదక్కి జరాసంధుఁ డొక్కరుండు;
వానిశౌర్యంబు వర్ణింప వశముగాదు.

సీ. శిశుపాలుఁ డవ్వానిసేనాని; యతఁడును
దుర్మదాంధుఁడు మహాద్భుతబలుండు;
మాయావు లాహవాజేయయోధులునైన
హంసడిభకులుఁ దదాప్తసఖులు;
వారల కాదంత వక్త్రుఁడు మిత్రుండు;
భగదత్తుఁ డమ్మ్యో నవ్వారిహితుఁడు;
నుగ్రచిత్తులు పురుషోత్తమ పౌండ్రిక
వాసుదేవులు నాకు వైరులగుచు
గీ. నాదుపేరునఁ గొల్చెద రాదురాత్మ;
కలభ, నకుల, కరూశ, సంకర్షణులును.
బారిని నష్టావశోద్దండభోజకులజు
లతనివశవర్తులై గొల్తురనుదినంబు

గీ. సారిదిఁ బాంచాల, పుష్కర, శూరసేన,
తతకళింగ, పుళింద, మత్స్యనరపతులు
వానిభయమున వీడుల వదలి, యందు
నందుఁ, దల దాఁచికొని యుందు రధిప వింటె! 48

ఉ. వానికి నల్లునిన్ గుటిలవర్తను, నీచుని, దుర్మదాంధునిన్
హీనునిఁ గంసు నేను వధియించుటఁ జేసి యతం డసూయచే
మానని వైర మూని, నను మాటికి మాటికిఁ బెట్టుఁ జిక్కులన్;
మానవనాథ! సి గ్గగును మాదురవస్థలఁ జెప్ప నల్వురన్. 49

ఆ. ఆయుధాళిని జావనిహంసడిభకు
లరుగుదే వెన్క, మధురానగరము వారు
ముట్టడించిరి; మే మని మొనను నిల్చి
"హంసుఁడు గతించె సమరంబునం" దటంచు- 50

గీ. వార్తఁ బంచిన, నదివిని, వాస్తవమని
"యిష్టునకుగాని యీజగ మేలనాకు"
నని వగచి, యమునాహ్రదమందు దూఁకి
చచ్చెడిభకుఁడు; హంసుఁడు సచ్చెనటులె. 51

గీ. ఆజరాసంధుఁ డిదియెల్ల నరసి, వగచి,
తోడు లేకుంట, ననిమొన వీడి, మిగత
సైన్యములఁ గూడి, వీటికిఁ జనియెఁ; గాని,
తటి యొదవినంత మమ్ముఁ దాఁ, దాఁకఁ జూచు. 52

మ. బలవంతుండు బృహద్రథాత్మజునితో వైరంబు భారంబు కాఁ,
దెలివిన్ మామధురాపురంబు విడి, విస్తీర్ణంబు లౌదుర్గముల్
గలుగన్ రైవతకాద్రిఁగట్టి,యచటన్ గాలంబుఁబోఁబుచ్చు చే
మలవోకన్ భవదాశ్రయంబున సుఖంబై యుండు మోభూవరా!

ఉ, ధారుణిఁ గల్గుభూపతులఁ దాఁజెఱవట్టుచుఁ దెచ్చి, నిత్యమున్
భైరవపూజ కై బలిగ వారల నొక్కొకనిన్ వధించు బల్
కూ్రరత! వానిఁజంపనగు; గూడు భృశంబు యశంబు, రాజ్య; మి
ట్లారయ రాజసూయమఖ మన్నివిధంబుల మీకు శ్రేయమౌ.

చ. భరతుఁడు, కార్తవీర్యుఁడు, విభాస్వరుఁ డామరుతుండు, సద్యశో
భరితుఁడు యౌవనాశ్వుఁ, డతిబాహుబలంబున, బుద్ధిసంపదన్
బరఁగిరి సార్వభౌములయి; భద్రయశోనిధి! నీవు వారికిన్
బరుడుగ వత్తువన్నిటఁ, బ్రభూ! మగధేశుఁడు నీకు లెక్కయే? [55

ఆ. భాగ్యశాలియైన, బలశాలియే యైన
గర్వబుద్ధిఁ బరులఁ గలఁచునట్టి
నెడఁగు చెడును విగతవిభవుఁడై! దుర్మదు
నొద్ద లక్ష్మి నిలుచునొక్కొ? యధిప! 56

క. అన; భీముడు :– జయము, ధనముఁ
బను లారంభించికాక, పడయం గలఁడే
ఘనుఁడైన? నల్పుఁడైనను
పనిగొని ఫలమొందుఁ జీమవలెఁ గర్మఠుఁడై. . 57

చ. హరిఁ గని ధర్మజుండు "దనుజాహిత! విశ్వమునందునిన్ను సం
గరమునఁ దాఁకి నిల్చెనె యొకండు? దురాత్మునిఁ బెద్దచెప్పె, దే
వరణి నజేయవిక్రమము కల్గెను వానికి? వానిపుట్టువే
తెఱఁగొ? సవిస్తరంబుగను దెల్పు "మనన్ మురవైరియిట్లనున్

సీ. వినుము, బృహద్రథుం డనుమగధేశుండు
సతు లిర్వు రుండి, సంతతియె లేక
వని కేగి, కౌశికుం డనుతాపసుని వేఁడఁ
దపసి కనుమ్మని హస్తంబు సాప
చూతఫలం బొండు చేత వ్రాలిన, దాని
మంత్రించి తేనికి నాని యొసఁగె;
సగసగంబుగ దాని సతులకుఁ బతియిచ్చె
నది తిని గర్భిణు లైరి వారు

గీ. ఒగిని నవమాసములు నిండి యొక్కకన్ను
నొక్కచెవి చెక్కుముకు బొడ్డు నొక్కచేయి
పాదపార్శ్వంబులుగ; నిరువ్రక్కలగుచు
నుద్భవించినఁ గని తల్లు లద్భుతముగ- 64

క. కని రెండు శకలముల, మదిఁ
గొని యేపమువారు, వానిఁ గొని యెందేనిన్
జని త్రోయఁ జెప్ప; దాదులు
గొని చనియవి త్రోసి రొకట గుప్తస్థలిలోన్, 65

ప॥ 63 పా॥ 2 అ॥ 5- దాఁకి; పా॥ 3 అ॥ 1- క; ప॥ 64 పా॥ 5 అ॥ 1- (జాత్త;

గీ. అందు నివసించు జర యనునసురి, వానిఁ
గొని చనఁగ నెంచి ప్రియ్యలఁ గూర్చియదిమి
యెత్తికొనఁబోవ నారెండు నేకమగుచుఁ
గలసి బాలకుఁ డయ్యె రక్కసియు దాని- 66

గీ. ఎత్తికొనఁ జాల బరు వైనఁ, దత్తఱిల్లె;
బాలకుం డేడ్చె; విని రాణివాస మటకు
వచ్చె;నది కనితేఁడును వచ్చె; నసురి
కామరూపిణి, యొకదివ్యకాంత యగుచు- 67

క. భూపునితో నను నీసతు
లీపుత్రుని రెండు ముక్క లిర్వురుఁ గని, తా
రీపురి వెలుపల వైనఁగ
నాపై నేవానిఁ గలప నర్భకుఁడయ్యెన్- 68

క. కొను మీసుతు నం చిచ్చినఁ,
గొని తనయు బృహద్రథుండు కుతుకముతో ని
ట్లను "దనుజవె? మావంశం
బును నిలిపిన మాదుపుణ్యమూర్తివి కావే?

మ: అని పూజించి జరన్, దదాజ్ఞఁగొని తేఁ డాబిడ్డతో పీఁటికిన్
జని, భార్యాద్వయిఁ గూడి పేరిడె జరాసంధుండునా వానికిన్
ఘనతేజంబున వాఁడు నగ్నివలె వెల్గంజాలె దుస్సాధ్యుఁడై,
చనఁ గొన్నేఁడులు గౌశికుం డటకురా సామాత్యు సామోదియై.

క. ఎదురేగి తెచ్చి యమ్ముని
పదములఁ బ్రణమిల్లి యర్ఘ్యపాద్యాది విధుల్
పదపడి తీరిచి; సుతుఁ ద
త్పదమునఁ బడవైచి, మీకృపా భాగ్యు నెక- 71

క. ఆశీర్వదించి బిడ్డని
గాశికుఁ డానృపునిఁ గాంచి " కరముపకృతి రా
కాశి యొనర్చెను సుమీ! ధర
ణీశా! నే యోగమహిమ నిజము నెఱిఁగితిన్. 72

సీ. వీఁడు కుమారుని తేకువఁ గనువీఁడు
శివుని వరంబునఁ జెలఁగు మిగుల;
పక్షులలో నెల్లఁ బక్షీంద్రుఁ డైవడిఁ;
తేజస్వులందు నాదిత్యుభాతి,
నిలఁ గల్గునృపులలో వెలుఁగొందు బలుపొంది
యతులి తాప్రతిహత మైన బలిమి,
దివ్యాస్త్రములు వీనిఁ దెగవ్రేయఁగా నోప;
వేఱు లద్రులఁ ద్రోయు నేరనట్టు;
గీ. లబ్ధి నదులను జేకొనునట్టు లితఁడు
పర నృపులసిరులఁ గొను; నని పలికి మౌని
వెడలె; రాజ్యాభిషిక్తుఁ గావించి సుతుని
తప మొనర్పఁగఁ జనె బృహద్రథుఁడు వనికి- 73

ప॥ 73 పా॥ 3 అ॥ 1- ఖ; పా॥ 10 అ॥ 6- సిరిఁగొను; ప॥ 12 పా॥ 1 దప;

తే. ఆజరాసంధుఁ డటమీఁద, హంసడిభకు
లను సహాయులఁగాఁగొని, యనయవృత్తి
సలిపె, నాహంసడిభకులు జచ్చెన, వీఁడు
పక్షముల్ దెగినఖగేంద్రుభాతి యయ్యె. 74

చ. ఇతఁడు మహాస్త్రశస్త్రముల నేమిటఁ జాలినయట్టు లాయుగా
పతి వరమంటఁబట్టి యిటునర్థి లె; నీకనుసన్నయైన, నా
తతభుజవిక్రముండు బలదర్పవిపక్షమదేభసింహ,మా
హతిఁగొను మల్లయుద్ధమున నొక్కట భీమసృసింహుఁ డెల్లెజా.

సీ. పార్థుగాండీవబలమును, బవనతనయు 75
బాహుబలమును, నానీతిబలముఁగలుగ,
నిమ్మహి నసాధ్య మున్నె? నశ్చమ్ము దేని
భీము నర్జును బంపు నావెంట నిపుడు. 76

క. అని హరి వలుకఁగ, భీమా
ర్జును లుత్సుకతయు మొగములఁ జూపఁగ, యమసూ
నుఁ డనుమోదముతో ని
ట్లను హరిఁ గని నీకు "మాయులాడంగల నే?" 77

సీ. పరమపురుష! పరాత్పర! వాసుదేవ!
శిష్టరక్షణ సురగణసేవ్యచరణ!
నీదయాదృష్టిబలముచే నెగడుమాకు
సాధ్యములు గానివున్నవా జగతియందు? 78

క. అనుజులనె యేల, నన్నే
పనుపుము నీయిచ్చవచ్చుపనులకు; శిరమం
దునఁ దాల్చి నీయనుజ్ఞను
జని సల్పెదఁ; బొండు వేగ సనుదెం డనినన్- 79

♦ స్నాతకవేషధారులై కృష్ణభీమార్జునులు మగధలోఁజొచ్చుట; భీమునితోఁ బోరి జరాసంధుఁడు చచ్చుట. ♦

మ. కృతకస్నాతకులైనభీమనరులున్ గృష్ణుండు నాఁటేనియా
నతిమైఁ బోవుచుఁ గాలకూటమును, శోణన్, గండకిన్, మార్గసం
గత మాల్శ్రీసరయున్, భగీరథిని వేగన్ దాఁటుచున్, బ్రాగ్దిశా
గతులై యమ్మగధప్రదేశమును వీఁకన్ జేరి, వా రంతటన్-80

ఆ. పంచగిరులమధ్యఁ బరఁగు గిరివ్రజ
మనుపురి దెసఁ, జైత్రికాద్రిశిఖరి
ముప్పు రెక్కి; రచటిమూఁడు భేరులఁ జూపి
హరి నచించెభీమనరులతోడ- 81

ఆ. కనుఁడు, మానుషాద మను ఋషభంబును
జంపిదానిదివ్యచర్మమొలిచి
కట్టి రివ్వి మగధుపట్టణంబున వింత
వారు చొచ్చిరేని స్వయము మొఱయు. 82

చ. మునిపతి గౌతముం డిటుల మ్రోఁగ వరం బిడె; గాన మున్నె యీ
నినిఁ దెగద్రెంప మే లనిమె; నేరిమి ముప్పురు మూఁడుభేరులన్
దుమదుకలుచేసి, చైత్యగిరిదుర్ధరశృంగముఁ ద్రోసి, ద్వారమున్
గనుఁగొనిచొచ్చి యందు గలకావలివారలఁ జంపి పెంపునన్.83

ప॥ 80 పా॥ 2 అ॥ 4- (బో; అ॥ 21- మార్గసం:
ప॥ 83 పా॥ 3 అ॥ 1- దుమ్ముకలు;

సీ. పురవీధి, విపణులఁ జొరఁబడి, చందనా
గరుమాల్యములఁ గొని కరముబలిమి;
సరభసంబున మేనఁ జర్చించి, ధరియించి,
త్రేతాగ్ను లన దివ్యతేజ మెసఁగ;
గోష్ఠంబులకు జనుకొదమసింగములట్లు;
కొలనిలోఁ జొరు నేన్గుగున్నలట్లు;
రాజమార్గముఁ బట్టి, రాజసవృత్తిమై
పుడమి వడంకగా, నడుగులిడుచు

గీ. రాజవర్యులు, స్నాతకవ్రతులు, వస్త్ర
ధారు, లారాజనగరునఁ దరియఁ, గాంచి
విస్మయంబంది, తమలోన వివిధగతుల
గుజగుజలువోయి రెల్లెడఁ, బ్రజలు పురిని. 84

మ. నిసిలోనైనను, స్నాతకావనినురానీకంబు నర్చించు, నా
యసమానవ్రతుఁడైనమాగధుఁడు మాయావిప్రులం దెచ్చి సం
తసమారఁ మధుపర్కమీయఁ గొనకే తన్జూచు వీరత్రయిఁ
నసి సంవీక్షణఁజేసి, యిట్లను జరాసంధుండు ధీసాంద్రుఁడై- 85

ఉ. స్నాతకులేని, యఁంగడులచందనమాల్యము బల్మిఁ జేకొనం
జూతురె? మాపురంబు నిటు చొత్తురె, చైత్యకశైలశృంగముఁ
ఘాత మొనర్చి, మార్గమునఁగాక, యమార్గముఁబట్టి? భేరిసం,
ఘాతము వ్రక్కలింతురొకొ? కావలివారల సంహరింతురే? 86

ఆ. భక్తి నే నిచ్చునీమధుపర్క మిట్లు
గ్రహింపఁగ నొల్లమికి నేమికతమొ? మీరు
వేషధారులు గానోపు, వీరరాజ
దేహతేజంబు లివ్వి సందియముగూర్చు! 87

మ. అనఁ; గృష్ణుం డను "స్నాతకవ్రతము బ్రహ్మాక్షత్రి వర్ణంబులో
న నె; యీరెండవవార మేము; నెటినెన్న ధాత్రి నద్వారమం
దునఁ జేరఁదగుశత్రుపట్టణములందుఁ, క్షత్రియుల్ బల్మిమై
చను శ్రీయుండుట గంధమాల్యముల నోజం గొంట నవ్వీడులన్. [88

గీ. అన; జరాసంధుఁ డను నీకు నహితత మేను
జేసినది లేదు; ద్విజదేవసేవకుఁడను,
బరమమహాక్షాత్రధర్మపరివర్తనుండ
శత్రుఁ డెట్లైతి నన, నవ్విశౌరి నుడివె:- 89

ఉ. ఉత్తముఁడైన క్షత్రియుఁడ వౌకొ? సవర్ణులబల్మిఁ బట్టి దు
ర్వృత్తిని దేవతాబలిగ నిచ్చెద; వీచెడుజీవహింస లే
నత్తములైనవారికి విషాదముగూర్చవు? నీసురార్చనల్
రిక్తలు; పాపకర్మ! విపరీతమతీ! నిను నోర్వనచ్చునే? 90

గీ ధర్మరక్షణదీక్షిత ధరణిఁ బరఁగు
మేము, నిను నిగ్రహింపంగ నీమ మూని
వచ్చితిమి! కృష్ణుఁడేన! బీభత్సుఁ డితఁడు;
పవనజుఁ డితండు నీకు పాండవులు కంటె! 91

మ. చెఱలోఁ బెట్టినరాజులన్ విడుము! నీసేమంబుకై చెప్పెదన్,
మఱి సన్మార్గుఁడవై చరింతు ననుచున్ మా కీవు మాటిచ్చినన్
సరి; లే దంటివ, వీ రుదగ్రమతులై సంగ్రామరంగంబునన్
బొరివుచ్చంగలవారు నిన్ను వినుమా. మూర్ఖాధమా! యంచనన్. [92

గీ. తతజటోత్పాటనాగ్రహోదగ్రసింహ
మట్టు, పటుకుటిలభ్రుకుటిసంఘటితనిటలుఁ
డయి, జరాసంధుఁ డాశౌరి నట్టెచూచి
వెఱకుతీవయె పదములఁ బెనసె నౌర! 93

చ. అని, తనమంత్రులన్ గనుచు నాఁడు "నితం డెవఁ డంచు మీ మదిన్
గనితిరో? మాకునల్లుఁ డగు కంసుని యుల్లుఁడు! దేవకీసతీ
తనయుఁడు; మాకుమన్మఁడు; ప్రతాపముతోఁ బదిమార్లు తాఁకి మ
మ్మనినిఁ, బలాయనుం డయినయట్టి మహాభుజవీర్యధుర్యుఁడున్-

ఉ. గండఁడు నాలకాపరుల; గణ్యుఁడు చోరవరేణ్యులందునన్; [94
పండితశేఖరుం డగుఁ బ్రపంచమునన్ గలవంచకాళిలోన్;
మిండఁడు గొల్లబొట్టెలకు; మేటియు పిల్లనగ్రోవినూఁద, దే
వుండు నహోమపాత్ములకు భూసుర భిక్షుక దీనజాతికిన్. 95

క. సుతవైధవ్యవిషాదా
తతవహ్నినిఁ గృష్ణరుధిరధారల నార్పన్,
క్షితిఁ బిండముఁ దన్మాంస
ప్రతతినిఁ గంసునకు నిడఁగ భాగ్యంబయ్యెన్- 96

క. అని, కనిభీమార్జులను;
జను నే పసివార్లీరు, సమరంబునకున్
గొని తెచ్చె మాయగొల్లఁడు;
సనుఁడీ! మఱి బురికి, ననికిఁ జాలదు రే? యనన్- 97

క. విని కనిసిభీముఁడను:- నీ
యనయఁపు బలుకులనుమాను, మని మొనలోనన్
గనఁబరతుకాని శౌర్యం
బును; వాక్పౌరుషములాడఁబోలునె? యనినన్- 98

క. మీ రొకరొక్కరొ, ముగ్గురు
జేరికగాఁ బోరువారొ; చెప్పుడు; మీకే
ఘోరశస్త్రంబులు నలయునొ?
కోరుం డను మాగధునకు గోవిందుఁడనున్- 99

ఆ. ముగురు నొక్కనిఁ దాఁకుట తగవుగాదు;
ఒకని మాయందు నీమది కొప్పువానిఁ
గోరికొ మ్మన్నవె, యూతండె పోరవచ్చు
మల్లయుద్ధంబునం దనె మాగధునకు. 100

క. "బాలకుఁడు పార్థుఁ డగుటన్
జాలం డాలంబు సలుప శౌరీ! నీవో
యాలను స్త్రీలను మేలుగ
మాలిమిసేయంగ మేటిమానిసి" యనుచున్- 101

ప॥ 97 పా॥ 2 అ॥ 6- వారలీరు; ప॥ 98 పా॥ 1 అ॥ 3- కి; పా॥ 3 అ॥ 4- ఱ:
ప॥ 99 పా॥ 3 అ॥ 3- శరంబులు;

క, అనిలసుతుఁ గోరికొని, సరి
తన కని బార్హద్రథుండు తక్షణమే నం
దను సహదేవుని రాజ్యం
బున కభిషిక్తునిగఁ జేసి పోరఁగ వచ్చెన్. 102

ఉ గోసి బిగించి, మేలగుదుకూలము లూడిచి, తీసిభూషలన్;
తాసిని వేసి, పెండ్రికలు గంటానగూడఁగ బాచి ముడ్చి; బల్
మీసలదువ్వి పాదముల మేదినిఁ గొట్టిన; భీముఁడుగ్రుఁడై
చేసెను సింహనాదమునుఁ జెచ్చెరఁ దాఁకిరి వారలొండొరుల్. [103

క. కరికరి, హరిహరి, గిరిగిరి
శరనిధి శరనిధినిఁ దాఁకుచందముగా, న
మ్మరుదంశభవుఁడు మాగధుఁ
డురువడి సరిసరిగఁ బెనఁగి రొండొరు లాజిన్. 104

చ. కరము గరంబుఁ జేర్చుచును, కంఠములంటుచు గెంటు చొక్కటన్
గుటిగొని ప్రక్కలొత్తుచును, గొబ్బున దక్కలఁ బట్టిమెత్తి, దిర్
దిరదిరదిర్రి, భూమిపయిఁ ద్రెళ్లఁగఁ ద్రోయుచు గ్రుద్దులాడుచున్
శిరముశిరంబుడీకొనుచుఁ జిత్రగతింబడి పోరి రిర్వురున్. 105

సీ. ఢీకొట్టువేళఁ బెఠీలని శైలంబు
శైలంబుఁ దాఁకినశబ్ద మొదవ;
గ్రుద్దులాడఁగ, భూమిబ్రద్దలైనటు ఘోర
నినదంబు లెల్లెడ నిండి పర్వ;

ప॥ 103 పా॥ 2 అ॥ 1- గా; ప॥ 105 పా॥ 1 అ॥ 12- గః
ప॥ 106 పా॥ 2 అ॥ 1- శైలంబు;

పదఘట్టనల శేషుఁ డదరుచు గడునొచ్చి
గస్సన నోర్వెచ్చి బుస్సలాడ;
ఇల యొత్తిడుల తగ్గి హెచ్చి యుయ్యేలలూఁగ;
హుంకృతి మారోన్మ్రిత లుఱుమ దెసల;
గీ. నదలుపులఁ బిడ్డుగర్జన లొదవి పొదవ;
నయనములు పండ్లకీట్లు, ఘనాఘనముల
మెఱపులకు "గడబడల" కౌతిఁ బురుడు గాఁగ,
సని సలిపిరి చతుర్దశాహములు వారు- 106

చ. హరి యనె భీముఁగాంచి "యనిలాత్మజ! సత్వవిహీనుఁడైన దు
శ్చరితుని వీని నీక్షణమ చంపి భవద్భుజవిక్రమంబు, భా
సురమగువాయుదేవుని విశుద్ధబలంబును మాకుఁ జూపఁగాఁ
దఱియిదె! జాగిదేల; రిపుదారక! నిర్మలధర్మరక్షకా!" 107

క. ఆమాటకు భీముం డు
ద్దామాగ్రహుఁ డగుచు, మదిని ధ్యానించిపితర్;
సామజముఁ బట్టు సింహము
నేమకమున నెగిరి యరిని నెట్టనఁ బట్టెన్. 108

ఉ. బాహులు వెన్కకున్ బెనచి,పట్టుగఁ గంఠముఁబట్టినొక్కుచున్
సాహసవృత్తిఁజుట్టువడి సాగఁగనూపుచు నూరుమారు లా
దేహము త్రిప్పి రక్త వితతిన్ నవరంధ్రములెల్ల గ్రక్క నా
బాహుబలుండు మాగధునిప్రాణము లూడగఁగొట్టెనేలపై. 109

ప॥ 106 పా॥ 1 అ॥ 1- బ; పా॥ 3 అ॥ 7- ద: పా॥ 7 అ॥ 10- కుఁబుసుడు;
ప॥ 109 పా॥ 2 అ॥ 17- ఋ;

క. బకుఁడు, హిడింబుఁడు నేఁ గా
దు కదా, నీచే నసువులఁ దొలఁగఁగఁ ననఁగా;
బకవైరి మిగులఁ గినిసి నె
మకి "జట్టనఁ" బట్టిచీల్చె మాగధుతనువున్- 115

సీ. మాగధుని మేనివ్రయ్యలు మఱలఁ జేరి
చేతనము నొంది పవనజుఁ జెట్టనట్టె;
నమిత కోపముతో భీముఁ డతని జీల్చె;
మరల బ్రతికెను తొలియట్లె మాగధుండు- 116

ఉ. "అచ్చెరువొంద రాముఁడు దశాననుగొంతులఁ జించ, వెంటనే
వచ్చెడి నంచు మున్ను వినవచ్చెఁ బురాణములందు: మాకిటన్
నిచ్చయు మయ్యెనత్తులకు, నేరమి యయ్యె నుపాయ" మంచులో
కొచ్చి మఱిన్ బృహద్రథతనూజునిగాత్రముఁ జీల్చి చెచ్చెరన్-117

రెండుచీలికలను గొని రెండుదెసల
దవ్వులన్ వైచి జయమగు ధర్మజునకు
ననుచు ఘోషించె; వ్రయ్య లయ్యెవి తమంత
గాడ్పుజవమునఁ బఱతెంచి కలసిమెలసి- 118

సీ. భీమువీపునగుద్దుచుఁ బేర్మితోడ
జయమృడా! పార్వతీశ్వర! జయకపర్ది!
జయమునీశ్వరకాళికేశ్వర! యటంచు,
నుద్దవిడిఁ గూసె ధారుణి దద్దఱిలఁగ- 119

క. చించుట, లవి కలియుటలు, గ
ణించుచు, మది విషవు భీమునిన్ గని, మేల్ మే
లంచు హరిపల్లటముగా
నుంచి నిజకరములఁ జూపెఁ; నొగిఁ గని దానిన్- 120

చ. పదపడి భీముఁ డార్చి, తెగఁబట్టి బృహద్రథసూనుఁ జీల్చి, స
మ్మదమున రెండుహస్తములఁ బూనిచి చీలికలన్, హరిన్ గనన్.
గుదురుగ శౌరి వ్రేళులను గూర్చె వెసన్ దలక్రిందుగాఁగ; న
య్యది కని పాదపార్శ్వమును నొదల పార్శ్వముఁ జేర్చి కూరిచెన్.

మ, అపసవ్యంబుగఁ గూర్చ నాశకలముల్ వ్యర్థంబులై యూడుచున్
విపరీతస్థితినుండఁ, హస్తయుగళిన్ వేఁబట్టి, కట్టల్కతో
నపు డాభీముఁడు మోదె భూస్థలినిఁ వెయ్యార్మా; ర్ల సంఖ్యంపుఁ జి
ద్రుపలై భూరజమందుఁ జేరె నవియున్ చూపింపరాకుండఁగన్.122

క. పిమ్మట భీముఁడు గృష్ణు ప
దమ్ములఁ బ్రణమిల్లె; హరియుతనిఁ గౌఁగిట మో
దమ్మునఁ గొనెఁ; బానని పా
దమ్ములఁ బడునరుని కిడె హితాశీషములన్- 123

ఉ. భీతిలు మాగధప్రజను వెన్నుఁడు డగ్గరఁజేర్చి; సత్కృపా
హేతువుగాఁగఁ దానభయమిచ్చి; చెఱన్ బడియున్న రాజులన్
బ్రీతి విముక్తులన్ జలిపి పేర్మిమెయిన్ సహదేవునిన్ ధరా
నేతగఁ జేసి; యింద్రసుతునిన్ బవనాత్మజుఁగూడి యంతటన్-, 124

క. తారకపథలో నింద్రుం
డారూఢుండైనదాని, నాయింద్రునిచే
వీరుఁడు వసు, వాతనిచేఁ
గూరిమిని బృహద్రథుండు గొన్నరథంబున్- 125

క్రొ. కొని, గరుఁడునిఁ దలఁచుడు,వెసఁ
జనుదెంచెనతండు; నతని సారథ్యమునం
దునిచి; విముక్తక్షత్రియ
జనములఁ, బాండవులఁ గూడి చక్రిపయనమై- 126

క. చని యింద్రప్రస్థమునకుఁ;
గని ధర్మజు, మ్రొక్కి- యెల్లకథ వినిపింపన్;
దొనక ముదశ్రువు లాహరిఁ
గొని కౌఁగిటఁ దార్చి జమునికొడుకు కడంకన్- 127

క. ఆయుధములచేఁ జావని
యాయతబలు మాగధేశు ననిలజుచేతన్
బాయించి తనుల; మాయురె!
నీయాప్తప్రజకు గలుగునే కొఅలుహరీ?. 128

వ. అని పూజించి; విముక్తభూభుజుల కర్హంబౌ క్రియన్ మచ్యభో
జనముల్ విందొనరించి, వీడులకు విశ్వాసంబుతోఁ బంచె; శ్రీ
వనజాక్షుండును వారి వీడుకొని, తద్భ్యాస్వద్రథారూఢుఁడై
చనియెన్; బిమ్మట నాయుధిష్ఠిరుఁడు బల్ సంరంభితస్వాంతుఁడై

♦ పాండవులదిగ్విజయము; రాజసూయయాగము. ♦

ఉ. దిక్కరులట్టిసోదరుల దిగ్విజయార్థము దిక్కుదిక్కునొ
క్కొక్కనిఁ బంచె, భీము, నరు, నోజను జంటల; నంట నేలనల్
ప్రక్కలఁ దూర్పునుత్తరముఁ బశ్చిమ దక్షిణముల్ గ్రమంబుగా;
నుక్కున వారలేగిరి సముద్ధితబుద్ధి యుధిష్ఠిరాజ్ఞచే. 130

చ. తెలియఁగ నగ్నిదత్తమగు దివ్యరథంబున మేటిగాండివా
దుల, వివిధాస్త్రశస్త్రములఁ దోకొని, యుత్తరదిఙ్ముఖుండునై
ప్రళయదవాగ్ని నా వెలిఁగి పార్థుఁడు వోవుచు, నాపుళిందభూ
వలయముఁ జొచ్చి యద్ధరణిపాలునిచే నరిఁబూని; పిమ్మటన్-

ద్వి. ప్రతివిందుఁ డనువాని బవరాన గెల్చి [131
యతఁ డిచ్చు కానుకల నన్ని గ్రహించి,
సమ్మతిఁ బ్రాగ్జ్యోతిషమ్మును జేరఁ,
బమ్మిన బిరుదున భగదత్తుఁ డంత
శబరసాగరవాస సైనికవరుల
నిబిడంబుగాఁ గూర్చి నిక్కి మార్కొనఁగఁ
బార్థుఁడాతని ననిఁ బడలంగఁ జేయ
వ్యర్థుఁడై, యతఁడుభయంబున వేఁడీ
బలురత్నరాశిసంపద లరివెట్టి
తలవంచి నిలువ నాతనినైచి క్షత్త్రి:-
"కడఁగిధర్మజుఁడు జగద్ధితార్థముగ
నడరెను రాజసూయంబును జలుప;

ప॥ 130 పా॥ 3 అ॥ 4- ఁదూ; అ॥ 10- బశ్చిమ;
ప॥ 132 పా॥ 8 అ॥ 12- వేఁడి;

నిలపతులెల్లవా, రే తెంచువారు
నిలువ కీవును రమ్ము నెమ్మితో'' ననుచు
నాతని పీడ్కొని యా మీఁదఁదరలి,
ప్రీతి నంతర్బహిర్గిర్యుపగిరులు
మున్నగువానిలో మొనరెడు నృపులఁ
జెన్నుగ నోరిచి పన్నులనుగొని
మలయు నులూకేశు మాటడఁగించి,
యలరు బృహంతుని నని దంచి మించి,
తగవామదేవమోదాపురేశాది
జగతీశ్వరుల గెల్చి, సాగి మున్ముందు,
నిక్కుసేనాబిందు నిస్సారుఁ జేసి
సుక్కఁగ విష్వగశ్వుని ననిఁగొట్టి,
పార్వతేయుల గెల్చి, బర్బర, శబర
గర్వితు లౌ తురుష్కావనీపతుల
పసడించి, కోసికాన్క, పౌండ్రు లగెల్చి
యసమ మాళవ, త్రిగర్తావనీశ్వరులఁ,
దనరు సుధన్వ, గాంధార, కాంభోజ,
ఘనకోసలేశులఁ గని యరినిఁ గొని
వడి సింహపురి కేగి వనచరేశ్వరులఁ
గడుకొని వశ్యులఁ గాఁగొని, కడిమిఁ

కాంభోజహాటక కాంతులచేత
సంభావితుండయి సాగి యామీఁద
కటక దేశమునందుఁ గలుగురాజులను
విటతాటనముఁజేసి, విఖ్యాతిఁగన్న
ఘనతురంగములను గజయూథములను
గొని, చనిచని హేమకూటంబుఁ జొచ్చి,
గంధర్వనగరముల్ గలఁచి పన్నుగొని
బంధుర మగు మేరుపర్వత మరసి;
జంబూమహావృక్షు, జంబూనదులను
సంబరమున గని చనిచని ముందు
గంధమాదనము నల్లట్టులఁ గల్గు
గంధర్వసిద్ధాదిగణములచేత
నరిఁ గొని ముందున కటులనే పోయి
హరివాస మనుపురి నాతండు చేర,
టలిఁ బురద్వారపాలకు లరుదెంచి
తిలకించి నరునకుఁ దెలిపి " రీయవియె
యుత్తర కురుభూము లోరాజతిలక!
యెత్తఱిఁ జొచ్చితో? యివి యగోచరము
లగుమానవులకెందు; నయ్యారె! యిందుఁ
దగుకార్య మెట్టిచందమొ తెల్పు" మనిన:-

"రాజసూయాధ్వర రాజంబు సలుప,
రాజరా జగుధర్మరాజు నన్పంప,
నవనిదిగ్విజయార్థమై వచ్చినాఁడఁ,
దివిరి కప్పంబులఁ దెచ్చి భూనాథు
లర్పింపఁ జనియెద; నది కాదటంచు
దర్పించువారల దర్పంబు లడఁచి
కప్పంబుఁ గొనియెదఖండితం" బనిన,
అప్పుడే ధనరాసు లర్పించి వారు
దరలినఁ; గత్తియుఁ దదనంతరమున
బొరిని నింద్రప్రస్థపురి కేగుదెంచి,
కని ధర్మసుతున కాకాన్క లర్పించి,
వినయంబుతోఁ మ్రొక్కి వివరముల్ తెలిపె. 132

దండకము :- వాతాత్మజుం డంత ప్రాగ్దిఙ్ముఖుండౌచు వేసాగి పాంచాలుచే సత్కృతుండై, విదేహాధినాథుండుసంగ్రామరంగమ్ము నం దాఁక నవ్వాని దోశ్శక్తి మర్దించి; మీఁదన్ దశార్ణాధినాథున్ సుధన్వాఖ్యు నాలమ్ములోఁ గొట్టి యవ్వాని శౌర్యంబులో మెచ్చి వాఁ డిచ్ఛమై రాగ సేనానిగాఁ బూని; యాయశ్వమేధేశ్వరున్ రోచమా నున్ రణాగ్రంబునన్ బెంపుఁ దెంపారఁగాఁ జంపి; యాచేది

రాజ్యంబులోఁ జొచ్చి యాభూపుఁ దర్పింపఁగాఁ గట్నముల్
బూని, సన్మానమున్ బొంది, యం దేడునాళ్లుండి; వేపోయి
పేరా పుళిందాపురంబందు వీరున్ సుమిత్రేశునిన్ జూచి;
యాపైఁ గుమారాధినాథుండు నా శ్రేణిమంతున్,
మహాకోసలాధీశు, నాపై నయోధ్యామహీనాయకున్
దీర్ఘయజ్ఞాఖ్యుఁ, గాశీధరేశున్ సుపార్శ్వున్ మఱిన్ గల్గు
భూనాథులన్ గాంచి వారెల్లరర్పింపఁగాఁ గట్నముల్ పూని;
ముందేగి యామత్స్యదేశేశు దర్శించి, కర్ణాటకేశున్ మఱిన్
దక్షిణాధీశునిన్ గాంచి, గర్వాత్ములావారి గర్వంబు సర్వంబు
నిర్మూలమున్ జేసి కోశంబులందున్న ద్రవ్యంబులన్దోఁచి యా
ద్రవ్యముల్ గోనెలన్ దాఁచి, కూర్పించి, తార్పించుచాయుష్ట్ర
రాజాళి మీఁదన్ మదేభాశ్వరాజాళిమీఁదన్;మఱిన్ బోయి యా
మాగధేశున్ జరాసంధపుత్రున్, మహాప్రీతితోఁ గాంచి,
యాతండు సద్భక్తి సన్మానముల్ సల్పి వీడ్కొల్పఁగా,
శీతశైల ప్రదేశంబులన్ జొచ్చి, యందాజలోద్భూత
దేశేశునిన్ గాంచి; భల్లాటభూనాథుఁ డెంతేని పిల్లాట లాడంగ,
విల్లెత్తి నిర్వెల్ల నీర్గాఁగ మర్దించి కోశంబులన్ దోఁచి వే
యింద్రశైలప్రదేశంబులన్ జొచ్చి యుందున్ గిరాతేశులా
నేడ్వురన్ శర్మకున్ వర్మకున్ జంద్రసేనున్
మహావార్ధిసేనున్ మఱిన్ గర్ణవత్సానసీభర్తలన్

బుండ్రినాథాదిభూనేతలఁ గాంచి వారిచ్చుకప్పంబులఁ బూని
యిట్లాడు:- శ్రీపాండురాజాగ్రపుత్రుండు నౌధర్మరా జేప్పడఁ
రాజసూయాధ్వరంబుఁ మహావైభవోపేతమై యొప్పగాఁ జేసెదుఁ;
మీరు మీవారితో నచ్చి కార్యంబులఁ సాయముఁ సల్పి;
మేమిచ్చుసత్కారముల్ పొంది యేతెండు; మావిందులై రండు
రండీరు రం డంచు మున్మార్లుగాఁ జెప్పి, వారెల్ల వీడ్కోల్ప
నేతెంచి, తా ధర్మజుఁగాంచి, సాష్టాంగదండప్రణామంబులర్పించి
ద్వారంబునఁ గట్టముల్ మోసియున్నట్టి భద్రేభ యూథాళి,
నుష్ట్రాళినిఁ వాజివారంబులఁ జూపి, రాజాజ్ఞచే వానినన్నింటినిఁ
గోశముఁ జేర్పఁగాఁ జెప్పి, సోదర్యుఁడౌపార్థుతోఁ గూడి,
సంతోషితస్వాంతుఁడై యుండె; నాపిమ్మటఁ- 133

గీ. మా. సముద్రముతోడ దక్షిణాశకుఁ గడంగి
సాగి సహదేవుఁ డతిసైన్యసమితిఁ గూడి,
యాదిని సుమిత్రశూరసేనాదినృపుల,
వరుసగా దంతవక్త్రాది ప్రభులగెల్చి;
చెలఁగి గోశృంగగిరినివాసుల జయించి
కుంతిభోజునిసత్కృతిఁ గొని చని మఱి
జలజనాభుని పగతుని జంభకాఖ్యు
భూరిబలునాత్మజాతునిఁ బోరిలోన
నిగ్రహించి, ధనంబుఁ బరిగ్రహించి-

పరమనది నర్మదా సమీపముననున్న
అలయవంతీశ్వరులను విందానువింద
భూపతుల నోంచి, మాహిష్మతీపురంబుఁ
జేర, నారాజు నీలుండు పోరొనార్చెఁ,
నాపురినిఁ గావ వరమిచ్చి యచటనున్న
యగ్ని యాసహదేవు సైన్యములపైన,
గజ హయ రథ పదాతి వర్గములపైన
నెగసి దహియింప, సహదేవుఁ డెనయుభక్తి,
నమితశుచి యయి దర్భాసనమున నిల్చి,
యగ్నిసూక్తులఁ బఠియింప, నగ్నిదేవుఁ
డతనికిఁ బ్రసన్నుఁ డయ్యె; నయ్యది గణించి
నీలుఁ డంతట సహదేవుమోలి నిల్చి,
కరములు మొగుడ్చఁ గని కనికరముతోడ
ఘనుఁడు మాద్రేయుఁ డతఁ డిడుకట్నములను
బుచ్చుకొని; రుక్మిభీష్మకభూపవరుల
దరిసి శూర్పారకపతిని దండపతిని;
దద్దయును వార లిచ్చిన ధనముఁ గొనుచు,
సాగర ద్వీపవరుల నిషాదవిభులఁ
బరఁగఁ బురుషాదులను నేకపాద జనుల,
భూవిభులఁ గాలముఖ కర్ణ పావరణుల,

నసురనరయోనులనియెడి యసమ బలుల
నోర్చినై రామగిరి కోలశైలతామ్ర
దీవిఁగలవారి; సంజయంతీనివాసు
లందఱనువశులుఁగఁ జేగొని, ముందుసాగి-
తాళవనపాండ్య కేరళ ధరణిపతుల
ఘనుల కాళింగ ద్రావిడయవని విభులను,
గడిఁదిఁగరహాటకేశులనొడిచి, కడచి
నడచి దక్షిణవేలావనములఁ జూచి,
సేతుబంధనతీరంబుఁజేరివిడిసి,
తలఁచె సహదేవుఁ డాఘటోత్కచునిమదిని;
నతఁడు ప్రత్యక్షమై నమస్కృతులొనర్చి-
హస్తములమోడ్చి "నాకేమియాజ్ఞ" యనిన,
జనుములంకకు నావిభీషణుని వలన
కప్పములఁ దెమ్మనా, ఘటోత్కచుఁడు గగన
పథమునం దేగి లంకలోపల విభీష
ణాసురేశునిఁ దిలకించి యనయెనిట్లు:-
కురుకులేశుండు ధర్మరాడ్ధరణివిభుఁడు,
దేవదేవుండు శ్రీకృష్ణదేవు బలిమి
రాజసూయాధ్వరముఁ జల్పు నోజమీఱ,
నతఁడు, తమ్ముల దిగ్విజయార్థముగను

దిక్కులకుబంప, దక్షిణదిశకువచ్చి
నతఁడు, సహదేవుఁ డావార్థికవల విడిసి,
పంప నన్నిటు, దూతగా వచ్చినాఁడ;
ననిలసుతు భీమసేనునితనయుఁ డేను,
జనులు నన్ను ఘటోత్కచుఁ డనెడివారు;
ధరణిపతులెల్ల రరివెట్టి తనిపినార,
లట్టులే మీర లరివెట్టి యంపుఁడయ్య!
సపరివారంబుగా మీరు జన్మమునకు
వెడలి రావలె నన్న, విభీషణుండు-
తనకులస్వామి రాముండు ధర్మరక్ష
ణార్థముగఁ గృష్ణుఁడై ధర నవతరిలుట,
యాగరక్షకుఁ డాతఁడే యగుట నెంచి,
పాదలుభక్తిని నాదేవుమదిఁ దలంచి,
వరుసగాఁ బంచశతదైత్యభటులచేత
కాంచనాంచితయూపముల్, కనకరత్న
వరవిభూషణరాజినిఁ బనిచె; వానిఁ
గైవసముగాఁ గఁ గొని యంతఁ గదలి నచ్చి,
యున్నకర్పించి, కలదెల్ల విన్నవింప,
దమ్మునగుట్టునిఁ గౌఁగిటఁ దార్చె తేఁడు. 134

ష, నకులుఁ డింద్రప్రస్థపురి విడి,
సకలసేనలఁగూడి పడమర
మొకముగాఁ జనెఁ; దేజమెల్లెడ మొనసియాడంగన్,
గకవికలుగా రిపులు, యోధుల
ప్రకటసింహనినాదములు, కరి
నికరముల బృంహితములున్ రథనేమిఘోషంబుల్ - 135

ష. మేటిదిగ్గజకర్ణకుహరము
పోటులెగయఁగ, దిగ్దిగంతము
లోటువడఁ బ్రళయాంబునిధి యిటు లోఁజలునోయనఁగన్
ధాటిమై చని నకులుఁడట బా
హాటముగ రోహితకమునఁ బో
రాటమున మత్తకమయూరకరాజులను నోర్చెన్ - 136

మఱియు మరుశైరీష మాళవ
వరుల, బర్బర కర్బరాదులఁ
దశిసి, వా రరి నిడఁగఁ గైకొని తరలి యటుమీఁదన్
సరగ నాదాశార దేశపు
దొరల నుక్కడఁగించి పుష్కర
పరిసరుల యాభీరగణముల వలన నరిఁ గొనుచున్ - 137

శ్రితసరస్వతి సింధుకూలా
శ్రితగతులు సౌగ్రామణీయుల
నతుల పంచనదామరాద్రుల యందుఁ గలవారిన్

వెతకి యరిఁగొని తరలి ద్వారా
వతికిఁ దా వచ్చినది సత్యా
పతికిఁ దెలియఁగఁ బుచ్చి సాపెను బయన పాటుపై నన్ — 138

మామ మద్రేశ్వరుని శల్యుని
ధామమున సత్కారములఁ గొని
యామహాపశ్చిమశరధిప్రాంతాధివాసితులన్,
భీము లగు బర్బర కిరాత
స్తోమముల నుక్కడఁచి యరిఁ గొని
ధీమహిత వరుణేంద్రపాలితదిఙ్మహీపతులన్ — 139

తాఁకి, సంగ్రామమున నోరిచి,
పీఁకతో ధనరత్నరాసులఁ
జేకొనుచు నవి యుష్ట్రతతిపయిఁ జేర్చి పయనంబై,
జోకతో నిజపురికి వచ్చెను
లోక మరుదుపడంగ; ధర్మజు
శ్రీకరపదంబుల కెరగి యాశీస్సులను బడసెన్. 140

ఉ. తమ్ములు ధౌమ్యముఖ్యులునుదక్కినబంధులుమంత్రులాప్తులున్
సమ్మతి రాజసూయమును సల్పఁ గడంగఁగ నొత్తిడింపఁగన్
ఇమ్ముగ ధర్మజుండు వెస నెల్లపదార్థములన్ గడించి కో
శమ్ముల నింపి సిద్ధముగ శౌరి నిరీక్షణఁ జేయుచుండఁగన్ — 141

గీ. కార్యకారణకర్త యాకంజనేత్రుఁ
డంత నేతెంచి, సభఁదీరినట్టిధర్మ
రాజుముందఱ ధనరత్నరాశి వోసి
కట్న మొసఁగంగఁ బాండవాగ్రజుఁడు భక్తి- 142

క. జగదర్చితకృష్ణునిపద
యుగ మర్ఘ్యసుపాద్యవిధిప్రయుక్తముగాఁగన్
దగుభక్తిని బూజించెను;
నగధరుఁ డాపిదప ధర్మనందను గనుచున్:- 143

చ. కురుకులవర్య! నీసుగుణకోటి తలిర్చెను; నీచరిత్రమో
పరువడి మూఁడులోకముల బాటలఁ దీర్చెను; ధర్మమే యిటుల్
దొరకొనిమూర్తిఁదాల్చినటుదోఁచుచు వెల్గితి రాజసూయమున్
ధరణి హితంబుగాఁ, బరమధర్మముగా నెరవేర్పఁ బూనినా! 144

క. పనుపుము మమ్ములఁ బనులకు,;
దనుపుము దేవతల, నగ్నిఁ దగ వేలిచి; బ్రా
హ్మణులన్ బూజనభోజన
ఘనదానము లిడుచు, లోకకల్యాణముగన్. 145

గీ. అనఁగ; ధర్మజుఁ డిట్లను: నఖిలలోక
పాలు, సద్ధర్మరక్షకు, భక్తవరదు
నీదయను నభ్యుదయ మయ్యె నేఁడు మాకు;
ధర్మ మగుపని నను బూన్పఁ దగును నీకు. 146

ప॥ 144 పా॥ 4 అ॥ 17- అ; అ॥ 21- ను:
ప॥ 145 పా॥ 3 అ॥ 1- హ్మణులన్;

క. అని; ధౌమ్యుని, ద్వైపాయన
ముని యానతిఁ బూని; కృష్ణు ముదలను గొని; తా
ననుజుల సమ్మతిఁ గనుఁగొని;
మునుకొనియెను రాజసూయమును జరుపంగన్- 147

గీ. వలయుయజ్ఞోపకరణద్రవ్యముల ధౌమ్యు
ననుమతినిఁ గూర్చ, ద్విజపార్థివాదినాల్గు
వర్ణములవారిఁ బిల్వఁ బంపంగ, నాజ్ఞ
సలిపె సహదేవునకు దగుసాయ మొసఁగి. 148

క. విజ్ఞుఁడు సహదేవుండు వి
ధిజ్ఞుల శిల్పకుల గూర్చుతీర్పులతోడన్,
యజ్ఞాలయ నిర్మాణము
ప్రాజ్ఞులు మెచ్చంగ సలిపె రమణీయముగాన్. 149

గీ. సర్వసామగ్రిలను యజ్ఞశాలఁ జేర్చి,
ప్రేక్షకులకు సౌఖ్యమ్ముగా విడదిఁ గూర్చి,
వనుల, కొలనుల, వేదుల, పందిరులను
జక్కఁగా నలంకారమ్ము సలిపి రంత. 150

సీ. భగదత్త, శక, బృహద్బల. సాల్వ, శిశుపాల
రాజులు; ద్రుపద, విరాటనృపులు;
వసుదేవ, బలదేవ, ప్రద్యుమ్న, శూరసే
నాదియాదవులు; భోజాంధకులును;

ప॥ 149 పా॥ 1 అ॥ 6 దేవుండు;
ప॥ 150 పా॥ 2 అ॥ 11- ఉ; పా॥ 3 అ॥ 4- ఁగొ; అ॥ 11- ఁజం;

అంధ్ర, వంగ, కళింగ, యవన, సింహళ, పాండ్య,
కాంభోజ, కాశ్మీర, గౌడ, ద్రవిడ,
కుంతల, కేరళ కువలయాధిపులును;
పౌండ్రకవాసుదేవప్రభృతులు;

కే. పార్వతీయులు, జలనిధిప్రాంతవాస
పతులును, చతుస్సముద్రముద్రితవసుంధ
రాస్థలినిఁ గల్గునాల్గువర్ణములవార
లటకు సహదేవునాహ్వాన మంది డిగిరి. 151

సీ. మా. ధన, కనక, రత్న, వాహనోత్కరముఁ గొనుచు,
నాత్మనైభవమున కెల్ల రరుదుపడఁగ,
భీష్మధృతరాష్ట్ర, కుంభజ, విదుర, సోమ
దత్త, కృప, కర్ణ, శల్య, సైంధవ, వికర్ణ,
ద్రోణతనయ, సుయోధన, దుస్ససేన,
శకునిముఖులేగుదెంచిరి సవనమునకు. 152

కే. అందఱ కన్నివిధంబులఁ
బొందుగ సన్మానవిధులఁ బొనరించి; సభా
మందిరమున యమతనయుఁడు
మందస్మితవదనుఁ డగుచు మాటాడె నిటుల్ - 153

ఉ॥ మీదయ నిమ్మహాధ్వరము మేకొనితిక్ మహనీయులార! మీ
రాదరమొప్పఁ గార్యమున నందఱు బాల్గొనితీర్చి, కీర్తి సం
పాదనఁ జేసి లోపములవంబున కే నెడమీక, నెమ్మి నా
మీ రెఱుఁగ గలిగి యీ యుబ్బరువు మీరును వింత వహింపఁ జూడుఁడీ! 154

ప॥ 151 పా॥ 4 అ॥ 1- బౌ; ప॥ 152 పా॥ 3 అ॥ 3- ధృతరాష్ట్ర;
ప॥ 154 పా॥ 2 అ॥ 14- ఁబా;

క. అని పెద్దలయనుమతిఁ గొని,
తనరరజతహేమరత్నదక్షిణాదానం
బునకుఁ గృపు; ద్రోణభీష్ముల
నునిచెఁ గృతాకృతము లరయునుద్యోగమునన్. 155

క. జనపతులు దెచ్చియిచ్చెడు
ధనరత్నసువర్ణమణివితతిఁ గొన, దుర్యో
ధను; దుశ్శాసను పాకము
వినియోగ నియోగకార్యవిధి నియమించెన్. 156

ఆ. వలసికూర్చి యున్నవస్తు సామగ్రిని
వెచ్చమాడుపనికి విదురు నుంచి,
యజ్ఞదీక్షఁ బూని విజ్ఞులతోఁగూడి
యజ్ఞశాల కరిగె యమసుతుండు. 157

క. వేదములఁ, బరతరాశీ
ర్వాదముల, విధిజ్ఞవాదరాద్ధాంత మహా
నాదములఁ దదన్యంబగు
నాదము మాటడఁగె శాల నాల్గు చెఱగులన్. 158

చ. అనలముఖంబునం దిడుచు నాహుతి వేదసమంత్రకంబుగాఁ,
దనిపి సమస్త దేవతల; దక్షిణాపూజనభోజనాదులన్
మునులకు భూసురేంద్రులకు మోదముగూర్చి; నృపాళి మెచ్చఁగా
ఘనముగ సత్క్రతుల్ సలిపెఁ గణ్యుఁడు ధర్మజుఁ డుద్ధురంబునన్.

గీ. మఖమహోత్సవ విభవంబు; మాన్యమైన
యమసుతుని ధర్మనిరతిని, నతనియశము
చాలఁ బొగడెను నారదసంయమీంద్రుఁ
డధ్వరప్రేక్షకులు సంతసాబ్ధి మునుఁగ- 160

ఉ. చుక్కలలోనఁ జంద్రునటు చూపరుచిత్తము లత్తమించుచున్,
నిక్కడిశౌరిఁ గాంచి, మును నీరజజాదిసురార్థియై మహిన్
దక్కినధర్మముల్ మనుప, ధారుణిభారముద్రింప, దీక్షమై
నిక్కడ విష్ణువే యిటులఁ గృష్ణుఁడుగా నవతారమెత్తుటల్-161

క. సురదైత్యదానవాదులు
ధరపై క్షత్రియకులమునఁ దనరఁగఁ దనువుల్
ధరియించుట; యిఁకముందఱఁ
బరఁగుట భారతరణంబుభావించి మదిన్- 162

క. వీణాతంత్రిల మీటి, స
మానముగ గళస్వనంబు మలపి, హరిశ్రీ
ధ్యానము, గానము నృత్య వి
ధానమ్ములసలిపె సభను దాళలయగతిన్. 163

కృష్ణునిదూషించిశిశుపాలుఁడు హరి చక్రమున కాహుతియగుట,

గీ. పిదప భీష్ముఁడు యమసుతువదనముఁ గని,
స్నాతకుండును, నిష్ణుఁడు, సద్గురుండు,
నృపుఁడు సంయుజుఁడును బూజనీయు; లట్టి
వారి కొకరికి నర్ఘ్య మీవలయు నిపుడు- 164

క. అన; ధర్మజుండు:- తాతా!
వినిపింపుము నాకు నట్టివిఖ్యాతుని, నీ
ఘనసభఁ గలవానిని; నీ
యనుమతిఁ బొలిచూజ నిడుదు నాతని కనిన౯- 165

శా. జ్యోతిర్మండలిసూర్యునట్టుల సమస్తోర్వీస్థలి౯ వెల్గుచు౯
భూతవ్రాతములోనిచేతనమునై, మూర్తిత్రయి౯ ముఖ్యుఁడౌ
నాతండే నరమాత్రుఁడౌచు మనమధ్యం దోఁచె నీతండు; సు
ప్రీతుం జేయఁగనొప్పు యజ్ఞపురుషు౯ శ్రీకృష్ణుఁ బూజావిధి౯. 166

గీ. అనుచు భీష్ముఁడు పల్కఁగ; నమితభక్తి,
నంది సహదేవుఁ డిచ్చునర్ఘ్యంబు నొసఁగి,
శాస్త్ర దృష్టివిధి౯ బ్రీతిఁ జలిపెఁ, గృష్ణు
శ్రీపదాంబుజముల యుధిష్ఠిరుఁడు ప్రాజ్ఞ.

చ. అది మది సైపలేక, కడు నల్కమెయి౯ శిశుపాలుఁ డాసభ౯
"ఇదియదెబుద్ధి? యింపుధరణీశులు,విప్రులు,మానులు౯ బుధుల్
గొదవడకుండ నుండ, నొకగొల్లని నల్పునిఁ బూజ్యుఁ జేసితే
ముదిమదిదప్పినట్టిఁ డగుమూర్ఖుని భీష్మునిమాటచే నృపా! 168

ఉ. కొండొకబుద్ధి వీ వగుట గుర్తిడ నేరవు ధర్మజు౯; సభా
మండలిఁ బ్రాజ్ఞులుండ, ముదిమానిసి నీ యెదుకొంగఁ, దా మహా
పండితునట్లు నోర్విడిచి పల్కఁగ, మీకిటఁ జెల్లె; మాకృశా
ఖండమతుల్ సహించుటకు గానిదిపో! యవమాన మిట్టిదే? 169

సీ. వృద్ధుఁడీతం డనుబుద్ధిఁ బూజించితే,
వసుదేవుఁ డల్లదే యెసఁగుఁగాదె?
ఋత్విజుం డని వీని కిడితివో యర్ఘ్యంబు,
వ్యాసుఁ డాపీఠిపై వఱలలేదె?
గురుఁ డని యీతని గుఱుతించితే, చూడు!
తోఁచరే నీకదో ద్రోణకృపులు;
రాజశేఖరుఁ డంచు యోజించితే, యార!
గొల్లలు రాజులే కువలయమున?
ఆ. వీని నెవ్వఁ డంచు వివరించి నీలోన,
సలిపినావు నిండుసభను బూజ?
యిందుఁగల్గుపూజ్యు లంద ఱయోగ్యులే?
ధర్మరాజె నీవు తథ్యమరయ? 170

వ. నయగుణశాలి ధర్మజుఁడునా, గణియించి నృపేంద్రులెల్ల లో
దయఁగని రాజసూయమఖదర్శనలాలసులై, ధనాదిసం
చయములఁ బూనివచ్చితిమి; శౌరిపరాక్రమ మెంచి మామదిఁ
భయపడి రాము; నీకిటుల భావ్యమె యిందఱ బేలపుచ్చఁగన్?
ఎఱుఁగక నీ విచ్చిన, నే [171
నరుహుఁడనా! యనుచు నింతయాలోచనయే
పరపఁడె; యీపశువులకా
పరి తగనని తలఁచి సిగ్గుపడఁ డయ్యారే! 172

క. కడుకొని పేడికిఁ బెండ్లియుఁ,
బోడగని బధిరునకు మధురపూర్ణ గీతంబుల్,
గడుఁజీఁకున కద్దము నిడు
నడువున హాగ కర్తవ్యమిడితి వ్యర్థముగాఁగన్- 173

క. అని, కినిసి సభను విడి చన,
వెనుబడి సని ధర్మజుండు వీడక ప్రియసాం
త్వనవచనరచనచే నిటు
లనె నాశిశుపాలుతోడ, నందఱు వినఁగన్- 174

క: ఉత్తమ మగున్నృపజన్మము
నెత్తి సశూరులకుఁ దగు నె యెడ్డపురుషవా
గ్వృత్తి! మహోదారుణ మది
కత్తి, యలుగు, నగ్గి, విసముకంటెను గంటే! 175

ఉ. కొండొకవీవు ధర్మగతి గుర్తిడ నేరవు; శాస్త్రవేది భీ
ష్ముండు గణించి వ్యాసమునిముఖ్యసమాజి నిజంబు నల్కెఁ; నీ
పండితు లూరకుండి, రది భావ్యమె యాట! నిశేల, నీకు నో
రుండదె; యుంపఱుండినటు లుండక యూరక మండనేటికిన్? 176

క. అజహరసుర సేవ్యంబై
నిజనిగమాగమప్రశంసనీయంబై, శ్రీ
విజయంబగు హరిపదనీ
రజముల కేఁబూజ లిడఁగరాదే వాదే! 177

చ. అని, శిశుపాలు నాఁడిల నాడెడుధర్మజుఁ గాంచి భీష్ముఁ డి
ట్లను: జననాథ! యిట్టడుగ నౌనె దురాత్ముని, వీని బాలునిన్,
ఘనతర రాగకోపపరికంపితచిత్తుని, నల్పభాగ్యమ-
త్తనయువిదూరు, నన్యజనతాగుణ దూషణు, నాత్మభూషణున్. [178

క. అని, శిశుపాలునిఁ గనుఁగొని
యను:- నీసభఁగల్గురాజు లంద ఱితనిచే
మును జరియుక్తులు గారే?
ఘనుఁ డీతని కర్ఘ్య మిడుట కాదే మాడే? 179

క. భూమీసురులన్ జ్ఞానియు,
భూమీశ్వరులందు వీరపుంగవుఁడు; విశ
స్తోమమున ధనియు, శూద్రుల
లో ముదుసలి పూజ్యు; లిద్దిలోఁ గనవొక్కో? 180

క. ఆరసి యీకారణముల
నారాధించితిమి హరిని, నచ్యుతు, జగదా
ధారుని, నిఖిలారాధ్యునిఁ
గారణకారణుని, సర్వకల్యాణగుణున్- 184

క. పూజింపఁ దృప్తుఁ డగునా
పూజితుఁ డొక్కఁడు; శౌరి పూజితుఁడైనన్,
దైత్రిజగము లోలిఁదృప్తిన్
రాజిల్లుట నీ కెఱుంగరా దవినీతా! 182

చ. అనియెడుభీష్మపల్కులకు నడ్డముగా సహదేవుఁ డేగి యి
ట్లను: మనసాప్రియచ్యుతునకర్ఘ్యము నిచ్చితి; మిందు మమ్మిఁగా
దనుదురితాత్మమస్తకమునం దిడుదుఁ గడకాలు నే నిదే
కనుఁ, డని పాదమెత్తె సభకంపితమై తనుజూడ నొక్కఁటన్.183

క. కురిపించిరి సుమవర్షము
సరగన్ సహదేవుమీఁద జయ యని సురలం
బరముననుండియె; సురముని
దరహసితాననుఁ డు నగుచుఁ దద్దయు నాడెన్. 184

క. సేనానితోడఁ గొందఱు
భూనాథులఁ గూడి చైద్యభూవరుఁ డలుకన్
సైనికుల గూర్చె; నదికని
పూనిక యాదవబలంబు పోర్వులు గట్టెన్. 185

చ. కలితతురంగభంగ, రథకాండతిమింగిల, కుంభినక్రి, సం
చలితమహాబాగ్రిశౌర్యపరిసర్పితసైనికమత్స్యరాజిచే,
నలఘుతరాంధకప్రకర యాదవ భోజ బలాబ్ధి ఘోషతోఁ
గలఁగెను రోషవాతపరికంపితమై జనదుర్నిరీక్ష్యమై. 186

క, గాంగేయుతోడ యమజుఁడు
" సంగర మగుభంగి దోఁచె, సవనము విఘ్నం
బుంగనకుండఁ, బ్రజాక్షయ
ముంగాకుండన్ బ్రశాంతిఁ బొందింపు మనన్- 187

క. నీసవనమునకు విఘ్నముఁ
జేసెడుసాహసులుఁ గలరె, శ్రీకృష్ణుండే
వాసిగఁ జేకొని కావఁగ?
నీసంశయము మేల నీకు నిందుకులేశా!- 188

క. యదుసింహంబెది కానక
నిదురంబడినటు నటించు నిజముఁగన కిటుల్
వదరెడిఁగుక్కలు నిక్కుచు;
నది లేఁగిన నెవ్వరి బ్రిదుకునా? యని నవ్వన్- 189

క. అది సింహమె? యివి కుక్కలె?
ముదివగ్గా! మేలుమేలు, బుద్ధి చిగిరె; నీ
వదిరా! గ్రామవరాహ మ
గుదు వాకురునాథునింటఁ గూటికిఁబడుటన్- 190

చ. ముదిమదిఁదప్పి నీవు పరముండని కృష్ణుని బ్రస్తుతించుచున్
బదరెదు రాజలోకమును; బాపురె! యిట్టిబిభీషికోక్తిఁ గో
విదు లిట మోసపోవుదురె? వీరులు నూఁకొనువారె? భీష్మ, నీ
వదురుడు మాన్ప వాయిపయి వాతలువెట్టెడువారు గల్గరే? 191

ఉ. వీడక ధర్మపుత్రుఁ డవివేకత నీ యనువర్తియాటచే,
నోడకు గట్టఁబడ్డదగునోడవలెన్, జనుపాంధుఁ డేగునా
జాడను బోవునంధునటు సంకటముల్ పడు; [illegible]
జూడెము కృష్ణుఁ బెద్దగను; వానిమహాత్త్వము మ [illegible] మెఱుంగమే? 192

సీ. పాలీయవచ్చినపడతిఁ జంపెను; బక్క
జనవసిఁ గూల్చెను; బండి విఱిచె;
నీటిపామును మెట్టి మేటిచిందులు ద్రొక్కె;
గొల్లబొట్టెలగుట్టు కొల్లబెట్టె;
నల్లుఁడంచని పిల్వనంప మామను జంపె;
గోవును వధియించి లావుమెఱసె;
మద్దిచెట్లను ద్రోసి మగధీరుఁ డనిపించెఁ;
బుట్టంతకొండను బట్టియెత్తె;
గీ. ఇట్టివీరుని, ధీరుని, నిట్టిమహిముఁ
బొగడ నీనాల్క నొకవేయిముక్కలుగను
వ్రియ్య నిడవలె నోరోరి! వాఁ డదెట్టు
లర్ఘ్యదానంబునకు యోగ్యుఁడయ్యెఁ జెపుమ? 193
ఉ. గోవుల, విప్రులన్, సతులఁ, గూడిడువారల, నమ్మువారలన్,
బ్రోవుమటంచుఁ బాదముల మ్రొక్కెడువారలఁ జంపువారికిన్
దావలమౌను ఘోరదురితం బనిఁ పెద్దలబుద్ధి! యిందు నీ
దేవుఁడు చేయనట్టియది తెల్పు మొకండది వింత మందఱన్? 194
గీ. పరుని వలచినకన్యకఁ బట్టితెచ్చి
తీవ! యది ధర్మదూరమం చెఱిఁగివుచ్చె
నీదు సోదరుఁ; డిటువంటి నీతివిదుఁడు
మీవు నొకసత్యధర్మనిర్ణేత వౌనొక్కొ?- 195

క. అరయ ననపత్యమనిమెడు
దురితము నిన్నొరయుగతికి దుఃఖింపవ; యీ
గురివెందగింజ నీతులఁ
బరఁగించెదు, నీదుధర్మపథ మిట్టిదె పో! 196

చ. ఇతనిఁ దివిక్రముం డనుచు నెంతయు స్తోత్రముఁ జేయుచుంటివీ
హతకుని నొక్కఁడీ వెఱుఁగు దట్టె! బృహద్రథ సూను ధాటికిన్
మఱి గతిమాలి పాఱెఁ బదిమారులు; సిగ్గఱి భీమసేనునిన్
జతఁగొని చంపె మోసగతి; చక్రిపరాక్రమ మేమి చెప్పుదున్. [197

క. పొగడుటయు నీకు వలసినఁ,
బొగడంగారాదె కర్ణముఖ్యుల, మఱి నీ
జగతీశ్వరు దుర్యోధనుఁ
బొగడుము సౌబలుని; హరిని బొగడకుతాతా! 198

క. పరనిందన, పరకీర్తన,
మఱి నాత్మస్తుతియు నార్య మతములు గావం
టెఱుగవొ పెద్దలనుద్దులు?
నరువదిదాఁటుటను నీకు నరులు మరు లొకో? 199

చ. అని, కనులెఱ్ఱఁజేసి కనె నట్టె నదీసుతు; భీముఁ డక్షులం
దనలము రేగఁగా, భృకుటిమూడఁగ, పండ్లనుగీటి; పాదఘు
ట్టన భువిక్రుంగమీఁటి; బెగడన్ జగముల్ తెగియార్చి,పేర్చియు
ట్టనె శిశుపాలుపైకి నొకలంఘనతోఁ బడఁజూడ నంతటన్ — 200

పా॥ 197 పా॥ 4 అ॥ 12 ఁజక్రి; ప॥ 199 పా॥ 3 అ॥ 1- టెఱుఁగవొ;
ప॥ 200 పా॥ 2 అ॥ 14- ఁబ;

క. గంగాత్మజుఁ డది కనుఁగొని
చెంగిటికిఁ దిగిచి భీము చెయిఁ బట్టుకొనెన్;
పొంగెడుజలనిధి వేలా
సంగతియటు వాయుసుతుఁడు చల్లన బడియెన్. 201

సీ. భీముమోమును గాంచి భీష్ముఁ డంతటఁ బల్కె:-
దమఘోషుఁ డనునృపతనయుఁ డితఁడు
పుట్టి చతుర్బాహువులు మూఁడుకన్నుల
తోడ, రాసభమట్టు లేడువంగ;
దానిని గని తల్లిదండ్రులు దుఃఖింప
నశరీరవాణి తా నపుడు వల్కె:
"నెవఁ డెత్తికొన వీని యెక్కుడుకన్నును
బాహువు లడఁగునో వానిచేత

గీ. వీఁడు మృతినొందు" నని; వారు పిల్లవాని
నెల్లవారికి నెత్తికో నిచ్చుచుండ;
హలియుఁ గృష్ణుఁడు రాఁ గని, యటులె మేన
యత్త సాత్వతి సుతు నిచ్చె నెత్తికొనఁగ. 202

ఆ. మొదట రాముఁడెత్తె, పిదపఁ గృష్ణున కిచ్చె,
నాతఁ డెత్తికొనఁగ నడఁగె వీని
యెక్కుడైనకన్ను నెక్కుడు బాహువుల్;
తల్లి భీత యగుచు దరిసి హరిని- 203

ప॥ 201 పా॥ 3 అ॥ 1- బొం; పా॥ 4 అ॥ 15- (బ;
ప॥ 202 పా॥ 3 అ॥ 5- ర్వా;

ఆ. కొడుకుఁ గావు మనుచు నడుగ నత్తకు శౌరి,
మొగి శతాపరాధములను సైప
బాసనిచ్చెఁ గానఁ, బద్మాక్షు చేతనే
చచ్చు, నొరులచేతఁ జావఁ డితఁడు- 204

గీ. కాన, నను గట్టెదుటఁదిట్టి తాను బ్రతికెఁ
గాక,మద్బాణవహ్నిసంఘాతమందు
నుఱికి శిశుపాలశలభ మిట్లుండఁగలదె?
శౌరి యున్నాఁడు, నీకేల సాహసంబు? 205

క. అని భీముని వారించినఁ
గని శిశుపాలుండు కినిసి, గాంగేయా! భీ
ముని విడు; కృష్ణా! నీ
వును ర మ్మాభీష్ముఁ గూడి పోరొనరింపన్" 206

క. చక్రధరుం డదికని, నృప
చక్రము విన, మేఘగర్జసమరవసంరం
భక్రియ నిటు లాడెను, ని
ర్వక్రగభీరముగ, వెఱఁగుపడఁగ సదస్యుల్:- 207

చ. వినుఁ డిట నెల్లవారలును! వీఁ డగు మేనమఱంది మాకు; దు
ర్వినయుఁ డకారణంబుగను వేరము మాయెడ నూని, ద్వారకన్
అనలము వెట్టి కాల్చెనొలయన్ విహరించెడు భోజులన్ సతీ
జనములతోడ రైవతకశైలమునన్ హతమార్చె నిర్దయన్.208

సభాపర్వము, ప్రథమాశ్వాసము.

క. మాతండ్రి సలుప సవనము
ఘాతకమతి యజ్ఞఘోటకమును హరించెన్;
నీతిచెడి బభ్రునింతినిఁ
బాతకుఁడై యపహరించి భార్యగ నేలెన్-

క. మఱి నాపరోక్షమందున
దురితంబులు సాల సలిపెఁ; దొల్లి కటిమాటల్
గుఱిఁగొని సైచితి; నేఁ డిటు
పరిభవ మొనరింపఁ జొచ్చెఁ బ్రత్యక్షముగన్-

క. అన; నీయనుగ్రహంబును,
గన నీయాగ్రహము రావు గవ్వవిలువకున్;
మునుసాళ్వుఁ దలఁచినకన్యను
గొనుటకు మది నింతసిగ్గుఁగొనవు దురాత్మా!

ఆ. అని, దురాగ్రహమున ఘన దుర్మదాంధుఁడై
తూలనాడి, చాలగోలసేయు
చెనఁటి, నీచు, మూర్ఖు, శిశుపాలుఁ దిలకించి
చండభానుఁ డనఁగ శౌరి మండి-

క. తలఁచెన్ జక్రము, నయ్యది
చెలఁగఁగ నార్భటము, దెసలు చెదరఁగ; నరుణుం
డలపూర్వాద్రినిఁ దోఁచెడు
లలిగా హరికరముఁ జేరి లావున మెఱసెన్.

క. కొని దాని హరి విసర, నది
యనలశిఖల్ గ్రిక్కిఱికొనుచు, నార్భటిలుచు వే
సని శిశుపాలుని శిరమును
దునిమె; నగమువోలెం దనువు దూలెక నేలక. 214

సీ. చైద్యు దేహంబునందుండి సరభసముగ
దివ్య తేజంబు వెలువడి తివిరి వచ్చి
దేవ దేవుని కృష్ణుని దేహమందుఁ
జొచ్చె, సభ నెల్ల వారలు చోద్యమంద.

క. ఆడిరి కిన్నరసానులు
పాడిరి యచ్చరలు; పుష్పవర్షము గురిసెక్
వేడుక మునులెంతయుఁ గొం
డాడిరి హరి, ధర్మజులను, యజ్ఞవిభవముక. 216

సీ. అగ్నిసంస్కార మొనరింప నాకశేబ
రమును బంపించి, యాతనికొమరుఁ దెచ్చి
చేదిరాజ్యంబునకు నభిషిక్తుఁ జేసి
యాగముఁ బ్రిశాంతముగఁ దీర్చె నచ్యుతుండు. 217

సీ. మయసభఁ దిలకింప మనసౌట దుర్యోధ
నుం డొంటిఁ దిరుగుచు నుండ, నందు
స్ఫటికమ ద్వారంబు దెలియఁగక చొచ్చి, ఫా
లముఁ దాఁకఁ గుడ్యముల్ భ్రమణ మొంది,

నీరున్న తావుల నేఱినేఱుంగక మున్ని,
యెండవఱావులఁ బాఱునే ఱటంచుఁ
గట్టుపుట్టము నెగబట్టి తడవు చేగి
జలములఁ గానక సంశయించి
గీ. నిజ మరయు రాక తిగ్గుతిన్నైలను నుఱికి
జాఱి వేసారి లజ్జచేకూరి, దిక్కు-
దారిఁ గనలేని యతని దుర్దశను గాంచి
నగ వెగసె మేడపైనున్న మగువలందు. 218

అనిలజుం డద్ది కని " మానధనుఁడ! యింద"
మనుచుఁ గేలూని పథమున కతనిఁ దెచ్చె;
"నగియెఁ బాంచాలి, భీముండు దెగడె" ననుచు
నలుక రారాజు చనె;- నిట నధ్వరమున- 219

జనపతులు గాన్క- వెట్టిన
ధనరత్నసువర్ణమణి వితానము; లటవం
డినవివిధ భక్ష్యవరభో
జనతతు లొక్కొక్కటి మేరుశైలముఁ బోలెన్. 220

ఓలిని జనముల భోజన
శాలల కడనుండి వెడలిచని పాయలునై,
కాలునలై, వాహినులై
పాలుం బెరుగును ఘృతంబు పాఱెనుబురిలో:- 221

ప॥ 218 పా॥ 2 అ॥ 7- భాఱునేఱటంచు; పా॥ 3 అ॥ 6- నెగఁబట్టితడవుచేగి;

గీ. భూసురులు, యాచకాళియు, మూటఁగట్టి
మెత్తఁజాలక, ధర్మజుఁ డిడిన భూరి
దాన, దక్షిణముల, రత్న, ధన, సువర్ణ
ములను విడలేరు; మోసికొంపోవలేరు. 222

ఆ. చెలఁగి యవభృథాభిషిక్తుఁ డౌఘనయశో
నిధికి, ధర్మజునకు నెమ్మిమీఱ
నాశిషంబు లిచ్చి యరిగిరి దివిజులు,
భూభుజులును, మునులు, భూమిసురులు. 223

క. మునిపతులు, నృపులు, విప్రులు
జనఁగా, ధర్మజుఁడు రాజసదనములోనన్
అనుజులతో ద్రౌపదితో
వనజాక్షునిసేవ నుండె వారనిభక్తిన్. 224

చ. మణిమయపీఠిపైన హరిమండితుఁడై చెలువొందఁగాఁ; గవల్
వెనుకొని నిల్చి చామరుల వీవఁగ; ముందట భీమపార్థులున్
గొని చరణాంబుజంబులను గూర్మిపేరిమి నొత్త; ధర్మనం
దనుఁ డలదవ్వులన్ నిలిచి తన్మయుఁడై హరి మోముఁగాంచఁగన్. [225

క. శిర మొకయించుక వాలిచి
కరయుగళిని మోడ్చి, నేత్రకంజాతములన్
దరలఁగ మోదాశ్రువు, లా
హరిపదములఁ గృష్ణ చూడ్కు లానిచి యుండెన్. 226

ప॥ 225 పా॥ 2 అ॥ 5- చామరమ్ములను; పా॥ 3 అ॥ 14- 8;
ప॥ 226 పా॥ 2 అ॥ 16- లం;

క. హరి కౌంతపడికి, నాయుం
దఱు నొగి నొకరొకటి మొగము దర్శించి, మఱిం
బరికించి ధర్మజుని, బం
ధురగతి నవె వారి కరుడు దోఁపఁగ మదిలోఁ- 227

ఉ. కాంచఁగఁ, గాలమొక్కగతిగా నత మెట్టిరుకైన సాగి రా;
దెంచఁగ బుద్బుదంబుగతి నేర్పడు సంపద; బుద్ధిమంతు లీ
సంచు నెఱింగి సంతతము సత్యము ధర్మముఁ బాయకుండ్రి; తా
నెంచి రఘూద్వహుం డడవి కేగఁడె తమ్మునితోడ భార్యతోఁ [228

క. వసుధారమణుఁడు సప్త
వ్యసనంబులజాడఁ జనఁగవలవదు; కడుఁగీ
డెసఁగును; తెలివికి నదియే
మసిపూతయ! దానితగులు మానుటశుభమా. 229

క. అని వినిచి; తక్కపాండవు
లను గని: యగ్రజునిపలుకులఁ విధిగాఁగఁ
గొని, యెల్లరై కమత్యము
దనరఁగ వర్తింప, బుద్ధితగుభ్రాతలకున్. 230

క. పతివాక్యమె పరమార్థము;
పతియే పరదైవతంబ పత్నికి; పతియే
గతియును, మతియును, మానము;
సతిదోవది! సతికి పతియె సర్వస్వంబున్. 231

క. అని వినిచి వారికెల్లను
చనివచ్చెద నంచుఁ జెప్పిచన; వెంబడి నే
చను దేరపాండవులు- వీ
డ్కొని, హరి రథ మెక్కి చనెఁ గడుఁజవగతితోఁ-

ఆ. ఎంతదవ్వు చూడ్కు లేగునో, యందాక
నిక్క హరిని, రథము, టెక్కియమును-
ధూళిఁ జూచి; ధ్యానమాలించి పాండవుల్
సనిరి, సిరిఁ దొలంగిచనెడునట్లు.

క. అని వినిచిన వైశంపా
యను జనమేజయుఁడు గాంచి, యతిహర్షమునన్
వినమితశిరుఁడై, చెప్పం
గను వేఁడెను, ముందునడచుకత కుతుకమునన్.

ఆ, మునిమనోబ్జభృంగ! ఘననీలరుచిరాంగ!
సదమలాంతరంగ! సాధుసంగ!
రాయదుర్గవాస! రవికోటిసంకాశ!
విబుధహృన్నివేశ! వేంకటేశ!!

సభాపర్వము, ప్రథమాశ్వాసము సమాప్తము.



# ఆంధ్రభారతము.

## సభాపర్వము.
## ద్వితీయాశ్వాసము.

♦ దుర్యోధనుఁడు శకునితో రాజసూయములో తనకైన పరిభవమును దెలుపుట. ♦



క. శ్రీదీనావన దీక్షా,
యాదిత్యవిపక్షశిక్ష, యాశ్రితరక్షా,
శ్రీదయితాహృద్యాభరణ
వేదవినుత విపులచరణ, వేంకటరమణా. 1

క. వినుపింపవె యానలికథ
యను జనమేజయున కిట్లు లను వైశంపా
యనుఁ, "డటు మఱఁదులు ద్వారక
కనుపఁ దిరిగి తిరిగి చూచు చరిగెఁ హరియుఁ. 2

క. శ్రీవరునికరుణఁ బాండవు
లావడువున రాజసూయయాగము సలుపఁ
దేవత లద్భుతపడిరి; ది
శావలయము వెలిఁగెవారి సత్కీర్తిరుచిఁ. 3

క. తన వెలుఁగున జక్కవకవ
కును గడుసమ్మోదము కూర్చి, కూర్చుజగద్బం
ధుని గాంచి దివాంధము వెత
గొనుగతి దుర్యోధనుండు కుందె నసూయన్. 4

క. మయసభఁ గనినప్పటినుం
డియుఁ గురుపతిమది నసూయ నెక్కొనఁ, గుడు ప
ప్రియ మయ్యెఁ; గూర్కు నొల్లవు
నయనము; లతఁ డంతకంత నవయన్ దొడఁగెన్. 5

మ. అనుపమమై యపూర్వమయి యద్భుతమై తనరారుతత్సభన్
గనుఁగొనినంత, దిగ్భ్రమము గ్రమ్ముచుఁ దెల్విఁ గలంచి తాఱుమా
ఱొనరుప, లేని దున్నటుల, నున్నది లేనటు తోఁచి యేఁపఁగాఁ,
బొనుపడె రాజరాజు తలమున్కలుగా బలుసిగ్గు పైకొనన్. 6

ఆ. నీరు లేనిచోట నీ రంచుఁ జొర, కది
యమరుచోట లే దటంచుఁ జొచ్చి
గాసి కగ్గమగుటఁ గని యెవ్వ తెయొ నవ్వ
టతనియెడఁద శూల మగుచు నాటె. 7

ఆ. ఎవరొనగినన వ్వ దేపాప మెఱుఁగని
ద్రౌపదిది యటం చతండు తలఁచె;
నదియె యకట! యెల్ల యవమానములకంటె
హెచ్చి యతనిమది దహింపఁ జొచ్చె. 8

ఆ. ఆఁడుదానిచేత నవమాన పడువాగ
వానికంటె జగతి హీనుఁ డెవ్వఁ;
డది సహింతు నెట్టు లనె మానధనుఁడు, దు
ర్యోధనుం డుదగ్రక్రోధనుండు

క. ఏవుగాని దురభిమానము
రూపెత్తినవాఁడువోలె, రోషాగ్నిసము
ద్దీపితమతియై, యొండును
దోఁపక యాతండు మిగులఁ దొట్రిలుచుండెన్.

ఉ. అవమతి యాటు సలిపిన పాం
డవులకుఁ దా నల్లె ప్రతియొనర్పెడుదనుకన్
భువనం బంతయుఁ జీఁకటి
కవిసినగతిఁ దోఁచె నతనికంటికి, మదికిన్.

క. నిలిచినయెడ నిలువఁడు, మా
ర్వాలుకఁడు తను బలుకరించు వారలతోడన్;
మెలఁగును సివమెత్తినగతిఁ
దలిదండ్రులు, చెలులు, హితులు తల్లడపడఁగన్.

క. తనయల్లుని యీవికలతఁ
గనుఁగొని దిగులొంది, శకుని కడుపేర్మిడి నా
తని బొదివిపట్టి, యనునయ
మున నిట్లను మనసు కొంచెముగఁ దేలుకొనన్.

ఉ. పోఁడిమి దక్కి వన్నె సెడి, మోమున దీనత నూని, యొక్క మా
టాడక, చల్వఁ గట్టుకొన, కన్నము నీరము నిద్ర నాక, యీ
జాడఁబరుండియుంటయెటులైతి సుయోధన; లెమ్ములెమ్ము; నా
తోడను జెప్పరాని యొకదుర్వ్యథ చేరెనె నిన్ను నేటికిన్. 14

ఉ. "దాఁపరికంబు లేక యొకదారినె నీవును నేను నిన్ని నా
ళ్ళాపగిదిన్ జరించు టదియంతయు నీగతి విస్మరించి, చూ
పోపనియీకృశత్వమును నూని తపించుట యోపఁజాల; నీ
తాప మదేమొ తెల్పఁగదె; దానికి నన్‌బ్రతిసేయ నీగదే" 15

చ. అని తను దేర్పఁజూచుతనయాప్తుఁడు సౌబలుతోడ నాతఁ డి
ట్లను"దొలినుండియైనయదియంతయుఁజూచుచునుండియే మొఱుం
గనిజనునట్లు నన్నడుగఁగా నెటు లొగ్గితి, మామ, నాదునో
టనె వినఁజూచునిర్దయత టక్కున నెట్టులు పుట్టె నేఁటికిన్. 16

ఉ. ఏ దెటులైన, నిందు్రినకు నేనియుఁ గన్నులు కుట్టఁజేయుదా
యాదులపెంపుఁజూచు టనునాపద యేయభిమానియోర్చు; నా
మీఁదట నే సభాస్థలి భ్రమించుచుఁ గుడ్చిన భంగపాటు, నీ
ర్వేదము నెట్టిదేబెయు భరించునె; యింకను నాలకింతువే. 17

చ. "అదిసకలంబొకెత్తు; సభయం దటు భంగమునొందునన్ను ద్రౌ
పదిగని, నైజగౌరవమొ, వావియొ, యొండు గణింప కక్కటా!
మదమున గేలుతట్టి నగి మాయనిగాయము చేసె లోన; నాఁ
డుదినగ,నోర్చునాపురుషుఁడున్ బురుషుండె;యిదొక్కయెత్తుగా"

---

పు॥ 14 పా॥ 1 అ॥ 1-పోఁ; పా॥ 4 అ॥ 18- నేఁటికిన్; పు॥ 15 పా॥ 1 అ॥ 8- ౘ
పు॥ 15 పా॥ 3 అ॥ 5- కృ; పు॥ 16 పా॥ 2 అ॥ 3- ౘదొ; పు॥ 18 పా॥ 3 అ॥ 5- ౘదే

క. ఇటులను దుర్యోధను గని,
కటకటపడి శకుని మిగులగారామున, నెం
తటిగతి రారాజున కని,
మటుమాయ గుణించి మదిని, మమతఁ బలికెన్. 19

ఆ. "ఏను గలుగ, నాచింత నీ కేటి కింత;
పాండవులసిరియెల్ల నీపదములకడఁ
ద్రోయ నేరుతు నొక్కయుపాయమున నె;
లెమ్ము; కార్యసిద్ధికిని సిద్ధమ్ముకమ్ము. 20

క. కలనికి, జూదంబునకును
బిలిచిన, నృపుఁ డొల్ల ననుట విధికి విరోధం;
బల ధర్మజు జూదముకై
పిలిపించి, జయింత మిందు; వెత నుడుగు మికన్ 21

శా. నాసామర్థ్యము నీ వెఱుంగుదు; మహానందంబు చేకూర్తు; న
న్నా సందేహము; ధర్మసూనుఁ బెనుమాయన్ ముంచి, యింతింత నీ
కాసాభాగ్యముఁ గూర్తుఁ; జింతవిడు; భృత్యాళిన్ వెసన్ బంపు మెం
తేసౌందర్యముతోడి శాలనొకటిన్ నిర్మింపఁగా నింతలో. 22

అతని కాశాలఁ జూపెద మనుసేవంబు
పెట్టి యొప్పించి, రప్పించి, యొట్టులేని
జూదమున డించి, క్రమముగ సోలఁ జేసి,
కైకొనుద మెల్లసిరి, ప్రతీకార మెసఁగ. 23

---

ప॥ 20 పా॥ 3 అ॥ 1- ద్రోయ; ప॥ 21 పా॥ 4 అ॥ 1- పిలిపించి;

క. మగువనగవునకుఁ బ్రీతిఫల
ముగ బానిస లైనమగలమొగితో నీదా
సిగ దాని గొలువఁ జేసెద;
వగ విడి పిలిపింపు మిటకు వడి ధర్మజునిన్. 24

గీ. ఆతనికి జూద మనినఁ జేరాస గాని,
యందు గెలిచెడునేరు పావంత లేదు;
మనమె గెలుతుము; విషు మనుమాన, మింకఁ
గుదుటవడని మ్మొకింత నీమది తనంత. 25

గీ. అయిన, మునుముందు మనయీప్రయత్నములకుఁ
దొలుత నీతండ్రియె డఁబడవలయుఁ; గాన
నతనిసమ్మతి వడయుటయొందె నీకుఁ
గలుగునేర్పంతయును జూపవలయు సుమ్మ. 26

ఉ. నెత్తముమాట తండ్రికడ నేర్పున నెత్తుము నేఁడె; నాఁడక
స్మాత్తుగ నెత్తజూచుట సమంజసమై కనిపింప; దందె త
చ్చిత్తము నేఁటినుండి పనిసేయుచు నున్న; నతండు దానికిన్
మెత్తవడంగ: మార్వ్యాలుక నేరఁడు నాఁటికి నీదుమాటకున్, 27

♦ దుర్యోధనుఁడు, పాండవులను జూదమాడఁ బిలిపింపుమని,
తండ్రిని నిర్బంధించుట. ♦

చ. అనిన నతండు తేఱి, ముదమారఁగ సౌబలు సన్నుతించి, పీ
డ్కొని, తనతండ్రియున్నయెడకున్ జని, కోరిక నుగ్గడించి, యు
పనికొఱ కొక్కనూతనసభాభవనంబును గట్టఁజేయు మం
చును, యమసూను నచ్చటికి జూదముకై పిలిపింపు మంచనన్

ఉ. అచ్చెరువున్, భయంబుమది నావహిలన్, ధృతరాష్ట్రుఁడాత్మజున్
మెచ్చక, "జూద మెవ్వరికి మేలుఘటించు; నిదేటికోర్కె; యే
పొచ్చములేనివంశమును ముంచెదవే యపకీర్తివార్ధి; నీ
చిచ్చు దహించు నందఱ నశేషముగా; వినునాహితోక్తులన్. 29

మ. విదురుం డొప్పనె, ద్రోణుఁ డీకొనెడునే, భీష్ముండు సైరించునే;
తుద నీకేనియు సమ్మతంబె; యకటా! దుర్మార్గులెవ్వారొ నీ
కిది బోధించిరి; మాను మీతలఁపు; లేదే వేఱుమార్గంబు నీ
కొదవల్ దీర్చుకొనంగఁ; బాండవులు నీకున్ లాఁతివారే సుతా. [30

క. అంతకు మించినసభ ని
ర్మింతము; జన్నంబు సేయ మేకొందము వా
రెంత గని, రంతయును గని
సుంతయుఁ గొదలేక మను యశోవంతుఁడవై". 31

గీ. అనుచు జనకుండు నొడివినయంత, నతని
పలుకు ములుకై చెవిన్ దూఱ, వంతనొంది
యాతఁ డిట్లనుఁ, దండ్రి, దాయాదిచేత
నాకుఁ బరిభవ మగుటయు నీకు హితమె. 32

సీ. ఆశాంతసకలదేశాధీశు లరుదెంచి
వేర్వేఱఁ గాన్క లర్పించుచుండ,
మునీంద్రగణవేదమంత్రఘోషలు దిశా
వలయంబు దాఁకి మిన్నలముచుండ,

సీ. సురపాదిసకలనిర్జరపాళి గుమిగట్టి
దివినుండి యాశీర్వదించుచుండ,
హరి సహాస్రిక్షుఁడై, యందెందు నేలోఁటు
పొరయన ట్లఖిలంబు నరయుచుండ;
గీ. మయవినిర్మితాద్భుతమహామండపమున
సింహపీఠి ధర్మజుఁడు భాసిల్లుచుండ,
నిఖిలలోకవైభవ మెుక్క నెలవునందె
వాలె నన మించెఁ బాండవప్రాభవంబు. 33

ఆ. అపుడు, తానె యుర్వినంతయు నేలిన
ట్లొరగంట నొక్కసారి నన్ను
మూదలించుచున్న మునినవ్వుతోఁ గన్న
భీముచూపు నెట్లు విస్మరింతు. 34

కం. పాంచాలి యింక నా కొన
రించినది దలంప జలదరించు శరీరం;
బెంచ వెనుకాడు నాలుక;
కొంచక యదియెల్లఁ దవ్వికొన నేల మఱిన్. 35

ఆ. కొడుకు నీకు వలయునెడఁ బాండవాగ్రజు
రయముమీఱ నిటకు రాఁబనుపుము
లేకయున్న నీకు నా కింతతోఁ దీఱె
బుణ మటంచుఁ దప్ప కెటిఁగికొనుము. 36

క. "పరిభవమున మనుకంటెను
మరణం బుచితంబు సదభిమానులకు; యుధి
ష్ఠిరుఁ డాడుక్కటొ జూదము, నే
మరణించుటొ నిశ్చయింపుమా, యేయొక టేన్" 37

సీ. ఇటులాడుసుతుఁ గాంచి కటకటపడి ధృత
రాష్ట్రుండు వానిమూర్ఖతకు వగచి,
యెది సేయు ముందు నూయియు వెన్కఁ గోయియై
తోఁపఁగాఁ గొండొకసేపు మదికి
నొందు దోఁపక యూరకుండి యామీఁదటన్,
సుతు నీగికొనుకంటె జూదమునకుఁ
బాండవాగ్రజుని రాఁబనుచు టప్పటికి ల
గ్గని నిర్ణయించి, యాతనయుతోడ,

గీ. నీతి విదుఁ డగువిదురుతో నీతలంపు
నుడివి, యాతనిసమ్మతి వడసి పిదప
నాతనినె పంపుదము పాండవాగ్రజాతు
నిటకుఁ దోతేర" నన, సుతు డిట్టు లనియె. 38

చ. "విదురు నెఱుంగమే; యతఁడు పిన్నతనంబుననుండి మమ్ములన్
మదిసహియింప కాపృథకుమారులనే కడు మెచ్చుచుండు; నీ
కిది విదితంబు; జూదమునకిప్పుడు ధర్మజుఁ బిల్వఁబొమ్మనన్
మదిమది నాతఁ డందులకు మైకొనునే; పని సాగివచ్చునే." 39

చ. అన విని,యాంబికేయుఁ;"డిదియంతయుఁదథ్యమె కాని,యిప్పు డీ
పనికి నతండు తక్కఁ బెఱవారలు చాలరు; పాండవాళి కా
తనియెడఁ బ్రేమ పెల్లగుటఁ, దద్విదురుం బలవంతపెట్టియే
ననుపుద" మన్న నొక్కక్షణ మారసి, పల్కె నతండు తండ్రికిన్. 40

క. ఈవగ విదురునె యనుపఁగ
నీ వెంచితివేని, యతని కీజూదపుమా
టే వచియింపకు; వెడలక
పోవునొ యాతండు జూదమున కని తెలుపన్. 41

క. తోలుత నొకదివ్యభవనము
వెలయింతము, ధర్మసుతుని బిలుతము దానిన్
దిలకించు నెపంబున; నా
వలఁ జూతము కోర్కె కలసివచ్చు తెఱంగున్. 42

క. మనపని యెఱుఁగును విదురునె
యనిపిన నని తలఁచితేని, యనుపు మతం డే
మనినను దగ బదు లిడి యని
చనె వెస నతఁ డొకనవీనసభ నిర్మింపన్. 43

సీ. ఆవల ధృతరాష్ట్రుఁ డతిదీర్ఘయోజనా
మగ్నుఁడై, మిగుల నుద్విగ్నుఁ డగుచు,
జనన మందినదాదిఁ, దనసేమ మరయుచుఁ,
దన కంతకంబె నీధరణి నెందు

హితు లేరు లేరనుగతి నొప్పువిదురుతో
మాట జూదపుమాట మనసురాక,
యున్నదున్నటు చెప్పి రొప్పింత మని నిశ్చ
యించియుఁ గడు నుమ్మలించుచుండి,

గీ. ధర్మపర మగునతనిచిత్తమ్ము నెన్ని
పిదపఁ బాండవాగ్రజుసాధువృత్తి నెన్ని
మఱి యటులె పుత్త్రమరణోద్యమమ్ము నెన్ని,
వడవడవడంకు చూరక మిడుకుచుండె. 44

సీ. ఈవల రాజరాజేమాత్రి మాలసిం
పక నిజాభీష్టంబు వడయుకొఱకు
నీపాటివ్యయమున కేనియు వెనుదీయ
కెట్టిసాహసమున కేనివెఱకక,
చూడనిందుమ్రసకుఁ జక్షులు, నుతింపఁగ ఫణీ
శునకు జిహ్వాలు చాల వనెడుభంగి
నతుల మత్యద్భుతం బగుసభామందిర
నిర్మాణకార్యంబు నిర్వహించి,

గీ. యదియు మును తాను భావించినంతకంటెఁ
ద్వరితముగ సిద్ధమౌటకుఁ గరము మురిసి
శిల్పక దెఱిగించి, తనకోర్కె స్మృతికిఁ దెచ్చి,
[illegible] చూడఁగ యుధిష్ఠిరునికొఱకు. 45

♦ ధృతరాష్ట్రుఁడు పాండవులఁదోడి తెచ్చుటకు విదురునిఁబంపుట. ♦

గీ. అప్పు డిఁక నేమిసేయలే కంధనృపతి
విదురుఁబిలిపించి, సంకోచమదిమిపట్టి
యల్లనల్లన సుతుఁ డన్న దెల్ల వినిచి,
యాత్మ జంకుచు నతని కిట్లనియె మఱియు. 46

గీ. "జూదమున కెట్టులో ధర్మజుని దరల్చ
పిలిచికొనిరాక నీకుఁ దప్పినది కాదు,
నీతిబాహ్య మిదంచుఁ జింతింతుఁ గాని,
యొక్కటియుఁ దోఁపక దేమి సేయుదునువిదుర." 47

చ. అన, విదురుండు విస్మయత నాత్మఁ దలంకి కలంగెఁ; గీర్తిమైఁ
దనరినభారతాన్వయము తాఁనె దురోదరకారణంబుగాఁ
దనమొదలంట బ్రుంగ్గి పతితం బగుదుస్థితిఁబారిఁ జిక్కినన్,
గనుఁగొననేర్చు నెట్లతఁడు కాయమునన్ గొఱప్రాణముండఁగన్ [48

ఆ. అగ్గలంపువగకు నగ్గమౌట నతండు
తోడనే నరేంద్రుతోడ నేమి
పలుక నోడి, తెలిసి, మెలమెల్ల గొద్గది
కమున నిట్లు పలుకఁగాఁ దొడంగె. 49

క. "రూ పెత్తినధర్మముతో
నీపలు కాడంగ నాకు నెటు నోరాడున్;
ఛాపమున నతఁడు కురుధఁడె
పాపపుజూదంపుమాట పడినంతఁ జెవిన్. 50

క. "నిర్మలవర్తనుఁడై, దు
ష్కర్మము మది నెపుడుఁ జొనిపి కానని గుణియై
ధర్మజునకు నీపలు, కయొ!
మర్మవిభేదకము కాదె; మన మెఱుఁగ మొకో. 51

సీ. అని పలికి. జూద మెట్టిదుర్వ్యసన మగుట,
యెంతటియనర్థముల కదియిక్క యగుట,
దానఁ దమవంశమున కెంతహాని యగుట,
యంతయును దెల్పి, మఱల నిట్లనియె నతఁడు: 52

ఉ. "కన్నులు లేనినీ కకట! కౌరవులున్, బృథపుత్రులున్ సదా
కన్నులుగా, సమాను లయి కన్పడుచుండిరి కాదె యింత; కా
యన్నలు దమ్ములున్ బగకు నగ్గము కాన్, బిత నీవు మాన్పఁగా
నెన్నక, వారివైరమును నింకను బెద్ద యొనర్పఁ జూచెదే. 53

చ. కొడుకున కిట్టిబుద్ధి మదిఁ గోల్కొనినప్పుడె బుద్ధి చెప్పి, యా
చెడుగు నడంపఁజూడక, నశించెడు వంశము నాక, నీవె యీ
వడువున నన్ను బంపుటకుఁ బొల్పడి; తింటుల కోప నోప; నీ
యడుగులఁ ఛట్టుకొందును; దయామతినన్ను క్షమింపఁ జూడుమా."

మ. అనుచున్ బాదము లంటునవ్విదురుతో నాయంధభూపాలుఁ డి
ట్లను,"నీ వేటికి నింతగా, విదుర, నా కారీతి వాకుత్రివ్వ, నేఁ
గననే నీగుణమున్, యుధిష్ఠిరునిసత్కార్యానురక్తిన్, మఱొం
డొనరింపన్, వచియింపఁ దోఁప కకటా! యీఁకొంటి నిద్దానికిన్.55

ఆ. "దుష్టుఁడైనసుతుని దూరంబుసేయు మం
చెంతి యొక్తి విధి విధించుచున్న,
నిట్లు మమత నను జయించెను దుదకు; నే
నేమి సేయువాఁడ, నీవె చెప్పుమ. 56

ఆ. "ధర్మ మొక్కప్రక్కఁ దనయు నింకొకప్రక్క
నునిచి తూఁప. ధర్మమును దొఱంగి,
ముల్లు తనయుదెసకె మొగ్గుచున్నయది, నా
తప్పా; లేక తండ్రితనముతప్పా. 57

ఉ. "ఏటికిదంతయున్, విదుర, యెట్టులొ ధర్మజుమ్రోల జూదపున్
మాటయె తేక, నూత్నభవనంబును జూపుట యొండె చెప్పి. యి
చ్చోటికిఁ దోడితె; మ్మవల సూనుమనోగతి యెట్లుమాఱునో
నాఁటి" కటన్నఁ, దత్సుతుని నైజ మెఱింగినయాతఁ డార్తుఁడై. 58

ఉ. "భూప, యిదేమి, యిట్టిపెడబోధ యొనర్చెద వేల; సద్గుణో
ద్దీపితుఁ డైనధర్మజుని తేజముఁ గాంచిన నాలు కాదునే
డాఁపఁగ నాకుఁ గల్ల, కపటంబు; మనం బెటు కుంగిపోదె యా
పాపవిదూరు నంచనకుఁ బొల్పుఱపన్ దలపోయ నా" కనన్. 59

గీ. నృపతి లో నెంతొ నొచ్చి వచించె నిట్లు,
విదుర, నీ కెట్లుహితత మని మదికిఁ దోఁచు
నట్టులే యాడి, తోడితె మ్మతని నిటకు;
నిందు నీకంటె నా కాప్తు లెందుఁగలరు? 60

శా. "కౌంతేయాగ్రజుఁ డిందు వచ్చునవలన్ గార్యంబు చేసెదనము
న్నెంతేనొద్దిక సాహసింతిము రవంతేనిన్ బ్రియాకం పడే
చెంతన్ రానటు; రెండుపక్షములకున్ సేమంబు చేకూరఁగాఁ
బంతంబుల్ తెగఁజూత; మింత మటుపై భారంబు దైవంబుపై. 61

గీ. "తప్ప కీమెడ కాధర్మతనయుఁ గొనుచు
రాకయుండెన, నాదుపుత్త్రకుఁడు మడియు;
వాఁడు మడియ, నేను మడియువాఁడ; నన్ను
వాని నిల్పుట నీచేతిలోనిపనియ. 62

♦ విదురుఁడుపోయి పాండవులఁ దోడితెచ్చుట. ♦

గీ. "ఇంక మాటాడ వలదు; నావంకఁజూడు
మింత, పొమ్ము పొ"మ్మని బలవంతపెట్టి
నొండుదోఁపక మనసొప్పకుండ విదురుఁ
డెట్లొ చనె నింటి కడుగుల నీడ్చికొనుచు. 63

గీ. అటు చని యతండు ధృతరాష్ట్రునాన జరుప
నొల్లకుండియు, మొగమోట గొగ్గి తుదకు,
నరమరఁ బ్రయాణసన్నాహ మాచరించి
పలువిచారము లుడికింప, బయలువెడలె. 64

క. ఉరియాడెదుమదిని యుధి
ష్ఠిరుతోఁ బ్రభునానతిని వచింపఁగ, నాతం
డరదంబు నెక్కియల్లన
వరుగుచుఁ దనలోన నిట్టు లనుకొనియె వెతన్. 65

చ, "అది యటు లుండె; నీతలఁచినట్టుల నయ్యెడ నెల్ల వారలున్
ముదితులు; రాజరాజు తనపోకడ నుండె; మహాద్భుతంబునై
పొదలుసభాగృహం బొకటి మొన్న నె కట్టిరి; దాని మీఁకుఁ జూ
పుదు మని మిమ్ముఁ బిల్వ నను బొ మ్మన వచ్చితిఁ దండ్రిపంపునన్.

సీ. "ఆసభాభవనంబునందుధర్మజుతో వి [76
నోదంబుకొఱ్ఱకింతజూద మాడ
మనసయ్యెఁ దనయున కని నీకుఁ జెప్పి; తో
డ్కొని ర మ్మటంచు న న్నని పెఁ దండ్రి;
యెటు చూచినను జూద మిరుపక్షములకు హా
నికరం, బధర్మంబునకు బిడారు,
లేనిరోషం బు, దుర్మానంబు తలకెత్తి,
తనవానినైన నన్యునిగఁ జేసి,
గీ, యెంతకీడైనఁ జేయించు నెదిరి కంచుఁ
బెక్కువిధముల నొక్కిచెప్పితిని గాని.
వినియు ముదిరాజు దుర్యోధనునకె లొంగెఁ;.
బుతునకుఁ దండ్రి యమ్ముదు వోయినాఁడు. 77

క. ఇది నావచ్చినపని, నీ
కెదిహితమని యిందుఁదోఁచు నింతపయిన్, నీ
వది గావింపుము;. నను నీ
మదిఁ దప్పుగఁ దలఁపఁ బోకుమా, యని పలికెన్. 78

క. విని యిది భీముఁడు దుర్యో
ధను నెడ వంచనయుఁ, గీడుతలఁపును గల యు
ట్లనుమానించుచు, వెస ని
ట్లని వాకొనె మిగులఁ జిత్త మాతురపడఁగన్. 79

ఆ. "అంధనృపునియాన కౌదల యొగ్గి, త
దీయతనయుకోర్కెఁ దీర్పకొఱకు
హాస్తిపురికి జూద మాడంగఁ జనుదేర
వలయునా, యి దెట్టివాలకంబొ". 80

క, అనుతమ్ముని భావంబును
దనమదిని గ్రహించి, కొంతతడ వటు భీమున్
గనుఁగొనుచు నుండి, ధర్మజుఁ
డనె నిటు క్షణ మూరకుండి యవ్విదురునితో. 81

గీ. "అనఘు, నీసద్విచార మెంతనఁగవచ్చు,
సతము హితమును, న్యాయసమ్మతమునైన
మాటయే కాని యొండు నీనోట రాదు;
నీపలుకు విన్నగుణి తలయూఁపవలయు. 82

ఆ. "రోగి కౌషధంబు రుచియింపనట్లు లీ
బోధ యొంటునే సుయోధనునకుఁ,
గాలగతి తెఱంగు కన్నవా రున్నారె;
నీవువినుము నాదునిశ్చయంబు. 83

చ. అని తలపోసి పోసి, తగ నాతని నించుక హెచ్చరింపఁ గా
ననువును గాచి కాచి, యది యబ్బమిఁ గంటిని జెప్పవో లెఁ దా
ననయము ధర్మదేవతయె యాతని గాచుచునుండ, నెన్వ రే
మొనరుప నేర్తు రంచు మది నూఱడిలెన్ దుద కామె యెట్టిటో. 94

క. మనసు కరిపురికిఁ దనవా
రిని వెనుకొన నెంత తీవరించినను సతుల్
చన నేలద్యూతసభకని
వనిత తడసె ధర్మతనయు వదనముఁ గనుచున్. 95

గీ. ధర్మరాజాదు లవల రథంబు లెక్కి
హస్తినగరాభిముఖులయి యరుగునంత,
వారి వీడ్కోల్పి కనుచూపు మేరదూర
మారయుచు నిల్వఁబడియుండె యాజ్ఞసేని. 96

క. ఆరథము లవారితగతి
వారిని గొని కరిపురంబుపజ్జకు నరుగన్
దా రచటఁ గురుకుమారులఁ
జేరన్ జని రెదా యశాంతి చిత్తము లలమన్. 97

సీ. ఇట వారిరాకకు నెదురుచూచుచు నున్న
దుర్యోధనుఁడు [illegible]
తిలకించి పరివారములతోడ నెదురేగి
[illegible] గౌరవాదరము [illegible]

నెదలోనికాపట్య మిసుమంత వెలికిఁదోఁ
పఁగనీక లోలోనఁ బట్టి యదిమి,
లేనినవ్వు మొగంబులోనఁ దెచ్చుకొని, ధ
ర్మజుపాదములకు నమస్కరించి,
భీముఁ గౌఁగిలించి, విజయుని, గవలను
జేరఁ దీసి యటులె గారవించి.
యాంబికేయుకడకు నవ్వారి నందఱఁ
గూర్మి తోఁపఁ దోడుకొనుచుఁ జనియె. 98

క. సముచితగతి, ధర్మాదులు
తమరాకను దెలిపి, పితపదద్వయి కెరఁగన్
దమి వారిసేమ మరయుచుఁ,
గ్రమముగ దీవించె నతఁడు కన్నీరొలుకన్. 99

గీ. అవలఁ దనపుత్త్రుఁ బిలిచి, పాండవుల కెట్టి
కొదవ లోదవని సౌఖ్యసంపదలు గూర్చి,
తమ నవీనసభామందిరమును జూపు
పని నియోగించి, వీడ్కొల్పె వారి నతఁడు. 100

క, పిత చెప్పినట్లు కుంతీ
సుతులకు సమకూర్చి సకలసుఖముల, నెందున్
హితులు తమకంటె లేరను
గతి మెలఁగె సుయోధనుండు కడు మెలపు మెయిన్. 101

ఉ. కార్యము కూడివచ్చె నని కల్గినపొంగు నతం డడంచి, చా
తుర్యము సాహసంబునకుఁ దోడ్పడ సౌబలు భానుసూను సో
దర్యుల, నాప్తులం గొని పృథాతనుజాతులఁ గూడి యేగె సౌం
దర్యకళావిలాసముల తావగు నవ్యవిశాల శాలకున్. 102

ఆ. నయనయుగళిఁ దన్పి, మయవినిర్మితసభా
మందిరంబుకంటె నెందుఁగాని
తగ్గదనఁగ నొప్పు తన్మందిరము సొచ్చి,
యంద అరసి చోద్యమంది రెలమి. 103

ఆ, అవలఁ గొంతకాల మామాటయీమాట
చెప్పికొను చొకింత సేపు పుచ్చి,
తుదకు నల్లనల్ల దుర్యోధనుఁడు ధర్మ
సుతునితోడఁ బలుకఁజొచ్చె నిట్లు. 104

చ. "మనమిట నెన్ని సౌఖ్యముల మాటిచి మాటిచి గుడ్చుచున్న, నిం
పొనరుచుకొత్త దానికొఱ కువ్విళులూరెదుఁ జిత్త; మద్దియున్
బొనరుపఁ గొంతసేపుబుసుపోకకు నించుక జూదమాడఁగా
మన సగుచున్న; దిందులకు మానక నీ విపు డీకొనంగదే.. 105

ఉ. "జూదమటన్న నీమనసు చొక్కు; సమర్థుఁడ వందు; దానినిన్
గాదనఁ జాల; విందుఁ గలక్షత్రియవీరులు గాంచియెంతొ స
మ్మోదము నొందువారు; మఱి ప్రొద్దును బోవును; నొల్లనంచు నే
వాద మొనర్పఁ బోకిచటఁ జివల్వురిక్ కోర్కులు దీర్పఁ జూడుమా. 106

గీ. ద్యూతసన్నాహ మెల్ల నాచేత నడచుఁ;
బణము లేనొడ్డెదను, గాని పాచికలను
మామ సౌబలుఁ డేయు; నామాట నడప
నొప్పు; మింక సారెలను దీయుదు నె? యనియె. 107

ఉ. అంత యుధిష్ఠిరుండు తన కంతకుమున్ విదురుం డిదింతవృ
త్తాంతము చెప్పుటల్ స్మృతిపథంబునఁ బాఱ, నొకింత తాళుచున్
స్వాంత మొకింత కుందఁగ నొకసారికిఁ దమ్ములమోము చూచి, య
ల్లంత సుయోధనున్ గని నయంబు ప్రియం బెసఁగంగ నిట్లనున్.108

ఉ. "తమ్ముఁడ యేమికోర్కె యిది; తప్పని తోఁపదె; లే వొకో వినో
దమ్మున కన్యమార్గములు; దానిపయిన్ మన సేల పాఱె; జూ
దమ్మున కిచ్చగింతురె దండినృపుల్ నినుబోలువారు సౌ
ఖ్యమ్ము లివన్నియున్ దుదకు వ్యర్థములై చనుజాడ యేర్పడన్

చ. తొలుదొలుతన్ వినోదముగఁ దోఁచుదురోదర మే క్రమంబుగా
నలుకల రేఁపు; సోదరుల మామనలో నెవ రోడి గెల్చినన్
గలుగునె మోద మందఱకుఁ; గావున నల్పవినోదబుద్ధితోఁ
గులమునకున్ గళంక మొనగూర్చుట మేలె; తలంచి చూడుమా,

ఉ. సంశయ మింకనిన్ విడని చందము గన్పడు; నిన్నినాళ్లు లే
యంశమునందు దేనికిని నైనను సుంతయుఁ దీసిపోనియీ
వంశపుగౌరవంబు నిలుపన్ దలపోయుమ; దానినిర్మల
ప్రాంశుయశంబు నెత్తము నెపంబునఁగూలఁగఁద్రోయఁజూచెదే.

చ. అనుజుమసూనుపల్కులు ప్రియంబులుగాక సుయోధనుండు తా
నను కొనియున్న దిట్లువృథయాటకుఁ జింతిలి, ధర్మపుత్రు నే
మొనరిచియేని జూదమున కున్ముఖుఁ జేయఁదలంచి, రోష వ
తనిమది రేఁప నిట్లనియె దర్పము గొంతున సుంకదోఁపఁగన్. 112

ఉ. "నేనును నేర్తు నింతయును; నీవిటు కోత్రగ నాకు నేర్పఁగాఁ
బూనకు; జూద మాడుటనె పోయెడు నన్యయ గౌరవం బనం
గా నెటునోరువచ్చె; నది క్షత్రియధర్మము గాదె; ధర్మజుం
డౌనొకొ యిట్టియేలిపలు కాడెడువాఁడిది యేటిబింకమో. 113

ఉ. నే నిదె క్షాత్రధర్మమున నెత్తము నాడఁగఁ బిల్తు; నీవునన్
దీనికి నోడవేని, వెనుదీయక పూనుము; కాని యూరకే
దీనత లేనిపోనియుపదేశములన్ జదునంగఁబోకు; నే
వాని వినంగనోప; మగవాఁడవయేని పణంబు నొడ్డవే. 114

ఉ. ధర్మము ధర్మమంచిటు లధర్మపథంబును దొక్కె దేల; నీ
ధర్మజనామమందుఁ గలధర్మము నూడిచి నేఁటిబీఱ వో
కర్మ మి దేమి వచ్చె; నను గాదని యోటమి కళ్కుచుంటి; నీ
మర్మము మే మొకిం తెఱుఁగమా" యనిమీసముఁదువ్వెనవ్వుచున్ [115

క. ఆమాటలు వినినంతనె
భీముని మొగ మెఱ్ఱవాఱె; విజయునికనులన్
బ్రామెను గోపారుణరుచు;
లే మనఁ గన లుడికిపోయి రింతింత కడున్. 116

క. హిమకిరణునియందును వే
డిమి పొడసూపెనొ యనంగ, డెందము రవులన్,
యమతనయునియందును గో
పము పొడసూపెను విరోధివారము బెగడన్. 117

ఆ. అంత సుంతస్సైపుఁ డనఁగ, భీమాదుల
తట్టు చేయిసాచి ధర్మసుతుఁడు
ధీరశాంతియుతగభీరనిస్స్వనమున
నుడివెనిటు సుయోధనుఁడువినంగ. 118

క. "ఓదుర్యోధన, యింతట
పా డుడుగుము; నోరు విప్పవలవదు; సత్యం
బాడుకొని నే వచించుట
నీదు తెలివి తప్పుగా గణింపఁగఁ జేసెన్. 119

చ, వ్యసనములందు నొక్కటిగ నార్యులు జూదముఁ జేర్చియుంట, నా
దెస నిను నీడ్చుచిత్తమును ద్రిప్ప తలంపున దాని కొగ్గఁగా
మసలితిఁ గాని, ధర్మమును మానుతలంపునఁ గాదు; నీతియే
విస మయి నీకుఁ దోఁచె విధిప్రేరణ; నేమి యొనర్తు రెవ్వరేన్.

చ. ఆడెద జూదమున్ విడక న్యాయము, ధర్మము మోముఁజూచి;నీ
వాడెదొ, లేకపో బలుఁడె యాడునొ సిద్ధముకండు; నీవె యీ
నాఁడు కులక్షయంబునకు నాటితి బీజ మటంచు నెంతు; నే
కీడెటు మూడనున్నదొ; తెగించితి వింతకు; నేరిబోధయో. 121

క. కా నిమ్మిఁక జా గేటికి;
రానిమ్మాక్షముల వెలికిఁ, బ్రిప్రిథమమునం
దీ నాసొమ్ములఁ బణముగ
నే నొడ్డెద; నిం కదేమి నీ వొడ్డెదవో. 122

♦ ధర్మరాజు, శకునితో జూదమాడి
రాజ్యమును, ధనమ్ము దమ్ములను ఓడిపోవుట. ♦

క. అని యమసూనుఁడు త్వరపడఁ,
గని దుర్యోధనుఁడు శకునిఁ గాంచిన, నతఁడుఁ
గను గీటెను; నదియే సూ
చన యనుకొని సిద్ధపఱచె సర్వము నతఁడున్. 123

క. అటు సకలంబును సిద్ధమ
గు టెఱఁగడవుగ జూదమునకుఁ గూర్చుండిరి తా
రిటుప్రక్క సౌబలుండును,
నటుప్రక్క యుధిష్ఠిరుండు నయ్యెడలన్. 124

క. మును తా మనుకొనినటె యీ
పని యనుకూలముగఁ గలసివచ్చుట, దుర్యో
ధనుఁడును, శకునియు నొకరొక
రిని గాంచుచుఁ బడయఁ గనిరి తృప్తిన్ దమలోన్. 125

వ. అది యెల్లన్ విని ద్రోణనందనుఁడు ద్రోణాచార్యుఁడున్, భీష్ముఁడున్ విదురుండున్ ధృతరాష్ట్రుఁడున్ గృపుఁడునున్ బృద్ధోశులున్ దత్సభాసదనంబున్ వెసఁ జేరవచ్చిరి మహాసంరంభ మేపార, నాపదశం కించుచుఁ గొందఱున్ గుతూకభావం బూరఁగాఁ గొందఱున్.

గీ. పౌరులంత కపురస్త్రీలు వచ్చి యటకుఁ,
దత్తదుచితస్థలంబులఁ దత్తదుచిత
పీఠములఁ గూరుచుండి రావేడ్కఁ జూడ,
నూర కొక్కొక్క రొక్కొక్క యూహతోడ, 127

క. మును మయసభఁ గన నేతెం
చినయెడ గాంధారి మఱలి నిజపురమునకున్
జనుచోఁ, దను బ్రీతిఁ బిలువఁ
జనుదెంచినకుంతి వారిజత నట నుండెన్. 128

శా. సాగెన్ జూదము; రెండుపక్షముల నుత్సాహంబు రేకెత్తె; ను
ద్వేగంబగ్గల మయ్యె, నాస్యముల నుద్దీపించెఁ గ్రోధంబులున్,
రాగద్వేషము లంతకంత పెరిగెన్; రాపాడెఁ జిత్తంబు; లా
వేగం బెచ్చఁగ. వారిలోఁ గ్రమముగాఁ బెంపొందె మాత్సర్యముల్. [129

గీ. న్యాయపథమున జూదంబు నడచుదనుక,
నెల్లగతుల ధర్మజుఁడె జయించుచుండె,
గురువిభుని గాలిమేడలు కూలనుండె;
శకుని చతురత నంతఁ బాచికల మలఁచె 130

శా. మాయావాగుర నొడ్డి సౌబలుఁ డధర్మద్యూతమున్ బన్నఁగాఁ,
గాయల్ త్రోవలు మాఱిచెన్, దిరిగెఁ జక్రం బేచి యన్యాయమే
జే యంచున్ దెగి యార్చె; ధర్మజుని బాసెన్ లాభయోగంబు; పో
లే యంతంతకు నాశనిన్ బొదివి, మాయించెన్ మనస్స్థైర్యమున్ 131

సీ. అంతటధర్మజుం డదిఁ యొడ్డి యిదియొడ్డి
మహితవిభూషణాంబరము లోడె;
జవనవాజి శతాంగసమ దేభముల నోడె;
రమణీయరాజసౌధముల నోడె;
నిరుపమానహితానుచరసమూహము నోడె;
దాసదాసీజనతతుల నోడె;
విస్తీర్ణనిజరాజ్యవిభవ మంతయు నోడె;
నతులదివ్యాయుధపఙ్క్తి నోడె;

గీ. నోడ ననువైన వన్నియు నోడి, తుదకుఁ
దమ్ములను నోడెఁ; దనోడెఁ దాల్మి నోడి;
యింకఁ దన కెందు నోడుట కేమిలేక
నిస్సహాయత నొంటిమై నిలిచె నతఁడు. 132

గీ. ఓడుకొలఁది రోసము హెచ్చి, యొడ్డి యాడి
యోడి, మఱియాడి, యెంతోడుచున్నఁ గాని,
యొక్క ధర్మ మేమఱ, కాతఁ డొడ్డఁడయ్యె
బ్రాహ్మణాధీనములును, దేవస్వములును. 133

గీ. అంత ధర్మజుదుస్థితి కన్ని కడల
నాసుయోధనుతోడియార్యాళి యెవరొ
కొందఱిని దక్క మిగిలినయంద ఱడలి,
కుందికుములుచు మిగుల గగ్గోలుపడిరి. 134

తెగి యిటు సభ సంక్షుభితం
బగుటకుఁ గారణము నరసి, యాధృతరాష్ట్రుం
డెగరోఁజుచు నోం డాడక,
మిగులవగలఁ బొగిలి, తడవు మిడికెఁ దనలోన్, 135

గురుఁడును, భీష్ముండును, నృప
వరులును, విదురాదిసాధువర్గమును, యుధి
ష్ఠిరుదుర్గతికి నెడందలు
కరఁగఁగ వందురిరి, వేడికన్నీ రొలుకన్. 136

తలఁచినటులె తనదాయా
దుల కటు సోలగుట కలరి, దుర్యోధనుఁ డా
వల ధర్మజుఁ గని, "యొడ్డఁగఁ
గలదె యిఁక క్షేమైన" ననుచుఁ గలకల నవ్వెన్. 137

* ధర్మజుఁడు జూదమున ద్రౌపదినొడ్డి ఓడుట. *

అపుడు శకునియిట్టులనె, "నీతఁ డింకను
నొడ్డ కున్న వస్తు వొకటి యున్న
దింతసొలుకతన, హృదయంబు మార్పడఁ
దుదకు మఱచె నేమొ ద్రుపదసుతను" 138

అనుపలుకులు వెలువడినం
తనె, పలువుర కాగ్రహంబు, తాపంబు, భయం
బనుకంపయు, నచ్చెరువును
మనసులఁ బొడసూపి, తాఱుమాఱొనరించెన్. 139

ఆ. ఎదిరి సైనశకునియే యిట్లువచియింప,
విని యుధిష్ఠిరుండు తనమనంబు
నెల్ల నలమికొనుచు నేవేవొయోజన
లూరఁ గొంతకాల మూరకుండె. 140

ఉ. అన్న మొగంబుపై ననుజులందఱుఁ జూడ్కుల నిల్పి, యాతఁడే
తెన్నిఁకఁ ద్రొక్కునో యనెడు తేఁకువ నుండ, నతండు చన్నమా
నోన్నతి నెంచి, ధర్మవిధి నొక్కపరిన్ బరికించి, సౌబలుం
డన్నటె నిశ్చయించె ద్రుపదాత్మజ నొడ్డెద నంచు నెమ్మదిన్. 141

ఉ. ఈగతి నిశ్చయించి, యతఁ డేమనకాయమనొడ్డి, జూదమున్
నాగఁగని మ్మనన్, గటికసౌబలుఁ డాసతి నట్లె వంచనో
ద్యోగము నూఁది, పాండవుల దోఁచి సుయోధనుపాలు చేసినన్
మూఁగినతత్సభాజనసమూహము, 'హాహా' యనియూర్చె బిట్టుగన్.

క. "నిలు నిలు" మనుల్లోననె, యా [142
చెలి నొడ్డినధర్మసుతుని చెయిదికి భీముం
డలుక నొకకొన్ని పరుషో
క్తుల నని, శాంతిల్లె నట్లొ తుదకుఁ దనంతన్. 143

క. "సరియొయి" దని, "సరి కా" దని
కురుపతి మం దేమి సేయఁ గోరునొ యనుచున్
బరిపరివిధములఁ బురుషుల్
తరుణులు ననుకొనెడుకలకలము చెలరేఁగెన్. 144

ఇ. చెప్పెడి దేమి; యాగెలుపుచేత సుయోధనుఁ డెంచె స్వర్గమే
గుప్పిటఁ జిక్కినట్లు; తనకోరికఁ దీర్చినమామఁ గౌఁగిటన్
గప్పె; వృకోదరున్ దెగి యొకానొకచూపునఁ జూచి, ద్రౌపదిన్
దెప్పమనంబుతోడఁ గొని తేరఁగఁ బంపఁదలంచె నొక్కనిన్. 145

♦ దుర్యోధనుఁడు ద్రౌపదిని సభకు దోడితెమ్మని ప్రాతి
గామిని బంపుట; ద్రౌపది ప్రాతిగామిని వెనుకకు దరుముట. ♦

ఆ. ప్రాతికామిఁబిలిచి, ద్రౌపదితో నిందు
నడచియున్న దెల్ల నుడివి యింక
రమ్ము, దాసివైతి రాజరాజున కంచు
వినిచి తోడితెమ్ము యనుచుఁబనిచె. 146

క. అది వినినంతనె భీముఁడు
గదపైఁ దనకరము సాఁపఁ గడువడి విజయుం
డదుముచు మెలమెల్లన, "మన
కిది తఱిగా దూరకుండు మిప్పటి" కనియెన్. 147

క. దీనిని గని, దుర్యోధనుఁ
డానలువురియాయుధముల నాక్షణముననే
తానలుక వశపఱచుకొనె
"నే నివి జూదమున గెలుచు టెఱుఁగరె" యనుచున్. 148

గీ. ఇట్లు జరుగుచు నుండ ని ద్దెల్ల నిచట,
నచట నొండు దోఁపక ద్రుపదాత్మజాత
దుర్నిమిత్తముల్ పైపయిఁ దోఁచుచుండ,
మనసు మనసున లేక యుమ్మలికఁ జెందె. 149

చ. మును పతులాగతిన్ వెడలిపోయినదాదిగ, నేదొ భీతి నె
మ్మనముఁ గలంప, శాంతి యనుమాటయె గానక, యొండు దోఁప, కే
మనుటకుఁ బాలుపోక, మన సాఁపఁగలేక, సఖీజనాళితోఁ
జని వెస, హాస్తినాపురముచక్కి న దేటికొ యాఁగియుండఁగన్. 150

ఆ. ద్రుపదతనయకొఱకు దుర్యోధనుఁడు పంప
వచ్చు ప్రాతికామి వారిఁ జూచి,
మిగుల గౌరవమునఁ దగుమేర నుండి, ద్రౌ
పదికి మ్రొక్కి, ప్రక్క కొదిగి నిలిచె. 151

క. కనినంత వానిద్రౌపది,
తనతహతహ యినుమడింపఁ, దనపతులశుభం
బునుగూర్చి తొలుతఁ బ్రశ్నిం
చెను, మొగమున నాత్రమొలుకుచిన్నెలు దొలుకన్. 152

గీ. అంత నాప్రాతికామి యాయమకు నచట
నడచినయుదంత మెల్ల సాంతముగఁ జెప్ప,
వానియావార్త నిర్ఘాతపాత మట్లు
చిత్త మగలింప, నామె నిశ్చేష్టయయ్యె. 153

గీ. కొంతసేపటి కెటో తేఱుకొనుచు, మున్ను
తాను భీతిల్లినట్టి యంతయును నకట!
యట నొకొక్కటి జరిగియుండుట దలంచి
నెలఁత యోర్వక పెల్లు కన్నీరునించె. 154

గీ, "ధర్మపత్నిని బాపిజూదమున నొడ్డ
నెట్టి కటికజూదరియేఁ దెగింపఁ గలఁడె;
యందు ధర్మజుఁ డటుచేసె నన్న వార్త
నమ్మ నెటునేర్తు," నని కడు నుమ్మలించె. 155

గీ. మృదుమనముచేత, సాధుప్రవృత్తిచేత,
నమృతవాక్కుచేత జగత్త్రయంబు నేలఁ
జాలుధర్మజుఁ డల్పదుర్జనునిచేత
నంతవడు కెంచి, కుంది పెన్వంతఁ గుమిలె. 156

గీ. తుదకుఁ బ్రభుఁ డేల తను బంచినదియుఁ గూడఁ
దడఁబడుచు వాఁడు విన్పింప, దర్పమేచి
మగువ రోషారుణితనేత్ర యగుచు లేచి
యధరమదురుచునుండఁ నిట్లనుచుఁ బలికె. 157

ఉ. "ఉన్నతవంశగౌరవము నూడిచి మీకురురాజు దాసియం
చు న్నను బిల్వనేరిచెనె; నో రెటులాడెనో; మ మ్మెఱుంగఁడే;
కన్నులు నెత్తికెక్కి నవుగాములు చూడఁడె; యౌర! మిన్నునుఁ
మన్నును గానఁడే; దురభిమాన మొకింతవిడక దలంపఁడే. 158

చ. దురమున వైరులన్ దునిమి దోర్బల మొప్పఁ బరాక్రమింప, క్రీ
వరుస దురోదరం బనునెపంబున గెల్చుట యొక్క గెల్పొకో?
గరితలయందు నైజముగ గౌరవ ముంచుట మాని, యక్కటా!
వరుసకుఁ దోడిసోదరులపత్నిని దాసి యనంగ నొప్పెనే. 159

క. "అది యట్టు లుండె; మును నా
కిది తెలుపుము, ధర్మతనయుఁ డెటు లోడె ననున్;
మొదలోడెనొ, తన్నోడిన
పిదపనె యోడెనొ, యెఱింగి వినిపింపు మిటన్. 160

క. ఎన్నఁగఁ, దన్నోడి యవల
నన్నాతం డోడినటు కనంబడుచుం డెన్;
దన్నోడి పరులసొమ్మై
యున్నపు డతఁ డెట్లు నన్నునోడఁగనోపెన్. 161

క. "నీ వెఱుఁగవేని నిన్నిట
కేనా రనిపి రిటు వారినే యిది యడుగన్
వే వెడలుము" యన, వాఁ డా
ద్రోవదికి నమస్కరించి తోడనె యరిగెన్. 162

గీ. అరిగి కురురాజునకు వాఁడు యాజ్ఞసేని
నుడివినది చెప్ప, విని మండిపడుచు, నాతఁ
"డిపుడు మే మేడఁ, దా నేడ; నిట్లు మమ్ము
నడుగవచ్చునె తారతమ్యమును మఱచి. 163

గీ. "తాను రాణినం చింకను దలఁచు నేమొ;
మఱచెఁ గాబోలు దాసి యౌ తెఱఁగు; నిప్పు
డోడెఁ దనమగఁ డెట్లొ; తా నోటుఃవడియెఁ;
దిరిగి ప్రశ్నించునంతి కావరమె తనకు. 164

♦ దుర్యోధనుఁడు ద్రౌపదినీడ్చుకొని రమ్మని దుశ్శాసనుని బంపుట ♦

గీ. "ఔర! దాసి కీనోరె; యానోరు చఱచి
సరగ మూయింత మానాఱిఁ బరిభవించి;
లెమ్ము. దుశ్శాసనా, వేగ పొమ్ము; దాని
నిపుడె యిట కున్న దున్నట్టు లీడ్చి తెమ్ము." 165

మ. అటు లాయన్న వచించినంత నె, సముద్యద్రోషవిస్ఫూర్తి ను
త్కటసంరంభవిజృంభణంబు మెయి నాతమ్ముం,డి దేపాటిదు
ర్ఘటకార్యం బని యట్టెలేచి వెడలెఁ గర్వంబు మున్నాడ," ని
చ్చటి కాదాసిని నీడ్చి తెత్తు నిపుడే; సైరింపు" మం చాడుచున్.166

క. ఱిచ్చవడి రెల్లసభ్యులు
నచ్చలపా టగ్గలింప, నాభీమాదుల్
నొచ్చిరి కడు," బ్రతుకుటయును
జచ్చుటయును గా, ది దేటిజన్మమొ" యనుచున్. 167

క. తా మున్ను దలఁచినట్టులె
యీముప్పు ఘటిల్లు టరసి హృదయము కుములన్
మోమోడక దుర్యోధను
మోమును గని విదురుఁ డాత్మమున ని ట్లనియెన్. 168

ఉ. సోదరుతోడ సోదరుఁడు జూదము నాడుట చూచి యోర్చితిన్
మోదమెలర్పధర్మజునిమోమున దీనత చూచి యోర్చితిన్;
గా దన కెట్టులోర్తుఁ గులగౌరవ మంతయు గ్రుంగ, సాధ్వి నా
పై దలిఁ దెచ్చి యీసభ నవజ్ఞ నొనర్పఁగఁ జూచుదుష్కృతిన్. 169

ఉ. "సుంతయుఁ బాపశంక మది పోఁకదె; పెద్దలమాట చేఁదె; తా
నెంతటిరాజరా జయిన నేమి, తపోధనుఁ డైన నేమి; దు
శ్చింతఁ బతివ్రతన్ జెనకి చేడ్పడ కుండునె, నొచ్చునిర్మల
స్వాంతలవేఁడియూరుపులు వంశములన్ మొదలంటఁ గాల్పవే. 170

క. "తాతకుఁ, దండ్రికి, బంధు
వ్రాతమునకు, వంశమునకుఁ బగతుఁడవై, నీ
వీతీరున"-నని యేమొ యిఁ
కాతం డననుండ, నీతఁ డాగ్రహతుఁడై. 171

క. "నో రెత్తకు, మీఱకు నీ
మేరను; నేవ్వరికి సతిగ మెలఁగంగలయా
నారినె సాధ్వి యనన్, భువి
నే రీకఁ గా,"రనుచు విదురు నెంతయుఁ బదరెన్. 172

క. ఆమాటలు వాఁడిములుకు
లై మది గాఁడినఁ జెమర్చి, యంధనృపతినె
మ్మోము మొఱపరిఁ గని, యప్పటి
కేమనకొని యేమొ విదురుఁ డటు యూరకొనెన్. 173

గీ. ఆవిధికి ద్రౌపదివదనంబు జేవురించె;
నులికిపడె ద్రోణుఁ; డచ్చెరువొందెఁ గృపుఁడు;
కూరువగతోడిచూపు ఫోక్కసాగి పఱపి.
కురుపతిని గాంచి భీష్ముఁడు శిరము వాంచె. 174

గీ. అవమతియు, సిగ్గుబాటును, నాగ్రహంబు,
నాఁపగారానివగపు త మ్మలమికొనియు,
బధిరమూకాంధు లట్లుండి పాండుతనయు
లపు డచట లేరొ యనఁ దోఁచి రంద ఱచల, 175

క. ఈదుష్టాత్మకు లెఱుఁగక
పోదురుగా కా మెశీలమును, బావనతన్
వేదవ్యాసుం డెఱుఁగఁడె,
యాదవకృష్ణుం డెఱుఁగఁడె, యనుకొనిరి బుధుల్. 176

* దుశ్శాసనుఁడు ద్రౌపదిని సభకీడ్చుకొని వచ్చుట. *

శా. ఆదుశ్శాసనుఁ డేగి, ద్రౌపదిని డాయన్ బోయి యంతంత, "మ
మ్మేదోపప్రశ్న యొనర్చితంటగదవే; యేప్రశ్నలున్ గిశ్నలున్
మాదుర్యోధనుమ్రోల సాగవుసుమా; మానంబుతో రమ్ముఁ నీ
వాదం బెయ్యదియేని యున్న, సభఁ దెల్పన్ వచ్చు, వే లె"మ్మనన్. [177

గీ, వచ్చియును రాకమున్నె యాపగిది వాఁడు
తన్ను వెడమాట లాడఁ జిత్తమున నొచ్చి,
యెదొదుపుద్దేశ్య మ్ముంట నూహించి, యామె
సామవాక్కుల ని ట్లన సాహసించె. 178

పా॥ 174 పా॥ 1 అ॥ 14- జి; పా॥ 177 పా॥ 3 అ॥ 18- రమ్మనే;
పా॥ 178 పా॥ 2 అ॥ 9- జి;

గీ, అన్న, కూర్చుండు, మిట్లు నోనాడె దేల;
యేదో యొకవార్త వింటివి, న దెల్లనిజమె;
నమ్మద మటన్న నాకు మనంబు రాదె;
యీవె యెఱిఁగింపు," మనిన, వాఁ డిట్టు లనియె. 179

గీ. "వినిన దంతయు నిజ; మింక వినఁగనున్న,
దంతయు నిజంబు, నిన్ను మాయన్న గెలిచె;
ధర్మజుం డోడెఁ; గాన మాదాసి వైతి;
వొం డనక రమ్ము సేయఁగ నూడిగంబు. 180

ఆ. "నీవె రాకయున్న, ని న్నీడ్చికొని తేర
ననిపినాఁడు నను మదగ్రజుండె,
యతనిమాటనాకు నవిలంఘనీయంబు;
నీవె ముందుపనిని నిర్ధరింపు. 181

చ. "తడయకు మన్న గ్నిస్న యని; తాళను కాలవిలంబ మింక; నే
విడువను నిన్న; నూరక వివేకముతోఁ జనుదెమ్ము; కానిమా
టుడుగుము; నిన్నునీమ గలె యోడిరి; దాసివి మాకు; రావయేః
ముడిగొనిపట్టి యీడ్చుకొనిపోదు నెవండనా నే నెఱుంగవే. 182

ఆ. "ఐదుగురికి నాల వైనని నొక్కమగం
డైన నోమఁ జాలఁడయ్యెఁ దుదకుఁ
బాయ కోమువాఁడు మాయన్న యొక్కండె;
యరసి మాఱు పలుక కరుగుదెమ్ము. 183

సీ. "పిఱికిపందల వరియించి తెఱుఁగ కపుడు,
తత్ఫలము గుడ్చు చిటు లున్న దాన విప్రుడు;
కురుపతి వరించి యుంటేని, తరుణి నాఁడు
నీ వ్యాయ్లె మెల్లసుఖము లుండెడివి నేఁడు." 184

మ. అనుమాటల్ చెవిసోఁకుటే తడవుగా, నాపాదమస్తంబు త
న్మనలం బేర్చినదైన, ద్రౌపది! "యిటౌరా! నన్ను నోనాఁడఁ, దు
ర్మతియల్ కా దెటునీదునాల్క ;యెదిరో దుర్వ్యాత మొండొల్లి, పా
వనులౌనాపతులన్ జయించితి రే; యీపాపంబు మి మ్మార్చునే.

శా. "ఆపై, నస్న ము పున్న మం చనక, మీ రాకీతిగా నేదొమా
యోపాయంబున గెల్చినార మను గర్వోద్రిక్తచిత్తంబుతో
నేపాపంబు నెఱుంగనట్టినను నీ విట్లాడి కొంపోదువా;
యేపుణ్యంబున కొగ్గి యిట్టిపనికై యే తెంచితో; దుర్మతీ." 186

క. అని యింకేమిరొయు ద్రౌపది
యన నుండ నె దుస్ససేనుఁ డాయుమకరముల్
గొని యొక కేలన్, గొప్పును
గొని మఱియొక కేల నీడ్చెఁ గుయ్యోడఁగఁ జెలుల్. 187

గీ. వాఁడు సతికప్పుకొ ప్పటు పట్టి తివియ,
ముడి సడల, వ్రేలి పెన్నెరుల్ పుడమిఁ గ్రిమ్మె;
నట్లె యిఁకఁ గ్రిమ్మునో యధర్మాంధకార
మూర్వి నని సాధుహృదయమ్ము లుమ్మలింప, 188

గీ. "రాజసూయావభృథపవిత్రంబు లైన
కేశపాశంబులకు నీచు కేలఁ జిక్కి-
పోఁడిమి దొఱంగి యిట్లు జీరాడుగతియె,"
యనుచు బలువంతఁ గుంది రావనితసఖులు. 189

క. కటకట! బావురుగానికి
జిటిచిలుకపడంతి నోటఁ జిక్కినకరణిన్,
గటికి యగుదుస్ససేనుని
పటుకరములఁ జిక్కుపడి ద్రుపదసుత బెగడెన్. 190

క. ఉన్నయటులుండి వాఁడటు
తన్నున్ వెనకు నని తరుణి తలపోయక యే
యున్నకతంబునఁ దా నా
తెన్నునఁ జిక్కువడు టరసి, తెలిసి, కలఁగుచున్, 191

చ. తొడరి దురాగతంబునకు, దుష్టత కోడక, తన్ను నాగతిన్
దుడికినదుస్ససేను నొకతోపునఁ ద్రోసి, కరాళమూర్తియై,
"తడయక నేనె వత్తు నిదె తత్సభకున్; నను దాఁకఁబోకు; వే
వెడలు"మటన్న, దేఁకని, వెంటనె వాఁడనుసాగె నావలన్.192

గీ. కాని, వాఁడట్టు లొకయాఁడుదానిచేత
నంత తాఁ గించపడు టెంచి, యలముకొన్న
పరిభవాగ్ని నడంచి, యప్పటికి నెట్లొ
తాళుకొనియెను ముందటితఱికి వేచి. 193

క. పారి దుశ్శాసనుఁ డామెను
బురవీథులఁ దటిమికొనుచుఁ బోయెడుదృశ్యం
బిరుగడల, నిలిచి కనుస్త్రీ
పురుషులహృదయములఁ గరఁచి పొక్కించెఁగడున్. 194

ఆ. వనిత తొట్రిపడుచుఁ జనుచుండఁ దెరవోలె
ధూళి భూనభోంతరాళ మలమె.
నట్టిపాపిదృశ్య మన్యులెవ్వారును
జూడఁగూడ దనెడుజాడ దోఁప. 195

ఆ. ఎంతరోస మున్న నేమి యప్పుడు తన
కొదవియున్న స్థితిని మదిఁ దలంచు
కొన్నమాత్ర, ద్రుపదుకూఁతు నిర్విణ్ణయై
శోకతప్త యగుచు సాగుచుండె. 196

ఉ. వాలుచు సోలు చాసతి సభాభవనంబును జేరునంత. గ
ర్గోలటఁ బెల్లురేఁగె. ముడిగూడక వీడిన కేశరాశి క
ల్లోలము నించె; స్త్రీజనవిలోకము లన్నియునం దెనాటెఁ; బే
రోలగ ముత్తరంగితమహాదధిచాడ్పునఁ బొంగిఘూర్ణిలెన్. 167

క. చింతావమానభయములు
స్వాంత మెరియ. ద్రుపదతనయ సత్వరగతి నం
దంతఃపురకాంతాతతి
చెంతకుఁ జనఁజూడ, దుస్ససేనుండాఁపెన్. 198

ఉ. దీనత మోమునం దలమఁ, దియ్యఁదనం బిగురంగఁ, గంట నీ
రూని కపోలముల్ దడుపన్, నొక్కట జీరుశిరోజనీరదం
బాననచంద్రు మాట. మృదులాంగము తూల,నభాగ్యరేఖ యీ
చానగ రూప మెత్తె ననుచాడ్పున ద్రౌపది నిల్చెఁ దత్సభన్. 199

క. ఏపాటున నేచోటున
నాపాండవు లున్నవారొ యనునాతురతన్
జూపులు సతి పఱపఁగ, నా
చూపులతో బెరసె వారిచూపులు నచటన్. 200

క. ఆవగ నే మనవచ్చు! న
యో! వెంటనె యుబికివచ్చు నొండొరులమనో
భావంబుల నాచూపులె
భావించుకొనెన్ విషాదభరభరితములై. 201

ఆ. ఆవిషాదభరము నతిసాహసము మీఱ
వనిత యెట్లొ యణఁచికొనుచు, సభకుఁ
దను సుయోధనుండు కొని తేఁ బనుచుట
యెట్లు న్యాయ మగునొ యెఱుఁగ నెంచి 202

♦ ద్రౌపదిసభలో ధర్మసూక్ష్మముల గుఱించి ప్రశ్నించుట. ♦

గీ. సభఁ గలయఁజూచి, యటఁ దనవిభులు లజ్జ
నౌదలల వాంచియుండుట కలమటించి,
తాన ధృతరాష్ట్రుదెసఁ గాంచి, తగవు నిర్ణ
యింప నతని నుద్దేశించి యిటువచించె. 203

గీ. "న్యాయమునుదీర్ప సింహాసనంబు నెక్కి
జనులఁ బాలించుధృతరాష్ట్రసార్వభౌమ,
ప్రాతికామితో నిటఁ జెప్పఁ బనిచినట్టి
ప్రశ్నయే మిమ్మడుగుదానఁ బ్రీతి యొసంగ" 204

క, "ఎవ్వరు సన్నపు డోడిరొ,
యవ్వా రటు లోడవచ్చునా; తెలుపరయే
యవ్వీనరంబుల, నను సభ
కివ్విధి రాఁ బనుపఁ దగునె; యిది న్యాయంబే ?" 205

క. అన, నాతఁడు మా టాడక;
తనమోమును వంప, ద్రుపదతనయ నిరాశన్
గని, నిలిచె దిక్కుఁదోఁపక,
మునిఁగెనొ తనపాలిసర్వమును నపు డనఁగన్. 206

చ. తగవును నిర్ణయింపఁ దగుధారుణినాథుఁడె మౌన మూనినన్,
బగకు సమస్త మోడి నిజభర్తలు తద్వశవర్తులై చనన్,
దెగి తనపక్ష మూనునొకధీరుని గానక, యూఱడింపఁగాఁ
దగినకృపాళు నేఁ గనక, ద్రౌపది నిల్చె నిరాశ్రయస్థితిన్. 207

మ. అతిలోకోత్తరరూపవైభవముతో, నైశ్వర్యగర్వంబుతోఁ
బతిప్రేమాయతితో విరాజిలినయాపాంచాలి, దీనాస్యయై
పతిదూరీకృతయై, నిరస్తగతియై వాపోవుచున్ నిల్చుదు
స్థితిఁ గన్నన్, శిలలేని నీరగు ననన్, శిష్టాళి నింకే మనన్. 208

క. స్రుక్కినమైసిరి, చెలువము
తక్కిన మొగ, మొలుకఁబాఱి తారాడుకురుల్,
దిక్కఱుగతిఁ గన, నీయమ
యక్కట! తొలిద్రుపదతనయయో, యనిపించెన్. 209

సీ. అది గాంచి, రారాజుమదియు సుంత కలుక్క
మనెఁ గాని, రాజసూయంబునాఁడు
తనకుఁ దత్సభ నైనతబ్బిబ్బు గని తా న
దెన రనుమోమోటమేని లేక
ద్రౌపది చేతులు తట్టి నవ్వినటన్న
భావంబు తనమదిఁ బాఱునంతఁ
బెల్లురేఁగినక్రోధ ముల్లంబు నగలింప,
ద్రౌపదికడ కొఱక్కచూపుఁబఱపి,
గీ. పగయు, నవమతి, యీర్ష్య, కోపంబు కలఁపఁ;
దలఁపు లేవేవో చిత్తంబు నలమ, నదిమి,
పాండవులఁ జూచి, మరల ద్రౌపదిని జూచి,
పలికె నిటు మూదలించుభావంబు దోఁప. 210

ఆ. "ఇంతి, యెవ్వరెట్టు లెపుడోడి రనుప్రశ్న
యిప్పుడేల; యుండనిమ్మ దల్లి;
నిన్ను నిపుడు గెల్చుకొన్నవాఁడను నేను;
మఱవ కింతనిజము, మఱియు వినుము. 211

మ. "యువతీ, జ్ఞాపక మున్న దే మది దురుద్యోగంబు చింతించిమున్
సవనంబం చొకపేరుపెట్టి, కురురాజశ్రేష్ఠు రప్పించి, యం
దవమానంబు ఘటించి. పొంగునిను నోరారంగ నవ్వించి, పాం
డవు లీహ్యూత్ఫలకంబుపైఁ జెడని పెన్ గాయంబు గావించుటల్.212

మ. "అదె యాపాండవు; లివ్వు డేవ్వురు మదాజ్ఞాధీనులై, సర్వసం
పదలన్ గోల్పడి, యాత్మపత్ని వగునిన్ మాపాలు గావించి, మా
పదముల్ గొల్వఁగ నున్నవా రిటు నినున్ వంచించి, యీనాఁడు న
వ్వెదవో, యేడ్చెదవో, యదేమొ యిఁకనీవేచూచుకొమ్మింతటన్.

క. కురుపతి యటు పలుకుట క [213
చ్చెరువడి చింతించి, యాజ్ఞసేని యతండా
కరణిఁ దను దప్పుతలఁచుట
యరయుచు నాతలఁపు నుడువ న నె నీవరుసన్, 314

చ, "నిను గని నవ్వియుంటి ననునేరము నూరక మోపి యిట్లు న
న్నొనరుప నీకుఁ బాడిమె, సుయోధన; యాస్థితి నున్న నిన్న యో!
యన కటు లేవివేకవతినైనను నవ్వునె; న న్నెఱుంగవే;
యనుకొనినట్లె నవ్వినను, నంతకు నింతయె, యాత్మ యొప్పెనే. 215

ఉ. "నిన్నటిదాఁకఁ బ్రీతిమెయి నీవును వీరును గూడిమాడి య
ట్లున్నది యంతయున్ మఱచి, యున్నటులుండి యిదేమిచేసి; తి
ట్లెన్నఁడొనర్తు వం చెఱుఁగ, నేఁ బెఱదాననొ, యిప్పు డిట్టులే
నున్న తెఱంగు చూచియును నుల్ల మొకించుకయున్ గరంగదో 216

క. అని సుంత తాళి, తన్ముఖ
మున నెటఁ గనికరపు మొలక మొలవమి, నామా
నిని నొచ్చి, కినుక యించుక
మనమున రేకెత్తుచుండ, మఱి యిట్లనియెన్. 217

ఉ. "జూదమునందు గెల్చుటొకశూరతయే; యిటు లన్నదమ్ములన్
ఖేదముపాలుసేఁత కృతకృత్యతయే; తెగి వారిభార్యను
ర్యాదను నిట్లు గోల్పఱచు టార్యమతంబె, యి టింత చేసియున్
నాదియుమానవత్వ మని, న్యాయపథం బని విఱ్ఱవీఁగెదే. 118

గీ. "వంచన, మధర్మ, మన్యాయ మెంచి, మమ్ముఁ
బలు తెఱంగుల హింసపాల్పఱచునీకు
నరక మెట్టిది కాచియున్నదొ యెఱుంగ;
వినుము నాదొక్క హితము నీ," వనుచునుండ. 219

ఆ. " ఇంత దొప్పఁ బలుకునే యీమె" యని పెద్ద
లనుచునుండఁ, బాండుతనయు లీమె
హిత మదేమొ యనుచు నెదురుచూచుచునుండ,
రాజరాజు కినుక రోఁజుచుండ. 220

క. "దాసిది హితోపదేశము
చేసెడు నఁట పరిభున, కెట్టిచెడు గిది" యని దు
శ్శాసనుఁడు పండ్లు కొఱికెన్,
"మోసం బిది" యనుచు శకుని ముసిముసి నవ్వెన్. 22

క. అనలంబున కాజ్యము చే
ర్చినయట్లులై, రాజరాజు రేఁగుచు, "దాసీ,
నను నిటు చెనకెదుని న్నే
మొనరించిన నాదుకోప ముపశమన మగున్." 222

క. అని యంతఁబోక, మును తన
కొనరినయవమాన మంతయును నారూపై
కనిపించినట్లు దోఁపఁగ
మనమునఁ గడు మండిపడుచు, మద మెగ రేఁపన్. 223

క. "మున్నర మగు గరువమ్మున
నమ్మెయి నవ్వినఫలంబు ననుభవ మొందన్
ర మ్మడుగు లొత్తఁ దొత్తా,
యిమ్మగలసమక్షమందె, యియ్యెడనె," యనెన్. 224

క. ద్రౌపది యపు డురుకోపము
రూ పెత్తినపగిది నిగిడి, రూక్షేక్షణముల్
దీపింప నిట్టు లనె, "నో
పాపీ, నను దొత్తనంగ వా రయుటు లాడెన్. 225

గీ. "మోసపుదురోదరమునఁ గుంతీసుతులను
గెలిచి తటు; లంతఁ బోక నన్ గెలిచి తంటె;
తన్ను నోడినపిదప నీధర్మతనయుఁ
డెట్లున న్నోడెఁ దెలుపుమ యిప్పుడేని. 226

ప॥ 222 పా॥ 3 అ॥ 5- చెన; ప॥ 225 పా॥ 4 అ॥ 11- యి;
ప॥ 226 పా॥ 4 అ॥ 3- ఁదె;

చ. "తులువతనంబుతోఁ, బొగరుతో నను నీగతి మాటిమాటికిన్
బలికెదునోరు వ్రీల్పదె; సభాస్థలికిన్ బరకాంతనీడ్చుచే
తులు తెగిపోవె; ధర్మమటె, దుర్మదమే పెనుపొంది యేలఁగాఁ
వలకొనునేని, లోకమున దైనముతోఁ బనియేమి యేరికిన్" 227

ఆ. అనెడునా మెపలుకు విని, విషాదము, తిర
స్కృతి, పరాభవంబు, కినుక తన్ను
నేఁప, నొండుదోఁప కించుక వెడనవ్వి
ధ్వనియుఁ జెదర, నిట్టు లనియె నతఁడు. 228

గీ. "గడియగడియకుఁ దా నోటువడిన దెట్టు
లనుచునొక్కరి నిట్టిది యడుగ నేల,
తాను పాండుపుత్రులకు నర్ధాంగి యగుట
వార లెప్డు డొడ్డి నను నోటువడదె యెట్లొ." 229

* ద్రౌపదిని విగతవస్త్రగఁ గావింపు మని దుర్యోధనుఁడు,
దుశ్శాసనున కాజ్ఞాపించుట – వికర్ణుని ప్రబోధము.

క. అని కినుక తానెతానై
తను రేఁపఁగఁ, దనువు మఱచి తలఁగక తానే
మనుటయుఁ దా నెఱుఁగక, యి
ట్లనెనాతం డనుజుతోడ నందఱును విసన్. 230

చ. "కురుపతి నైననాపరువు గోల్పడ, నోరికివచ్చినట్టు లీ
కరణి దురుక్తు లాడుపలుగాకిని దీనిని నెట్టివాని యు
వరుసయుఁ జూడ; కిచ్చటిసభాసదు లిందఱు చూచుచుండ నె
వ్వరిని గణింపకే, విగతవస్త్రను జేసి, పరాభవింపవే." 231

క. అనుపలుకులు వెలువడినం
తనె "హా! హా" రవము లొక్కతడవున నె సభా
జనముఖముల వెలువడియెను,
మిను దాఁకెను కలకలంబు మితిమీఱి కడున్,

క. చెడువాక్కులఁ జెడుదృశ్యము
లడరెడు నని మూసికొనుచు నక్షులు, చెవులున్,
బడఁతుకలు మాఱుమోముల
నిడి మిడికిరి యశ్రులొలుక, హృదయము లదరన్. 233

క. 'హరి! హరి!' యని సాధుజనో
త్కరము లశాంతత మనంబు గప్పఁగ నడలెన్,
"వరభరతాన్వయమున కిటు
కురుపతిచే దుర్యశంబు గూరెనె" యనుచున్. 234

చ. అరయిక తక్కె వెల్వడినయాపలుకుల్ చెవిగాఁడుమాత్రినే,
గురుఁడును! ద్రౌణియున్, గృపుఁడు కోపవిఘూర్ణితచిత్తులయ్యు, న
క్కురుపతి వెట్టుకక్కుఱితికూటికి లొగ్గుటఁ జేసి, కుందు చొం
డొరుల మొగంబులన్ గనుచు నూరక యుండిరి సిగ్గుపెంపునన్. 235

చ. తనపరిశుద్ధజీవితము ధర్మముతో ముడిపెట్టి యున్న శాం
తనవుఁడు ప్రాణమొడ్డియయినన్ మనుతున్ గురువంశమంచు, మున్
జనకున కిచ్చి యున్నవచనంబుఁ దలంచి, కలంచు నాసుయో
ధనునియధర్మవర్తనము తాళుకొనెన్ మన సొప్పకుండియున్. 236

గీ. అకట! తముఁ దనప్రాణపంచకముగాఁగఁ
బరిగణించెడు సతిపరిభవముఁ గాంచు
పాండవులతీరు, తన్మనోభావములును
నెట్లు లుండెనో తెలుపుట కెవరితరము. 237

ఉ. ఇంతకుఁ దానె మూల మని యెంచి యుధిష్ఠిరుఁ డోరిచెన్, నిజ
స్వాంతముపొంగడంచుకొనె ఫల్గునుఁ డన్నతలంపెఱింగి, యా
యంతరమున్ గ్రహించి కనలల్లె సహించిరి కాని, భీముఁ డ
త్యంతవిషాదరోషముల నాఁపఁగలేక తపించి భీముఁడై, 238

ఆ. లేచి యేమొ యనఁగఁ జూచుచుండఁగ, ఫల్గు
నుండు బలిమిఁ గూరుచుండఁ బెట్ట,
శమనసుతుఁడు కొన్ని సామవాక్యము లాడి,
మనసు శాంతపరచి యనునయించె. 239

గీ. వలకుఁ జిక్కినకంఠీరవంబుపగిది
నగ్రజునియానతికిఁ జిక్కి యనిలసుతుఁడు
కనులఁ గోపాగ్నివిస్ఫులింగంబు లెగయ
హుంకరించుచుఁ గురుపతినంకఁ జూచె. 240

---

ప॥ 236 పా॥ 1 అ॥ 17- వె; ప॥ 239 పా॥ 4 అ॥ 8- ఱ;
ప॥ 240 పా॥ 4 అ॥ 4- రించు;

విదురుఁడు ద్రోణుఁడుఁ గృపుఁడు, భీష్ముఁడు మోములవాంచియుండిరా
ముదుసలి తేఁడు క్రోధువడి మూఁగఁదనంబు వహించె; సభ్యులె
య్యదియన నేమి వచ్చునొ యటం చెటు నోరు మెదల్పరైరి; కో
విదులగు పెద్దలిట్లయినఁ; బిన్నలకెవ్వరి కాడు నాలుకల్. 241

గీ. కాని, దుశ్శాసనుఁడు యాజ్ఞసేని దరిసి,
తప్పుకొనఁ గేలు మాటొడ్డితలఁగునామె
చేల మూడ్చెదుకొలకున్నై చేయి సాఁపఁ,
"దాళు మనుచు వికర్ణుఁ డడ్డాలకుండు. 242

ఆ. అలుక నల్లెలేచి, యాజ్ఞసేనియవస్థ,
దుస్సనేనుదుడుకు నిస్సహాయు
లైనపాండుసుతులదీనత, నిర్వీర్యు
లగుజనాళివగపు, నరసి పలికె, 243

ఉ. తామసి యొక్కఁడిక్కరణి ధర్మపథంబు దొలంగి యక్కటా!
యీమెయి సాధ్వి నొక్కరిత నీడిచితెచ్చిపరాభవింప-నిం
కేమనఁ- జేలమూడ్చునఁట యీసభవారిటు చూచుచుండఁగా
ఛీ! మగవారలింద చిటఁ జేరియు, నొక్కఁడు నడ్డగింపఁడే. 244

ఆ. "ఎప్పు డెవ్వరైన, నేలోకమందైనఁ
బురుషు లరయ సభకుఁ దరుణి నీడ్చి
వలువలొలిచియిట్లువరిభవించిరె; యింక
నింతకంటె నీచవృత్తి గలదె. 245

మ. "తమకుఁ దల్లులు,సోదరీమణులు,నర్ధాంగుల్,సుతల్ లేరొ యీ
క్రమముం దోయరొ,పౌరుషంబుడిగెనో; ప్రాజ్ఞుల్ ప్రబోధింపరో
రమణుల్ పుట్టుటె దోషమో, నృపతులేరాజ్యంబు లిక్లేల, ధ
ర్మమునిల్వంగలదే;యదే తొలఁగినం బ్రహ్మాండముల్ మ్రొగ్గవే.

ఉ. "కావున ధర్మముం నిలుపు కార్యము చూడరె; లేనిపోని దు[246
ర్భావము నూఁది దుర్యశముపాలయిపోనక క్షాత్రి జన్మముం
బావనముం బొనర్చుకొను భాగ్యమునొందరె; పాపదూరులై
దైవకృపం గడించుకొని ధన్యతగాంచి తరింప నెంచరే. 247

ఉ. "దాసిదెన్నైన స్త్రీసహజధర్మమె యీమెకులేదె, యెంతయుం
దోసముగాదెదానిఁ జెడఁద్రోయుట,ద్రోసినయంతఁ బూరుషుల్
గాసికి నగ్నమై చెడరె; కానఁ బవిత్రి సతీత్వ మోమరే;
వాసి గడించి మానవత వర్ధిలు స్త్రీత్వవిశుద్ధి వర్ధిలం. 248

క. " రారా జీయుమ పాండుకు
మారుల యర్ధాంగి యగుట, మగలొడ్డుట నే
చేరెను సతి యోటమి యని
యారయక వచించె, దాని యర్థం బదియే. 249

తే. ఓడునెడ, నొడ్డి వా రోడియుండవలయుఁ
బ్రమద యర్ధాంగము నె; యిట్లు క్రమము తప్పి
యీమెఁ బూర్ణాంగిఁ గొని తెచ్చి రిట్టు లిటకు
నిధియుఁ బెద్దలె నిర్ణయించెదరు గాక. 250

తే. అనునతని ధోరణికి సభ్యు లచ్చెరునడి,
"యెంత పసివాని కీధర్మచింత యారా!
ధర్మమెం దున్న, నెంతి పెద్దలకు నైనఁ
దాలిశిరోధార్య మద్ది కానలదె, యనిరి. 251

ఆ. "అట్టి కౌరవునకు నిట్టి వికర్ణుం డ
దెట్టులో కొ తోడఁ బుట్టె" ననియు,
"హాలహాలముతోడ నమృతంబు పుట్టదే"
యనియుఁ దమకుఁ దామె యాడుకొనిరి. 252

క. "పిన్నని వాక్కున నెంతటి
యున్నతభావ" మని యబ్బి మొందుచు విహితుల్
మన్నించియు మన్నింపక
మున్నే "యీబుడుతి కెంతపొగ" రని రహితుల్. 253

క. కర్ణుం డపు డాబాలుని
దుర్ణయమున దుడుకు చిట్లు దురహంకృతితో
నిర్ణయము లాడనత్తువె
పూర్ణజ్ఞానివలె, బడుగ పో" మ్మని తెగడెన్.  254

♦ ధర్మజుఁడు ధర్మనిర్ణయముఁ జేయుట. ♦

ఉ. అనుడులాలకించి, హృదయంబున నొచ్చి సదీసుతుం, "డిటుల్
వానిని వీని దూఱుపని వల్లదు; ద్రౌపది ప్రశ్నకున్ సమా
ధాన మొసంగ నర్హుఁ డొకధర్మజుఁడే; యతఁడిందె యుండెడున్
గాన, నతండ దేమనునొ కన్గొను టొప్పదె యంచు" బల్కినన్.

తే. "అట్లయోనిజగాఁ బుట్టి యసమబాహు
బలధురీణు లౌ పతులఁ జేపట్టి, యకట!
నాథు లేవురుండియును ననాథవోలె
నంగలార్చెడుగతియె యీయమకు" ననిరి. 264

చ "శరధిపరీతభూవలయ సంస్థిత సర్వనృపాళి శౌర్య వి
స్ఫురణ జయించి, నిర్జరసమూహ 'మహో' యన రాజసూయముఁ
జరిపిన పాండునందనులు జ్ఞాతులచేతుల నాత్మపత్ని కౌ
పరిభవ మాఁపనోపియును బైకొన, రెంతటి ధర్మనిష్ఠులో! 264

క. "అది యటులుండఁగ, నీద్రౌ
పది నిటు కౌరవులు భంగపఱచుట తగునే;
తుద కాఁడుదానిమానము
చిదుపుట పురుషులకె సిగ్గుచేటగుఁ గాదే. 266

ఉ. "ఆఁడుదియన్న నింతనలుసా; కలదేసతిసాటి వస్తు వీ
మూఁడు జగంబులన్; ముగురుమూర్తులు నాయమచేతిపాపలై
యాడరె; చండదండధరుఁడా మెకుల్లొంగఁడె; సూర్యచంద్రులున్
జాడలుతప్పరే; భువిని సాధ్వి నెదిర్చి, యెవండు దక్కెనే. 267

ఆ. "ధర్మనిష్ఠ నొక్క దౌర్బల్యముగ నెంచి
గరిత నొక్కయబలగా గణించి
తాఁకు వీరినోర్చి ధర్మమప్పటి కూర
కున్న, సతిసతీత్వ మూరకున్నె. 268

" కాని ప్రకృత మీమెగతి యేమనఁగవచ్చుఁ
దలఁచుకొనినఁ గడుపు తఱిగిపోవు,
నకట! తమ్ముఁడైన మరగంటఁగన; నెంత
ఘనుల గతియు నింతెగాదె;" యనిరి. 269

కులకాంత నలున నొలి చేడు
ఖలునిఁ శాసింప ననువుగామిఁ; దానిఁ
దిలకింపఁ గను లోపమిఁ,
బలువురు పురుషులును సతులు వడివిడిరి సభఁ. 270

వీడినవేణితోడ, నరవీడినవయ్యెదతోడ, దీనతఁ
వాడినమోముతోడఁ, దనవారల నాటినచూపుతోడ, నా
చేడియ నల్వఁ బట్టి యొకచేత, మఱొక్కటిఁ బాఱఁజాచి, కా
పాడరె యంచు నశ్రువుల వ్రాల్చుచుఁ గుయ్యిడె నీరెలుంగునఁ

న్యాయనిర్ణయ పరిజ్ఞాన సంపన్నులై
వెలయు వయోజ్ఞానవృద్ధులార;
ధర్మ సంస్థాపనార్థము శరీరమునైన
నర్పింపఁ జాలు మహాత్ములార;
నిత్య సత్యవ్రతనియతిఁ బ్రాణము తృణం
బుగ వీడఁగల త్యాగమూర్తులార;
పాపకర్ముల సహింపక యొక్కత్రుటిలోన
వధియింపఁ గల శూరవర్యులార;

తే. "మీర లిందఱుఁ జూడ నీమేర నన్ను
నేక వస్త్రను, నింతరాయిడి ఘటించి,
పట్టి పరిభవింపఁగ సిద్ధ పడినవారి
బారిఁ బడనీక వేగ కాపాడ రారె. 272

మ. "పతితవ్రాతము నుద్ధరించి, ఖలులన్ భంజించి, సన్మార్గ సం
గతులన్ సత్కృతి మంచి, సాధ్వులను సన్మానించి, శ్రద్ధావిధిన్
సతమున్ ధర్మము నిల్పుదీక్ష ధరణీశత్వంబుఁ గైకొన్న స
న్మతు లిందెవ్వరు లేరె; లేరె కుమతిన్ వారించు ధీరోత్తముల్.

ఉ. "తానను కొన్నయట్లె నను ధర్మజుఁ డోడిన నోడుగాక; యీ
దీనను రాజరాజె యొకతీరున గెల్చిన గెల్చుగాక; యే
చానయు లజ్జనోట ననఁ జాలనిభంగిఁ బరాభవింపఁగాఁ
బూనినవారి మాన్పఁగల పూరుషుఁ డొక్కఁడు లేడె యక్కటా!

ఉ. "మామయుఁ గోడలన్న యభిమానము వీడెనె నేఁడు తాతయున్
ప్రేమ దొఱంగెనే, నయవివేకులు ద్రోణకృపాదులున్, గటా
యీ మెయి నన్ను బోవిడిరె యెవ్వరినిన్ శరణందు నింక యో
నా మొఱ నాలకింపఁగ గల న్యాయవిదుల్ కఱవైరె నేఁటికిన్.

ఆ. ఏల మనసు కరఁగు నీ సుయోధనునకు, [275
శకుని కర్ణు లడ్డ సమ్మతింత్రె,
యిపుడె పరిభవింపనిటు సిద్ధ పడియుండు
దుస్ససేను నెటు తొలఁగు ఘుండు. 276

ప॥ 274 పా॥ 1 అ॥ 17- డుఁ; పా॥ 2 అ॥ 17- ల్పుఁ; పా॥ 4 అ॥ 16- లేఁ:
ప॥ 275 పా॥ 2 అ॥ 1- ప్రే; పా॥ 4 అ॥ 9- గ:

క. "పురుషుల తెఱఁగిటు తేలెఁ
గరితలు మీకైన మనసుకరఁగదె, నన్నుఁ
బరికింపరె, మొఱవినరే
సరిగరితపరాభవంబు సైపఁగలరే. 277

సీ. "తనకుమారుల కిట్టితఱి నెట్టికర్జమో,
వీరసూకుంతి విన్పింపరాదె,
తనకడుపు చెఱుపఁబూనినవారి వారించి,
దేవిగాంధారి నన్ బ్రోవరాదె;
తనతోడికోడలు కనుపాటు తనపాటె
యని భానుమతి దీని నాఁపరాదె;
తనపుట్టినింటికీర్తిని మాపువని నాఁడు
బిడ్డ దుస్సల మాన్పఁ బెనఁగరాదె;
గీ. పురుషు లింద ఱిట్లు పరిభవింపఁగఁజూచు
తోడియాఁడుదానిగోడు నుడిపి
మనుపఁజాలువీరవనిత యొక్క తెయేని
యీసభాంతరమున నిపుడు లేదె. 278

క. "ఏపగిది నను మనుపుఁడని
యీపతులను వేఁడుదాన; నీయేవురిలో
నాపాటు నివారింపఁగ
నోపినవా రెవరొ; యెట్లు లోపుదురొ; కటా! 279

చ. "విధి ప్రతికూలమౌట నయవేత్త యుధిష్ఠిరుఁ డొక్క-ధర్మమున్
విధిగ గ్రహించి, త్రిప్పకొన నేరక వంథరుచున్నవాఁ డిఁకే
విధి నను గావుమం చితని వేఁడుదుఁ; దా విలువిద్య పూర్తిగా
నధిగమియించియున్ మఱచిన ట్లిటులుండుకిరీటి నేమనన్. 280

క. అన్న లటులైన, వారలు
చన్నటులే చనెదునకుల సహదేవులునా
విన్నపమును మన్నింతురె;
మన్నించిన, భీముఁ డొకఁడె మన్నింపవలెన్. 281

క. "విను, భీమసేన, దుర్యో
ధనుచే నీపడినయంత తారు నలువురున్
మునుపడిరే; కావున నా
తనియెడ నీ కుండునంత తమ కుండు నొకో. 282

ఉ. "పుట్టిననాఁటఁగోలెఁ బగఁబూని సుయోధనుఁ డీసుపట్టి ని
న్నెట్టులొ తీర్పఁ బన్నుగడలెన్నియొ పన్నఁడె, మున్,విషాన్నమున్
బెట్టఁడె; పన్నగాళిఁ గఱపింపఁడె; త్రోయఁడె; గంగ; నెట్టిటో
గట్టున కెక్కి నీవు మనఁగంటివి మాసుకృతంపుఁ బెంపునన్. 283

ఉ. "ఈవు మహాబలాత్మజుఁడవే, యటు నీవు మహాబలుండవే;
పావనివే; యపావనతప్రబ్బెడుపట్లఁ బ్రభంజనత్వమున్
నీవును నీదుతండ్రికరణిన్ వెలయింపవె; యీజడత్వమున్
బో విడి, యీసదాగతికిఁ బుత్రుడ వౌట స్మరించి చూడవే. 284

క. "కైకొనవుగాక; నీవే
కైకొనితివ యేని యిట్టికౌరవులెల్లన్
నీకొకలెక్కయె; యకటా!
నాకర్మముకొలఁది నీవు నడవన్ దలఁతే. 285

క. "నిన్నొకనిన్ వీడిన, నీఁక
న న్నవ రీసిలుగు వాపి నడపెడు వారల్;
కన్నులఁ జూచియు నీసతి
బన్నము నుడుపంగ లేవె; పౌరుషఖని వే. 286

క. "పరుఁ డొక్కఁడు తనకంటియె
దూర నే సతిఁ బరిభవింప దొరకొన, మాన్పన్
దరమయ్యు, నుపేక్షించెడు
పురుషుని ధర బ్రహ్మ యెట్లు పుట్టించెనొకో. 287

క. "అవమాన మొందు కంటెం, న
సువు దొఱఁగుటె శీలవతికి శుభ; మయ్యుదియున్
ధవుచేత నె యవునేనిన్
భువిఁ గాంతకు నంతకంటెఁ బుణ్యము గలదే. 288

క. "కాన నీఁక లెమ్మ; వీరల
నైనను గడచేసి వాపు మవమతి; యటుగా
దేనిన్, నీచేతుల నీ
ధీనన్ బలియిమ్మ ధర్మదేవత కిచటన్." 289

ఉ. ఆసతి యట్లుపల్కఁ, బవనాత్మజుఁ డుగ్రత లేచి రోఁజుచున్,
రోసము రూపుగొన్నలయరుదుగ్రుఁడో నా, "నిదె రాజరాజు, దు
శ్శాసను నిప్పుడే చదిపి చంపుదు నొంపుదు," నంచు సాఁగినన్,
గాసిలి ధర్మజుండు, "నను గైకొను" మంచు మరల్చె నాతనిన్.
ఆ. అట్లు తను మరల్చునన్నవంకకు వృకో [290
దరుఁడు మోముఁద్రిప్పి కెరలి యతని
దేటిపాటుఁజూచి, తెలిసి, యాటనొంది,
పలికె నిట్టు లెల్లవారు వినఁగ. 291
ఉ. "ఆడఁగరానియట్లరయ కాడినజూదము మమ్ము నూరకే
వీడెనె; తత్ఫలం బనుభవింపక తీఱెనె; యింక నట్టులే
పాడిదొఱంగి యీసతి నవజ్ఞ నొనర్చ నఘుంబు వీరినిన్
వీడునె; యెట్టిగోడుగుడిపించునో. యింతట నేనె చూచెదన్. 292
తే. దీని గర్ణుండు విని, యాజ్ఞసేని దుడికి
ప్రభుని దుర్భాషలాడి, యాపగిది భీము
రేఁపు టారసి, సహింపనోప, కిట్లు
నుడివె హేళన దుర్యోధనుఁడు వినంగ. 293
తే. "వెలఁది, నీమగ లిట్లు నిర్వీర్యులైరి,
ధవునిగ వరింపుమా సుయోధనుని నిపుడె;
యితని జేపట్టి తేని, నీపతులపాలి
పోలు నిక్కమ్ము నీపాలి మేలు సుమ్ము. 294

తే. "మగువ కొకమగం డను నియమంబు మీఱి
యప్పు డేవ్వర వరింపనై ననీకు
నిప్పు డాఱవవాని వరించు టెంత;
యదియు విధిహిత మని సిద్ధమగును లెమ్ము." 295

ఉ. కర్ణునినీచవాక్కు చెవిగ్రాఁడినమాత్రనె సవ్యసాచి కో
పార్ణవ మేచిన ట్లుడికి "యన్న్యాలపంచలఁ దిన్నకూడు చే
దుర్ణయ మెచ్చెఁ గర్ణ, యనిఁ దూల్చి వధింపకమాన ని, న్నిదే
నిర్ణయ, మీసుయోధనుఁడు నీగతి చూచుత" మంచు,గర్జిలెన్. [296

ఆ. "అగ్నిపుత్రితోడ ననిలాత్మజుఁడు చేరె;
నిఁక ధనంజయుండు నేచు టరుదె;
యంతకాత్మజుఁడును నటు వారితోఁ జేర,
నకట! యేమిగతియొ, యనిరి జనులు. 297

చ. అలిగియు సవ్యసాచినుదు లావలఁ దోసి సుయోధనుండు న
వ్వలము మొగంబుతోడఁ "జెలువా, రవిసూతినిజంబు పల్కె,నన్
వలచితి వేని ర మ్మిపుడె నాతోడపై నిటఁ గూరుచుండు; మీ
తులువల వీడు మీగడీయతో." నని డాతోడ తట్టి చూపినన్. [298

క. "హరి! హరి!" యని యిరుచెవులన్
గరములఁ గదియించి, యట్టి కనుమూసి, మనోం
బురుహాము ముకుళింపఁగ, నా
గరిత మయిన్ మఱచె ననఁగ క్షణ మగపడియెన్. 299

క. అంతఁ, గిరీటికి బదులిడఁ
బంతంబున లేచుకర్ణు "వలదని, రారా
"జింతకుఁ గారణ మగునీ
కాంతను గా కౌరులఁ గినియఁ గత మే" మనియెన్, 300

క. కురుపతి యటు లనినంతనె,
మురియుచు దుశ్శాసనుండు, "మున్నే నాచే
విరిసిన యాకురులే యీ
గరిత తెఱఁగు చాటు" ననుచుఁ గలకల నవ్వెన్. 301

తే. అప్పు డవమానరోషముల్ గప్పి కలఁపఁ,
గనుఁగవ జలంబు, నగ్ని యేకముగఁ గుఱియ,
నాదిశక్తియె యీరూప మందెనో యన
నెసఁగె ద్రౌపది రిపుదుర్నిరీక్ష్య యగుచు. 302

తే. అట్టు లెసఁగుచు నున్నయయ్యాజ్ఞసేని
దేహ మాపాదమస్త ముద్దీర్ణకోప
భరముచేఁ గ్రాఁగి యెంతయు వడఁకుచుండఁ
దడఁబడెడుగొంతుతో నిట్లు నుడివెఁ గసరి. 303

శా. ఏచేతన్ ముడివీడి యీకురులు నేఁ డీరీతి జీరాడునో
యాచేతిన్ మును దుంచి భీముఁ డనిలో నాదుష్టదుశ్శాసనున్,
నీచున్ జంపి, తదీయరక్త మిడి తానే కూర్చునందాఁక, నే
నాచేతన్ ముడివేయ వీనిని, ప్రతిజ్ఞన్ వింటిరే యిందఱున్. 304

శా. భీముం డంతట ని ట్లనుఙ్ జలదగంభీరస్వనం బొప్ప, "నా
భీముండే చనుదెంచి యడ్డపడినన్ వేధించి, బాధించి, సం
గ్రామక్షోణిని దుస్ససేను దెగటార్చన్ జేసి, యానెత్తుటన్
భామా నీకురు లద్ది గూర్తు; నిది నాపంతంబు శాంతింతువే. 305

ఉ. "నాతిరో, యింతెకాదు విను నాప్రతినన్ మఱియింకొకండు, నీ
కేతొడఁ జూపి యెక్కు మనియెన్ నిను నీచసుయోధనుండు; నే
నాతొడ మున్నుగా విఱిచి, యయ్యధమున్ వధియింతు నాజిలో;
నాతఁడె ధర్మజుండె వల దన్నను మాన; నిఁక కూఱడిల్లు దే." 306

ఉ. ఆచవిగానిమాట వినినంత సుయోధనుఁ డుగ్రమూర్తియై,
లేచి, కరంబు వాతెఱ చలింప, "సహోదర,వల్వలూడ్చి యీ
నీచను బిత్తలన్ సలుపు నెట్టిన నిందఱిమోల; దీనినిన్
గాచికొనంగ వచ్చుమొనగాఁడది యెవ్వఁడొ చూతమం"చనన్. 307

ఉ. ద్రోవది కోపతాపములతో వెలిఁగ్రక్కుచునున్న వాక్కులన్
బోవయి పొంగుభావములు ముట్టి, మెయిన్ మఱిపింపఁ, గర్జమున్
బోవిడి యూర కందనుకఁ బూనక యుండినదుస్ససేనునిన్
ద్రోవకుఁ దెచ్చి మేల్కొలిపెఁ దోడనె కౌరవునాజ్ఞ యత్తఱిన్. 308

* దుశ్శాసనుఁడు ద్రౌపదివలువలూడ్చుటః-ద్రౌపది కృష్ణుని
ధ్యానించుటః-వస్త్రములక్షయ మగుట. *

క, రక్కసునిబోలె నిగుడుచుఁ;
దక్కక దుశ్శాసనుండు ద్రౌపదివలువన్
జిక్కఁగొని పట్టియీడిచె
నక్కాంత తోలంపఁ బెనగులాడుచునుండన్. 309

క. విడువక వాఁడును సతిదెసఁ
బడి, కడుసాహసముమీఱ వలువను నీడ్వన్,
విడిపించుకొనుచు నాసతి
తడఁబడె, మెయిదాఁచుకొనఁగఁ దహతహపడుచున్. 310

క. ఆరీతిని దీఁనిగతి
వా రిరువురు తమకడంక వదలక పెనఁగన్,
నారీమణి యంతంత, క
ధీరయగుచు సోలుచుండెఁ దికమకపడుచున్. 311

క, ఎం తాఁపిన, న్నాఁగక వలు
వంతంతకుఁ జేయి మీఱి యరుగుచునుండన్
గాంతామణి సంతాపము
శాంతిఁ గనుచు, నాస యుడిపి, చనె భక్తి దెసన్. 312

ఉ. ఆసమయంబునందుఁ దను నాదుకొనంగల పుణ్యుఁ డొక్కఁడే
నాసభయందు లేమి, దుృపదాత్మజ యచ్చటియాశలన్నియున్
దోృసి, తనంతనే మదికిఁ దోఁచినకృష్ణుని, శౌరి, ద్వారకా
వాసుని సంస్మరించి యభివ్యాధవపూర్వకరీతి నట్లువాకొనెన్. 313

శా. "అన్నా, సాధుజనావనుండవను ప్రఖ్యాతిఁ జెల్కిఁ నమ్మి, నే
నిన్నే నెమ్మదిలోన నుంచుకొని ధ్యానింతుఁ గృపాశాలివై
నన్నీ దుష్టుల బారినుండి తొలఁగంగాఁ జేసి, వేవేగ, యా
పన్నుఁ దీనను నాదరంబు మెయిఁ గాపాడంగ దే ర్గాగదే. 314

ఉ. "చెప్పుదు నేమి, నీయనుఁగుఁ జెల్లెలి నైనను నీమఱందు లి
ట్లొప్పరికించి జూదమున నోడిరి దాయలకొడ్డి వారలుఁ
జెప్పఁగరాని దుర్మదముచే ననుబట్టి కృపావిహీనులై.
యిప్పగిదిన్ గలంచి, రిఁక నేమని నీకడ విన్నవించెదన్. 315

చ. "ఇలునడిఁ గూల్చి, నిండుసభకీడ్చి కులాంగననైన నన్నయో!
బలువెతఁగూర్చి, యిట్లు మగవారలు చూడఁ బరాభవింప; నీ
పలువలు పూని; రాఁడుకుయి వారిచెవిన్ జొర; దీనగల్కనుల్
గలిగియు లేనివారిగతిఁ గన్గొనుచుండి; రిఁకేమి చేయుదున్. 316

క. "చేపట్టిన మగలే నను
నీపగిదిన్ జేయి విడువ, నెవ రోమంగా
నోపెదువా; రిఁకఁ, గృష్ణా
నీపైననె యాశలెల్ల నిలిపితిని సుమా! 317

క. "ధర్మమునకు బద్ధుండై
ధర్మసుతుం డూరకుండుఁ; దత్సోదరు లా
నిర్మలు నను యాయులు; నా
కర్మమునకు వారి ననుటకాదు, ముకుందా! 318

క. "దిక్కెవరు లేక, నీవే
దిక్కని నిను దలఁచువారి దిక్కై కరుణన్
బెక్కుర మనిచితిగదె; న
న్నొక్కతె నియ్యెడల మనుప నోపవె కృష్ణా! 319

క. "నారాయణుఁడవు, పెక్కవ
తారంబుల నెత్తి ధరణి ధర్మము నిలుపన్
గోరి శ్రితులందు దయపెను
పారఁగ వర్తించుతీరు నారయుదు, హరీ. 320

సీ. "మకరంబునకుఁ జిక్కి వికలమై మొఱవెట్టు
కరిరాజుఁ గరుణించి కావలేదె;
నిను వీడు మని తండ్రి తను బెట్టు పెనుబాధ
లను నోర్చు ప్రహ్లాదు మనుపలేదె;
పినతల్లి యవమానమును గూర్పనిను నెంచు
ధ్రువబాలు ననుకంపఁ బ్రోవలేదె;
దుర్వాసు దుర్వార గర్వంబు సర్వంబు
చెడ నంబరీషు రక్షింపలేదె;
తే. యనయ మనదలై యార్తులై యశ్రులూరఁ
దనువు గరుపార, మనసార నిను భజించు
వారినెందఱెందఱినో కాపాడలేదె,
యకట! నే నొక్కతెనె భారమా ముకుంద. 321

తే. " జనని మనిచితి మామనై నను వధించి,
భార్యఁ బ్రోచితి శిశుపాలు బారినుండి,
చెల్లెలిని గాచువంతు వచ్చెను, మురారి,
యదియుఁ జెల్లింప నవకాశ మిదియె సుమ్ము. 322

ఆ. " ఆలసింపవలవ దవమాన మగుమున్నె
మనుపఁ దలఁపు; మవల మనుపఁ దలఁచి
యేమిఫలము; గాన నింతలో నామాన
మైన నిమ్ము, ప్రాణమైనఁ గొమ్ము. 323

తే. " కృష్ణ, దామోదరా, దేవకీకుమార,
మాధవ, పరాత్పరా, ఖలమదవిదార,
సాధు హృదయానువర్తి, ప్రసన్నమూర్తి,
పరిజనార్తి నివర్తి విశ్వప్రవర్తి. 324

తే. " ఆనతావనదీక్ష, దీనాళిపక్ష,
భువనపావననామ, దానవ విరామ,
పాలితానాథజాల, దయాలవాల,
దాసజనజీవ, కేశవా, వాసుదేవ." 325

తే. అని కనులమూసి, యెల్ల బాహ్యంబు మఱచి,
చిత్తమేకాగ్రమొనరించి, శిరమువాంచి,
కృష్ణమూర్తికై సర్వమర్పించి మించి,
ధ్యానమగ్నత వెలుఁగొందె యాజ్ఞసేని. 326

క. పదిలంబుగ వలువను మెయిఁ
గదియింపఁగఁ బెనఁగు టుడిగి, కరముల రెంటిన్
గదియించె నొసటిపైఁ దన
హృదయస్థితు కృష్ణుకడనె దృష్టి నిలుపుచున్. 327

ఉ. ద్వారక నున్న కృష్ణభగవానుఁడు సర్వగతుండు కాన నా
తీరుననామె సల్పెడునుతిన్ గలభక్తిరసంబు పొంగి, యు
ద్వారిగఁ బాఱి యాత్మఁ దడుపంగఁ, గరంగు మురారి కంటనీ
రూరెను దత్సతీ పరిభవోగ్రదవానల మార్పనోయనన్. 328

చ. మయసభనాఁడు పాండవుల మందిరమందు సమస్త కార్యముల్
ప్రియపడి శౌరి తానె యొనరించుచుఁ జెల్లెలి ప్రేమనారయన్,
జెయిరొక యింత కోసికొనఁ, జిందెడు నెత్తురుచూచి, యామెయున్
భయమున నాక్షణంబె తన వల్వచెఱంగును జింపికట్టెనన్. 329

ఉ. అప్పుడతండు ప్రీతుఁడయి, యాయమకట్టెడె మాఱుమేలు, తా
నెప్పుడుసేయ, నెట్టియను వెట్టు లభించెడినో యటంచు, నే
చొప్పునగూడునం చెదురు చూచుచునుండ, నదిప్పు డబ్బఁగా
నప్పుడె యామెయంబరము లక్షయమౌత యటంచు వాకొనెన్.

ఉ. అక్షయమన్న వాక్కుతని యాస్యము వెల్వడినంత, దిక్కులం
దాక్షణమందె వెల్వడియె నక్షయ మక్షయ మన్న నిస్వనం
బక్షుల నందఱెత్తి కనిరంతటఁ గైనను గృష్ణమాత్రప్ర
త్యక్షము కృష్ణరూపుఁగనె, నంబరమధ్యమునన్ రహింపఁగన్.

క. ఆరూపుఁ గన్నతోడనె
నారీమణి పులకరించె; నయనంబుల న
వ్వారిగ నానందాశ్రువు
లూరెన్, విప్పారె వదన, ముల్లము తేలెన్. 332

క. అక్షయ శబ్దము తోడనె
యక్షయగతిఁ జెలువవలువ లంతటఁ బెరిగెన్;
బక్షములు తెగిన సుడివడు
పక్షికిబలె దుస్ససేనుబల మఱె తఱిగెన్. 333

ఉ. ఇచ్చఁ దెగించి యక్కతినిఁ డేచి తదంబర మెంతయీడ్చినన్,
వచ్చుచునుండెఁగాని యుదిపారము ముట్టదు; వాని బాహువుల్
నొచ్చివటంబుదప్పె; శ్రమనూల్కొన వాఁడు సగంబుచచ్చి మేన్
ముచ్చెమటల్ దొఱంగఁ,గనుమూయుచుమూల్గుచుఁ గూలె నేలకున్.

ఆ. అపుడు సభ్యజనుల యాశ్చర్యమానంద
మెంతలనఁగవచ్చు; నెల్లవారి
స్వాంతమందు నొక్కభావంబె పొంగి రాఁ
దమకుఁదామె యిట్లు తలఁచుకొనిరి. 335

ఉ. పెల్లుగ దుష్టులేచి తను బెంప, నధర్మపిశాచి సాధువుల్
తల్లడమందఁగాఁ బ్రళయతాండవ మాడుచునుండ, వాని యే
పెల్లను మాపి, ధర్మరమకే తుదఁ బట్టముకట్టి లోకముల్
చల్లఁగ నేలజేయుపరశక్తియె శిష్టుల కెందు దిక్కగున్, 336

క. మానంబు దక్కెనని యెడు
జ్ఞానం బుదయించినంత, సాధ్వీమణి య
త్యానంద పరవశత్వం
బూనఁగ, నొక్కింతకాల మూరక యుండెన్. 337

ఆ. అవల నుంత తెలిసి, యాకృష్ణ పరమాత్ముఁ
డట్లనుగ్రహించు టరసి మురిసి,
మరలమరల నతని స్మరియించి స్మరియించి,
తనివి సనక యిట్టులనియె నతివ. 338

శా. 'దేవా! యెంతనిసన్నుతింతును భవద్దీనావనాసక్తి; నా
సేవన్ సుంత పరిగ్రహించి, యిటునీ చిత్తంబునన్ నాకునున్
దావీయన్ దలపోసితే గుణనిధీ, ధర్మాత్ములన్ ధర్మమున్
గావన్ జూచుటెనీప్రధానకృతిగాఁ గైకొంటివే, మాధవా! 339

మ. తరమేనిన్ను నుతింపఁగాఁ, త్రిజగదంతర్యామివై, స్వామివై,
శరణంచున్ మొఱపెట్టుటే తడవుగా సర్వార్తసందోహమున్
బరమప్రీతి సమాదరించి సతమున్ బాలించి లాలింతువే;
వరధర్మప్రతిపాదనైకహృదయా, భక్తాళి భాగ్యోదయా! 340

క. "పారమెఱయ నలువయె నిను
నేరఁడఁట నుతింప, నబలనే నేనుతునే;
భూరి కృపనను మనుప నీ
తీరునఁ గతమేమొ నీకె తెలియు మురారీ. 341

క. "నిండుమది ధర్మరక్షకు
నండగ నిలుచుండు వారి నరసెదవు గదా
నిండారు కరుణ; నందునఁ
బాండవులన నీకదెంత ప్రాణమొ కృష్ణా! 342

క. "శత్రువులె లేరు తనకు ధ
రిత్రి నను నజాతశత్రురిపులను నీ వీ
మాత్ర మణఁగార్చి, యాతని
జిత్రముగ నజాతశత్రుఁ జేసితివి గదే. 343

క. ఇందున్న నన్ను ద్వారక
యందున్నను నిట్లు మనుప ననుపైతివి, నీ
వెందున్ననేమి, భక్తుల
ముందున్నటుకాదె, సకల భువనవ్యాపీ! 344

క. "చెల్లెలిని బ్రోచువంతిటు
చెల్లింపఁగ నేను నీకుఁ జెల్లెలినని, నీ
చల్లని చూపుల నాపై
నల్లనఁ బఱపితివె. యెంత యాదరమొ హరీ! 345

క. "నిను మదిఁ దలఁప నుపేక్షిం
చినవారిదె తప్పుగాక; స్థిరమతి నీపై
నునిచిన వారల నెన్నఁడు
మనుప నుపేక్షింప; వెంతమమతయొ కృష్ణా! 346

తే. అఖిలదేవాదిదేవ మహానుభావ
దారుణాధర్మ విలయ, సద్ధర్మ నిలయ,
విశ్వ విస్తార రూప, సంవిత్స్వరూప,
సకల లోకాధినేత మోక్షప్రదాత! 347

తే. శ్రీరమాకాంత, శ్రితవన శ్రీవసంత,
సుజనసురభూజ, శతకోటి సూర్యతేజ,
భూరిగుణసాంద్ర, భక్తచకోర చంద్ర,
కృష్ణ, కృష్ణా, ముకుంద శౌరీ మురారి!" 348

క. అని భక్తి పరవశత్వం
బునఁ గంఠము బిగియ, ద్రుపదపుత్రిక యాపై,
వినుతింప నాలు కాడక
కనుమోడ్పుతోడ మోడ్చెఁ గరయుగళంబున్. 349

తే. ఆమెతోడనె పాండవుల్ తాముకూడఁ
బొంగుభక్తిఁ గృతజ్ఞతా పూర్వకముగఁ
గేలుమోడ్చిరి కనుమోడ్చి కృష్ణమూర్తి
కతని యవ్యాజ కృపకు సద్భుతము పడుచు. 350

క. ఆమీఁద సభ్యులెందఱొ
తా మే మొనరించుచుంట తామెఱుఁగకయే
యామెయి నె కేలు మోడ్చిరి,
యామోదాశ్రుప్రపులధార లక్షులఁ దొరఁగన్. 351

ఆ. వనిత యవలఁ దేఱికొని సుంతకనువిచ్చి,
యొక్కసారి జరిగి యున్న దెల్లఁ
దడవి యాకళించి, ధైర్యమూఁది, ప్రశాంత
చిత్త యగు చొకింతసేపు తాళి. 352

తే. ఓపి సభకడ కొకసారి చూపుఁబఱపెఁ;
బతుల, దుశ్శాసనుని, గురుపతిని, శకునిఁ
జూచునపు డామెకన్నులఁ దోఁచె నోలి
హిత, ముదాసీనతయుఁ, దిరస్కృతియు, జయము. 353

క. తనవలువ లొలిచి దుశ్శా
సనుఁ డేసినరాశిచాయ సతి కను మలపన్
బెనుమంట లెగసె, దుర్యో
ధనువైభవ మిట్లిముందు దరికొనునో యనన్— 354

ఉ. అంతట నాసభాసదులయం దుదయించినతిచ్చపాటు నెం
తేం తనవచ్చు; నెవ్వరును నే మన నేరక, కన్నుమూయ క
త్యంతభయంబు, భక్తి హృదయంబులలోఁ దమయంత బొంగ,డి
గ్భ్రాంతి వహించియుండి రిటపై నిఁక నేమొయటన్న యోజనన్.—

ఉ. కష్టసముద్రియున్ గడచి గట్టు న కెక్కినద్రౌపదిన్, మనో
భీష్టము తీఱలే దని, తపించు సుయోధను, గూలియున్న యా
దుష్టుని దుస్ససేను, బరితుష్టి వహించిన పాండుపుత్రులన్,
జేష్టలు తక్కసౌబలుని స్గిలుకర్ణు గణించి రందఱున్—. 356

తే. వారికీదృశ్యములు పలుభావములను
గోలుకొనఁజేసి మిగులగగ్గోలుపఱప,
నప్రియత్నత వారియాస్యములనుండి
పెద్దకోలాహలముబయల్వెడలినిగిడె- 357

ధృతరాష్ట్రుఁడు పాండవులను దాస్యవిముక్తులుగ నొనర్చి
వారిరాజ్యమును మఱల వారికిచ్చుట.

మ. అది వెంటన్ ధృతరాష్ట్రవీనులను వ్రియ్యల్ సేయఁగా,నాతఁడ
వ్విదురున్ బ్రశ్నయొనర్చి యెల్లవిని,యావేగంబు హెచ్చంగ,దా
పదియున్ భీముఁడు క్రీడి కైకొనినయాపంతంబు లేఁపంగ, నా
పద లేవేవియొ ముందు నిల్చినటులోఁపన్, భీతుఁడై చింతిలెన్. [358

ఆ. మహితు ధర్మతనయుమదినొవ్వ, భీముని
గదయు సవ్యసాచి గాండినంబు
సాధ్వి యాజ్ఞసేని శాపోక్తులును, జక్రి
తోడుఁ దమకు నెదురఁ దోఁచి నిలిచె. 359

మ. ఇది యెల్లన్ గని, వారిగాయములుమాయింపన్ విచారించి,నె
మ్మదిలో నాతఁడు భావికార్యగతి సంభావించి, యాపై సభా
సదులన్ శాంతిలఁ జేయఁబంచి, కృప, భీష్మ,ద్రోణులన్ బాహ్లికున్
విదురున్ సంజయు హెచ్చరించి యెటులో విశ్వాసమున్ బెంపఁగన్:-

సీ. వేగ గాంధారి రప్పించియామెకుఁదొ త్త
యాజ్ఞసేనినిశ్రద్ధనప్పగించి.
సకలోపచారముల్ సలిపిశ్రీమర్ణదీర్చి
యామెను బ్రేముడి నాదరించి
మునుపటిదానిగా నొనరింప నియమించి,
విదురసంజయులను బిదపఁ బిలిచి,
యట్టులే ధర్మభీమార్జునాదుల నాద
రించి తేర్పఁగ నియోగించి, యవల

తే. ననియు ననట్టు లాసుయోధనునితోడ
వేడిపల్కుల నొండురెండాడి, కర్ణ
శకుని దుశ్శాసనాదులసరణిఁ దెగడి,
యెల్లవారును విన నాతఁ డిట్టు లనియె.- 361

ఉ. "ఓమహనీయులార, చెవియొగ్గి వినుం డొకమాట; యింత కే
మేమియొ యిందు నేఁడు ఘటియిల్లినదెల్లను దొంటినుండియుఁ
దాము జూచియుంట, మఱి త్రివ్విశొనఁ బనియేమి దానిఁ;
దామసవృత్తి, దాని కగుదండన, రెండును జెల్లె నింతతోఁ. 362

ఆ. "ఇంత కెవ్వ రెవ్వ రెం తెంత బాధ్యులో
మీరె నిర్ణయింప నేరుపరులు;
చేయిమీఱి జరిగిపోయె నిదంతయు;
ముందుపనిని జూచుకొంద మింక. 363

క. "పాండవులారా, పజ్జకు
రం డని మిముఁ బిలువ నోరురాదు! కటకటా!
నిండారిన శోకము నను
నుండనియదు; రారె పిలుతు నొద్దకురారే. 364

ఉ. "ఆర్యులుసన్నుతింపఁదగు నన్నిగుణంబులు నాశ్రయింప, సౌం
దర్యముతోడి శీలమును, ధైర్యముతోడి ప్రశాంతభావ, మౌ
దార్యముతోడి సంపదయు, ధర్మముతోడి స్వయంప్రతిష్ఠయుఁ,
శౌర్యముతోడి సజ్జనత, సాజములై సమకూరె మీయెడన్. 365

ఆ. " పాండుసుతులవంటివారి నేవంశమే
గాంచఁ గనుట గర్వకారణంబు;
నేఁడు వారు నిట్టికీడుపాలై రన్న,
నేరికంట నశ్రు లూరకుండు 366

క. " అమ్మా ద్రౌపది, చెంతకు
రమ్మా; మాతల్లి వీవుఁ రమణీమణులం
దిమ్మహిలో నినుబోలెడు
కొమ్మలు లభియింపఁగలరె, కోటికి నొకరేన్. 367

చ. " అనుపమ సాధుశీలవు; గుణాఢ్యవు, సాధ్వివి, క్షాత్రతేజమున్
మునుకొని నిల్చునిన్ జెనకు పూరుషు నెంతకునేని దింపఁగా
వెనుకకుఁ దగ్గనోరువని వీరసతీమణి వీవు; స్వచ్ఛమై
తవరెదు దైవభక్తి గలధన్యవు; నిన్ను నుతింప శక్యమే. 368

క. "అట్టిగుణోత్తమ వగునీ
మెట్టిఁ ట భరతాన్వయంబు మిన్నందెనుమా;
యెట్టులొ మాకోడలివై
యి ట్టెసఁగితి; మాదుసుకృత మెంతనవచ్చున్. 369

సీ. "ఇట్టినీకు నకట! యిట్లు మావారిచే
నెవ్వ రనుభవించి యెఱుఁగనట్టి,
సిలుగు లొదవు టెంచి సిగ్గుచే వెనుకాడు
డెందము నిను నూఱడింప నేని. 470

తే. "అట్టి యీపాండవులు, ద్రుపదాత్మజయును
బాములకు నగ్గమైన యప్పట్టునందు
వారిఁ బ్రత్యక్షముగఁ జూచువ్యథను బాపి
యంధతయె నాకు మేల్చేసె నని తలంతు. 371

క. "ఇదియెల్ల నట్టు లుండెన్,
మది నుంచక దీనినెల్ల మఱవుం; డిఁక నా
తుది నిర్ణయమును వినుఁ డ
య్యది మీసమ్మతిని బడయు ననుచున్ దలఁతున్." 372

ఆ. అని వచించి ద్రుపదతనయ నుద్దేశించి,
యాత్రి మొలయుచిన్నె లాస్యమందుఁ
గడుసమాదరంబు నుడులందుఁ దొలుకాడ,
నిట్టులనియెఁ బ్రీతి యుట్టిపడఁగ. 373

ఆ " తనయ, తొలుత నీదు దాసీత్వమును బాపి,
స్వేచ్ఛ నిత్తు నీకు నింతమీఁద;
వలసినట్టి యెన్నివరము లే నడుగుము;
యిచ్చి సంతసింపనిమ్ము నన్ను":- 374

తే. ఇట్లు ధృతరాష్ట్రుఁ డనినంత, నెల్లవారి
హృదయముల శాంతి పొడసూపె నింతయంత;
యవలఁ బాంచాలి పతులయాస్యములఁ జూచి.
భావ మూహించి, మెలమెల్లఁ బలికె నిట్లు.- 375

ఉ. "మామ,కృతజ్ఞరాలనునమస్కృతిఁగై కొను; మెంతభాగ్యమో;
నామదిసంతసిల్లెఁ, గరుణామతివై యిటు పల్కుచున్ననీ
ప్రేమకు సాటియున్నె; కడుఁబెద్దవు; నెమ్మదిపొంగిరాఁగ, నే
మేమియొపల్కుచుంటిని; క్షమింపుమ; ప్రీతి ననుగ్రహింపుమా- [376

తే. "నను వరములెన్నియేఁ గోరుకొనుమ యంటి,
వెన్నొ నేఁ గోరనేల; నీ వీయ నేల,
యొక్కటియె కోరుకొనియెద; నిక్క మెంతొ
తృప్తియగు నాకు నది ప్రసాదించితేని,- 377

క. "నాపాలిటిసౌభాగ్యము,
నాపాలిటిసర్వజగము నాపతులగుటన్,
నాపతుల నా కొసఁగు మీ
యాపద చెడ వారివారి యాయుధములతోన్- 378

క. మెలఁత యిటు పలుక, "బళిబళి,
కులకాంతల కింతకంటెఁ గోరిక యున్నే;
తలఁపులఁ, బలుకుల, వర్తన
ములనిట్టిరు గలరె" యనుచుఁబొగడిరి సభ్యుల్. 379

క ఆపతు లాయాయుధముల
యేపున దీపింప, నింక నేరాజ్యముతో
నేపని తన కనుకొనియెనో
ద్రౌపది యప్పటికి నెట్లుతలచెనో భావిన్.— 380

క. ధృతరాష్ట్రభూవిభుం డా
సతికిన్ "నీవరము నిదె యొసంగితిఁ గొను మం"
చతిముదమున నుడువఁగఁ ద
త్సుతుఁ డలుకన్ దనజనాళితో సభ వీడెన్. 381

సీ ఇది విని ధృతరాష్ట్రుఁ డెద నొచ్చి, దీనిచే
నీపాండవులఁరోస మెచ్చు ననియు;
నారోస మేనాఁటికైన దుర్యోధనా
దుల బుగ్గిసేయక తొలఁగ దనియుఁ;
బాండుతనూజులపాలి రాజ్యము వారి
పా లగుదాఁక యీపగ లె యనియు;
నావిూఁదఁ బగ లాఁతి, నైకమత్యము గూరి
యుభయులయెడ శాంతి యొదవు ననియుఁ;

తే. పాండుతనయులె యరయ నెప్పటికినైనఁ
దనసుతులకంటె బలవంతు లనియు నెన్ని,
తుదకుఁ దనవారిసేమము మదిగణించి,
యాజ్ఞసేనితో మరల ని ట్లనివచించె. 382

ఉ. “ క్షత్రియధర్మమూఁది సతి, చాలవరంబుల కాసఁ జూప, కా
మాత్రము కోరి, తైన మును మాటయొసంగనె పెక్కులిత్తు నం
చాత్రము మీఱఁ; గాన నిపు డట్లొనరింపక మాటతప్పినన్
ధాత్రి జనుల్ నన్నుఁ దెగడి, తప్పన రే; మనసైన నొప్పనే.-383

క. కావున నిం కొక టేనియు
నీ వడుగకయున్న నేనెయిత్తును; క్షాత్ర
స్త్రీ వగుట, దాని వల దనఁ
బోవక గొని, నాయభీష్టమును దీర్పఁగదే. 384

సీ. విను మదే మన సౌబలునిసాయమున సుయో
ధనుఁ డా తెఱంగున ధర్మసుతుని
తోడ జూదము నాడి యోడించి, మును గెల్చు
కొనినదంతయు మీరు కోరుకొనకె
సార్వభౌముఁడ నౌట సర్వాధికారముల్
వహియించి నేఁ గృపాపరత నిత్తు;
మీపాలిరాజ్యంబు మీకొప్పగించితి
మహితసమస్త సంపదలతోడ.

తే. ధర్మసుతుఁ డింకఁ దనతోఁటిధరణి కెల్ల,
రాజసూయాధ్వరమునాఁటిరాణ మెఱయ
సిరులు చెలువారఁ బట్టాభిషిక్తుఁ డగుత;
నెప్పటి తెఱంగు మీఱు సుఖింతుర్గాత. 385

ఆ. "వినుము ధర్మతనయ, మనపెద్దల స్మరించి,
పరిక్షితవంశగౌరవంబు నెంచి,
నా మొగంబు గాంచి, నామాటవాటించి,
యీవు నాదుకోర్కె కియ్యకొనుము." 386

చ. అని ధృతరాష్ట్రుఁ డాడ, ద్రుపదాత్మజ ధర్మజుమోముఁ జూడ, నే
మొనరుపఁ దోఁప కొక్కక్షణ మూరకయుండి, గతంబు నంతయున్
దనమది నాకళించి, హరి తమ్మటు మన్నట నెంచి, యింక నే
మనుకొనిరో యతండు తుదకట్టులె యీకొనెఁ దండ్రిమాటకున్

క. వినయంబునఁ జని యాతఁడు [387
తనప్రియసోదరులతోడ, ద్రౌపదితోడన్
దనకున్ మ్రొక్కిన, దీవిం
చెను విని ధృతరాష్ట్రుఁ డుడుకుచిత్తం బలరన్. 388

తే. కృపుఁడు, ద్రోణుండు, భీష్ముండు. కృపదలిర్పఁ
బాండవుల నొక్కరొక్కరిఁ బట్టి డిగిచి.
కౌగిలించిరి మోదాశ్రుకణము లురలి
జడిగుఱిసి వారిశిరములఁ దడుపుచుండ. 389

క. ఆవల నున్నతగౌరవ
భావంబున ద్రుపదతనయ వారికి మ్రొక్కన్,
వేవిధములఁ బొగడుచు సతి
దీవించిరి వారు కలఁత దీఱఁగ మదులన్. 390

చ. కని యిది యెల్ల సమ్మదము గాంచి, సభాసదు లంతకంతకున్
మనసులమబ్బు తేఱుకొన, మాటికి మాటికి నన్నమాటలే
యనుకొనుచున్, విశుద్ధహృదయన్ ద్రుపదాత్మజ నప్పుడప్పుడున్
గనుఁగొనుచున్,బవిత్రితను గాంచితి మంచుఁ దలంచి రయ్యెడన్.

క. విదురుం డత్తఱిఁ బొంగెడు 391
హృదయముతోఁ "బాండవులకు నీవిభవము ద్రౌ
పది యేయిటు సమగూర్చిన
యది," యన సందఱును బలికి "ఠవు నవు" ననుచున్. 392

తే. విదురుఁ డట్లను టేమిభావించుకొనియొ;
ద్రౌపదికి దాన నూరినతలఁపు లేవొ,
పాండవాగ్రజుమన సేమొ; పార్థునూహ
లేవొ; కవల యాలోచన లేవొ; కాని. 393

తే. అబలమూలక మిట్లు రాజ్యంబుగొనుట
పౌరుషంబునకే తలవంపు లగుట,
నని రిపుల నోర్చియే దాని గొనుసుయోగ
మబ్బఁగావుత మనుకొనె ననిలసుతుఁడు. 394

క. మును ద్రౌపది, భీమార్జును
లొనరించిన ప్రతిన లెట్టు లొనగూడునొకో,
యనికొందఱు, "కృష్ణుఁడె యా
యను వెఱిఁగెడి" ననియుఁగొంద ఱనుకొనిరి సభన్. 395

తే. మలినవర్తను లగుకౌరవులకు మరలఁ
బరిభవము గూరు టరసి, సద్వర్తను లగు
పాండవులకు రాజ్యంబు చేపడుట యరసి,
యంద ఱది కృష్ణుమహిమ యం చబ్రపడిరి. 396

సీ. ధర్మజున్నైన జూదము లోఁగొనఁగఁ జాలె,
నన్యులమాట యే మనెడువారు,
భీమార్జునులఁ గూడ విధి బానిసలఁ జేసె,
నద్దాని కెదు రేది యనెడువారు,
నగ్నిపుత్రిక వేణి కధముండు చేసాఁచె,
నాదైవమాయ యెం తనెడువారు,
ద్రోణాదులను దుష్టుదుడు కొర్వఁజేసెఁ, బ
రాన్నమాహాత్మ్య మెం తనెడువారు,
తే. నూరకే దాయలకు రాజ్య మొసఁగఁ జేసె,
నంధనృపుపుత్రమోహ మెం తనెడువారు,
నగుచు, నెవరికిఁ దోఁచినపగిది వారు
పలుకుకొనుచుండి రందఱు బలువిధముల. 397

తే. జనులు వేర్వేఱ నెటుపల్కుకొనిన నేమి,
ధర్మజాదుల ధర్మవర్తనము దలంచి,
ద్రౌపది సతీత్వమును, శౌరిదయను దలంచి,
మెల్ల రొక్కరై పొగడి రామెల్ల వారి

ఆ. అందు నెందుఁ జూడ, నానందమొక్కటే
తాను తానె యగుచుఁ దాండవించె,
నియతిమీఱ నేచి జయజయధ్వానంబు
విశ్వమెల్ల నిండి వెల్లివిరిసె.

తే. ఉన్నయటులుండి యూరకే యుబికివచ్చి
నట్టికష్టార్ణవమునుండి గట్టుచేర్చి,
తమ్ముఁ గృపఁజూచె నంచు నందఱు నుతించి
శ్రీహరికి భక్తి నతుల నర్పించి రెలమి.

క. అని వైశంపాయనుఁ డా
జనమేజయ జనవిభునకు– సారతరంబై,
యనుపమధర్మాంచితమై,
తనరెడు భారత మొకింత తా వినిపించెన్.

ఆ. మునిమనోబ్జభృంగ! ఘననీలరుచిరాంగ!
సదమలాంతరంగ! సాధుసంగ!
యఖిలసుగుణకోశ! యాశ్రితాఘవినాశ!
విబుధహృన్నివేశ! వేంకటేశ!

ద్వితీయాశ్వాసము సమాప్తము.

# ఆశ్వత్థ భారతము.

## స భా ప ర్వ ము.

## తృ తీ యా శ్వా స ము.





క, శ్రీదయితా! త్రిదశార్చిత-
పాదా! శ్రితవరద! ధర్మపథసంచరణా!
వేదవినోదన! దుర్జన-
భేదన! శ్రీరాయదుర్గ వేంకటరమణా! 1

♦ పునర్ద్యూతము; పాండవు లడవికిఁ బోవుట ♦

క. అనెనిటు లాజనమేజయుఁ
గని వైశంపాయనుండు, "కౌంతేయు లటుల్
గని దాస్యవిముక్తిని, నృపు
ననుమతి నిజరాజ్యపదవి, నఖిలవిభవముల్- 2

ఉ. చేకొని; వీఁకతోడఁ బురిఁ జేరఁగ నేగఁగ, దుస్ససేనుఁ డ
త్యాకులభావమూని చని, యంతిపురంబున నున్నయన్నతో
నాకత విన్న; సౌబలుఁడు, నంగవిభుండు, సుయోధనుండునుల్
ఏకతమాడి రేపకడ నేతిగి మువ్వురు తనిచెంతకున్. 3

క. కని పేర్మిన్ దుర్యోధనుఁ
డను "ఉచితమే సుతులఁ జెఱప నన్యుల నింకే
మనవలయుఁ బ్రాప్తి యింతని
యనవలయునె కాక, విధిని నడ్డన్ వలనే?– 4

ఆ. మాదు పగఱపైన మమత నీ కిటు లున్న
మొట్టమొదట నొప్పి, తుట్టతుదకు
రచ్చఁబెట్టి మమ్ము అవ్వసేయుదె, జనుల్
గుణి జనకుఁడు, సుతుఁడె చెనఁటి యనఁగ?– 5

క. న్యాయము మిత్రులయెడ, న
న్యాయము శాత్రవులపట్ల నవనీశునకున్
ధ్యేయముగనుంట, శాత్రి
న్యాయం బనుపాటి నీవునారయలేవో? 6

క. బలిమినో, చెలిమినో, కపటము
కలిమినో, వల నగు మఱెట్టిగతినో, గెలువన్
గలిగి, పలుతెన్ను పన్నగ–
డల నృపుఁ డరిఁ గూల్పనోఁ గడంగి కడంకన్. 7

క. సాధింపరాని వైరుల
సాధించితి మెట్లొ యుక్తి శక్తిని; నదియే
బాధకముగాఁగ జనకా!
సాధించితె నీవె ప్రబలశత్రుఁ డవగుచున్? 8

ఆ. అనెడుతనయుపల్కు టల్గుల మదినుల్కు,
బాధకూర్చి కొంతవడికిఁ దేఱి,
చెంత దిగిచి సుతుని శీర్షంబు మూర్కొని
యంధనృపతి యిట్టు లాడఁ దొడఁగె:- 9

క. "కుఱ్ఱండవు, తెలియవునీ
యుఱ్ఱుకడన్ సిలుగు చిదిమి యూడుట, నాపై
జిఱ్ఱాడెదు, నేనంతటి
వెఱ్ఱినె, నీ కింత మది వివేచన వలదే?- 10

చ. వల దనునాఁడుబుద్ధిఁ జెవిఁ వాలఁగనీక, చలంబువట్టి నీ
వలిగి కలంప, నొందుతెఱు వారయ కొప్పితిఁగాక యప్పు; త
త్కాలము కులమ్ము నాశ మగుదాఁక సరాసరిరాకఁ గాంచి నేఁ
దెలివిని పాండునందనులఁ దేర్చితి, నీశుభ మెంచి పుత్రకా. 11

ఉ. నిన్నును, దుస్ససేనుని ననిన్ దెగటార్పఁగ భీమసేనుఁడున్;
బన్నికఁ గర్ణునిన్ దునుమఁ బార్థుఁడు; నద్దక నీదు నెత్తుటన్
జెన్నెఱిగంటుఁ గూర్పనని క్రేలుచుఁ గృష్ణ ప్రతిజ్ఞ లేర్తెఱన్
బన్నుటఁ, బుత్రశోకగతిఁ బొల్పడ నొల్లక, యిట్లొనర్చితిన్. 12

ఉ. ద్రౌపదినీడ్చి మీరు సభఁ దార్పఁగదన్ గొని భీముఁ డుగ్రుఁడై
చూపడినప్పుడ; తట్టితోడఁ జూపఁగఁ గృష్ణకునీవు పార్థుఁడే
చాపముఁ దొట్టినప్పుడ; గడుశాంతత ధర్మజుఁడాఁప మీకు ప్రా
ణాపద తప్పెఁగాక! యతఁడాపనిచో మననోపు వారలే.? 13

క. ఒలిచినతన మెయి వస్త్రం
బులఁగట్టను, గృష్ణకోపపుంజూడ్కు-లజ్వా
లలఁగాల్చె నంట; నివ్విని
వలగొన నటుగాచె సాధ్వి భావంబేమో? 14

క. అదియు మదీయ సుకృతమగు,
మదిగినియక పాండురాట్ కుమారుల తోడన్
మదిమదిగలపఁగఁ గను; మ
య్యది నీకగుహితము; నాకునదె సమ్మతమౌ. 15

ఆ. సగముమీరు, వారుసగ, మిలాభాగముఁ
దగభరించి, జగముతోగడ నెగడి;
రగడలేకమనఁ గనగుఁ గాక, యీగ్ష్యాగ్ని
రగులుపగలఁ దగిలి పొగలనేల? 16

క. అల గాంగేయుఁడు, విదురుఁడు,
కలశోద్భవుఁ, డతనిసుతుఁడు, ఘనుఁడు కృపుఁడు నీ
తలపొల్లరు; విను! పెద్దలు
పలువుర కిష్టంబుగానిపని నీ కగునే? 17

క. వారలపాలును వారలు
గూరఁగ నీకేల యింతకుతిలి? పరుసిరిన్
సైరింపఁదేని నిజసుఖ
సారాంశము నొందఁబోఁడు శకుస్యిండై నన్- 18

ఆ. సర్వభోగ భాగ్యశాలివి నీకేమి
కొఱంత? శాంతి నొకటె చిఱుత; యుదియు
గదుర నీకు నీడు గల్గఁ డెవ్వఁడు మూఁడు
భువనములను; నాదుబుద్ధి వినుము'' 19

క. అను జనకుపలుకు గొన కా
తనయుఁడు లికిపడుచు నాడు, ''దాయాదులు దు
ర్వినయులు, వారలఁ జేరఁగ
మనసొప్పదు; గుప్ప కిట్టి మాటలపోటుల్- 20

క. ఉమ్మడి యాలుగ భ్రాతలు
కొమ్మనొకత నేలి;రట్టి కుజనముఖాలో
క మ్మఘమన, వారలతో
నిమ్మహిఁ బొత్తొంది కుడువ నిష్టపడుదు నే?- 21

ఉ. ధర్మపరావతారుఁడను దా, ననుధర్మసుతుప్రగల్భముల్,
దుర్మదమెత్తి స్వేచ్ఛగతి దుందుడుకాడెడు భీముభాషణల్,
కార్ముకవిద్యఁదానె మొనగాఁ డనుబార్థునిపల్కులోపఁ బా
క్కర్మమె మాకు, ముల్కులటు కర్ణపుటంబులగాఢ గాఢమై? 22

ఉ. పోని, యికేని వారిజతఁ బూని చరించెదమన్న, నిన్నఁ ద
న్మానినివల్లులాడ్చితిమి మానము దూయఁగఁబట్టి; షండుఁడుఁగ
హీనుఁడునై ననుఁగ బలిసహించునె? వారలదుష్ప్రతిజ్ఞలఁగ
వీనులవిన్న నాయనవు, వెఱ్ఱిప్రలాపము లాడ నేటికిఁగ? 23

ఉ. ఎట్టులొ త్రాచులన్ గెరలనేసితి; మట్టులె పూర్తి చావఁగాఁ
గొట్టక వీడుచో చలముఁగూరి, ససిన్ గసిబట్టి కాటులన్
బెట్టక మానునే? తఱిని వేచెదుగాక; మనీషు, వీరు ని
న్నిట్టి భ్రమప్రమాదముల నేచెదుదుర్విధి నేమిసేయుదున్? 24

ఉ. పుట్టిననాఁటఁగోలె మము బొందరు వారలు; నస్త్రశస్త్రముల్
తొట్టిననాఁటఁగోలె మదిఁ దొట్రిలుచుందురు తాఁకమమ్ము; మే
మట్టులె కిన్కతో నదను నారయుచుంటిమినాఁడు నేఁడు; ముం
దెట్టులొ మాకుమాకు,జగదీశ్వరుఁ డొక్కఁ డెఱుంగు సర్వమున్.

క. దూఱితివి దుష్టుఁ డని నను- [25
నారయ కీరీతి; రాజ్య, మఖిలసుఖంబుల్
దూరంబు లగును నాకా
క్రూరులు మనియుండుఁదాక; రోయుదుఁగాఁకన్. 26

క. వే యేల పలుక జనకా!
పోయెద, నెమ్మెయినొ యసువుఁ బోఁద్రోసెద, నా
కీయవె యానతి, సుఖముగ
"దాయలతో మను" మటంచుఁ దరలెన్ వెలికిన్. 27

క. కలఁతపడి తేఁడు "శకునీ!
పిలుపిలు సుతుఁ, గులవినాశు, విధిచోదితునిన్;
తలమున్కలిడియు, నింకను
చలిభయమే" యనుచునశ్రుసలిలము లార్చెన్.- 28

---

ప॥ 24 పా॥ 2 అ॥ 7- ఁజ; పా॥ 3 అ॥ 13- ఁగాక;
ప॥ 26 పా॥ 4 అ॥ 6- యుండుదాఁక; ప॥ 28 పా॥ 3 అ॥ 1- దఱ;

క. శకునియుఁ గర్ణుఁడుఁ జెఱియొ
క్కొక్కకరమును బట్టి తెచ్చి యొప్పింప, నృపా
లకుఁడు సుతునొడికి దిగిచి, నె
మకి చెక్కులఁ బుడికికొనుచు మాటాడె నిటుల్:- 29

తే. "నీకుఁ గానిస్వర్గలోక మే నేనొల్ల,
సుతుఁడె పితకు నెల్లసుఖము ముఖము;
కర్మగతుల నేరు గడఁదోయఁగలవారు?
తెలుపు నాకు నీదు తలఁపు వలపు- 30

చ. గరళముఁ బెట్టినాము, కడగాననిగంగను ద్రోసినాము, జల్
దురుసున లక్కయింట నిడి దుర్ధర వహ్నినిఁ దార్చినాము; వా
ర్మరణము నొందరైరి, సుకుమారులు, దైవబలంబు పెంపునన్;
వెరవది క్రొత్త దేమి కనిపెట్టితిరో మఱి వారిముంపఁగన్? 31

క. యుద్ధంబో, మోసంబగు
బుద్ధియొ, కులకాంతకృష్ణ పుట్టమొలుపనో
పద్ధతియో, మఱియెంతటి
యుద్ధృతియో తెలుపుఁ, జేలమోచనలింకన్? 32

క. కన్నులు రెండును గానని
న న్నేపని నుంచువారొ, నాకతన మఱే
పన్నుగడ వన్నుచుంటిరొ?
పున్నెమొ, పాపంబొ, సేయఁబూనెద" ననినన్:- 33

క. మఱి క్రొత్త లేదు, దూతక
దఱుమును తోఁ దేరఁ బాండుతనయులను, దురో
దరమున జయించినవారల
నరణ్యములఁ దోలువార, మని సుతుఁడు మఱిక, 34

ఆ. "మదిని మరులు గొనకు, మా మాటఁ ద్రిప్పకు,
వారు వీరు వినుచు దారిఁ జనకు.
తమ్ముగుణ్ణ లనుచుఁ దలఁ కూనఁగాఁబోకు,
తనయుపగతు లంచుఁ దలఁపు నిలుపు" 35

క. అన, జన పతి కలఁతకవడి-
యును, "గృత కర్మం బవశ్య మనుభవనీయం
బను టెఱుఁగనె? తిరుగనుటె"
య్యని, తరిమెను బ్రాతికామి, నసుఁగులఁ దోడ్తేక. 36

ఆ. దారి నేగుచున్న ధర్మసుతాదుల
దరిసి ప్రాతికామి, తెలఁకు మదిని
విన్నవించె నెల్లవృత్తాంతమును; విని
తమ్ములెల్ల వినఁగ ధర్మజుండు- 37

ఆ. "సుతు నుడులకు మనసు సోలుచు మఱినను
బిలువఁబంచినాఁడు పెద్దతండ్రి;
అల దురోదరమున కాపహూతుఁడై తేఁడు
పోకయుంటఁ దగదు లోకమందు- 38

శా. మాయాద్యూతమునందు సౌబలునితో మార్కొడ్డలే రెవరు; మా
దాయల్ వానినె దాయమందునుతు, రద్దానన్ జయంబౌనె? యే
న్యాయంబై చెడుగౌనుమీకు; నెడబాయన్ న్యాయమే నొట, మీ
శ్రేయంబెట్టిటో నాజతన్ బడుటో, నిశ్చింతన్ బురిన్ జేరుటో?—

క. మీతలఁపు లెంచి తెలుపుఁడు! [39
నీతియు, ఖ్యాతియును నాకు నెటి" యనఁ; దోడన్
"నీతోడి నీడలే" మని
వాతాత్మజుఁ డాడె; నట్లె వాకొనె నరుఁడున్. 40

క. "మాసుఖముల కీసడపడి
మాసంపద జూదమందు మగుడఁ గొనంగా
నాసపడిరిట్లు; శౌర్యం
బేసరి; యది యున్నసిరుల కేలా కొదలా. 41

ఆ. శౌర్యముండె, మెండు సాహసంబును నుండె,
ధర్మమూర్తి నీదుదయయు నుండెఁ!
గాలగతుల సిరులు గలుగును దొలఁగును;
దిరుగనిమ్ము హాస్తి పురికి రథము." 42

క. అని వారు పలుక; ధర్మజుఁ
డను, మిమ్మడిగితిని నిన్న నట జరిగినయా
పనికై మీమన సెట్టిదో?
యని; మిమ్మొఁదొలఁగుట నేను వసువుల విడుటే. 43

క. అని, హాస్తిపురికిఁ దేరుల
జనఁగాఁ దోలించి ధర్మసంభవుఁ డపుడా
యనుజులతో సతితో రథ
మును డిగి, పెదతండ్రిఁ జేరి మ్రొక్కఁగ; నతఁడున్. 44

తే. వారి నెత్తి, కంట నీరు వారఁగఁ గౌఁగి
లించి, "మీకు శుభము లెసఁగు" ననఁగ;
"నేఁడె గాక ముందు నాఁడు గూడ శుభమ్ము
లనయు" నంచు భీముఁ డనియె విసిగి. 45

శా. ఆతేఁ డాయమపుత్రుఁగాంచి "విధిదుర్వ్యాపార భారంబుచే
నారీతిన్ గడుకష్టముల్ వడితి రయ్యా! యింత లోనుంచ కే
మీ రీనాఁ డిరుపక్షపుత్రకులు సంప్రీతిన్ సుహృద్భావ మే
పారన్ జూదమునాడఁ జూచిమది నాహ్లాదింపఁ గాంక్షించితిన్. [46

క. నాకు సుయోధనునకు నిం
దేకాభిప్రాయ మగుట, నిటు లిచటికి మీ
రాకన్ గోరితి, ముద్దుల
నాకూనలు దీర్పుఁడయ్య! నా యీప్సితమున్". 47

తే. అనుచు దుర్యోధనుని "మీరలనుజులెల్ల
పగలు వగలును దిగనాడి, నగుచుఁగూడి
యాడుఁ డీజూదము; జయంబు నపజయంబు
విధియధీనంబు; ప్రాప్తికి వెఱవవలదు. 48

క. అన, దుర్యోధనుఁ డోకకర
మును, సౌబలుఁ డొక్కకరముఁ బూని యమసుతుఁ
గొనిపోవ, ననుజులెల్లరు
వెనువెంటన సనిరి సభకు, పీడ్కొని చేనిఁ. 49

తే. అట సభామండపము మధ్యమందు, వార
లిరు తెగలవారు గూర్చుండఁ; బరికరముల
సిద్ధ మొనరించి ద్యూతసంసిద్ధుఁ డగుచు,
శకుని ధర్మజుఁ గని సంతసమున ననియె:- 50

ఉ. "ఓడిన రాజ్యసంపద లనూనముగా విభుఁ డిచ్చె మీకు, నిం
కోడుట వానిలెస్స యగునొక్కొ? వచింతు సభాతమాపణం
బోడినవారు, భార్యయును సోదరులుఁ మునివృత్తిఁ గొంచు మా
రాడక ద్వాదశాబ్దములు నట్టివనిఁ వసియింపఁ గావలెఁ. 51

కం. అటు లటవినిఁ గడపినమీఁ
దట నజ్ఞాతముగ జనపదమ్మున నొకయేఁ
డెట్లో, తెలియఁబడక మనవలె,
నటు తెలిసిన, మొదటి యట్లె యడవిఁబడవలెఁ, 52

కం. ఈరీతి నడపి వారలు
వారలరాజ్యంబు గొనుటె పందె" మన, విధి
ప్రేరితుఁడై యమనందనుఁ
డారీతికి నొప్పి యాట నాడఁ దొడఁగెఁ.- 53

క. పాచికల సౌబలుఁడు గొని
వైచినఁ దొలిసారె గెలుపు పడియెను; పిదప౯
వైచెను యుధిష్ఠిరుఁడు, విధి
వైచిత్ర్యంబేమొ, యోటువడియె నరేంద్రా! 54

ఉ. “కే” యని కౌరవుల్ కెరలి కేకలు వైచిరి; ధర్మజుండు క౯
దోయిట నేలఁజూచె; సయిదోడులచూడ్కులు చాలువాఱఁగా
నాయనమోముపై నిలిచె; యజ్ఞజ శత్రులవైపు తీక్ష్ణ దృ
క్సాయకపంక్తి దూఁటె యుత్థిచంపెను, బూర్తిగఁ జంపకేటికో. 55

క. పిలిపించి మిము బితృవ్యుఁడు
సలిపిన యుపకార భరము చాలదె? యింక౯
నిలిచితి రేలిట? నతనికిఁ
దెలిపి వనికిఁ దెరలకున్న దీరునె చెప్పుఁడా! 56

క. అని కృష్ణ వలుక, దుర్యో
ధనుఁడనుఁ “బాగరెంత యాఁడు దానికి; సభలో
నను నగినఫలముగ, మణిన-
సనము లొలిచికొనుఁ డరణ్యచరుల కివేలా” 57

క. పలుకియ్యది విని, పాండవు
లొలిచి విభూషాంబరముల నొసఁగి, యజినవ-
ల్కలములఁ దాలిచి, సతితో
నిలిచిరి జడదారులట్లు నిరుపమ దీక్ష౯. 58

క. వెడలి యటనుండి నడివడి
నడచిరి ధృతరాష్ట్రునంతినగరి; కచటనీ
చెడువార్త వినుటఁ బ్రముఖులు
నడలున, గుమిగూడియుండి రానృపుచెంతన్. 59

తే. సీ. అంతఁ బాండవు లాతండ్రియడుగులకును
మడుఁగ, హాయని తద్ద వాయ్విడిచి యతఁడు
ప్రక్కమోమిడి, కన్నీరు గ్రుక్కకొనుచు,
బసిడిమేలంచు దుప్పటి ముసుఁగుఁబెట్టె- 60

తే. అవల గాంగేయ కుంభసంభవముఖులకు
మ్రొక్క, నవ్వారు దుఃఖంబుఁ జిక్కపట్టి,
యవశమై నిక్కనిట్టూర్పులార్ప, నచోటు
ఘూర్ణితార్ణవశబ్ద పరిపూర్ణమయ్యె.- 61

*తే. అంత నవ్వారు విదురుని చెంతకరుగఁ,
" పూర్వకర్మంబు గుడుపక పోవ దురక,
జ్ఞాను లెప్పుడు కష్టసుఖంబులందు
మతిచలన మొంద, రవి యశాశ్వతములగుట. 62

క, ధర్మపథంబును వీడక,
నిర్మల మతియుతుల రగుచు నిరతంబును స
త్కర్మల జరుపుఁడు! కృష్ణుం
డర్మిలి మిము బ్రోచు విడక యదనుల గడఁకన్." 63

ఆ. అనుచు వినిచి, "కుంతి యడవి కోపదు, మీకు
వలెనె నియమ మీమె కలుగ దగుట,
ఇన్నిందె, నాగృహంబునందె యుండఁగనిండు,
చూచుచుందు దనరఁ బ్రోచికొందు" - 64

క. అన; పాండుసుతులు శోకం
బున మునిఁగిన జననిఁ బరిసి మ్రొక్కఁగ, సుతులన్
గొని యొడి నిడి, శిరమును మూ
ర్కొని తడబడునుడుల, నిట్లు గుంతి వగర్చెన్:- 65

ఉ. మీదురవస్థఁ జూడక, యమేయగుణాన్విత మాద్రి యెంతయున్
గాదిలిభర్తతోఁ జితిముఖమ్మునఁ జేరె దివమ్ము; దాని పు
ణ్యోదయ మట్టులుండె; నటు లోపనిపాపిని నాకుఁగల్గెనీ
ఖేదము; పాయునే స్వకృతకిల్బిష మెట్టిరుఁ గట్టిపడ్డకే. 66

తే. సకలరాజన్యలోకంబు సన్నుతింప,
నఖిలసామ్రాజ్యభోగము లనుభవింపఁ
దగినసుతులార! మీరు కాంతారమునకుఁ
బోవుచుంటను గనియును జావకుంటి". 67

క, అని, కన్నీటను దనయుల
తనువుల జలకంబులార్చి, తత్తరమునఁ గృ
ష్ణను గొని, తనతోడ నిడికొని
కని, చుబకమునంటి, యశ్రుకణములు దొలుకన్. 68

---

ప॥ 64 పా॥ 3 అ॥ 1- నిందె; పా॥ 4 అ॥ 5- మఁ;
ప॥ 65 పా॥ 1 అ॥ 3- ఁబా; పా॥ 2 అ॥ 11- జి;

తే. జననమాదిగ నెనలేనిసౌఖ్యములును
దసరఁ బెరిగినభాగ్యశాలినివి నీవు;
కానసమ్ముల కేఁగుదుర్గతిమె తల్లి!
విధివిధానంబు ద్రోయంగ వెరవు గలదె? 69

తే. జనక వంశంబు పాండుభూజానివంశ
ముభయములును బవిత్రత నొందె నీవు
పుట్టుటను, మెట్టుటను జేసి; పుణ్యమెంత
సలిపితిమొ మేము మాతోంటిజన్మములను? 70

ఆ. ఇట్టినిను బాయఁగా మది కొట్టుకొనెడి;
నైన నీ విట్లు భర్తల నంటి వనికి
దరలఁ గని, యుబ్బె నాకు సీతమ్మవంటి
కోడ లనుకొంటి, యూఱట గొంత కంటి'' 71

క. అని, సహదేవునిఁ గని, ''నే–
మన నేర్తునె నిన్ను బాసి, మహాదటవికి నేఁ
జనుఁడెంతును నీతో'' నన–
విని విదురుండాడు మిగుల వెతతోఁ బృథతోన్. 72

క. ''అమ్మా, భయదవనావా
సమ్మున కీవోప వని వెసన్ దెలిపితి నే
నమ్మోయి; వేఁడెద ధర్మజు
:సమ్మతి, నిను విడఁగ సాదుసదనంబందున్. 73

చ. అనవిని ధర్మజుండునగి, యావిదురుఁ గని, "నన్ను వేఁడఁగా
ననఘ వనేమి? తావకగృహంబున నాజనయిత్రి యుంట నా
కును గడుసమ్మతంబ! వగఁ గుందిన యాయమ చిత్తపంకజం
బును వికసింపఁ జేయఁగదె పూని సపర్యలఁ బుణ్యగాథలన్." 74

క, అని యాతల్లిని విదుర స
దనమున నిలవేఁడఁగాఁ, బృథ యొడంబడి, కం
టను దడి వెట్టుచు సహదే
వునిఁ జూపుచు ద్రుపదరాజపుత్రికతోడన్- 75

మ. వినుమా! యీతఁడు బాలకుండు సుమ! నే వేళన్ దగన్ బిల్చి పె
ట్టినదాఁకన్ దనయాఁకలిన్ దెలుపలేఁ డే వీనియందొక్క క
న్నును, దక్కంగలవారియందు నొకకన్నున్ గల్గి యజ్ఞాతకా-
నన వాసంబులు దీర్చి నీపతులతో నన్ జేరుమా! మానినీ" 76

క. అను కుంతిని వీడ్కొని, త
త్తనయులు ద్రోవదినిగూడి త్వరనంతిపురం
బును వీడి రాజమార్గం
బునఁ బడి పురినుండి వెలికి బోవుచునుండన్- 77

ఉ. స్త్రీలునుబూరుషుల్ గుములు దేరుచు, మేడలుమిద్దెలెక్కుచున్
బాలురు వృద్ధులాదిగను బారులు దీరుచు నిల్చిచూచుచున్,
జాలఁగనొచ్చియశ్రువులజార్చుచు, దూఱుచు ధార్తరాష్ట్రులన్
గాలము మీఱరాదనుచుఁ గట్టిడిదైవముఁ దిట్టపోయుచున్.78

సీ. "అమరేంద్రసమభోగు లగుపాండవుల కట్టె
వనవాసదుఃఖమం" చనెడువారు;

"నల, రామనృపులు గానలఁ బడరే, విధి
కడ్డమున్నదె" యంచు నడలువారు,
"తాళి త్రయోదశాబ్దంబులు మఱివచ్చి
యరులఁ ద్రుంపక మాన" రనెడివారు,
"జీవమై తనరు రాజీవనేత్రుఁడు నేఁడు
పోవరాఁ డే"మని పొగలువారు,
తే. కాంచి కృష్ణను గన్నీరు నించువారు;
"నగ్రజాజ్ఞా నిబద్ధులై రంతెకాని
కత్త్రీయును భీముఁడును రేఁగి కౌరవులను
దునుమకుందురె యీపాటి" కనెడువారు. 19

క. అటు లాపురిజను లెంతయుఁ
గటకటపడి పాండుసుతుల గనుఁగొని, మదిన
క్కటికమున వగచు చిటు ప
ల్కుట విని భీముండు మిగుల క్రుద్ధుం డగుచున్- 80

క. "కదనమున ధార్తరాష్ట్రుల
మదయుతులన్ నీచమతుల మర్దించెద నీ
గదచే" నని త్రిప్పుచు, ను
న్మదగజమటు చనియెఁ బ్రజలు మార్పడి చూడన్. 91

ఉ. గాండివముక్తబాణతతిఁ గయ్యములోనఁ, ద్రయోదశాబ్దముల్
నిండినమీఁద, దుర్మదుల నీచుల సూతతనూభవాదులన్
జెండెద" నంచు, బిట్టుగ వచించుచు వైరులగుండెజాఱఁ బా
ర్థుండు మహోగ్రుఁడై చనియె, దూఁకెడ నగ్నికణంబు లక్షులన్.

ప॥ 19 పా॥ 1 అ॥ 1- సల: పా॥ 4 అ॥ 4- ద్రుం; పా॥ 8 అ॥ 5- నిబద్ధులై;
ప॥ 91 పా॥ 2 అ॥ 12- మ్రందిం;

తే. మాయజూదంబునందు నీమాడ్కి మముఁబ
రాజితులఁ జేసినట్టి దుర్మార్గు, శకుని
మామకీనమహోదగ్ర మార్గణాగ్నిఁ
గాల్చి వేల్చెద మని కిన్కఁ గవలుసనిరి.- 83

ఆ. మోముపైన వస్త్రమును గప్పికొని యుధి
ష్ఠిరుఁడు నడువ; వెన్క నెఱులు విరిసి
భూమి వ్రేల ద్రుపద భూజాని పుత్రిక
చనియె, మూర్తిఁ గొన్న శక్తివోలె. 84

తే. పాండవులు నేగు చాడినపలుకులెల్ల
వినుప విదురుఁడు, ధృతరాష్ట్రవిభుఁడు బెదరి,
తనసుతులచావు నిజ మని తలఁచి, తలఁకి
పాన్పుపైఁ బడి పొర్లుచుఁ బరితపించె.- 85

క. అని వినిచిన వైశంపా
యను జనమేజయుఁడు గాంచి, హర్షముతోడన్
వినమిత శిరుఁడై చెప్పం
గను వేఁడెను ముందునడచుకత కుతకమునన్. 86

ఆ. మునిమనోబ్జభృంగ! ఘననీల రుచిరాంగ!
సదమలాంతరంగ! సాధుసంగ!
రాయదుర్గ వాస! రవికోటి సంకాశ!
విబుధవ్రాన్ని వేశ! వేంకటేశ! 87

సభాపర్వము సమాప్తము.

# ఆన్ధ్ర భారతము.

---

## అరణ్యపర్వము.

## ప్రథమాశ్వాసము.

క. శ్రీదయితా! త్రిదశార్చిత
పాదా! శ్రితవరద! ధర్మపథసంచరణా!
వేదవినోదన! దుర్జన
భేదన! శ్రీరాయదుర్గ వేంకటరమణా!

* తన వెంటఁ బడిన విప్ర, బంధు, భటపరివారముతోడ;
ధర్మరాజు అడవులకు బోవుట. *

క. అనె నిటు లాజనమేజయుఁ
గని వైశంపాయనుండు; "కౌంతేయులు ధౌ
మ్యునితోడ, సతితోఁ జని హా
స్తినగరిముఖమందు బాహ్య దేశమునందున్. ౨

మ. తమకై వేచినయిందరసేనుఁడును, భృత్యశ్రేణియున్, బందుగుల్
రమణీయోత్తమయానరాజిని సుభద్రాదేవి, తత్సూనుఁడున్,
గ్రమమొప్పన్ బ్రతివింధ్యముఖ్యసుతులున్ రాన్ వెంబడిన్, బాండవుల్
తమి శస్త్రాస్త్రములన్ ధరించి వనికిన్ దారేఁగ; గంగాతటిన్— ౩

క. లెక్కకు మిగిలిన భూసురు
లొక్కటఁ దముఁ జేరరాఁగ నూపుచుఁ దల, వ్రేల్
ముక్కుపయినిడి విషాదము
చిక్కఁగ మదిధర్మజుండు చింతాన్వితుఁడై. 4

మ. తనదౌర్భాగ్యము నెంచి వారు వగవన్ దాఁ బల్కు మా రాజ్యమున్
ధనమున్ సర్వము దాయ చేకొనియెఁ! గాంతారంబునన్ విప్రులన్
ఘనులన్ బూజ్యులఁ మిమ్ము కష్టములపాల్ గావింపఁగా నొల్లనేఁ;
గొనిపోవన్ మదిజంకుదున్ నిలుఁడి; నన్ గోపింపకే సైచుఁడీ! 5

ఉ. కట్ట, భుజింపఁ బట్టలను, కంపలు పిండెలు కాయలాకులున్,
మెట్టిగిరుల్ నదుల్ పదును మీరిన ముండ్లను గుండ్ల నొనర్
జెట్టమృగంబులే చెలులు, చేరఁగ వచ్చునె? నాకుఁ బాపమున్
గట్టక వీటికిన్ జని సుఖంబుఁ గనుండని కేలుమోడ్చినన్— 6

మ. అవనీశా! వినుమా నిజంబు, నిను బాయన్ లేము; నీ వాసహా
ర్ణనమున్ జొచ్చిన, శీతపర్వతము పైనన్ జేరినన్, దారినన్,
దినమందేగిన, నగ్నిదూఁకిన, ధరిత్రిన్ దాఁగినన్, వెంబడిన్
దవులన్ మానము, జీవ మీన! సుజన స్తవ్యా కృపన్ జూడవా!

క. అన, మది వనరుచు నశ్రుల్
తొనకఁగ ధర్మజుఁడు ముందు దోఁపక, ధౌమ్యున్
గనుఁగొన, నాతఁడు జనపతిఁ
గని యానందంబు పొంగఁగా వదనమునన్— 8

క. " క్షేమం బేటికి, ద్విజులు ప్ర
సాద మతులు, బుధులుఁ గష్ట సౌఖ్యములఁ ని
ర్భేద విషాదామోదులు,
నాదులు సమవర్తనులు ప్రశాంత మనీషుల్- 9

తే. "క్షితితలేశ్వర! భూసుర సేవనంబు
పరమ భాగ్యప్రదంబును, బాపహరము!
రవికృపను బొంది మృష్టాన్న రాజి వీరిఁ
దనిపి యాశీస్సులను బొందు మనుదినంబు" 10

♦ ధర్మరాజు సూర్యునుపాసించి అక్షయ పాత్రను బడయుట ♦

సీ. అని విశుద్ధాత్ముఁడై యర్యమ మంత్రంబు
విధ్యుక్తముగను పృథ్వీశ్వరునకు -
బోధింప నాతండు పోయి భాగీరథిఁ
జలకంబులాడి నిశ్చలితమతిని-
ధ్యానింప నినుఁడు ప్రత్యక్షంబుగావచ్చి
హేమపాత్రం బొకం డిచ్చి పలికె:-
" ఫలమూలశాకముల్ పాంచాలి దీన వే
యంగ మృష్టాన్నంబు లక్షయమగు,
తే. దినదినము పెట్టి ద్రౌపది తిన్నఁగాని
కడవడదు వేవవేల్ జనుల్ గుడువనైన,
ద్వాదశాబ్దంబు లిటులొప్పఁ దప్ప" దంచు
భానుఁ డాడి వెసఁ దిరోధానుఁడయ్యె, 11

తే. అంతఁ దానిని ధర్మజుం డింతికొసంగె;
బ్రాహ్మణాది జనంబులఁ బరమనియతి
నిష్టమృష్టాన్నములను సంతుష్టిఁ గొలుపఁ
బ్రతిదినముఁ గృష్ణ రవి హేమపాత్రవలన. 12

తే. ఇట్లనేకసహస్ర మహీసురులను,
బంధుజనముల, మిత్రుల, భటులఁగూడి,
గంగగట్టున కొన్నాళ్లు గడపి, పిదప
విడిసి రవ్వారు కామ్యక విపినభూమి. 13

క. ఎడనెడ మౌనులు ధర్మజు
నెడకున్ విచ్చేసి, ధర్మ మేర్పడుగాథల్
నొడువుచు సత్కారంబుల
నిడఁ గైకొని వీడుకొందు రెంతయు బ్రీతిన్. 14

♦ భీముఁడు కిమ్మీరుని వధించుట. ♦

ఆ. ఆవనంబునఁ గిమ్మీరుఁ డనెడునసుర,
బకునిసోదరుఁ డతిబాహుబలుఁడు పాండు
సుతులఁ బొడఁగని పైబడఁ జూడఁ; గాంచి
యనిలజుఁడు దాఁకె; నిర్వురు ననికి డిగిరి. 15

ఉ. కొండల పిండులన్ విసరికొంచు మహోర్భటి దిక్కులెక్కఁగా
నొండొరు లార్చి డీకొనుచు; నుగ్రగజంబులు దాఁకుజోకగన్
దండిగ ముష్టిపెట్టులిడి దండడి నొదలలొడ్డి యడ్డుచున్
గొండొకఠీవిఁ బోరిరి యకుంఠిత బాహుబలంబు పెంపునన్. 16

---

ప॥ 12 పా॥ 1 అ॥ 15- నఁ; ప॥ 13 పా॥ 3 అ॥ 7- గొ;
ప॥ 15 పా॥ 3 అ॥ 8- పైఁ; ప॥ 16 పా॥ 1 అ॥ 23- ఁగా;

ఉ. భూమివడంకె, నద్రితతిపార్లె, మహాభ్రములుమ్రోసె, దైత్య సి
ద్ధామరపంక్తి బెండువడె, నభ్రము దిగ్భ్రమనూఁగె, జల్లి బోఁ
గాములఱేఁడు చల్లఁబడెఁ, గండె సుధాంశుఁడు నట్టి యుద్ధ్రతిన్
భీముఁడు రక్కసుం డెనసి భిట్టపలించుచుఁ బెన్గధాటికిన్. 17

తే. అంతఁ గిమ్మీరునిన్ బట్టి యనిలజుండు
ముష్టిఘాతంబులిడి దేహ యష్టి విఱిచి,
యెలమి నూఁగార్చి యూఁగార్చి, యెత్తివై చెఁ
బుడమి ఘూర్ణిల్లె నావేత్రిటు వడివడంకి. 18

తే. తద్వనంబున వసియించు తాపసులకు,
వనచరులకెల్లఁ గిమ్మీరు వలనిబాధ
వాపెఁ బవనాత్మజుం; డందె పాండుసుతులు
కాపురంబుండి; రంత నాగజపురమున. 19

సీ. పాండవు లడవులఁ బడినదాదిగ నుది
నెఱిసెడి ధృతరాష్ట్రి ధరణి విభుఁడు,
కౌరవ పాండవ వైరంబుచేఁ దన
సుతుల కెగ్గగునంచుఁ ధృతిఁ గలంగి,
యిదియెల్లఁ గుఱిచ్చుచు విదురునినడుగ "నీ
కొడుకులు చెడి" రని నుడివెనతఁడు;
నుడివడి యాఱేఁడు సొలయుచుఁ బొన్నుపైఁ
బొర్లుచు నిప్పులఁ బొర్లునటుల.

తే. వెతలనొంది, సుయోధనుఁ బిలువ బంచి
"పాండవులఁ గూడి మను" మని పలువిధముల
నొద్దికగ విన్చి, గద్దించి బుద్ధిచెప్పి,
కడకు నిష్ఫలుఁడై మది మిడుకు చుండె. 20

శా. గాంగేయుండు,గురుండు, నాకృపుడునున్;గౌంతేయులెంతేనియున్
భంగింపన్ బడికోట నీసుతులకున్ బ్రాణంబు మానంబు లిం
కం గల్లల్; సమయంబు దీర్చి బలిమిన్ గౌరవ్యులన్ దూ్రించి పిఁ
కం గైకొందురు పాండురాజ సుతు లీసామ్రాజ్య సర్వస్వమున్!

క. అనుచుఁ జెవినిల్లుఁగట్టుక।
వినిచిరి; వ్యాసుండుఁగూడ వివిధంబులఁ బ
ల్కెను; దుర్యోధనుఁడు మదిన్
గొనకుండెను వారిమాట. గోరంతయు నేన్- 22

క. మునిమైత్రేయుం డొకదిన
మునఁ గురుపతిసభకు వచ్చి, పూజలుఁగొని యా
జనపతి యడుగఁగఁ, "గామ్యక
వనము వెడలి యిటకు నేఁడ. వచ్చితి" ననియెన్- 23

క. అది విని "పాండవు లచ్చట
ముదితులె? స్నేహంబు గలరె?-మునివర! సమయం
బుఁదగన్ దగులఁగ నెంతురె?
యది త్రోియరె రాజ్యకాంక్ష" ననుజనపతికిన్- 24

క. అనవరతము మునిగణముఁ
దనుపుచు దీవెనలఁ బొంది తద్దయుఁ గుశలం
బున నున్నవారు ధీమతు,
లనఘులు, కౌంతేయు, లాహవా జేయబలుల్ 25

క. సమయము వారలు దప్పుట
కమలాప్తుఁడుఁ గుముదసఖుఁడు గతులు చెడుటయుఁ
సమ మగు; నిఁక నానుడులఁ
దమకముఁ బోనాడి వినుము తద్దయు ధృతితోఁ- 26

తే. మోసమున వారిసిరిఁ గొని, దోస మనక
వారిభార్యను సభకీడ్చి వస్త్ర మొలిచి,
భంగ మొనరించి, వనులకవ్వారిఁ ద్రోలు
తనయునుద్ధృతి మాన్పన, తగదు నాక 27

క. అన, ధృతరాష్ట్రుం డాముని
కను: -నాజతనంబుసాగదయ్యా! వనటతో
మన మురియాడెడు; నిదె నా
తనయుఁడు, మతిఁగరవుఁ డనిన, తాపసుఁ డంతెఁ- 28

సీ. దుర్యోధనునిఁ గని "దుడికితి మీదుపా
వనవంశమును జెఱపఁగఁ దలంతె?
పరమధార్మికులును సురనాథవిక్రము
లాపాండవుల నోర్వ వగునె నీకు?

నాహవా జేయుండు నగుధృష్టకేతుండు
వారికి సంబంధ బంధుఁడయ్యెఁ;
త్రిభువనారాధ్యుండు దేవకీతనయుండు
శ్రీకృష్ణుఁ డవ్వారి చెలిమికాఁడు;
తే. బకహిడంబులఁ బరిమార్చె; నొకఁడ గూల్చె
వీరు కిమ్మీరు భీముండు విజయుఁ గూడి
పేఁక ననిఁ జేర వారల నీకకాదు
లోకములు మూఁడునేకమై తాఁకరాదు- 29

క. అనఁ గొనక సుయోధనుఁ డా
మునిఁ గని తనయూరుమూలముఁ జఱచి నగఁ,
గనలి యతి, "భీముగదచేఁ
దునియంబడుఁగాఁకనీదు తొడ" లని తిట్టెఁ- 30

క. మునిశాపమునకు బెదరి, చ
రణములఁ బడి యంధనృపతి ప్రార్థింపఁగ,"నీ
తనయుఁడు సమమతిఁ గనిమనఁ
జెనకదు శాపం; బితండు చెడునటుగా దేఁ- 31

క. అని దిగ్గునలేచి తనం
తన చనె సభవీడి తపసి: ధరణీధవుఁడా
జను, లెది మదిలోఁపక, కొలు
వు నపుడు సాలించి చనిరి పాగిలి వగచుచుఁ- 32

♦ కృష్ణుఁ డడవిలోనున్న పాండవులను జూడవచ్చుట. ♦

సీ. ధరణిఁ గోల్పోయి తాపసవృత్తి నైఁ
పాండవుల్ కానలఁ బడు టెఱిఁగి
సాత్రియుల ధృతరాష్ట్రకొడుకులఁ దూఱుచు
యాదవవృష్ణిభోజాంధకపతులఁ
బాంచాలవిభుఁడును, బద్మాక్షుఁడును గూడి
పయనమై కామ్యక వనముఁ జేరి,
పాండవేయుల డాసి, వారలచేత స
త్కృతిఁ గొని, వారి దుస్స్థితికి నగచి,
తే. అబ్జధ్వజశౌర్యుఁ డరుణ వర్ణాక్షుఁ డగుచు
ధార్తరాష్ట్రులఁ బరిమార్చి, ధర్మతనయు
సార్వభౌమునిఁగాఁ జేతు నుర్వికెల్ల
ననుచు, చక్రంబు చేఁబూన నరిసి, దరిసి, 33

తే. సైచు మని హస్తమునుఁ బట్టి శమనపుత్రుఁ
డట్టితఱి వచ్చు లెమ్మనె ననిల సుతుఁడు;
మేము సమయంబుఁ దీర్చిన మీఁదఁగాని
సాహసింపఁగ రా దనె, సవ్యసాచి. 34

క. అంతట ద్రౌపది కృష్ణుని
చెంతకుఁ జని, చరణయుగళి శీర్షంబిడి, య
త్యంతము హర్షాంబువుల దృ
గంతములఁ జార్చి, జలక మార్చుచువానిన్- 35

క. నాఁ డాసభ దుశ్శాసనుఁ
ఊడువ నావలువ, నేను నేడ్చుచు, నిన్నున్
వేఁడగ, దయ నా కిడి కా
పాడవె మానంబుఁ; గృష్ణ! భక్తాభరణా!- 36

క. శ్రుతు లెఱుఁగవు నిను, నిత్య
వ్రతు లెఱుఁగరు సురలు, మునులు, బ్రహ్మాభవులునీ
స్థితి నెఱుఁగరు. లోకత్రయ
నుతచరణా! పాండునుత మనోజ్ఞవిహారణా ” 37

క. అని పదములఁ బడినవనరఁగ,
వనజాక్షుఁడు “లెమ్మ చెల్లి! పగతులపత్నుల్
గని వైధవ్యము నేడ్వం
గను గని నవ్వంగ నీకు కాలము వచ్చున్. 38

క. ముడిఁగట్టుము వ్రేలెడు నెఱిఁ;
దుడుపుము కన్నీరు మేని ధూళిని; నింకన్
విడుము వగపుఁ, గౌరవ్యులు
చెడిరి చెడిరి, చెడిరి నిన్ను జెనకుట సాధ్వీ! 39

మ. అన, నాటోపముతోడఁగృష్ణ విను,మ ట్లానాడునాయీకురుల్
గొని యేదుర్మదుఁ డీడ్చె, వానియురమున్ గోరాడి, తద్రక్తమం
దున నావేణిని నద్ది వాయుజుఁడు, సంతోషంబునన్ జేతితో
గొనుచున్ గూర్చెడుదాఁకఁ గట్ట ముడినే,గోవింద! వింటేయన్—40

ప॥ 38 పా॥ 1 అ॥ 1- అ; పా॥ 4 అ॥ 11- ఁగా;
ప॥ 40 పా॥ 1 అ॥ 15- నాఁ; పా॥ 4 అ॥ 13- ది; అ॥ 23- యనన్:

మ. అని శ్రీకృష్ణుఁడు సేదదీర్చెఁ; వినుఁ! నీయార్తిన్ దగన్ దీర్తు, నం
చని ద్రౌపదికిన్ గద భీముఁ డుగ్గ్రితి; నరుం “ డబ్జాక్షి! నేనుంటి నీ
వనజాక్షుం డిడె మాటఁ బూఁటపడె; నీభాగ్యంబు శాంతింప్రమా ”
యని యోదార్చి తేర్చెఁ; ధర్మసుతుఁ ‘డౌనౌ’ నంచు నూరార్చెన్.

క. అందలిజను లిది చోద్యము (46
నంది కనిరి; వేళయఁగుట నంపఁబు స్నానం
బుం దీర్చి సరస పాకము
లంది కుడిచి, కూరుచుండి రానందమునన్. 47

గీ. ఒండు రెండు దివసములందుండి పురికిఁ
బోయెఁ బాంచాలుఁ డుపపాండవులను గొనుచు:
వృష్ణి యాదవులను గూడి వెడలెను బల
భద్రుఁడు సుభద్రతోడ, సౌభద్రుతోడ. 48

క. ఉరవుగఁ గొన్ని దినంబులు
నరు సంగతి నుండి, పాండునందనులను సా
దరమున వీడ్కొని యొకనాఁ
డరిగెను ద్వారకకు హరి రథారూఢుండై. 49

తే. పాండవేయులు కామ్యక వనము వదలి
యింద్రసేన పరిభృతులును బ్రాహ్మణులు
తర లిరాఁగ రథాయుధ తతులఁ బూని
వెడలి చని ద్వైతవనమున విడిసి రంత— 50

క మునిమార్కండేయుం డొక
దినమట కరుదెంచి, సత్కృతిఁ బడసి, మదిన్
వనవాసక్లేశంబున
దనికెడు ధర్మజునిగాంచి తద్దయుఁ బ్రీతిన్- 51

చ. "జనకుని మాటకై పృథివి సంపదవీడి, సతీసహోదరుల్
వెనుదవులంగఁ దాపసుల వేషములన్ జని, కందమూలముల్
దినుచును గాననున్న కులదీపకు శ్రీరఘురాముఁ గంటిమున్,
నిను ఘను సత్యధర్మపరునిన్ బుధసన్నుతుఁ గంటినేఁ డిటన్. 52

ఆ. చెలఁగి సగర భరత నల వైన్య ముఖ్యులు
నిత్యసత్యధర్మ నియతిఁ జేసి
పుణ్యలోకములను బొందిరి, యిహసౌఖ్య
ములకు మనసు మరఁగి మోసపోక. 53

శా. పాపుల్ ద్రోహులు ధార్తరాష్ట్రులనయ వ్యాపారపారీణులై
చేపట్టంగల రొక్క ధర్మమును, సచ్ఛీలాన్వితుల్ మీర, లా
గోపాలుండు విశిష్టరక్షకుఁడు మీకుంగూర్చి శ్రేయమ్ము, మా
యోపాయజ్ఞుల రూపుమాపగలఁ డోహో! చింతమీ కేటికిన్" 54

క. అని పల్కి తద్ద ప్రొద్దును
విన ధర్మపథక్రమంబు వినిపించి మహా
ముని వారి నంత వీడ్కొని
పనె సంధ్యోపాసనంబు సలుప నియతిమై. 55

క. బకదాల్భ్యుం డను మునివరుఁ
డోకదిన పుట కరుగుదెంచి, యోగిధర్మజుచే
సకలోపచారములఁ గొని
సకలాగమ విధుల విసిచి సనెఁ గురుముఖ్యా! 56

♦ ద్రౌపదీ ధర్మరాజుల సంవాదము ♦

క. వనవాసాయాసముచే
వసటంబడి యొక్కనాఁడు పాంచాలి, కనుం
గొని యమతనయునితో ని
ట్లను శ్రీమమునంటిదీను లవనిఁ గలరే? 57

సీ. సకలావనీశులు సన్నుతింపఁగ భూరి
తేజులై వెలసిన రాజమణుల,
అమరేశ్వరుండేని యనుభవింపఁగరాని
భోగభాగ్యములున్న పుణ్యవరుల,
నరసురాసురులకైనను నని మొనలోనఁ
దేరిజూడఁగరాని వీరవరుల,
దేవాంశభవుల, సుధీమంతులను, రూప
విజిత కంతులఁ, బాండు విభుతనయులఁ,

తే. గాన మృగములుగాఁ జేసి, గాసివాస
ములకు గతిలేని పరమదీనుల నొనర్చి,
తేజము డివోవ, వగవ విధించె నొక!
యెట్టులు గనికన్ని సైతు నీకుటిలవిధిని:- 58

క. నీయాజ్ఞాపాశంబునఁ
జేయార్పఁగ రాకయునికిఁ జేష్టుడిరిగదా
నీయనుజులు! కాదేని మన
దాయలుమనువారె యిట్లు దర్పోద్ధతులై?- 59

క, తనయుని కృతి కోడఁబడి యం
ధనృపతి మిమ్ములను గానఁ దఱిమెను! నీవో
కనలవు శత్రుల; ధాత్రిం
బున కనునదె శాంతపథము భూపవరేణ్యా?- 60

క. కాలంబు నరసి, తగినటు
లోలి క్షమాతేజములను నొంది చరింపన్
మేలగుఁగా, కిటు నీవలెఁ
"దాలిమి తాలిమి" యనంగఁ దగునె నృపాలా?- 61

సీ. నిత్యశాంతునిఁ జూచి భృత్యులు భయపడ
రవమాన మొనరింతు రధమజనులు;
వైరులు పైఁబడవత్తురు, చోరులు
నపహరింతురువాని యర్థమెల్ల;
నిత్యతేజోధికునిన్ గన గృహాగత
సర్పమున్ గనినట్లు సర్వజనులు-
భయపడుదురు మది భద్రమొందక, కాన
నిత్యతేజముఁ జూప నెఱియ కాదు;

ఆ. దేశకాలగతుల( దేట తెల్లంబుగా
ధర్మబుద్ధినరసి, ధాత్రివరు(డు
లోకభద్ర మెంచి, వీ(క తేజఃప్రమా
గతుల( బూని నడవ హిత” మనంగ:- 62

క. “అక్కట! యేటివివాదము
నిక్కంబో? నన్ను దూఱు నెపమో? తెలియ(గ
నెక్కటి ధర్మ్మవునకు సమ
మొక్కటి కనరాదునాకు నుడురాజముఖీ- 63

ఉ. ఆరవిచంద్రు, లాయనలు(, డాపవమాన వసుంధరా భ్రముల్;
నీరధులేడు పర్వత వనీప్రకరంబులు, నాదిశావళుల్
మేరలు మీఱకుండునటు మెల్గ(గ సత్యము ధర్మమే కదా
కారణ; మాట నాకునవి కానలె వీడ(గరాని సద్విధుల్. 64

తే. సత్యమును విద్యయును యజ్ఞ శౌచములును
సకల శ్రుతులును ధర్మము సర్వజగము
దేనియాధారమున(జేసి తేజరిల్లు
నట్టిక్షమ నాకురక్ష ఫుల్లాబ్జనయన! 65

తే. జపతపంబుల, వ్రతముల, జన్నములను,
జ్ఞానమున( బొందు సద్గతుల్ క్షమను బొంద
నౌనగుట(గాదె, వ్యాసాది మానివరులు
సాధులును మెచ్చి పొగడిరి నాదుతాల్మి.- 76

క. అన, విని ద్రౌపదియను "స్త్రీ
యనినది నిక్కంబ కాని, యవినీతులచేఁ
గని నిక్కృతిఁ బ్రతియొనర్పక
మనికియుఁగడు మాన్యమగునె మనుజాధీశా?" 67

క. అన, శమనజుఁడను "ధర్మం
బను దూఱఁగఁ దగదు, ఫలము పూర్వార్జితముం
బెనఁ గొని యుండును; తఱిఁగనుఁ
గొని వర్తింపంగ నరుఁడు గూడు శుభంబుల్- 68

తే. పురుష యత్నంబె ఫలమీయఁ బోవఁ డెందు
దైవ, నరయత్న సిద్ధంబు దలఁప కర్మ
ఫలమిది ; పురుషకారంబు వలన, దైవ
బలమునంజేసి ఫలమగు జలజనయన!- 69

తే. తైలము తిలల నుండుట తథ్యమైన,
యత్నమునఁగాక యది పడయంగనౌనె!
చక్కఁగా దున్ని విత్తులఁ జల్లియున్న,
పడు నదనునను గాకున్న ఫలమునున్న- 70

తే. పురుషకారంబు, దైవంబుఁ బరఁగు నిట్టు
లొండొకటి చూపె! దైవపరుండు తలఁప,
వారిధిని యానపాత్రంబువలెఁ జెలంగి,
యత్నమొనరించి, ఫలసిద్ధి నంది నెగడు. 71

క. మానసమయము గడపక, యిటు
లానపడుట లగ్గె? యోపి, యుదికడమున్
జేసి, హరి దేవుఁ దోడ్కొని
వాసిగఁ గొనఁదగును మాదు పాలున్ గీలున్:-

సీ. విను మదియునుగాక, విక్రమోపేతులు
దుర్యోధనాదులు దుష్టమతులు;
భార్గవ రాముని భంగించినట్టియా
భీష్ముఁడాదిక్కున వెలయువాఁడు;
మాకుమాత్రమె కాదు, మహిధనుష్మల్లోక
గురుఁడు ద్రోణుండటఁ గుదిరినాఁడు;
గురుపుత్త్రుఁడును గృపుండురుబలాఢ్యులు చూవె!
రాధాసుతుండు విక్రమధనుండు;

తే. సౌబలుఁడు, మద్రవిభుఁడును సమరవీరు
లగుదు; రని మొనఁ దగులుదు, రగుట మనకు
పౌరుషకారంబుకంటెను బ్రౌర్ఢమైన
దైవబల మొంద నగు ప్రయత్నంబు తగును:

ధర్మరాజు కృష్ణద్వైపాయనునిచేఁ బ్రతిస్మృతియను
మంత్రమును బడసి పార్థునకుపదేశించుట.

క. అనఁగన్; గృష్ణద్వైపా
యనుఁ డంతన నందుఁదోఁచి, "యగు నీపలుకుల్
గొను మీవరమంత్ర" మని చె
విని యమతనయునకు వినిచి, పిదప వచించెన్-

తే. "ఇది ప్రతిస్మృతి యనువిద్య యింద్రజునకు
నిమ్ము దీనినిఁ; దచ్ఛక్తి నిమ్మ నడఁగ
నమర నరు, భూతినాథుఁ బ్రత్యక్షుముగను
జేసికొని పొందు దివ్యాస్త్రసిద్ధు లెలమి. 75

తే. ఇష్టఫలసిద్ధి నొసఁగునీకిదినిజంబ"
యనుచు మౌని తిరోధానుఁ డయ్యెఁ; బిదప
వార లాద్వైతవనమును వదలి, తరలి,
కడకఁ గామ్యకవనమున విడిసిరంత.— 76

తే. అర్జునునకుఁ బ్రతిస్మృతి యనెడువిద్య
నప్పు డుపదేశ మొనరించె యమసుతుండు,
తన్మహిమ నొప్పె భానుశతప్రభాప్ర
చండ తేజోధికుండయి సవ్యసాచి. 77

క. నరుఁ డంతట ధర్మజుపద
సరసీరుహములకు మ్రొక్క; సాదరమతియై
పరమాశీస్సుల నిడి, సురు
చిరదృక్కుల నెరపి యతఁడు చెప్పందొడఁగెన్. 78

క. "మెయి మఱువుఁ దొడఁగి; యుర్వుగఁ
గయికొని విశిఖములు, విల్లు, ఖడ్గ; మరులచే
భయ మొదవనట్లు, నిజముగు, వి
జయుఁడ వగుచు నింద్రకీల శైలముఁ జొరుమా! 79

త, అతినియమవ్రతివై యతు
లతపం బొనరింపు ధృతిఁ దొలంగకు. మట వి
ష్ణుతతినిను తొడరి నను బశు
పతి వరములనిచ్చువరకు పట్టైసయుకుమా! 80

క. మదిచెదరకు మప్సరలకు,
బెదరకు సురపతియయోని బెదరించిన; నీ
యదను విడకు, మరిమట్కాం
బుఁ దగులకు భవుఁడు నీకు బొడసడు తనుకఁ. 81

క. సురసిద్ధముఖ్యదివిజులు,
ధరణి యు, దివి దిశలు. రవి, సుధానిధి. నీళుల్
మరుదగ్నులు కరుణించుత!
హరుఁ డొసఁగుత నీదుకోర్కె" లని దీవించెఁ. 82

తే. అతివ పాంచాలి మంగళాక్షతలు నొసటఁ
దిలకముగఁ దీర్చి, నేత్రసందీప్తి లెసక
మెసఁగఁ జేసి నివాళించి, హసితశశిన
రాననప్రసన్న వీక్షణ యగుచుఁ బలికె. 83

క. "తలఁపకుము దేహసౌఖ్యముఁ
దలఁపుము మత్పరిభవమును; దాయవిభవముఁ;
సలుపుము నీయగ్రజునుడి,
నిలతలక్రిందైనఁ బాయు కీర్త్యరనిష్ఠఁ. 84

---

ప॥ 80 పా॥ 4 అ॥ 10- అ; ప॥ 81 పా॥ 4 అ॥ 5- కుముఖపు;
ప॥ 82 పా॥ 2 అ॥ 13. ధా;

క. సురపతియే కా, డాపుర
హరుఁడే ని న్నెఱుఁగనేని యనిఁ బోరుము లో
నరు దొంది మెచ్చి వా రిడు
వరములతోఁ గాక కరిమవలసదూ సుమ్మీ. 85

క. అరికృతదుష్పరిభవ మను
శరనిధి దాఁటంగ తేఁప సముఁడవగుచు బల్
కరుణా మముఁగను; మొదట కీ
భరమోర్వఁగ రా'' దటంచుఁ జనముల వ్రాలెన్. 86

ఆ. ఎత్తి లేవఁదీసి, కృష్ణుఁడు నరుఁడును,
"అగ్రజన్ము లీవు. ననుజవరులు
నేన తగదు నంచు నియమింపఁ, బనిదీర్ప
కట్టెరాఁగ నెడఁగు నట్టె నేను? 87

క. శిరమున మదగ్రజు స్థిర
తరమగు మహదాజ్ఞయుండెఁ, దలఁగక మదినీ
పరిభవజన్యకటాక్షు
స్ఫురితశరాఘాత ముండె స్ఫుటముగఁ దరుణీ! 88

క. మఱి విను! ధర్మసుతుని పర
తర శుభదాశిషము లుండె; తదఁ గలిగె శ్రీ
హరికరుణ; నాకు వరముల
వరదుఁడు హరుఁ డిడఁడె, భక్తవత్సలుఁ డగదే! 69

ప॥ 86 పా॥ 3 అ॥ 6- ఁగ; పా॥ 4 అ॥ 5- ఁగ: ప॥ 87 పా॥ 1 అ॥ 12-
ప॥ 88 పా॥ 1 అ॥ 9- నిస్థిర; ప॥ 89 పా॥ 2 అ॥ 12- ఁదఁద్ర;

* అర్జునుఁడు శివునిగూర్చి తపమాచరించుటకై
ఇంద్రకీల పర్వతమునకు బోవుట. *

తే. అని; ప్రణుతిఁ జేసి మునుల దీవనలఁ బొంది;
మ్రొక్కి ధర్మజ వాయుపుత్రులకుఁ; బ్రీతిఁ
గవుఁగిటను గ్రుచ్చి నకులిడుకనల; నవల
కృష్ణయానతిఁ గైకొని యింద్రసుతుఁడు, 90

ఉ. దివ్యకిరీటవర్మములు దీప్తిల వాళిని మేన; మూఁపునన్
భవ్యమహోగ్రగాండివము భాసిల; చేతఁ గృపాణ మొప్పఁగా
నవ్యయబాణతూణ మురి యూడఁగ వీపున; నగ్రజాజ్ఞ సం
భావ్యమతిన్ గిరీటి చనె భర్గునిగూర్చి తపం బొనర్పఁగాన్. 91

మ. నరుఁడారీతిగ నింద్రకీలగిరిపైనన్ జేరఁగా నెంచి, యు
త్తరప్రాగ్దిఙ్ముఖుఁ డౌచుఁ బోయి, కడకే తత్ శైలముం జూచి పై
కరుగన్ బోవఁగ, నభ్రవాణి "తగదయ్యా! బాణతూణీర బం
ధురు లీశైలము నెక్కరాదు, మునిసందోహంబు లందుండుటన్. 92

క. ఇది వీతమోహఖేదా
స్పదు లగు తాపసుల తావు! చనదు తిరుగ నీ
పదమున బాణకృపాణము
లఁ దాలిచి" యనఁగ, మదిఁ గలంగక నరుఁడున్, 93

ఉ. "శాంతుఁడు దాంతుఁడున్ విమలసత్యవచస్కుఁడు, ధర్మమూర్తి యా
నంతకసూనునాజ్ఞను శరాసన బాణకృపాణధారి నే
కుంతిసుతుండ, నర్జునుఁడ, [illegible]
చెంత నొనర్తు నింద్రుఁడె విజృంభణ నొడ్డిన మాన నేర్తునే! [illegible]

పు॥ 90 పా॥ 4 అ॥ 1- గృ; పు॥ 91 పా॥ 2 అ॥ 14- జే; అ॥ 21- గా;
పు॥ 92 పా॥ 1 అ॥ 1- నరుఁడా; పు॥ 94 పా॥ 3 అ॥ 1- గు;

క. వడి బెదరక, ధృతి చెదరక,
కొదుకక గాండీవము చేతఁ గొని పల్కుచుఁ దాఁ
బదపడి చనఁ; గని సురవిభుఁ
డెద మెచ్చుచుఁ బొల్చి కంటిమెదురుటన్ గనుటన్- 95

క. "మెచ్చితి నీధైర్యమునకు,
నిచ్చెద దివ్యాస్త్రవితతి, నీశ్వరుదయఁ గై
పెచ్చుగఁ బాశుపతాస్త్రముఁ
దెచ్చుకొనుము కోఱికె లెల్లఁ దీఱుఁ గుమారా! 96

క. ఘనముగ నీకు శుభము లగు,
ననయులు ధృతరాష్ట్రతనయు లనిఁ దెగుదురు; దీ
వనములు వరములు నివె! యిఁకఁ
జనుమీ గిరిపైనఁ దపముసలుపు" మనంగన్. 97

ఉ. "ధన్యుఁడ" నంచు నింద్రునిపదంబులకుం బ్రణమిల్లి, లోకస
న్మాన్యుఁడు కవ్వి కొండపయినన్ ఫలవృత్తి నసరితపస్సనూనసా
జన్యము నొప్పుదేశమున సాక్షి, నియంతను సర్వదేవమూ
ర్ధన్యు నుమేశుఁ గూర్చి దృఢతన్ దపముండెఁ దదేకనిష్ఠుఁడై. 98

◆ అర్జునునితపస్సు; కిరాతార్జునీయము. ◆

ఆ. ఆదిఁ గొన్నినాళ్లు లానిఫలంబులఁ,
గొన్నినాళ్లు నీరుఁ గ్రోలి, పిదపఁ
గొన్నినాళ్లు గాలిఁ గొని, పదంపడి మెల్ల
మాని, యేకనిష్ఠ నూని, కడకు- 99

ప॥ 96 పా॥ 4 అ॥ 7- ఱఁ; ప॥ 97 పా॥ 2 అ॥ 14- ఁదె;
ప॥ 98 పా॥ 1 అ॥ 3- ఁడ; పా॥ 4 అ॥ 1- ర్ధ;

తే. పులుఁగుటీకతురాయి యా దలను గులుక;
తీఁగకడియమ్ము ముంజేతి. తెగువఁ దెలుప;
మొలను బులితోలుసాలువ చెలఁగఁ; గరము
మెరయ వరిగడ్డిగండపెం డరము. పదము.- 102

తే. పాశుపత శూలములు. విల్లు బల్లెములుగ;
బసవుఁ డాదిగఁగల యెల్ల ప్రమథగణము
మొఱకు టెఱుకులుఁగాఁ; దాని యెఱుక దొరగ;
గిరిజ కా నెఱుకసానిగ హరుఁడు తరలె!- 104

క. చిక్కములు, వలలు, నీటెలు,
చిక్కని గొడ్డెండ్లు, విండ్లు చేకొనిఁ పఱవన్
గుక్కలు; భూతవ్యాధులు
గ్రిక్కిఱియఁగ నడచె నింద్రకీలగిరిదరిన్;- 105

క. అక్కడి మృగములు. ఖగములు,
చిక్కి, గుహల పొదలనక్కెఁ; జీకుల నులియం
దక్కినకుంటుల, మూఁగల
ఫక్కిని పసిఁ బట్టివీఁక వ్యాధులరాకన్- 106

క. అట నున్న మూకదైత్యుఁడు
నిటలాక్షుప్రేరణమున నిజమగు కిటమై
పటుగతి "గుఱు" వెట్టుచు ది
క్తటములదర నింద్ర సుతునిఁ దాఁకన్ రాఁకన్. 107

శా. పాదాంగుష్ఠమునన్నాదిని ల్చి, ముఖముర్ భైకెత్తి బాహుద్వయిన్
మీఁదై నిక్కఁగ నిల్పియిందిృయతతిన్ మిట్టార్చి, బుద్ధిన్ హృదిన్-
బాదై నిల్పఁగఁగూర్చి, కుండలిని లేవన్ జేసి, ప్రాణంబుని-
ర్బాధన్ జకృములాఁటన్ జని సహస్రారంబు సంధింపగన్.- 100

క. సర్వాత్ము భవుని, ధ్యానసు
నిర్వహణాయత్త చిత్త నియమ వృతుఁడై,
దుర్వారతప మొనర్చె. సు
పర్వులుఁ దాపసు, లసురులు, భయమున వడఁకన్ 101

క. ఘోరతపోజ్వాలలసెగ
లోరువఁగాలేక మౌను లోఁగిఁజని తెలుపన్
మారహరుఁడంత నది, మది
నారసి, నగి, పంపె వారి కభయుం బిడుచున్.- 102

సీ. గంగను జందృనిఁ గలగలపుగఁ గూర్చి.
మెఱుఁగుగాఁ గట్టి ముం, గురుల ముడిని
బేసికంటిని బిగ్గమూసి కన్పడకుండఁ
జిగసొల్లుగా బూది, తీర్చి నొసట;
గళ వాసుకినిఁ దీసి కాసెకు గోసెకుఁ
తెగువ నెన్నడుమున బిగియఁదిగిచి;
గుదివెందపూసల సరుల గుది నమర్చి
గొంతుకవన్నె నొకింత, గుట్టువఱచి;

శా. పాదాంగుష్ఠము నూదినిల్చి, ముఖమున్ బైకెత్తి బాహుద్వయిన్
మీఁదై నిక్కఁగ నిల్పి, యింద్రియతతిన్ మిట్టార్చి, బుద్ధిన్ హృదిన్-
బాదై నిల్వఁగఁగూర్చి, కుండలిని లేవన్ జేసి, ప్రాణంబుని-
ర్బాధన్ జక్రములాఱిటన్ జని సహస్రారంబు సంధింపఁగన్.- 100

క. సర్వాత్ము భవుని, ధ్యానసు
నిర్వాహణాయత్త చిత్త నియమ ప్రితుఁడై,
దుర్వారతప మొనర్చె, సు
పర్వులుఁ దాపను, లసురులు, భయమున వడఁకన్- 101

క. ఘోరతపోజ్వాలలసెగ
లోరువఁగాలేక మౌను లోఁగిఁజని దెలుపన్
మారహరుఁ డంత నది, మది
నారసి, నగి, పంపె వారి. కభయం బిడుచున్.- 102

సీ. గంగను జంద్రునిఁ గలగలపుగఁ గూర్చి.
మఱుఁగుగాఁ గట్టె ముం, గురుల ముడిని
బేసికంటిని బిగ్గమూసి కన్పడకుండ
తిగసాళ్లుగా బూది, తీర్చి నొసట;
గళవాసుకినిఁ దీసి కాసెకు గోసెకు
తెగువ నెన్నడుమున బిగియఁదిగిచి;
గురివెందపూసల. సరుల గుది నమర్చి
గొంతుకప్పా నొకింత, గు[illegible]

ఉ. అవ్విధి కర్ణభేద మయినంతన వేల్పొకని కన్నువిచ్చి, యా
దవ్వున వచ్చుపందిఁ గని తాఁ గొని గాండివమున్, గుణధ్వనిన్
నివ్వటిలంగఁ జేసి, గుణినిక్క శరంబును గూర్చి పేర్చి, యా
కవ్వడి నిల్వఁ, గాంచి కిటి గ్రక్కున భగ్నుని జేరఁ బాఱెనన్. 108

శా. ఓహో! వేయకు వేయ కంచు గిరిశుం దుద్వృత్తిమై చీరుచున్
బాహాస్కంధమ్ముఁ జూపి యాఁచినను, సంభావింప కాపల్కు క్రో
ధాహంకారతఁ బుచ్చె నమ్ము నరుఁ; డంతన్ వీఁడె బాణంబును
త్సాహంబొప్ప హరుండు; నవ్వి యొకటన్ దాఁకెన్ గిటిన్ దీవ్రతన్ [109

క. పటుగతి నరు, హరుశరములు
కిటి కిరుదెస లంటఁ, దిరిగె గిట్టున నది ది
క్కటము లదర; మథనం బ
ప్పటి శివనిధి మంధరపు జవరివార్ధిబురున్ 110

తే. ఆవరాహ వేషుఁ డగుమూక దైత్యుండు,
బాణయుగళవిద్ధవపువుఁ దొఱఁగి,
యసురరూప మూని, యతఁడు యుద్ధభ్రష్టుం డయ్యె;
పఱచివచ్చి రట్టకు నరుఁడు, హరుఁడు. 111

క. ఇరువురు నుఱుముచుఁ, "గిటి నా
శరమున నాశరముపలనఁ జచ్చె" నటంచున్,
సరిసరి వాదాడిరి; వా
ద రభస [redacted] ంపడివ్వాహా. 112

ప॥ 108 పా॥ 2 అ॥ 2- వ్వు; ప॥ 110 పా॥ 4 అ॥ 18- అ;
ప॥ 111 పా॥ 4 అ॥ 1- (బ;

క. గుఱిగాని పఱి మఱి మెయి మెయి
శరవృష్టిని దద్దగురిసి, సడలక కడఁకన్
బరుసడిగ [illegible]బడి
వరమునకుం డిగిరి జగము భయమున వడఁకన్ 113

శా. బాహుద్వంద్వము నప్పళించుచు, గడున్ బౌరుష్య రోషంపుటు
త్సాహోద్వేగములోడ, నొండొరుల మేన్ దాకించి నూకాడుచున్
బాహాబాహి, కచాకచిన్ బెనగుచున్ బట్టూడి దట్టించి సిం
హాహంకారత హుంకృతుల్ నెఱపిర భ్యామర్దమందిర్వురున్. 114

తే, ద్వంద్వయుద్ధంబులోఁ జాలదనిసి నరుఁడు
దారుణాశుగవర్షంబుఁ దద్దఁ గుఱిసెఁ;
బరమ శివుఁ డంబువృష్టిని బర్వతంబు
వలె గ్రహించుచు మఱి పేర్చెఁ బార్థుఁడలయ. 115

మ. నరుఁ డాయతక్షతగాత్రు నాయసమసంగ్రామోద్ధతున్ శంకరున్,
బరఁగన్ గాంచి "యయారె దేవవిభుఁడో, వాణీశుఁడో యీశుఁడో-
మఱి యీవ్యాధుఁడె నన్ను నోర్చియిటు నామైఁగాఁడి తూటాడఁగాన్
బఱపెన్ బాణము" లంచుఁగించువడి, రూపం బొందుకోపంబు నాన్

తే, ప్రళయ మార్తాండ మూర్తియై వెలిఁగి, చెలఁగి, 116
ఘోరదుర్వార బాణాగ్నిఁ గురిసి, పిదప
నాతఁ డక్షయశరనిధి యందునొక్క-
శరము నేనియుఁ గనక, దుర్భరవుఁ గినుక- 116

ప॥ 113 పా॥ 3 అ॥ 7- డి; ప॥ 114 పా॥ 2 అ॥ 15- దాఁ;
ప॥ 114 పా॥ 3 అ॥ 5- ఁగ; అ॥ 10- బెనఁగు; ప॥ 116 పా॥ 1 అ॥ 22- క

క. రెండుకరంబులఁ బూనుచు
గాండీవము నెత్తి, నీలగళుమూర్ధము ను
ద్దండతఁ గొట్టఁగ, హరుచే
గాండీవ మపహృతముఁ గాఁగఁ గత్తిని మొత్తెన్,

-: పార్థుఁడు పాశుపతాస్త్రమున్ బడయుట :-

క. అది పని సేయక యున్నన్,
బాదవి హరున్ బట్టి చుట్టి ముష్టులఁ బెట్టెన్;
విధుమౌళి యట్టె కౌఁగిట
నదుమ, వివశుఁడగుచుఁ బార్థుఁ డవనిన్ వ్రాలెన్- 119

ఉ. అంత హరుండు పార్థునినితాంత పరాక్రమ ధైర్యవృత్తిక-
త్యంతము మెచ్చి, యర్జునున కప్పుడెతోఁచెను నౌళిచంద్రుతో,
గొంతువిసంబుతో, నెసఁగు కుండలిహారముతో, గజాజి నా
క్రాంతకటి ప్రదేశపృథు కాయముతోఁ, దిగవాలు కేలుతో- 120

సీ. అర్జునుఁ డద్దేవు నాశ్చర్యమునఁ గనఁ,
ద్ర్యంబకుం డాడు "నీ ధైర్యశౌర్య,
విహితతపశ్శాస్త్ర మహిమంబులకుఁ గడు
మెచ్చితి, నీ కోర్కు లిచ్చువాఁడ.-
మానిత సురదైత్య మానుషంబైన యీ
విశ్వంబు నీ చేత విజిత మగును;
చనిన పుట్టున నీవు శౌరియు నరుఁడు నా
రాయణుఁడనువార లేయఁబలులు;

తే. మూఁడుజగములు మీచేత నాఁడనేఁడు
రక్షితమ్ములు సిద్ధమ్ము; రాక్షసులను
మునుపు నీ గాండివముచేతఁ దునిమి, కడిమి
చేసినాఁడవు శక్రాభిషేక మీవు.- 121

క. కను మిదె నానిజ రూపం,
బని యొసఁగఁగ దివ్యదృష్టి, నర్జునుఁడు హరుఁ
గని, ధన్యుఁడ నని, యాదే
వునిపదముల వ్రాలి మేను పొంగ నుతించెన్ 122

శా. పాతాళంబు పదంబుగా, దివ మెయొప్పన్ మౌళిగా, నష్టది-
గ్వ్రాతం బాననసీమగా, రవిశశుల్ కందోయిగా, నీక్కులే
శ్రీతత్యాగమధర్మమూలములుగా, సృష్టిస్థితిధ్వంసనల్-
చేతల్ గాఁగల, దేవుఁ, గాంచితిని నా చిత్తంబు పొంగారఁగన్.-

సీ. శ్రీగిరిజామనః ప్రియ! సురగణసేవ్య!
ఆగమగేయ! తుభ్యంనమోస్తు;
భక్తాభయప్రద! భవవిమోచన! సదా
యతినుతపాద! తుభ్యంనమోస్తు,
పావన! పన్నగా భరణ! పంచానన!
ఫాలాగ్నినయన! తుభ్యంనమోస్తు,
గంగా జటాజూట! గళకాలకూట! శ్రీ
వరనంది కేతు! తుభ్యంనమోస్తు,

ప॥ 121 పా॥ 1 అ॥ 10- నాడ; పా॥ 3 అ॥ 11- త; పా॥ 4 అ॥ 1- ఁజే;
ప॥ 123 పా॥ 3 అ॥ 20- ముల్; పా॥ 4 అ॥ 1- చేఁతల్;

తే. అఖిలవేదవినోద! తుభ్యం నమోస్తు,
పరతరాపరానంద! తుభ్యంనమోస్తు
పరమ పురుష! పరేశ! తుభ్యంనమోస్తు,
భర్గ! పాపవిసర్గ! తుభ్యంనమోస్తు;- 124

క. అరయఁ బడక దేహేంద్రియ
కరణంబులనెల్ల మూల కరణంబై లో
స్ఫురణీయుఁడవై వెలిఁగెడు
పరమాత్ముని వరదుఁ గంటిఁ బ్రత్యక్షముగన్.- 125

క. నిరతవ్రత జపతపముల
నురునిష్ఠల మౌను లెఱుఁగ నోపనిపరమున్
బరతరు వరభక్తవశం
కరు. హరుఁ, బుర హరునిఁ గంటిఁ గామ్యప్రదునిన్- 126

తే. విశ్వలీనుఁ డగుచు వెలిఁగించి, వెలినిల్చి
విశ్వమెల్లఁ ద్రెంచి, వెలుఁగు మించి.
సాక్షిభూతుఁ డగుచు సర్వంబుఁ దిలకించు
నభవుఁ గంటి! నిత్య విభవు గంటి!- 127

క. ద్వైతాద్వైత విశిష్టా
ద్వైతంబులఁ గొలువరాక, వాఙ్మనసులతో
నాతీరుఁ దెలియరాకయ,
యేతత్తత్త్వాత్ముఁడైన యీశ్వరుఁ గంటిన్,-

క. అని యిటు నుతియించుచు, నిర్
గసనేంద్ర కయ్యమునకుఁ గాల్ద్రొవ్వితిఁ బో;
సను నైపు. పల్పమతి నేఁ
గనుము నెవరమానులేని కానని నిన్నున్"?- 129

క. అసమాక్షుం డప్పుడు కృపా
రసము లొలుకఁగఁ జూచి నీ పరాక్రమము కరం
బసదృశము గొమ్ము గాండివ
మొసఁగితి నక్షయ శరనిధినుత్సుకమారన్ నన్ -. 130

చ. అని "మఱి తెల్పు నీమదిఁ బ్రియం బెది? సర్వజగజ్జిగీషయో?
ధనదుని తాంతసన్నవని ధానవిభుత్వమొ? ఖేచరత్వమో?
తనదమరత్వమో? యనిలు గాఢజవత్వమొ? యగ్నిసత్వమో?
యనఘ చిరాయురత్వమొ? యనన్యసురేంద్రపదాధిపత్వమో?

క. ఇటు లడుగ, నర్జునుం డను;- 131
నిటలాక్ష! యి వేల? మమ్ము నెఱిఁ గెఱచిన, దు-
ష్కుటిలు రగుదాయలను గెలు
చుటె యగ్రజునాజ్ఞ; నీకుఁ జొప్పడు నేనిన్ :- 132

8 తే. ప్రళయవేళ నీవు పఱపంగఁ జని, జగ
జ్జాలములను బూఁదిసలుపునట్టి,
పరమ మైనయట్టి పాశుపతాస్త్రమ్ము,
నజశిరశ్శరమ్ము నభవ! యిమ్ము!- 133

సీ. అని వేడఁ గడుహర్షమున శివుఁడిట్లను
మహితాస్త్రములఁ గోరి మాన్యుఁడైతి,
వెల్లజగంబులు నేకమై తాఁకిన
గెలువవచ్చును వీని బలమువలన,
నని సమంత్రికముగా నస్త్రద్వయంబును
సంధానమోక్షణ సహితముగను,
సాదరమతిని బ్రసాదించి, యల్పుల
పైఁబ్రయోగింపకు ప్రళయ మగును

తే. సత్యమనిచెప్పి, యీగుట్టు జగమెఱుంగ
దనుచు వినిపించి, యీశ్వరుఁ డమరనాథ
సుతుని దీవించి, యతఁ డెడునతులఁ నంది,
తోడ నంతర్హితుం డయ్యెఁ జూడజూడ.— 134

—:విజయునకు దేవవిభుని సన్మానము; ఊర్వశీ శాపము:—

క. నరుఁ డంతటఁ దనమదిని "నిది
మరులో, కలఁగన్నసిరియొ? మతివిభ్రమమో?
హరు నీ చర్మాక్షులతోఁ
బరికించితి నాదు సుకృతభాగ్యం బేమో?— 135

క. అనిభావించుచు, విస్మయ
తనుఁడై యుండంగ, నభ్రతలిని విసూత్న
స్యనమొండు చెలఁగ, నాదెసఁ
గను లెక్కిడి చూచు చుండఁగాఁ, జిత్రముగాఁ:— 136

క. మణిరథ మొక్కటి జివ్వున
దనముందట వ్రాలె; గన్యాతముఁ డొక్కరుఁ డం
దున వెలువడి, నడి వందన
మొనరించి కిరీటిఁ గాంచి యొయ్యనబలి కెన్.— 137

శా. ముల్లోకంబుల నేలురాజు, శివసంపూర్ణప్రసాదైక సం
పల్లభ్యాశుగు, నిన్ సుతున్, గరుణ సంభావింపఁ గాంక్షించి నేఁ
డెల్లిన్ దోడ్కొనిరా, ననుజ్ఞ నిడ నే నేతెంచితిన్ మాతలిన్;
జెల్లెన్ భాగ్యము; రమ్ము లెమ్ము విజయా! సేవింపనీతండ్రినాన్

మ. సురనాథుండటె, తేరఁబంచెనటె నన్ సూనున్; సదేహుండనై
హరిలోకంబున నేఁజరింతునటె, భాగ్యంబౌర! సామాన్యమే?
నరుఁడే నెక్కడఁ నాక మెక్కడ హహా! నవ్యంబు దివ్యంబు పో,
శిరమం దుంచితిఁ దండ్రియాజ్ఞ; పద విచ్చేతున్ వెసన్ మాతలీ!

ఆ. అనుచు నందుఁగల్గు మునులకు హిమగిరి 139
కినిఁ, దపోవనికినిఁ గేలు మోడ్చి,
పుష్పకంబు నెక్కఁ, బోనిచ్చె మాతలి
తేరు వాయుజవము మీఱునట్లు.— 140

సీ. ఇల వెల్గుసోమయాజులవారు చని, యచ్చ
రలభోగముల నందఁగలుగు చోటు,
రణవినిహతులైన రాజుల పీరుల
కూటంబునై ఖ్యాతిఁ గొన్నచోటు;

ధర్మతత్పరులు. సత్యాన్వితు ల్దాతలు,
తాత్రిలలు నివసింపఁ దగినచోటు,
తీర్థయాత్రిలఁ జాలఁ దిరిగిన పుణ్యుల,
భక్తుల కిరి వొచుఁ బరఁగుచోటు,
తే, పాపులకసత్య పరులకుఁ బడనిచోటు,
పరమకృపణులు కాపథుల్జొఅని చోటు,
సాధ్వులకు. స్వాగతంబు నొసంగుచోటు.
యతులకు, సుజనులకుహిత మైనచోటు- 141

తే. కలియుఁ, దప్పియును బుట్ట నట్టిచోటు,
వ్యాధు లాధులు చేరని యట్టిచోటు,
ముదిమి మృతియనునవి లేక, పొదలు చోటు
శాంతి దాంతులు విహరణ సలుపుచోటు.- 142

క. అట్టిమహాత్తర హారి హాయి
పట్టణమును జేర రథము; పార్థున కాయా
పట్టులఁ జూపుచు మాతలి .
యట్టే యొడ్డోలగమున కరదముఁ దోలెన్,- 143

చ. అట డిగి వచ్చునాత్మసుతు నారసి, నిర్మల, మందహాసము-
ల్నటనముసేయ మోవిపయి, నాకవిభుం డెదురేగి తెచ్చితా,
నటులె సుధర్మపీఠికి స మాసనమున్దనతో నొసంగి, యు
త్కటకృపఁ గౌఁగిటన్ జొదవెఁ గాంచుచు మోము ముదశ్రుత్రిలా
రగన్. 144

క. శతయజ్ఞసుకృతపుణ్యా
స్థితునకె కా, కన్యునకు ననేవ్యంబని వి
శ్రుత మగు సుధర్మపీఠము
శతమఖసుతుఁ డెక్కఁ గాంచి, సంరంభితులై. 145

క. సురగరుడసిద్ధవిద్యా
ధర, కిన్నర, సాధ్యులు కరతాళములు దమిఁ
బరఁగించిరి; వాద్యంబుల
మొరయించిరి; పుష్పవర్షమున ముంచి రటఁ 146

కం శతయోజనవిస్తీర్ణా
యత మగునట, సురలు, మునులు, యతులును, బుణ్యుల్
మితిమీఱి చేరి, కేరుచు
నతులను దీవనల నిడిరి నరునకు హరికిఁ- 147

తే. సరగ నందందు వేత్రహస్తములవారు
చాలుఁగాఁ దీఱి, చమరుచు, సద్దుమాన్చి,
నిలిచి తొలఁగనివారల తలలు మొట్టి,
కూలవైచిరి సభ కనుకూలముగను- 148

సీ. కలపంపుబరణులో, కనకంపుబొమ్మలో,
చెలువారుకరువులో, చిత్తరువులో?
విటులకఁ కల్కులో, విరహికల్పకములో,
యసమబాణుని విజయధ్వజములో?

యరవిరిముల్కులో, మరునిచే చిల్కలో,
రతిశాస్త్రమూల సూత్రార్థగతులో?
మునితపఃఫలములో, మనసు శృంఖలములో,
యతనునిసంజీవ, నౌషధములో?
తే. అక్షిపక్షులఁ దిగిచెడు నట్టియురులో?
నాకసౌఖ్య ప్రసాకార లోకతతులో?
మించుతీవలో? యనఁ జనుదెంచిరచటి.
కచ్చరలు, పాంగిసభవారు మెచ్చిచూడ,- 149
సీ. దివ్యవాద్యంబులు భవ్యనాదము లీనఁ,
గాళులఁగింకిణీ క్వణము లలర,
భ్రూచలనము, నేత్ర భూరివిన్యాసంబు,
వదనహాసము, గళ వర్తనంబు,
నాంగికంబును భావభంగిమంబును, హస్త
పాదాభినయగతి పరఁగ; వివము
సమరీతు లెసఁగఁగ; మమధురగానంబు
లయతాళగతుల జెలంగి మలయఁ,
తే. గళ లోలుక; నవరసములు కరుడుదీర;
తోదసీకుమారంబెల్ల నాదమలమఁ,
దత్తదుచితంబుగా శాస్త్ర. తత్వ మొలయ
నభినయించిరి యప్సర లద్భుతముగ 150

ష॥ 150 పా॥ 5– కటినర్తనము భావగతి కచకుచహస్త

తే. వాద్యగీతాభినయరస వార్ధియందు-
మునిఁగి, యది ముగిసియు మోహ బుద్ధి, గడియ
మెయిమఱచి యుండి యంతంత మేలుకొనుచుఁ
జెల్లెఁబో! యని సభయెల్లఁ దెల్లవోయె;- 151

క. నయఁ డాయమానుషం బగు
సురవేశ్యలనాట్యమహిమఁ జొక్కి, తరుణులన్
మెఱుగారు నూర్వశినిఁ గను
గిఱుపక కనె, వజ్రిమది, నగియె, నదికనుచున్.- 152

క. పదియుంబదిగా లోలోఁ
బొదలుమరులు కతన విజయు మోమున్ గనుచున్
సుదతీరత్నం బూర్వశి,
మదనునికోలలకుఁ జిక్కి మదికుదురు చెడెన్- 153

తే. పారితోషకముల నిడి పనిచి దేవ
వేశ్యలను. నాకవిభుఁ డాఁపి వేసి కొల్వు;
నర్జునుని గూడి తా నేగె నంతిపురికి;-
నల్లనల్లనది నమణి యస్తమించె.- 154

ఉ. అంతట, దేవదూతయొకఁ డప్పుడె వచ్చినయాహితాగ్నులన్,
శాంతుల సోమయాజులను; సత్యవచస్కుల. యుద్ధభూమిలో-
నంతముగన్న వీరులను నాదృతి నాసుర వేశ్యపాళికిన్-
వంతులలోడఁ గూడుటకు వాసవునాజ్ఞను వించి, యాపయిన్-155

క. ఆ దేవపూత యూర్వశిఁ
దాఁదరిసి వచించె "వినుము తరుణీ! నడనీ
మోదమునఁ గ్రీడఁ దేల్పఁగ
నీడి సుమా! వంతు; చనుము నీరజనేత్రా! 156

తే. అతఁడు సభ నిన్నుఁ జూచుట, యతని నీవు
నట్టె కాంచుట, తా నది యరసి యుంట
సురవరుఁడు నాకు వినిపించి, త్వరగ నిన్ను
బంపనట, కాజ్ఞనిడి యిట కంపె నన్ను.- 157

క. నరుఁ డుత్తమనాయకుఁ డగు
సురవేశ్యలకెల్ల నీవ చూడామణివో;
దిరువురు రసిక వరేణ్యులు!
దరిసెను తఱి మీకు నేఁడు దర్పకు నేలఁ- 158

కం సురవేశ్యకు సిగ్గేమి? స
గర, భరత, దిలీప, నల ముఖక్ష్మాపతు లం-
దఱ మేటి, మారవిద్యా
గురుఁ డీతని నీమనంబు గుఱిగొనఁ దప్పే?"-

తే. అనిన ముసిముసి నవ్వుచు నతనిఁ గనుచు
"నమరపతి యాజ్ఞకన్నను, నతని సుతుని
ప్రేమరసికత్వమునకన్న శ్రేయిరేట్లు
మిన్న తిగిచెను నీనుడు లెన్న నన్నుః- 160

క. అనియూర్వశి యన; దూతయు
"వినిపించితి నున్న తెఱఁగు విపరీతము నీ
కననిది కలదే నానుడి ? "
యనుని నవ్వుచు నాతఁడేగె నటుపై నప్సర,- 161

సీ. జలకంబు లాడి, దువ్వలువ కట్టెఁ కస్తురి తొడుగి
తిలకంబుఁ దీర్చి, మైకలప మలఁది
కరముల మాణిక్య కటకంబులను దాల్చి,
మగరాలకమ్మ లిమ్ముగ ధరించి,
రతనాల హీరహారము లురమ్మునఁ గూర్చి,
కటిని నొడ్డాణంబు దిటవు పరచి.
మొలనూలు దానిపైఁ బొలుపారఁగాఁ గట్టి,
మెఱుగారు సొమ్ముల మెయిని బెట్టి,

తే. ప్రక్కటను గప్పురంపుతమ్ములము విరియ,
కనకఘంటావు, కోళులు గాళ్ల మెఱయ,
చేతఁగరనస్త్ర మలరారఁ, జెలియ ముందు
నడన, నూర్వశి నడుపీధి నెడలె నడచి. 162

క. పికములు దరిసె ధ్వనికి; భ్రమ
రకములు ముంగురులఁ గవిసె; రక్తిని మూఁగెన్
శుకములు నుదులకు; నంచల
నికరంబులుఁ జేరె నడక నేరుపు నేర్వన్- 163

ప॥ 161 పా॥ 4 అ॥ 1- న; అ॥ 9- గెః అ॥ 13- ఖ;
ప॥ 162 పా॥ 1 అ॥ 12- తెఁకఁదొడిగి: పా॥ 6 అ॥ 13- ఱుఁ;
ప॥ 162 పా॥ 8 అ॥ 2-ఱుఁ; పా॥ 10 అ॥ 1- ఁగ; పా॥ 11 అ॥ 1 ఁజే;

తే. "అశ్వమేధంబు రాజసూయాదికక్రతులఁ
జేసిన మహానుభావు లీచెలియకడప
కాచిరిమొగము లున్నవారయుఁ గల్గిపుణ్య
మేమొ? యీమెమొ దరియంగ నేగునాఁ! 164

క. వరుణుని సుతునకు. నలుకూ
బరునకును, జయంతునకును, వంతుదొరకునో
దొరకదొ యొం డబ్బమునకు?
నరుభాగ్యం" బనిరి నగరి నాయకజనముల్, 165

క. చనిచని యటు లూర్వశి, పా
ర్థుని శయ్యామందిరంబులోఁ జెలి నొకచోఁ
గనుగిటిపి నిలిపి చని, నరుఁ
దనవోవఁగఁ గాంచె హంసతల్పశయానున్. 166

క. విరుల సుగంధము, నెఱులిడు
పరిమళమును, గుబులువిడెమువరసౌరభ, మా
తరుణి మెయినలఁదుకలపఁపు
చిరుతావియు నరుని నిదురఁ జెఱిచెను భరమై. 167

క. మెలమెల్లనఁ గనువిచ్చుచుఁ
దిలకించె నతండు మెఱుఁగుదీవను, మరుచే
ములికిని. చిలుకల కొలికిని,
కలికిని వణిదీపకాంతిఁ గన్నారఁతవడన్. 168

ప॥ 164 పా॥ 3 అ॥ 1 కాచిరి; అ॥ 11- గ: ప॥ 165 పా॥ 1 అ॥ 10- అ;
ప॥ 166 పా॥ 4 అ॥ 2- ని; ప॥ 167 పా॥ 3 అ॥ 11- పపుఁ;
ప॥ 167 పా॥ 4 అ॥ 1 ఱి: ప॥ 168 పా॥ 4 అ॥ 5 వ:

క. గుఱుతెఱిఁగి యింద్రసభలో
మెఱసిన యూర్వశిగ దాని, మెల్లమెల్లనఁ దాఁ
బఱుపు డిగి, ముడిచి కరపుటి,
శిర మించుక వంచి, నిలిచి స్మితవదనుండై — 169

క. "చనుదేర నిసి, నదెంతటి
పనియో? యాసనముఁ గొనుము పావని! త్రిదశేం
ద్రునిసతివి, నీదు రాకన్
మనికి కృతార్థంబు నయ్యె! మాతా!" యనినన్. 170

క. అచ్చెరువు, భయము, మోహము,
హెచ్చినకామంబుఁ దన్ను నేచఁగ, నరునిన్
మెచ్చుచు, మరువిరి శరముల
నొచ్చుచుఁ బొలయలుక నులికి నుఱిపిడి యగుచున్. 171

క. "విటధర్మం బిదియా? య
క్కట! కామినియే, తనంతఁ గామించుచు రా,
నిటు లాడుటె? మగవారల
మటుమాయలు దెల్లమయ్యె మా" కని మఱియున్. 172

క. కని పులుకుపులుకునన్ మదిఁ
"గనికరమే లేద? పేడి కావుగదా? మా
రునిబారి కోర్వ; ననుగై
కొని దయతో నేలు" మనుచుఁ గోమలి వేఁడన్. 173

క. నరుఁడను "దర్పకుదాడికి
దురితింబులఁ జలుపఁజన్నె? దూరపుదృష్టిన్
బరపి, తగ వరసి, ధర్మా
చరణముఁ గొనరాదె? యిద్ది సాహసముగ దే? 174

తే. రాణినై మున్ను మాపురూరవునిఁ బాణిఁ
బట్టితివి, మీకు "నాయువు" పుట్టెఁ, బిదప
నతఁడు బడసెను నహుషుఁడన్ సుతుని, నిట్టు
లెసఁగు వంశాన నే జనియించినాఁడ! 175

క. మావంశ పరంపర కిటు
లీవే మూలం బటంచు నేర్పడె దీనన్
దేవీ! మాతృస్థానము
భావింపనివాఁడు మనుజపశు వగుఁ జూడన్" 176

క. అని పలుక "వేశ్యయింటన్
బ్రణవార్థవిచార మట్టె? రతికూటమునన్
గనుటె స్వరాక్షరగుణితము?
మనుశాస్త్రమె దేవలోక మహిళలపట్లన్? 177

క. నెయ్యుఁడ! మీయయ, కాయయ
యయ్యకు, బంధులకు, సోమయాజయ్యలకున్
గయ్యమునఁ దెగినయయ్యల,
కయ్యెద నే నేస్తురాల ననుస్మృతి వినవో?" 178

క, అన "మర్త్యుఁడునై భువిపై
మను దాఁకఁ దదీయ మైన మతమగుఁ; బిదపన్
గనుచో దేవశరీరము,
చను మఱిఁ దద్ధర్మగరిమఁ జనఁగా జననీ! 179

క. అల దేహ విశేషవిధుల్
బలవత్తమములు గదమ్మ! పరికింపంగన్;
తెలిసి తెలిసి శాస్త్రమును, మ-
రలున నిటుల సనుదె? పాప రూపకము గదే?" 170

క. "ఓహో! శాస్త్రము సదువుదె?
సాహసమన కేగు రీరు సతిగా నొకతన్
బాహాటముగాఁగొనితి, ర-
హోహంబగు విధినిఁ దెలియవో? " యనియనిన్.  181

క. విని నరుఁడు "దోసమేమట?
జనని పనుపు విధిగ నడపఁ జాలితి" మనినన్-
"జననిపనుపు విధియైనన్
జనకుని పనుపిదియు విధిగ సలుపుమ" యనినన్:- 182

క, "దేవి! యనాఘ్రాతం బగు
పూవున్ జేకొంటి మపుడు, పూజ్యులయాజ్ఞన్;
ఈవడువగు క్రియయేయది?
దేవగణిక విధినిఁ గొలువఁదీరునె దానిన్";- 183

క, అన; లజ్జయును, నిరాశయు,
ఘనరోషము మదిఁ బెనంగఁ గామిని కినుకన్
"నను నీవు లవమానించుదె?
మనుజాధమ! కనుమ వేశ్యమహిమ" యటంచున్.- 184

క. రాహు వడరు శశియో? రా
ద్రాహితలను వెలయుమణియొ, యలిగినపులియో?
దాహకుతేజమొ? శక్తియొ?
యూహింపఁగరాని దగుచు నూర్వశియంతన్. 185

క. "కట్టెడివై నామానము
గుట్టుతిగిచి రట్టుపఱచు కూ్రరాత్మ నినున్
బట్టెదు షండత్వం" బని
తిట్టి చనెన్ జెలినిఁ గూడి తీక్ష్ణేక్షణయై. 186

చ. నరుఁడు "కృతాపరాధులకు న్యాయము దండము; సజ్జనాళికిన్
మఱి మనుముఖ్యశాస్త్రవిహితమార్గుల కయ్యదియే ఘటిల్లఁగా
సరియగునె? యొకర్కటన్ హరుప్రసాదము గంటిని; శాపత స్పృహై
పరఁగితి సత్యసంధత; తపం బొకటన్ ఫలవైపరీత్యమే? 187

క. బలవత్తర మగువిధి యని
తలపోయుచుఁ గొంతసేపు తా నుండంగన్,
దెలవాఱె నంత నచటికి
బలసూదనుఁ డేగుదెంచి పార్థున్ గనుచున్. 188

తే. వగసకుము; పేడిరూపంబు వత్సరంబు
వఱకె నర్తిల్లు, నజ్ఞాతవాసవిధికి
నెఱవు నీ కిది; యూర్వశి కరుణఁ జేసి
శాపమిష నీకు నుపకృతి సలిపె నిటుల, 189

క. అని, సుతునిఁ దేర్చి సురపతి,
కొనిచని తనపంతిపురికి, గోష్ఠిసలుపుచుఁ
దనిపి. మహదస్త్రముల నిడఁ,
గని దిక్పతు లిడిరి వారి ఘనవిశిఖములన్. 190

క. ఈవిధి సురేశ్వరునితో
నావిశ్వచ్ఛందు నుండ నయిదబ్దంబుల్;
దేవపురికి రోమశముని
భూవలయమునుండి వచ్చి పొసఁగ సురసభన్. 191

క. వాసిగ నేకాసనమున
వాసవుతో నిలిచి, సురలు భజియింప మహో
ద్భాసితుఁ డౌనరుఁ గని, యు
ల్లాసమునన్ వజ్రితో విలసితవదనుఁడై. 192

క. నీసభ దొరకుట దుర్లభ
మా, సంయమివరుల కేని; నంతకు దవ్వౌ
వాసవ! నీదయ; నీయే
కాసనుఁ డీమనుజుఁ డెవ్వఁ? డని ముని యడుగన్. 193

సీ. నరుఁడనెడు మహర్షి వరుఁడీతఁడగుఁ జూవె!
భువిమదంశంబునఁ బుట్టువొందె;
గుణరత్ననిధి వీఁడు, ఘనుఁడు కౌంతేయుండు,
నపరవిష్ణుని కృష్ణు నాప్తసఖుడు;
పడసె నీశుని దయఁ బాశుపతాస్త్రంబు,
నిడితినిందాస్త్రంబు నితని కేను;
సురవరుల్ తమతమ శరముల నొసఁగిరి;
దేవకార్య మితండు దీర్చనుండె;
తే, నవనిభారంబు హరియింప హరియు నరుఁడు
భువినవతరించి యున్నారు; భుజబలమున
దుష్టుల నివాత కవచులఁ దునుముపొంటె
నాయనుజ్ఞ నిచట నిల్చినాఁడితండు, 194

చ. ఎలమిని నీవు మర్త్యమున కేగి, యుధిష్ఠిరుఁ గాంచి యింతయుఁదెలిపి, నరుండు పాశుపత దివ్యశరౌఘముఁ గొంట వించి, తానలయక తీర్థసేవవిధికై సనఁ జెప్పుము! నీవుఁగూడ తో-
-డలవడ వెంట నేగుము; మహాత్మ!" యటంచని పంపె నమ్మునిన్ 195

–: అర్జునుని పాశుపతలాభాదులను విని ధృతరాష్ట్రుఁడు దుఃఖించుట :–

తే. వసుధ ధృతరాష్ట్రుఁడీయెల్ల వార్త లెలమి
వ్యాసుఁ డెఱిఁగింప విని కడు వ్యాకులమున

దోఁచ కేమియు మది నొందితోటుపాటు,
సంజయునితోడ యోచన సలిపె నిట్లు:- 196

సీ. "అగ్నిహోత్రాహుతి యిచ్చె నమరేశ్వరునివన
మోహాటిల్లక వజ్రి నోటుపఱచి;
యన్నచే రాజసూయంబును జేయించె
నుర్విపాలుర నెల్ల నోర్చి కడఁకఁ;
బాశుపతాదిమహాశుగంబులఁ గొనెఁ
బరమేశ్వరునికృపాభాగ్యగరిమఁ;
దైగ శతక్రతునకుఁ దక్క తాఁకఁగరాని
యమరసుధర్మ పీఠార్థ మెక్కె;
ఆ. నట్టినరుఁడు ధనువుఁ బట్టి, భీముఁడు గదఁ
బొట్ట సురలకైనఁ దొడర నగున?
మనసుయోధనుండు మతిమాలి, చల మూని.
కూల్పఁ దొడఁగె నాదు కులము, బలము" 197

క. అని కడుఁగుందెడు జనపతిఁ
గని, "శాసింపంగఁ బోవు కట్టిడికొడుకున్
మనుజేశ! నీయుపేక్షయె
విను! యింతకుఁ గారణంబు విదితంబు గదా! 198

తే. పొంచి దుర్ద్యూతమునఁ బాండవులను గెల్చి
కపటవిధిఁ భూమిఁగొని, వారికాంతనట్లు

పరిభవ మొనర్చి, కానకుఁ బంపఁ. గాంచి
కొడుకుదుడు కేమియడ్డవ కువలయేశ! 199

ఉ. కానల బడ్డపాండవులఁ గాంచి మురాంతకుఁ డల్గి ఫూఁటగాఁ
దా నిడెనంట మాట "నని దాయగమిన్ హతమార్చి పేర్చుచున్
బూనిక ధర్మపుత్రునకుఁ బూన్చెదఁ గౌరవరాజ్యలక్ష్మి నే
మాన"నటంచు; మాధవునిమాట, ల సత్యము కాదె భూవరా! 200

క. మఱి నాతఁడె స్వయముగ సం
గరసారథ్యము వహించి, కవ్వడికి జయం
బరుదారఁ గూర్చె నని యా
తఱిఁ గృష్ణను దేర్చె ననుచుఁ దద్దయు వినమే? 201

తే. వారిసమయంబు నెఱవేర్చి పాండుసుతులు
బందుగులఁ గూడఁ, గృష్ణుని బలముతోడ
సమరమున నీకుమారుల సంహరించి
ధారుణినిఁ గొండ్రు రిద్ది తథ్యమ్ము సుమ్ము 202

క. నరువరశరస్ఫురఘాతము,
తర మెఱుఁగనివాయుసుతు గదాఘాతము, నీ
తరిలీ పనునిర్ఘాతము
కురుకులపాతంబునకు నగున్ హేతుకముల్. 203

క. అన "నాతనయుఁడుముదుకఁడ
.నని, జాత్యంధుండ నంచు, నవివేకుఁడ నే

ప॥ 201 పా॥ 3 అ॥ 1- యం; ప॥ 202 పా॥ 4 అ॥ 10- తథ్యమ్మునుమ్ము;
ప॥ 204 పా॥ 1 అ॥ 3- నాతనయుఁడుముదుకఁడ;

ననిక్రొనఁడు; శకునికర్ణులు
వినిచెడినుడిఁగొను, నిదేమి విధివిలసనమో? 204

క. కులవృద్ధుని భీష్మునిపలు
కుల విన, రావిదురుఁ గొనరు, కుంభజు కృపు నీ
తుల గణింప, రానల్వురు
తులువలు న న్నిట్లు చెఱుపఁ దొడఁగిరి వినకే! 205

తే. పుత్త్రుఁడు చెఱకుతుద వెన్ను పుట్టినట్లు
పుట్టెనాకులమెల్లను బుగ్గిసేయ;
మహిత విధువంశసత్కీర్తి మాసె నకట!
విధివిధానంబునకు వేఱువెరవుఁగలదె? 206

తే అనుచుఁ జింతార్ణవనిమగ్నుఁ డగుచు గ్రుడ్డి
రాజు, గతి యేమి తోఁపక రోఁజుచుండె;
విపినమునఁ బాండవేయులు, విజయువార్త,
నెఱుఁగరాకున్కి కారణ మరసి యరసి. 207

తే. హరునిఁ దపమున మెప్పింప నరిగినట్టి,
నరుఁడు రాకుండె నబ్దము ల్గ్రాఁచుఁ గడచె;
మసలగా నేమి కత మొక్కొ మదికిఁ దోఁచ
దనుచుఁ దామట్టె యోచించి రనుదినంబు. 208

క. అని వినిచిన వైశంపా
యను జనమేజయుఁడు గాంచి హర్షమ్మతోఁదఁ

ప॥ 205 పా॥ 3 అ॥ 3- ఁజెవినిడు; ప॥ 207 పా॥ 4 అ॥ 7- ఁగొ;
ప॥ 208 పా॥ 2 అ॥ 15- డ; ప॥ 209 పా॥ 2 అ॥ 13- హర్షముతోఁదఁ;

వినమితశిరుఁడై చెప్పం
గను వేడెను ముందునడచుకత కుతుకమునన్. 209

ఆ. మునిమనోబ్జభృంగ! ఘననీలరుచిరాంగ!
సదమలాంతరంగ! సాధుసంగ!
రాయదుర్గవాస! రాకేందుసంకాశ!
విబుధహృన్నివేశ! వేంకటేశ!. 210

అరణ్యపర్వము ప్రథమాశ్వాసము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ



# అశ్వత్థ భారతము.

## అరణ్య పర్వము.

## ద్వితీయాశ్వాసము.



క. శ్రీదయితా! త్రిదశార్చిత
పాదా! శ్రితవరద! ధర్మపథసంచరణా!
వేదవినోదన! దుర్జన
భేదన! శ్రీరాయదుర్గ వేంకటరమణా! 1

### * నలోపాఖ్యానము, *

క. అని నిటలాజన మేజయుఁ
గని వైశంపాయనుండు, కానల నటులన్
దనికెడు ధర్మజునొద్దకు
మునిబృహదశ్వుండు రాఁగఁ, బూజించి తగన్. 2

చ. పుడమిని సంపదన్ బలగము న్విడఁబాయుచు, చరిణ్యాసిమలన్
బడుచు మృగంబులన్ బలెనె, పండగ నుండగలేక. కట్టఁగాఁ
గుడువఁగ నారఁ గూరలుఁగఁ గోమలితో, నిజసోదరాళితో
నిడుమలఁబడ్డవారు మఱిఁ బృథ్విని గల్గిరె నన్నుఁద క్కొరుల్. 3

చ. అనెను యుధిష్ఠిరుఁ గనుచు నాయతి భ్రాతృభటాళితోడ, స
జ్జనతతితోడ, భూమిసురసంఘముతోఁ బ్రియపత్నితోడ, స్యం
దననివహంబుతోడ, విపినస్థలినుండెను ధర్మదీక్షతో
మును నలరాజు పడ్డవెతముందఱ నీయది లెక్క కెక్కునే? 4

క. అని తాపసియన, నచ్చెరు
వున దాని వినంగ బుద్ధిపుట్టి వినుపు! మం
చని వేఁడెడుధర్మజునకు
మునిపతి యాకతను దెలుప మునుకొని పలికెఁ. 5

సీ. విను నిషధేశుండు, వీరసేనసుతుండు,
నలసార్వభౌముండు న్యాయపరుఁడు,
ననవరతాక్షప్రియాత్ముండు, బ్రహ్మోత్త
రంబుగ క్షితిపాలనంబుఁ జేసె,
నతని భాసురకీర్తిలత, సితపుష్పమై
ప్రాఁకెను భూనభోవలయ మొలయ;
విని విదర్భాధీశభీమనృపాత్మజ
దమయంతి యతనిఁ దద్దయును వలచె,

తే. నటులె యాసతిరూపంబు, నమలగుణము
వినుకలినిఁ జేసి నలుఁడును మనసు నిలిపెఁ;
నిరువురు మనోవికారంబు నొరసి, మరుని
బారి కోర్వక, మది నొచ్చి బాధపడిరి. 6

క. ఇది పనిగ తాత్రిధగ్నా
స్పదమైనస్వయంవరంబు చాటించెను స
మ్మదమున భీమనృపాలుఁడు
విదితంబుగ ముజ్జగంబు వినియెడురీతిన్.

తే. అంత దిగ్దేశములఁగల యవనిపతులు
వారివారిబలంబులు వైభవంబు
లలరఁగా, దమయంతీస్వయంవరమున
కరుగుదెంచిరి యుత్సాహాతు లగుచు నెలమి.

క. సుదతి దమయంతి త్రిభువన
మదవతులందెల్ల మేటిమానిక మనుచున్
త్రిదశేశుఁడు విని యము, వరు
ణా దహనులఁ న్గూడి _నుచుసతిఁ గనన్ ధరకు డిగెన్.

తే. నలుఁడును స్వయంవరమునకు నడచుచుండ,
దారిమధ్యన సురవరుల్ దరిసి, నీవు
కడఁగి దూతవైమా కొకకార్య మిపుడ
సేయవలె నన్న నట్టులఁ జేతుననుచు.

తే. మీర లెవ్వారు? నాయెడ మీకు నేమి
కార్యమ్ మన, నిందుఁడే నొద్దు[illegible]ల; దహన,
వరుణు లివ్వారు! దమయంతిపరిణయార్థ
మరుగుచుంటిమి తత్స్వయంవరముకొఱకు.

తే. ఈవు దూతగ ముందేఁగి, యింతితోడ
మస్ము నెఱిగించి, మాయందు మమత నొకని
నతివ వరియింప వినిపింపు "మనఁగ నాతఁ
డమరవరులకుఁ బ్రియ్భతుల నాచరించి, 12

క. ఏకార్థకాంక్షితుని, న
న్నికై వడిఁ బంపఁ బాడియే యీపనికై
లోకేశులార! మీ" రన
నాకేశుఁడు పల్కెఁ బల్కె నావటు తోలుతన్. 13

ఆ. "సత్యనిరతుఁగాఁగ సంభావనముఁజేసి
దేవకార్యమిద్ది తీర్చుకొఱకుఁ
బంపవలసె దూతపనిఁ బూన్చి; నీ కెట్లు
పలికి బొంకవచ్చు పార్థివేంద్ర!" 14

క. అన బొంకు లేదు నానుడి;
వినిపించితి నున్న తెఱఁగు; సౌజనను మఱి నేఁ
జని, యంతిపురిని మగువన్
గని మాటాడంగ నెట్టిగతి నేర్తు? ననన్. 15

క. "కాను మీయదృశ్యఘుటికన్
దనరఁగ నిది మోళిఁదాల్చి తరుణినిఁ జేరం
గనువచ్చు; మాటలాడం
గనువచ్చును; దీనిఁ దీసి కన్పడవచ్చున్". 16

ఆ. అమరనాథుఁ డిట్టు లాడి దాని నొసంగె,
భాగ్య మనుచుఁ బూని. నందనంబుఁ
జేసి నలుఁడు వెడలె; వాసవాదులుఁగూడఁ
దరలి రటు విదర్భపురముఁ జేర. 17

అనల నలావనీశుఁడు విదర్భపురంబును జేరి, శీర్ష మం
దున్నది తాల్చి, యక్షులకుఁ దోఁపక యంతిపురంబుఁ జొచ్చి, మున్
వినికికి వేయిరెట్లు గడువెల్గుచు రూపవిలాసరేఖలన్
మినమినలాడుకాంతఁ గని, మెచ్చుచు, నొచ్చుచు మారుకోలలన్.

క. తలఁ గలయదృశ్యకరణిన్ (18
వలపలికరమందుఁ దాల్చి ప్రత్యక్షముగాఁ
బొలిచిన, ననమోహను నా
నలుఁ గని, చెలి యదరిపడి, మనంబున భ్రాంతిన్. 19

క. మదనప్రేరితయై సతి
మది సిగ్గుఁ దొలంగి, మృదులమంజులగతి నిం
పొదవెడుపలుకులఁ జక్కె
వెదజల్లుచుఁ బల్కె, నలుఁడు విస్మయ మొందన్. 20

ఉ. నిన్ను మహానుభావునిగ నేఁ దలఁతున్ మదిఁ సాహసంబునన్
జన్నె చొరంగ నంతిపురిఁ? జారులు లేరె? యిదేమిమాయయో?
కన్నులభాగ్యమై పొలిచి, కామునిబారికిఁ దోసినావు! నీ
యున్ననిజస్థితిన్ దెలిపి యోముము; కైకొను మాసనం బనన్. 21

క. నలుఁడ. నిషధాధిపుఁడ నే౯
జెలువా! దిక్పతులయాజ్ఞఁ జేకొని, నీకు౯
దెలుపఁగ వారలయభిమత
ముల వచ్చితి, దూతపనిని మునుకొని యిట్లు౯, 22

ఆ. వజ్రి, కాల, దహన, వరుణులు నినుఁగోరి
వచ్చినారు; నీవు వారినొకరి
రమణ నీస్వయంవరంబున వరియింపఁ
బలుక నన్ను నిటుకుఁ బంపినారు. 21

క. ఎంతటిభాగ్యమొ? దిక్పతు
లంతటివారలె వరించి యర్థించిరి; నీ
స్వాంత మలర నం దొకరినిఁ
గాంతా! పాణిగ్రహించి కరుణింపఁగ దే! 24

క. అనిన, విని చెలి యవనతవ
దనయై, ప్రియుపలుకులెంచి తత్తరపడుచు౯,
గనుఁగొని కనులారఁగ నలు;
ననియెను బద్ధానురాగయై యాతనిపై. 25

తే. ప్రణుతు లర్పింతు భక్తి దిక్పతుల; కేను
నీధనమ! నిన్ను రప్పింప నెపము వెట్టి
పరపె నాతండ్రి యీస్వయంవరము; నీవు
దయను నన్నేలు; లేకున్నఁ దనువు నొల్ల! 26

తే. అన సవిజు లేడ? నే నేడ? యతివ! వారి
పాదరజమును బోలను; వారి నొకరిఁ
బ్రీతి వరియింపు; సురల కప్రియముఁ జేయ
నెంతఘనులైనఁ జెడిపోద రెఱుఁగవొక్కొ? 27

క. నామాట వినుము, వారలఁ
బ్రేమింపుము, దేవవిభులె ప్రేమించిరి నే
నే మందు; నీయదృష్టము,
కామిని, త్రైలోక్యకుము వారిఁ గరుణింపఁగదే! 28

తే. అనిన; దమయంతి నయన బాష్పాంబుకలిత
గండయుగళ యగుచుఁ గొంత కలఁగి యెడఁద;
నట్టె యోచించి "నిరపాయ మానుపాయ
మొండు మదిఁ దట్టెవిను" మనియుత్సుకమున. 29

ఉ. వా రటులఁ స్వయంవరసభాస్థలికిఁ జనుదెంతు రేని, నే
వారలదివ్యసన్నిధి, ననారితనై వరియింతు నిన్ను, నీ
నేరము లేనిరీతియును నిశ్చయమౌఁగద వారికెల్లనుఁ;
మారు వచింప కింక నని మానిని యానలుపాద మంటినఁ. 30

ఆ. చేయునదిలేక యాతఁ డాచెలని వీడి
యంతిపురమును బాసి, యయ్యమరవరుల
దరిసి, జరిగినకతయెల్ల, దప్పకుండ
వినిచి, సమ్మతిఁగొని వారి వీడుకొనియె. 31

పా॥ 27 పా॥ 4 అ॥ 12. రెఱుఁగవొక్కొ; ప॥ 30 పా॥ 4 అ॥ 2- ఱు;
ప॥ 31 పా॥ 1 అ॥ 11- లి;

ఆ. తరుణి నలునిఁగాక వరియింప దట్టె, యా
కథణిఁ జూతమంచు సురలు నల్వు
రరిగి, మండపమున నానలు వజ్జన,
నలునిరూప మూని నిలిచి రంత. 37

చ, కరగతపుష్పదామయయి కామిని యాదమయంతి, తత్స్వయం
వరవరమంటపంబునకు వచ్చి, నరేశులఁగాంచు చేగి, యే
వురు నలురూపు లొక్కెడనఁ బొల్చుటఁ గన్గొని, భ్రాంతయౌచు నే
ర్పరుపఁగ లేక నాథునిఁ గరంబరుదార నిమీలితాక్షియై. 33

తే. కరయుగంబు మోడ్చి సురవరులార! నా
నలునిఁ జూపి కరుణ నన్నుఁ బ్రోవుఁ
డనిన, ననిమిషాక్షు, లస్వేదగాత్రులై
నేల విడిచి సురలు నిలిచిరంత. 34

క, కని సతి, తనప్రియు నలుగళ
మున సుమదామమును వైచెఁ బొగడరి యమరుల్,
ముని విప్రసాధువాదము
ఘనతూర్యారవము లెసఁగె గగనం బంటన్. 35

సీ. ఘనవైభవంబునఁ గల్యాణ మానల
దమయంతులకు నమ్యోరమణమీఱ,
నలునకుఁ దనయజ్ఞముల నమరేశుండు
నిజరూపమునుఁ జూప నేర్చునట్లు;

నగ్ని వరుణు లాతఁ డగ్నిజలంబుల
వలచినతోడనఁ గలుగునట్లు,
ధర్ముఁడు నలునకు ధర్మువునం బుద్ధి
తద్దయు సతతంబుఁ దగులునట్లు,
ఆ. వరము లిచ్చి దేవ వరులేగుచుండంగ,
దారినడుమ నెదుట ద్వాపరమ్ముఁ
గలసివచ్చు కలినిఁ గని, "యెందుబోయెద?
వేమిపని?" యటంచు నింద్రుఁ డడుగ. 36

తే. "అరయవలె. దమయంతీ స్వయంవరంబు
ధరణి జరుగుట? నందుఁ దత్కన్యచేత
నేను వరియింపఁబడుదు నా నెపముచేత
నరుగుచున్నాఁడ" నన, నగి యమరవరులు. 37

క. "మది మెచ్చక యేరిని నా
సుదతీమణి నలు వరించెఁ జూచి కనుల న
య్యది మేముఁ దరలితిమి మా
సదనంబులఁ జేర నిట్లు స్వర్గమున" కనన్. 28

క. కర మలిగి కలి, సురేంద్రున
"కర రే యెరు సరకుఁగొనరె? యనఁ చెదఁ గనుఁగా
నరోకద, నలదమయంతులు?
నరులకు నీకావరంబె? న న్నెఱుఁగరొకో! 39

సీ. అని వారివీడ్కొని, యరిగి యాకలి, నిరం
తరయజ్ఞయజనతత్పరుని, నలునిఁ
జేరరాక, సమయంబు నరయుచుండఁగఁ గృత
మూత్రుఁడై జలముల ముట్టి పిదపఁ
బాదశౌచముఁ జేయఁ బదఁబడి మఱచి, సం
ధ్యోపాసనముఁ, జల్పఁ దొట్టియతని,
దాయాది, పుష్కరు దరిసి, త న్నొఱఁగించి,
చెలఁగిజూదం బాడి నలునితోడ,

ఆ వె. నోడిచికొమ్ము నాని పుడమినిఁ. గలిమిని
ననుచుఁ బ్రోత్సహించి. యతనిఁ గూడి
విప్రవేషమూని వేంచేసి పుష్కరు
తోడఁ నలుని జూదమాడఁ బిలిచె. 40

క అనికిని జూదంబునకును
దనుఁ బిలువఁగ నృపుఁడు పోవఁదలఁగ. నధర్మం
బని నలుఁడు గడఁగె జూదం
బున కాకలిమాయచేతఁ బుష్కరుతోడన్. 41

చ. ధనము సువస్తుసంతతులఁ దాలుచుసొమ్ముల వారణంబులన్
ఘనరథవాజిరాజి, మణికాంచనరాశి దుకూలజాల మా
సననివహంబు రాజ్యమును సర్వ మొకొక్కటి నొడ్డియాడె నం
దునఁగలవిఘ్ను లాఁపినను దొఁయక తొట్టి చలంబుపెంపునన్. 42

క. ననట దమయంతి తనయుఁ
డనయును వార్ష్ణేయుఁడనెడు తమసారథితోఁ
బనిచె విదర్భపురికిఁ దను
జనములకడ విడువఁ బ్రియుని సమ్మతిఁ గొనుచున్. 43

సీ. ఇల రాజ్యముం జెడి నలుఁడు పత్నినిఁ గూడి
కుడ్వ లేక జలంబుఁ గొనుచు నడవిఁ
బడి, బుభుక్షాపీడ భరియింప నోపక,
సరసఁ దిరుగుపక్షి చయముఁ గాంచి,
భక్ష్యంబు లగు నని పట్టఁ దాఁ గట్టిన
వస్త్రంబు వానిపై వైవ, నవియుఁ
గొని దాని నాకాశమున కేగి, విగతవ
స్త్రుని నలుఁ గని, నగియనిరె "నీదు

తే. ధనము, రాజ్యము నికృతిమైఁ గొనినయట్టి
యక్షముల మేము! కొనియిట్లు పక్షిరూపు
వస్త్రమునుఁ గొంటి; మిఁక లేదు పనియటంచు
నరుగ; మదిఁ జాల విస్మయ మందె నలుఁడు 44

క. తిరిగి ప్రియకట్టు పుట్టపు
చెఱఁగుం గొని కట్టె నొక్క చీరనె యిటులి
ద్దఱుఁ దాల్చి యొక్క రొకరిన్
బరికించుచు నగుచుచుండఁ, బతిసతి కనియెన్. 45

సీ. "కమలాక్షి నీకడగండ్లు జూడఁగ లేను,
పడనోప వడవుల నిడుమ లీవు;
కాన, విదర్భకో, కాక యుజ్జయినికో,
కోసలకో పొమ్ము! కోనుము తెరువు."
నన, శోకగద్గదయయి నాథుతో, "మన
మిర్వురము విదర్భ కేగి, యుండె
యుంద, మీవిధిఁ గానఁ గుంద నేమిటికి?" కన్న
సతివతో నతఁడు "నేన ప్పుడట్లు,
తే. రాజవిభవంబుతోఁ బోయి నోజ మెఱసి
బంధుజనులకు మానసానంద మొసఁగఁ
జేసి, యిపు డిట్లు దీనుఁడై వాసి బాసి
బంధువులఁ జేర నెంతయాపదలనైన" 45
ఆ. అనిన శోకరుజార్తున "కౌషధంబు
సతియొకర్తయ! సతితోడి పతికి నెందు
నెంతలాపద లున్నను నెఱుకపడవు!
తరుణి ధవునకు హార్ద సంధానకరణి! 46
తే. అలపుసొలపుల, క్షుత్తృదాహముల వేళ
సకియ భర్తకుఁజిత్తచాంచల్య మడఁపు
లాలనాలింగన స్మిత లలితవచన
రచనశుశ్రూషవీక్షణప్రచురణమున. 47

క. మనుజేశ! మదను జీవిత
యనుచు, ననువ్రత యటంచు, నర్ధాంగి యటం,
చనుకంప నీయ డనుచును
నను వీడకపోనుట నీకు న్యాయం" బనినన్.- 49

క. "హిత మగు నీపలుకులు, సతి
పతికిన్ బ్రాణంబు! సతికిఁ బతి యగుగతి! స
మ్మతిఁగను, మోడకు మిఁక నీ
జత వీడ నటంచు ముందుఁ జని యతఁ డొక-చోన్- 50

తే. విజన విపినంబునం, దొక విటపి నీడ,
ధూళిధూసరితం బగు నేలమీఁదఁ
బండి, కను మోడ్చి, కూరుకు పట్టకునికి
చరణముల పొంత నిద్రించు సతినిఁ గాంచి- 51

చ. ధరణి, సమస్త రాజ్యమును దాయకుఁజేరుట, నాప్తవర్గముల్
బరిజన వారముల్ తొలఁగఁబారుట; దారయుఁదానుఁ గానలోఁ
బరిపరి కష్టముల్ వడుట భావనఁజేసి, దురంతదుఃఖ సా
గరమునఁ దొప్పదోగి దరిఁగానక; యాసతి రీతిఁ గాంచుచున్ 52

తే. "మృదుల తల్పంబు పైవాల్చి మెయినిఁ, జెలులు
పదము లొత్తఁగ నిద్దురఁబట్టు కోమ
లాంగి యిటు గూర్కె; నాకు నర్ధాంగియయ్యు
కష్టముల నొందె దైవసంఘటనఁ జేసి.- 52

ప॥ 51 పా॥ 4 అ॥ 1- ఁజ; ప॥ 52 పా॥ 2 అ॥ 13- ఱ;
ప॥ 52 పా॥ 4 అ॥ 1- ఁగ;

ఉ. చాన విషాద మేఁ గనఁగఁజాల, మతెందులకేనిఁ బోదు; నన్
గానమి నెట్టకేల కెటొ గాదిలిబంధులఁ జేరు, నంతలోఁ
మానును దుఃఖ మీమె యని, మానిని మేల్కొనకుండ నస్త్రమున్
బూని సగంబుఁజించి, యది పుట్టముగా ధరియించి పోవుడున్. 54

క. ఆఁగి, సతిపైని నెయ్యపుఁ
దీఁగన్ ద్రెంపంగలేక, తిరుగుచుఁ జనుచున్,
ఊఁగెడి యుయ్యాలవలెఁ, గా
ల్గాగక మోహంబురజ్జు వదిపెనగొనుటన్. 55

ఆ. పోలఁతి నొంటిఁబాసి పోలేఁడు; నడుకాన
వెతలఁ జూడలేఁడు వెంట నుండి;
కడకు నలుఁడు తెగువఁ గలినికృష్టుండయి
కాంత వీడి చనియెఁ గరుణమాలి. 56

తే. కొంతసేపుమీఁదఁ గోమలి మేల్కొని,
చెలువుఁ గనక తనదు చీరచెఱఁగు
చింపుఁ జూచి, భీత చిత్తయై, తడబడి.
కంట నీరుదొరలఁ గనుచు దెసల. 57

సీ. అగ్నిసాక్షిగఁ గొన్నయర్ధాంగి నన్ బాయఁ
దగవగునే ధర్మతత్పరాత్మ!
యెడబాయ నని యిడ్డ నుడి వి నన్విడిపోవ
సత్యవ్రతుండవే! చనునె నీకు?

సకలఖండమండల నాథుండన్నై యిట్లు
పడతిని విడుతువే యడవి నొంటి?
ననుఁ బరీక్షించుకొంతకును నిందు నెందైన
దాగినాఁడవె ప్రాణదయిత చెప్మ?

తే. యనుచుఁ బొదల, నదుల నదుల, గుంటల,
గుట్ట, పుట్ట, చెట్టు, పట్టు లరయుఁ
గన్నటాలకెల్లఁ గన్నీరుఁ గార్చుచు,
నార్తిఁ దిరిగె నడవియందు నబల. 58

ఆ. ఉలికిపడును బిట్టయెలుఁగేది విన్ననుఁ
నెండ కోడి చెట్టదండ నిలుచు;
దారిముండ్లు, టాలు, దగిలి తొట్రిలు, వాలు;
నడవి సత్త్వములకు నడలు, బడలు, 59

తే. సోలుఁ, దూలుఁ, బ్రాలు మూలుఁ, గూలును, వ్రాలు,
సొలయు, మఱయు, నలయు, బొలయు, నులియు,
కలఁగుఁ, దలఁగు, నలఁగు. నలుగును, జెలఁగును,
దాఱుఁ, దాఱుమాఱుఁ గూరుఁ, జీరు. 60

ఆ. అట్టులడవిఁ దిరుగు నాదమయంతిని,
నజగరంబు పట్ట నరుగుఁ దేర,
నాథ! శరణ మగుమునా కని విలపించు
నింతియెలుఁగు విన్నయెఱుక యొకఁడు. 61

ప॥ 58 పా॥ 2 అ॥ 2- డఁ; పా॥ 4 అ॥ 1- దాఁ; పా॥ 6 అ॥ 6- ట్టు;
ప॥ 60 పా॥ 3 అ॥ 1- ఁగ;

క. పరతెంచి సురియఁ గొని, వెసఁ
దఱిగి యజగరమును, దేర్చి తరుణిని, మదనా-
తురుఁడై పైఁబడఁ గనఁ, బరి
పరి వినిచి, ఫలంబుఁగనక పాల్పోక మదిన్-

ఆ. శాప మిచ్చెఁ "జెడుగ! చావు" మంచని, వాఁడు
ధగ్ధుఁ డగుచుఁ గూలెఁ దక్షణంబ;
ప్రాణదాత నేనిఁ బరిగణించున సాధ్వి,
మాన మేచి చెఱుపఁబూన నేని?-

ఆ. తరుణి తన పతివ్రతా మహిమంబునఁ
గ్రూరుఁ జంపి; హృదయ కుహర మందు
నలుని నిలిపి, తొలఁగ కలవోక తిమ్మరె
ఘోరవనిని నలునిఁ జీరి చీరి.-

ఆ. లతల దలీసి ప్రియుడుగు సతి మనోనాథుని;
వేఁడుఁ జెట్లఁ బ్రియునిజాడఁ దెలుప;
గహనగహ్వరముల, గుహాల, సరస్సుల
నరసి కంటి నీళు లురల నేడ్చు.

క. చనిచని యిటు లొకచో ముని
జనాశ్రమముఁ గాంచి, యటకుఁ జని తాపసులన్
గని, భక్తి మ్రొక్కి నిలిచిన
వనితకు నవ్వారు పొదలు వాత్సల్యమునన్

క. "అహ్హా! యెవ్వరిదానవొ?
యివ్వన దేవతవొ? వేల్పుటింతివొ? తగఁదో
డెవ్వరు లే కిటు దిరిగెదు
జవ్వని! వివరింపు నీదుచరితం!" బనినన్.

క. "క్షితిదానయజ్ఞ సత్యా
వ్రితు, నలునిల్లాల, నన్నుఁ బాసె నడవి నా
పతి విధివశుఁడై; యాతని
స్థితి నారసి చెప్పరయ్య సిద్ధులు మీరల్. 68

తే. కాంతునన్వేషణార్థమై, కాననమునఁ
దిమ్మరుచునుంటి; నిఁక గఁగొన్ని దినములందు
ధవునిదర్శనభాగ్యం బు(దవులనేని
మేను వాయుదు" నని యేడ్వ మానినిఁ గని. 69

క. "సతి! సర్పదష్టుఁడై నీ
పతి వికృతాకృతిని నుండి ప్రదపడి ధరణీ
పతి యగు, నాతని నీవుఁ
గతిపయకాలమునఁ గనెదు కలఁగకు మమ్మా! 70

ఉ. కంటిమి మాతపోమహిమఁ; గావుత మంగళ మంచు వారు లా
వెంట నదృశ్యులై చనినఁ; విస్మయ మొందుచుఁ గల్లయో, కలన్
గంటినొ? నిక్కువంబొ! యని కామిని పోయి విడార మొక్కచో
మంటము జూచి, యందుఁ జోరనుండగఁ గాంచి తదీయు లాజనుల్,

సీ. ధూళిధూసరితకరాళకర్కశములై
చిక్కువారినకురుల్ నిక్కుదాని,
మలినార్ధవస్త్రంబు మైఁగప్పి, తూఁగుచు
నరుదెంచుజీర్ణదేహంబుదాని,
ధృషబుభుజాస్థిదర్శి లేమేనిఁ గానక
యున్మత్తవైఖరి నొప్పుదాని,
సతిఁ గనుగొని, పిశాచం బని కొందఱు
పాఱిరి; కొందఱు పజ్జఁజేరి.

తే. హాస్య మొనరించు, "చడవిలో నరఁయు దేమి
యబ్బసొమ్మని "నగిరి; యోయువ్వ! నీవు
వేల్ప వగు దని కొందఱు వెఱచి, భక్తి
వందనముఁ జేసి రాసార్థవాహు లంత. 72

క. దమయంతి వారలఁ గని
తమక ముడిగి, మదిని సమ్మదముఁ గని నే నా
విమలచరితు నలుభార్యను.
రమణుని జా డరయు చిటు లరణ్యముఁ బడితిఁ. 73

ఆ. తెలిసియున్న మీరు తెల్పుఁడు మన్నాథుఁ
డెచట నుండె? ననిన "నెఱుఁగ" మనఁగ;
నింతి మరల నారి "నెందేగెద"? రటన్న,
"నాసు బాహునగరి" కనిరివారు. 74

ఆ. "అయిన నేను నచటి కరుదెంతు" నని వారి
వెంటనంటి రమణి వెడలుచుండె,
మునిజనాళివాక్యములు మనంబున నాఁక.
సమ్మకమ్ముఁ గొలుప సమ్మదమున. 75

క. నడచు చిటు చనుచ, యొక్కెడ
విడిసెఁ దటాకంబుదరిని; వెలుఁగులఱేఁడున్
నడునెత్తి నిలిచి యుడు కిడఁ;
బడలిక లార్పంగ, క్షుత్పిపాసలఁ దీర్పన్ 76

ఉ. అట్టుల వార లాదివస మచ్చోడఁ నాగఁగ, నర్ధరాత్రి నీ
ర్వాట్టున, నత్తటాకమున వారిఁ గ్రహింపఁగ, దంతియూథముల్
బెట్టుగ వచ్చి, యవ్విడిది స్వేచ్ఛ జరించి, హడావుడిన్ బ్రజన్
వట్టి కలంచె, భీతియుతమానసులై జను లార్వ నెవ్వగన్. 77

క. ఈసంక్షోభమ్మం గని
వే సతి యడ్డంబురాఁగ, విడివడి గజముల్
బాసె నచోటు విడి; యూవలఁ
జేసిరి పయనంబు వారు చెలితో లలితోన్ 78

క. అంత సుబాహుపురిని దమ
యంతీసతి రాజవీధి నరుగుచునుండన్,
...ంతఃపుర సౌధంబున
మంతనమున నున్న రాజమాత కనుఁగొనెన్. 79

ప॥ 77 పా॥ 2 అ॥ 11- రిఁ; ప॥ 78 పా॥ 2 అ॥ 8- రాఁ; పా॥ 3 అ॥ 1- వా;
ప॥ 79 పా॥ 3 అ॥ 1- అ;

తే. మలినజీర్ణార్ధవస్త్రంబు మయిని దోఁప,
ధూళిధూసరితాలకజాల మూన
నమున నాఁడఁగఁ, గనులవిన్న నగ్రసింప,
నెడఁగుకై నడి దమయంతి నడచుచుండె. 80

ఉ. మాసినపేలికల్ వెలఁచుమానికమ్ముబలె, మబ్బులోపలన్
భాసిలుచంద్రరేఖవలె, భస్మము గప్పినవిప్పుతున్క యు
ల్లాసితపంకజేక్షణవరాంగము ధాత్రిపరాగసాంద్రమై
ధూసరితమ్ము నందెను విధుంతుదసంగ్రహచంద్రికై వడిన్. 81

క. తవకనుల, నూర్చుదమయం
తినిఁ గనుఁగొని రాజమాత నిర్వ్యాజపడి, దా
సినిఁ జీరి, "యామె నిటుతో
డ్కొని రమ్మని పంచె, మదినిఁ గుతుకము పేర్మిన్. 82

ఆ. అల్లవీధి నరుగు నాదమయంతిని
మెల్ల డాసి దాసి, యెల్ల వినిచి,
పిలిచి తెచ్చి ముందునిలిపిన, నారాణి
కనికరంబుఁ దోఁపఁగ ననియె నిటుల. 83

ఆ. "ఎవరిదాన వమ్మ? యిం దెట్లు వచ్చితి?
వెచటి కేగుచుంటి, వేల? పలుకు!
నిన్నుఁ గాంచినంత నెన రుద్భవించెను.
నెట్టిబాంధవంబొ యెఱుఁగ" ననఁగ? 84

ఆ. రాణి వీవు! పేదరాలను నే! నిట్టి
మనకు బాంధవంబె మాత? నాదు
భర్త విధివశమున భాగ్యవిహీనుఁడై
పడియె నడవి ధర్మబద్ధుఁ డగుచు. 85

ఆ. తోడునీడవోలె వీడక ప్రాణేశుఁ
పవిలియుంటి, విధివిధానమహిమఁ
బండియున్ననన్నుఁ బాసిపోవుటఁ జేసి
యతని నరయుపొంటె నరుగుచుంటి. 86

క. అని బాష్పంబులు దొరఁగఁగఁ
దనచెక్కుటఁ గరముఁ జేర్చి తలఁకి, కలికి రో
దనము సలుపఁగా, ననునయ
మున నిట్లనె రాజమాత పూర్ణప్రేమన్. 87

క. నాకడ నుండుము, నీపతి
నేకరణినినైనఁ దేర నే విప్రులనె
న్నోకడల రోయఁ బనిచెద;
శోకింపకు, మనిన భీమసుత సమ్మతితో. 88

క. కుడువను నెంగిలి; పరులకుఁ
గడుగ పదముఁ బరపురుషులఁ గని పలుకఁ; బతిన్
గడుకొని రోయు ద్విజులతో
నుడువుదు; సైరంధ్రి నగుదు; నోముదు దినముల్. 89

క. అన; నీయిష్టం బగుచో
ప్పున మును నాకడ నటంచుఁ, బొందుగ స్నేహం
బున రాజమాత నుడువం
గను, నట దమయంతి యాశ్రమముఁ జేకొనియెన్. 90

చ. అటవి నలుండు, బాసి దమయంతి నటన్, దనయంత నేగ, న
చ్చట మృగజాతిఁ గూల్చుచు, దిశావళు లంటుచు, నార్చి పేర్చుచున్
బెటపెటఁ జెట్టుగుట్టలను వ్రీల్చుచు వెల్గుదవాగ్ని మధ్య, న
న్నిటు దయచేసి రోము''మను నెగ్గు వినంబడ జాలినొందుచున్.

క. చని నలుఁ డచ్చోటికి వ (91
హ్నిని జొరఁబడి, దానినడుమ నిటికి వనమదీ
నుని, నాగకుమారునిఁ గనె;
వనె నెవ్వఁగ నమ్రుఁ డగుచు నతఁడు నలునితోన్. 92

క. అనఘా! నేఁ గర్కోటకుఁ
డనువాఁడను నాగసుతుఁడ; యతివరు మును దూ
షణఁజేసి కదలనేరక
వనరెదఁ దచ్ఛాపగతిని వహ్నివశుఁడనై. 93

క. కదలన్ గడుకొని, నాదెస
కడరెడుదావాగ్ని మ్రింద నడలెద; వెస నన్
గడుదయఁ గొనిచని సరసినిఁ
బడవేయుము నీకు బలుశుభంబగు ననినన్. 94

ఆ. దానిఁ బూని, సరసి దరిసిన, మఱిఁ బది
యడుగు లిడుమటన్న, నట్లె చేసె,
నంత వికృతరూపుఁ డయ్యెడునట్టు లా
పాము కఱచి నలునిఁ; బలుకు నిట్లు. 95

సీ. నలరాజ! నను వేఁడుఁదలఁపకు, తలఁకకు,
మెగ్గగు నిన్నోరు లెఱిఁగినఁనని,
వికృతుఁ జేసితిఁ గాన విష మెంతకాలంబు
నీశరీరమునందు నిలుచు, నంత
దాఁక దుష్టపిశాచ, దానవ, సర్ప, శా
త్రవ, భయంబులు రావు; రాజ్యలాభ
మును, సతీసుతలాభమును, యశోవైభవ
మలునుఁ గల్గెడు నీకు; వలసినపుడు

తే. తలఁప నను, బుత్తు నొక్క వస్త్రంబు, దానిఁ
దాల్ప, నిజరూప మబ్బు సిద్ధంబు నీకు;
పరఁగ ఋతుపర్ణుఁ గొల్వు, మవ్వానియక్ష
హృదయమును గొని, ప్రీతి యశ్వహృదయ మిమ్ము. 96

క. అని యతఁ డదృశ్యుఁడైనఁ;
తనమది విస్మయము నొంది, తరలి యయోధ్యే
శుని ఋతుపర్ణునిఁ గని, వం
దన మొనరించి పలికె నలుఁడు తనకార్యంబుల్.  97

ప॥ 96 పా॥ 11 అ॥ 1. (బ; ప॥ 97 పా॥ 2 అ॥ 1- ద; పా॥ 4 అ॥ 5- రిఁ;

ఆ. బాహుకుండ నశ్వపాకశాస్త్రంబుల
శిల్పకర్మమున, ననల్పకౌశ
లమ్ముఁ గలదు; సుజనసమ్మతు నినుఁ గొల్వ
వలఁతు ననఁగ, ఱేఁడు వల్లె యనియె.

తే. జేనియూనతి, వలల, వార్ష్ణేయు లనెడు
వారు సాయంబొనర్పఁగాఁ, బవలుజేలు
నేమరక తన గు ట్టెవ్వ రెఱుఁగనీక
సలుపుచుండెను బనులు ప్రచ్ఛన్నుఁ డగుచు.

తే. దినము లిట్లేగఁగా నొక్కదినమునందు
రాత్రి భార్యావియోగదుర్భరవిషాద
బాధ నలుఁ డార్తిఁ గలవరింపఁగఁ గాంచి
జీవలుఁ డనుధారుణీదేవుఁ డంత.

ఆ. ఈకురూపిఁ గూడునింతి యింకెట్టిదో?
యనుచు విస్మితాత్ముఁ డగుచు, దరిసి,
నెయ్యకాఁడ! నీకు నీభార్య కేఁ బాటు
గలిగెనేల? యన్న నులికి నలుఁడు.

క. ఈరూపునకుఁ గాంతయె?
మారునితాపంబె? సఖుఁడ! మనసగుటను, శృం
గారగ్రంథములోనిది,
నేరిచినది చెప్పినాఁడ నిద్దుర రామిన్.

ఆ. అనుచుఁ దన్నెఱుంగ నటుఁ బలె వర్తించె;
నట విదర్భపాలుఁ డైన భీముఁ,
డనుఁ గూఁదనయ వరయ నవనీసురలఁ బంపెఁ
గడగి యెల్లకడలఁ గలయఁదిరుగ. 103

క. అందు సుదేవుం డనుద్విజుఁ
డందందుఁ దిరిగి యరసి, యలసి, తుదిని నా
నందములరఁ జేదిపురి సు
నందనకడఁ గాంచె నొక్క నవలామణినిన్. 104

క. నీలాభ్రచ్ఛాదితశశి
వోలెన్ గుఱుతింప రాక పొల్పుఱుదానిన్
భ్రూలతిమధ్యస్థిత సు
శ్రీలక్షణ లగ్నసూక్ష్మచిహ్నితవదనన్. 105

క. సతి దమయంతిగఁ గని, యిది
పతివిరహిత యయ్యుఁ జెడదు పాతివ్రత్య
స్థితి నవ్వుగా! కులవనితకుఁ
బతిభక్తియె చాలు; నేలఁ బరభూషణముల్? 106

చ. అని తలపోసి, "నీపితరు లాత్మజు లెల్లరు సౌఖ్యసంగతిన్
మనెదరు; తండ్రి నిన్ వెదక మమ్ములఁ బంపఁగ వచ్చినార మో
తనయ! సుదేవుఁ డే ననఁ గఁ; దాగురుతించి నమస్కరించి మా
నిని తనవారినడ్గి; మది నెవ్వగ జేపఁగ నేడ్చె బోరునన్. 107

---

ప॥ 103 పా॥ 4 అ॥ 2 దఁ: అ॥ 11- యఁ; ప॥ 105 పా॥ 1 అ॥ 3- భ్రా;
ప॥ 106 పా॥ 4 అ॥ 9- ఒపర; ప॥ 107 పా॥ 4 అ॥ 14 రేఁపఁగ;

సీ. సైరంధ్రి యిటు లేఁడ్చు టారసి దూతిక,
యంతిపురంబున కరిగి, యద్ది
రాజమాతకు విన్న రయమున నాదేవి
వచ్చి సైరంధ్రియు బ్రాహ్మణుండుఁ
బలుకాడుచుండుటఁ దిలకించి విప్రితో:-
భూమీసురేంద్ర! యీ పుణ్యశీల
యెవ్వానిపుత్రిక? యెవ్వని భార్య? యే
కారణంబునఁ దనకాంతుఁ బాసి

తే. సలుపు నిత్యవ్రతంబు? నీ లలన నామ
ధేయ మెయ్యది? నీ వెట్లు తెలిసి తీమె?
నని యడుగ రాజమాతకు నాద్విజుండు
సంభ్రమోపేతుఁడై యిట్లు సరసఫణితి. 108

చ. తెలియ నలావనీరమణు దేవి, విదర్భపురేంద్రపుత్రి యీ
చెలి దమయంతి, దైవగతిఁ జేడ్పడి రాజ్యముఁ, గ్రుమ్మరిల్లు నా
నలుసిపిఁజుంద నేగె సుతి, నా విని. రోయఁగఁ బంచెఁ దండ్రి వి
ప్రులను; సుదేవుఁ డేన సతిఁ బుణ్యవశంబునఁ గంటి నిమ్మెయిన్. 109

శా. భ్రూమధ్యంబునఁ బద్మరేఖ సతి కొప్పారన్ సూక్ష్మరూపంబునన్
శ్రీమాన్యంబది ధాతనిర్మితము; గుర్తింపంగ నేఁ గంటి నాన్;
ఆమాటల్ విని రాణి, పాంసుపిహితంబై యున్న యాకామినీ
భ్రూమధ్యంబును నీటిచేఁ గడుగఁగా రూపొందె చిహ్నం బటన్, 110

ఉ. అంతట రాజమాత దమయంతిని, గౌఁగిటఁ గ్రుచ్చి, మోహసం
భ్రాంతిని "నాసహోదరికుమారివి; పుత్రివి నాకు; తల్లినీ
కెంతటియాపదల్ గలిగె; నిప్పటి కీసిరిఁగంటి! నోము లే
నెంతగ నోఁచియుంటినొకదే?" యని యార్చుచుఁ జార్చె నశ్రులన్

తే. అంత దమయంతి, మ్రొక్కఁగా, నానునంద
కూఁతుఁ గౌఁగిటఁ జేర్చి, సంప్రీతి మెఱయ
సత్కరింపఁగఁ గొన్నాళ్ళచట నసించి,
వెడలె దమయంతి కనఁదన పితలసుతుల! 112

క. మణిమయరథమున నాసతి
చని, జననిని, జనకు, నాత్మజనుల, సుతుసుతన్,
గని, మోదమొంది, వారికిఁ
గనుపండువుసేసె నీమె కనె మఱి జనినాన్. 113

ఉ. తల్లినిఁ దండ్రిఁ జేరియును దన్వి నిజేశునకై వ్రతంబు సం
ధిల్లగ సల్పుచున్, సతము దేహసుఖంబులు వాసి, గాత్రమం
దల్ల దుమారమంట, మలి నార్ద్రదుకూలముఁ దాల్చి, నాథుపై
నుల్లము నిల్పి, సుంతయును నూరటఁగానక యల్లతల్లితో..114

తే. పతివియోగంబుకంటెను సతికి లేదు
దుర్భరం బగుదుఃఖంబుఁ! దోన నాథుఁ
గనక యసువులు నిలువవు; ఘనుని నలునిఁ,
బుణ్యపురుషుని వెదకఁ బంపుమ! యటన్న,- 115

ప॥ 111 పా॥ 2 అ॥ 19- ఁద; ప॥ 112 పా॥ 2 అ॥ 3- గౌఁగిటఁ;
ప॥ 114 పా॥ 4 అ॥ 12- ఋ; ప॥ 119 పా॥ 1 అ॥ 4- నేనునయోదఁ.

క. గూఁతు మనోభీష్టం బా
మాత పితకుఁ దెలిపె; నంత క్ష్మాపతి ద్విజసం
ఘాతమును నియోగింపఁగఁ,
బ్రీతిన్ దమయంతి వారి వీక్షించి తగన్. 116

సీ. అనిమషేశ్వరుం డసమర్థుఁడిపు డౌట
నన్ను లెఱుఁగరాక యడఁగియుండుఁ;
గనుక నాయీసభలను జొచ్చి “నలుఁ డెట్టి
సత్యనిరతుఁడొకొ? సతిని నట్టు
వంచించి యద్దాని వస్త్రార్ధముఁ జించి
నిదురించునబలను నదయవృత్తిఁ
బాసెను కానలో!” భార్యభర్తృవ్యా
బడుధర్మ మెఱుఁగఁడో? పాపియొకొ?

ఆ. ఘనుఁడు మీరు; దాని నాలించి సడికోడి
ప్రతివచన మెవండు పలుకు, నతఁడె
నలుఁడు సుండు! నన్ను దెలిపి వేదోక్తుండు
రాకయున్నఁ దెలిసి రండు! పొండు!! 117

క. అని వినిచి పనిచి నంతనఁ,
జని సభలం జొచ్చియట్లె సలుపుచుఁ బ్రతివా
క్కును గనక మరలి వచ్చిన
జనులన్ బర్ణాదుఁ డనెడు క్ష్మాసురుఁ డంతన్. 118

సీ. అతిన! నేఁ నయోధ్యకరిగి నీకఱపిన
సరణి మైఁ బుతుపర్ణు సభను బలుకఁ
గుఱుచచేతులవాఁడు గొఱుసు మేన్ గలవాఁడు
బాహుకుం డనుపేరు వాఁడు తేని,
బానసీఁడఁట, యశ్వపాలకుండఁట, శీఘ్రి
యానకౌశలుఁడు, నున్నట్టులుండి
మోము వెల్వెలఁ బోవ మునుకొని నిట్టూర్పు
లొలయు నవ్వుచు సభఁ గలయఁగాంచి
తే. ప్రియునిదోసము లున్న సైరించి మదిని
భర్తృభక్తిని, నెమ్మని బాయనట్టి
రమణి పొందును లోకాంతరమునభర్త
తోడ భోగము" లని, సభ వీడిచనియె. 119

క. అన; దమయంతి యొకించుక
మనమున యోచించి "యిట్టు మా తిమనె నలా
వనిపతికాఁ కని, కైకొని
జననిపనుపుఁ, బిల్వఁబంచి సరగను దేవున్. 120

చ. కని వచియించు "నాదునను గన్గొని తెచ్చినయట్టు లానలా
వనిపతిఁ దెమ్ము భూసుర! యపారదయాపర! నీ వయోధ్యకున్
జను మని తా, రహస్యముగ సంగతు లెవ్వియొ వించి మ్రొక్క, దీ
వన లిడి, కార్యసిద్ధిఁ గని వచ్చెద నోడకు మంచుఁ జెచ్చెరన్ .121

క. చని ద్విజుఁ డయోధ్యఁ గట సభ
జనపతి ఋతుపర్ణుఁ గాంచి సత్కారములన్
గొని, నలుసతి దమయంతి క
గును జేప్ర స్వయంవరంబు కువలయనాథా! 122

సీ. విను! విదర్భేశుండు భీముండు, నలు రోయఁ
బంచి యెందెందును బడయలేక,
తరుణి పునస్స్వయంవరమును జాటించె;
వసుధేశు లెల్లరు వచ్చువారు,
నీకు విన్న నృపుండు నియమింప వచ్చితి;
నెల్లి యేయది, యెటులేగు?" దనిన;
విస్మితి బాహుకు వీక్షించి ఋతుపర్ణుఁ
డను "వేడబం బిది కనఁగ నల్తు,

తే. రాత్రియగునంత కటకుఁ జేరంగ రథముఁ
బరపి నీయశ్వనిపుణత నెఱపి నేఁడు
మాకుఁ జూపఁగఁ దఱియిది నీ" కటన్న
నరిగి యాతఁడు రథము నాయత్తపరచి. 123

చ. కలఁగి యెడంద విన్నన ముఖంబునఁ దోఁపఁగ, భార్యదుర్ణయం
బలజడి నింప, నశ్రుపులనార్చుచు" నూర్చుచు, భావిజీవిత
ప్రళయము నాఁదపించి, తనబాధ బయల్ వడనీక బాహుకుం
డలఁగక తేరు తెచ్చె, నది యారసి తేఁడు రథాధిరూఢుఁడై. 124

ప॥ 122 పా॥ 4 అ॥ 3- తేఁపు; ప॥ 123 పా॥ 10 అ॥ 22- ఱ;
ప॥ 123 పా॥ 4 అ॥ 14- ఱ;

క. కన వార్ష్ణేయుని, నాతం
డును నెక్కఁగ; నెక్కె నలుఁడు నొగ; గుఱ్ఱములన్
గని "బక్క విప్పి దప్పు లఁ
గొనిపోవునె మఱి?" మ్మటన్న కువలయపతితోఁ. 125

క. అను బాహుకుఁ "డీహరులు బ
వనగతిఁ జనుఁ; బ్రొద్దు గ్రుంకునడకమునుప యే
గును సుమి, విదర్భ" కన; నేఁ
గనియెద నీయశ్వహృదయకౌశల మనుచున్. 126

క. జనపతి ఫలోక్తి నాడఁగఁ
గను మని బాహుకుఁడు లాగి కళ్ళెము, సెలగో
లును జూపి, యదలుపంగాఁ
జనెఁ బవనగతిన్ హయములు సలుపుచు హేషల్. 127

ఆ. వె. కడఁగి తెప్పపాటు కాలంబులోఁ గడు
దవ్వుతావు లల్ల దరియవచ్చుఁ;
దక్షిణంబ యవ్వి దవ్వయి తొలఁగును
కనులఁ గానరాక నణఁగి నట్లు. 128

క. తిలకించియది, "యితఁడు మా
తలియొ, యనూరుండొ, నలుఁడొ, తక్కొరుఁడు హయం
బుల నిటు జవముమీఱఁ గు
పలయుమునన్ దోలనేర్చువాఁడున్ గలఁడే?" 129

ప॥ 125 పా॥ 4 అ॥ 3. పో: అ॥ 10- ఁగు; ప॥ 127 పా॥ 4 అ॥ 7- తిన్; ప॥ 128 పా॥ 3 అ॥ 2- క్షు; ప॥ 129 పా॥ 3 అ॥ 4- ట్లు; పా॥ 4 అ॥ 1. వ అ॥ 11- వాఁ

ఆ. అనుచు విస్మయాత్ముఁ డగుతేనిభుజ మాను
వస్త్ర మట్టె వసుధఁ బడిన, రథము
వేగ మాపుమింత యేగి వార్ష్ణేయుండు
వడిగఁ దెచ్చెఁ బడినవస్త్రమనుచు. 130

క. ఱేఁ డన, నవ్వుచు బాహుకుఁ
డాడెను "వస్త్రంబు జాఱి యామడకడ చెన్
గూడు నదె ట్లని మఱినా
జాడఁ గలవిభీతకమును క్ష్మాపతి కనుచున్. 131

ఆ. "అంద ఱన్నివిద్య లరసియుండరు, భిన్న
భిన్నవిషయములెల్లఁ బ్రాజ్ఞజనము,
లే నెఱుంగనేర్తు నీక్షణమాత్రాన
వస్తుసంఖ్య లెంతవానినైన. 132

క. కల యీవిభీతకమ్మున
ఫలవర్ణములెల్ల, వేలుపండ్రెండును, నా
వలతొంబదియా ఱనియున,
నలుఁ డయ్యవి యెంచిచూచినన్ సరిపోయెన్. 133

క. మది నచ్చెరువడి బాహుకుఁ
డిది నా కిడు మనిన, నక్షహృదయము సుమ్మీ
య్యదియని విధ్యుక్తముగా
నదియిచ్చె, గ్రహించి పిదప నతఁ డానృపుతో- 134

ఆ. ఉరగ విద్యఁ గొనఁగ నొప్పదు కావున
నిచ్చెదఁ బ్రీతిగ నశ్వహృదయవిద్యఁ
గొను మటన్న ఱేఁడు "కొనెద నావలసిన
తఱిని, యంతదాఁకఁ దాల్చు" మనియె. 135

ఆ. అశ్వహృదయమహిమ నప్పుడు కర్కోటక
విషముఁ గ్రక్కికొనుచు వెడలి నలుని
మొదలు వీడి, కేలు ముడిచి మ్రొక్కిడి కలి
తను నెఱుంగఁ జెప్పఁ గనలి నలుఁడు. 136

క. తను శపియింపఁగఁ బూనఁగఁ
గని కలి "యహివిషముచేతఁ గ్రాఁగితిఁ గడు నే
నినుఁ బొందుట నింకేటికి
ననుఁ గినియకు మహాత్మ! యేల్కొనఁగదె కరుణన్. 137

ఉ. నిన్నుఁ దలంచువారలను నేఁ జెనకన్ గరుణింపు మన్న నై
చెన్నలుఁ, డాక్షణంబ కలి చేరెను తద్ద్రుమమందు; నంత నా
చెన్ను దురూపుఁ దక్క, విడిచెన్ నలుఁ గష్టము లావిభీతకం
బన్నఁగ నప్రశస్తముగ నేర్పడె నాఁటనుగోలె నేఁటికిన్. 138

క. ఆమీఁదట వార్ష్ణేయున్
భూమీశు ఋతుపర్ణుఁ గూడి పోయి నలుం డా
భీముపురిఁ జేర, నాతఁడు
ప్రేమ నెదుర్కొనుచు వారి విడిదులఁ జేర్చెన్. 139

తే. పురి స్వయంవరసంరంభ మరయరాక,
నచ్చెడునృపాళిఁ గనక, విభ్రాంతు లగుచుఁ
బాలుపోవక సంగతి వారు ముగురు
విసిగి డోలాయమానమానసులు నైరి. 149

చ. అరయ మనోవిభుణ్, దహతహణ్ బడుచిత్తము నొత్తలేక త
త్తరమున భీమపుత్రి, తనదాసినిఁ గేశినిఁ బిల్చి "యేఁగి నీ
వరయుము బాహుకాఖ్యః మన మంపినబ్రాహ్మణుమాట కాసభాం
తరమున మారునల్కిన యతండొకొ, యీ పెచ్చెడి నుల్లనూ డెసణ్.

క. ధీచతుర వీవ, చెలి! నీ
వాచోమహిమమున వాని పలుకుల, నడలం
దాచూకిఁ దెలిసి ర, మ్మా
లోచించెద మాతఁ డానలుండో? కాదో? 142

క. అనుపలుకులు విని కేశిని
సని, కని, దరిఁజేరి: సరస సరణిసిఁ, "బే రే"
మన, "బాహుకుఁ డ" ని యతఁ డన,
విని నగి సతి "పేరో? యినొకపిచ్చిరియో" యనినణ్. 143

క. వెలవెలవో నాతఁడు, చెలి
తిలకించుచు "నీవు వచ్చితే పేరాసణ్
నలురాణి వరింపఁగ, నన
నిలువున నీ లగుచు నలుఁడు నెలఁతణ్ గనుచుణ్. 144

పః 140 పాః 4 అః 11- సు: పః 142 పాః 2 అః 2- చా;

క. చెన్నగు స్వయంవరార్థప్రుఁ
జిన్నలె లే; వేల నృపులు" జేర రన, నలుం
డున్నాఁడే, మఱి తదితర
సన్నాహము లేల, యెట్టిశంకలిఁ కేలా

క, మిన్నుక్ మన్ను నెఱుఁగవో?
ని న్నెఱుఁగవో? పాడి నెఱుఁగ నేరవో? సాధ్వీక్
ము న్నెఱుఁగవో? నలుసతి కగు
చున్నస్వయంవర మెఱుంగవో? యలికిపడెదవో?

ఆ. బానసీఁడవంట బాహుకా! యీస్వయం
వరమునకు నికేల వచ్చినావు?
మగువమరులో? కడుపుమమకారమో? లేక
తెలివి ముదిరి పిచ్చివనుబడితో?

క. అన, బాహుకుఁ "దుస్సరు" మని,
కని కేశిని "నేఁడు గోరఁగలుగుట, శతయో
జనదూరము రథ మొకదిన
మునఁ జేరఁగఁ దెచ్చినాఁడ! ఔ, యదియుండెక్

క. అతివా! నలు దేవి పతి
వ్రతయని మును విందు, నేఁడు పాడిఁదొఱఁగి యీ
గతి వరియించునె పతిసైఁ
బతి? ననఁ గేశిని వచించు బాహుకుఁ గనుచున్.

పు॥ 145 పా॥ 2 అ॥ 10. చే; పు॥ 146 పా॥ 4 అ॥ 9- ఱుఁగ;
పు॥ 147 పా॥ 1 అ॥ 10- క; పా॥ 4 అ॥ 8- పలను;

వ. అనయతఁ, గట్టుపుట్టమున, నర్ధముఁ జించి గ్రహించి, కానలోఁ
బవలఁగ, ఘూర్ణిఘూసరముపై కొన, నేలను బన్వళించుచుఁ
వదనము వాడ్వాడఁ, జటలువాఱఁ గురుల్, గడుసాధ్వివృత్తినై
సుదతి వ్రతంబుపట్టు నలుఁ జూడఁ దపించుచు నిష్ఠతోఁ జనఁ. 150

ఆ. ఉబుకుశోక మాఁపనోపక, కన్నీటి
కణము లురల నిడుచు గండయుగళిఁ;
దెఱవ తెలియు నంచు దిగులున నలుఁ డొండు
వలను సూచుచుండెఁ దలను వంచి. 151

క. పరికించి దాని "నలుఁ డెం
దరిగెనొ, యెఱుఁగుదు వె" యనిన. "నలుఁ డొక్కండా
పరమాత్ముం డొకఁ డెఱుఁగును
దరుణీ! యాగుట్టు నెఱుఁగఁ దరమె యొరులకుఁ?" 152

సీ. అనినంత పని నిల్చి యాతఁ "డుష్షని" యూఁద
నుదయించి యగ్నియుఱ్ఱూఁతలూఁగె;
శూన్యకుంభముల నంజుళ్లకెత్తినఁ దోడ
నక్షయవారి ప్రత్యక్షమయ్యె;
వంటకట్టెలనందు గెంటక పొయి మండె;
నార్పెడు నందాక నప్పు లెసఁగె;
నతనిహస్తముల మర్దితగంధకుసుమముల్
గందియుఁ దొల్లింటి కంపు లీనె;

తే. అతనివిధః మతిమానుష; మపగతప్రి
యాస, మశ్రుతపూర్వంబ, యదియదృష్ట,
పదియ పరమార్థ; మతఁడు వే ల్పగు నటంచు
యింతిగ్రహియించి, యేగె శుద్ధాంతమునకు, 153

క. చని దమయంతినిఁ గని, కత
వినిపింప, స్వయంవరమున వేల్పులు తననా
ఘున కిడు వరములకు నిద
ర్శన మిది యని, పతి యతఁ డని సతి మదిఁ దలఁచెన్. 154

సీ. నంజుళ్లు తెప్పించి నాతి యాస్వాదించి,
విని బాహుకునిరూపు గుణగణములఁ;
దనసుద్ది వినుట మోమున మూఁడుచిన్నెలు,
నతఁ డన్నపలుకులు నడిగి తెలిసి;
పాముచేఁ గఱవఁగఁబడి విరూపము నొందె
నలుఁ డన్నమునుల పల్కులఁ దలంచి,
నగురీతి, మోమున్నవగ, మేనిగతి, దాసి
తెలుపఁ గన్గొని లోఁ దలఁచి తెలిసి;

తే. కడకుఁ గొడుకును నాతని కడకుఁ దోడి
కొనియరుగఁ గేశినికిఁ జెప్పి పనిచి; యాఁగి
యాడు మనసునుఁ గట్టంగఁ దాఁడుఁ గనక
గడియ యుగముగ దమయంతి కడపుచుండె. 155

తే. దాసి యాసుతుతో నలుఁ దరియ, నాతఁ
డక్కుమారునిఁ గని ప్రేమ నాఁపలేక
హర్షపులకితగాత్రుఁడై యక్కటియెత్తి
ముద్దులాడెను కన్నీట మోముఁదడిపి. 156

క. కని "యాగడ మిదియే" మన,
వనితనుఁ గని యతఁడు తెచ్చెనడి, నాసుతుఁ డి
ట్లనె యుంట, వీనిఁ గని నా
మన సీడ్చె, క్షమింపుమ"న, బొమల్ ముడినిడుచున్. 157

క. "ఈపుట్టునకును సుతుఁడా?
యేపడఁతి వరించెనిను, న దింకెట్టిదియో?
తేఁపట మాదమయంతిని
నాపత్నియటంచుఁ జట్టనన్ బట్టెనో?" నాన్. 158

తే. అలిగెనో? తన్నుఁ దెలిసెనో? యనుచుఁ దలఁకి
యులికిపడి, కేశినినిఁ గని "నలునిజాడ
లరసితిరె?" యన్న, నురగంబు గఱచ వికృత
రూపమున నున్న నలుఁ డెట్లు చూపుఁదగులు?" 159

క. అనవిని, విననటు లాయమఁ
గని, కాల్ నిలవోక్క యింట? గడిచు యుదుంగ; వే
పని పర పురుషులతో? మా
నిని! నీ మర్యాదరీతినే తెలియవుపో! 160

క. నలుఁ డిటులను, "నరసితి నీ
కలమర్యాదక్రమంబుఁ; గాలగతి మెయిన్
"పులి పిల్లి, పిల్లి పులియగు;"
నెల వీఁక" నని సుతునితోడఁ జెలి వీడ్కొనియెన్. 161

మ. అది మెల్లన్ దమయంతి, దాసి తెలుపన్ హర్షించి, యాతండు మత్
హృదయేశుండని నిర్ధరించి, పితకీవృత్తాంతమున్ జెప్ప, నా
బిసవన్ బిల్చును భీమరాజు సలుపన్, వేంచేసి శుద్ధాంతమున్
గదిసెన్, గాంచెను జిత్రిదృశ్యమును దిగ్భ్రాంతాత్ముఁడై నిల్చుచున్.

క. చిక్కిన మెయిఁ, జింపివలువ, (162
నిక్కిన వెండ్రుకలు, నీరునిండిన కనులన్
వెక్కసపడు నొకకామినిఁ
దక్కెవ్వరు లేకయుంటఁ దాఁగని నొకచోన్, 163

ఆ. కాంచఁ గాంచఁ సతినిఁ గన్నీరతనికాఁడె,
సతియుఁ దోడ మేనిస్మృతిని వీడె;
నోర్చి పల్కరింప నుంకింపఁ గంఠంబు
రుద్ధమయ్యెఁ గొంతిపొద్దుదాఁక. 164

ఆ. తన్వి తేరి, "విధివిధానంబునన్ గొన్న
అర్ధదేహ, నబల నడవినొంటి
గెంటి చనెడుభర్తఁ గంటిమే, నిర్దయా
త్ముని భీమపుత్రి పతినిఁ దక్క? 165

ఆ. సురలఁ ద్రోసి తన్ను వరియింపనే! యేమి
సలిపినానొ యెగ్గు పలుకవలదె?
తన్ను బోలుఘనుఁడు దారను బాయ స
త్కర్మ మగునె, లోకధర్మ మగునె?" 166

క. అని తను నెపమిడి పలికెడు
వనితను గని శోకవివృతవదనుండై "మా
నిని! కలిపీడితమతి నయి
నిను విడి యడవులనుబడితి, నెగులఁ జొగిలితిన్. 167

క. అలిగినఁ, బతి తనుఁ ద్రోలఁగినఁ,
గలకుమరుని నైన, నున్న కాంతుని నైనన్
దలఁపక, యన్యాపేక్షణ
సలుపంగా ధర్మమగునె సాధ్వీల?" కనినన్. 168

సీ. చెలి కృతాంజలియయి నిలిచి "పర్ణాదుఁడన్
బ్రాహ్మణు నిన్ రోయఁబంప నతఁడు,
పరఁగ నయోధ్యా సభాస్థానమున, నేను
గఱపినట్టుల నాడఁ గలఁగి, ప్రతిగ
నీపల్కులు విన్న నేనుఁ దండ్రియుఁ జేరి
నిన్ను రప్పింప నీనెపము వెట్టి
భూమీసురు సుదేవుఁ బుత్తెంచితిమి, స్వయం
వర మెల్లియని ఋతుపర్ణుఁబిలువ;

తే. నలుఁడు గాకున్న శతయోజనములు రథము
దినమునన్ గడపితేఁ డని తెలిసి, నిన్ను
నిటకు రప్పింప విధిలేక నిట్టి ఘోర
పాపపుం వార్తఁ గల్పింప వలసె నాథ! 169

ఉ. ఇంతకుమించు నే యఘము నేఁ గన నీపదమాన, దీన నే
నుంతయుసత్య మున్నయెడ,సూర్యుఁడు, చంద్రుఁడు, దిక్పతుల్ సురల్
పంతముతోడ న న్నిటులె భస్మమొనర్తురుగాక! యన్న, స
ర్వాంతరభూతుఁడై పరఁగు పావనుఁ డాపవమానుఁ డంతటన్. 170

ఉ. మిన్నునఁ బల్కె "నీసతి యమేయగుణాఢ్య! సుశీల; దీని, సం
పన్నత మూఁడువర్షములు బాయకసూర్యుఁడు, జంద్రుఁ డేనునున్
బన్నుగ వేఁచి కాచితిమి; భావ్యము గా దిటువల్క; దోసమం
చెన్నక స్వీకరింపు మికఁ నీదమయంతి నలావనీపతీ!"- 171

క. సురలంబరమున నుండియె
కురిసిరి సుమవృష్టి; కర్ణకుహరము లోలయన్
మొరసెను దుందుభు, లంతటఁ
గరము మనానందమొందఁ గాడుపు వీచెన్. 172

క. నలుఁడంతటఁ గర్కోటకుఁ
దలఁచుడు వస్త్రంబు వచ్చె, దానిని మేనన్
బొలుపుగఁ దాల్పఁగ నాతఁడు
తొలిరూపము మొలిచినట్లు దోఁచెన్ దోడన్. 173

ప॥ 171 పా॥ 2 అ॥ 10 పా: అ॥ 21 నున; పా॥ 3 అ 4 వే; పా॥ 4 అ॥ 9 మిఁకఁ
ప॥ 173 పా॥ 4 అ॥ 7– లః

చ. దినమణి డిగ్గె ధాత్రికను దిగ్భ్రమ నెల్లను జేరి రయ్యెడన్;
గనిఋతుపర్ణుఁ డానలుని కాళుల వ్రాలె క్షమింపు మంచు; న
ల్లునిఁ గని భీముఁ డుబ్బుమదిలోఁగొని కౌఁగిటఁ దార్చెఁ; గాంత వం
దన మొనరించి నాథునకు, నందను నందన నిచ్చె నెత్తికోన్.
క. సతితో సుతుతో సుతతో
హిత బాంధవవితతిఁ దనిపె నిష్టాగోష్ఠిన్;
హితమార నలమహీపతి
ఋతుపర్ణున కిచ్చె నశ్వహృదయము; పిదపన్. 175
ఉ. ఆపురినుండికొంతవడి, కాతతసైన్యసమేతుఁ డాత్మసై
యేపు సెలంగఁగా నిషధ కేగి కనుంగొని పుష్కరున్ "దగన్
నీపయి నెత్తివచ్చితి, ననిన్ బడు" మన్న, "నధర్మమానునీ
కీపని; యోడి జూదమున నీధర బల్మిఁ గొనంగఁ జూచితే! 176
క. వా దుడుగు, నీవు నాతో
జూదంబిపు డాడి గెల్చి క్షోణిస్థలి నా
మీఁదటఁ గొనఁ దగుఁగా, కిది
కా" దను పుష్కరున కపుడు కడఁక నలుఁడనున్, 177
క. "కానిమ్ము జూద మాడఁగఁ
బూను" మనఁగ, "నిడెద రాజ్యమును బణముగ నే;
దేనిన్ బ్రతి యొడ్డెదొ? నీ
మానిని దమయంతి తక్క మఱిగతి గలదే?" 178

క. మును గెలుపుఁ దలఁచి యిప్పుడా
వనితఁ గెలువంగ నెంచి వాఁ డిటు లాడన్
మన సింతనొచ్చి "దుర్మతి!
కను నాదమయంతిఁ బణముఁ గా నొడ్డితి నే: 179

ఉ. ఆను" మటన్న, నిర్వురును నాడిరి, దైవవిలాసవైఖరిన్
ఓడెను పుష్కరుండు, నలుఁ డుర్వర గెల్చి "కలిప్రమత్తతన్.
ఓడితి నేను నాఁడు; మది నోడకు నాకు భ్రాతృవ్యపుత్రుఁడై
నాఁడవు గాన సైచితి మనంబునఁ; బొ" మ్మనిపంచెఁబుష్కరున్

క. తొల్లిటి ధరణీరాజ్యము
నెల్లన్ గొని నలుఁడు గీర్తి నెసఁగె; నలుల నే
కొల్లగొని శత్రువుల నీ
వెల్ల ధరాతలముఁ గొనెదు కృష్ణునిదయతో. 181

తే. భక్తి నీకథ విన్నను బఠనసేయ
నగును శుభములుఁ; గర్కోటకాహిని మఱి
నలుని దమయంతి ఋతుపర్ణుఁ దలఁచు నేనిఁ
గలిభయమునుండి తొలఁగు నిక్కంబు నరుఁడు." 182

క, అను చిటువలె బృహదశ్వుఁడు
వినిచె శమన జునకుఁ గరుణ పెంపున మఱియున్
మనసొప్పి యశ్వహృదయముఁ
గాన నుపదేశించి చనియెఁ గురుకులముఖ్యా! 183

క. అని చెప్పిన వైశంపా
యను జనమేజయుఁడు గాంచి యతిహర్షితుఁడై
వినయమున వేఁడఁ, జెప్పం
గను దొరకొనె ముందుఁగలుగు కత కుతుకమునన్. 184

♦ ధర్మజుని తీర్థయాత్రా విశేషములు. ♦

ఉ. ఆవిధి నర్జునుండు దివిజాధిపుపీటను నుండఁగా, నిలన్
వావిరి ధర్మజుం డతనివార్త నెఱుంగక చింతనుండె; నా
దేవపురంబునుండి యరుదేర మహాత్ముఁడు రోమశుండు, సం
భావనతో నెదుర్కొనుచు మౌనినిఁ దెచ్చి యుధిష్ఠిరుం డొగిన్.

తే. ఆసనము నిచ్చి; యర్ఘ్యపాద్యాదివిధులు
దీర్చ; సంతుష్టుఁడై మౌని దేవనగరి
నుండివచ్చుటఁ, బార్థుఁ డందుంట, దేవ
విభునిసత్కృతి నాతఁడు వెలయుచుంట. 186

చ. తపమునకాత్మ మెచ్చి, తగ దర్శన మిచ్చి యుమేశుఁ డెంతయున్
గృప మది హెచ్చి. పాశుపత మిచ్చుటయున్, సురరాజు పుత్రుపై
జపలత, గద్దెపై సగముస్థానమునన్ దనతోడ నిల్పి, మే
లుపకృతిఁ జేయుటన్ వినిచి యొయ్యన నామునిచంద్రుఁ డంతటన్.

చ. అసురులతోడియుద్ధమునకై దివిజేంద్రుఁడు, తన్నుఁ గోరుటన్
మసలె నటన్ గిరీటి సురనాయకుఁ డర్మిలిఁ దీర్థయాత్రికున్
వెస నినుఁ బోవ, నీజతను వెళ్ళగ నన్నును జెప్పె. నింక నీ
వ్యసనము మాను; దిగ్విజయ మయ్యెడుగావుత! మీకు నంచనన్,

క. నయకుశలము; పాశుపతము
హరుఁ డొసఁగుట, నిష్టసిద్ధి యగుట; నసుజ్జ్వ
సురవిభుఁడు దీర్థయాత్రికు
నరుగ నిడుట; మీరు ధౌమ్యునయి వచ్చుటయున్- 189

తే. తెలిపి, నాచెవి నమృతంబుఁ జిలికి; మదికి
మోదమునుగూర్చి; ప్రాణంబు వోసి నన్ను
గాచి ప్రోచితి రవ్యాజ కరుణఁ జేసి.
వరదయాసాంద్ర! మునికులవార్ధిచంద్ర! 190

క. శిరమున వహించితిని సుర
వరునానతి; మున్నె నేను వాంఛించితి నా
కరణి, యిపుడు సిద్ధించెను,
హరికరుణ" నటంచుఁ దీర్థయాత్రకుఁ గడఁగెన్. 191

ఉ. రోమశధౌమ్యులున్ ద్విజవరుల్ ప్రియసోదరులెల్ల వెంటరా
నా మెయిఁ దీర్థసేవకుఁ బ్రయాణముఁగట్టి క్రమక్రమంబుగా
భూమినిఁ జుట్టుచేగి, యమపుత్రుఁ డగస్త్య మునీంద్రునాశ్రమా
రామముఁ జేర, మౌని వివరంబుగఁ దెల్పెను దన్మహాత్మ్యమున్. 192

సీ. పరఁగ నగస్త్యుండు వాతాపి యనుదైత్యుఁ
బొట్టలోఁ బెట్టుకొన్నట్టి కథను;
నతఁడు లోపాముద్ర యనుతన్విఁ బెండ్లాడి,
యామెకోర్కెను దీర్చినట్టివిధము;

వృత్రుఁ జంపఁగ, సురల్ వేఁడ, దధీచి నె
న్నెముక నిచ్చినయట్టిక్రమ; మగస్త్యు
నడుగు ద్రేటున వింధ్య యడఁగుట; ముని వార్ధి
నసురులకై గ్రోలినదియు; సగర
తే. సుతులచరితంబుఁ; గపిలునిచూడ్కి వారు
బూడిదగుట; భగీరథుపూన్కి వలన
దేవవాహిని భువి కరుదెంచు టాది
వినిచె రోమశుఁ డాయమతనయుఁ డడుగ. 193
తే. ఒగిని దీర్థంబులాడి విధ్యుక్తదాన
ధర్మపితృతర్పణంబులఁదనర జరిపి:
స్థలమహాత్మ్యంబుఁ దత్కథల్ తెలియ రోమ
శుండు వల్కఁగ, యమనందనుండు వినుచు,- 194
సీ. ఋష్యశృంగానది కేగి విధుల సల్పి,
ఋష్యశృంగుని కథారీతిఁ దెలిసి,
కౌశికహ్రదమునఁ గడఁగి స్నానముఁ దీర్చి,
గంగాంబురాశిసంగమము నరసి,
అబ్ధిచెంతనఁ గళింగాఖ్యదేశముఁ గాంచి,
వైతరణిని స్నానవిధులఁ జేసి,
పరఁగఁ జేరి మహేంద్రపర్వతం, బలకశ్య
పునివృత్త మాద్యంతమును నెఱింగి,

తే. యేచుపితృస్మృతి కల్గి ముయ్యేడుమార్లు
క్షత్రియుల హత్తి సివమెత్తి సంహరించి
తనిసి తద్రక్తమునఁ బితృతర్పణంబు
పరశురాముండు సలిపిన భాతినడిగి. 196

శ్రీశనిపరశురాము దక్షిణగంగఁ జేరి,
స్నాన మొనరించి ద్రవిళదేశంబుఁ జొచ్చి,
తర లిపోయి యగస్త్యతీర్థంబు నాడి,
సంబరమునఁ బ్రభాసతీర్థంబుఁ డాయ,- 196

క. అది యెఱిఁగి రామకృష్ణులు
గదిసి సుఖం బరసి, నరుని కథ విని, మిగులన్
ముదితులయి వీడుకొని, రా
పినప యుధిష్ఠిరుఁడు ముందు వెడలెన్ గడఁకన్.

సీ. అతిశయసోమమిశ్రితతోయ యగుబయో
ష్ణిని గృతస్నాతులై తనిసి; గయుని
చరింతబు; శర్యాతిధరణీశసుతసుకా
ఖ్యను, జ్యవనాఖ్యసంయమివివాహ
మాడి, యాశ్వినుల నాయమిపేర్మి సోమపీ
థులఁ జేయుటయు, దాని కలుగు వజి
పై నగ్గిముని వేల్చ, దానవుఁడటఁ బుట్టి
మానియానతి నింద్రుపైనఁ బడఁగ,

ప॥ 196 పా॥ 1 అ॥ 1- యేఁ: ప॥ 198 పా॥ 6 అ॥ 10- అ:
ప॥ 198 పా॥ 7 అ॥ 2- నల్లి: అ॥ 14- ట్టి:

తే. వెఱచి సురపతి యాయమిమఱుఁగుఁ బొరఁగ
చ్యవనుఁ డాయిందు్రి క్షమియించు టాదిగాఁగఁ
జెప్పఁ ముని, విని పయనంబుఁ జేసె ధర్మ
జుండు యమునానదికి; రోమశుండు పిదప.— 198

సీ. జనపతి మాంధాతృచరితంబు వినిపించి,
కడఁగి సోమకనృపుకథ నచించి,
యంబరీషునిగాథ లం బల్కి, నహుషునా
ఖ్యాయికఁ జెప్పి; విఖ్యాతుఁడౌ య
యాతివృత్తాంతంబు; నాశిబి మేని కం
డను జెక్కి సురల కిడిన విధంబు,
పూజ్యా వష్టావక్రి పూర్వోత్తర చరిత్రి;
ముని యవక్రీతుఁడు ఘనతపంబు

తే. వలనఁ బొండితివడసి, గర్వమునఁ జేసి
ముని పరావసుసతిఁ గృష్ణయనెడు సాధ్విఁ
బట్టి, రైభ్యుని నిజకోపవహ్ని జన్య
శక్తి నాతఁడు సచ్చిన సరణి నెల్ల- 199

క. వినుప, విని ఘవిస్తరమ్ముగఁ
గని మోదము ధర్మజుండుఁ గడుకొని వడిగా
సను దెంచి గంధమాదన
మనుగిరిఁ దనవారితోడ నధిరోహించెన్. 200

శా. ఆకాశంబును దాఁకునంతపొడవై యల్లంత విస్తారమై
నీరక్ వృక్షలతానికుంజమయమై భీభత్సమై. కూ్రరస
త్వాకీర్ణంబయి; సజ్ఝరీకుహరమై యచ్ఛచ్ఛిలోపేతమై,
శ్రీకాలోయల వింత వెల్గులిడుచున్ శోభిల్లె శైలంబొగిన్ - 201.

సీ. ప్రళయవీచిక లనఁ బఱతెంచి గాడ్పులు
గండశైలముల వృక్షములఁ గూల్చె;
పాంశుపటలిదిశా వలయము నలమెను;
గాటుక మొగిళులు క్రమ్ముకొనియె;
కాఱు చీకట్లు కన్గవఁ గ్రమ్మెఁ; మింటఁ బెన్
మెఱుములు నుఱుములు మెఱసె మొరసె;
పిడుగుల వ్రేటులఁ బీటగిల్లెను గిరుల్;
కడలి ఘూర్ణిల్లెను; బుడమి వడఁకె;

తే. ఘటములను గుమ్మరించిన కరణిఁ బెద్ద
పెట్టునన్ గురిసె వర్షమ్ము, మిట్టతగ్గు
దారి దరి దిక్కుఁ దెలియక తడవి తడవి
తత్తరిల్లిరి పాండవుల్ తద్దయలసి- 202

క. మించిన నల్లన నడుగుల
నుంచుచు, నవి మాయ నొదిగియుండుచు; దారిన్
గాంచ నవస్థలఁబడి వా
రించు కొనుచుఁ ద్రోవఁ బడిన వృక్షప్రతతిన్. 203

పa 201 పాa 2 అa 15- ఖీ: పa 202 పాa 5 అa 1- గా:
పa 202 పాa 5 అa 3- చీఁ: పాa 7 అa 1- బి; పాa 10 అa 3. వఁగురిసె;

క. నడుకుచు జడిఁదడియుటచే
నొడళులుఁ దడబడఁగఁ గాళు లొరగుచు, లేవన్
గడఁగుచుఁ, బెదవులుఁ బండ్లున్
విడక పరిభ్రమణ మొంద వడకుచు లిడుచున్. 204

క. జార్చుచు; నొండొరుఁ బాయుచుఁ
జేరుచుఁ; దడిపిండి, కట్టుచీరల మేనన్
దారుచుచుఁ, బిడికరంబులఁ
గూరిచి యెదఁ జేర్చి మెల్లఁ గునుకల నిడుచున్. 205

తే. అలసి; రటఁ గృష్ణగతిఁ గని యనుసుతుండు
డెందమున నొచ్చి తా వాయునందనుఁ గని
"కంటె, కోమలి యడుగిడఁగాకపడెడు
కష్ట" మన నాయుజుఁడు ఘటోత్కచుఁ దలంచె. 206

తే. గగన పథగామియయి వచ్చి కాంచి పితల,
నలరి దండప్రణాంబు లాచరించె;
వానిఁ గౌఁగిటఁ జేర్చి పవనసుతుండు
కృష్ణ వైపున తన కేలు నెత్తి చూపి- 207

తే. "కంటె; నీజనయిత్రి యీాకటికటాల
నడవనేరక యలజడిఁబడెడు; నీమె
నెత్తికొని నీవు మాచెంత నరుగుదేరు"
మన, జనకుఁ గాంచి తనయుండు వినయగరిమ- 208

తే. కర్కశోపలసునిశితకంటకమగు
నీయరణ్యము; మీరును నేఁగఁజాల,
రలసితిరి చాల; నిదె యుండుఁడంచు నాత్మ
బలగమును జీర రాక్షసప్రతతి వచ్చె. 209

తే. ద్రౌపదినిఁ బాండవుల ధౌమ్యుఁ దాల్చి భీమ
పుత్రుఁ; డాతక్క వారినిమూఁపులందు
నసురమూఁకలు కొని, సని రభ్రవీధి;
సిద్ధగతి నేగె రోమశ సిద్ధయోగి 210

సీ. చనివియన్నది డాసి స్నానాదికముఁ దీర్చి
లలి నరనారాయణులకు మ్రొక్కి,
నేత్రపర్వంబుగా నెలకొనుమాధుర్య
ఫలపల్లవంబుల వెలుఁగుచున్న
బదరీవనమునఁ దపం బాచరించెడు
మునివర్యులను గాంచి మ్రొక్కి, వారి
సేవించి మైనాకశిఖరంబు దర్శించి
మొగి బిందుసరసిలో మున్కవెట్టి

తే. ఫలరసముఁ గ్రోలి, జాహ్నవీసలిల మాని,
తరులనీడల, గుహల, లతాగృహములఁ
బండి పరవశులయి శుకప్రతతిగీతి
వీనులకు విందొనర్పఁగ విడిసి రచట—

క. అని వినిచిన వైశంపా
యనుఁగని జనమేజయుండు హర్షముతోడన్
వినమిత శిరుఁడై చెప్పం
గను వేఁడెను ముందు నడచు కత కుతుకమునన్ 212

ఆ. మునిమనోబ్జభృంగ! ఘననీల రుచిరాంగ
సదమలాంతరంగ! సాధుసంగ!
రాయదుర్గ వాస! రాకేందు సంకాశ!
విబుధవ్రాన్ని వేశ! వేంకటేశ!

అరణ్యపర్వము ద్వితీయాశ్వాసము సమాప్తము.

శ్రీ! శ్రీ! శ్రీ!



# అశ్వత్థభారతము.

## అరణ్యపర్వము తృతీయాశ్వాసము.



క. శ్రీదయితా! త్రిదశార్చిత-
పాదా! శ్రితవరద! ధర్మపథ సంచరణా!
వేదవినోదన! దుర్జన
భేదన! శ్రీగాయదుర్గ వేంకటరమణా!! 1

క. మునిపతి వైశంపాయనుఁ
డని జనమేజయుని తోడ నాకొంతెయుల్
ఘనగంధమాద నమ్మున
ననువొప్పఁగ విడిసి మిగుల ననుమోదమునన్- 2

-: భీముఁడు సౌగంధికములను దెచ్చుట :-

తే. ఆఱునాళ్లట నుండఁగా నంతనొక్క-
నాఁడు పాంచాలి భీముండు గూడి శైల-
సానుఘనరత్నవేదిక సరసగోష్ఠి
మైమఱచియుండ నాశ్చర్యమై కనంగ 3

తే. వాయువశమున ధర వ్రాలిపడి సహస్ర
పత్రికమలంబొకటి వారిపజ్జఁజేర;
నెమ్మిఁ గైకొని తత్కమనీయ తతును
ననపసౌరభమునకును నలరిమిగుల- 4

ఉ. భీమునిఁ గాంచి ద్రౌపది "నవీన, మమోఘ, మపూర్వసౌరభం
బై మహనీయరమ్యతరమైనిది, నందనవాటిపుష్పమే
మో, మదిఁ గోరె నీవిరుల మొత్తము నాముడి నత్తనొత్తఁగాఁ
బ్రేమ తలిర్పఁ దీర్పఁగదె ప్రీతి నటంచని కృష్ణపల్కనన్ - 5

క. రామా! యిటుగా రామా?
లేమా! సతికోర్కెఁ దీర్పలేమా? యిదిపో
రామా? మారామా? ఓ
శ్యామా! మాప్రేమ సంశయమ? తేలేమా! 6

క. వని గదఁ గొని సౌరభ్యమువ
లను గొని చని సింహగర్జలను సలుపుచుఁ ద్రో
వను బడెడుమృగములను గొని
సనువనమృగములను మొత్తి సంపుచుఁ గడఁకన్. 7

సీ. విజయాట్టహాసంబు వెలరారఁ బదతలి
ఘట్టించు భూమి యిట్టట్టుగాఁగన్
కన్నుఁ లెఱుపువాఱఁ గను మృగంబులుపాఱ,
బొబ్బరించును దిశల్ ప్రబ్బికొనఁగ,

---

పll 5 పాll 4 అll 1- ఁబ్రే: పll 7 పాll 1 అll 1- అ: అll 10- వ;
పll 8 పాll 3 అll 1- ఁగ:

మైనాకునిఁ బోలి తనుమడితనము మీఱఁ
దాఁకి శైలములఁ దత్తరిలఁజేయు,
దాక్షాయిణి ఖేచరభుజంగ సురనాథు
లను గంధరములఁ దాఁటఁగ నొనర్చు,
తే. వేగభరమున శిఖరముల్ ప్రీఁగి భూమిఁ
ద్రెళ్ళ గడఁ ద్రిప్పు మిగులనుద్దిక్కుఁ డగుచు;
లంఘన లొనర్చుఁ జెంగున లావు మెఱసి,
చీఱు దిక్కరికర్ణముల్ చెవుడువాఱ. 8
క. ఆనమున శ్రీరాముని
ధ్యానంబున నిల్పి యోగపదవిఁ గొనినయా
పావని యగుహనుమం డీ
రావముచే ధృతి చలించి తాఁపడి; పిదపన్- 9
ఉ. అల్లనవిచ్చి కన్గని, దిశాళిఁ గన్గొని, యార్చి యూఁదలన్
"జెల్లరె! నాఁటిమాఁదలము నేతలసింహ నినాదముల్ బలెన్
జెల్లెను ద్వాపరంబున! విచిత్రముపో! నడుఁ బెట్టివాఁడొ? నేఁ
దెల్లముఁగాఁగఁ గాంచనల దే? యదియెల్ల నటంచు మెల్లనన్. 10
ఉ. పండినవాఁడు పండినటె వాలము సాఁచెను, తోఁకలోసెపెన్
గొండలఁ జెట్టుగుట్టలను గూల్చి పెళిల్లుపెళిల్లుమంచు వే
తొండొకప్రక్క కొత్తు చది యొక్కటసాగె యథేచ్ఛగాను; భీ
ముండట వచ్చి కాంచె తినముందట దారినిఁబడ్డవాలమున్. 11

పం॥ 8 పా॥ 2 అ॥ 9- జీ: పా॥ 5 అ॥ 12- ప్రీఁ; పా॥ 7 అ॥ 7- ర్చుఁ
ప॥ 11 పా॥ 1 అ॥ 18- ద్రో: పా॥ 3 అ॥ 14- సాఁ; పా॥ 4 అ॥ 10- ఁద;

క. దారిం బడి యొక శైలా
కారంబున నడ్డగించు నావాలంబున్
మారుతి కని యచ్చెరువునఁ
బాఱించెన్ దృష్టి దానిపాఱ మెఱుంగన్ 13

క. ఎందాఁక దృష్టి యేగునొ,
యందాకనుఁ; జూఁచెఁ జుట్టుప్రక్కం గందని దగుచున్
ముందున్ వెనుకన్ మీఁదన్
గ్రింద నదియె యుంటఁ దానిరీక్షించి భ్రమన్— 13

చ. ఇది యొకతోఁక యౌరవుర! యెట్టిదొ యీమృగ మద్భుతంబు! నే
నది కనిగాని ముం దరుగ నంచని వాలముతోఁ గ్రినఁ బట్టి తాఁ
బదములఁ బెట్టుచున్ జని యపారము దూరము పోయి కన్గొనెన్
ముదిసి పరున్న యొక్క కపి ముఖ్యుని యోగనిమగ్నమూర్తిఁ దాన్

ఆ. "పిట్ట చిన్న కూఁత పెద్దది" యనుభాతి 14
మృగముకంటె వాలమే ఘనమ్ము;
వింతకోఁతి దీని వీక్షించితినొకింత,
యింకబల్కరించి యేగుదునని— 15

ఆ. పాండునందనుండు పరువడిఁ గపివీరు
నల్లనల్ల దరియ నరిగి యట్టె
చెంతఁ జేరి చెవిని సింహగర్జనఁ జేసె
నంతఁ గన్నువిచ్చి హనుమ చూచి— 16

ఆ. "ముదిమి రుజల నలసి నిదురించుమముఁబోలు
వానరములజోలి నలసె నేల?
కడఁకమీఱ గుండె నడఁకంగ నీలీల
సింహగర్జనలను జేయ మేలె? 17

ఆ. వేదమృగముపట్ల ప్రియబుద్ధి లేదేమి
నరుల? కీ వెవండొ? వెఱవ కేల
నేగుదెంచినావొ? యిద్దినిర్మానుష్య
మగును సుమ్ము! కార్యమట్టి దేమొ?" 18

క. అన, "క్షత్త్రియుఁడను, పాండవుఁ
డను, గుంతీగర్భజాతుఁడన్, వాయ్వంశన్
జనియించినాఁడ, భీముఁడ!
వనచరవర! భూరిబాహుబల సంయుతుఁడన్- 19

తే. ఏను గార్యార్థినై యిట్టు లేగుచుంటి!
దారి కడ్డముకొండయట్లార సాపి
పండితే శ్రమ కా నిట్లు పాంథతతికిఁ?
ముడిచికొమ్మింక నీతోఁక, ముదుసవేని- 20

క. తొలిహనుమఁడు శతయోజన
ములవిస్తారముగ వెలయు మున్నీటిని నా
వలదాఁటి నటుల నీగిరి
లలి లంఘించెదను చూడు లావు మెఱయఁగన్"- 21

క. అనునాభీముని మాటకు
మనమున హర్షించి నవ్వి, మారుతి "హనుమం
డను కపి యేల శరధిదాఁ
టెను దెలుపుదే?" యనిన నడిమిడి ముదం బొదవన్. 22

క. "కపినట్టె, యెఱుఁగవటె, యా
కపికుల తిలకుని పవిత్రగాథలఁ? దొల్లిన్
నృపదశరథసుతు శ్రీరా
ముపడఁతి యన్వేషణార్థముగఁ గపివీరుల్- 23

క. సుగ్రీవునాజ్ఞఁ బోయి యు
దగ్రాంబుధి దాఁటలేక తహతహఁ బడఁగన్
నిగ్రహమున లంఘించి ద
శగ్రీవుని వీడుఁ జేరి సామీరి తగన్- 24

క. రామునిసతి సీతకు శ్రీ
రామునికుశలంబుఁ దెల్పి, రామామణి సు
క్షేమముఁ దెల్పెను రామ
స్వామికి, లంఘించి వచ్చి శరనిధిని మఱిన్- 25

తే. ఆహనుమయంత బలశాలి నగుదు, నరయ
నిరువురము వాయుదేవుని వరమువలన
జనన మొందుట నాయగ్రజన్ముఁ డాతఁ
డన్యో; వీక్షింతె నాశక్తి?" యనిన; హనుమ- 26

తే. ముసలి నేను కదల నసమర్థుఁడను, నీవె
తొలఁగఁ ద్రోసి తోఁకఁ; ద్రోవఁ గానుచు
నరుగు'' మనిన, వామకరముచే భీముండు
వాల మెత్తఁ బోయి వశముగాక- 37

ఉ. రెండుకరంబులన్ గడఁగి తేఁగినకన్నుల రక్తమూడ, రు
ద్రుండయి మోకరిల్లఁబడి రోషము పైకొనఁ మైచమర్పఁగాఁ
గాండొకసేపుఁ బెన్గె; నది కొంచముఁగూడ చలింపకున్న ఖి
న్నుండయి గర్వమూడి, మది నూల్కొన దిగ్భ్రమ లేచినిల్చుచున్

క. "సామాన్యవానరుఁడవై
నామద మడఁగించి తీవు! నాకేశుండేన్
నాముందాఁగఁడు; నీనిజ
నామాదులఁ దెల్పు! మిదె వినతిఁ గొను'' మనినన్- 29

క. నీసెప్పినట్టిహనుమఁడఁ,
గేసరిమారుతుల సుతుఁడఁ, గీశాధీశుం
డౌ సుగ్రీవుని సచివుఁడ.
శ్రీసీతారామపాద సేవారతుఁడన్- 30

క. తమ్ముఁడ! రా ర''మ్మని తా
నెమ్మినిఁ గౌఁగిటనుగ్రిచ్చ, నెఱిఁజాఁగి వ్రీణా
మమ్ములిడు తమ్ము నెత్తఁగ;
నమ్మారుతిఁ గాంచి భీముఁ డత్యాదరతన్- 31

ప॥ 28 పా॥ 1 అ॥ 13 రే; పా॥ 2 అ॥ 5 మోఁకరిల్లి; అ 18 చె; పా॥ 3 అ॥ 13 చె;
ప॥ 31 పా॥ 4 అ॥ 8- భీ:

ఉ. నిండినభక్తిఁ గేల్మోగిచి నిల్చి "కపుంగడుధన్యుఁడైతిపో
పండెను నాతపఃఫలము; పావని! నాఁడు ధరాసుతార్థమై
నిండుమహార్ణవం బెలమి నీ వెటుదాఁటితో? నాఁటిరూపుఁ గన్
పాఁడువుగాఁగ" జూపు నిజభ్రాతృసమాదరబుద్ధిఁ నంచనన్. 32

తే. కాలమునుబట్టి గుణధర్మగతులు మాఱుఁ;
దనరఁ గృతయుగరూప మీద్వాపరమునఁ
జూప నెట్లగు? నేఁడు నే నోపినంత
చూపెదను వీఁక నీవది చూతుగాక!" 33

క. అంతట హనుమంతుం డిం
తింతై, మఱి యంతకంత యినుమడియై; య
ల్లంతై, యంతకు నంతై
వింతగ దివిభువుల కొక్కవిధముగఁ బెఱిగెన్. 34

మ. వరుసన్ ఛత్రమునై, శిరోభరణమై, ఫాలాంకమై హారమై
కరసూత్రమ్మయి, కట్యలంకరణమై, కాలందెయై, పాదుకా
వరమై తోఁపఁగ భానుమండలము, సంవర్ధిల్లుచున్ జూడ్కికిన్
భరమై పొల్చెఁ ద్రివిక్రమాకృతిని విశ్వంబెల్ల నిండారుచున్. 35

క. ఆరూపుఁ గని ముదశ్రులు
జారఁగఁ; బులకింప మేను, స్మయమతి యగుచున్
గూరినభక్తిని గాద్గది
కారావముతో నుతించె నతఁ డాహనుమన్- 36

ప॥ 32 పా॥ 4 అ॥ 18- ద్ధిఁ: ప॥ 34 పా॥ 4 అ॥ 17- ఱి;
ప॥ 35 పా॥ 1 అ॥ 8- నై: ప॥ 36 పా॥ 2 అ॥ 2- ఱ;

ఆ. అంత హరిస్వరూప మంది యాహనుమంతు
"పోయి కార్యసిద్ధిఁ బొందిరమ్ము!
నిన్ను నిర్మలాత్మ నిగ్రహానుగ్రహ
శక్తుఁ గంటిఁ గొంటి; సమ్ముదమ్ము. 37

క. లలిఁ బార్థు రథధ్వజమున
నిలిచి రణాగ్రంబునందు నీవిక్రమముల్
దిలకింతు; మీకు జయమును
గలిగించెదఁ దిగిచి నేఁ బగతులబలంబుల్". 38

క. అని యంతర్ధానం బా
హనుమంతుఁడు గా; విస్మయాత్ముఁడయి భీముఁడు తా
ఘనుఁ దనమదిధ్యానించుచుఁ
జనె నా సౌరభము వచ్చు జాడల్ గొనుచుల్. 29

క. ద్విగుణీకృతహర్షము మది
నిగుడఁగఁ జను చందునందు నిలిచి తదీయం
బగు ప్రకృతిఁ గని యలరుచు స
రగఁ జేరెను రజత భూధర ప్రాంతమ్ముల్. 40

క. తా వడివడిఁ జను చోఁ జోఁ
బావని సౌగంధికాబ్జవనమును గని లోఁ
బోవంగా నుంకింపఁగఁ;
నావనపాలకసమూహ మతనిఁ దడయుచుల్. 41

ఉ. "భూరిబలాఢ్యుఁడై ఖరినిఁ బోల్చె దుసగ్రి గదాధరుండవై
వీరగభీరరౌద్రి రసవిశ్రుత మాముఖభానుమండలం
బౌర! నరుండ వీవ, యిది యక్షకులేశువిహారవాటి, యిం
దేరుఁ జొరంగ రా; దిచటి కేవిధివచ్చితొ. చోద్యమయ్యెడిన్ 42

సీ. అలకాధినాథుఁడీ యెలదోఁట సరసిలో
సతిఁగూడి జలకేళి సలుపుచుండు;
నీదివ్యవనములో నా దేవకన్యకల్
నిచ్చలు విహరింతు రెచ్చుతమిని;
నీవాటిక మునీంద్రు లేప్రొద్దు కాపుండి
దేవతార్చనవిధుల్ దీర్చువార;
లీనీళు లమృతోపమానముల్ దేవతా
సేవ్యముల్ తదితరాసేవ్యములగు;

తే. నమలవైడూర్యనాళంబు లత్యపూర్వ
సౌరభాన్వితములు స్వర్ణసారసములు
గలుగుటంజేసి యక్షరాక్షసులచేత
రక్షితంబగు నిది యహరహము మిగుల- 43

క. నీ వెవ్వఁ డింతసాహస
మేవిధి సల్పితివి? కార్య మేమియొ? వెస నీ
తావుఁ దొలఁగ మేల్ నీ కగు"
నావుడు నప్పాండవుండు నయ మారంగన్- 44

ఉ. "పాండునృపాత్మజాతుఁడను బాహుపరాక్రమ విక్రముండ, భీ
ముం డనువాఁడ, రాజకులపూజ్యుఁడు ధర్మతనూజు పెద్ద త
మ్ముండను, మత్ప్రియేష్టపరిపూర్తికి, స్వర్ణసుగంధకంజముల్
పండుట వెండికొండదరి వ్రాలితి వాని గ్రహించువాంఛతో". 42

క. అనఁ "గౌంతేయులు బుధజన
వినుతులు భుజవీర్యులనఁగ విందుము; యక్షే
శుని వేఁడి యీసరోజము
లను గాను" మన, వారి నట్టె లక్షించి వెసన్— 46

క. గిరులన్ ఝరులన్ బుట్టిన
సరసులు నిజమునకు సర్వసామాన్యము, లో
క్కరిస్వత్వము లే? యిది మీ
దొరయక్షేశ్వరుఁడు గానెనె తోలినే? సెప్పుఁడా! 47

తే. కామితార్థము భుజబలక్రమము మెఱయ
నార్జనముఁ జేసి యాప్తుల కర్థిజనుల
కిచ్చి తనకీర్తి దిశ వెలయించుఁగాక.
యొరుని యాచించునే క్షత్రియోత్తముండు? 48

ఉ. చాఁచఁ గరంబు మీకు గ్రహచారమె మాకు, త్రిలోచనుండు నే
నేచిన మాన నాపనిని, కృష్ణయుధిష్ఠిరులాన నంచు సం
శోచములేక వీఁకను వృకోదరుఁ డెత్తెఱఁ జొచ్చి యావనిన్
బూచిన హేమకంజములఁ బూని సరోవరనీర మానినన్. 49

క. కని యసురులు బదివేవురు
గినియుచు నొకమొయినిఁదాఁకఁ గీల్కొల్పి కదం
బున గదను, ద్రిప్పికొనుచును
దనుజసమూహమునఁ జొచ్చె దర్పంబెసఁగన్. 50

ఉ. హుమ్మని హుంకరించి గద నూఁచిన యూఁకున సోఁకుసూఁక నా
క్కుమ్మడి వేవురన్ జదిమె; నుద్ధృతి లంఘనముల్ పొనర్చి పా
దమ్ముల వేవురన్ దునుమెఁ, దార్కొని పెట్టిబిగ్రుద్ధ్రవేటులన్
గిమ్మనసీక వే, యమునిగీమున కంపెను నిల్చువారలన్. 51

తే. దాన నొకరిద్దఱెట్టులో తప్పివచ్చి,
యంత వృత్తాంతమును విన్న, యక్షునాథు
నాప్తమిత్రుఁడు మణిమంతుఁ డనెడియసుర
యుద్ధసన్నద్ధుఁడై పైకి నుఱుక రాఁగ- 52

ఉ. భీకరసింహగర్జనలు వీను లఁగల్ప నొనర్చి, భీముఁ డు
ద్రేకముతోడఁ బూని గదఁదెవ్వన నామణిమంతుపై నికిన్
దూఁక, నుదగ్రుఁడై యసుర దోర్బలమొప్పఁగ నల్గులేయుచున్
దాఁకెను; వార లొండొరులు దర్ప మెలర్పఁగఁ బోరి రుద్ధతిన్. 53

క. ఆరీతి వారు మీఱుచు
హాహాహాకారిగను బోర, నురవడి భీముం
డారాక్షసు ప్రాణంబుల
వారించెను దనువు నెత్తివై చిధరిత్రిన్- 54

ప॥ 50 పా॥ 4 అ॥ 2- ను; ప॥ 51 పా॥ 1 అ॥ 15- యూఁ; ·
ప॥ 52 పా॥ 4 అ॥ 4- న్న; ప॥ 53 పా॥ 1 అ॥ 6 హ;

చ. ఇటు యమనందనుండను, సతి కృష్ణ వచింపఁగ భీమసాహసో
త్కటవిధ మాలకించి, విడిధామ్యుని ద్రౌపదిఁ బర్ణశాల; నొ
క్కటఁ గొని వెంటజంటలఁ జటాచకఁ గానలఁ జుట్టిరాంచె ధూ
ర్జటివలె రౌద్రమూర్తియయి సంగరమందున నొప్పభీముని౯. 55

క. మారుతి బారిని జారిన
వారలు చని వినుప, యక్షపతి విస్మితుఁడై
బోరన వచ్చెను తనపరి
వారముతో భీముఁ జూడ వాత్సల్యమున౯- 56

ఉ. వచ్చుకుబేరుఁ డాయసమబాహుబలాఢ్యుని భీముఁ గౌఁగిట౯
గ్రుచ్చె; యుధిష్ఠిరుండు గని మ్రొక్కఁ, గుబేరుఁడు భీముశౌర్యము౯
మెచ్చుచు "నాకుఁ దెల్పకయె మేకొని రా మణిమంతునాజిలో
వ్రచ్చె; నగస్త్యశాపగతి వాఁ డటు చచ్చెను వాయుపుత్రుచే౯. 57

క. ధర్మాత్ముల మిము నిందు్రఁడు
ధర్ముఁడు దయఁబ్రోచువారు దద్దయు; నటులే
[illegible] నేనును గాచెద;
[illegible]కై వీడుకొందు నని తా నేగె౯. 58

తే. ధర్మజుఁడు సోదరులతోడఁ దరలి, నిజని
వాసము౯ జేరె; గాడుపుపట్టి లేని
యదనున జటాసురుండునా యసుర; కృష్ణ
ధర్మజాదుల మ్మూపునఁ దాల్చి బలిమి- 59

క. ఎత్తుకొని శీఘ్రగతిని వి
యత్తల మార్గమున కుఱుక నఱచిరి వారల్;
కుత్తుక సారము( దెలిసి జవ
మెత్తు చు( బఱ తెంచి భీము( డీక్షించి తగన్— 60

తే. "జార! వంచక! మత్సోదరాళి నాయు
ధముల కెడబాపి కొనిపోవ(దల(తె; వారి
వీడి భూమికి డిగి యుద్ధ మాడ రమ్ము
వినువవా, వచ్చె గద, ప్రాణ ముడుపు నిదిగొ" 61

క. అని గిరగిర గద(ద్రిప్ప న
వని కుఱికి భుజాననున్న వారల విడి యా
దనుజు(డు భీముని పై( బడె
నని(బడి రిరువురును భూమి యదుర నఱచుచున్ 62

ఉ. తే(కువమీఱనిర్వురును దీకొని పోరుచు; మేను లొండొరుల్
నూకుచుమూల్గుచున్ విడకనూల్కొని మార్కొని డీల నిచ్చుచున్
వీ(కను ముష్టిపెట్టు లిడి విక్రమ మొప్ప(గ( బట్టులూ(ది యా
క్రాకను దిక్కరీంద్రములు తాపడ( బోరి రుదగ్రమూర్తులై, 63

తే. అంత వడముడి రక్కసు నదిమి బాహు
పాశముల( జుట్టి పెనచి, యావేళ మెత్తి
యసువు లూడంగ మేనిని( బిసిగి పిసిగి
పీన్గుగా( జేసి పడవైచె( బృథ్వియదర. 64

తే. ఆర్ష్టిషేణాశ్రమంబున కనుజుఁ గూడి
ధర్మజుఁడు కవల్ద్రౌపది ధౌమ్యరోమ
శాదిజనములతోఁ బోయి, యందు బన్న
శాలలోఁ గాపురంబుండె సమ్మదమున- 65

-:అర్జునుఁడు సోదరులకు కాలకేయులను జయించిన విధముఁ జెప్పుట:-

ఉ. ఆనరుఁ డేగి వత్సరము లైదు గతించె నుమేశు సత్కృపన్
బూనిక దివ్యపాశుపతముం గొనె నంచు సురాధినాథుచే
మానితుఁడయ్యెనంచు విని మామది పొంగెడు నైన నింతకున్
గానము; ప్రాణమైన నరుఁ గానక సైఁపఁగఁ జాలమంచునున్ 66

క. కలఁగుచుఁ బాండుసుతులు నరుఁ
దలపోయుచు నుండ నభ్ర తలి వెల్వడి, మా
తలి కడపరథ మొకఁడు భూ
స్థలికిన్ డిగె నందునుండి సంభ్రమ మొప్పన్- 76

తే. ఇంద్రనిభతేజుఁ డర్జునుఁ డట్లు డిగ్గి
మునుల కగ్రజులకు మ్రొక్కి తనకు మ్రొక్కు
కవల ద్రౌపదిఁ బ్రియమారఁ గౌఁగిలించి
యను నయాలాపములచేతఁ దనిపెవారి. 68

తే. మాతలికి ధర్మసుతుఁడు సన్మానవిధుల
జరుప, నాతండు సంతోష భరితుఁ డగుచు
వారివీడ్కొని రథమున వాయువీథి
నరిగె నమరావతినిఁ జేర సరభసమున- 69

వ॥ 65 పా॥ 2 అ॥ 5- కవల్: అ॥ 12- మ్య: పా॥ 3 అ॥ 12- దుఁ;
పా॥ 4 అ॥ 4- గాఁపు;

క. రవి యస్తమింప నాపాం
డవులెల్లరు నిద్రలోఁ గడపి రాత్రిన్;
రవి యొడమ సరసగోష్ఠిన్
దవులుచు వారుండ దివిజ నాథుం డంతన్- 70

తే. సపరివారంబుగా వారిసరసఁ దోఁచి
పూజలనుగొని యాధర్మపుత్త్రుఁ గాంచి;
పజ్జ వినమితుఁడై యున్న పార్థుఁ జూపి
సారగంభీరమృదునచోదార లోలయు- 71

మ. "పడసెన్ బాశుపతాస్త్రదివ్యశరమున్ ఫాలాక్షుచే; మెచ్చి నే
నిడితిన్ శస్త్రమహాస్త్రముల్ మిగులఁగా; నేకంబులై లోకముల్
పడినన్ దోలు నితండు; శత్రువితతిన్ భస్మంబుగావించి యీ
పుడమిన్ బట్టము నీకుగట్టున్నృప! నీపున్నెంబు సామాన్యమే?72

క. మాకును మాసురకోటికిఁ
దాఁకంగా రానియట్టి దర్పితదైత్యా
నీకము నివాతకవచా
నేకంబును గూల్చి మాకు నెమ్మి ఘటించెన్. 73

సీ. అంతు గాననియట్టి యబ్ధిలోఁ బురములు
నిర్మించుకొని యందు నెగడుచుండి,
తఱిఁ జూచి సురపురిఁ దాఁకి విక్రమమున
బిట్టుగాఁ గష్టముల్ పెట్టువారు,

శరధిమధ్యమునుండి పురములతోఁగూడ
నెగసియభ్రమునందు నిలుచువార
లటమాయమై, మేఘపటలంబునన్ దాఁగి
ఘోరశస్త్రాస్త్రముల్ గుప్పువారు,
తే. పౌరిని మాయావులై మించి భువిని, దివినిఁ
గలుగు ఘనులను, మునులను గాసివఱుపఁ
దోఁచకుంటిమి; నీతమ్ముఁడేచి, మమ్ముఁ
గాచెఁ; దీర్పమె మీయుపకార భరముఁ 74

క. అనిపాండవులన్ బొగడుచుఁ
ఘనీదీవ నలిచ్చి యామఘవుఁడు ముదమునన్''
మునిగోమతుఁ గొని వెంబడి,
సనెఁ బుష్పక మెక్కి దివిజ సంఘము గొలువన్ 75

క. సురపతి చన, యమసూనుఁడు
నరు నడుగఁగ, వివరముగను నడచిన కథ సో
దరులు దదితర జనంబులు
పరమా నందమున వినఁగఁ బార్థుఁడు ప్రీతిన్:- 76

క. "నా మెయిఁ గల భూషణములు
నీమణి బొమడికము. గొనయ మీకవచము నా
నామహితాస్త్రములను సు
త్రాముఁడు నాకిచ్చి పంపె రాక్షసతతిపై 77

క. తనదాల్చు కిరీటం బిడి,
తనుతనువునఁ దొడుగునగలఁ దద్దయుఁ గృపఁ దా
నె నిలిచి తొడుగఁగ, బుష్పక
మును మాతలి నడప ననికిఁ బోయితి ననుచున్- 79

చ. వరుసమహాస్త్రశస్త్రముల వానిప్రయోగము, వానిసంహృతిన్
బరునడి చెప్పి చూపెఁ, గనిపాండవులెంతయు మెచ్చఁ, గాంచిరన్
గెలుపక, క్రుచ్చిక్రుచ్చి విని కృష్ణధనుంజయు మెచ్చి హెచ్చు సం
బరమున మేనెఱుంగనటు వర్తిల భీముఁడు నవ్వెఁ బక్కునన్-79

తే. ఇట్టు లవ్వారు హర్ష సంభృతులు నగుచు
నందు గొన్నాళ్లు నివసించి, యచోటు వాసి
పోయి బదరీవనపవిత్ర భూమిఁ జొచ్చి
వెడలి హిమవన్నగంబున విడిసి రంత. 80

* భీముఁడజగరము చేఁబట్టువడుట; నహుష ప్రశ్నల
ధర్మజుఁడు త్తరించుట- *

క. పొందుగ వారలు వత్సర
మందుండఁగ నొక్కదివస మనిలజుఁ డందున్
గందోయిఁ బడకయుండిన
సందేహముతోడ ధర్మసంభవు డంతన్- 81

తే. భీము వెదకుచు నా వనభూమిఁ దిరుగఁ
బాముచే నొక్కచోఁ జుట్టునడి తొలంప
సాహసముఁ జేసి, తన శక్తి చాలకునికి
రావడి తలంకుతమ్ము దుర్గతినిఁ గాంచె. 82

క. తెలియఁగఁ బదివేలేన్గుల
బల మొప్పెడివాఁడు, యక్షపతి నని గెలువం
గలిగిన వీరుం డొక యహి
వలనంబడె నౌర! కలదె ప్రతి. విధి గతికిన్? 83

క. అని తలఁచి యజగరము దరిఁ
జని సురుఁడవో? యసురవాక్కొ? సర్పాకృతిఁగై
కొని తంత్ర కాక మఱియొ
క్కని కీ భుజవీర్యుఁ బట్టఁగా వశమొ?" యనన్- 84

చ. వినుమ, నహుషుండ మీకులము పెద్దలలో నొకరుండ దేవనా
థున కెనయైనవాఁడ; ఘనమున్మదవృత్తిఁ జరింప నన్నులోఁ
గనలి యగస్త్యమౌని భుజగమ్మవు గమ్మని శాపమిచ్చెఁ; బ్రా
ర్థన మొనరింప "నీవడుగు ప్రశ్నలకుత్తర మెన్నఁ డబ్బునో-85

క. ఆనాఁడు శాపమోచన
మౌ" నని సెలవిచ్చి, నాకు నమితబలముఁ బూ
ర్వానుభవ జ్ఞానము ముని
తాను బ్రసాదించెఁ గరుణ ధర్మజ! వింటే?- 86

తే. ఒనర నాప్రశ్నలకు నీవుత్తరముల
నిడఁగఁగల్గిన నీతమ్ము విడుతు ననినఁ
బ్రశ్నలేవని పాండవాగ్రసుతుఁ డడిగె;
నిత్తెఱంగున జరిగెఁ బ్రశ్నోత్తరములు :- 87

తే. పరఁగ నేగుణములు గల్గు బ్రాహ్మణుండు?
"సత్యశీలతపోదాన శౌచ శాంతి
దమదయాన్వితుఁ డగునువాఁడు సేర్వ
వలయు నెయ్యది? సుఖదుఃఖములను సమత; 88

క. శూద్రునియం దీగుణములు
భద్రం బగు నేని వాఁడు బ్రాహ్మణుఁ డగు నే?
శూద్రుండగు నే ద్విజుఁ డీ
భద్రగుణంబులను గోలుపడుగతి గనినన్? 89

క. "సత్యాదులు శూద్రునియెడ
సత్యం బగు నేని వాఁడు సచ్ఛూద్రుఁడు నాఁ
స్తుత్యుండగుఁ; జెడి విప్రుఁడు
సత్యము శూద్రుండునాఁగ నడి సన్నఁబడున్. 90

తే. ధనవిహీనుఁడు పెక్కువిధముల మఱల
ధనికుఁడుగ నొప్ప నోపు; వృత్తంబు చెడిన
వాఁడు హీనుండు నాసడిఁ బొందుఁడగుట
ధనము కంటెను వృత్తరక్షణము వరము! 91

తే. అహిత వర్తనుఁడైనను నన్ృత పరుఁడు
నైన హింసావిదూరుఁడైనట్టి వాఁడు
సుగతిఁ బొందెడు నందు రేపగిదిఁ దెల్పుమ?
యను నజగరంబునకు ధర్మతనయుఁడంత, 92

సీ. దానముఁ, బ్రియం బహింస సత్యంబుల నెడు
నాలుగు సమానము లెవ్వైన మేలహింస;
సుర, మనుజ, తిర్యగములందు నరుఁ డహింస
గానఁగవలె ముఖ్యముగ నెంతగుణుఁడునైన- 93

ఇత్తెఱఁగు * నల్పు ప్రశ్నల కుత్తరములఁ
బొంది నహుషుఁడు శాపవిమోచనంబు
నంది యహిరూపు డింది, దివ్యాంగుఁ డగుచుఁ
బోయెను విమానమున సురపురముఁ జేర 94

క. అంతట యుధిష్ఠిరుం డ
త్యంతామోదమునఁ గూర్మి యనుజునితోఁ, ని
శ్చింతత నిజాశ్రమస్థా
నాంతరమున కేగి చేరె నాత్మప్రజలన్ 95

* శ్రీకృష్ణమార్కండేయ నారదులు కామ్యకవనములో
నున్న పాండవులను జూడవచ్చుట *

క. జనమేజయ నృపవర! విను
మొనరగ ధర్మజుఁడు సతిసహోదరులు సఖుల్-
మునులును ధౌమ్యుఁడు నిజపరి
జనులును సభదీరియుండ; సాదరమతినై- 96

తే. సమసె నీకాననమున ఫలములు; దుష్ట
మృగములుఁ గడచె మాయున్కి కగువనమ్ము
కామ్యకమ్మొండె వేఱొండు గన మటంచు
వారితోఁ గూడి పోయి యవ్వనిని విడిసె 97

తే. ఆశరత్కాల మమ్మెడ నశించు గడపు
చుండ శుభశకునమ్ములు మెండు దోఁచె.
ఫలము కృష్ణాగమనముగాఁ దలఁచి మఱియు
చుండ, విచ్చేసి మాతయొకండు మ్రొక్కి- 98

తే. అదిగో శ్రీహరి విచ్చేయు ననఁగ, నమృత
సేచనంబైనగతి మది సేదఁదీర్చి
వీనులకు విందొనరించి, వీక్షణముల
సార్థకముఁ గొల్పఁ; నెదురుగా జనఁగడంగె. 99

క. అనుజులును, సతియు, ధౌమ్యుం
డును, మునులును వెంటరాఁ, గడుకఁ బడిఁ జని, క
న్గొని దవ్వుల గారుడకే
తనమును నడుగడుగునకును దా మడుగిడుచున్. 100

చ. మెయి పులకింప, గద్గదసమిశ్రము కంఠముకాఁ; ముదశ్రువుల్
పయిఁకొన; నాననాంబుజము భాసిల; వేదములందలేని శ్రీ
దయితుని గంటి, భక్తశుభదాయకుఁ గంటి; బరేశుఁ గంటి నా
యయ మిది ప్రాక్కృతిం'' బని యమాత్మజుఁ డెల్లెడఁ జెప్పఁబెట్టునన్.

క. అది విని చిఱునవ్వున నా
యదుకులతిలకుండు డిగ్గి యరదము, వడిగాఁ
బాదములిడి కదిసి, ధర్మజు
నెదకొత్తుచు వింతరీతు లే లిటు! లనుచున్. 102

ఉ. పావని, పార్థ, మాద్రిసుత, పావకపుత్రిక మ్రొక్కు లందు, భూ
దేవ, మునీంద్ర, ధౌమ్యులిడుదీవనలన్ గొని, తక్కువారి సం
భావనఁ జేసి, తాపుసకు వచ్చి, సుఖాసనమంది వేడ్క గా
జీవదశాశ్వుఁ జీక్షణాలఁ జింతను ధర్మజు మోముదమ్మిపై. 103

మ. దివిజేశుండు, మృడుండు మెచ్చియిడఁగన్ దివ్యాస్త్రశస్త్రంబులన్
దవ్రులన్ గ్రీడి రహించె; నీతపము నీధర్మంబు నీనిష్ఠయే
యవుపో. యింతకు గారణంబు! ఘనభాగ్యం బన్న వేఱున్న దే?
భువి రాజ్యంబునకన్న ధర్మమె కదన్ భాష్యంబు నీకాఁగ దే!-104

సీ. తతి వేద వేదాంగ తత్త్వవిదుండవు;
సదమలయజ్ఞవిశారదుఁడవు;
అతులధనుర్వేదమతివి; నిస్తులరాజ
ధర్మజ్ఞుఁడవు; సత్యతత్పరుఁడవు;
శమదమాధికుఁడవు: స్థైర్యధైర్యవిభూష
ణుండవు; నిత్యతృప్తుండవగుదు;
వరిషట్కవశనిజహస్తశస్తుఁడవీవు,
త్రికరణశుద్ధి వత్యకలుషుఁడవు;

తే. ఆరయఁగ నజాతశత్రుండ వగుదు; పుణ్య
పురుషుఁ డవుదువు; దాక్షిణ్యపరుఁడ వగుదు;
సతతభూతదయాపరశాలి వగుదు,
వమలత్రైలోక్యపూజ్యమహిముఁడవగుదు— 105

చ. కపట ద్యూతముఁ గారణంబుఁగొని, విఖ్యాతన్ సతిన్ జల్పితో
నపకర్షస్థితిగా సుయోధనుడు సేయన్ గాంచి నిష్కంప నా
ప్రకటస్థైర్యము ధైర్యమున్ గలిగి సైపన్ నీవుమాత్రంబె కా
కేకశాంతాత్ములు మాన్యు లిట్టిరులు నీపృథ్వీస్థలిన్ గల్గిరే? 106

ఉ. శాంతియు దాంతియున్ గలుగు సత్యసమృద్ధుఁడ వౌట నీదుసు
స్వాంతము విక్రమంబునకుఁ జాల్పడనొల్లక సైచఁ బట్టి, దు
శ్చింతిక ధార్తరాష్ట్రుల కుచేష్ట ప్రతిష్ఠలు చెల్లెఁగాక నా
క్కింతగఁ గ్రుద్ధుఁడీ వయిన నేమగు వారలొ వార లింతకున్? 107

క. మేలిమి యగు నీయాజ్ఞా
వేలను దాఁటంగ రాక వీరు లనుజు లీ
లీల సహించిరి; కాదేఁ
దోలరె యమపురికి వారి దోర్దర్పమునన్?. 108

క. అంధక భోజక వృష్ణులు
బాంధవులై నిన్ను స్నేహపాశావృతని
ర్బంధత సేవింతురు; మో
హాంధులు కౌరవుల కెదుర నౌనే వారిన్?- 109

తే. సప్త సాగర పరివృతక్ష్మాకళత్ర
పతివి? నీవు దలంచిన పనికి భంగ
మొందుసల్పఁగ శక్తుఁ డొకండు మూఁడు
లోకముల [redacted] చూడ నస్తోకమహిమ!- 110

క. అన; న నె ధర్మసుతుం డో
యనఘా! యల్పావశిష్టమగా వనవాసం
బును, నజ్ఞాతమును గడపి
యనింద్య మగు విక్రమమున నరిజయ మొప్పన్. 111

తే. ఇంతపనిఁ దీర్ప నీదువం; తెసక మెసఁగ
నీవు కనుసన్నఁ జెప్పిన భావ మెఱిఁగి
కడఁగునట్టిది నూవంతు; కార్య మరసి
నడపుమీ యుమ్మ! సూత్రధారుఁడవు గమ్మ!! 112

మ అనఁ, గృష్ణుండతితుష్టుఁడై మిగుల నెయ్యంబార వీక్షించి కృ
ష్ణను; నీపుత్రకు లేకురుల్ వివిధ శస్త్రాస్త్రంబులన్ దీరి వీ
రనుతుల్ గాని వెల్గువారు! కడుమార్గంబార సౌభద్రు కం
టెను బ్రీతిన్ మనుచున్ సుభద్ర సతి వింటే! మోద మందన్ గదే!

* మార్కండేయుడు ధర్మజునకు కృష్ణుని ప్రభావమును
ధర్మవ్యాధోపాఖ్యానమును జెప్పుట- *

క. అని యాశ్వాసింపఁగ; నం
తన మార్కండేయ నారదర్షులు రాఁగన్
సనిమెల్లవా రెదుర్కొని
కొని తెచ్చిన, నాసనములఁ గ్రాని, కని యమజున్- 114

సీ. తపమునఁ గాగి, సంత్రసమాధిని మున్గి
జపహోమములఁ జిక్కి కృపణులగుచు;
స్వాధ్యాయనిరతులై శ్రీమఁ గూరి తమేమిాటి
గంగాది[illegible]కడిగి

ప॥ 111 పా॥ 2 అ॥ 6- ఁజే: ప॥ 112 పా॥ 2 అ॥ 1- నీవు:
ప॥ 114 పా॥ 3 అ॥ 1- జని: ప॥ 115 పా॥ 1 అ॥ 7- సంతత:
ప॥ 115 పా॥ 3 అ॥ 12- తమి:

దానధర్మంబులఁదగిలి తత్పరులయి;
యజ్ఞయాగాదుల నడలి బడలి,
క్షేత్రజాలములెల్ల సేవించి భావించి,
నిఖిలశాస్త్రంబుల నెమకి నెమకి,

తే. భ్రాంతులై యెందుఁగానక బడలిరెల్ల
కర్మఠులు మునుల్ మనువులుఁ గంటె! యెవుడు
మంత్రియై భటుఁడై మేన మఱఁదియున యి
యెలమి సేవించు హరి నీ సుకృత మదేమొఁ? 115

చ, భరత భగీరథాదినృపవర్యులు గల్గరె తొల్లి? వారి కీ
తెఱఁగునఁ జక్రితోఁ గలసి తిగ్గఁగఁ గొల్వఁగఁ గొల్వులందఁగా
బరఁగఁగ, ముచ్చటింపగను బాంధవ మందఁగ భాగ్యమబ్బెనే?
పరముఁ డితండు పాండవుల ప్రాణము ప్రాణము పార్థివోత్తమా!

క. అనిమార్కండేయుఁడు మఱి
యనుజనజహరిహరప రాత్మ్యుఁడయి యెల్ల సృజిం
చను బెంచును ముంచు నితని
ఘనమహిమ మెఱుంగవా నిగమములునై నక- 117

క. క్రతువుల వ్రతములఁ జిక్కం
డితరపథంబులను జిక్కఁ డీశ్వరుఁ డితఁ,డు
న్నతమగుభక్తికిఁ జిక్కిన
గతి; దీనికిసాక్షి వీ వకల్మషభావా!- 118

తే. పుణ్యపాపంబు లనునవి బొందె తోడి
చాయ నట్టువున ననుజన్మ జన్మములను
గడఁగి తత్ఫలము ముడుఁగక కుడుచు నిడును
కనుక స్వర్గపథంబగు మనికి తగును 119

మ. అని ధర్మక్రమముల్ వచించి యుగధర్మాదుల్ వినం జెప్పి, యం
తనవర్ణంబులరీతిఁ బల్కి; యటుమీఁదన్ ధర్మ సూక్ష్మస్థితిన్
గనసొప్పూర్వుల వృత్తముల్ దెలిపి, విజ్ఞానంబు విన్పించి యా
మునిచంద్రుండు పతివ్రతామహిమముం బోధింప నుద్యుక్తుఁడై

సీ. వినుమొక యితిహాసమును; మున్ను డవియందు
నుండె నొక్కఁడు కౌశికుండనంగ
నిరతతపోధర్మ నియతుండు, ద్విజుఁడు, స్వా
ధ్యాయతత్పరుఁ; డొక్కతరువునీడఁ
గూర్చుండి, వేదముల్ గుణియించుచుండ నా
తరువుపైనున్న కొక్కెరయొకండు
తనపైన విష్ఠింపఁ గినిసి యాతఁడు చూడ
నది చేతనముఁ దూలి యవనిఁ గూలెఁ

తే. గాంచి నిశ్శాంతమగు తనగతికి వగచి
వికలమతిఁ గుండి, క్షణముండి విన్నుఁ జూచి
మట్టమధ్యాహ్నకాలమగుటచేఁ బట్టణమున
కరిగి యొకయింటి ముంగిలి దరిసి నిలిచి- 121

గీ. భిక్ష యన. విని యూ శ్రాయింటి వెలఁది భర్త
సేవలో నుండి, యదికడఁజేసి, పిదప
వచ్చి బిచ్చంబు నిడఁబోన వనిత నట్టె
ద్విజుఁడు వీక్షింప, నీక్షించి తెలివ పలుకు:- 122

తే. కొంగ నేఁ గాను విప్ర! నీకోప ముడుగు;
పతిని సేవించు చుండిన కతన నింత
తాళితిని, దీనఁ గలదె నాతప్పు? తాల్మి
యెఱుఁగ కేవట్టి నీతప మేల చెప్పుమ?- 123

క. అదివిని భూమీదేవుఁడు
మది నచ్చెరువొంది పలికె మానిని! యెటునీ
విది తెలిసితి వన, నాసతి:-
యది పాతివ్రత్యమహిమ; యదియట్లుండెన్- 124

మ. అరిషట్కంబు జయింపలేక, మదిలో హంకారమున్ మానలే
కరయన్ హింసను బాయలేక, నిశితంబౌ ధర్మ సూక్ష్మంపు టం
తరముల్ గుర్తిడలేక బాహ్యమగు కర్తవ్యంబు మాత్రాన ని
బ్బరమున్ బొందుటె బ్రాహ్మణోత్తముని సౌభాగ్యంబు లీపాటివే?

క. స్త్రీనాట, ధర్మసూక్ష్మ
జ్ఞానము లేదగుట నన్ను సయిపుము; నీవున్
ధీనిధి ధర్మవ్యాధుని
చేనరయుము మిథిలకేగి శిష్టపథంబున్ 126

మ. అనినన్ విస్మయచిత్తుఁడై మిథిల నొయ్యం జేరి బాపండు నీ
ధిని వీధిన్ జని, వ్యాధువాస మట నిర్దేశింప నాలించి వే
సని, వ్యాధుం డట మాంస మమ్మట జుగుప్సన్ జేరఁగాలేక ద
వ్యాన నిల్వంబడియున్న విప్రు విషయంబున్ వ్యాధుఁడూహించుచున్-

క. వే సని భక్తి నమస్కృతిఁ 127
జేసి, కుశలమడిగి, "సాధ్వి చెప్పట నాయీ
వాసమునకు విచ్చేసితె?
భూసుర! ప్రియమయ్యె! రమ్ము పోవుద" మనినన్- 128

క. చిత్రములు రెండు గంటిని
చిత్రం బిది! యనుచు నతనిఁ జేరినడచు నా
ధాత్రీసురు నిజవాస
క్షేత్రమునకుఁ దెచ్చి చూపె స్వీయపితరులన్- 129

క. పండుముదుసళ్లు పితరులు,
నిండుమనంబున భజింతు; నెఱి మాంసంపున్
గండలు గొని నే నమ్ముదు
నుండీ! యిది నాదువృత్తి శుద్ధచరిత్రా!- 130

సీ. బ్రాహ్మసురులకుఁ దపస్స్వాధ్యాయములు; బ్రహ్మ
చర్యయు, సత్యంబు సాధకములు;-
దండనీతియ సూపె! ధర్మంబు నృపులకు;
వాణిజ్యమును, బశుపాలనంబు,

వ్యవసాయ మనునవి వైశ్యులధర్మముల్;
శూద్రధర్మంబు శుశ్రూష;- యటులె
మృగయోపజీవనం బగుమాదుధర్మంబు
వంశక్రమాగతవర్తనంబు;-

తే. స్వకులధర్మంబు విడువక సాగనిచ్చి
ద్రోహమును బాసి, విషయవిమోహ మెడసి.
హింసగతిఁ ద్రోసి, కృపశాంతి హితముఁ జేసి,
దైన్యమును రోసి మనుటె సద్ధర్మ పథము!- 131

తే. దొరకినంతకె తృప్తుఁడై మరిఁగిన్యాయ
మున మనుఁచు దాను, దనవారి మనిచి, దాన
ధర్మములఁ బెంచి, నిస్వార్థతను గడించి.
దైవముఁ దలంచునాతఁడే ధన్యతముఁడు 132

క. నావృత్తినిఁ గని నీమది
నేవముఁ గొనినట్లుదోఁచె; నిదిహింసగ నీ
భావమును గలఁచె; విను, భూ
దేవోత్తమ! తత్వగతిని దెలియుము బుద్ధిక్ 133

క. నేలయు, నింగియు, నీరము,
గాలియుఁ బ్రాణులమయంబు కాన, నహింసక్
బాలింపఁబూర్ణ మెట్లగుఁ?
బోలినగతి నాచరింపఁ బోలునుగాదే? 134

క. ఫలశాకంబుల నసువులుఁ
గలుగవె? యవి కుడువకుండఁ గలమే? మృగముల్
పులుమృగముల భక్షింపవె?
జలజోద్భవు సృష్టి యిట్టి చందము కాదే?- 135

క. యాగంబులఁ బశుహింసను
నాగమములు చెప్పలేదె? యటువలెఁ బ్రాణ
త్యాగముఁ జెప్పరె స్వప్రజ
యోగక్షేమముల పొందె యోగ్యముగాఁగన్? 136

ఆ. పరహితంబు కొఱకుఁ బరపిన హింస తా
నగు నహింస; స్వార్థమా నహింస
హింస యాను; సూక్ష్మ మిది శ్రుతిస్మృతి వృద్ధ
వర్తనములఁ దెలియవలయు సరిగ! 137

ఆ. తగిన దైనఁ దనకుఁ దగనిదియే యైన.
నిజకులోచితమయి నెగడినట్టి
ధర్మమును విడంగఁదగ, దదినిజభాగ్య.
విహిత మండ్రు బుధులు విప్రవర్య! 138

క, తను కర్తృత్వముఁ బూనక
తనపాలికివచ్చు వృత్తి ధర్మ మటంచున్
జనుసల్పఁగ, నది దేవా
ర్పణమనుచుఁ, దిశుద్ధి నెట్టిపట్టులనైనన్ 139

క. కడువృద్ధులఁ బితరుల నిలు
కడనిడి, యడవులఁ దపింప ఘనమే? వారిన్
గడు భక్తిని గొలువుము! య
య్యెడనే నీతపము పండు నెఱిఁగితె” యనిన౯- 140

తే. తక్షణము బ్రాహ్మణుండు ప్రదక్షిణంబు
సల్పి యావ్యాధునకు:- నీవ జ్ఞానగురుఁడ
వగుదు నాతల్లిదండ్రులఁ దగ భజింతు”
ననుచు వీడ్కొనె ననుచు నామునివరుండు- 141

తే. ఇట్టిగాధలు బలుచవు లుట్ట, ధర్మ
గతిఁ దెలియఁ దెల్పి ధర్మజుకలఁతఁ దీర్చెఁ;-
గంజదళనేత్రుఁ డాపైనఁ గాంచి, పాండ
వాగ్రజునితోడ నిట్లనె నాదరమున:- 142

క. దినములు చాలఁగఁ గడచెను,
చనవలె మావీటి కేము; సైరింపదు మా
మన సది మీయెడబాటును
ననుచును హరి కౌఁగిలించి యాధర్మసుతు౯:- 143

సీ. ఆడినకాలంపుటవధి దగ్గఱవచ్చె
సత్యంబుఁ దప్పని సాహసులరు
కడవుఁ డీయనతి యాకాలంపుటవధిని
నష్రిమాదులరయి యడవియందు

జెముగులాకోఁ బుల్ చెట్టనెంచినఁగాని
శౌర్యంబునకుఁ బోసి శాంత మూనిఁ;
పుష్కాంతివాసంప్రట్బంబు నోడలెల్లఁ
గనుఁగల్గి చరియింపఁ గనుఁడు! వినుఁడు!

గీ. మనుఁడు సుఖముగ నని, కృష్ణుఁ గని; పవనజుఁ
గత్తి నీక్షించి, కవలఁ గాంచి ప్రేమఁ;
గ్రుచ్చి కౌఁగిటఁ ధర్మజుఁ గూర్మి; నెట్లొ
వారి వీడ్కొని రథమెక్కి శౌరి తరలె— 144

గీ. కడపి రబ్దంబు లిటు పది, యడవియందుఁ,—
దీర్థయాత్రలు సల్పుచు, దేవమౌని
సాధుజనసేవఁ జేయుచు, సత్యశీలు
రగుచుఁ బాండవు లోకరీతి తగవునరసి. 145

* దుర్యోధనుని ఘోషయాత్ర; దుర్యోధనుని గంధర్వులు
చెఱఁబట్టుట; పాండవులు విడిపించుట. *

శా. ఏకచ్ఛత్రపదస్థుఁడై సతత ముర్వీశుల్ తగన్ గొల్వఁగా
నీఁకన్ దాను నిరంకుశంబుగ ధరన్ నెల్లారి దుర్యోధన
క్ష్మాకాంతుం, డలఁ కర్ణ సౌబలులు ప్రేమన్ జేరి సేవింప న
స్తోకశ్రీవిభవప్రభావ మహిమల్ శోభిల్లఁగానుండఁగన్. 146

గీ. భూసురుండొక్కరుఁడు పాండవులు వసించు
కాన కేతెంచి వారలకష్టములను
గాంచి విచ్చేసి, యాస్థితిగతులఁ దెలుపఁ
దలఁకి ధృతరాష్ట్రుఁ డప్పు డశ్రులఁ దొఱఁగి— 147

చ. గుణధనులై వెలింగి, బుధకోటినుతిన్ గని, కీర్తికామినీ
మణికిని నాథులై విబుధమాన్యులునై ధరణీశమౌళిభూ
షణపదులైన పాండవులు సౌఖ్యముఁ దక్కి వనాంతరంబులం
దనదలరీతిఁ గుందుదురె! కటా! యెటుసేయుదు కాలమేరినేన్? 148

క. అనుజుని తనయుల దుస్థితి
వినియును జాకుంటి, నిట్టి విపరీతము నే
మనవలయునొ; ముం దెట్టివి
కనవలయునొ కాంచరాని గతులన్ వెతలన్?" 149

తే. అనుచుఁ బనవుచు మఱిమఱి యడిగి యడిగి
త్వష్ట్రసురునిచేత వారి కష్టము లెఱింగి
కంది, బెగడొంది వెతనంది కుంది డింది
యలఁతనేమేమొ విపరీతములఁ దలంచెః- 150

ఉ. అంతలువడ్డవారలు వనాంతర వాసము, గుప్త వాసకా
భ్యంతర మెట్లొ తీర్చి, పులులట్టుల వచ్చి పురంబుఁ జొచ్చి, దు
శ్చింతకులైన మత్సుతులఁ జెండరె భండనమందు? నింక నా
వంతకు నంతముండునె? యవారిత మీబ్రదు కెట్లుదాళుదున్ 151

సీ. తెల్ల గజమునెక్కి విల్లుమీటుచు యుధి
ష్ఠిరుఁడని యముఁడయి తిరుగునట్టు;
గదనెత్తియదలించి యద యత భీముండు
దుర్యోధనుని తోడఁ దుర్యించినట్టుఁ

బ్రహ్మాండ మగలంగఁ బార్థుండు గాండీవ
మున సూతసుతుతలఁ దునిమినట్లు;
కడువాడికత్తులఁ గనలు మాసేనలఁ
జెఱకుఁ జెండినరీతి నఱికినట్లు;
శక్తిరూపమునఁ బాంచాలి నాలుక సాచి
యనిఁ జొచ్చి రక్తంబు నానినట్లు

తే. విశ్వరూపుని గృష్ణుని పీపున నిడి
కాలమహిమంబు నిజగళఘంటనినద
ఝణఝణల నుగ్రి నాట్యంబు సలుపునట్లు
కలలఁ గందును రేబవళులనుగూడ-" 152

క. అని వందురు ధృతరాష్ట్రినిఁ
గని సౌబలుఁ "డిట్టు లేల కళవళపడ; నీ
తనయులు సత్వాఢ్యులు; గుణ
ధను; లీఘనులందు నొక్క తప్పుఁ గలుగునే- 153

క. వారలు విమయు విలంపట
పారంగతులాట సోలి వసుధ, నడవిలోఁ
జేరిరి; యవధిఁ గడపి మీ
వారలతోఁ బోర కుడుగు వారలె కూరుల్?- 154

తే. దూర నేల సుతుల? దుఃఖింప నీ కేల?
పగరపైన మచ్చరఁ దగుల నేల?
యెవరి కర్మగతుల కెవ్వారు బాధ్యులు?
శాంతి నొందఁగనుము; భ్రాంతివిడుము- 155

క. అని జనపతి నూఱడిలం
వినిచి, సుయోధనునిఁ గన్న వెనుకొనిచని, మం
తనమున నుండఁగఁ, గర్ణుం
డనె దుర్యోధనునితోడ నతిహర్షమునన్-

ఉ. భాగ్యము లుండి, భోగములు పండి, సతీసుతబాంధవప్రజా
యుగ్యము పండి గల్గినను, యుక్తసుఖంబులఁ దాను నిండి రా
ర్భాగ్యత మందు శత్రువులవాసములం బడి కన్నుగట్టు సౌ
భాగ్యముతోడ నవ్వి యెవి వచ్చునె సాటిగఁ గౌరవోత్తమా! 157

ఉ. నారలు చీరలై, చెడువనంబులు రాజగృహంబులై, చెలుల్
ఘోరమృగంబులై, కుడుపుగూరలుఁ గాయలునౌ నసార సం
సారులు పాండవుల్ గనఁగ ఛత్రపతిన్ నిను వారిమోము బం
గారము నగ్గిబొగ్గయినకైవడిఁ గానలెఁ, గాంచఁగావలెన్. 158

క. నీ దేవులసౌభాగ్యం
బాదీనుల దేవి కాంచి యడలన్ బడలం
గాఁ, దిలకింప [redacted]
గాదే యది జన్మసార్థకము మనకున్నృపా 159

తే. అనఁగ, సౌబలుఁ డదికార్య మనుమఁ బొగడెఁ;
పగిదిపనియిది దైనను దండ్రి యేల
పనలఁ బోనిచ్చు నాద్వైతవనముఁ జేరఁ,
బాండుపుత్త్రకు లందుండుభంగి యెఱిఁగి? 160

క. అనఁగ సుయోధనుఁ డిటువలె;
"మనగోగణ మందుఁ గలదు మసమది కనఁగన్
జనెద" మని విభుని యానతిఁ
గొని మనఁ గణ్ణండు:- పిల్చి గొల్లని నొకనిన్ 161

క. పనివినిచి వానికనుదో
డ్కొని విభుఁగని ద్వైతవనిని గోగణ ముంటన్
వనమృగము లందు హెచ్చుట
వినఁ దెలిపెను గొల్ల చేతఁ బిత కాసుతుఁడున్- 162

చ. తృణజల పూర్ణమై సుఖసమృద్ధము నై, పశువాసయోగ్యమై
తనరెడు ద్వైత కాననము తథ్యము; దుష్టమృగాళిబాధ యం
దునబలిసెన్; నివారణకుఁ దోడ సమర్థులఁ బంపి కావు గో
గణ మని గొల్ల చెప్ప; విభుఁ గాంచి సుయోధనుఁ డాతురంబునన్ -

క. దేవరయానతి సేసినఁ
బోవుదు మట మృగవితతినిఁ బొరిపుచ్చి తగన్
గోవులఁ గాచెద; మింక సెల
వీవలెనన. వంధనృపతి యిష్టసుతునితో:- 164

ఆ. గోగణము రక్షణము మేలు; క్రూరజంతు
మారణముఁ బోలు; నైనను వీరవరులు
మానధనులగు పాండుకుమారు లందు
విడియుటలు, మీరలరుగుట లెడరు దోఁచు-

చ. ఆచక్రిన్ వలఁగొన్నవారు; శివుదివ్యాస్త్రంబుఁ గొన్నారుసూ!
భూచక్రాధిపతిత్వ మొందఁగల తెంపున్ బెంపుఁ గన్నారుపో,
మీచే నొచ్చినవారు బాహుబలిమిన్ మిన్నందియున్నార లా
ధీచారిత్రులు! మీరువారఁగలయన్ దీండ్రింబు వేఁడ్రింబగున్ 166

తే. కనుక నచటికి మీరు పోఁజనదు; వేఱె
యేరినైనను బంపుదు నూఱకుండుఁ
డనఁగ, సౌబలుఁ డాయంధజనపుఁ గాంచి-:
యధిప! యిటులేల సందియ మందనీకు?- 167

ఆ. కానమే మేము వారి విక్రమముఁ? దెలిసి
యేలపోదుము వారల జోలి? వారు
ధర్మనిరతులు ప్రతినను దప్పువారె?
క్రీడమెయిఁ బోదుము జగడమాడఁగాదు 168

క. గోరక్షణకతమగుమృగ
యారతినైఁబోవువార మంతియు; వారిన్
జేరము- నేనంతయుఁదగ
నారయుదు నికేల భీతి? యనివినుపంగన్- 169

తే. సుమతి యోచించి పతి– "బుద్ధిమంతులరయి
చనని గోధనమును వైశ మరుగుదెంచు
పాండు! వారలవతి కేగకుండుఁ డనుచు
నెట్టకేలకు నానతి నిచ్చి పనిచె. 179

సీ. నగల గోనెలను దంతావళిపై మోపి,
రత్నంపుసంచు లుష్ట్రిముల కెత్తి,
విలుపైనవలువలు గలపేటికల నెల్ల
వాజిశకటముల నోజఁ దాగ్చి;
పాకసామాగ్రుల బండ్లకు నెత్తించి,
రథపంక్తి శస్త్రాస్త్రరాశి వోసి,
యందలంబుల స్త్రీలసందర్భ నెక్కించి,
మొగి విమానములఁ బ్రముఖులు నిలిచి

తే. సోదరులుఁ గర్ణగాంధారులాది బాంధ
వులును సుతులును సఖులు, యోధులు మృగయులు
సైన్యములు, భటుల్ సర్వులు సాగిరాఁగ
నేలయీనినగతి జనజాలమొప్పె – 171

క. గాయకులు, నటవిదూషకు
లాయతవిటవంది, మాగదాదులు, వేశ్యల్,
నాయికలుఁ, గవులు సుకళా
ధ్యాయకులును జనిరి నృపుని యాజ్ఞాబలిమిన్ 172

క. పదివేల రథంబులు, ము
ప్పదివే లుష్ట్రములు, నాల్గుపదివే లేన్గుల్;
పదివేలు శకటములు, నే
బదివే లశ్వములు నడచె వసుధ వడంకన్, 173

క. మంగళవాద్యంబులును మృ
దంగ, కహాళ వేణు ముఖ్యతరతర ఘనవా
ద్యాంగ ధ్వని గీతస్వన
భంగిను రవళులును గగన భాగముఁ దూఁకెన్- 174

క, చని యిటు, ఘోషంబులు గల
వనిఁ జేరి, తదంతరమున వసతిశిబిరముల్
తనరఁగఁ గూరిచి వారం
దున విడిసిరి సర్వులున్ మనోహర్షమునన్- 175

సీ. ఫలమూలవృక్షసంపద గల్గి, యతిథుల
కాదరాతిథ్య మీయంగఁ గల్గి;
నిండారు కొలనుల నీరజ కలహంస
తతి ప్రేక్షకాక్షులఁ దనుపఁ గల్గి;
రమణీయ బహులతాసుమము లభ్యాగత
జననాసికల నేలుసరణిఁ గల్గి;
శుకపికాదులనుగీతికసుధన్ విను వీను
గవలవిం దొసఁగుత్యాగంబు గల్గి,

తే. విప్ర, సటు, ముని, ఖచరుల వీండ్లు గలిగి;
గోప, గోపిక, గోష్ఠ సంకులముఁ గల్గి;
వనమృగ సమూహ గర్జన ధ్వనులు గల్గి,
సలిపె ప్రీతిని భీతిని ద్వైతవనము- 176

సీ. హాళిమై వారాడి, విహారము ల్సలుపుచు,
ఫలములఁ దినుచుఁ దేనెలను గొనుచు,
గోష్ఠంబులకుఁ జని గోక్షీరములఁ బిండు
కొని ధారధారల గుటుకలిడుచు;
దధి ఘృతంబులను, గొల్లతలో సంగనానుచు
మురియుచుఁ, బూవుల ముడిచికొనుచుఁ,
పక్షితతికి గానఘణితిని గఱపుచు;
గమనంబు రాయంచగముల కిడుచు,
తే. నెమిళులకు నృత్యములగతి నేర్పుకొనుచుఁ,
పాఁడుచును, గేరుచును, దక్కి తారికొనుచుఁ,
గేలు కేల్వట్టి నడచుచుఁ దూలినగుచు,
నబల లందందుఁ దిరిగిరి పతిబలలగుచు- 177

మ. కురురాజున్ బరివారయుక్తుఁడగుచున్, గోష్ఠంబులన్ డాయుచున్
బరిశీలించుచు, ముట్టితట్టికనుచున్ వత్సంబులన్; ధేనులన్-
వరుసన్ గోడెల, నెద్దులన్ వివిధవర్ణాకీర్ణ వర్గంబులన్;
జరియించెన్ సఖులన్, సహోదరులనోజన్ జేరుచున్ గేరుచున్.

ఆ. వందిమాగధాదిబృందంబు రావించి
యాచరించి యభిమతార్థము లిడి,
మృగయాలంటిరాఁగ, మృగయావినోదంబుఁ
గడఁగి యడవిఁజొచ్చెఁ గడకతోడ. 179

మ. పొడుచుక్ మత్తగజేంద్రసంఘమును నేపుంజూపి భల్లంబుచే
నడఁచుక్ భల్లుకఖడ్గసింహఘనవన్యశ్రేణి ఖడ్గంబుచేఁ;
బడుచుక్ వ్యాఘ్రవరాహఝూటములపై, బాధించిపాశంబులక్
దుడుచుక్ దంచునుజించు,నొంచుఁబొలియించుక్ మించి వెన్నంటుచుక్ (180

తే. ఇటులఁ జని, పాండుసుతు లున్నకుటజములకు
నరుత, నొకదివ్యతరసరోవరము దరిని,
వలపి క్రీడాగృహంబులవసతిఁ గూర్చ
నాజ్ఞ నిడ భృత్యులకు; వారలచటికరిగి:- 181

తే. శిబిరములఁ గట్ట, నది చిత్రసేనుఁ డనెడి
ఖచరవిభుక్రీడనార్థంబుఁ గట్టబడిన
కొల నగుటచేత, ఖచరు లలవ్వలకుఁదోలియుఁ
వారు పఱతెంచి పతికి నాపగిదిఁ దెలుప,- 182

క. కోపంబున దుర్యోధనుఁ
డోపక సోదరులఁ జూడ, నుత్కటసైన్యా
టోపంబున, శస్త్రాస్త్ర
దీపితవిక్రమము మెఱయఁ దెరలిరి వారల్,- 183

క. చెలరేగి సాగి, గంధ
ర్వాలతోఁ దలపడిరి, పెనఁగిపోరిరి, పుపుబం
తుల వధువరుకీ్రడలవలె
నలరిశిరఃకందుకముల నాడిరి మెలుచన్- 185

క. అంకుసకుబసులతెలలను
టెంకాయలఁ గొట్టుకైవడిని, నరశిరముల్
ఉంకువగ నిడిరి రణక
న్యాంకాశన్ వీరవరు లనన్య పే్రమన్- 185

ఉ. నెత్తురుటేరులన్ బఱచి, నిక్కుచు నూఁగెడు నెమ్మిగూడులున్;
హత్తుచు వీడుచున్ సుడిసియాడుకబంధశిరోరుహాస్త్రముల్,
ఒత్తగుపే్రగుఁగండలయి యొప్పెడునారణభూమి నెల్లెడన్,
బిత్తరలాడు పే్రతములవిం దొనరించిరి వాసవీరునున్- 186

తే. కౌరవులధాటి కోర్వక ఖచరసేన
పఱచి ప్రభుచిత్రసేనుని వేఁడుకొఁగు సాచ్చి
వినుప; నాతఁడు మితిమీఱుకినుక నూని
ప్రబలసేనలతోడ సంబర మెసంగ- 187

మ. శరచాపంబుల నూని, తోమరగదాశస్త్రాళిఁ గేలూని, మై
మఱువున్, గుండలముల్, కిరీటమును,సంభావ్యంబులౌభూషణాం
బరముల్ దాల్చి; రథాధిరూఢుఁడయి, దుర్వారాగ్రహోదగ్రుఁడై
ధర కంపింపఁగ వచ్చెఁదాఁబ్రళయమార్తాండుండునాఁ దొప్పుచున్

---

ప॥ 185 పా॥ 1 అ॥ 3- రేఁగినాఁగి; ప॥ 186 పా॥ 1 అ॥ 4- బేఱులన్;

సీ. తమ్ములు నూర్గురు తనముందలను నిల్వఁ;
గర్ణసౌబలులుఁ బ్రక్కలను గొల్వ,
సైంధవ ప్రముఖులు శత్రుమధ్యను దూఁకఁ
వడినర్ధరథులు పైబలముఁ దాఁక,
నతిరథు లందందు మితిమీఱుఖతిఁ బోర;
మొనను మహారథు లెనసి తేర,
యోధులు సేనలవ్యూహముల్ పన్నఁగఁ;
దెగి సైన్యపతులు నల్దిశలఁ బెనఁగ.
తే. కాల్బలము లశ్వబలములు కదుఁ దలిర్ప;
దంతిబలములు దండడుల్ తఱచు నెఱప;
సింహగర్జలు గగనంబుఁ జించిమించఁ,
గురుధరేశుఁడు రణమునఁ బరిఢవించె- 189

క. ఉఱుములు, మెఱుములు, గర్జలు
ధర గగన మగల్చె; శాతతర శరవృష్టుల్
గురిసె నొకగడియ యెడఁయక;
కురుసేనలు సమసి పఱచెఁ గుయ్యిడికొనుచున్- 190

ఉ. సుక్కుచు దుస్ససేనముఖ శూరులు చిక్కిరి; సౌబలుం డకే
పిక్కబలంబుఁ జూపె; నరిభీకర తేజుఁడు సైంధవుండునున్
బిక్కకు జాఱె; నందఱును బాఱిరి కర్ణుఁడు తేని పీడకే
యొక్కఁడె నిల్చి శత్రువులనుక్కడఁగించెఁ బరాక్రమించుచున్.

క. గంధర్వవిభుఁడుఁ, గర్ణుఁడు
గంధగజద్వయము తాఁకుగతి, డీకొనుచున్,
బంధురముగఁ బెనఁగిరి, యమ్మ
హాంధసులు నుతింప, భూమి యదురువఁ గడంకన్. 192

క. ఘోరశరంబుల నింపిరి
ధారుణి దివి రెండు నిబిడదంబై నిగుడన్
మీఱినబలమును మెయిఁగొని
పోరిరి సరిసరిగ రోషపూరితమతులై.- 193

తే. తగులువడి యంతనంత గంధర్వవిభుఁడు
మాయమయి, మేఘముల డాఁగిమలయుచుండి
శరతతిఁ గురిసెఁ, గర్ణుండు సుఁజెదొఱంగి
వ్రేటువడుచుండె, మఱువ్రేటు వేయలేక.- 194

చ. ఇటువలె జాముసైచి, కడ కేమియుసేయఁగలేక కర్ణుఁడున్
దటుకున జాఱెఁ; గౌరవుఁడుఁ దాళఁగలేక పలాయనంబుకై
యటునిటు సూచుచుండ, ఖచరాధిపుఁ డాతనిఁ బట్టి బందిగా
జనపతిఁ దన తేరునఁ [illegible], రయంబున నేగె నభఃపథంబునన్. 195

క. హాహాకారము లెసఁగెను
నాహవరంగమున; [illegible]
ఊహింపరాని [illegible];
సాహీనులుం [illegible] హస్తివారము వెడ [illegible] 196

ప॥ 193 పా॥ 2 అ॥ 9- నిండితద్దయు; ప॥ 194 పా॥ 3 అ॥ 12- గుఁ;

క. తక్కినకౌరవ వీరులఁ
దక్కకబంధించుచున్; రథంబులఁ గొనుచున్
నిక్కుచు గంధర్వులు సని
దక్కజముగ రాజుఁగూడి యభ్రపథమునన్. 196

తే. భానుమత్యాదిరాణులు వనరు చందె
స్రవనదీక్షిత మండినశమనపుత్రుఁ
గనుచుఁ, "బతిభిక్ష పతిభిక్ష" యనుచు, శరణుఁ
జొచ్చి, కతనెల్ల వినిచిన, నొచ్చి యతఁడు - 198

తే. భీమసేనునిఁ గని "నీవు వేగ నరిగి
కౌరవేశుని గంధర్వుబారినుండి
ముక్తుఁ గావించి, బాంధవ్యమును గణించి
నీవదిన భానుమతి వెత నీగు" మనిన- 199

తే. వెలయ మనపని గంధర్వవిభుఁడె తీర్చె,
చెల్లెఁబో; యిది నుదినంబ చెప్పనేల?
దారిపోరును వలెనని కోరఁదగునె?
పాముసకుఁ బాలు వోయుదు రే? మహాత్మ; 200

ఉ. పుట్టినదాదిగా మనలఁబొందఁడు, నైచఁడు; చావుగోరుచున్
బెట్టెవిసంబు; లక్కయిలు వీడుగఁ గట్టెను; గొట్టెసంపదన్;
దొట్టెను భార్యపుట్టమును; దోలెను కానల నట్టె; యిప్పు డీ
కట్టిడిస్వీయవైభవ ముఖంబునమమ్ముగలంపవచ్చెఁబో; 201

ఆ. తత్ఫలంబుఁ గుడిచెఁ దప్పేమి? గంధర్వ
నేత మనకు దీన నెయ్యుఁ డయ్యె!
యిడఁగరానియిడుమ లిడుభ్రాత కురుపతి.
చంపదగిన ఘోరశత్రుఁ డయ్యె!!- 202

తే. అనిన; నిటు లగునే? శర ణనినఁ గావ
ధర్మమగు; శర్మమునకయి తగవు గలిగె
జ్ఞాతులకు మనకు; నంతకే నీతిజాతి
ప్రీతినియతుల రీతుల వ్రీల్పనగునె? 203

తే. వారికిని మనకు దగవైన వారు నూర్గు
రై దుగురు మన; మితరులతో నయ్యెనేని
మనము నూటైదుగురముభీమా; నిజమ్ము!!
మతము నా దిది; విబుధసమ్మతము సుమ్ము - 204

తే. శరణు చొచ్చినవీకరశత్రునేనిఁ
గావవలె నన్న, భ్రాతనుఁ గావవలదె!
యజ్ఞదీక్షిత నుంటచే, నరుగరాక
వినిచితిని, తోడుభ్రాతలఁ గొనుము చనుము 205

మ. అనినన్ భీముఁడు చిత్తమంచనియె, నష్టాత్మ పార్థుఁడే నిప్పుడే
చని దుర్యోధనుఁ బుత్తెఁ దెత్తునని బాసం జేసె; నానల్వురన్
గొని శాస్త్రాస్త్రములన్ రథంబులను జాగున్ జేయ కేగోయి ఘో
రనగంధర్వరథస్థానంబు దెస. నస్త్రంబుల్ గీడ్పి సాధించినన్ - 105

ప॥ 203 పా॥ 3 అ॥ 5- మనకు నంతకే: ప॥ 204 పా॥ 1 అ॥ 4- ని:

క. చని యడవి, మబ్బులచాటున
జనుగంధర్వనిరథంబుఁ జన నీయ, కలే
వెనుకకు లాగి కొనుచుఁ బా
ర్థునిముందటఁ దెచ్చి నిలిపెఁ దుర్గతి కాలమునన్.– 207

ఆ. పార్థువిక్రమంపుపాటి నెఱుంగుట
చిత్రసేనుఁ డేమిసేయలేక;
"యంతవడియు మీర లీక్రూరులను గావఁ
గడఁగు టేమిమంచికార్యమయ్య? 208

ఆ. కానఁ దోలి మిమ్ముఁ గష్టపెట్టిరె కాక,
యిప్పుడుఁగూడ నిట్టు లపహసింపఁ
గోరి నచ్చు టెఱిఁగి కోపించి సురపతి,
పట్టి తేరవీనిఁ బనిచె" ననిన.– 209

ఆ. "ఏది యెట్టులైన నిద్ది యగ్రజునాజ్ఞ
మాకుఁ ద్రోయరానిమతము సుమ్ము!
వీఁక మిఱతని; నీవె విడిపొమ్ము; నిష్కార
ణంబుగా ఘాతకు మనకు సమర మేల?" 210

ఆ. అనుచుఁ బార్థుఁ డనిన యంతన, గంధర్వ
పతి వచించె "దేవపతియనుజ్ఞ
మాకు గాదుటు, దీని మన్నింపఁ దగునీకు
ననిన; నట్లనుండు మనియె నిట్టుల.– 211

ఆ. ఇందుమిత్రోడ నిద్దిరమెఱిఁగింపుఁడయ్య! యీ
కౌరవులకుఁ గలిగె జ్ఞానమగుటఁ
బట్టనేల వీరి? వదలుఁడు! కాదేని
నస్త్రబలమిఁ గొందు ననిననగుచు— 212

ఆ. అనినయెఁ జిత్రసేనుఁ డనియేలమనలోన?
వినుతు మిద్దినీదు పితకు, నితనిఁ
గొనుఁడు; వీని నీచగుణములు మునుమున్న
జూడఁగల రటంచు వీడుకొనియె;— 213

తే. బంధితులఁ గౌరవుల నెల్లఁ, బాండుతనయు
లరదముల నిడికొనిపోయి, యుగ్రజాతు
చరణముల పైవఁ, గనిచు యజ్ఞాతశత్రుఁ
డపుడె బంధనములనూడ్చి కృపతలిర్ప— 214

శా. అన్నా! యెన్నడు నిట్టిసాహసము జేయంబోకు, దుర్మార్గముల్
చన్నే? చేటగుఁగాదె? దుర్యశము వంశం బెల్ల బ్రింగింపదే?
మున్నెందుర్ మనపెద్దలిట్టిపనులర్ బోఁజూచిరే? యల్లెసం-
పన్నత్వంబుననుండు: మీగతికి తాపంబొందఁగాఁబోకుమా; 215

క. అనితగవుసెప్పి దుర్యో
ధనుబుచ్చిన, నతడుసిగ్గుతలకొని మరుమా
టనుబలుకనొల్లఁ. కట్టుతె
సనె; తనవారెల్ల వెంటఁజను దేరంగర్.—

అరణ్య పర్వము తృతీయాశ్వాసము సమాప్తము.

# ఆశ్వత్థ భారతము

## అరణ్య పర్వము - చతుర్థాశ్వాసము





క. శ్రీదయితా! త్రిదశార్చిత
పాదా! శ్రితవరద! ధర్మపథసంచరణా!
వేదవినోదన! దుర్జన
భేదన! శ్రీరాయదుర్గ వేంకటరమణా!. 1

### దుర్యోధనుని ప్రాయోపవేశదీక్ష - అతనిని రాక్షసులు పాతాళమునకుఁ గొనిపోయి ధైర్యము చెప్పి పంపుట, అతడు హాస్తినావతిమునకు వచ్చుట

క. అని యిటు లాజనమేజయు
గని వైశంపాయనుండు, కౌరవపతి యం
తనఁ జని గంగానదిపొం
తన, సమతలమందు నిలిచి, దర్భాసనుఁడై. 2

తే. కడఁగి ప్రాయోపవేశదీక్షను ధరించి
యుంటఁ గురి నల్లకల్లోల మొంద, నంధ
నృపతి, గాంధారి, గురు భీష్ము లెల్లవారు
వచ్చి దుర్యోధనునిఁ గని పలుకఁ దొడఁగ. 3

క. వలదంచని చెప్పిన మా
పలుకులు బలుచేదు లయ్యెవత్సా! కర్ణా
దుల చెడుపలుకులు నీకుఁ
గలకండలునయ్యెఁ గాలగతి నేమనఁగన్? 4

తే. తొలుతనుండియు నిట్టు లే మదుకువడితి,
కడకు నవమతి నొందితి! చెడుగుచేత
లుడుగు మింతటఁ; బెద్దలనుడుగు లింత
కొనుమని గురుఁడు భీష్ముఁడు వినిచి, రంత- 5

క. నిజ మాడితి; రే నెంచఁగఁ
గుజనుఁడ, నావలనఁ గందుకులమున కయ్యెన్,
ప్రజ నొచ్చె నాదుమనికిన్
సుజనులకును గష్టమయ్యె సుకృతి రీరల్ 6

ఆ. చెడుగు వీడుమంచుఁ జెప్పితి, రదియానా నే?
వేముతియ్యవడునే? పాము విసము
విడునె? తేలుకుట్టు వేయక మానునే?
కుజనుఁడుడుఁగ నగునె నిజగుణమునే?- 7

క. మానినఁ గొన్నాళ్ళఁటిగ
మానంగావచ్చు మూలమట్టముగాఁగన్
మానవుడు నైజభావము
మానునె మరణించికాక, మాటలనెందున్?- 8

ఆ. కనుక నేనుమనుట చనదొట, మృతిఁగంట
లోకమున కెకాదు నాకు మేలు!
దుర్మరణమఘు, మ్మదోషమ్ముప్రాయోప
వేశమగుటఁ, దనువు విడుతునిట్లు. 9

ఉ. వందనముల్ కొనుండు గురువర్య, పితామహ! మిత్రులార; నా
యందలిదోసముల్ సయిచుఁ డాజ్ఞనొసంగుఁడు తల్లితండ్రి యీ
ముందఱ దున్న సేనుకరమున్ గ్రహియించుత రాజ్యలక్ష్మి! మీ
రందఱుఁ జేయుఁడిట్టు; లిఁకనాగక యెల్లరుబొండు వీటికిన్ 10

క. అన; ధృతరాష్ట్రుఁడు ననటన్
దనయా! యిట్లేల?. పాండుతనయులతో. సం
ధిని సలిపి, సగము బాలిడి,
యనుగుణులై మనుఁడు మీరలందఱనంగన్, 11

ఆ. సంధి యేమి? నన్ను సమరంబులో గెల్చి
నట్టిఖచరు గెల్చినపుడె, నన్ను
గెలచి రగుటఁజేసి, యిలయెల్ల వారిదె!
సగమ యేల? రిత్తసంధి యేల?- 12

క. వారిదె ధర, నా దేహము
వారిదె; నేనిజమ వారిబంధీయమ; ప్రాణం
బీరాజ్యము నా దెట్టుల?
మారాడకుఁ డిదియె నా నపుసక్ప్రతి యనినన్ 13

ప॥ 9 పా॥ 3 అ॥ 5- మఘు: ప॥ 10 పా॥ 4 అ॥ 11- నాఁ

ఆ. ఇంతమందుఁ డగుదువేమయ్య; "యింటిలో
సర్పముండె నోటశని వసించె"
నన్నరీతి యయ్యె నక్కటా! నూర్గురు
కొడుకులుండి గొడ్డునడువు నైతి- 14

క. అని గాంధారి ననరఁగా:-
మనమురి యాడంగ భానుమతి " నీతోనేఁ
దనువును దొఱఁగెద, వీటికి
నన నన; "నాయానయుండె నను " మనెఁ బతియున్. 15

ఉ. అంతటఁ గర్ణుఁడాడె ' యిదియా పనితేఁడ? తొలంగి తప్పఁడ
ట్లింతపరాకుతో; ఖచరునిప్పుడ దంచెద నూకనుగ్గుగాఁ;
గొంతులు గోసివేసెదను గుప్పలు పాండుకుమార వారమున్;
ఇంతకు నింతయేఁ? యసువులేఁ గలుగంగను జింతయేఁ యనన్.16

ఆ. ' ఏల పౌరుషం బదేరితో? గంధర్వ
నాథుతోనె? నిన్ను నన్ను గెలిచెఁ
బవర మేరితోడ? బార్థునితోడనా?
ప్రాణదాతతోడఁ బాడియగునె?- 17

ఆ. దేహ మిచ్చెనగుట ధృతరాష్ట్రుఁ డొకపిత!
ప్రాణదాన మిచ్చిపనిచెనగుట
జమునికొడుకు నొక్కజనకుండు; తండ్రినైఁ
బడెడునట్టి కొడుకుఁ గొడుకె? కర్ణ! 18

క. కినుక మెయి నిటులఁ బలుకను
మనమున వైరాగ్య మొదవె; మరలను బుఱికిన్;
దనువుఁ ద్యజించెదఁ దథ్యము
చనుఁ డీర లనంగఁ గుంభసంభవుఁ డంతన్:- 19

క. భూవధువు నాసఁ జేసిన
యేవీరుఁడు సౌఖ్య మొందె? యిది క్షాత్త్ర యశో?
చావంగ నేల? తగవుగఁ
బోవంవలెఁగాక, యిదియు బుద్ధియె? యనియెన్. 20

తే. "మింట మనువారు భూమిపై మెలఁగువానిఁ
బట్టినా రంట; భ్రాతలు వాపిరంట;
యనమతికిఁ గారణం బిందు లనముఁ గలదె?"
యంచు గురుసూనుఁడును గృపుఁ డనిరి విసిగి. 21

ఆ. అంత సౌబలుండు ననెఁ బాండవులు నీకు
బంటు లగుట, వారిపాడి యదియ!
చూడఁ గించుఁ గలదె? పోలుట నేఁడైన
తేపు గెలిచి యేపు సూపలేమొ? 22

ఆ. పందచేతఁ జిక్కు బలవంతుఁ డొకవేళ
గాలకర్మగతులలీల యద్ది!
అంతమాత్రమునకె యపవృతి యనఁదానె;
యోడుగెలుపులెపుడుఁ గూడు వీడు"- 23

ప॥ 19 పా॥ 1 అ॥ 9- లఁబలుకను: ప॥ 21 పా॥ 3 అ 17- అఁ;

ఆ. అంతఁ గన్గొఁ డనియె "నా పాండవేయులు
సోలుపడరె మనకు జూదమందు?
అడవిఁ బడరె? మరణమాసించిరే యిటుఁ?
భ్రాంతి యేల? రిత్త బడల నేల?" 24

ఆ. అపుడు దుస్ససేనుఁ డాయన్న పదముల
వ్రాలి యశ్రువులను వ్రాల్చి, వ్రాల్చి
"యింద్రపదవినైన దృణమట్లుత్యజియింతు
నీవు లేక యున్న నిజమి దన్నః- 25

ఆ. అనినతమ్ముఁ గ్రుచ్చియనె "మాఱువలుకకు;
ఆన నీకు; వీటికరుగు" మనిన
వకార్క్ష్యమూనెఁ; నేఁడు మరలి తేపిచటికి
వచ్చిచూత మంచువార లంత- 26

ఉ. ఆధృతరాష్ట్రుఁ గూడి, మదినారటతోఁ జనిరెల్లవార; లో
మీఁదట భృత్యులుంటఁగని, మీరు చనుండని త్రోల, వారలున్
వేదనతోడ నేగిరి; దివింబడి డయ్యుటసూర్యుఁడంత, స్నా
నాదులఁ దీర్పఁ బశ్చిమమహాబ్ధిని దూఁకెను; దోఁచెఁ జంద్రుఁడున్

తే. ఎసఁగ బాహ్యేంద్రియక్రియ లెల్ల విడి,
మహితమైన సమాధితన్మయతఁ గూడి,
గాలిసోఁకనిదౌ దీపకంబుఁ బోలె
స్తిమిత గతినుండెఁ గౌరవక్షితివరుండు- 28

సీ. ఆవేళ, ననురు లయ్యమరులచే సోలి
మహిలోకమందున నడఁగియుండి,
దుర్యోధనునినాఁటి దుస్థితి విని, యజ్ఞ
మున నొకశక్తినిఁ బుట్టఁజేసి;
దానిచేఁ గౌరవ ధరణీశుఁ దెప్పించి,
వాని సన్మానితుఁగా నొనర్చి,
సురలకుఁ దమకున్న యరిభావమును జెప్పి,
పాండవు లొకడ నుండు టాడి,

తే. 'పాలు పాండవులకు నీకు బవరమందుఁ
దోడు నీ కౌదుము; మమరు లాతోడునై నఁ
జంపెదము; వారి; నీవిటు చావనేల?
యని, యతని కసురులిట్టి ధైర్యమును గఱపి'- 29

తే. శక్తిచే మున్న పతఁడున్న స్థలముఁ జేర్పఁ;
బలుగతుల దీని మదిలోనఁ దలచి తలఁచి,
ధైర్యమును భొందెఁ; దెలవాఱెఁ; దానుకాల
కృత్యములఁ దీర్చెఁ; బూర్వాద్రి నినుఁడుఁ దోఁచె. 30

తే. కర్ణుఁడున్ శకుని రాఁ; గని కౌరవుండు
హాస్యమారంగ వృత్తాంత మంతఁ జెప్ప,
వారు పొంగిరి, పొగడిరి వచ్చిరపుడు
ముగురు గజనగరికి; జనుల్ ముదితులైరి. 31

ప॥ 30 పా॥ 1 అ॥ 4- మున్న తండున్న; ప॥ 31 పా॥ 1 అ॥ 4- న్ను;

తే. సందుగొందుల బాటలఁ జక్కఁజేసి
ముంగిళుల, దేవళంబుల సింగరించి
పూజలను వేడ్కలును బంధువుల సలిపిరి
రాజు పురి కేగుదేర నాప్రజలు దమిని.- 32

క. మంతనమునఁ గౌరవునకు
సంతస మొనగూర్పఁ, గర్ణసౌబలు లొకనాఁ
డెంతయుఁ బొగడుచు నింద్రుం
డింతటి విభవంబు నొందఁడిది సుకృతముపో! 33

ఉ. శత్రులు గాన లో బడిరి, సర్వధరాధిపతిత్వ మబ్బె నీ
స్తోత్రము భాగ్యమయ్యెను వసుంధర రాజులకెల్ల; ధర్మమే
గాత్రముఁ దాల్చె నా వెలుఁగఁ గంటివి! సాటులు మేటులుండిరే!
ధాత్రిని నేలుకొమ్ము సముదారపదా! ముదమేదురంబుగన్ 34

తే. అనఁగ; మీయట్టి హితులు నా కొనరియుండఁ
గొఱఁతయేమైన నాయుధిష్ఠిరుఁడు రాజ
సూయమును జేసినటు నేనుఁ జేయ వాంఛ
కలదు, తీర్పఁగదే; యన్న గర్ణుఁడంత.- 35

క. అగుఁగా! కని ప్రాజ్ఞుల నడు
గఁగఁ బాండుసుతాళి నోర్చి కానుకఁ గొన కె
ట్లగు నది? వైష్ణవ యాగము
తగునిప్పటి కనినరాజు తలకొనిధానిన్, 36

చ. అతి విభవం బెసంగఁగ, ధరాధిపు లెల్లరఁ జేర్చి, పాండురా
ట్సుతులకు పూతఁబుచ్చినఁ,గడుఁ గుతూహలుండయి భీమసేనుఁడా
తతరణయజ్ఞముఁ గడపు దాఁటిన మీఁదట. ధార్తరాష్ట్రసం
తతిఁదగ వ్రేల్చి చేసెదము తెద్దగ" నంచని. చెప్పె మంచి కెఁ 37

ఆ. ధర్మపుత్రుఁ డనియె ధార్తరాష్ట్రుఁడు మహా
యజ్ఞముం బొనర్చె ననుట వినుటఁ,
హర్షమయ్యె; మాకు ననఘ! బూరింపక
పురికిఁ జేరరాని పూన్కిఁ దెలుపు, 38

ఆ. అనిన దూతయేగి యదియెల్ల వినిపించెఁ;
గౌరవేశ్వరుండు భూరిదాన,
దక్షిణముల, మంత్రతంత్రంబుల నుయాజ్ఞ
కంబుఁ దీర్చి యవభృథంబుఁ జేసె.— 39

క. ద్వైతవనినిఁ గుంతీసుతు
లాతీరున నుండఁ బాండవాగ్రజుకలలో
నేతెంచి జంతుసంతతి
భీతిని మొఱ లిడియెఁ గనుల వెడలఁగ నశ్రుల్ 40

తే. తఱిగె నస్మత్కులంబిటఁ దఱచు; బీజ
మాత్రముగ నిల్చె మాయున్కి మానితాత్మ!
యొండువని కేగుఁడన, నిద్రనుండి లేచి,
యందఱనుగూడి, యాతఁ డాయడవి విడిచి. 41

క. మఱిఁ గామ్యకమున డిగె; నది
తరుఫలసుమజలసమృద్ధి దంబయి, మృగభీ
కరమయి, రవిచండకిరణ
పరిహృతిశాఖామయ మయి భయగతి నొప్పెన్, 42

క. పారాశర్యుఁడు వచ్చి కృ
పారస మేపారఁగాంచి పాండుతనయులన్
సారతరధర్మ పథబో
ధారూఢిన్ జేసి వారిఁ దనిపె మృదూక్తిన్ 43

* సైంధవుఁడు ద్రౌపదిని యెత్తికొని పోవుట; పాండవులు
సైంధవుని బట్టి మానభంగముఁ జేయుట *

సీ. ఒకనాఁడు పాండవు లువిద కృష్ణను, ధౌమ్యు
నిన్ బర్ణశాలను నిలిపి; వేట
తమిని వా రేగ, నాతరుణంబునం దాత్మ
సైన్య సమేతుఁడై సైంధవుండు
వచ్చి ముంగిటను ద్రౌపది యుండఁ దిలకించి,
మోహించి తగవుఁ బూనలేక
వావిని వరుసను భావింపఁ గాఁబోక,
భ్రాంతిమై యామెను బట్టఁ బోవ,
తే. అన్న వే, చెలియ లిఁగానె? చన్నె? యనుచు
వడఁకి, కేకలు వెట్టిన విడక, వాఁడు
తన్ని రథమందు నిడికొని తరలఁ; గాంచి
ధౌమ్యుఁ డేతెంచి బెదరించెఁ; దగవుఁ జెప్పె:—

ము, విన కాధూన్తుఁడు, కృష్ణుతో రథము వేవేఁబాఱఁగాఁ దోలఁ, గి
న్కను నాఁడా ద్రౌపది ధౌమ్యుఁడున్ బలిమిఁ గేకల్ వెట్టి రా నంతటన్
విని కౌంతేయులు వచ్చి క్రుద్ధులయి, గెంటింపంగ నస్త్రంబులన్,
గని యాసైంధవుఁ డేర్చి నిల్చికడుపీఁకన్ బోరె రౌద్రుండునై;- 45

చ. గద గొని భీముఁ డార్చుచు, నెకాయతి తాఁకెను శత్రుసైన్యమున్
బదపడి పార్థుఁ డస్త్రములపాండితిఁ జూపె సుపర్వ లోకనన్
కదుకొని జంటలంటి రిపుకాండముఁ జెండి, రిదెల్లఁ గాంచి ద్రౌ
పది ముదమందె సైంధవుని పాటునకున్ దనవారిధాటికిన్- 46

క. ఆదాడి కోర్వకా ఖలుఁ
డేదిక్కును లేక, రథము నెగిరి దుమికి, య
ట్టే దాడుఁ దీయ, వడముడి
మోదెను వెన్నంటి వానిమూపును గదచే- 47

శా. ఓహో! చంపకు, మాఁడుబిడ్డ చెడునయ్యో భీమసైరింపుమా!
మోహాంధుండయి దోషబుద్ధి నితఁ డేమో తప్పుఁ గావించె; నీ
ద్రోహిన్ దుంచినఁ బెద్దతల్లి కడుపున్ దూఁటాడినట్లౌఁగదే!
సాహంకారు శిరోజముండనము జేయన్ జంపినట్లౌ నదే; 48

క. అని ధర్మజుఁ డెలుగెత్తిన,
వినిపార్థుం డడ్డపడియె; విడిభీముం డా
తనితల చెక్కులు వోఁ, గ
త్తిని బట్టెలు నాల్గుదీర్చి తీఱని యలుకన్ 47

---

ప॥ 46 పా॥ 1 అ॥ 20- న్యః పా॥ 3 అ॥ 1- గః

క. పాండవులభటుఁడ నని, భూ
మండలమునఁ జాటుకొనుచు మన్ననమున, నపుడే
పాండవులభటుఁడ ననుచును,
గొండికపడి వాఁడు కూసికొనుచును జనియెన్. ౫౦

శా. గంగాద్వారముఁ జేరి వాఁడు, తపముం గావింపఁ, బ్రత్యక్షమై
గంగాజూటుఁడు కోరు మీప్సితము నంగాఁ, దాను బాండవ్యులన్
భంగింపంగను వేఁడఁ, బాండవులు దుర్వారప్రతాపాఢ్యు లో
పంగన్ గాదు కిరీటి నాకు; నిఁక నీప్రార్థ్యంబ దేలాగనన్. ౫౧

క. నీకోర్కెఁ దీర్పవలయుట
నాకొటఁ; గిరీటిఁ దప్ప, నల్వుర గెలువన్
నీ కగు నొకనాఁ డని, యని
వాకొని, యంతర్హితంబునడియెన్ హరుఁడున్. ౫౨

క. ఆకామ్యకవనమందున
నాకౌంతేయాగ్రజన్ముఁ, డనుజాది హితా
నీక, ద్విజమునిపరిజన
లోకముతో నుండె, ధర్మలోలపుఁ డగుచున్. ౫౩

◆ మార్కండేయుఁడు ధర్మరాజునకు రామాయణకథ జెప్పుట. ◆

క. మునిమార్కండేయుం డా
జనపతిఁ గనరాఁగ, నెదురుసని తెచ్చి, కుశా
సన మిడి సపర్య సలిపిన,
మునిమోదము నందె; ధర్మపుత్త్రుం డంతన్— ౫౪

తే. పరమునీశ్వర! ద్రౌపదివగిది దుఃఖ
పడినరాజవధూటి, నావలెనె కష్ట
మనుభవించిననృపతి, యీయవనిఁ గల్గి
రొకో, యెక్కాలమున, మమ్ముఁ దక్క? ననిన- 55

క. లేకేమిరా? రఘురాముఁడు
కాకుత్స్థాన్వయపయోధికంజసఖుండు
శ్రీకాంతుఁడు గానల శో
కాకుల మగుసతివియోగ మందఁడె యధిపా!- 56

క. అనఁ దపసి; యాకతను విన
మనసయ్యెను దెల్పు మనెడుత్స్మాపతిఁ గని, యా
మునిపతి మార్కండేయుం,
డనురాగముతోడ నిట్టు లాకథఁ దెలిపెన్. 57

సీ. తనయులకొఱకునై దశరథుఁ డనుతేఁడు
వరపుత్రికామేష్టి జరుపుటయును,
నం దగ్ని ప్రత్యక్షమై పాయసంబీయఁ,
బతి ముగురాండ్రకుఁ, బంచుటయును,
రాముండు భరతుండు, లక్ష్మణ, శత్రుఘ్న
పుత్రు లాసతులకుఁ బుట్టుటయును
కౌసల్యసుతు రాముఁ గానల కనుపంగ
నధిపుఁ దత్సతికై క యడుగుటయును,

సుశీఁ దండ్రియిచ్చుటచే, నడవిని రాముండు
సీతతో భ్రాతతోఁ జేరుటయును,
నడవిలో రామునిపడఁతి సీత దశాస్య
దనుజచేఁ జెఱఁజిక్కి నలఁగుటయును,
నటుపైన రాముండు, హనుమంతుఁ డనుకపి
ముఖ్యుని బంటుగాఁ బూనుటయును,
గపిరాజు సుగ్రీవుఁ గని మైత్రిఁ గొని రాముఁ
డెలమి వాలినిఁ గూలనేయుటయును,
ఆవానరుల రాముఁ డంపి లంకాపురిఁ
గలసీతవృత్తంబుఁ దెలియుటయును,

తే. వారినిధిఁ గట్టి లంకలో దూఱి కపుల
బలమునన తెంపు రావణు బలముఁ
దునిమి భూజాతతోడ లక్ష్మణునితోడఁ
జేరి పురి, రాజ్యపాలనఁ జేయుటయును- 58

క. రామాయణ మామూలము
నామునిపతి బూసఁ గుచ్చినటు తూ-చా-యే
మేమియుఁ దప్పక నవరస
ధామముగా వినిచి పిదపఁ దానా నృపుతో- 59

క. శ్రీరామునికై వడినే
ఘోరాటవిఁ గష్టమొంది యుండి, పిదప నీ
ధారుణిఁ గొందువు కూర్మిరులఁ
గౌరవులఁ దునిమి కడిమిఁ గలనను నధిపా.- 60

సీ. విను, మొక్కకథ నింక వినిపింతుఁ దొలి మద్ర
వసుధేశ్వరుం డశ్వపతియనంగఁ
గలఁ డాన్నృపుఁడు సంతుకయి గొల్చ సావిత్రి,
నా దేవి ప్రత్యక్షమైన నతఁడు
"సంతతి" యన నట్టె జరుగు నంచనితోడ
నామె యంతర్హితయయ్యెఁ బిదపఁ
బత్నిమాళవి యందుఁ బడసెనాతఁడు పుత్రి,
నామెకుసావిత్రినామ మయ్యె;
తే. బాలచంద్రుని కైవడిఁ బ్రతిదినమ్ము
బాలవృద్ధినిఁబొందుచుఁ బ్రాయమొందె;
మూఁడుజగముల యువతుల నీడు లేక
రూపరేఖావిలాసనిరూఢి నొప్పె, 61
తే. సాల్వభూపతితనయుండు సత్యవంతుఁ
డతులగుణరూపుఁ డని విని యతనిపైఁ స
లలన మదినిల్పె మహినిగోల్పడి యతండు
జననితోఁ, నంధజనకుతో వనుల నుండె. 62
క. నారదుఁ డొకదిన మచటికిఁ
జేరంజని యుచితరీతి సేవలఁగొని; సొం
పారెడుసావిత్రినిఁ గని
యీరమణికి వరునిఁ జూర్చు టేమి? యనంతన్. 63

తే. సాళ్వభూపతితనయుని సత్యవంతుఁ
గాక వేఱొల్ల నని మదిఁ గలిగె నిద్ది;
యతఁడు రాజ్యవిదూరుండు, నటవివాసుఁ
డంధసుతుఁడు; డింక నేమి సేయుంగ నేర్తు? 64

మ. అనఁగన్; నారదుఁ డాధరాధిపతితో "నల్లంతఁ బో దద్ది; యా
తనికిన్ నేఁటికి వత్సరంబుకడనన్ దథ్యంబుగా మృత్యువౌ,"
ననఁ బుత్త్రిన్ గాంచి యశ్వపతి "యమ్మా! దేవమర్త్యంబు లీ
మతి నిన్ మెల్ల, నమోఘమీమునినుతుల్ బోనాడు తద్భ్రాంతినాన్ (65

క. కరణములమూఁట, నంతః
కరణము ముఖ్యంబు, దానఁ గైకొన్నమనో
హరుఁ బాయుకంటె. సాధ్వికి
దురిత మధిక మున్నె? హెచ్చుదుఃఖం బున్నే? 66

క. అతఁ డెట్టిఁడైన నాకిఁకఁ
బతియును గతియును నతండె; పరికింపఁగ మీ
హిత మొప్పదు నాదుదృఢ
వ్రత మిది! నాగతికి నొకరు బాధ్యులె సెపుడా? 67

మ, అనినన్; మెచ్చి మునీంద్రుఁ "డిద్దిగుణవిద్యాబుద్ధిసౌభాగ్యయీ
తనయన్ మించెదుసత్యవంతుఁడు; మహాధర్మాత్ముఁడాధీరుఁ,డిం
కనుమానింపకు; దేవుఁ డుండె; సతిమాంగల్యపవిత్రభావంబునన్
మనుతన్ వాఁడు చిరాయురూర్జితయశోమాన్యుండునై ధాత్రిపై!

క. అని దీవన లిడి యాముని
కొని నందనములను, వీడుకొనె వారల; నం
తన నశ్వపతి సభార్యా
తనయా బాంధవ్యుఁడునగుచుఁ దర లి యడవికిన్ 69

క. కనిన ద్యుమత్సేనుం డా
తని సంభావనముఁ జేసెఁ; దదనంతర "మీ
తనయను మీతనయున కిడె
దను గొని నను ధన్యుఁ జేయఁ దగు" నని వేఁడెన్. 70

ఆ. అంత నశ్వపతికి నాసాళ్వపతి యనె
విగతరాజ్యులమయి విపినమందు
మృగములట్లు మనికిఁ దగిలినమాతోడ
ముగుద యిద్ది సుఖముఁ బొందునయ్య? 71

క. అనిన ద్యుమత్సేనున కా
జననాథుఁడు "గలిమి లేమి శాశ్వతమే? స
ద్గుణుఁడవు; వినుతచరితుఁడవు
ఘనుఁడవు; వియ్యమున కింతకంటెన్ గలదే?– 72

సీ. అన విని యయ్యంధజనపుఁ డామోదించి
తగఁ జేర్చి యచ్చటి తాపసులను;
ఘనతరశుభలగ్నమున సత్యవంతున
కును సతిసావిత్రికిని వివాహ

మును సల్పె శాస్త్రోక్తముగ; నల్లునకుఁ గూఁతు
నకు భూషణాంబరనికర మొసఁగె;
షడ్రసోపేతభోజనదక్షిణలఁ దృప్తి
పడి మును లాశీస్సు లిడిరి మిగుల;

తే. నశ్వపతి వీడుకొని వారి నరిగెఁ బురికి;
రమణి రమణీయచీనాంబరములఁ గొనక,
వనికిఁ దగువల్కలాజినవసన యగుచు,
భర్త నత్తను మామను భక్తిఁ గొలిచె.— 73

తే. నారదుఁడు విన్పిచనినయానాఁటినుండి
విడక యనుదినమును లెక్క వేయుచుండి,
కొఱఁతగా నాల్గు దినములు వరుషమునకు
బట్టె నా మె త్రిరాత్రోపవాసదీక్ష. 74

తే. అత్తయును మామ "యిటు లేల" యనిన నతివ
పరమశుభములఁ గోరి యీవ్రతముఁ గొంటి
దేవిసావిత్రి కరుణించు దీనఁ గాన
వగనకుఁ" డటంచు వారి నెవ్వగను మాన్చె— 75

క. నాలవదిన మా మె యుషః
కాలమునన్ లేచి, తీర్చి కాల్యములను, వే
వాల్మికిమునులకునతు లిడి
సోలఁగఁబాసి జేసి సేవ మునకొనియుం డెన్. 76

వ॥ 73 పా॥ 3 అ॥ 10- క్షి: వ॥ 74 పా॥ 3 అ॥ 7- నాల్గువత్సరమునకను:
వ॥ 76 పా॥ 4 అ॥ 2- లఁ;

ఆ, సత్యవంతుఁ డంత సమిదలుఁ గుశఫలం
బులను దేఁ గుఠారమును ధరించి
వనికిఁ బోవనుండఁ, గని సతి వెన్నంటె
వలదటన్న (బ్రి)యుఁడు వదలఁబోక- 77

తే. "పడఁతి యుపవసములఁ జేసి బడలినావు.
ఎల దుడుగు" మన్నఁ "బ్రాణేశ! బడలి కేమి
యొడలఁ గలుగదు నీవెనుఁబడి యడవినిఁ
గలవిశేషంబులను జూడఁ దలఁపు గలిగె. 78

క. అని నుడివి, యత్తమామల
కును వందనమాచరించి, కొని వారల యా
జ్ఞను, బతివెను వెంటను సతి
చనెఁ గళవళమొందుమదిని జక్కఁబరచుచున్. 79

సీ, సరసిజాకరములఁ బరువడిఁ బరువిడి
యలరారుసంచల చెలువుఁ జూపి,
సుమఫలభరితమై శోభిల్లుబహువిధ
తరులతాగుల్మసంతతులఁ జూపి,
ఫలముల దిని కలకలలాడికోలనుల
నీ రానుపక్షుల నీటుఁజూపి,
పూదేనియలనాని, పొలుపార గానంబుఁ
గావించు తేనెటీఁగలను జూపి,

తే. హర్ష మొందుచు, సల్లాపమాడికొనుచుఁ
గాంతి మెడఁ గేల బిగియించి, కౌఁగిలించి,
ముద్దులనుగొంచు నాతండు మురియుచుండ
నిర్వికారతఁ బతితోడ నెలఁత మెలఁగె. 80

క. లలి నాపయి నొడ్డఁటఁ గ
ట్టెలఁ గొట్టఁగఁ బూని యతఁ డచట వ్రాలి, ధరా
స్థలి వ్రాలిన, సతి యాతని
తలఁ దనతోడఁ జేర్చి కొంగుతలఁగొని విసరెన్, 81

క. అంతట ముందట సతి కనె
ధ్వాంతోజ్జ్వలకాయు. మహిషవాహుఁ; గరాళా
క్రాంతభయదుఁ బాశాంకుశ
కుంతగదాధారు, నంతకుని, సితదంష్ట్రున్. 82

ఆ. అంతకుండు సత్యవంతునిఁ గదిసినఁ
దెగువ మగనిశిరముఁ దిగువదించి
భయముభక్తి గదుర పాణియుగము మోడ్చి
నయముఁ బ్రియము లొలుక నాతి పలికె. 83

క. మీ రెవరు? మాయెడకు రాఁ
గారణమది యేమొ? కనుట ఘనము నిను శుభ మే
పారెను, మాకోరిక నెఱ
వేఱె” ననఁగ, దండధరుఁడు వెఱఁగుగఁ బడుచున్ 84

మ. అతివా! దండధరుండ! సాధ్వి నిజ మాహాత్మ్యంబునన్ నన్ను గాం
చితి; విట్లన్యులకౌనె? కాలమగుటన్ నీనాథుఁ గొంపోదు; వీఁ
డతిపుణ్యాత్ముకుఁడౌట నన్యులకు డాయంగరాదు; వీడ్కొందు నో
సతి; యంచాపతిజీవముం దిగిచి పాశంబందు బంధించుచున్- 85

మ. కొనుచున్ దక్షిణదిఙ్ముఖుండయి చనన్ గుంభించి దుఃఖంబు;నా
థుని దేహంబునుదాఁచి,యాశమను దోడ్తోఁ గాంతయున్ బోనఁగన్
గని కాలుం డిటులేల వెంబడిలఁగాఁ గల్యాణి! దుర్గమ్య మీ
చను మార్గం బిఁకనిల్వు" మంచనఁగ నాసావిత్రి ధీసన్నుతిన్నమె 86

క. పతియడుగుజాడ నడచుట
సతికిన్ మతమగుట, నాకు చనునది కాదే?
పతిభక్తి వలన, నీదయ
కతమున నా కరుగరానికడలున్ గలవే?- 87

తే. మార్గసర్వస్వముల ధర్మమార్గమదియ
ముఖ్యమగు; సజ్జనులు ధర్మమూల; మట్టి
సుజనదర్శనమునఁ గల్గు శుభము లందు;
సజ్జన శ్రేష్ఠ! నీదుదర్శనము గలిగె! 88

క. అన, నాపతిగల్భ వాక్కులు
మనమున కచ్చెరువుఁగొలుప "మానిని! నీవా
క్ఛణితికి మెచ్చితి, వర మిడె
దను పతిజీవంబుఁ దక్కఁ దగ వేడుమనన్- 89

క. పతిఁ బాయువరమె సతికిన్?
పితృపతి! దయ నిత్తునన్న వేఁడఁగఁ దగదే?
పతిపితను సాళ్వరాజును
గతచక్షుని లబ్ధచక్షుఁగాఁ జేయు మనన్ 90

క. ఇచ్చితి నని వాక్రుచ్చుచుఁ
జెచ్చెర ముందునకు నడవఁ, దెలియఁ బిఱుందన్
వచ్చినఁ గని మఱి యేఁ? మన,
నచ్చేడియ యతని కనియె సతిభక్తి మెయిన్- 91

క. త్రికరణముల హింసింపరు;
సుకముల్ దీనులకుఁ గూర్తు; సొలయక, మఱి గొం
కక యిడుదురిష్ట మాశ్రితు
లకునార్యులు; నివియ ధర్మలక్ష్యము లగుటన్- 92

క. నీకేమి సెప్ప? సమమతి
వై కర్మఫలములఁ బ్రాణులందరికిఁ దగన్
జేకొనిపంచెదు; ధర్మము
నీకలమునఁ దాండవించు నిర్మలమూర్తీ!- 93

తే. ప్రాణికర్మఫలంబులపాటి నెఱిఁగి
పంచుట[illegible] సరిగ, నిను సమవర్తియండ్రు;
యముఁ డటందురు సర్వభూతములఁ గడఁగి
నీవు యమియింతువగుట నో దేవ! యనిన- 94

ఆ. నీకునట్టుగొన్న వారికి శీతల
వారివోయు, వారు దేఱునట్లు
రహితకల్మషములు,రమ్యంబులౌ నీదు
సుధలఁ దనివిఁ గనితి జడజనయన! 95

క. కావున నీచిత్తార్థిన్వాని
జీవముఁ గాకేమికాంక్షఁ జేసిన నేనిన్
నే విధిగ నీ కిడెద నన
సావిత్రి మనంబునందు సంతస మొసయన్- 96

క. వైరులచే నిజరాజ్యవి
దూరుం డగుసాళ్వవిభుఁడు దొంటివిభవమున్
గూడునటు వరముఁ గోరిన
నారీతిగ నిచ్చి నిలువు మబలా! యనినన్- 97

ఆ. ధర్మపరులు సల్పుధర్మక్రియలఁ దప్పఁ
గాన, రెట్టిదశలనైన, నూర్మి
మోహతాపములును బొడవవు ధార్మిక
హృదులఁ బ్రథమధర్మపదవినోద!- 98

ఆ. పతియకాక సతికి గతియున్నె? నిజమత
ముడుగఁ దగునె? మోహ మెడసి ధర్మ
మును గడంగవలదె ముద్దియ? యోధర్మ
రాజయజ్ఞకల్పభూజ! యనిన.- 99

క. శ్రీకరధర్మనికేత
పాత్రికలచారిత్రి నీవు; పతినొకని వినా
నీ కిపుడఁ గోరికొ న్మన
నాకాంతాతిలక మప్పు డాకాలునితోన్- 100

తే. మహితగుణనిధి! మాతండ్రి మద్రవిభుఁడు
పుత్రహీనుం; డతనిఁ జేయు పుత్రవంతు
ననినసుతశతం బిచ్చితి," సనియముండు,
"బడలితివి బాల! నిలు" మన; నుడివెనామె. 101

క. అలయిక యే? నిజపతిపద
జలజాంఘ్రిస్థితనగుచుసతి మఱి యితరం
బులఁ బోవునె? వెత లెంతలుఁ
గలిగినఁ, బ్రీతియుఁ గ్రమమైనఁ గారుణ్యనిధీ! 102

ఆ. నిరతమాత్మధర్మనియతు లలభ్యులు;
వారిఁజేర నఘము వాయుఁ దీర్ఘ
భూతమతులు వారు భూతలంబున; వారి
వలన ధర్మ మెల్లమి వఱలుచుండు.- 103

క. ఇనశశులగతులు వారివ
లననె గలుగు; వార్థులుఁ గులాచలములు ని
ల్చెను మించక; భూతము లొ
ప్పెను దగసవ్వారి పేర్మి వినుతగుణాఢ్యా! 104

క. నుడు లేడాడిన నార్యులు
వడిఁ జుట్టము లగుదురంట; పల్కితి దవ్వు వెం
బడితి నిఁక నేను వేఱుగ
నడుగంగా నేల చుట్టమగుట? మహాత్మా! 105

క. కావున మిత్రము నోరథ
మేవడువునైనఁ దీర్ప నేవలయుట నో
దేవ; ప్రసన్నుఁడ వగు మన,
నీవాంఛిత మిడెద ననియె నా యముఁ, డంతన్ 106

క. మును బతిజీవముఁదక్కన్
గోను మనుచుండితివి, యిపుడు కోరఁగ నేదే
ననుమతిఁ నిడి, తిది భాగ్యం!
బనిసతి, పతిజీవమిడిదయన్ గను, మనినన్ 107

ఆ. మెచ్చిమదిని యముఁడుఁ బుచ్చి వెంటనె పాశ
బద్ధుఁడైన సత్యవంతు; నీతఁ
డిలఁ జతుశ్శతాబ్దములు మను; శతపుత్రి
పితగ నగును సవనశతముఁ జల్పి- 108

క. అని పితృపతిచనఁ, గామిని
వనికిం జని ధవునితనువు వసత కొని కనుం
గొనుచుండ సత్యవంతుఁడు
కనువిచ్చుచు మెయిని విఱిచి కనియెన్ గాంతన్ 109

ప॥ 105 పా॥ 4 అ॥ 3- గం: ప॥ 106 పా॥ 2 అ॥ 2- వడువునైన:

తే. పెద్దనిద్దుర వోతిని వేఁడి మేలు
కొలుప వేటికి? నెవ్వండొ బలియుఁ డొకఁడు
తెగువనాబలమెల్లను దిగిచె; సద్ది
స్వప్నమన కాదు మగువ; వాస్తవము యసిన 110

చ. అది యొకదైవచిత్రి మరయంగను వచ్చును రేపవాపు; న
య్యదె నడురేయి యయ్యె, ఘనకౌనె ఘనాటవి నుండఁగా నిటుల్?
మదిదిగులయ్యె నత్తయును మామయు నెంతగరోయువారొ? యిం
కఁ దడయరాదు; నీవలయికన్ బడినాఁడవ సేయ నేమగున్?-

క, అనుసతి కాతం డనువుగఁ [111
దనువొప్పెను; దప్పెనాకుఁ దలనొప్పి. పిత్రుల్
వనటఁ బడిరో! నడుజేయిన్
మనకగునా, యిటులనడవిమధ్యన్ మసలన్?- 112

క. అని జననీజనకులఁ దల
పునఁగొని భీతిలుచు నశ్రువు లురల "పిత్రుల్
దనియింపలేనితనయుఁడుఁ
దనయుండె కిరాతుఁ డంచుఁ దలకొనిలేవన్- 113

చ. అది కని కాంత యున్నరని, యంగముసంటిన ధూళిదుల్పి; త
న్మృదుతర బాహుమూలమున నెత్తి భుజాగ్రము నూతనిచ్చియా
పిదపఁ గుఠారమున్ గరిడివృక్షమునం దిడి, మెల్ల మెల్లనన్
బదముల మెట్టు చాశ్రిమముఁ బట్టునకున్ బయనించె భర్తతో. 144

ఉ. కాననమందు సాళ్వపతి కన్నులువచ్చుటః నాశ్రమంబునన్
సూనునిఁ గోడలిన్ గనక స్రుక్కుచు, సొక్కుచు దిక్కుదిక్కులన్
బూనికఁ దోయుచున్ మునుల మ్రొక్కుచు వేఁడుచు నూరార్పు లొందు పన్
బ్రాణము వోవునట్లు బలు బాధ సతీపతు లంది కుందుచున్. 115

కం. నారదునివలన నల్లుని
మారణమగు ననుట వినుట, మఱిచూడ నేఁడో
టారయుట, నశ్వపతి యా
యారణ్యముఁ జేరవచ్చె నతిదుఃఖమునన్, 116

సీ. చనుదెంచి సావిత్రిసత్యవంతులు, భక్తి
మాతాపితల కత్తమామలకును
మ్రొక్కిన, శోకంబుఁ దక్కి వా రాయెల్ల
సంగతి విని, చాలసంతసించి
రందుఁ జేరినయెల్ల బందుగులును మునుల్
సతిమహాత్మ్యంబుఁ బ్రశంసఁ జేసి
రా పైన నా సాళ్వభూపతి మంత్రులు
విచ్చేసి "పగ తేఁడుఁ జచ్చె, రాజ్య
తే. మెల్లఁ దొల్లిఁటియట్టుల నేలుమనిన
నరిగి చిత్రాశ్వుఁడంత సింహాసనంబు
నెక్కె భువనత్రయంబుల నెందు నేని
సాధ్వి కున్నదె యొక్కయసాధ్య మనఘ? 117

ప॥ 115 పా॥ 4 అ॥ 19- కుందఁగన్: వ॥ 116 పా॥ 4 అ॥ 6- రఁ:

క. ఈసాధ్వి యాజ్ఞసేనియు
నాసావిత్రి యటు లన్వయద్వయ మెల్లన్
వాసిఁగన నుద్ధరించు ను
పాసతి, కల్యాణి, ధర్మయాయిని యధిపా! 118

క. అని మార్కండేయుఁడు ధ
ర్మనిరూఢగతిన్ వచించి మాన్యులఁ గుంతీ
తనయుల వీడ్కొని తాఁ జని
మునిజనాశ్రమమునకు హర్ష మిగురొత్తంగన్. 119

♦ బ్రాహ్మణవేషమున యాచించు దేవేంద్రునకుఁ
గర్ణుఁడు, కవచకుండలము లిచ్చుట. ♦

క. అను వైశంపాయనుతో
జనమేజయుఁ డనియెఁ గర్ణసహజనిహితమ్ముల్
చనుకవచకుండలంబులఁ
గొనె సురపతి యెటులఁ? దెలుపు కోవిద! యనినన్. 120

క. వినుం! సురనాథుఁడు పాండవ
వనవాసాంతంబు తుదను ఫాల్గునకుఁ బ్రియం
బొనరింపఁ గర్ణకవచం
బును గుండలముల హరింప బుద్ధిఁ దలంచెన్. 121

ఆ. అరసి దాని దినపుఁ డాత్మజుకర్ణున
కద్ది వినిచి మాన్పనాసఁ జేసి,
విప్రవేషమూని, విచ్చేసి యొంటిగ
నుండు సూతసుతునియొద్ద కరిగి. 122

క. వీరా! వదాన్య శేఖర!
భూరిగుణా! నీకుఁ గీడుఁ బొరియక మనుపన్
గోరి దరిసితిని నిన్నుగు
మారా! యినుఁ డేననఁ గ నమస్కృతు లిడుచున్; 123

క. దేవర దయ సేయుట నా
జీవము, ప్రాణమును, వపువు సిద్ధిం గనె; రా
జీవసఖ! యెట్టియర్థము
నావలనన్ వలసె యాజ్ఞ నాకేమి? యనన్- 124

సీ. ఈవట్టివాఁడ వం చెంచి యే తెంచితి
వీను మీ దొక్క-రహస్యవిషయ. మమర
పతి, పాండవులపక్షపాతిగ నిను యాచ
నము సేసి కవచకుండలము లెలమి
వంచించు, నాతనివలఁ దగులకు; మవి
యిచ్చిన, మృత్యువు నచ్చు నీకు!
నమృతమయంబు లయ్యవియున్న నేమిట
నెందు వధ్యుఁడవు గాకుందు వీవు!
తే. అవియు సౌఖ్యప్రమోదంబు లనుదినంబు
నలరఁ జేకూర్చు నేగతినైన వాని
రక్షణము నీకు ముఖ్యకర్తవ్య మనుచు
వినుమ రవిః కర్ణుఁ డుబ్బుచు విన్నవించె. 125

తే. అనఘ నీపలుకుఁ బ్రాణంబునైన నిడుట
నాకు మతిమాట, రాదు మాఱ్పంగ దానిఁ
గంజజునకైన; నది యుండెఁ; గరుణ మెఱయ
దర్శనంబును నొసఁగితి! ధన్యుఁడేన! 176

క. శతమఖుఁడఁట యాచకుఁడఁట,
అతనికి నే దగిన దాతనంట! యరరే! ప్రా
కృతిఫలము కవచగివచము
లతిశయములె? లోకబాంధవా! మమ దేవా! 127

క, త్రిజగముల వెల్గుకీర్తిని
ద్యజియించి, తృణంబుఁగాఁగఁ దరిగెడి తొడలిన్
భజియించుటె? నీబోధన
నిజమొ? పరీక్షయొ? యెఱుంగ నిఖిలాధారా! 178

ఉ. పాండవపక్షమూని సురపాలుఁడె యాచనసేయ వర్మమున్
గుండలమేనిడన్ యశమకుంఠితమై జగమెల్ల నిండదే?
పాండవ ప్రాణముల్ గొనఁగ భవ్యతరాస్త్రము లింకనుండవే?
దండ మొనర్తు నాపలుకుఁ దప్పుగ నెంచకు ధర్మవర్తనా! 129

ఆ. యశముకొఱకుఁ గాయమైనఁ బాయఁగ నొప్పు;
నడికి మేలుగాదె చావుజగతి?
నీకె తెలుఁగరాని నెఱి యున్నె? ధర్మాత్మ!
వినుము నామతంబు విన్నవింతు. 130

క. వైరులను జంపి చేతికిఁ
జేరును మఱి; దానివలనఁ జెండె సురపుఁ డా
కూ్రరుల దనుజుల; భుజబల
వీర మఱవ కంచు నిమ్మఁడు వీడ్కొ-నెఁ బిదపన్, 136

తే. ఒక్కమధ్యాహ్నమందు సూర్యునిసుపాస
నంబు సేయు చు విప్రజనంబులకు న
భీప్సితముఁ గర్ణుఁ డిడుతఱి, విప్రవేష
మున సురపతి "భిక్షాం దేహి" యనుచు వచ్చె. 137

ఉ. వచ్చినవిప్రవర్యునకు వందనముం బొనరించి "ధేనులో?
హెచ్చగుభోగభాగ్యములొ? యింతులొ? రత్నములో?మఱెంతలో?
మెచ్చగుగ్రామసీమలొ? యమేయముఁగాఁగ, ధృవంబుఁగాఁగ నే
నిచ్చెదఁ గోరుకొ మ్మనిన, నిట్లని యాచకుఁ డావదాన్యుతో.138

క. ఇవి యెవి.వల దుడుగుము నీ
కవచంబును గుండలములుఁ గాంక్షించితి నీ
నవి నా కిడఁ గల్గినచో
భువనత్రయమునను బొగడ్తఁబొందుదు కర్ణా! 139

క, అంతట నాకర్ణుఁడు నీ
వెంతయు .బేలవు గదయ్య!. ఇవి యేలా? నీ
వంతువ మును గోరిరె! యే
భ్రాంతిల్లితివొ!. యిం దేమిఫలము వడయుదు" వనినన్- 140

క. ఫల మిది, విఫలం బిది యను
తలపోతలు దాత కేల? తగ నర్థిమనః
ఫలమిడరె వదాన్యులు? నీ
వలెఁ దలఁతులఁ దూఁచ నర్థివాంఛలఁ గనిరే?- 141

చ. అన ముదితాంతరంగుఁడయి "యర్థియఁ బేటిత్రిజగదధినేతయౌ?
వనులఁ దపంబుచేఁ దనుపువారి కభీష్టము లిచ్చు దేవుఁడీ
వును నను వేఁడువాఁడవటె? పోలఁగ నే నిడువాఁడనట్టె? కై
కొనుమిడువాఁడనీప్సితముఁ గొంకక వీఁకఁ ద్రిలోకపాలకా! 142

క. అని ఖడ్గంబును గొని యా
ఘనుఁడు కవచకుండలములఁ గడఁగోసి "యిదో
కొను మని యిచ్చెన, సురపతి
కొని ప్రత్యక్షంబుసేసి; కొనియాడి కడున్. 143

క. కరమున నిమిరినఁ జిమ్మురు
ధిరము నిలిచి గుఱుతుమాసి, దేదీప్యతభా
స్వరుఁ డైనగర్ణుపయిన్
గురిసెను సుమవృష్టి రంభ కునిసె నభమునన్.- 144

తే. సురపుఁ డంతట మెచ్చుచు వరము నిడెద
నడుగు మనఁ గర్ణుఁ డిడ నిష్టపడెద వేని
నీకరంబున నలరారు నిరుపమాన
శక్తి నిడు మన్న నిందుఁ డా శక్తి నొసఁగి. 145

తే. ఒక్కమారిది నీకుపయోగపడును;
ఎదల నీపని నిటితీర్చి వచ్చి నాదు
కరముఁ జేరును; దత్ప్రీతి జరుపరాదు;
ప్రాణభయమైనయప్పుడే పరువు దీని!- 146

క. అనఁ, జిత్తంబనెఁ గర్ణుఁడు;
చనె వీడ్కొని దివిజవిభుఁడు స్వర్గంబునకున్
విని యిది సుయోధనుఁడు మన
మునఁ గలఁగెను బాండుసుతులుఁ బొంగిరి మదులన్. 147

క. అన విని వైశంపాయనుఁ
గని జనమేజయనృపుండు, కాననవాసం
బునఁ గడపటిదినములుఁ గడ
పిన దెటు లప్పాండుసుతులు వివరింపు మనన్.- 148

* యక్షప్రశ్నలను ధర్మజుఁ డుత్తరించుట. *

తే. ఘనులు పాండవు లక్కామ్యకమును బాసి
మరల ద్వైతవనంబున కరగి, యందు
హితపురోహితవిప్రసహితముగాఁగ
నుండ, నొకనాఁడు బ్రాహ్మణుఁ డొకఁడు వచ్చి- 149

తే. అధిప! తరుశాఖ నిడిననాయరణి, యొక్క
హరిణి యత్తరువును నొరయంగ దాని
కొమ్ములన్ దగుల నది, మృగి కొనుచుఁ బఱచె
నిత్యవిధి కది నాకు నగత్యమనిన- 150

ప॥ 146 పా॥ 4 అ॥ 11- ఊ: ప॥ 147 పా॥ 4 అ॥ 12- లపాం:
ప॥ 149 పా॥ 2 అ॥ 12- ర; ప॥ 150 పా॥ 3 అ॥ 4- క్షు;

ఉ. వెంట నిజానుజాళిఁ గొని వీరుఁడు ధర్మజుఁ డస్త్రహస్తుఁడై
కంటకకాననంబున మృగంబును వెన్నడి తూణబాణముల్
గెంటిన నంటువాసి యది గీఁటునఁబుచ్చుచు దాఁటులాడుచుఁ
గంటికిఁ జిక్కి చిక్కనటు గాఁటిమువెట్టుచు మాయమైచనెన్. 151

తే. చేయునది లేక వారలు చెయ్యిఁదక్కి
శ్రాంతులై పోయి శీతలచ్ఛాయ నిగుడు
నొక్కవటవృక్షమునుఁ జేరి యుస్సురనుచు
విశ్రమించిన, నకులుండు విసిగి యనియె- 152

క. కౌరవులకతన నెంతటి
దారుణదుఃఖములఁ దగిలి తలఁకితి మకటా!
సారకులశీలధర్మద
యారతు లగుమమ్ము నేఁచ నజుఁ డిటు లేలా?- 153

తే. అనఁగఁ; బ్రాజ్ఞుండు ధర్మజుఁ డంత సుఖము
కష్టమునకును దనపూర్వకర్మ మొండె
కారణం బగు, వే ఱొండుఁ గా దటంచు
నందు బ్రబుధులన్న వడముడి యాగ్రహమున. 154

తే. ధర్మముల కేమి కపటజూదమున గెలిచి
యువిద సభ కీడ్చి పుట్టంబు లొలుచునపుడు
కౌరవశతంబు నట్టె నాశనము జడుమ
కుండి వది నాదిమోఁ తప్పె నొండె! భువిన. 155

ఉ. నీతిపరాత్మునగ్రజుని నేమము మేరను మీఱరాక, దు
ర్నీతులచేఁతలన్ సయిచి నేఁడిటు గోడ్పడనయ్యె లేనిచో
నాతఱి భవ్యగాండివముఖానలకీలలఁ గాలకుందురే?
ఘాతుకధార్తరాష్ట్రు లిటు గర్వము లుబ్బఁగ నిక్కువారలే 156

తే. అనఁగఁ బార్థుండు, సహదేవుఁ డనియె నాఁడు
ప్రేమఁ జూపించి మమ్మింట్ల పిలువఁబంచి
నీచతను మాదురాజ్యంబు దోఁచుకొనిన
యప్ప ధృతరాష్ట్రుఁడే యన్నఁ దప్పుఁ గలదె!- 157

తే. ధర్మజుం డంత "సైచుఁడు తమ్ములార!
యంతయును దీఱె, మనద్వాదశాబ్దవిధియు
దినము లిఁకఁ గొన్ని కొఱఁతఁ గాఁదీఱె; మఱికి
తీఱెపగర, కబ్దం బిఁక దీఱమనకు 158

తే. నీరునట్టయ్యె; నీర మీనేల నెచటు
నైనఁ బరికించి తెమ్ము పొమ్మన్న! యనిన
నంత సహదేవుఁ డాయన్నయాజ్ఞ నూని
వెడలె జల మున్నతావుల వెదకికొనుచు- 159

తే. కనియె దవ్వుల నొకతటాకంబు నతఁడు
దానిలో దిగి, జలములఁ ద్రావ నెంచి
దోయిలించిన, నంత నెదో యదృశ్య
భూత మిట్లని గంభీరరీతి దోఁప:- 160

తే. ఆనఁబోకుము నీర మోయన్న! యిద్ది
నాతటాకము; నాదుప్రశ్నలకు నుత్త
రంబు లిడి మీఁద నీవు జలంబుఁ గ్రోలు!
కాని చో నీ కపాయంబు గలుగుఁ జుమ్ము!— 161

క. అన, నది యనాదరంబుగఁ
గని, దాహముఁ దాళలేక, కడుపారఁగ నీ
రును ద్రావి చేష్టఁదక్కుచుఁ
దనువునుఁదత్తటిని వ్రాల్చెఁ దత్తరపడుచున్- 162

ఆ. అంతనకులుఁగాంచి యటధర్మజుఁడు సహ
దేవుఁ డేలఁ నడఁగెఁ దెలియుమయ్య?
నీవు వెడలియతని, నీరంబునన్ దెమ్ము!
యనినఁ బోయి - పడినయనుజుఁ గాంచి 163

చ. కళవళమొంది, కారణముఁ గానక, దప్పిజలంబుచేత నా
కొలనునడిగ్గి, నీరమును గ్రోలఁగఁ బూనఁగ. మున్నురీతిగాఁ
బలుకులురా, గణింప కవి, వారిని ద్రావి, తటంబుఁజేరి పూ
వల నతఁడుస్రై దేహమును వ్రాల్చి విచేష్టుఁడయ్యె దాపలన్-163

చ. అచట యుధిష్ఠిరుండు కని యర్జునుఁ "దాళిరి తమ్ముగుఱ్ఱ, లిం
కెచటికిఁ బోయిరో? జలములింతకుఁ జిక్కవో? యేమిపుట్టెనో?
ఖచరులె యడ్డిరో? తడయఁ గారణమేమొ? కలంగెఁ జిత్తమున్;
అచిరమరమ్ము వారిఁ గొని" యంచన, నేగెఁ గిరీటి చెచ్చెరన్-164

ఆ. అరిగి యరిగి కొలని దరిఁ బడియుండిన
సోదరులను గాంచి స్రుక్కి, చింతఁ
గలిగి నాల్గుకడలఁ దిలకించి, మడివాలు
వోక, సరసిజలముఁ దాఁకఁ గనిన— 166

చ. ఎలవదు నాహసం బిటుల! వారితటాకము నాది; నాదుప్ర
శ్నలకు సదుత్తరంబు లిడి సారముఁ గ్రోలిన మేలు; కానిచోఁ
గలుగును హాని" యంచనఁగఁ, గన్వడి "యెవ్వఁడ వీవుచూచెదన్
జలములఁ గ్రోలియంచు నటుసల్పి విచేష్టత వ్రాలెఁదత్తటిన్ 167

క. కడునడలి ధర్మపుత్త్రుఁడు
వడముడిఁగని "చిత్రమిద్ది పావని! తమ్ముల్
తడసిరి;చను" మనఁనాతఁడు
వడిఁజనికనెఁ గొలనితటినిఁ బడిన యనుజులన్ 168

చ. ఇదియ యమానుషంబ; మఱి యెవ్వరికృత్యమొ? చక్కఁజేతుపో
మొదల జలంబుఁ గ్రోలవలె! తృట్టెనుదాహమటంచు డాసినన్,
ఇదిమదధీనమౌఁ, బలికి యేనిదుప్రశ్నల కుత్తరంబు, నీ
యుదకము నాను! లేనియెడ నొందెదు చావని యభ్రమాటఁగన్ 169

క. అప్పలుకుఁ గొనక పవనజుఁ
డప్పులసేవించి, పడిన యనుజులదరినే
తెప్పున వ్రాలుచు మూర్ఛిలె;
నప్పుడు ధర్మజుఁ డనుజుల నరయుచు వచ్చెన్— 170

ఉ. తమ్ములునల్వురొక్కెడనఁ దన్వులువ్రాల్చుటఁగాంచి, చిత్తమం
దుమ్మలికమ్ము గ్రమ్మఁగను; నూర్చఁగనశ్రులు; నూర్పులార్చుచుఁ
జెమ్మటలాడ మోముపయిఁ; జేష్టలఁదక్కి ముహూర్తముండియా
పిమ్మటఁ దేఱి చాలదురపిల్లె విచారవిషాదభారుఁడై - 171

ఉ. గాయములేదు; శోణితముఁగల్గదు; వేఱెవరిందువచ్చియుఁ
బోయినజాడ కన్పడదు; పుట్టె నిదెట్టులొ? ధార్తరాష్ట్రులే
మాయలఁబన్ని కుఱ్ఱలను మ్రందగఁజేసిరొ యక్కటక్కటా!
దాయల నమ్మమేలె? పగదాయలు వారలె! వేఱువారలే? 172

క. వదనంబులుఁగళఁగుందవు;
పదకరరుచులేమి కందువారవు; నీరం
బిదివిషపూరిత మేమో?
యెది తోఁపదిదేమిమాయ? యీశ్వరుఁడెఱుఁగుఁ 173

ఉ. అక్కట! రాజ్యముఁ జెడి, మహాటవులఁ బడి, కట్టఁ గోఁకలఁగఁ
దక్కి, మృగంబులఁ గలిసి, నాకతమై యిటువచ్చి చచ్చిరే!
యెక్కడఁ బెట్టిపోవుదు, నదెయ్యెడ కేగుదుఁ? గుంతి తల్లి వా
రెక్కడ? నన్ను నేమనుదు? నేమిమొగంబునఁ గందు బందులఁ 174

[illegible]. అని పలురీతులఁ వగచి, యాపఁగ నోపకదప్పి; నంబుఁ ద్రా
వనుగన, నాది యీకొలను, వారక నానుడి గీటువుచ్చి నీ
యనుజులు సచ్చి; రేనడుగునర్థములఁ విశదీకరించి నీ
రను గొనమేలు! లేద యెడరుఁ గను దీవును భ్రాతలట్లుగఁ 175

క. అని నభమునఁగా, ధర్మజుఁ
డనె నివ్వెర "దేవముఖ్యులందెవరవో? యీ
ఘనుల, మదనుజుల, నితరుల
కనువేయిటు గెడపఁ? జెప్పు" మనిప్రార్థింపన్- 176

క, తాళోపమకాయుఁ; డనల
గోళాక్షులు; భయదదంష్ట్రి; కుధరశిరం; బా
భీలానలఘోష, ఘోజ్వాల
నీలతనుండొకఁడు బొలిచినిలిచితటమునన్- 177

ఉ. జనపతి! నేను యక్షపతిఁ, సమ్మతి నేనిడునట్టి ప్రశ్నలన్
విని తగనుత్తరం బిడుదువే? యన, నో మహాత్మా! నీకున
చ్చునటులఁ జెప్పనాకగునె? చూచెద నోపినయంత యంచనన్
విను మనియక్షుఁ డాతనికి విన్నెను; జెప్పె నతండు నీగతిన్- 178

సీ. రవి నెదినడపును? "బ్రహ్మంబ" రవిఁగొల్చి
తిరుగున దెవ్వారు? "సురలు చూవె"
యినుఁ డస్తమించు నదేమిట? ధర్మచే-
నాధార మాతనికేది? ఋతము;
దేనఁ బురుషుఁడు శ్రోత్రియుఁ డగు? శ్రుతముచే;
తగునెట్లు మహిమంబు? తపముచేత;
నెదిసహాయము సేయు? ధృతిసూవె!- ధీమంతుఁ
డెట్లగు? బుధసేవ నెసఁగుకతన;

తే. దేవభావంబు నెటులఁ భూదేవుఁ డొందు?
"సంతతాధ్యయనంబున"- సాధుభావ
మబ్బు నెట్టులఁ? "వ్రతగతి"- నతఁ డసాధు
వెట్టులగు? శౌచహీనత; నెట్లు మర్త్యుఁ
డయ్యెడిని? మృత్యుభయగతి యక్షనాథ!— 179

సీ. జీవన్మృతుఁ డెవండు? దేవాతిథిపితృభ-
టాళి కీయక కుడుచునట్టివాఁడు -
ధరకంటె బరువేది? తల్లి-యభ్రముకంటె
పొడుగేది? తండ్రి- గాడ్పునకు జవమొ?
మది-తృణతృణ మేది? ఘుది చింత-నిద్రించి
కనుమూయదెది? మీను- జనన మొంది
యెది యచేతనమయ్యె? నది గ్రుడ్డు- హృదిలేదు
రూపుండియెద్ది? రాయూప మద్ది—

తే. యేది వేగంబుచేఁబొల్చు? నేఱు-దారి
నేగువారికి, రోగికి. గృహపతికి మృ
తునకుఁ జుట్టము? విను, సార్థమును, భిషక్కు,
మంచి యిల్లాలుఁ, గృతకర్మ మెంచ ననఘ!— 180

సీ. ధర్మమునకుఁ బాదు? దాక్షిణ్య మగు-కీర్తి
కగుతావు? మహిమంబు-యమరపురికి
గతి? ఋత, మీవి- సుకృతటిక్కు? శీలంబ-
యాత్మ కరున కెవ్వఁ? డాత్మజుండె;-

అతనికి దైవిక మగుచుట్టి? యిల్లాలు-
జరుగుజీవికము? పర్జన్యుకతన-
తినఁగారు నరుఁడెట్లు? దానంబుఁ గొనియాడి-
యెది పేటిధర్మ? మహింస చూవె!

తే. మొనర నెది మెప్పు పండును? యోగకర్మ;—
నెది తనుమ మది ముదమగు? మదమ-యేరి
స్నేహవికలంబుగాదు? సజ్జనులసంధి-
జగతికెవ్వానిదిక్కు? సజ్జనుఁడె యనఘ!— 181

తే. సర్వసమ్మతుఁ డెవ్వఁడు? నిర్గర్వ శోక
రహితుఁడెవ్వాఁడు? విను, క్రోధరహితుఁ; డర్థ-
సంతుఁడెవ్వఁడు? డలోభుండు-సంతతసుఖ
లో[illegible]ర్జితశీలుఁ డనఘ!— 182

తే. పురుషుఁ డెవ్వాఁడు? దివిభువివఱలుకీర్తి
నెగడువాఁతండు- సర్వధనియగు నెవ్వఁ?
డెడరుసుఖదుఃఖములును బ్రియాప్రియములును
దగసమతఁ [illegible]డె సర్వధని మహాత్మ!— 183

చ. అనవిని యక్షరాజు కడుహర్షము నొందితి నీదుతమ్ము నొ
క్కని నిడునాఁడఁ గోరు మనఁగా నకులుఁ దయసేయుమన్న నా
తనిఁ గని వెన్నుతోఁబుడినతమ్ములఁ భీముని బార్థుఁగోర వే
మని యను యక్షనాథునకు నాశమనాత్మజుఁడంత నిట్లనున్ 18[illegible]

క, మాపెండ్రికి సతులిద్దరు;
మాతల్లికి నేన యుంటి; మాద్రికి నటులే
జాతుఁ డొకఁ డుండవలదే?
యాతతధర్మక్రమంబు నారయఁ దగదే?- 185

తే. అనఁగ నిటు ధర్మజుం డంత యముఁడు:- నీదు
సోదరులు లబ్ధ జీవితు లౌదు రనిన.
వారు నిదురను మేల్కాన్న పగిదిలేవ
నచ్చెరువునొంది యమసూనుఁ డతనిఁ గాంచి- 186

క. నమ్మను యక్షుఁడవని నిను
నమ్మరుతుఁడవో? సురేంద్రుఁ డౌదువొ? నా జ-
న్మమ్మిడినధర్ముఁడవొ? స
త్యమ్ముగ నిను నాకుఁ దెలుపుమని వేఁడంగన్- 187

ఉ, ఏను నిజమ్ము ధర్ముఁడ; మహీశ! యశంబు, సు[illegible]
జ్ఞానము, దానశౌచములు, సత్య తపమ్ములు నాదుమూర్తులౌ!
సూనుని నిన్ను ధార్మికునిఁ జూడఁగ వచ్చితిఁ, జూచి మెచ్చితిన్;
ఏనిడుదున్ వరంబుఁ బ్రియ మెయ్యది కోర్కు మనంగ నాతఁడున్

తే. చాఁగి దండప్రణామంబు సలిపి పొగడి
యుపహరించెను భూసురునరణి హారిణి
నిత్యకర్మంబున కది యగత్యమగుట
నతని కద్దానినిడుమని యనిన; యముడు:- 189

చ. హరిణముగాదు, నిన్నెఱుఁగఁ జేష్టలసల్పితి నేన! కొమ్మటం
చరణినొసంగి; రెండుఁ బదియబ్దము లేగెను; వత్సరంబొకం
డరయఁగ రానియట్టిమము నయ్యెయిరూపము మీరుగోరున
ట్లిదువు పడంగ నేవరమునిచ్చితి, నింకభయమ్ముఁ దక్కుఁడీ! 190

క. అనియంతర్ధానముకాఁ,
మనమున విస్మయము నంది మహితుఁడు పంక్తి
తనయ శ్రేష్ఠుండాశ్రమ
మునకనుజులతోడ నరిగి ముదమున నుండెన్—— 191

క. అనివినిచిన వైశంపా
యనుజన మేజయుఁడు గాంచి హర్షముతోడన్
వినమితశిరుఁడై చెప్పం
గను వేఁడెను ముందునడచుకత కుతుకమునన్ 192

ఆ. మునిమనోబ్జభృంగ! ఘననీలరుచిరాంగ!
సదమలాంతరంగ! సాధుసంగ!
గాయదుర్గవాస! రాకేందు సంకాశ!
విబుధహృన్నివేశ! వేంకటేశ!! 193

అరణ్యపర్వము సమాప్తము.

శ్రీ! శ్రీ! శ్రీ!



# అశ్వత్థ భారతము

## విరాటపర్వము - ప్రథమాశ్వాసము





క. శ్రీదయితా! త్రిదశార్చిత
పాదా! శ్రితవరద! ధర్మపాలన! శుభదా!
వేదవినోదన! దుర్జన
ఛేదన! శ్రీ రాయదుర్గ వేంకటరమణా!

* పాండవులు వెంటవచ్చిన పరిజనులనుబంపి మారువేసము
లతో విరాటపురిలో నడఁగి యుండుట *

క. అనెనిటులాజనమేజయుఁ
గని వైశంపాయనుండు కాననవాసం
బును బండ్రెండేఁడులు ముగి
సిన, ధర్మసుతుండు గాంచి శ్రితజనవితతిన్. 2

తే. "కాననంబున మాతోడఁ గలసి, మెలసి,
యలసితిరి; ద్వాదశాబ్దంబు లరిగె; మాకు
దక్కె నజ్ఞాతవిధి యింకనొక్కయబ్ద
మగుట నిటనుండి మిమ్ముఁ బాయంగవలసె. 3

మ. అతిగుప్తం బగునున్కి మాకు నెఱి నీయఁజాలు; నాలోన మా
గతిగుర్తించిర యేని కౌరవు లిఁకన్ గాంతారవాసంపు దు
ర్గతి మాకౌ; నిదిమీకుఁ దెల్లము; నమస్కారంబు మీకెల్ల, నా
నతిఁ. నాశీస్సులనింతు; పొండు; మఱియెందైనన్ వసుం డంతకున్. 4

క. తీరునె మాకష్టంబులు?
కూరునె పరిజనుల, బందుగుల, భూసురులన్
జేరి సుఖంబుగ మనియెడు
సారదినం?" బంచుఁ గంట జల మాడంగన్. 5

చ. పలుకఁగ; ధౌమ్యుఁడంత "నిటుపాడియె, ధర్మనిరూపణార్థమై
సలిపినదీక్షగాక యొకసంకట మంటునె నిన్ను? జూడఁ ద
త్ఫలితము నీచకౌరవవిదారణమున్, భవదున్నతోన్నతా
మలసుయశఃప్రశస్తమును తాత్మజనశస్త్రముఁ గాదె భూవరా! 6

క. సురపతి ప్రచ్ఛన్నుఁడుగాఁ
బరగఁడె? హరి యదితిగర్భబాధలు వడఁడే?
తఱికొఱకు వీరు లిత్తఱి
మఱుఁగయి తిరమకలువడరె మహిమ మున్నన్? 7

మ. అటు ధర్మప్రతిపాదకుండ వయి, నీవడ్డఁ బోకున్నచోఁ
బటువీర్యక్రమవిక్రమం బెసఁగ నీపార్థుండు నీభీముఁ డా
కుటిలస్వాంతులఁ గౌరవాధముల నుక్కుం జెక్కరే? మించి ప్ర
స్ఫుటసామ్రాజ్యము నీవు గోరునెడ నేర్పుం జూపి సాధింపరే! 8

మ. అనఁ; బంకించి శిరంబు ధర్మజుఁడు "మీయాశీస్సులన్ బండి, యా
వనజాతాక్షుకటాక్షవీక్షణము మాపై నొల్కఁగా నుండినన్
క్షణముల్లబ్దము వృచ్చినచ్చి కడుహర్షింబోరఁగా మీమదీ
వనలన్ బొందుదు; మింకవీడ్కొనుఁడు దేవా! పోవమాకాజ్ఞయా?

సీ. అనుచును బ్రార్థించి, యగ్నుల ధౌమ్యునిఁ
గాపాడఁగా వేఁడి కడమునున్న
బంధుల, మిత్రుల బరిజనంబుల నెల్ల
ననువైన తావుల కరుగఁజెప్పి;
ద్వైతవనమ్మున వదలి పాండవు లెందొ
చని, తద్వియోగము చనఁగఁ దెలిసి
వందనమ్ములును, దీవనలు, నాలింగనం
బులు వారివారికిఁ బోరిని సలిపి

తే.గీ. అందఱును దన్ను వీడ్కొన్న యంతరమున
ననుజులను, ద్రౌపదినిఁ గూడియరద మెక్కి
తనరశస్త్రాస్త్రములఁగొని ధర్మజుండు
తరలి యొకవటవిటపంబు దరిసి, విడిసి:- 10

ఉ. ముందటిపూర్ణికై జతనముం బొనరింపఁగ ధర్మపుత్రుఁడ
య్యుందఱిఁ గాంచి "యిట్లు మన మైదుగు రీసతితోడఁ బోయినన్
మందియెఱుంగదే! మనకుమాటగుమన్కి యడొక్కఁడేనియున్
బొందిక కాదు; మీమదులఁ బొల్పువిధం బెది యేనిఁ దెల్పుఁడీ. 11

క. ఉత్తరమున నాకపుపతి
పెత్తన మగుఁ; బ్రాచ్యు లతనిప్రియులు,ప డమరన్
జెత్తనపుపతులు; మనచే
నొత్తఁబడిరి దాక్షిణాత్యు లాకతతి బలిమిన్. 12

తే. బాగ మనకింక నెయ్యది తగినతావు?
తోఁచ" దని యోచనము సేయఁ దొడఁగియున్న
నాయుధిష్ఠిరుఁ గనుఁగొని యర్జునుండు
సాంత్వనం బగు వచనసరసముఁ బలికి- 13

క. కౌరవ్యులకుఁ బగతుఁడు; వర
వీరుని, సింహబలుబలము వెరవుగఁ గొని పెం
పారెడువాఁడు; త్రిగర్తుల
వైరి విరాటుండు గలఁడు పశ్చిమదిశలో- 14

తే. మహితుఁడై యంగపశ్చాదిమాండలికులఁ
జేరికఁగొనెఁడు; న్యాయసుస్థిరుఁడు చూడుఁ!"
డనిన; ధర్మజుఁ "డిది తగు నైన మీదు
రూపముల మార్చ నెట్లగుఁ దోఁప దకట! 15

మ. హిమవచ్ఛైలమువంటి భీము నెసకం బేరీతిగా మాటఁగా
నమరేశప్రతివిక్రముండు నరుఁ డెట్లాఁ దారి తా నుండఁగా?
సుమకోదండులు వీరవర్యులు కవల్ సుశ్రీకొండ నెట్లోక దే?
ప్రమదారత్నము యాజ్ఞసేని మెయి దాఁపన్ మార్గ మొందున్న దే?

తే. అనఁగ; నర్జునుఁ డనుఁ "దిత్రిలోకార్చనీయు
శౌర్యధైర్యమహావీర్యసాహసుఁడవు,
శాంతిసత్యదయాకీర్తిసత్త్వుఁ డగుదు!
నీమహితమూర్తి నెటు మాటనేర్తు వనఘ? 17

తే. అనిన "సన్న్యాసినై, కంకుఁ డనఁగ, తేని
కడన నే నిల్చి, నానేర్పుకరణి మెఱయ
ధర్మబోధల నతనిచిత్తమును గొందు
నన శమనజుఁడు; భీముఁడు ననియె నిట్లు- 18

క. వంటలవాఁడుగ నేనై
యంటి ధరాధీశు, వలలుఁ డనఁగా, రుచిగా
వంటల వండెద; లీలఁగ
గెంటుచు మల్లురను తేనికిఁ మెచ్చఁగుదుఁ". 19

తే. పార్థుఁ డంతట "నూర్వశివలన నాకు
చేసి కా శాపమబ్బ నొక్కేఁడుమాత్రి
మద్ది యుండఁగ సురపతి తీర్చెనపుడు;
భోగ్య మగు నాకు నిష్టది పుణ్యవశత. 20

క. పేరు బృహన్నలగాఁ గాని,
యారాజును జేరి, కన్నియల కే నృత్యం
బారాధికఁ గఱపెదఁ, గడు
నేరుపు గల దండు నాకు నృపవర!" యనియెన్, 21

క. "దామగ్రంధి యనంబడు
నామంబున, నశ్వశిక్షణం బగు పనిగా
నేమంబుగఁ గొలిచెద నే
నామహిం ప్రు" నటంచు నకులుఁ డాడెను; విదపఁగా- 22

క. "గోపాలకుండ నయి, తం
త్రీపాలుం డనెడిపేర నృపుఁగొల్చుచు నే
నేపారెద" నని శౌర్యో
ద్దీపుఁడు సహదేవుఁ డపుడు తెలిపెను; పిదపఁగా. 23

తే. "నేను సైరంధ్రివేషంబు నూని విరటు
దేవిమొడ నుందు; గంధంబుఁ దీటుఁ బూల
మాలికలఁ గూర్తు, సాధ్వీసన్మాన్యవృత్తి
వర్తనముఁజేతు" ననుచు ద్రౌపది వచించె:- 24

ఉ. అంతట ధర్మపుత్రుఁ "డిటులన్నియు నొప్పెనె! మున్ను గుర్తునా
వంతయు నెవ్వరుఁగా మనలఁ బట్టఁగ రానటు రూపులబ్బఁగా
నంతకుఁడియ్యఁడే వరము? నయ్యదియుండ భయంబిఁ కేల? శ్రీ
కాంతుఁడు కృష్ణుఁడే మనలఁ గాచెడు, ఛేవిడఁబోఁడు నమ్ముఁడీ. 25

ఉ. వీరభయానకంబు లగువిండ్లు, వరాస్త్ర, సుశస్త్రజాలముఁగా
జేరిచి తెండు; దిక్కు లెగజిమ్మెడుభీకరశాఖ లొప్పి పెం
పారుశమీమహాక్షితిజ మల్లదె; యామసనంబు మధ్యలో
మీఁదెదు; దానదాచుదము; మేకొనిరం" తని ఖిమ్మిడాయుచుఁగా. 26

తే. మసన మిది యాట నిం దేరు మసలఁబోరు
సూర్యకిర ణంబులకుఁగూడఁ జొరఁగ రాక
దట్టమై చీఁకటులు బిట్టుదగులుదీనఁ
గట్టఁ బరు లేరుఁ దెలియ రీగుట్టు" ననిన. 27

ఉ. ఇయ్యకొనంగ నంద; అపు డింద్రతనూజుఁడు గాండివంబుఁ దాఁ
జయ్యన నెక్కుడించి, కని "శత్రువిదారణశక్తియుక్త మా
నియ్యది నాకరం బెడయు దెప్పుడు; నిప్పుడు తప్పఁజేసె నా
దయ్యపుఁజెద్ద మిట్టి" దనితాధను విచ్చె విచారభారుఁడై. 28

క. భూరిగద భీముఁ డొసఁగెను;
నారు లుడిపి, కైదువులు దొనలు నిడిరి కవల్;
చేరిచి యన్నియు జమునికు
మారుఁడు నాగములఁగట్టు 'మాదిరిఁ గట్టెఁ. 29

తే. శవమువలెఁదోఁపఁ బైనొకచర్మ మొనరఁ
జుట్టి, తన కేల దానిఁ బట్టి, యట్టె
నిర్మలస్వాంతుఁడైన యాధర్మజుండు
జమ్మివృక్షమ్ము నారోహణమ్ముసేసి. 30

తే. హరిహరబ్రహ్మలకు మ్రొక్కి; యష్టదిక్ప
తులను, సూర్యుని, శశినిఁ, బితృలను, దివిభు
వులను, వనదేవతాదిసర్వులను దలఁచి,
మొక్కి పెనుశాఖ నా మూఁటఁ జక్కఁగట్టి. 31

క, చాపాధిదేవతలఁ దా
నేపున స్మరియించి "నాకు, నీపార్థునకున్
జేపడుఁడు; తదితరులకున్
రూపింపఁగరాక భయదరూపులుఁ గండీ! 32

క. కవ లోకపరిఁ గోరినచోఁ
దవులుం; డీభీముఁ డెట్టితఱినేని మిమున్
దవులఁగ వచ్చినఁ, జిక్కక
దవుదవులన్ దొలఁగిపొండు, తప్పకుఁ" డనినన్ 33

క. ఆమాటకు భీముండు
ద్దామాగ్రహుఁ డగుచుఁ, "పాండుతనయులు మీతల్!
నేమాత్రము కౌరవ్యుఁడ
నే? మంచిది! చూతు మీదునియమములెల్లన్. 34

మ. సురసందోహమె యడ్డుఁగాక; యసురస్తోమంబె మాఱొడ్డి సం
గరమున్ సల్పెడుఁగాక; యేకమయి లోకంబుల్ పదినాల్గు భీ
కరమై పైఁబడుఁగాకఁ నామృడుఁడె వీఁకన్ దాఁకెడున్ గాక ని
బ్బరమై మించుచు మద్గదాయుధము నేఁ బ్రాణింగ్రహింతున్ జుఁడీ!

మ. అనుచున్ సాగరమట్లు ఘూర్ణిలఁగ; నయ్యేఁడిగ్గి యా-వృక్షమున్
గని. భీమున్ గొని కౌఁగిలించి "యిది కిన్కన్ బూనఁగాఁ గాలమే?
కొనఁగా సైరణ మాకునున్ బలెనె నీకున్ గల్గ; దల్లాట చే
వమకూళలంబుగ నబ్ధమున్ గడవ, నీయాలోచనన్ బన్నితిన్, 36

క. కోపమె నీకుఁ గల్గిన
నాపంగఁ ద్రిమూర్తులకును నగునే? యిటులన్
గాపాడఁ గంటి సమయము;
నాపాపమె మిమ్ము నెల్ల ననయన్ జేసెన్— 37

క. నట్టడవుల మిమ్మిట్టులఁ
బట్టించితి; జూదమాడఁబట్టి కలిమి పోఁ
గొట్టితిఁ; బెట్టితి నిడుమల
కట్టిడినే; నన్ను గనలఁగాదే నీకున్? 38

తే. అనుచుఁ గన్నుల నశ్రువుల్ తనుకఁ గంప
మొనర గళమున ధర్మజుఁ డనిన; దోన
జలముచే నగ్ని చల్లారుసరణి భీముఁ
డాగ్రహముపీడి పడి యన్న యడుగులందు— 39

క. "ఒడ లెఱుఁగక పేలితి నిటు;
నోడిగట్టితిఁ బాప; మెట్టు లుడుపఁగ నౌనో?
కడుకోపి నను శిక్షింపక
విడువను నీయడుగు లనుచు విలపించెఁ గడున్— 40

ఉ. అక్కునఁ జేర్చి, యశ్రువుల నల్లన దుడ్చి, మొగమ్ముఁ గాంచుచున్
జెక్కిలి నొక్కిపట్టి "యిటు చెల్లునె వీరవతంస! కాచినా
వెక్కటి లెక్క యింటన్; నిటులేటికి? పాపము నీకుఁ గల్గునే?
యుక్కివులైన కౌరవుల నుక్కడఁగించెదుగాక! తమ్ముఁడా. 41

తే. అని శమనజుఁడు భీమునియలఁతఁ దీర్చి
"విరటునగరికి ముందు నే నరుగువాఁడ,
నరుస మీరొక్కరొకరు రానలయు, నబ్ద
మోర్చి యెట్టులో, సమయంబుఁ దీర్చవలయు. 42

క. జయుఁడు జయంతుం డనఁగ, వి
జయుఁడు, జయత్సేనుఁ డనఁగ జతపడఁ బే, ళ్లా
పయిని జయద్బలుఁ డనఁగా,
నియమితములు గ్రమముగా నని వినిచి తగఁ. 43

చ. కరముల మోడ్చి, పార్గ్ధిశముఖం బిడి ధర్మజుఁ డంతటఁ జలా
కరమున యుక్షురూపమునఁ గన్పడి, కోరినరూపు లిచ్చి,యె
వ్వరు గుఱుతింపరానటుల వర్షముమమ్ములఁ గావఁగా, వరం
బిరవుగ నీవె? తండ్రి! యదియిష్టఫలింప ననుగ్రహింపవే. 44

క. అనినంతన, యతిరూపం
బనువుపడెఁ; దక్కువారి కందఱికినిఁ గో
రిన వేసము లపుడె యమరె,
నను వెనయఁగ నద్భుతముగ, నాశ్చర్యముగఁ. 45

క. అంతట వారల వీడ్కొని.
కౌంతేయాగ్రజుఁడు విరటుఁ గనఁ జన; నాభూ
కాంతుఁడు దపుదప్పాల యతి
కాంతునిఁ గనుగొనుపఁబోక కని, సంభ్రముగ. 46

చ. రవిసమతేజుఁడై పృథివిరాజుల నెల్లను నేలఁజాలు వై
భవవరరేఖలొప్పుముఖభాసురు, నీయతివేష మేటికో
తవిలెఁ? ద్రిమూర్తులొక్కమెయి దాల్చిరొ యిట్టులన్? ధర్మమీవిధిన్
భువి నవతార మెత్తెనొకో? పోల్పఁగరాదనుభ్రాంతి నొందుచున్.

తే. అట్లు డాయంగ వచ్చినయతినిఁ గాంచి,
యెదురుగాఁ జని, కొని తెచ్చి, పదయుగముల
నిజశిరఃకిరీటమొనరనిలిపి మ్రొక్కి,
సింహపీఠాధిరోహణఁ జేయ వేఁడ. 48

క. ఆసింహపీఠిచెంతన్
భాసిల్లెడు సముచితాసనంబును గొని యా
భూసురవరుండు వదనవి
కాసవిలాసముల నాల్గుకడలన్ బరపన్. 49

ఉ. నివ్వెఱపాటుతోడ ధరణీవరుఁ డైనవిరాటుఁ డంతి "మీ
రెవ్వరొ? దేవముఖ్యులరొ? యీయతిరూపముఁ గొంటిరేల? యిం
దెవ్విషయంబుఁ గోరి, యిటు లీరు నిగూహితవేషధారులై
యివ్విధి వచ్చినారొ? మఱిఁ గేటికిఁ దెల్పుఁడు సంశయింపకే. 50

క. కొనుఁడీసింహాసనమును;
ననుఁ, దనయుల, సచివవరుల, నాపరిజనులన్
బనిగొనుఁడు! మూఁడుపదముల
మును భువిదివిఁ గొల్చినట్టిమూర్తివిగాదో! 51

క. బలిపలె నిందప్రపదంబును
వలనను, రక్కసుఁడుఁగాను, వసుధావర! మీ
వలసినటుల వర్తింపుఁడు;
ఫలమేమీ వేసములను?బలుకుఁడు నిజముల్", 52

చ. అన;దరహాస మొల్కఁగని యయ్యతి "మానుముసంశయంబులన్
మనుజుఁడ, నేస్త్రిజుండ, గురునాథునిపంపున నొక్కయబ్ద మి
ట్లనఁగిమణంగి వర్తిలఁగనై యిట వచ్చితి! రాజనీతివే
త్తను, మఱిద్యూతిరక్తుఁడను, ధర్మరతుండను మత్స్యభూవరా! 53

క. ఒక పేరది కంకుండని;
యిఁకఁజాలఁ గలవుఁతడవ నిప్పడ వేలా?
రొకకేను పనికిఁ బోవను;
ప్రకృతం బాశ్రియ మొసంగి పాలింపు" మనన్. 54

ఉ. "చిత్తము, మీకు నచ్చినటు సేయుఁడు, పెద్దలు మాకుమీరలై
యుత్తమమార్గముల్ కఱపి యోగ్యుల సల్పుఁడు,మానసక్షితిన్
విత్తుఁడు రాజధర్మవరబీజములన్; గరుణించి మానిరా
ట్సత్తమ! కొల్వులందుఁ" డని తన్మాపతి ధర్మజు నిల్పె నాపురిన్. 55

క. నీవెవరవు? "వలలాఖ్యుఁడ"
"యేవర్ణము?" "నాలుగవది" యేవృత్తి? ధరే
శా! వాచవి యగు వంటల
నే వండెద; భీమునొద్ద నిలిచితిఁ దొలుతన్" 56

తే. వలలనామంబుతో నున్న పవనజునకు;
మత్స్యనరపతి కిట్లు సంభాషణంబు
కొంత జరిగినపిమ్మట, వింతపురుషుఁ
డితఁ డటంచు విరాటుఁడు నతనిఁ గాంచి. 57

ఉ. రుద్రిన కీడుజో డనఁగ రూపము దీప్తము హావభావముల్
భద్రముఖంబు వీక్షణము, భాషణముల్, బలముల్ పరిభావసి
ద్ధిద్రవరాక్రమంబుఁ గలనీవు మహాక్రియలన్ గతించఁగ, క్షి
ద్రుద్రపుదాస్యవృత్తిఁ గొనఁజూచెద వేటికి వీర? "యంచనన్. 58

ఆ. "బానిసము నొనర్తు; బవరంబునకు వత్తు;
నింక మించుపనుల నేను జేతుఁ;
బ్రకృతమందు వంటపనికి మాత్రమె నిల్తుఁ
గొనుము లేక, యొల్ల నని పనుపుము!" 59

క. అన "గాటగుప్రకృతివి! యే
పనినైనను గొనుము, వంటవారలపైనన్
జను మధికారిగ" నని ము
ద్రనొసంగిన, దానిఁ బూని తాఁ జనె నగుచున్. 60

చ. మఱియొకనాఁడు కొల్వుఁగొని మత్స్యమహీపతి యుండఁదప్పనన్
బురుషుఁడుగాక కేవలముఁ బొల్తిగ నొప్పక దివ్యతేజమున్
గరువముఁ గల్గిఁ వేషమునఁగాంతగ; భీషణభాస్కరుండుగన్
మెఱసెడు నొక్కమూర్తి మెల్లమెల్లనఁ జేరఁగరాఁగఁగాంచుచున్

క. ఇంద్రుఁడో యాతఁడు కాక యు
పేంద్రుఁడో; యిటు పేడివేస మేమో? యారా!
చంద్రసదృశరూపంబు, ది
నేంద్రప్రతాపంబు నొప్పె నే మనవచ్చున్.

ఆ. ఇట్టివింతవారె యేతెంత్రు; వీం లా
పాండుసుతులయొద్ద నుండి రేమొ?
అంతవార లకట! యడవులపాలైరి;
యేరి కెవ్వ డేమొ యెవఁ డెఱుంగు?" 63

ఆ. అనుచు విస్మితాత్ముఁడై యాతఁ డుండఁగ;
పేడిరూప మూని క్రీడి రాఁగ,
దివ్యతేజ మెలమిఁ దిగిచిన నామాత్యుఁ
డతని గారవించి, యనియె నిట్లు. 64

ఉ. "వీరవరేణ్య! యేమియిది? వేసమొ? దోసమొ? ధాతమోసమో?
కారణజన్మమో? స్వకృతకర్మమొ? శాపమొ? పూర్వపాపమో?
అరయ నామతిభ్రమమొ? యంతట కయ్యెను దిగ్భ్రమంబు! నీ
తీరుచరిత్ర మెట్టిదియొ తెల్పు మొకింత యనంగఁ గ్రీడియున్. 65

క. "మీ సలిపిన యూహలలో
దోసములే; దవ్వియెల్ల దొరకొని, యిటులన్
చేసెను పేడిగ దైవవి
లాసం బద్దీ నే బృహన్నలాఖ్యవరుండన్. 66

ఆ. త్రివ్వనేల దాని ధరణీశ! స్వాకృతంబు
కుడువఁబెట్టకుండ విడున; దద్ది
యట్టులుండె; నేను నట్టునయొజ్జ; మీ
పట్టిఁ దిద్దితీర్పఁ బెట్టు" మనిన. 67

క. "మేలు బృహన్నల! మత్సుత
బాలిక, కుత్తరకు, లాస్యవాద్యగతులు, గా
నాలాపములుఁ గఱపు" మని
హాళిని, సుతనప్పగించె నధిపుఁ డతనికిన్: 68

క. దామగ్రంధి యనంబడు
నామంబున, నశ్వశిక్షణను నకులుఁడు; గో
స్వామిగఁ, దంత్రిపాలుఁడు
నా, మఱి సహదేవుఁడును నణఁగి నిలిచి రటన్, 69

క, సైరంధ్రి వేషంబున
నారీమణి యాజ్ఞసేని, నయగతితోడన్
జేరఁగవచ్చె విరాటధ
రారమణునిసతి సుదేష్ణరాజీవాక్షిన్, 70

మ. మొగిళుల్ కప్పినచంద్రబింబమటులింపుల్ దక్కుచున్; మంచుచే
సొగసుల్ దప్పిన నీరజాతమటులన్ సొంపేది, ధూళ్యావృతం
బగు పూదీవటు మాసి, ప్రీతను మఱుంగౌ మానికం బట్టులో
వగతో ద్రౌపది,రాణిమందిరముతోవన్ బట్టి విచ్చేయఁగన్,71

ఉ. అంతిపురికిఁ, సతీనివహ మచ్చెరు వొందుచుఁజూడ; రాణియుకా
గాంతవిలాసపై ఖరికిఁ గన్నిడఁగా; నెద, నెత్తి, వీపులం
దంతకునంతకుఁ, దడవుచల్ల చెఱంగును; నేలఁజూచుచుఁ
గంతునిదంతినా దగసె కామిని కృష్ణను దేష్ణ నంతటఁ. 72

చ. నిజపదకాంతికుంకుమము నిల్చినచోటులఁ గూర; మేనికాం
తిజిగి సమీపకుడ్యములఁదీర; విలోలవిలోకనాబ్జముల్
స్రృజనముసేయుమాలికల; శ్రీ రజనైల్యము మేల్మొసుంగుదాఁ
టెజగి, యింటికప్పునకు టెక్కొనగూర్పఁగవచ్చి నిల్చినఁ.73

క. నిలువారఁగఁ గని విరటుని
చెలి "రమణీ! యెవ్వరీవు చెప్పు; మెచటి కే
ఫలమునకై యిటు తిరిగెదొ?
కలరూపది మెట్టిదొక్కొ? కాంతుఁ డెవండో? 74

క. ఆకార(శ్రీ)రేఖల
(శ్రీ)కాంతను బోలు దీవు, చెడినటు తిరుగఁ
నీ కేమికష్టమొక దే?
కా కీవేసంబుఁ గొనితో కార్యభరమునఁ? 75

క. నలు దేవివలె నె కఁదునిదు
మలఁబడితివొ? పాండుసుతులమానినివో? నేఁ
డలవా శ డవులఁబడి; రా
కలికిని నేఁగందు; నీవు కావుక దమ్మా. 76

చ. అనిన, స్మితాస్యయై "యటులె యౌను, మదీయచరిత్ర మెంతయున్
వినుటకుఁ గారణంబ! యది వల్దిపుడారయ; నేను దాస్యముం
గొనఁ జనుదెంచితిన్; మునుపుఁ గొల్చితి సత్యను, ద్రౌపదిన్ దగన్
వనములఁ బాండవుల్ వడుట, వచ్చితి నిన్ గొలువంగ నెమ్మితో.

తే. అనిన, "ద్రౌపది చెలివటె వనిత! నీవు?
ఆమె కాననమున కేగె ననుట వినుట
వ్యాకులముఁ గంటి; నిన్నామె యటులఁ జూతు!
నాకడనె యుండు! చింతింప నీకు వలదు. 78

క. అనఁ, గృష్ణ పలుకు "నీచపుఁ
బనులకుఁ జన, గరిత నగుదు; వలయుఁ కలవేపుం
బనులకు, విరులల్లుటకును
ననుఁ గొనుమా! మాలిని యను నామము నాకున్. 79

మ. అన, "నీరూప మనన్యలభ్యమ యగున్, హైన్యక్రియన్ బోషనం
చను దే? నాథుఁడు లేఁడు; జవ్వనివి, ధ్యేయం బెట్టిదో? భర్తయే
నిను బోఁద్రోసెనొ? సన్యసించితివొ? వన్నెల్ చిన్నె లేవారుఁ నీ
మనసింకెట్టులొ? యంచు రాణి వలుకన్ మర్మోక్తి; సైరంధ్రియున్.

ఉ. "పలుకుదు సత్య, మైదుగురు భర్తలు భూరిబలాఢ్యఖేచరుల్
కలుగుదు; రెప్పు డేమఱక కాతురు నన్ జెనకన్ జెనంటులన్
బలిగొనువారౌ; లీశ్వరుఁడెఁ వచ్చిన మానరు; నాదుచిత్తమున్
వెలిమఁగఁ దాస్య శాలి కది తేలదు; చెప్పుత మట్టితుచ్ఛముల్. 81

తే. అనుచుఁ బాంచాలి నుడివిన, నాసు దేష్ణ
"యంటి నే లోకసామాన్య మగువిధంబు;
నేరగింపకు; నీచిత్తవృత్తి యట్ల
నడుపు మీ" వని సంభావనంబుఁ జేసె- 82

సీ. సన్యాసివేషాన శమనపుత్రుఁడు కంకుఁ
డన, విరాటునియొద్దఁ దనరుచుండె;
వంటలవాఁడయి వలల నామంబున
మారుతి యయ్యెడఁ జేరియుండె;
అలబృహన్నలనామ మంది పేడిగఁ గ్రీడి
యట నాట్యగురుఁడయి యలరుచుండెఁ;
దనరి దామగ్రంధియను పేర నశ్వశి
క్షకుఁడయి నకులుఁ డక్కడ నెయుండె;
గోపాలుఁ డగుచుఁ దంత్రీపాలుఁ డను పేర,
నచ్చోట సహదేవుఁ డమరియుండె;
తే. కృష్ణ సైరంధ్రియై రాణియెడన నుండె;
గోప్యగతి, నోర్పు, భయ, మడకువయుఁ దగవు
మెలపు, నేరుపు, నెఱితోడ మెలఁగుచుండి
యంద ఱందఱ లాలించు చడఁగియుండి- 83

:- భీముఁడు మల్లురతోఁ బోరి వారిని జయించుట :-

మ. కురురా జంపగఁ బాండవాళికయిదిక్కుల్ రోయఁగా వచ్చి యా
విరటప్రాంగణమందు జొచ్చి నృపునిన్ వీక్షించుచున్ మల్ల శే
ఖరులౌ మేగురు మ్రొక్కి "లోకమువ వీఁకన్ మమ్ముఁ దాఁకంగ నొ
క్కరుఁడున్ గల్గఁడు; మీయెదన్ గనెదు వేడ్కన్ వచ్చినా మో ప్రభూ!

క. జీమూతమల్లుఁ డే నన;
నామల్లునిఖ్యాతి కడలనంటుట వినుటన్,
ఆమాత్స్యునిజెట్టులు గని
భూమికిఁ జూడ్కులను వ్రాల్ప, భూపతి కనుచున్. 85

తే. మదిని విసివినఁ, గంకుఁ డామాడ్కి నరసి,
"నేఁడు విడెమిచ్చి పంపుము, తోడ తేఁపు
రమ్మనుము చూత!" మంచన, రాజు వారి
కటులె విడెమిచ్చి తేఁపు రండనుచుఁ బనిచె. 86

క. ఆమరునాఁ డుదయమునన్
భూమీశుఁడు గొలువుదీరి, పోరిఁ గని కంకున్
"ఆమల్లురు వచ్చేసెద,
రేమాలోచించినార లీర?"- లనంగన్. 87

క. "మనవలలుఁడు మల్లురతోఁ
బెనఁగంగలవాఁడు, మేటిబిరుదుఁగలాఁడున్;
మనుజేశ్వర! పిలిపింపు మ
నిన, విరటుఁడు మదిని వెఱఁగొని కనుచుఁగంకున్. 88

మ. భువనఖ్యాతుఁడు మల్లుఁడేడ? యకటా! బోనంబులన్ వండి మ
న్కి వెలార్చన్ గలదాసుఁ డేడ? యిటు చన్నె వానిఁ జ్ఞపింపఁగా?
భువి దేవా! దయ లేదె? ధర్మవిదుఁడీవున్ గూడనిల్లాదు వే?
చెవులన్ గట్టుదె నాకు నిట్లఘుము" నా ధాత్రీసురుం డిట్లనున్. 89

ఉ. వెఱవఁగ నేటికిన్? వలలవీరుఁ డసాధ్యుఁడు! సామ్యుఁడీభువిన్
దొరకఁడు; తప్పు నానుడుల దూర్లదు; దోసము రాదు; భీముచేఁ
గఱచెను మల్లవిద్యమును; గంటిని; వానికిజోడు వీఁ డగున్
హరి కరిపైన దూకిడినయట్టులె మార్కొను నీతఁ డాతనిన్. 90

ఉ. అనఁ; బిలిపించె ఱేఁడు; సభ కావలలాఖ్యుఁడు గెంపు లక్షులన్
దనుక; గభీరతాననము దర్ప మెలర్పఁగ; బాహునాగముల్
కనుల భయంబు నింపఁగఁ, బ్రగాఢతరం బగు వజ్రవక్ష మా
ఘనుగరువంబుఁ జాటఁగ; ముఖంబున గుప్పెడుగుండ్రమీసముల్
గునియఁగ వింతఠీవి, మదకుంజరమట్టుల వచ్చి చొచ్చినన్, 91

క. విరటుఁడు సంభావించుచు
"వరమల్లులు వచ్చినారు; వారలు కీర్తిన్
మెఱయించినారు ధర; నిట
సరిమల్లులు సణగినారు చాల మటంచున్. 92

క. ఊరక పంపఁగవచ్చునె?
వైరులకడవారు వారు; బలియుఁడ వని నీ
పేరీకంకుఁడు చెప్పుటఁ
జేరితి; నీవిషయ మెట్లొ? చెప్పు మనంగన్ 93

ఉ. ఇంతకు నింతచింతయె? మహీతలపాలక! ప్రాణమన్న నా
కంతటితీపియే? యశముపచ్చడిపట్టుల జాఱనిత్తునే?
యెంతటివాఁడువాఁడు? జమునింటికి గెంటెద! వంటకట్టెయ
ట్లింతగ నింతగా విఱుతు లీలగ మేలుగ; వానిఁ జూపుమా! 94

క. అనునంతట జీమూతుఁడు
సనుదెంచె సహస్రమల్లజన తతితోడన్;
అనుమతి నొసఁగెను విరటుఁడు;
కని రొక్కరి నొకరు మలయుగజయుగ మటులన్. 95

ఉ. వంగి, ధరిత్రికిన్ సలిపి వందనమున్; మెయిఁ జల్లుకొంచు మన్;
చంగున దాఁటు లేయుచును, జయ్యన బాహుల నప్పళించుచున్
సింగపు బొబ్బరింత లిడి చేతులువట్టుచుఁ జుట్లుచుట్టుచున్;
అంగము లంటి గెంటుచు, ఘనంబుగఁ బల్లటు లల్లఁ గొట్టుచున్

సీ. నడుముకాసినిఁ బట్టి విడక గిఱ్ఱునఁ జుట్టి
యప్పళింపఁగఁబోవు నదను గనుచు
కాళులలోఁ గాలుఁ గీలించి, పడఁద్రోయ
సాహసంబును జాల సలిపికొనుచు;
తనువులఁ దక్కులోఁ గొని, బల్మిమై భూమిఁ
ద్రోయంగ సమయంబు రోయఁగనుచు;
గొంతును జంకలోఁ గుదియించి, పిసుకంగ
నోలిమై మిగులఁ దంటాలఁబడుచు;

తే. ధాటిమైమెత్తి దేహంబు మీఁట దివికి;
పొక్కిని మఱపించి తివియఁగఁ దఱికిఁ; బయికి
నుఱికి నుసిసేయు వాగలో నొక రొకరికి
నుచ్ఛ్వాసం బెద్దురకు నొగిఁ బెచ్చు పెరిగె 97

. తిగియుచుఁ, దీటుచు, నఱె పుట
మెగయుచుఁ. బిడిగుద్దు లిడుచు, నెసక మెసఁగఁగా
నిగుడుచుఁ, గవయుచు, బిగియుచుఁ
దెగి పోరిరి సభ్యులెల్ల దిగులువడంగన్. 98

చ. ఇటులఁ గుతూహలంబున నొకించుక సేపు నటించి. గొబ్బునన్
బటుగతిఁ బక్షిపై కుటికి పట్టెడు డేగవలెన్ వృకోదరుం
డటునిటు మల్లునిన్ బొదవి హావడిగాఁ దల కాలు కేలు కీల్
పెటపెటఁ గట్టివోలె నవలీలగఁ దా విఱిచెన్ క్షణంబునన్. 99

క. అంతట వేగురుమల్లురు
పంతముతో నొక్క మెయినిఁ బైఁబడ; వారిన్
వింతగఁ ద్రుటిలో వలలుం
డంతకపురి కంపి, యట్టహాసముఁ జేసెన్. 100

తే. సభ్యు లల్లన చప్పటల్ సరచి, హర్ష
నినదములఁ జేసి; రంతట జనవిభుండు
బానిసీనిని సల్పి సంభావితునిగఁ,
గొలువు సాలించి నగరునకుం గమించె. 101

క. వచ్చిన వేగురుమల్లురఁ
జచ్చుట, నిదియేమి తెలియఁజాలక కురురా
జెచ్చటనో చొట్టిలుండిరి,
వచ్చెద రని మఱచియుండె వారివిషయమే. 102

క. ఆనాఁటిమండి కంకుని,
బానిసవనితాని మత్స్యపాలుఁడు దగన
న్మానించుచుఁ, గార్యంబులఁ
దా, నియమింపఁ గడంగెఁ దటియగు నెడలన్. 103

ఉ. కంకునితోడ మత్స్యపతి జ్ఞానవిచారము, ద్యూతకేళి, రా
జాంకితదివ్యధర్మముల నారయుచుండును, బానిసీని పీ
రాంకితమల్లురన్ బులుల, హస్తుల, సింహచయంబు నొగ్గి ని
శ్శంకతఁ దాఁకి పోరవిడు, సంతసమొందుచు గాంచి క్రీడమై. 104

-కీచకుఁడు సైరంధ్రినిచూచి మోహించుట; సుదేష్ణాకీచకుల
సంవాదము.-

చ. ఉడుగక కాలమిట్లు చనుచుండ, విరాటునుఱంది దండనా
థుఁడు, బలగర్వితుండు; నయదూరుఁడు, సింహబలుండుఁ గీచకా
ఖ్యుఁడు,నిజరూపవిభ్రముఁడు గూర్చుఁడునప్పు సుదేష్ణఁ గాంచన
క్కడికరుదెంచి, కృష్ణఁగని కామవికారతఁ దక్కెఁ జేష్టలన్. 105

ఉ. నాతివిలాసవైఖరుల నాటినచూడ్కి మరల్పలేక తే
జోవిహీనుఁడై నిలిచె; చిత్తముఁ దత్తఱిఁ గత్తిదూసి పెన్
ఘాతముఁదీసెఁ; జిత్తమున గాయము జేసె, జలించె ధైర్యమే!
భీతియు భ్రాంతియున్ బొసఁగె; బీడ్వడెబుద్ధి; మనంబు చేద్యఁడే-

క. భువనవిమోహనతిలకమొ?
యువవిటతతి కొడ్డగించిన యురులో; కాయో
ద్భవుకరపుష్పశరమొ ! యీ
యువతీమణి! యురరే! యంద మొప్పగ నెటులన్? 107

అడిగింతునా? పరు లరసిరిగు ట్టని
కిగసి నాపై "గుట్టు" మనునో యేమొ?
ఊరకుందునో? కూ్రరమారుఁడు కసిఁ బూనె
తొడరిన్క జంపియేవిడుచునేమొ?

తే. యేమిసేయుదు? దారినాకేది? యింత
బలము, బలగముఁ, బ్రభుతయుఁ, గలిగియుండి,
జగమునె జయింపఁ గలచుట్టిశక్తి యుండి,
రిత్తవడితిని, మగువలు చిత్త మీఁక
కడఁగి భోగింపఁగా నౌనె మృడున కేని?

క. కానీ, చూచెద; నప్పను
దీనివిచారంబు నడిగి తెలిసెద! నాపై
నానేరుపుఁ బ్రకటించెద;
మాన, నని సుదేష్ణకడకు మత్స్యుఁడు తరలెన్.

తే. తొలఁగిపోయెను ద్రోవది; తోడనున్న
చెలియ లందఱు చెదరిరి; కలఁతనొంది
చూచుచుండె సుదేష్ణ నీచుండు తాఁగ
పీఠమును జూపెఁ; గూర్చుండి పిదప నలెఁడు.

ఉ. అక్క! భవత్సఖీనిభవామందునఁ జక్కనిచుక్కవోలె నీ
చక్కియ వెల్గుచుండిన విశాలవిలోచన యెందుజాతె? నీ
మక్కువ మన్ననమ్ముల ప్రవాణము లెట్టివి? దీనివృత్తమే
ఫక్కిది? జాతినీతిపరిపాటుల వెట్టి వచన్ సుదేష్ణయున్.

ఈయమ గంధర్వులసతి,
న్యాయంబగుమాన్యవృత్తి నాకడ నుండున్;
ఓయన్న! చాలుతొలఁగుము;
నీయూటలు సాగ విందు, నిజమిది! " యనినన్. 116

గుండె చలియించె; గుబులుదిగులు జనించె
చింత మదిఁ గాల్చె; మోహ మింతింత చీల్చె;
దిగ్భ్రమము మీఱెఁ దలఁగల తెలివి జాఱె
నెరిఁగు చాకీచకుఁడు వచ్చి యిల్లు చేరె. 117

పువ్వులసెజ్జమీఁదఁ బడి పొర్లును నిప్పులఁ బొర్లినట్లుఁ దా
దవ్వుల శబ్దమైన నది తన్వియెలుం గనిరోయు; భోజనం
బొప్పదు: తా ను మింటశశియున్ విడ, నానిసి నిద్రలేనివా
రెవ్వరుఁ గల్గ రాఘరిని; నీగతి సింహబలుండు వేఁగుటన్. 118

కనులు జేగురించెఁ; గందెను నెమ్మోము;
మందగించె మేను; డెంద మవిసె;
గడియ యొక్కయుగముగా రాత్రిఁ గడఁద్రోసెఁ;
గోడికూసెఁ, బాన్పు వాఁడువాసె, 119

తలఁపులపైఁ దలఁపులుఁ దల
నెలుఁగును, నాలు తొలఁగు; నిట్లు వేవేవిధముల్
కలిగి కలఁగి, కడ కతఁడోక
నిలకడఁ గని, కార్యములను నెఱవేర్చ తమిన్. 120

తే. పొసఁగనుపహారమును గొని, భూషణాంబ
రములఁ గైసేసి, గంధమాల్యములఁ దాల్చి
పరిమళమునించు విడెము సేవనముఁజేసి,
వీడు విడి సింహబలుఁడిల్లు వెడలి చనియె.- 121

తే. అటుచని సుదేష్ణయింటిముంగిట నొకర్తె,
నిలిచియుండిన సైరంధ్రిపొలుపు, కనుల
మెఱపు మెఱసినకైవడి మరులుగొలుపఁ,
దడఁబడుచు నిల్చె కీచకాధముఁడు బెదరి.- 122

క. పరికించి వఱడు సింహిని;
గరుడతరుణిఁ గాంచి పాము కామించునటుల్,
మరులువడి కీచకుం డా
తురమున సైరంధ్రి డాయఁ దొట్రుపడంగన్. 123

తే. తెలిసి సైరంధ్రి మదిఁ గళవళము నొంది
"సోలె నీచుఁడు చెడె" నని స్రుక్కి యెడఁదఁ,
దూలఁగ వెనుకడుగుల నిడులలినిఁ గాంచి,
దుడుకి ముందడుగుల వడివడిగ నిడుచు. 224

క. "నిలు; పలుకాడిన ముత్తియ
ములు రాలునె నోట? నాఁటిమోహినివి కదే?
వలఁగొంటివి చెలి! నామది
చిలుకను; బంజరము నుడుప చెల్లునె యిటులన్ 125

క. తోలిగూడున దానిని విడి,
పలికింపవె! యధరమధురఫలమిడి తనుఁపం
దలఁపవె! నీకుచములగు-
త్తుల విహరింపంగనీవె తోయజనయనా! 126

మ. అనునాకీచకు జూచి, రోసి సతి "నీకానేయిటుల్ వల్కఁగా?
ననుమోహింపగ రా;దలభ్యమిది యన్నా! కాలకూటంబు మిం
గను గాంక్షించుదే? బాడబంబు నుఱుకంగా నెంచుదే, కత్తిఁ జే
కొనుచుఁ గుత్తుక నుత్తరించుకొనుదే? గుర్తింపఁ జేటౌఁగదే?127

క. అనుచుఁ దాఁటఁగ; గీచకుఁ
డను "జరుగకు! మదుఁడు వాడియడిదంబున దూఁ
కెను పెనుగాయము; నౌషధ
మును నెఱుఁగుదు; బ్రోచికొనుము మ్రొక్కెదఁ దరుణీ! 128

క, నుడివిను; మడుగిడు టుడుగుము!
కడగంటికటారి నాటి కటుగతి నెడఁదన్
విడిపోవుదే? మరణార్తుని
కడుకొని తలఁగాచి ప్రోవఁగాదే? యనినన్ 129

చ. పరసతి కాంక్షసేయ ఘనపాతక మబ్బును; వాసి మాసెడిన్;
బరము సెడున్; దొలంగు సిరి;పాసెడినాయువు;నిందమోసెడిన్
సరిజనులెల్ల రోసెదరు; సత్వముఁ గోల్పడు సారముల్ జెడున్;
గరువము డీల్పడున్; గనులు గానని కాముక! మూఢకీచకా! 130

మ. అనినన్; సద్గతి కూలిపోని, నరకంబౌఁగాని. యిల్లాండ్రు వా
యని; మన్మిత్రులు బందుగుల్ విడని; రోయన్ గల్గనీలోకమే;
వనితా! మారుని కోర్వ నీకుచగిరిప్రాంతంపుఁ బాఱ్పిచ్చి నన్
మనుపంజూడుము పున్నె మయ్యెడిఁగదే! మన్నింపవే! మ్రొక్కెదన్

క. చెలి! తెలినవ్వుఁ జిలికింపుము; (131)
తొలఁగింపుము తాపభరము! తొటతొట నమృతం
బొలికించు నుడులఁ దృష్ణన్
బొలియింపుము! కవుఁగిలించి ముద్దిడు; మనినన్. 132

చ. కరముల మూసి కర్ణపుటిఁ గామిని, కృష్ణఁ దలంచి, లోన నా
నురవడి డించి "కీచక! యయో! కులనాశకుఁడౌదె? నీచముల్
దొరకొనఁజూతె? మోహమది లోకపునైజము; కాని శాసనం
బుఱవు! తొలంగు మింక క్షణముండకు; మోర్వరు మత్పతుల్ నినున్.

క. నాపతు లసమబలాఢ్యో (133)
ద్దీపులు గంధర్వు; లిద్ది తెలిసిర యేనిన్
ఏపున నిను సమయించెద!
రోపుదురా త్రిమూర్తు లేని నోఁ బోరలుగన్. 134

క. అని ద్రోవది యనఁ; గీచకుఁ
డనుఁ, "జా వెటు దప్ప దగుట నతివా! నే నిన్
మనసారఁగ భోగించియె
తను వీగెద మరుని బారిఁ దప్పింపఁగదే! 135

ఉ. నీపలుకోప మోఘమునకె పెట్టగు! సింహబలుండు కోపమే
మూనుకొనన్ త్రిలోకములె యుల్లలలాడవె! క్షితిఁ గొల్పుదే!
నీదయ రాని; యూపయిన నీపతులెల్లర నోర్తుఁగాని యీ
పాపము మాను, మారు ముఁడె వాలిన లీలఁగఁ గాలదాచనే!

క. మధుపపికమ్ములు రేఁగెను; [136
విధుఁడడరె, వసంతుఁడురుమె; వేఁపె మరుతుఁ; డా
యుధమెత్తెను మారుఁడు; నా
వధజతిగెడిఁ జూతువేల? పాలింపవె! నాన్ 137

తే. "వీరు చంపరు; దానికి వేతె కలరు
మరులు విడవేని నిజముగా మడియుదీవు!
తొలఁగు; మిది యింత మత్పతుల్ తెలియ, నిన్ను
దాచెదరు కాల! ననుచు సైరంధ్రి యనిన- 138

క. "నారీ! దూఱకు; జాఱకు;
వేతేమో గొప్పఁజెప్పి వెఱపింపకు; సన్
నీరమున ముంపనైనన్
క్షీరంబున ముంపనైన నీవొక్కతవే! 139

క. ప్రాణార్తునితో సరసమె?
మానిని! యభయంబు నిచ్చి మనుపంగదవే!
సూనాస్త్రుఁడు వేఁటాడెడు
దీనుఁడ! దాసుండ! కల్గదే దయ? తరుణీ! 140

క. నాసంపద కెల్లను నిను
జేసెద నధికారిణిగను; సేవలఁ జేయన్
జేసెద నారాణుల; నే
దాసుఁడనై కొలుతు! ” నని పదంబులఁ బట్టెన్— 141

క. “ గతియు, మతియుఁ జెడె నితఁ” డని
సతి ద్రౌపది సుంతచింత సలుపుచుఁ గ్రోధో
న్మతితో, వెతతో, సరభస
గతితో లోపలికిఁ జనియెఁ గలఁతన్ బడుచున్. 142

ఉ. కీచకుఁ డంత లేచి, కని “ కీడ్వడె మానము, మున్నుఁగన్ననాఁ
డే చెఱఁబట్టఁగాఁ బడితి; డీల్వడె నాసలు నిప్పు, డింక నా
యోచనలన్ని వీడువడె; నొవ్వులఁ జేర్వడె; నప్పుడొక్క తే
తోఁచెడు నాకు దోడువడఁ; దోడని చూచెదనంచు నెంచుచున్. [143

తే. అచ్చోటు విడివాఁడు లోపలి కట్టె యరిగి,
యొంటిగ సుదేష్ణ యచ్చట నుంట. దరిసి
పాదములవ్రాలె; ఫాలంబుఁ బట్టియెత్తి
యామె యాతని మణిపీఠమందు నిలిపి— 144

తే. చూచి “ పీనుఁగు మొగమటు దోఁచె వీని
యాననము; చెనకెనో యేమొ యాగరితను?
ధూర్తుఁ డీతండు వంశమున్ దుడుచుదాఁక
నావఁ.” డనుచు సుదేష్ణ తో మరిగి పొరిగి— 145

క. అగ్గలమగుకళ మొగమున
దగ్గెను. బొగ్గటుల నమ్మెఁ దమ్ముఁడ! కనులం
దగ్గి మిణుగుఱులుఁ బాఱెను;
డిగ్గురువడె హృదయ మేమొ? తెలియఁగ జెప్పుమా! 146

మ. అనఁగన్; గీచకుఁ డంత సిగ్గువడి తా నల్లంత చింతించి "నీ
కనలేనట్టిది లేదు: నీకొలువులోఁ గాంతాళిలోనన్ శిరో
మణి సైరంధ్రియె చూఱలాడికొనె నామానంబుఁ, బ్రాణంబు; మా
రుని బారిన్ బడఁద్రోసెఁ; గావఁగదె, కారుణ్యంబునన్ సోదరీ!-

క. దిక్కేది శరణుఁ జొచ్చితి
నక్కా! జగమునె జయింతు; నట్టిబలాఢ్యున్
ఇక్కలికి ననుగెలిచెఁగదె!
మొక్కెద పతి నాకుఁ గూర్చిపోవు" మనంగన్— 148

తే. అన్న! నిజవంశవిధ్వంస యముఁడవైతె?
కీర్తి సుమలతఁ జేసేత గిల్లఁగంటె?
పరసతినిఁ గోరి చెడినరావణుని వినవె;
అని వడంకి సుదేష్ణ యయ్యనుజుఁ గాంచి— 149

క. వేఁటాడుటె పరసతులను?
మాటాడుటె పరులసిరికి? మాతాండ్రులలోఁ
బోటాడక పరుగిడుటె? వి
రాటుని సమయింతులే! వెఱతు నినుజూడన్. 150

క. వనితపతులు గంధర్వులు
మనమా, మనుజులము! సామ్యమా? వల దాకా
మినిగాడవ! చెలువలగు మా
నిను లేక భువి లేరె? దాసి నృపులకుఁ దగునే? 151

క. తలమాసె, నొడలు మాసెను,
వలువలు, వంశమును మాసె, వల దుడుగుము! యీ
కలికి చెలువకాదు సుమా!
తెలియరు మగవారు చెలువుతీరుల వినుమా! 152

ఆ. చూచినేన తగినసుందరి నొనగూర్తు,
తక్కు దీని; మించుచుక్కఁదెత్తుఁ
బెండ్లి చేసికొనుము; పెడదారిఁ జనకుము
వేఁడుదాన! మాటవినఁ గదన్న!" 153

క. అని పలుగతులుగ వినుపం
గను, సోదరి నట్టెయట్టె కనుచుఁ నగుచుఁ,
వనితా! యివేటి మాటలు?
నను నెట్టులొ తోలఁగఁద్రోయనా, యీనేర్పుల్? 154

ఉ. నీవును భీతిఁగొల్పుదువె; నేనెవరౌటఁ దలంపలేవె; యీ
భూవిభుఁ జేరిబల్మిపయి నిత్తెను, నిక్కను నీ వెఱుంగవే?
నీ విటుత్రోయ మీగతుల నే నెటుసేయు? దయన్ గనంగదే?
శ్రీవజ్రవాడినోఁత! ననుబాలనసేయవె యక్క! మ్రొక్కెదన్ 155

తే. పలికితేని నాపైఁ బెండిలి సలుపుదు నని,
మనసు లగ్నంబుగాకున్న, మయికి లగ్న
మేల? ఫలమేమి? సుందరి యిద్దికాదె?
పోల నాకంటితోఁ జూడు తేలు నిజము. 156

తే. చిత్త మత్తుకపోయె నీచెలువయందు;
నుత్త బొందెకు పెండిలి యొనరుతు రఁటె?
నవ్వులాటమె యిది కాని, నాకుదానిఁ
గూర్చితేఁ జాలు, నయ్యదే కోటిమేలు!- 157

ఉ. రూపసి యిద్ది కాదని నిరూపణసేయుదె? మిథ్యలాడుటల్
పాపముఁ గాదె! లోకమున భామలఁ గానమె, యింతయందమే?
ద్రౌపదియో రత్తె యుండె నట! తక్కి నభూచరఖేచరాళిలో
చూపడిరొక్క యిట్టిరులు? సోదరి! వంచన నీకు శక్యమే? 158

క. చెప్పకు మొరులను; గనులకుఁ
గప్పయ్యె నితరులచె; ల్పొఁకఁ బరసతులపై
ర్లొప్పవు చెవులకు; నాల్కకుఁ
జప్పనగానయ్యె; మది కషవ్యాంబయ్యెన్, 159

మ. అనఁగన్; గన్నులనీరుగ్రమ్మె;హృదయంబట్టాడె,నాపల్కులన్
వినఁడేకూ్రరుఁడు;మమ్ముఁ గూడ దుడుకన్ వీఁ డెంచుఁజా వెట్టులీ
తనికిన్ దప్పద! యేమిసేయ? తనయంతన్ బోవఁగా నిచ్చి, యీ
తుణమేఁదో్రసెద! మీఁదఁ గల్గఁడోకో పోకల్ దీర్పఁగా దేవుఁడే?

క. అని మది నొకనిలుకడఁ గని,
వనితామణి యాసుదేష్ణ వానినిఁ గని " నీ
వనరుఁ బుడుగు సైరంధ్రినిఁ
బనిచెద నీయింటి కాసవముఁ గొని తేరన్ — 161

క. చను మట నీప్సితమును గొను
మన " కీచకుఁ డుబ్బి యదిర! యబ్బెను సుకృతం
బున, నప్పకరుణ వంచిన
వనితామణి; మరుని కినుదుఁ బండుగకునుపున్ — 162

తే. అనుకొనుచు, నక్కవదముల కతఁడు మొక్కి;
" మఱవకుము! తడయకు! మదిమార్పుఁ గొనకు!
వేఁచియుండెదఁ; దడవైన వేఁచుమాగుఁ "
డనుచు, నలరుచు గృహమున కాతఁడరిగె — 163

తే. చేది నిజసదనంబును, సారమధుర
సమును సమకూర్చి రుచ్యభక్ష్యములు చాలఁ
జేర్చి, యచ్చోటు విజనంబు జేసికృష్ణ
పయి మరులు గ్రోలు లుఱుకంగనయిన వాఁడు — 164

ఉ. వచ్చినయట్లు; క్రొఁగనులవాలు నురమ్మునఁ గుచ్చినట్లు; తన్
మెచ్చుచు నవ్వు వెన్నెలల మేనునఁ జిల్కినయట్లు; గుబ్బలన్
గుచ్చుచు నిచ్చఁగౌఁగిటను గుప్పినయ; ట్లధరమ్ముఁ గ్రోలఁగా
నిచ్చినయట్లు; నీవి సడలించి పయింబడినట్లు భ్రాంతుఁడై — 165

సీ. "అపు యిదేల పంప దని యల్కవహించు; గఁరించి కాంతతా
నొప్పక జాణ నోఁచునుచు నూర్చును; నుస్సురనున్; నెలంత షే
దప్పిఁ గావు దప్ప దని తత్తఱిలున్ మదిపాలు వోక లో
చొప్పఱి మాడుసుస్రుక్కఁ దడుఁ; జొక్కవడున్, దమినిక్క నిలుఁగున్

తే. అరవిరులఱ్ఱప్పెఁబడి పొరల నతని
కాగుమేన్ సోఁకి పూవులుఁ గమరె; లేత
యనఁటియాకులపీవన యట్టెయూర్పు
తాఁకుడులఁ గందె; నతఁడు వితాకు నొందె- 167

♦ సుదేష్ణ సైరంధ్రిని గీచకునింటికిఁ గల్లుతేఁ బంపుట ♦

ఉ. అచ్చట నాసుదేష్ణ ద్రుపదాత్మజఁ జేరఁగఁబిల్చి "దప్పి కాఁ
జొచ్చెను, రుచ్యమౌ మధువు చొప్పడుఁ గీచకుపద్మమందునన్,
వెచ్చెర తెమ్ము నీగమనశీఘ్రతఁ గందుముగాక! యంచనన్
ఱిచ్చనుబొంది, తేఱఁగని, చిల్వాన నీరయి కృష్ణ నొచ్చుచున్ 168

తే. "పోవ నే నోవ నచటికి దేవి! నీదు
సోదరుఁడు దుండగీఁడమ్మ! చూచి చూచి
పంపవచ్చునె? నీచంపుఁబనులఁ బోవ
ననుచుఁ దొలి నీకుఁ జెప్పనే? యన; సుదేష్ణ- 169

తే. మఱఁగియును మది ననుజుపై మమత పేర్మిఁ;
బ్రణయగతి నీవ తగుదని పంపఁ గంటి!
తనగుణముఁ బట్టి పరులు నుత్తములుఁ జెట్ట
లగుదు రంతియ చెప్పనే? యనిన, కృష్ణ. 170

క, కలతెఱఁగంతియు, వేఱుగఁ
దలఁపఁగ నన్నగునె? కష్టనము దాస్య మయో!
కలుగఁడె దేవుం డనుచుఁ, దె
రలెఁ జమకమునూని తానె రయగతిఁ; ద్రోవన్. 171

క, గతిరహితుల కిల నీవే
గతి! దుర్యోధనునిచేతఁ గనినపరిభవ
స్థితిఁ గనఁగ నుంటె; దయ శ్రీ
పతి! పాలింపఁగదె! పాండవప్రాణపతీ!! 172

చ. అని, కరయుగ్మమున్ మొగిచి, యజ్ఞహితున్ గనినేనుపాండునం
దనులకుఁ దప్పనట్టిసుమనస్విని నాదున యేని దేవ! య
న్ననయకెయుండఁ గీడు,కృప నేలఁగదే!యని మ్రొక్క నాతఁడో
క్కని భుజవీర్య రక్కసునిఁ గామినిఁ గావఁగఁ బంపె వెంబడిన్.

క. ఆతం డగోచరుండై
యే తెరఁగ, సింహబలునిగృహముం జొరఁగా
నాతన్వి పోయె, బెబ్బులి
వాతన్ బడఁబోవుహరిణివడువు వొప్పారన్. 174

క. పదనూపురఘణఘణలకుఁ
గదిసి పురుల విప్పి నెమిలిగమి, నటియింపన్;
మదవతితనులతసౌరభ
ముఁ దవిలి ఝుమ్మనుచు భృంగములు బాడంగన్, 175

క. మాదనివిండ్లను బొమలును;
చేరెను, తిలచుట్టినచ్చి చేరెను కండ్లుల్
తీరఁప నుంగురముచనుము;
మీఱుకటియుఁ గుచము తెనఁగు మెలఁతుకఁ గనుచున్. 176

ఉ. "నెత్తుఁ దేక తాఁకులిడనేర్చిన బాకిది; మేన వాతలే
బొత్తిగఁ దోఁపనీ కడుచు భూరికళంబిది; మానసంబునం
దత్తి పొగల్ రగుల్పఁ కను వార్చెడు చిచ్చిది; కంటిధార చేఁ
గుత్తుకఁ గోయుటింప మిదాళో" యని కీచకుఁ డార్చి దిగ్భ్రమన్

తే. "రమణి; రమ్మిటఁ గూరుచుండుము! మరుండు
మదిగుదురు సెఱచె; నికఁ నే బెదరఁగలనె?
బిరుదుగట్టెద విధునకు, భృంగములకుఁ;
గోయిలల" కంచు నాకాముకుండు వలుక- 178

క. "ప్రిచ్చెదెనో, రీటు నీచత-
నుచ్చారణసేయఁ? గుక్క-యోజఁ జరింపన్
వచ్చునె కీచక? మధువున
కివ్వోటికిఁ బంపెరాణి; యి" మ్మన నతఁడున్- 179

ఆ. "రాణిపంపెఁ దీర్చ్చుజాణవు! తతోన్వద
రుఁడను నాదు చిప్పి నుడువఁదగదె?
యధరమధురసంబు నానంగ నాకిచ్చి"
యనుచుఁ దన్ను బట్టుకొనిన; నామె- 180

ఆ. వెనుకఁ దగిలివచ్చు దనుజునిగాత్రంబు
డాఁకకొనంగఁ దఱుఁ దోఁచి నీచు!
చపక మచట వైచి సైరంధ్రి యుఱికెను
వెలికొలువునుగొన్న విరటుదెసకు- 181

*విరటుకొలువున కుఱుకు సైరంధ్రిని గీచకుఁడు పరిభవించుట*

తే. విడక కీచకుఁ డాసతి వెంటనంటి
"నాతి! పాఱకు! కుచజఘనములభార
మునకు విఱుగదె నీనడుము? నిలు మంచుఁ
బట్టి కెడపినఁ దోఁచె ద్రౌపది యతనిని- 182

తే, ఒకుపుఁ దప్పిననాగంబువడువుఁ దోఁప
నిగుడ నిట్టూర్పు, కోపంబు నిట్టలముగఁ
గుంతితుండయి, యాకీచకుండు వివశుఁ
డగుచు నిలుచుండె; సభ్యులు దిగులువడిరి. 183

చ. అనలుఁడు తేగి కన్గొనల నల్లలలాడెను; నాసికంబులం
దనిలువిజృంభణం బెసఁగె, నగ్నిగిరుల్ తలలందు భేదిలెఁ
వనధులు గుండెలఁ గలఁగె బాండుతనూజుల కద్దికాంచుటఁ
దనువులు పారవశ్యగతిఁ దాల్పగఁ జేష్టలుఁ దక్కె రొక్కటఁ

తే. ధర్మతినయుండు ధర్మతత్త్వరూఁడు సగుట
నవధిపాటించి యెట్టెటో యడఁచుకొనియె
సైచి, సైపక కృష్ణ నిశ్చలత నిలిచె;
గణచుకో బోయి విఫలుఁడై యనిలసుతుఁడు- 185

చ. పెటపెటలాడఁబండ్లు; కనువిప్పుల నిప్పులు రాల; భూరిభూ
కుటి నటవాతిరేకగతి గొబ్బునఁ గక్షితి; ప్రచండభానుసం
ఘటితముఖంబు దోఁప; లయకాల భయంకరముద్ర రౌద్రవి
స్ఫుటనిటలాక్షుఁ డన్నెఁ బెరచూడ్కి కినందఁగఁ గాక లోననే-

శా. పంచన్ నిజాండభాండముల బ్రద్దలుగొట్టఁగమించు నల్కలోఁ
గెరలుచు; నీచకీచకునిగీటడఁచన్ గనియున్, బ్రభుండునై
సౌరకొని శిక్షసేయక మె దుర్మదు నూరకవుచ్చినట్టియా
విరటుని మోదఁజెంతఁగల వృక్షముఁ గన్గొన;దానిఁగాంచుచున్ 187

మ. కనునైగన్ మరలించి ధర్మజుఁడు "శాఖాపుంజమై యాశ్రితా
వనమై దివ్యఫలప్రదాయియయి తేవన్ మించునీ వృక్షమున్
గనుదే? వేలుప్రమాని బొగ్గులకునై ఖండించువ్వారున్ బలెన్
జనునే కూల్పఁగ నంటకట్టెలకు నంకన్ గల్గవేసువ్కముల్, 188

క. అన, వినితద్గూఢార్థం
బనిలజుఁడు గ్రహించి, మిన్నకట్టులె యొదిగెన్,
కని యామె యన్నదమ్ముల
యనయపుఁ జేష్టలను, గలయ నాసభఁ గనుచున్ 189

గీ. "మత్స్యనాథు సభాస్థలి మహితుఁ డొక్కఁ
డైనఁ గలుఁగడో? కో, ధర్మహానిభయముఁ
గలిగిపలికెడివాఁడు? రక్షకుఁడు, లేఁడు . .
శాసకుఁడె యోర్చి చూచుట చన్నె చెప్పుఁడ-? 190

క. అన, సతిపై నక్కటికముఁ
గని విరటుఁడు నీచుఁ గినియఁగా సత్యము లే
మిని, సాంత్వనమగువాక్యము
అను దెలుప్పఁగ గీచకుఁడు దొలఁగె నాతలమున్. 191

క. గుజగుజలువోవు చాసభ
గజిబిజిపడఁజొచ్చెఁ; గృష్ణ కదలక పతులన్
బ్రజలన్ గనుచుండఁగ ధ
ర్మజుఁ డప్పుడు స్థైర్యమూని మానినిఁ గనుచున్. 192

చ. "జనపతియున్ సభాసదులు సర్వులు నీ తెఱఁగెల్లఁ గాంచి రో
వనిత! తొలంగు మింక బహుభాషణముల్ పచరింపఁ బోవకీ
వన "దినగండమయ్యె నిది యక్కట సైఁపఁగలట్టిదే? విర
క్తునకటె,యాలిమానగతితోఁచునె?కంటిమి కంక పోలు పేల్."

చ. అని కినుకన్ వచింపఁ గని యాతఁ "డి దేటిది?సాధ్విమానమున్
గానఁగలఁడే యొకండు?మునుఁ గొల్చిన దేవుఁడు నేఁడు గల్గఁడే
నిను భరియించుఖేచరులు, నిర్దయులే? సతి! దుర్బలాత్ములే?
కనుఁగనలేవొ? ధర్మగతిఁ గానవొ? కర్మము పాటెఱుంగవో? 194

క. వరవుడుదానికిఁ దెలియునె
గరితలగతి? చాలుఁ; బతులు ఘనసత్త్వులు నీ
పరిభవ మరయరె? నీకీ
నురులేటికిఁ దొలఁగు! మనిన, మానిని చనియెన్. 195

తే. వెడలి యట్టు కృష్ణ నిట్టూర్పు లిడుచు, నశ్రు
లురల మఱఁగి, సుదేష్ణమందిరముఁ జేరఁ
గాంచి యాతీరు రాణి లోఁగలఁగి, వెలికిఁ
దోఁపనీ కడి పాంచాలితోడఁ బలికె— 196

క. "దిగు లొందినట్లు చూపుల
వగ దోఁచెడు; మొగము వాడె; పసలారెడు మేన్
సెగఁ బొగలె నెవ్వఁడేగతి
నగడువడన్ జేసెఁ దెలుపుమా! యత్తెఱఁగున్. 197

క. దండించెద వానిఁ ద
ప్పుండైనను, దండ్రియైనఁ, బుత్రుండైనన్
ఖండితమిది" యనుమిథ్యా
పండితురాలికి వచించెఁ బాంచాలివగన్. 198

తే. "తెలిసి తెలియనిగతి నాడవలఁతె? నీకుఁ
గల్లు తేఁబోవఁ గీచకుఁ డొల్లమఱచి
పట్టరాఁజూచి, నృపుకొల్వుపట్టుకడకె
యుఱికితిని వాఁడు బఱతెంచి పఱచెసభను! 199

క. అనఁ "గీచకు దండించెద;
వనటను మానుము" యటంచు బహుభంగులుగాఁ
దనుబ్రతిమాలంగ, సుదే
ష్ణను గొన కాద్రుపదసుత కనలుగొం తెనయన్— 200

క. "నీ కేటికి దండింపఁగ
నాశాంతులు దీర్త్తురది" యనఁగ, గాణి విధీ
త్యాకులయై పార్థించినఁ
గైకొన కాకృష్ణ కోపగతి విడకుండెన్. 201

తే. తోడియంగనలెల్లరు "దుష్టకీచ
కునకుఁ దగుశాస్తి యగుత!" యంచనుచు వదిని
దలఁకుచుండిరి; కృష్ణ సంతప్త యగుచుఁ
జాన్పుఁజేరెను గనుల బాష్పములు దొరల- 202

క. అని వినిచిన వైశంపా
యను జనమేజయుఁడు గాంచి, యతిమోదమునన్
వినమితశిరుఁడై చెప్పం
గను వేఁడెను ముందునడుచుకతఁ గుతుకమునన్. 203

ఆ. మునిమనోబ్జభృంగ! ఘననీలరుచిరాంగ!
సదమలాంతరంగ! సాధుసంగ!
రాయదుర్గవాస! రవికోటిసంకాశ!
విబుధహృన్నివేశ! వేంకటేశ!- 204

విరాటపర్వము, ప్రథమాశ్వాసము.
సంపూర్ణం.



శ్రీ శ్రీ శ్రీ

# అశ్వత్థ భారతము

## విరాటపర్వము - ద్వితీయాశ్వాసము.



క. శ్రీదయితా! త్రిదశార్చిత
పాదా! శ్రితవరద! ధర్మపాలన! శుభదా!
వేదవినోదన! దుర్జన
ఛేదన! శ్రీరాయదుర్గ వేంకటరమణా!- 1

క. వినుమని వైశంపాయనుఁ
డనెజనమేజయునితోడ," నాద్రౌపదిచిం
తనుగన్నీరొలుకఁగఁ, బా
న్పునఁ జొరలుచుఁ దుదకు మదిని స్ఫురియింపంగన్. 2

ఆ. "పరిబలుఁ డైనసింహబలుఁ బొరిపుచ్చఁగఁ
బవనసుతుని బాహుబలమెపోలు!
దైవబలముఁ గూడఁ దగియుండు" నని యెంచి,
రాత్రికొంతవడికి రమణి లేచి. 3

క. జనులెల్ల నిద్రఁ గొను నద
నున శయ్యను వీడి, నిజతనువు ఘూళిని నీ
రునఁగడిగి, తొడిగి చలువర్
జని భీముని గనె మహానస గృహములోనన్. 4

క. పాతక కీచక దుర్నయ
తీతికిఁ బ్రతిసలుపఁ దలఁపు తేఁచుటఁదను, చిం
తాతురుఁడై మందుచు, సతి
నాతఁడు గని పలుకరింప కలె యుండంగన్— 5

ఉ. "నీకనుముందుఁ గీచకుఁడు నీచత నన్ను బరాభవించియున్
జేకొన సౌఖ్యశయ్యఁ గని నీకనుమూసెడు శాంతినిద్ర నీ
కేకరణిన్ ఘటిల్లె? నవుడేడ్తుఅమాన్పుట నన్న సన్న ని
ట్లీకతినత్వముర్ గానితో? యీపిరియురాలి ననాథఁ జేసితో 6

ఆ. బాల, యాలకూయిఁ బగతునకై నను
నరయుఁటిదియ ధర్మమనిన బాల
నాలినీచుఁ డప్పుడటుదొరియఁ గనికని
తాళినావ! ప్రాణదయితుఁ డీవ!— 7

క. అనఁ, "జెప్పకు మది యగ్రజు
ననుమతి పాశమునఁ జిక్కి నట్టిఁడనే; నా
తనికె మోఅయిదుము సతి! పా
ర్థ, నకుల సహదేవులను శరణుకొని చనుమా! 8

తే. నాఁడు దుశ్శాసనుని పేర్వు లూడఁబెఱికి
నమిలి రక్తమునాన నేదుముకనున్న
మాన్చె; సైంధవు నటుమంచె; మరల నేఁడు
నడ్డె గనుసన్న నాయన్న; యరయుఁ దీవ! 9

కం. మడతిమరులు వడి యగ్రజు
నుడిదాఁటితి ననుచు జనము నోనాడెదు; నేఁ
గుడువఁగరాని యనల మిది!
విడునే విసజాల, మదికి వేఁగయ్యెఁగదా 10

తే. మాదుశస్త్రాస్త్రముల జమ్మిమ్రానఁ గట్టి
యన్న యన్నట్టిపలుకుల విన్నదాన!
వేన దుందుడుకట! వార లింగితజ్ఞు
లంట! చాలదె బహుమతి యరయనాకు?- 11

కం. గరువము వలుకుటగా దిది!
తరుణీ! నా తెంపు వేఱు; ధర్మంబునకున్
మఱిహద్దువలయుఁగా కిటు
గుఱి, గెర. సరితోలఁగుపథముఁ గొననాయత మే? 12

ఉ. చెప్పెద నొక్కమాట! నరుచిత్తము నుత్తలమెత్తఁ బల్కుమా
త్రిప్పము ధర్మసూతిమతి; రేఁగఁగవల్పచరింపు; కార్యముల్
జొప్పడఁజూడు; మయ్యదియు శూన్యఫలంబగునేని మానినీ!
తప్పది వారిదే నిజము! తాకదు నాకపకీర్తి పామ్మనన్- 13

చ. అనలముఖంబునన్ బొడమి; యాద్రుపదాధిపు పెంపు సంస్థితిన్
గానములప్రోవు కుంతిపెదకోడలి నై కొని యీడఁ గంటిఁ; బ్రా
వనులగు పాండునందనుల పత్నిగ సౌఖ్య సుధాబ్ధిఁ దేలితిన్
అనఘుల వీరవిక్రముల నందనులన్ గని కీర్తి నందితిన్ 14

తే. అతుల మైనట్టి రాజసూయావభృథను
గరితెఁ బూతెను సభ నొకకరినుఁ డేచి
పరిభవించిన నది చూచి పతు లనాద
రించ; గతి మతి మాలి జీవించుటె సతి?- 15

క. ప్రాణంబు నిచ్చి యేనియు
మానముఁ గాపాడఁ దగును మగువకు; మగఁడే
మానాపహారుఁ జంపక
మానఁగ, నిల మానవతికి మన్నన కలదే?- 16

క. ఉడుగదు తానింతటఁ, బైఁ
బడఁదొడరెను తెప్పు మాపు; పతులె సతినఁ జే
విడిచిరి; మానరక్షకు
విడుటెఁ దనువు నాజ్ఞనిమ్ము! భీమా! యనుచున్- 71

క. బిట్టుగ నశ్రు లురలి, చను
కట్టుపయిన్ మిట్టిపడఁ గడుకొని గుండెల్
గొట్టుకొనఁగ దడదడ; సతి
యట్టె యొరిగె భీమసేను నడుగుల మీఁదన్ 18

ఉ. కన్నుల నీరు గిట్టుమని నెక్కొని మ్రాన్పడి యున్న భీముపై నెమ్మొగ మొల్తె! ... 
మోము తిరిగి వాతెఱ యూఁదుచు నొక్కి ... నూఱు వేళ్లలోన్ జేర్చి; వే
లన్నియు లట్టి దీర్చి, సలిలంబుల మోమును దుడ్చి, మిన్నకా
కన్నుల లోనఁ గన్నులిడి కన్గొని మీసముఁ గేలదువ్వుచున్ 19

ఉ. చించెదఁగీచకున్; గనలుఁ జెందిన మాత్స్యుని దున్మెదన్; నన్నుగు
రి్ంచిన గౌరవప్రజము వ్రేల్చెద; నగ్రజుఁ డడ్డ నేని ల
క్షించెద నే! సహోదరుల గిన్మ్రవ నిత్తు నె? శౌరిమీఁదికో
పించిన మించనే? ప్రతిన ... నీచుఁడు చచ్చెఁ బొమ్మికన్”20

వ. అని సతిహస్తమందు నిజహస్తము నూన్చి “ప్రమాణమిత్తెఁ గై
కొను మిదె మోదురాశయుని గూర్చి యుని నీచకుఁ నీటడంచెదన్;
జనవిఁబిపింపు రేపునిశి నర్తనశాలకు వాని నొంటి ర
మ్మని; తెగఁజీల్చి వింది దెద నయ్యధమాధముఁ జేతిజాతికిన్

క. కుసుమతి మనల నెఱింగిన
మఱి వనవాసమునుఁ గాదెఁ మనువా! యెటులో
మఱుఁగగు రీతి నె నీచునిఁ
బరిమార్చెద సర్వవిధుల భయరహితముగన్ 22

తే. అనఁగ; మొగ మలరఁగ నయ్యాజ్ఞసేని
యప్పుడాభీముఁ గౌఁగిటఁ గుప్పె, నిరువు
రట్టి నిముసంబు వివశత ననుభవించి;
అంత వీడ్కొనె సతిపతి యాజ్ఞను గొని.

క. కడఁగి నిజగృహమున రాత్రిఁ గడపి కృష్ణ
ప్రొద్దున నె లేచి. కాల్యముల్ పుచ్చి, భక్తి
భానునకు మ్రొక్కి, కృష్ణు భావమునఁ దలచి,
భర్తల స్మరించి, ముంగిట వచ్చి నిలచె, 24

—: భీముడు నర్తనశాలలో కీచకుని సంహరించుట :—

ఉ. కామినిపై విరాళిఁగొని, కామునికోలల నొచ్చి, కొల్వులో
నామెయి భంగమొంది చని, యాకలుషాత్ముఁడు కీచకుండు, నా
యామిని దుష్టస్వప్నముల నానుచు. వేగుట లేచి, భ్రాంతిఁ దై
భామజపంబుతో సమయవర్తనముల్ పచరించి, పిమ్మటన్ 25

తే. దివ్యతరభూషణాంబర భవ్యగంధ
మాల్యములఁ దాల్చి; మదిని సంభ్రమము గదుర,
నమరగట్టిన నిల్వుటద్దమునఁ దనదు
చాయఁ గని, నీటుసవరించి. చనెఁదనంత 26

క. చనిచని ద్రౌపది యుండున
దనముకడన్ జూడ్కి నెఱపెఁ, దత్తరుణియు ముం
దునముంగిటఁ దోఁచినఁ దన
కనులుఁ దనియ, మనముఁ గునియఁ, గనితాననియెన్ 27

ఉ. "మొత్తియమిత్రభూపతుల మూలలకొత్తిన మేటివీరుఁడన్
ముత్తెములట్టి భూభుజుల మోహావృహ్రియప్రు స్త్రీలచిత్తముల్,
గుత్తకుఁగొన్నఁవాఁడఁ; గొనకుణనిమఁ బట్టఁగఁ బల్మిఁగల్గి, యా
వృత్తిని మానితిన్ రసవిహీనుల యాటది యాటబిత్తరీ! 28

ఉ. "పంకరుహాక్షిరో! పశలు పేర్ష ములయ్యెను నిన్న మొన్న! నే
నొంకుఁడు నేఁచెఁ గాలయము నట్టులఁ; నేనిదినాకు దక్కెఁ గ
శంక జనించె; నీచరణసాక్షిగఁ బ్రాణము మాన వీవ! నీ
కింకరుఁ డేన! నామనవిఁ గేరడఁజేయకు మంచు" మ్రొక్కెఁ గ. 29

క. "మరుఁడు యముఁడగును; మనికియె
గరళంబగు; నఖు లురులు గానగు; హితులే
యరు లగుదురు వలవని పర
తరుణి మరులుఁ దగిలినట్టి దౌర్భాగ్యునకున్! 30

క. వలవన్న వినవు; ప్రాప్తికిఁ
గలదే ప్రీతి తలఁప? నాదుకాంతులు గన నీ
తలఁదఱుగుదు; రానర్తన
నిలయమునకు రాత్రి రమ్ము నీ వాకరుఁడవే"- 31

క. అన "నీకిఁ ట్లాశీస్సుల;
మనితిని నీ కరుణ! నను మగుడు మృతునియఁ"
ట్లనఁ; "జను నిలకిట; నిసి నొం
టిని ర"మ్మన నట్లె యని చనెఁ దమి నతిఁడున్. 32

తే. పిదప నిదియెల్ల గోప్యమౌ విధిని దుపద
పుత్రి భీమున కెఱిఁగించెఁ; బొంగుచు దుల
నడమువిడుఁ గృష్ణ కడచి రాపగఁలు; నంత
నస్తమించెనురవి తమస్సమ్మరె రాత్రి 33

ఉ. కీచకుఁడంత వీడుకొని కృష్ణ నటుల్, యుగమట్టు లాపగల్
త్రోచెఁ, దలంపుపైఁ దలఁపుఁ దోఁపఁగ, నొక్కెడ నిల్వనోపకే,
వేఁచుమనంబుతోడ, మరువ్రేటులపోటుల; మిట్టిపాటు సం
కోచము, సంశయమ్ము,భ్రమ, కోపము, తాపము, రెచ్చిరేఁట్రేఁగన్

ఉ. "వచ్చునో రావొ యచ్చపల? వంచనవాక్కుల బుజ్జగించెనో?
పొచ్చెము లేలసెప్పు? నటుపుచ్చినదాని కదేమి లాభమో?
యిచ్చయె యున్న, నిన్ననను నేటికిత్రోయును? కాంతభ్రాంతయై
వచ్చుట సత్య! మేటికిటు వంకరుకోగము నాకుబుట్టెనో! 35

క. క్రొత్తడియగుటన్ దా నవు
డత్తఱి నొల్లమి నటించె; నాటదికద యా
బిత్తరి, నారూపము తన
చిత్తము నొత్తదె! మరుండు చెలరేఁగింపన్- 36

క. అతివ తనకు గంధర్వులు
పతులనె; ననుఁ ద్రోసినట్టివారలొ వారల్?
సతిమరులున నడఁ సైచితి
గతియింపరె నేనుగినియ ఖచరుల్ గిచరుల్?—" 37

ఆ. అనుచు నూఱడిల్లుఁ; గను సంశయము మఱిఁ
బ్రొద్దుకడనఁ జూచుఁ; దద్దనూర్చుఁ;
గఁలత నొందుఁ; గన్నుఁగవమూయుఁ; దలపోయుఁ;
నావలించు, నొడలి నట్టె విఱుచు- 38

తే. అచట మారుతి, యీనిసి నంధకార
మందుఁ దలచీర మొలచీరయట్లు గట్టి,
యతివతో నేగినృత్యాలయమున మంచ
మందుఁ దాఁ బండె; నటఁ గృష్ణ యడఁగియుండె:— 39

చ. మదనవికారుఁడై, స్వబలమత్తుఁడు సింహబలుండు వచ్చియు
న్మదగతిఁ జొచ్చి మండపము; మంచముడాసి, కరంబుసాచి యా
పదమున మేనువాలిచిన పావనిపాదము నంటి యుబ్బుచున్
మదవతి ముందెవచ్చితివె? మంచిది నాయదెజాగు సైచుమా! 40

చ. అన, ఘనరోష వేగగతి కాగకయుండియు సైచిభీముఁడా
యనయుఁడుసల్పుచైదముల;నాడెడు వాక్కుల చొప్పఁజూడఁగా
వినమనసొటఁ జేష్టితము వీడ్వడియుండెను; కృష్ణడాగి విం
తనుగని మెచ్చుచుండెను; మదంబునఁ గీచకుఁడున్ బ్రిమోదియై

ఉ. "వేనకువేలుస్త్రీలు ననువేడ్కరమించి రభీష్టవస్తువుల్ [41
కానుకలిచ్చి; నారుల నిగారపు నారివి! నీవ గెల్చితో
మానిని! నన్నుగూడ నిఁకమానవు! భ్రాంతవుగాక పోవు లే!
కాని" యటన్న, రోసియును గాడుపుపట్టి సహించి, యాపయిన్.

ఉ. "అరయ నీకురాద! యిది యందఱినారులయట్టి నారియే! [42
చేరినగొంతువట్టుఁ గరశృంఖలమా; సురనారిసౌఖ్యమున్
గూరుచుఁ, గందు వింక" నని కోపము రేఁపఁగ లేచికీచకున్
మారుతిమోదె 'ఖేచరులుమాయలఁబన్ని'కటంచు రేఁగుచున్ 43

చ. తోడఁబడివాఁడు భీముపయి దూఁకెను; పావని వాని నెత్తిపై
నడచెను; కీచకుఁడు గడుసల్గుచు మారుతి డొక్క ప్రక్కలన్
బొడిచెను; భీముఁ డంతఁ బెనుముష్టిని వాని యురమ్ము ప్రయ్యఁ బె
ట్టిడెను; రవంత సొమ్మఁగొని యెచ్చరమున్ గని వాఁడుఁ బైఁబడెన్. [44

క. పరులెఱుఁగ రాదటంచును
నిరువురు సవ్వడులు నిగుడనీయక, లోలో
సరిసరిబలిమిని, దెలివిని
నరమర లేకుండఁ బోరి రద్భుతరీతిన్. 45

క. అడరుచుఁ దొడరుచుఁ, గడుకొని
పడఁ ద్రోయుచుఁ, బట్టుగొనుచుఁ బట్టుచు, విడుచున్;
ఎడనూకుచుఁ, బిడికిలి నిడి
పొడుచుచు, నడచుచును విడక పోరిరి కడఁకన్. 46

క. హరిణముఁ బట్టెడు సింగము
కరణిన్ గీచకునిఁ బొదివి, కాలున్, గేలున్,
శిర; ముదరముఁ జొఱఁ బొడువులఁ
బరిమాలిచి భీముఁ డాద్రుపదజను జీరెన్. 47.

తే. అడఁగి యందున్న ద్రోపది యరుగుదెంచి
కాంచి వెఱగంది, "యోనీచ కామవృత్త!
యింత కెంతెంతఁ జేసితి; వేమి కంటి?"
యని పలికి భీముఁ గొనియాడెఁ దనివిదీఱ! 48

క. అపుడుంగఁ బగబని కృష్ణను
సభయందే నిలిపించి తెరలెఁ; బనఁపడి సతి నె
ల్లాడి, కావలివారలఁ గని
యడివెను జేరంగఁజని నొప్పఁగ వారల్. 49

క. "నామగఁడగు గంధర్వుని
చే మడిసెను సింహబలుఁడు: చెడునడనడి దు
ష్కాముకులకు గతి యుండునె?
భూమిని నన; దివ్వియలను బూనుచు వారల్- 50

* కీచకుని శవముతోఁ గట్టికొనిపోవుచున్న ద్రౌపదిని-
భీముఁడు విడిపించుట *

ఆ. సరగవచ్చి నృత్తశాలలోపలఁ జొచ్చి,
కాంచి వినుప, కీచకవ్రజంబు
మొత్తికొనుచు వచ్చి మూలను నగుచున్న
కృష్ణఁ గాంచి, దీన నింత జరిగె- 51

ఆ. అనుచు నామెఁ బట్టి, పెన వైచి కీచకు
పీనుపాడెపైనఁ బిగియఁగట్టి,
"అగ్నిజాత్మతృప్తి యగుటకు నతనితో
నగ్ని వేల్చువార మజల! నిన్ను 52

ఆ. అపుడు నవ్వినట్టు లిపుడును నవ్వుము!
తెలియు నీదు కోర్కె తెలుఁగటంచు
భుజములందు పాడెఁ బూని దివ్వియలను
గరములందు నూని సరభసమున- 53

చ. మననము బారిఁబట్టిచన; మానిని ద్రోవది భీతచిత్తయై
యొసరఁగ బొష్పముల్ కనుల, నుమ్మలి కమ్మనవార్చెఁ "గీనకుల్
వెసఁగొని సింహసత్వుని కళేబరమూనిచి నన్ దహింపఁగా
మననముఁ జేరఁబోదు రిదె మాన్పుఁడు ఖేచరులార! వేఁడెదన్.

సీ. జయ! యోజయంతి! విజయ! యోజయత్సేన!
ప్రియజయద్బల! మీదుప్రియను నేను;
సైరంధ్రి యనుదానఁ గ్రూరుల పాలైతి
రక్షింపుఁడీ వేగరండు రండు!
కీచకవ్రజము నన్ గీచకశవముతో
దహియింప మననంబు దరియుదు రిదె!
గంధర్వ పతులార! కైమోడ్పు ఘటియింతు
మిమ్ము నమ్మినదాన నెమ్మనమున!
తే. పరమవిక్రమధనులార! శరణు శరణు!
నిరుపమదయాంబునిధులార! శరణుశరణు!
శరణరక్షనియతులార! శరణుశరణు!
నిరతసద్ధర్మపథులార! శరణుశరణు" 55

క. అని ద్రోవది వందుర నా
నినదము విని యనిలసుతుఁడు నిజసతిగళ ని
స్వనముగ దాని గ్రహించి, వె
స నుఱికెఁ బితృవనము దెసకు సంరంభమునన్. 56

తే. గగనగ లంఘించి పోవచ్చి మసనము నాల్గు
దెసలఁ గని యందుఁ బెనువృక్షమొసఁగు టరసి
పోయి పెకలించి, యది కేలఁబూని, యెదురు
సనియె; నుపకీచకులు నదికని వడంకి— 57

క. వచ్చెను గంధర్వుండని
విచ్చలవిడిపఱచి రుడిగి పీనుఁగుపాడెన్;
చిచ్చై మండుచు పావని
వచ్చె వరుస నూటయేవురన్ గీచకులన్— 58

తే. పవనజుండంతఁ బాంచాలి బంధనంబు
నుడిపి,పొమ్మింక నిశ్శంక విడిదికనుచుఁ
గాంతఁ బోఁబంచి వేఱుమార్గమును గొంచు
నేగితాను మహానసగృహముఁ జొచ్చె,- 59

సీ. పురములో నీవార్త పొక్కుట, గుమిగూడి
యందందు గుసగుస లాడువారు;
వీథినిఁ గృష్ణరా, వెఱఁగొంది కాంచుచు
దటియక, దవుదవ్వుఁ దలఁగువారు;
మఱుఁగున నిలబడి కరమెత్తి నారిగా
దిది మారి యని చూపియేగువారు;
నింతతోఁ బో దిది, యీపురిమగ వారి;
సమయించి కా కని సణగువారు;

క్రూరుఁడా కీచకుం డని దూఱు వారు;
నాసు దేష్ణబె తప్పించు ననెడు వారు;
విఁటు దౌర్బల్య మంచని మఱుగు వారు;
నగుచుఁ బురిలోని ప్రజకడు నటమటించె 60

తే. ఇట్టులందందు గొణగుచు, మిట్టిపడెడు
జనులఁ గనుఁగొంచు, నడువీథిఁ జనుచుఁ గృష్ణ,
బానసంపు గృహద్వార మాని నిలిచి
కనుఁగొనుచు నున్న పవమాన తనయుఁ గాంచి, 61

క. తెలినవ్వులను, గడగంటను
దిలకించుచుఁ గరము లెత్తి దివిముఖమిడి యా
చెలి, గంధర్వపతి కిదే
సలిపెద నతులనుచుఁ జనియె సదనంబునకున్, 62

చ. విరటుఁ డిదెల్ల లోఁదెలిసి, ప్రేయసితో "నిఁక దీని నింతటన్
బురివిడఁ ద్రోఁచకున్నఁ గడుముప్పగు; నీకెు యనన్యదివ్య సుం
దరి; కనుఁగాన లేని మరుదానులు పూరుషు; లిద్దిపోలనా
తరుణికి విన్పి పంపు" మనఁ; దక్షిణమాయమ కృష్ణఁ జేరుచున్

ఉ. "మానిని! విన్నపంబు విను! మాపురమున్ విడిపోఁగదమ్మ! నీ
కేనునమస్కరింతుఁ దరుణీ! నవమోహిని వీవు! కన్నమేన్
గానని వారు పూరుషులు! కాంతులు ఖేచరులమ్మ నీకు! భూ-
జానిభయంబు నొంది యిటు సల్పఁగఁ దెల్పెను నా" కటంచనన్

క. అపరాధము నాయదియే?
చపలుఁడు చెడుగెంచఁ బతులు జంపిరి; విను మీ
యుపకార మొంది మీకే
యపకృతి మావారు సేయ నరయరు వింటే! 65

క. ఇపకేటికి మన్నాథులు
సదయులు, సద్ధర్మపరులు, సంపన్నమతుల్;
పదుమూఁడుదినము లిట నుం
డెద నంతియ! మిగుల మీకు నెగడు శుభంబుల్" 66

ఆ. అనుచు నూఱడించె; విని యేమి సల్పఁగ
నొల్లకాసు దేష్ణ యూరకుండె;
నృత్తశాలకరుగఁ గృష్ణను దిలకించి
యాదరించుఁ బార్థుఁడనియె నంత,  67

క, "నీచునిఁ గీచకు, ఖేచరుఁ
డేచిదుని మెనంట; యద్ది యెల్ల విశదమై
నీచే విన వాంఛించితి,
నాచరితముఁ దెలుపు" మన్న నాయమ యంతన్. 68

క. "ఆటలఁ, బాటల మఱుఁగుచు
నీటుగఁ గాలంబుఁ బుచ్చు నీ కేటికి నా
పాటరయఁగ; నది యెంతటి
పాటి? బృహన్నల" యనంగఁ బార్థుం డంతన్. 69

తే. పేడి పాటించి యేరి కేపిప్రియముఁ గూర్చి!
తెలిసి తెలియనికైవడిఁ బలుక నేల?
యకలుషాత్మవు నిన్ను నే నరయ లేనె!
నీపలుకులకు నాకేల తాప!" మనియె.

♦ విరాటుగోవులఁ బట్ట దక్షిణమునకు సుశర్మపోవుట. ♦

మ. ఇటు లాపాండవులెల్ల గోవ్యగతియాావృత్తిఁ బ్రివర్తింపఁగా
నట దుర్యోధనుఁ డాప్తమంత్రిసహితుండై మంతనంబుండి, యె
చ్చటఁ బాండవ్యులుదాగిరో, తెలియు నిచ్చన్ రోయుచుండఁగ, న
చ్చటి కేతెంచిరి గూఢచారులు సహస్రానీకసంఖ్యాయుతై. 71

క. జయజయ నినదము లెసఁగఁగ,
భయనయగతిఁ దోప మ్రొక్కి, ప్రభుఁ గన్గొని, ని
ర్భయతఁ గను! పాండవులు ని
శ్చయముగ నిలలేరు లేరు క్ష్మావర! వింటే! 72

చ. జనపదముల్, ఘనాటవులు, సాగర, శైల, నదీ, తటాకముల్,
ఘనమగుద్వీపముల్, గుహలు, గట్టులు గుట్టలు మిట్టపల్లముల్
చని, కని, రోసిరోసితిమి క్ష్మాస్థలి నెల్లెడ; మేము పోయి కాం
చని స్థల మొండు నుండదు; నిజంబుగ లే రెటఁ బాండునందనుల్!

క. మన్ననఁ గలసిరో! లేకా
మిన్నఁగల వేల్పుటన్న మిన్నలబసలం
దున్నారో? యెన్నంగా
మన్నీఁడా! భూమి నెందు మన రవ్వారల్. 74

తే. విడుము వారలవ్యసనంబు! వినుము శుభక
రంబయినవార్త; మాత్స్యమణంది, సింహ
బలుఁడు. దేవరవారికిఁ బ్రబలవైరి,
మనత్రిగర్తులమార్తాండు మడిసె" ననిన.— 75

శా. "ఏమీ! మత్స్యమహీశుదక్షిణభుజం బేపోయెనే! మేలుపే
లేమీ! సింహబలుండుఁ గూలెనే! బళే! యెల్లెట్లు తథ్యంబె? మీ
రేమీ, స్వప్నమునందు లేరె? యను, నాపృచ్ఛీశుతో వాఁడు "మీ
తో మిథ్యల్ వచరింతుమే? వినుము, చేతోరక్తితో భూవరా. 76

క. గంధర్వులకాంతను గా
మాంధుండై కవయఁబోవ నాకీచకు నా
గంధర్వులలో నొక్కఁడు
మర్దించెను నిసిని గుట్టుమై" నని యనినన్.  77

క. "మన్ననఁ గలమనుజుం డెటు
మిన్ననఁ గల కాంతఁ గవయ మెయికొనె! వానిన్
అన్నెలతనాథుఁ డెట, నే
తెన్నున మర్దించె" ననినఁ దెలిపిరి వారల్. 78

తే. మాత్స్యసతిఁ గొల్చి గంధర్వమహిళయుండఁ,
గీచకుం డామె నాసింపఁ, గెరలి మగఁడు
నీచుఁ గడచేసె నిసియందు, నృత్యశాల,
ముట్టకే యాయుధము ముష్టిఘట్టితోనె.

క. అన నృపుఁ డాశ్చర్యముతో
నను "నిది మిథ్యయగు! నామె యనలోద్భవయా!
ననిలజుఁడె ఖేచరుం డగు!
నణఁగిరో మ త్స్యేశువీఁట నలకౌంతేయుల్!!. 80

తే. ఖచరసతి యేడ? విరటునికాంత యేడ?
నరసతి న దేల గంధర్వతరుణి కొల్చుఁ?
బాండుతనయకుతంత్రప్రభావ మిదియ!
యనిలజాతుఁడె గంధర్వుఁ డగు నిజంబు!! 81

క, అల సింహబలుఁడు, శల్యుఁడు,
బలరాముఁడు, భీముఁడు, సమబలు; లొండొరులన్
గెలువన్ గందురు; వీరికిఁ
దుల ఏరే! కీచకుండుఁ దూలునె పరుచేఁ? 82

క. కలరే యిరువురు దవ్వుల; న
నిలజుఁ డొకఁడె నిలిచె ఖలుని నీల్గింపఁగఁ; గా
వలయును ద్రోవది సురసతి!
బలిగొనఁగా సింహబలునిఁ బరుని వశంబే?" 83

తే, అనినఁ; బాండవు లెందుండు రందు ధనము,
ధాన్యపశువృద్ధి, సుఖవృద్ధి, ధర్మబుద్ధి
పరఁగు; నేఁ డట్టు లెసఁగెడు విరటుప్రోల
టంచు వినవచ్చెఁ; వార లం దడఁగి రేమొ? 84

తే. వారిగడువు పుచ్చుకొని యుచున వచ్చెఁ; బోయి
తోడికొనివచ్చి. పాలిచ్చి, కూడియుంట
తగ వగును, మాయెఱింగిన ధర్మమిద్ది!
యనఁగ గురుకృపుఁ; లాభీష్ముఁ డనియె నిట్లు. 85

గీ. "తథ్యమాడిరి వీరలు; ధర్మబుద్ధి
వారు వారలవిధిఁ బుచ్చి వచ్చినారు;
పిలిచి గారవ మేపారఁ గలసియుంట
మేలు! లేకున్న విడుతురే పాలువారు?" 86

క. అన, విసుగున దుశ్శాసనుఁ
డను; "వారికిఁ బాలుగీలు ననవచ్చునె! కా
ననమే పాలు! కలనునై
ననుఁ దలఁపకుఁ డట్టివిధ మ"నెఁ గర్ణుఁ డనుఁ:- 87

క. "చని, కనుఁగొని, మునుపటివలె
వనవాసమునకు విడెంబు వారి కిడంగన్
జనుఁగాక, ధరణిఁ బాలిడు
పనియే!" యన, భీష్ముఁ డనియెఁ బకపకనగుచున్. 88

గీ. "అంతసులభంబె కానల కంప వారిఁ!
గపట మెఱుఁగక చెడి రప్పు; డిపుడు నటులె
యనుప శక్యంబె! యవ్వార లవధిఁదాటి
బయలు పడువారె! యేటి కీభ్రాంతి మీకు!- 89

క. అన, విని ద్రోణుఁడు "సూతవ
చనమే శ్రుతిమంత్రి మయ్యె క్ష్మాపతి కెందున్;
వినుఁ; డీతని తంత్రంబులె
జనపతికిన్ జేటుఁ దెచ్చు సత్యంబు సుఁడీ! 90

మ. అన, దుర్యోధనుఁ డాడు "మీర లిటు వ్యత్యాసంబుగా నున్నచో
ననుబోనా పగవారలన్ గెలువ? నా యందుంచి విశ్వాసమున్,
వినువుం డేగతి గుర్తిడం గరిపులన్? విజ్ఞానులారా" యటం
చన, గాంగేయుఁడు "మమ్ము వేఱుగను వత్సా! యెంచ నీ కేటికిన్?

సీ. మీరు వారును నొకమెయి వార నాకు;
గురుఁడుఁ గృపుఁడును నట్టిని వాకొనిరి; పాండు
నందనులు దైవబలమును నమ్మినారు,
చెలువఁ జూచెద రీరలు చెల్లునెట్టు? 92

సీ. ధర్మమె జయించుఁ దథ్యంబు; దాని కేమి?
అడిగితిరి కాన నుడివెద, నాలను జెఱఁ
గొనిన ధర్మజుఁ డున్నచోఁ, గూడు, నీకుఁ
గైకొనఁడు, వాని విడిపింపకయె; వినుండు! 93

మ. అనఁగన్; గేరుచు నా సుయోధనుఁడు మత్స్యాధీశు గోబృందమున్
గొనెదన్ నేఁ జెఱఁ, బాండవుల్ గలుగుచో, గుర్తించి నేఁ గానరున్
బనుతున్; వారలు లేనిచో విరటు బండారంబు దోఁచించెదన్
గాన కెల్లిసను లాభమే" యనిన, నాకుంభాత్మజుం డిట్లనున్. 94

గీ. తప్పు లేదిందు, శిష్యులదర్శనంబుఁ
గూడ మా కగు; నడవిలోఁ గ్రీడిఁగొన్న
దివ్యశస్త్రాస్త్రములతీరుఁ దెలియఁగూరు;
మీకు సంధిఘటిల్లిన మేలు మీకు! 95

చ. అనఁగ; సుశర్మ పల్కు "వసుధాధిప! పంపుడు నన్ను మాత్స్యగో
గణము గ్రహింప; నన్నతఁడు గాసిలఁ జేసెను మున్ను; దీర్పఁగా
ననువిది నాకు; స్వల్పమగునట్టిది దీనికిమీర లేల! గో
గణము గ్రహింతుఁ, బాండవులఁగాంతు; విరాటునడంతు, దంతు నే.

గీ. అనఁగఁ; గర్ణుఁడు నిద్ధి తగును సుశర్మ
బలముతోఁ బోయి, యొకదెసఁ బసులఁ బట్ట,
మనము వేఱొందు దెసఁ బట్టఁ, బసులభము!
ఒకకడనన్నైన వారు దొరకక పోరు. 97

కం. అనఁగా నృపుఁ డను "దక్షిణ
మున కేగని యీసుశర్మ ముందుగ; మరునాఁ
డునఁ జని యుత్తరమున గో
గణమును ముట్టుటయ మనకుఁ గర్జం" బనినన్ 98

గీ. అంద ఱదిసమ్మతించిరి; యధిపుఁ "డాలఁ
గొనియె డుసుశర్మ బహుళాష్టమిని; నవమిని
మనము నుత్తరమున నాలఁ గొనుద" మనుచు
సైన్యసన్నాహమున కాజ్ఞ సలిపి పంపె. 99

ఉ. అంతసుశర్మ భూధవునియాజ్ఞఁ దలఁ ధరియించి, నీఁటిక
త్యంతముదంబుతో నరిగి, యద్భుతరీతిగ సేనలొప్పఁగా,
దంతివరాశ్వముల్ రథపతాకచయంబులు విండ్లు నస్త్రముల్,
వింతగుశస్త్రముల్ వెలయ; వీరులబొబ్బలు వ్రిబ్బ నద్దెసల్. 100

సీ. ఇసుకఁ జల్లినసైన నిల వ్రాల దన, సేన
నేల యీనినయట్టి లీలఁ గ్రాల;
ధగధగ మనుశస్త్రతతికాంతి కార్ముకం
గుల నెల్లెడల నింపుపొలుపుఁ జెలఁగ;
దెసదెసల్ మార్మ్రోత లెసఁగెడు రణతూర్య
రవము మఱి, మిన్నుల రాచికొనఁగ;
సేనల బహువిధసింహగర్జనములు
పిడుఁగులు ప్రేలుచునదువు నిగుడఁ;

తే. వాహినులు పాఱునటు నిజవాహినులును;
వాహినీశులు మంత్రులు వరుసఁ దేర;
దంతిహయరథతండంబుఁ దగిలి నడవ
వెడలెను సుశర్మ విరటుని వీఁటిత్రోవ. 101

గీ. విరటు పరిసరభూముల వీడువిడిసి,
వేగరుల ముందుగాఁ బంప, నేగి వార
లాలమందలు గలచోటు నరసి వచ్చి
తెలుప, వెడలెను సేనలు బలిసి రాఁగ. 102

గీ. మలయమారుతవాద్యముల మ్రోత మాన్పి, వీర
గర్జలుడిపించి, నిశ్శబ్దగతిఁ దలిర్ప
సాగి మునుముందు వేగరుల్ జాడఁ జూప,
నడచెను సుశర్మ బలములుఁ గడఁగిరాఁగ- 103

గీ. నాల్గుపాయలుఁ గా సేన, నాల్గుకడలఁ
బసులఁ జుట్టినఁ, గావలి వార లెదురఁ,
దాఁకిరి త్రిగర్త సైనికుల్ దర్పమెసఁగఁ;
గొంద అందునఁ బట్టిరి గోగణమ్ము- 104

-: విరాటుఁడు సుశర్మతో యుద్ధమాడఁ బోవుట :-

క. మందల కావలి వారలు
దండడిగాఁ బోరిపోరి తలఁగి రసువులన్;
అందున జాఱిన వారలఁ
గొందఱు పఱతెంచి విరటు కొలువునఁ బడుచున్ 105

ఉ. "దేవ! త్రిగర్తవాహినులు దేవర గోగణమున్ గ్రహించుచున్
బోవఁగఁ జూచి, యుద్ధపడి పోరి గతించిరి రక్షకుల్; ప్రభూ!
వావిరిశత్రుసేనబలవత్తరమై గణనాతిరేకమై
శేవరహించె; వైరులఁ గడుందినడంపుము లెమ్ము లెమ్మనన్ 106

క. "ఏమీ! సుశర్మ మును గనఁ
డో మము? మత్స్యుండొ? జాల్ముఁడో? యంధుండో?
తామసిల నేల? సైన్య
స్తోమంబుల నడపుఁ" డంచు దోర్దర్పమునన్ 107

చ. విరటుఁడు సైన్యనాథులకు వీడెము లిచ్చి, యమాత్యవర్గముల్
ద్వారగఁ జనంగ నాజ్ఞనిడి, తానుసహోదర మిత్రియుక్తుఁడై
వరశరశస్త్ర ఖేటములు వర్మకిరీటములూని, తేరునన్
బరువడిసాగెభూరితర వాద్యవిఘోషములుఁ బెద్దమ్రోగఁగన్. 108

క. అరసి యది ధర్మజుఁడు సో
దరులన్ గని "మనలనెమకఁ దలకొని కురుభూ
వరుఁ డంపెఁ ద్రిగర్తుల, నిటు
విరటుని గోగణముఁ బట్ట, వీరత మెరయన్— 109

గీ. గడువులోపల మనలను గాంచిమరల
నడవికిన్ దోలఁ బూనిన యత్నమిద్ది!
యేది యెటులైన గోవుల యిడుమ విన్న
చెవుల నీరైనఁబోయము సిద్ధమిదియె!— 110

కం కావున విరటునితోఁ జని
యావుల చెఱనుడు పవలయు, నర్జునుఁ డిచోటన్
గావఁగ నిలువని మనమిఁకఁ
బోవుదమని యానతిచ్చి, వుచ్చి వురి నరున్- 111

గీ. జతగఁగొని భీముఁ గవలను శమన తనయుఁ
డనికి వెడలంగ, మాత్స్యుండుగని, హసించి,
"కలిగెనే మీకు ననిసేయఁ గాంక్ష కంక?
యనుచు రథశరములఁ గూర్చె నామువురకు— 112

గీ. దృష్టికందనిదై సేన తెరలి నడవ
దిశదిశల ధూళి క్రమ్మంగ; దివియు భువియు
వాహినీవాద్య ఘోషలు వ్రిబ్బి కొనంగ
విరటుఁడావేశమున నేగె నరులఁ దాఁక. 113

గీ. కని త్రిగర్తేశు సేనలు గనలి తగిలె
మాత్స్య బలమును; రెండును మలసి కలసి
గిరులుగిరులును శరధులు శరధు లోజ
దాఁకినటువలె నురుముచుఁ దద్దపెనఁగె.- 114

క. శరములు, శరములు బరువిడి,
నురువడి మండంగ; ముష్టియుద్ధము లెనయన్
ఇరుగడల నసిగదాతో
మరభల్లము లార, రుధిరమయ నది పాఱన్— 115

క. చించుచు వర్మంబులఁ, బడ
దంచుచు గజరథతురంగ తండంబుల; బా
ధించుచు, నొంచుచు నొండొరు
మించుచు, మెయికొనుచు ననిని మెలఁగిరి వారల్. 116

సీ. శరముల శిరముల ధఁరగూలనేయుచుఁ;
గుత్తుకల్ కత్తులఁ గోసియిడుచు;
పీఁటల మేనుల దూఁటుచు; బాకుల
బొమ్మల నాటంగఁ గ్రుమ్మనిడుచు;

నదలించి తలలపై గద లెత్తి కొట్టుచు;
ముసలాల నొండరుల్ మొత్తఁగనుచు
భిండివాలంబులఁ గండలఁ జెక్కుచు;
వాలుల డాలులు వ్రక్కలిడుచుఁ
గీ. దేలుకాళులు మొండెముల్ దూల నిడుచు;
మీసములు దువ్వి చాడుచు రోసములను;
విజయమో, స్వర్గమో యంచు వీరు వారు
పెనఁగి రెల్లెడఁ బీనుగు పెంటఁజేసి 117

చ. విరటుని సేన లుద్ధ విడివిక్రమ మొప్పఁ ద్రిగర్త సేనలన్
అతిముతి వెట్టి గంతులిడ,నాగ్రహ మొంది సుశర్మ మీఱుచున్
సరగ విరాటుఁ దాఁకె; రథసంబున మే కొని యిర్వురుద్ధతిన్
బర్గిపిరి యస్త్ర వృష్టిని సుపర్వులు మెచ్చుచుఁ బిచ్చలింపఁగన్.

క. హుంకారము, భయద ధను
ష్టంకారము, మంటలార్చు శరరిభసమహో
ఝంకారము, లాశానిబి
డాంకముగా నితరశబ్ద మణఁగన్ జేసెన్. 119

క, పులుమాండలికా! మాతాన్యా!
అలసింహాబలుండు నీల్గినప్పుడె చెడె నీ
బలమెల్ల; నింక నేఁటికి
విలుఁ బట్టఁగ? నీవు నొక్కవీరుఁడ వొక్కొ? 120

క. అనుచు సుశర్మ హసింపఁగ
విని, మీసముఁ గేల దువ్వి విరటుఁడు "పంతా!
మును పోడిపోవె? మఱచితె?
వెనుకాడకనిలు" మటంచు విలువీటిడుచున్- 121

గీ. అలుగు వేయంగ, నలుగుచే నడ్డిదాని,
సరగ శరములు వుచ్చె సుశర్మ; వాని
నడుమ ఖండించి విరటుండు విడిచె నూఱు
బాణములను, వానిసుశర్మ వ్రియ్యనేసె 122

క. ఏచ్చుట, ఖండించుట లిటు
విచ్చలవిడి సలిపి వారు; వీరావేశం
బెచ్చి పెనఁగులాడిరి కడు
నొచ్చియుఁ బ్రాణముల నొడ్డనోఁచి చలమునన్. 123

గీ. ఇతనికోలల నణికెడు నతఁడు; నతని
బాణములఁ జించు నీతఁడు, వగుస నొకరి
నొకరు మించుచుఁ దగ్గుచు, నొచ్చి చించి,
దంచి పోరిరి స్వేచ్ఛగ దర్పమెసఁగ 124

క. సోలుచు రథమున వాలుచు,
వ్రాలుచు, మయిమఱచి, లేచి వారసికన్కుల్,
తాలఁగ నిప్పులు కన్నుల
నాలము నవ్వారు సలిపి రవని వడంకన్. 125

గీ. వెడలురక్తము దుడుచుకో నెడములేక,
పడుకిరీటంబు సవరించువడువుఁ గనక,
నాఁటునమ్ములఁ బెరికెడి పాటిఁ బోక,
పోరి రథిపతికైనను బోగడరాక 126

చ. చటులతఁ దోఁపనీయక సుశర్మరథంబు విరాటుతేరు చెం-
గటఁ జననిచ్చి, మాత్స్యపయినన్ బడదూఁకెడి పానిబట్టి; తా
నచెతన తేరునన్ గొనియంటునఁ బోవఁగఁ గాంచి ధర్మజుం
డిటులను భీముతోడ నవి యెల్లను నేర్పడఁ జూపి యొప్పునన్ 127

-:భీముఁడు సుశర్మనోడించి విరాటుచెఱఁ బాపుట:-

క. "అరసితె; సేనలు జెదరెను,
విరటుని నరిపట్టుకొనియె, ననిలాత్మజ! యిం
కుఁదుకుండనేల? యీపో
దరులన్ గొనిపొమ్ము, తెమ్ము త్వరమత్స్యపతిన్!" 128

గీ. అనఁగఁ జెంగటి పెనుమ్రాని ననిలసుతుఁడు
గాంచఁ గని ధర్మజుండు వృక్షంబుఁబూని
పైఁబడ నరులు నినుగుర్తు పట్టలేరె?
వలదుడుగు సాహసంబిటు పవనతనయ; 129

క. మనగడుపు నేఁటితోఁ దీ
రును నైపు మొకింత, సోదరులఁ గొని, యరదం
బును విలుఁ గొని చని మాత్స్య చె-
ఱను బాపుచుఁ దెమ్ము పొమ్మురయమున" ననినన్ 130

సీ. కవలు సహాయులై నిలువఁ గార్ముకముం గొని భీముఁడుద్ధృతిన్
బవరమునన్ ద్రిగర్తబలవర్గములన్ సమయించి సైన్యమున్
జనమునఁ గూర్చి యోధులను జంపుచు మారి మసంగినట్లుగన్
దవిలి మహారథాతిరథతండము నుగ్గొనరించె వేల్మిడిన్ 131

క. అరదంబుల, గజవాజులఁ
బొరిగొని, సారథులఁ గొట్టి, పొదివి సుశర్మన్
దరిసి "నిలునిలు" మటంచును
శరవృష్టిని గురిసె నతఁడు చరచరలాడన్— 132

ఉ. అంతసుశర్మ కిన్కఁగొని యల్గులు పిక్కటిలంగ నేయఁగా
నుంతచలింప కాపవనజుండవి తుంటలు సేసె; మాద్రిజుల్
పంతముతోడఁ బోరిరి; జవంబున భీముఁడు దగ్రమూర్తియై
దంతి గ్రసించు సింహము విధంబున దూఁకి సుశర్మఁ బట్టుచున్

క. విరటుని విడిపించి. కసిన్ 133
జెఱవట్టి సుశర్మ; నాలఁ జెఱఁ బాపి వెసన్
బఱితెంచెను దమ్ములతో
విరటునితో నాత్రిగర్తవిభుతోఁ దవిలో 134

చ. యమసుతుఁ గాంచి మత్స్యపతి హర్షముపొంగ నుతించి "మంటిని
పరివిమలమైన పేరిమ" నని; బావిసి శౌర్యముఁ బ్రస్తుతించి, యా
కవలను మెచ్చి, "మీ రెవరొకో? కా జెఱుఁగంగ, నిగూఢవృత్తిమై
భువిఁ జరియించు దేవతలొకో? పోలగఁ దెల్పుఁడు మీ నిజస్థితిన్ 135

క. తను విది మీఱి డినది; సిరి
యును మీఱుది; మీఁది తథ్య మూర్వర సుండీ!
కొనుఁడీ, దయఁ గనుఁడీ! పని
గొనుఁడీ మ" మ్మంచు వేఁడికొన నది కనుచున్.

గీ. కంకుఁ డను "మమ్ము నెంతయో గారవించి
తంతి యేచాలు, వేఱు రాజ్యంబు వలెనె?
పురికిఁ బోయినపిమ్మటఁ బోలినట్లు
సలిపెదవుగాక యిపు డాప్రసక్తి యేల?

క. చెలఁ బాపుమీఁసుశర్మకు;
పురిలో నీజయముఁ జాటఁబుచ్చుము భటులన్;
దరలింపు మాల" నని, యటు
జరిపించి విరాటుతోడఁ జనె పయనంబై.

ఆ. అరులచేత భంగమంది ప్రతిక్రియ
సలుపలేక పసుల జాఱవిడిచి,
పోగలు చాసు శర్మపోయెను; విరటుండుఁ
బయనమయ్యె వీడు పట్టుఁ జేర.

గీ. సైన్యములు నడచె; జయ వాద్యసమితి మ్రోసె,
నరదములు సాగె; కరితురగాళి యేగె;
నాలుమందలు పురిఁ జేర నరిగె, నంతట
లంకజాప్తుండు పశ్చిమ వార్ధి మునిఁగె.

క. అని వినవిన వైశంపా
యను జనమేజయుఁడుగాంచి యతిమోదమునన్
వినమితశిరుఁడై చెప్పం
గను వేఁడెను ముందునడచు కతుకుతకమునన్. 141

ఆ. మునిమనోబ్జభృంగ! ఘననీలరుచిరాంగ!
సదనులాంతరంగ! సాధుసంగ!
రాయదుర్గవాస! రవికోటిసంకాశ!
విబుధహృన్నివేశ! వేంకటేశ! ! 142

ద్వితీయాశ్వాసము సమాప్తము.



# అశ్వత్థ భారతము

## విరాటపర్వము, తృతీయాశ్వాసము.

### ఉత్తర గోగ్రహణము.

క. శ్రీదయితా! త్రిదశార్చిత
పాదా! శ్రితవరద! ధర్మపాలన! శుభదా!
వేదవినోదన! దుర్జన
భేదన! శ్రీరాయదుర్గ వేంకటరమణా! 1

క. విను మని వైశంపాయనుఁ
డనె జనమేజయునితోడ " నామరుదివసం
బునఁ గురుపతి పెనుబలములఁ
గొని, మత్స్యపురోత్తరాశకుఁ జని విడిసెన్. 2

### ఉత్తరుఁడు బృహన్నలను సారథిగాఁగొని కౌరవులపై —యుద్ధమునకుఁ బోవుట.—

మ. అల దుశ్శాసనకర్ణసౌబలవికర్ణాదుల్ వెసన్ గోవులన్
వలఁగొన్నన్, గని రేగు గోపకులఁ జావన్ మోదియందొక్కనిన్
తలపై నాదిగ నాసికాంతముగ నున్నం బేర్చి పెన్ బట్టిగాన్,
" బలిమిన్ గౌరవు లాలఁ బట్టి" రని తెల్పన్ జేనికిన్ బుచ్చినన్. 3

క. పఱచిచని వాఁడు వికటున
గరులోపలఁ జొచ్చి యందు గాంతాగోష్ఠిఁ
మరిఁగి మయిమఱచు నాభూ
వరసుతు నుత్తరకుమారుపదములఁ బడుచున్, 4

గీ. అదర హృదయము; దగ బలుగదుర; నిశ్వ
సనములు నిగుడ, నోరారఁ దనువుఁ జెమర,
గళము వడ నుడి దడవడఁ గనులుబెదరఁ
గనుచు రానుతు, నాగొల్లఁ డని వడఁకుచు:— 5

క. లెమ్మా! శత్రుంజయుఁ డవ్వ
గమ్మా! చెఱగొనియె మనదుకదుపులఁ గురుపుం;
డిమ్ముగ సేనలఁ గూర్పుము!
ఇమ్ముగువలగొడవ విడుమ; నృపవర తనయా! 6

గీ. ధరణిపరువుగఁ గురుపతిదండు వచ్చె,
శరశరాసనములఁ గొని యరదమూని,
వాహినులు, దంతిగజహయ వారములును
వెంటరాఁ జను, గోవుల విడుపఁ గనుము! 7

క. అన, నూర్గురుమగువల మ
ధ్యన నిష్టాగోష్ఠినున్న యాసుకుమారుం
డని నించుక కనులఁ గినుక
తొనఁకఁగ గర్జన యొకింత తోఁప గళమునన్:- 8

క. ఏమిర! ముకుపై సున్నపు
నామం బదియేమి? బెదరునకుఁ గత మేమీ?
మానుము మది భయ"మన" గురు
సేనలు నుత్తరపుఁబసులఁ జెఱవట్టె నృపా! 9

క. ఎందాకఁ జూడ్కు లానెడు
నందా కరిసేన, దంతిహయబృంద మగున్
ముందును వెనుకను దిశలం
దెందును దుములంబె మసఁగి యెసఁగెడు నధిపా! 10

క. దక్కినదెస కేగినతేఁ
డక్కట! యిందాక రాఁడ; యటసమరము పెం
పెక్కెనొ? మఱి యేమాయెనొ?
యుక్కివు లీసందుఁ గొనిరి యుత్తరభూపా! 11

గీ. పురముకావలిసేనల నిరవుగొలుపు
మరులుఁ జోకరానికై వడి; నారితేఱు
వీరసైన్యముఁ గొని యట్టె వెడలు మింక
నుత్తరపుఁటాలఁ జెఱఁ బాపఁ, నుత్తరనృప!"— 12

క. అనఁ, గుడియెడమలవనితలఁ
గని, మెయినే మఱచి; నిలిచి, గంభీరముగా
ధ్వనిచెలఁగఁగ నగి, కాంతలు
దనుఁ గన, బొమముడి ఘటించి దర్పం బెసఁగన్. 13

క. నూఁతుఁడు వీనిని సమరభ
యాకులు; సతిసుతులభ్రాంతి నంటి యిటకురా
నీకతఁ గట్టెను, నే ను
ద్రేకించిన సురలు గిరలుఁ దేరి కనుదురే?" 14

క. అని సతులు బెగడఁ బలికిన
విని గొల్లఁడు "నిన్ను నెదురువీరులె వీరల్?
దినపునెడఁ దిమిరదర్పమె?
జనపతిజృంభణము గోపజనములపైనే?" 15

క. అని యిచ్చకపూడిన, ను
బ్బునఁ దా డాకేల మీసముఁ బురిగొనుచుఁ
బినవప్పున. రోమాంచన
మునఁ గనుగానక, మగువలమొగములఁ గనుచుఁ, 16

గీ. "కపటమున రాజ్యమును గొని, కాంతఁ బరిభ
వించి, పాండవుల వనికిఁ బంచినట్టి
క్రొవ్వు నాయెడఁజూపులే కురువిభుండు?
తలఁచినాఁడేమొ నను బీదధర్మజునిగ? 17

గీ. గుంజెనా. యమమీసము? ఘోరభైర
వునికపోలముఁ గొట్టెనా? పొగరుపట్టి
మిత్తిముందలప ట్టీడ్చె మొత్తెనా? స
మరము నాతోడఁ గోరెనా కురువిభుండు? 18

గీ. చచ్చుబాపలు గొందఱు; జమునిపురికి
దారిపట్టిన కొందఱు; తక్కువయిన
కులమువారలు గొందఱు కురుధరేశు
సేనవీరులు వీరలె చెప్పనేల? 19

క. ధరనధములపని కా కిటు
నరపతులకుఁ బనులఁబట్ట నాకౌం బగునే?
కురుపతివిక్రమ మరరే?
యరసితి"మని యాడుఁగఱచి యాదల నార్చెన్. 20

క. ఖలులన్ దునిమెద; గజపుర
నెలకొల్పెద "తాణ" నరుల నేల నొరసెదన్;
ఇలబెగడఁ జేతు" నని కో
మలు లెదుర నిజప్రతాపమహిమఁ బొగడుచున్. 21

గీ! తాని ఫలమేమి? మొన్న సంగ్రామమందు
సారథి గతించె; ద్రోణుఁడు వేల్కొండు;
తగినసూతుండె యొదవినఁ దక్షిణంబ
యరిగి వైరులఁ జించిచెండాడి గానె? 22

క. కుంభజముఖ్యులు నాసం
రంభముఁ గని "నరుఁడువచ్చెరా!" యని బెదరన్,
జంభారి యదర; మాలిక
రంభయె నామెడనువేయ తఱము సలుపనే? 23

సీ. అనఁగ; ద్రోవదిపోయి, యది పార్థునకుఁ జెప్ప,
నాతండు నల్కె "నజ్ఞాతవాస
విధి గడచెనుఁ దాళ నెరవుగా దిఁక మన
వసుధను గొన నేగవలయు; మనల
నరయుటకై కురువరుఁ డిట్లు వచ్చె, ను
త్తరతోడ "ఖాండవదహనవేళ
మనబృహన్నల యర్జునునకు సారథ్యంబు
సలిపె, నిశ్చింతకుఁజాలు" ననుచుఁ
గీ. దెలిపి, తనయన్న కయ్యది తెలుపఁ జెప్పి
నన్ను నెటులైనఁ బిలిపింపఁ బన్ను" మనుచు
వినిచి పంచినఁ, గృష్ణ యావిధముఁ దెల్పె
నుత్తరకు; నామె యది తెల్పె యుత్తరునకు. 24

క. "మానుమ సందియ, మిఁక నా
హ్వానింపుము యిటకురా బృహన్నలను; వెసఁ
బూనుపుము సారథిగ నీ
వానరుఁడవునకమ్మ! విజయ మందుము లెమ్మా! 25

చ. అన, విని నవ్వి, "పేడిమొగమైనను జూడఁగనోడు నట్టి నా
ఘనతకు లోటుగాదె యిది! కవ్వడిసారథియంటివాటఁ గై
కొనితి! మదీయధాటి కనుగుణ్యుఁడె నూతుఁడు! చూతుఁగాక వే
జనుము బృహన్నలన్ ద్వరగ సమ్మతిలంగనొనర్చి తె" మ్మనన్. 26

సీ. రాకేందుముఖి, దివ్యరాజీవదళనేత్రి,
శస్తకపోల, విశాలఫాల,
అళినీలకుంతల, విలసితశ్రీకర్ణ
చంపకనాస, చంచలితహాస,
కంబుకంధర, సుధాకలితబింబాధర;
శుకవాణి, నీరదసుభగవేణి,
తతకుచకుంభ, సైకతసన్నిభనితంబ,
తనుమధ్య; నెఱజాణ, కనకవర్ణ,
గీ. ఉత్తరకుమారి, మరుగజమో యనంగ,
చూడ్కిమెఱుంగులఁ జిమ్ముచు, వేడ్కతోడ
నల్లనల్లన వచ్చి నృత్తాలయమును
జొచ్చి, నిజగురునకుభక్తి జోతఁజేసె. 27
క. కని నరుఁడది ముసిముసి నగి,
"తనయా! నీరాకరీతిఁ దలఁపోయ నెదో
ఘనరాజకార్యతీవ్రతఁ
గనఁబఱచు; నదెట్టిదిట్టికార్యమొ?" యనినన్. 28
గీ. "రాక మఱియేమి లేదు, కౌరవులు మనదు
పసుల నుత్తరమునఁ జెఱపట్టినారు,
దక్షిణమునుండి పితరాకతడసెఁ గనుక
అన్న యుత్తరభూపుఁడే యరుగవలసె, 29

గీ. మొన్న నాతనిసూతుండు పోరులోన
మరణమొందుట, నెవ్వరు దొరకరగుట,
నజ్ఞమున కీరు సారథియగుటఁ గనుట
వినువ సైరంధ్రి, మాయన్న ననుఁ బనుచుట. 30

గీ. కారణంబుగ వచ్చితి; సారథిత్వ
మూన మిము వేఁడఁ, గరుణనాపైనఁ బరపి
గడపవలెనుండి నేఁటి యిక్కట్టునుండి!"
యనుచుఁ బ్రార్థింపఁ; గనికరమున నరుండు. 31

క. ఎనఁడో సల్పిన దడి; నై
నను గాదనఁజాల, నీకునై కొనియెద నే
పనినైన; నింకఁ బోవుద"
మని మదవారణముభంగి నాతఁడు వెడలెన్. 32

చ. అగరిపుసూతిరానటకు, నానృపనందనుఁ డంత సాదరం
బుగఁగని మన్ననల్ సలిపి "పోరు కురుక్షితిపాలుతోడ మా
కగుఁ; దగుసూతుఁడున్ దొఱకఁడౌట నినున్ దమిఁగోరికొంటి నీ
తెగువను వింటి! మాకొఱఁతఁ దీర్పుము నేర్పుమెయిన్ బృహన్నలా!

క. తొడుగుము వర్మము, నరదము
వడితె, మ్మశ్వములఁ బూన్చి; పరిఘ లీనెడుమా
సిడ మెత్తుము; జాగేలి
ప్పుడ వత్తుము కదుపుతోడఁ; బూను" మనంగన్. 34

క. నృత్తము, గీతము నావని;
యుత్తరి సంగ్రామసూతకృత్యము పనియే?
యెత్తిరఁట వసుధరేశ్వరు
లొత్తిరఁటే పసుల; మాటలొకొ పోరుటలున్? 35

క, తర మెఱిఁగి సూతుఁ గాను'' మనఁ
"గురుబలములఁ గాననట్టె? గురుభీష్మకృపా
ద్యరులగతిఁ గనెద, రథముఁ
బఱపుము; నెపమాత్రముందు; భయముడుగు'' మనన్. 36

గీ. పార్థుఁ డను "రాజసుతుఁడవు; పసిమి యొసరు
వయసువాఁడవు, క్షత్త్రియాన్వయుఁడ వగుదు;
గణనయే నీకు గురుఁడు, గంగాసుతుండు,
గురుసుతుఁడుఁ, గృపకర్ణులుఁ, గురువిభుండు! 37

క, అన; నుత్తరుండు కవచం
బును దెప్పింపఁగ వెనుకముందుగఁ దొడు పా
ర్థునిఁగని సతులుఁ జఱచినఁగఁ,
గాని యుత్తరుఁ డద్ది నరునకున్ దొడిగించెన్. 38

గీ. "వర్మమే తొడ నేరనివాఁడు రథము
గడపనేర్చునె యని!'' యని కాంతలందు
గుజగుజలు లేచె; హయములఁ గూర్చి సిడము
నెత్తి రథమును గొని తెచ్చె నింద్రసుతుఁడు, 39

క. కనుచు బృహన్నల నుత్తర,
"రణనిర్జిత రాజభూషరాజని, సరికాం
చనచేలతతిఁ దెండీ!
పొనరారున వేరి బొమ్మపొత్తికల" కనన్. 40

క. "రాసుతుఁడు రణతలంబున
వాసిగ జయలక్ష్మిఁ జెట్టవట్టెడునఁటె, నే
నీసన్న పనికిఁ దగనే!
చేసెదలే నీయభీష్టసిద్ధిఁ గుమారీ!" 41

సీ. అని నరుఁడువల్కె; నుత్తరుఁ డంతలోన
మకుటభుజకీర్తివర్మముల్ మహితతార
హారములుఁ గుండలములు, బంగారునడుము
పట్టె, కటకంబు, లుంగరాల్ పరఁగఁ దాల్చి. 42

గీ. పట్టుపీతాంబరముఁ గట్టి, పెట్టి నొసటఁ
గమ్మకస్తూరితిలకమ్ము; తమ్ములంపు
టిమ్ములారఁగ, నడిదమ్ముఁ జిమ్మకొనుచు
రాచఠీవిని నడతెంచి రథము నెక్కె. 43

క. "నాయస్త్రశస్త్రనిచయము
లాయత్తముచేయఁబడినవా! సారథీ!" నా,
నాయుత్తరునకుఁ గవ్వడి
ఆ! యన్నియుబండ్లకెత్తి రవెకను" మనియెన్. 44

సీ. అంభోజదళనేత్రు లారతులెత్తిరి;
పెట్టిరిసేసలు ప్రియలు తమిని;
బాటలుపాడిరి పాటలాధరలు; నా
ట్యమును గావించిరి యతివ లంత;
వేసిరి మాలలు భాసురాంగులు; జయ
నినదముల్ సలిపిరి వనజముఖులు;
మణిదర్పణముల రమణులు చూపించిరి;
దృష్టినిఁ దీసిరి యిభగమనలు;

గీ. పూవుఁబోడులు గురిసిరి పుష్పవృష్టి,
కాంత లిచ్చిరి నిజకటాక్షములకాన్క;
చిన్నవోయిన మొగములఁ జెలువలెల్లఁ
దమప్రణయమునుజాటి రుత్తరున కపుడు. 45

గీ. వందిగాయకవిటనటవైణికాది
వర్గములు స్వీయవిద్యలఁ బరపి; రంత
ధరణిదేవులు లాజాక్షతలను జల్లి
పనసలఁజదివి యాశీర్వచనము లిడిరి; 46

గీ. పండ్లుఁ, గొబ్బరకాయలు, పాలుపెరుగు
నిండుకుండలు, గుమ్మడిపండ్లు, నడుగు
నడుగునకుఁ బడవైచిరి కడఁగియరద
మునకు ముందఱ జనములు మూఁగసాగి. 47

సీ. మొరసె రణవాద్యములు సేన లురవడించె.
వాజితతి హేషలొనరించె, వారణములుఁ,
జేసె ఘీంకృతులను; వీరసింహనాద
ములరవళిమించె; రథములు బలిసి నిలిచె. 48

గీ. సైన్యములు, సైన్యనాథులు, సైన్యధర్మ
పద్ధతినిఁ బట్టి యుత్తరప్రభున కపుడు
వందనసమర్పణముఁ జేసి, వరుసతోడ
"నెడమకుడి" యంచు నడుగుల నిడుచుఁ జనిరి. 49

క. పౌరజనంబుల మ్రొక్కుల
గారవమున నంది; ప్రేమఁగనుఁగొని, నిలువన్
నారులకు వినిచి; పరపుము
సారథి! రథ మనిన నరుఁడు సాగన్ దోలెన్. 50

గీ. సైన్యములు, సైన్యనాథులు, సకలవస్తు
సంతతులు, హయరథములు, సామజములు
వెనుకబడియెను, మారుత వేగమూని
రథము సాగెను బితృవనప్రాంతమునకు. 51

✦ఉత్తరుఁడు కౌరవసేనఁగని పరువిడుట; అర్జునుఁడుపట్టి తెచ్చి
వానిసారథిగ నియమించి, తానురథికుఁడగుట. ✦

శా. కాంచెన్ దవ్వుల నుత్తరుండు కురుభూకాంతేశు సైన్యంబులన్;
నించెన్ భీతి. చలించెగుండె చెమటల్ నిండెన్ మెయిన్; దెమ్మ్రక్కి
ణించెన్ నోట; వడంకె నంగములు; వంచెన్ మౌళి; ఘావోటల్తో
చూంచెన్; దల్లినిఁ దండ్రి నాండ్రను దలంచెన్, బల్తపించెన్ మదిన్

సీ. పరఁగ శస్త్రాస్త్రముల్ భానుకోటి తలిర్చెఁ;
సింహనాదంబులు చెవులఁ జీల్చెఁ
గుంభిబృంహితములు గుండెల ఖండించెఁ;
హయతతి హేషలు భయము నించెఁ
గేతుధనుష్టంకారపటలంబు వడఁకించె;
గదలతిప్పుడులు కన్నవను మూసె;
భూరివీరాలాపములు మూర్ఛ నొనఁ గూర్చెఁ;
రథఘోషణములు దిగ్భ్రమ మొనర్చెఁ;
గీ. వికటహయదంతిఖురపుటపరిచలితధర
ణీరజశ్ఛాదితంబులై నిఖలదిశలుఁ
దమమునిండుటఁ గనుట, నుత్తరుఁడు బెదరి
తనకుతప్పదు చావని తలఁకి యేడ్చె. 53

క. సామాన్యసైన్య మనుకొని
దీమసమున వచ్చినాఁడఁ దెలియక, యిదియే
మో, మారిమసఁగినట్టుల
భీమంబై తోఁచె మరణభీతి జనించెన్. 54

గీ. క్షత్రియాన్వయమును జెండఁ జాలినట్టి
పరశురాముని గెలిచినబలియుఁ డొకఁడు;
హరుని గెడపినవిజయునిగురుఁ డొకండు
శక్యమే వీరితో నాకు సమరమాడ? 55

గీ. ఇది ప్రళయకాలమేఘసమూహకమొ, కరికు
లంబొ? పిడుగులగరడియొ? లయగతిప్ర
చలితమో? కల్పవహ్నిప్రచండధూమ
పటలమో, కైదువులో? యివి పలుకరాదు. 56

గీ. దివిభువులనంట నెగచిన తెరలో, చుక్క
యమ్ములో? జగముల ముంచ నరుగుదెంచు
శరధులో, సేనలో? రథచయమొ, శమను
వాహ్యములో? కౌరవులో, సమవర్తి లోకమొ? 57

గీ, కనులు గడచగాన; వారిధిప్రాయమైనదీని
మనసునకుగాదు; తనువున్నఁ గనమె యెంత
లెంతవింతలు? ధర యీనినంత సేన;
తాఁకి దీనిని జెందునాతఁడె మృదుండు! 58

క. ఆఁకటఁబడుమారియెదుట
జోకగ నడయాడుగొఱియజోకై తిఁగదే!
నూకకు హయముల, సెలగో
లాకడఁ బడఁద్రోయవే బృహన్నల!" యనియెఁ.

గీ, కనఁగనఁగ గురుబలముఖ్యులఁ, దనువు భార
మయ్యె, రోమవికారమై యవయవములు
మండె; గళమారె, పెదవులు నెండె; గుండె
అదియఁ గరపుటితో మూసె నక్షియుగము. 60

క. సారథి! యేటికిఁ దేరును
జాఁటిచి నాగొంతుఁగోతువే బలమదె కనుమా!
కారము నూరెడు గన్నుల;
నారసువా? పొగరా? తెలివి యడుగంటినదో? 61

గీ. సురలకునుసేన లివి తేఁచూడరాదు,
నిల్పు హయముల, రథము మరల్పు! చాలు!
తడసి తేనిఁ బ్రమాదంబు తప్పదు సుమా!
దాఁటుదమువీఁటి; కేటిపిల్లాట నీకు?" 62

క. విన కది పార్థుఁడు రథమును
జన నిచ్చెనునాల్గడుగులు; జాతె నప్పుడు చే
తనుగలవి ల్లుత్తరుసకు
"వినిచెదు మే మే లికలము! విద్వేషులమే? 63

క. స్వామిద్రోహము పాపం
బీమాత్రము తెలియనేరవే? యన, నగి సు
త్రామజుఁడు దోలె; "చంపితి
వే మము సారథి!" యటంచు వేగిరపడుచున్. 64

గీ. కట్టుపుట్టంబు పైకెగఁగట్టి, వెనుక
ముందుగ జరిగి, తుది రథమునకు వచ్చి,
యల్లనన్ లేచి, భూమికి నట్టె యొఱికి
"బ్రతికితి" నటంచుఁ బరువిడెఁ బ్రభుసుతుండు. 65

క. ఓరగ నొరగుకిరీటము;
జాఱినముడి, ఘూర్ణిలుయవసనముల్, జెదరం
బాఱినగళహారముఁ; గ
న్నీరగు చెంపలుగ నతఁడు నెఱిచెడి పఱచెన్. 66

క. పరువిడుచుఁ దిరిగి కనికని
పఱచెనుత్తరునిఁ గాంచి పార్థుం "డరరే!
చెఱచెను బని" యని పట్టఁగ
నరదము డిగి వెంటనంట; నదికనుఁగొనుచున్. 67

క. కురుసేనలోనఁ గలవిర
మురియాడెను; పేడివేస మొప్పెడువాఁడా
నరునట్లు దోఁచు మెయిఖిరి!
నసు దిది" యని కనిరి తెప్పలార్పక వీరుల్. 68

మ. కురుబలమెత్తిరాఁ, దగులుగుండెగలాఁడుఁ గలండె యెవ్వఁడేన్?
వారుఁడు నరుండు దక్కఁ బరుఁడైనఁ దెగించునె ప్రాణమాస; నా
విరటునిపీఁట నిమ్మెయిని వేసముతో నరుఁడుండెనో" యటం
చరమరలొందఁ జొచ్చిరి మహామహులెల్లరు భ్రాంతచిత్తులై. 69

సీ. అటుల నుత్తరువెన్నంటి యర్జునుండు
నిలుము! నిలకున్నఁ దీతు నీతల" నటన్న
మృత్యువో? సారథివో? నాకు నెచట దావ
రించితివో? యంచుఁ గనుచు సాగించెఁ బరుగు. 70

గీ. నడక పని జేసి నరుఁడు నూఱడుగులందు
బట్టి యుత్తరు "నిది యేటిపని కుమార!
సతులమధ్యనఁ బొల్లుదంచితే? యని మొనఁ
బఱితే? స్వచ్ఛనిరాటునన్యాయముఁ జెఱితే?" 71

గీ. అనఁగ; నిగిలించిపండ్లను, నట్టినోట
వ్రేలినిడి, వాంచిశిరము "నిట్లేలచలము?
వదలు-మఱేఁ బుట్టఁగంటి నీయుదరమునను;
మనెద నీపేరు నేఁజెప్పి కొనుచునిలను. 72

గీ. నేనూ చచ్చెదె నీకిష్టమైన వినుము!
కొనుముఖడ్గము; శిరమునుఁ దునిమి విడువు;
మేలలోకంబు వారిచే నిట్లునాదు
గొంతుఁ గోయింతు కాంతు వేమంతఫలము?" 73

గీ, అనఁ; గడుపు పగులఁగ లోనె యతఁడు నగుచుఁ
గామినులమధ్యఁ బట్టపగ్గములు లేక
వాగితివి డంబముల వాయివ్రక్క వాఱ!
పగఱఁగని పాఱుదే? చావవా కుమార!" 74

గీ. అనిని బాఱిన నడుగడుగునకు నఘము
మునుకొన నడుగడుగునకు ముట్టు నశ్వ
మేధపుణ్యము! మడిసిన మింటిచెలుల
పొందు దివియందు, నిలఁ గీర్తినొందు" ననిన. 75

గీ. అనిమొనను బాసి పాఱిన యఘముఁ బాప
ధరణిసురలుందు; రశ్వమేధమును మేమె
స్వాయము సలుపంగ నేర్తుము! స్వర్గసతుల
నొల్ల; మాయంతిపురికాంత లుందు రొల్ల 76

క. నూఱుహయంబు లిడెద; మణి
హారంబుల నిత్తు నీకు! హస్తులనే వే
యూఱిచ్చెద; మఱి నాపరి
వారాంగనలను నొసంగువాఁడ; నుడుగుమా! 77

క. మాతండ్రి పాఱి పోసంగిన
దే తప్పుగఁ జేసి చూపితే నీచేయుఁగ!
ఱాఁతిమదిగల బృహన్నల!
నాతర మిది కాదు వినుము! ననుదయఁ గనుమా! 78

క. పరుఁ బిఱికియనఁగ నందఱుఁ
బురుషులె! తమలోటు లెంచు పుణ్యులు గలరే!
పరిహాసములకుఁ గినిసి బ
వరమున దూఁకంగఁ బిచ్చిపట్టెనె నాకుఁగా. 79

గీ. అనిన, నర్జునుఁ డుత్తరు ననునయించి
"వెఱవఁబోవకు మేనుంటి నెఱపు పార
థిత్వమున "నేరి మును బోరి తేఱినావొ?
ఫేడి కేటికి యుద్ధంబులాడు గోడవ?" 80

క. అనినఁ, "మాటల దాఁటిన
విను! నీకడవాయిఁ గోతు; బింకమువిడు; కై
కొను సూంతకృత్యమును; ర
మ్మని శిరమును జంకనుగొని, యరదముఁ దరిసెన్, 81

గీ. నొగపయిన నిల్పి యుత్తరు "బెగడు వడకు,
రథము గడపుము; శత్రుల రణమునందు
నడుకఁ జేసెద నీయాన! నమ్ము" మనుచు
ధైర్యమును బోయ, నీకొనెఁ దప్ప దనుచు- 82

గీ. మున్ను తమయాయుధంబుల మూట, నిడిన
తతశమీవృక్షమెడకు నుత్తరునిచేత
రథముఁ దోలించెఁ బార్థుఁడు రథుకుఁ డగుచుఁ
గాంచి యిదికురుబలములుకళవళించె- 83

క, గురుఁ డది కని "యర్జునుఁ డీ
కరణి నవధిదాఁటి యిట్లు కానంబడె, నే
తెఱఁగో" యని భీష్మునితోఁ
బరు తెఱుఁగని యట్లు మర్మఫణితిని బలికెన్. 84

చ. కురుపతి వచ్చెనంచయినఁ గ్రుంకఁడు; కాలముపోల్చి యేనియున్
వెఱవఁ డిదేమిగర్వమొ? వివేకమొ! పెద్దలు లేరె? బుద్ధినిన్
గఱపరె? యిందుచందమునఁగన్పడు వీఁ డెవఁడో, గణించియున్
గుఱుతిడరా దిఁ; దెట్టిెఱఁగో కద యీతనిచిత్తవృత్తి" నాన్. 85

ఉ. "వానికి భీతిలేకునికి వాస్తవమే యగు! నేటికుండుఁ? దా
మాన కవన్ని యెన్ని యిటు మార్కొనఁగామదినూఁది వచ్చెఁనీ
మానసమందు సందియము; మానుము సంధియొ ముందుయుద్ధమో
పూనఁగ నిట్టు విఘ్నపతిపూజ నొనర్చుటిదంచు నెంచెదన్." 86

గీ. ఇట్లు గురునకు గాంగేయుఁ డెఱుఁగఁ జెప్పె;
దానియర్థంబు గ్రహియించి ద్రోణుఁడంత
నవధిగడపిరి పాండవు లంచుఁ దలఁచి
సందియము మానె; నచ్చటసవ్యసాచి- 87

గీ. ఉత్తరునిమోముఁ గన్గొని "యుత్తరువునఁ
బాండవులకై దువులు దాఁచఁబడిన వవిగొ!
దీనినారోహణముఁ జేసి, వానిలోన
గాండివము నాకు ని" మ్మనఁగా, నతండు- 88

గీ. సరిగ శిర మెత్తి తిలకించి, "శవము నకట!
రాజపుత్రులు దాఁకుదురా, ధరిత్రి?
సారథీ! యనుచితమిది, వేఱె దేని
పనికి నియమింపు మెట్లైన్ఁ బ్రదె" ననిన; నరుఁడు.- 89

క. "కైదువులపైనఁ జర్మము ...
బాదుకొనఁగఁ, బరులు గుఱుతుపట్టనియటు లీ
మాదిరిఁ గట్టిరి, శవమిది
కాదు సుమీ! త్వరగ నేగి కైకొను" మనినన్. 90

గీ. పుట్ట మెగగట్టి, భయముఁ బోనెట్టి, చెట్టు
నెక్కి యసువులవరచేతఁ జిక్కవట్టి,
కట్టులనువిచ్చి, చర్మంబుఁ గడకుఁ ద్రోసి.
కైదువులఁ గాంచి వడఁకుచుఁ గట్టకనియె— 91

"కాలభుజగమొ. ఖడ్గమో? కనఁగ శరని
కరమొ, కల్పాంతవహ్నివిసరమొ? యాయు
ధములో కాలాంతకుని కపోలములో? నన్నుఁ
దెఱచితి బృహన్నలా!" యంచు నఱచి యుత్తరుఁడు. 92

క. "ఎట్టు కరమిడుదుఁ బాముల
పుట్టను? బిడుగులొకో కైదువులొకో యివి? నాకా;
నెట్టుకొని నరునిఁ దలఁచుచుఁ
బట్టుము యవిచిక్క" నంచుఁ బార్థుండనియెన్. 93

క. చిత్తమున నగుఁ స్మరించుచు
సత్త్వ నిగ్రహించి చెమటజాల్వార మెయిన్;
ఎత్తికొని గాండివము నొ
డ్డొత్తుచుఁ బార్థున కొసంగి యుత్తరుఁ డటుపై, 94

గీ. పరశు, గద, దేవదత్తము; శరనికరము,
వర్మ, ఖడ్గాదుల నొసంగెవరుసమీఱ;
నవ్వికొని కిరీడి "మిగిలిన వట్టిపెట్టి
ర" మ్మనిన నుత్తరుండనె, బమ్మరిల్లి- 95

గీ. సారథీ! యిప్పుడిచ్చిన భూరిచాప
మేమహామహాభుజముపై నెక్కనేర్చెఁ?
దక్కు గైదువు లివియేరు దాల్చువారు!
తెలుపుమా! వేఁడెద" నటన్నఁ బలికెనరుడు:- 96

క. ఇదిగాండీవము కవ్వడి;
దది ధర్మజు మేటిచాప; మది వడముడి పెం
గద! కోదండము నకులుని
దది; యదిసహదేవుచాప మవనీశసుతా!" 97

చ. అని తమయస్త్రశస్త్రముల, నయ్యాయి వర్మకిరీట ఖేటముల్;
పొను పదు తేరు టెక్కములుఁబూన్చుహయంబులుఁ; బట్టుశంఖముల్
మునుమును కొన్న కార్యములు, ముఖ్యములైనతదీయ హేతువుల్
వినిచెను కిరీడి యుత్తరుఁడు వేఁడఁగ గ్రుచ్చుచుఁ దన్ను వేడ్కతోఁ

క. వింతగ నుత్తరుఁ డది విని
కౌంతేయులమట్టు గుట్టుఁ గనుమహితుఁడ వా
కౌంతేయుల నొక్కఁడవో? త
త్వాంతర్యము నాకుఁ దెలుపు" మనఁ బార్థుఁ డనున్ 99

క. "ఏ నర్జునుండ; వలలుఁ
డౌ ననిలసుతుండు; కంకుఁడయ్యె యమజుఁడే!
మానకులుఁడె హయరక్షకుఁ
డౌ! నాసహదేవుఁడెనుమా! గోపుఁడగుచున్. 100

క. మీరాణివాసమందున
సైరంధ్రి యనంగనుండుసతి ద్రోపది యూ!
గోరుటఁ గీచకుఁ డావెను
మారుతి యూనీచుఁ జంపె మాటగుధాత్రీ. 101

గీ. పదియు రెండేండ్లు వనినుండి; వత్సరంబు
గడువు నజ్ఞాతవాసంబుఁ గడప; నిట్లు
మఱుఁగుపడి యుంటి మిచట, మీపురిని, మీదు
ప్రాపునం” దన్న, నతఁడు హర్షంబుతోడ:- 102

గీ. “పార్థునకు బేరు లెప్పారుఁ బది యవేవి?
యెవ్వడేరీతి లభియించె నెఱుఁగఁ దెలుపు
మపుడు సారథి! నమ్ముదు” ననిన శ్వేస్మి
తాననుండయి యింద్రజుఁ డనియె నిట్లు:- 103

గీ. ఫల్గున, శ్వేతవాహన, పార్థ, సవ్య
సాచి, జిష్ణు, కిరీటి, విజయ, ధనంజ
యార్జునులునన, బీభత్సు డనఁగ, నిట్లు
పేర్లు పది యొప్పె నాకు పృథ్వీశతనయ! 104

సీ. ధరణినెల్ల జయించి ధనమును జేకొని
యుంట నన్ను ధనంజయుం డటండ్రు,
పోరులో జయ మెప్డుఁ బొందంగఁ గల్గుట
బిరుదారఁగా నన్ను విజయుఁ డండ్రు,

రవిపోలె శిరమున రహియించు నింద్రుకి
రీటం బగుట నన్ను గిరీటి యందు్రు,
వీరజాతికి నెల్ల బీభత్సుఁడుగ నుంటఁ
జాటించి నన్ను బీభత్సుఁ డందు్రు,
కేలు రెండింటను. నాకేలమిన్నగ వింట
శరము లేయుట సవ్యసాచి యందు్రు
ఉత్తరఫల్గుని నుదయంబు నొందుట
లోకులు నన్ను ఫల్గునుఁ డందు్రు;

గీ. పార్థుఁ డందురు పృథకు నేఁ బట్టి నగుట;
నర్జునుం డందు్రు స్వచ్ఛవర్ణాంగుఁ డగుట;
వరిణము ధర్మజునకు జేటు గనినవానిఁ
జంపఁ బ్రతినను గొంటను జిష్ణుఁ డందు్రు. 105

సీ. నాకభవులెల్ల నక్షుచు నన్నదిర్ప
నంబుజాక్షుమాత్రసహాయుఁడ నయి
యేర్చుటను ఖాండవము నాకుఁ గృష్ణుఁ డనుచు
విధిభవులు బహునామకుఁడగు పేరొసఁగిరి. 106

గీ. అమరవిభుఁ డమరు లొసఁగి రస్త్రశస్త్ర
జాల; మనిలోన లొంగని కాలకేయ
ముఖ్యదానవకోటిఁ దున్ముటఁ గిరీట
దేవదత్తము లిచ్చిరి దివిజవరులు. 107

ఉ. ఈకురునాథుఁ డల్లఖచరేశ్వరుచేఁబడినప్పు, డొక్కఁడే
నాకరణంబునందుఁ బదినాలుగువేవుర నభ్రచారులన్
నూఁకితి; రాజరాజునటె నొవ్వఁగనీక గ్రహించి తెచ్చితిన్;
నీకు భయంబులేదు; కురునీరధిఁ ద్రచ్చెద. నాలఁ దెచ్చెదన్" 108

క. అను; డిగ్గన నతికి వృత్తం
బనుమోదముతోడఁ గ్రిడియుడుగులఁ బడునా
తని నరుఁడు కౌఁగిలింపఁగ
ననెనుత్తరుఁ డలరుచున్ వయముఁ బ్రియ మొప్పన్. 109

చ. "ఘను నిను, దేవనాథసముఁ గానక పేర్లితి నైచు నన్నటం
చని వినుతింపఁగాఁ "దెలియ కాడినపల్కుల దోసమెంతు నే!
యనుచు సమాదరింపఁ గని "యాహవభూమిని సారథిత్వమున్
గాని పనిసేయ నీకు, మదిఁ గోరితి ము, న్నది యబ్బె నేటికిన్, 110

గీ. "అలఁతి యని నన్ను నెంచకు, మరులు వొగడ
నూతుఁడై, మించునాచేయి చూపుదు" నన
నర్జునుఁడు "నాకు నీపైన నగ్గలంపు
టాదరం బనె; నుత్తరుఁ డనియె నపుడు. 111

చ. హరిసఖునిన్ మహాభుజు, మహాత్ము న్మరేంద్రతనూజుఁ గాంచుటన్
బళమకృతార్థుఁ డేనయితి; భాగ్యముపండెను; భవ్యమూర్తి! నీ
కరయ నపుంసకత్వ మెటులయ్యెను బాప్రమ్ము! క్లేశమయ్యె! సా
దరముఁ నఁ దెల్పు, మెవ్వడది తప్పు? నటంచన నర్జునుండ నున్, 112

క. విను మూర్వశి శాపం బది!
పనుపడె నజ్ఞాతవాసవత్సరమునకున్!
చన నిన్నటితో; లేదిం
కన, మురియుచు నుత్తరుండు హర్షము వొందెన్. 11–

తే. కలుగు మదినుండి యుండెల్లఁ దొలఁగె, నింక
నన్నుఁ బనిగొను మనఁగ, మున్నన్న యట్ల
తక్కు నాయుధములఁ గట్టి తనువునందె
పెట్టి కథమూన్పు! మన నాతఁ డట్లు సలిపె. 114

క. కరములఁ గాజులను విడిచె
నరికాంతలగాజు లట్లు! యదిమి పెటపెటన్;
మఱిఁ దొడిగె వల్లకంటెడి
సరిగంచులచీర నరుఁడు సవరించి మెయిన్ 115

క. తిలకమును మార్చి; వెండ్రుక
లలవడఁగాఁ బాచి ముడిచి, యధిదేవతలన్
దలఁచుఁడు నిజగాండీవా
దులు గలుగఁగఁ బురుషమూర్తితో నెలకొనెన్. 116

క. మునుపటినిజకథమును వారు
లను గోరినదిచ్చె; హనుమ పార్థించినఁ, గే
తనముపయిఁ బోలిచెఁ; గవచం
బును దొడిగి, ప్రమోదము ద్విముఖమునఁ దనుకెన్. 117

గీ. బలరిపుఁ డిడిన కుండల వజ్రమకుట
మఱలఁ దలఁపఁ గర్ణశిరములపూఁనవ్వి
రవిసదృశమూర్తిఁ గపిధ్వజ రథము నెక్కి.
భానుఁడుదయాద్రిపైఁ బొల్చుభంగి దోఁచె 118

క. "జయమగు ధర్మజున!" కని, వి
జయుఁ డెత్తె గాండీవముఁ గొని, నిజగురువును దలం
చి, యెసఁగఁగ నారిని బిగిచి
భయగతి నరియెడఁద లవియ నెదురున మీటెన్. 119

గీ. తోడనే దేవదత్తంబుఁ గూడ నొత్తె
వేయిపిడుగులు మ్రోసినవిధముఁగాఁగ;
ప్రళయమాయెనో యనుచు నభ్రమున నున్న
దేవతలు దిక్కుఁదెలియక దిగులుపడిరి. 120

గీ. తోయధులు మ్రోఁగెఁ, గులగిరుల్ తూఁగసాగె;
క్షోణి యూఁటాడె; దిక్తతి క్షోభనొందె!
చాలుగ రథాశ్వములు మొగ్గి కూలఁబడియె;
మెయిమఱచి యుత్తరుఁడు నొగమీఁద నొరగె, 121

— అర్జునుఁడు కౌరవబలముతో యుద్ధము సేయుట —

గీ. నరుఁడు పగ్గములను బట్టి తురగములను
నివిరి నాలుగొనక నిల్పి; తవిలి విస్మృత
రూపుఁడై యున్ననుత్తరు లేపి, చక్క
నునిచి, యేమిది? యన నాతఁ డనియె నంత. 122

క. భేరీశంఖారవముల,
వారణఘీంకృతుల, వింట్లధ్వనులగతుల. నే
నారయుదుఁ దొల్లి; నిరుపమ
యారభటి యొకాక, సంకునారావంబే? 123

క. పిడుగులపిండులు వడినటు
కడపాఱిణంబుల నగల్చెఁ; గపికేతనమో
పొడిచెను గనులకుఁ జీఁకటిఁ;
గడువెఱ్ఱి పొలిచెఁ దావకపదసరవియున్. 124

క. తొలిసారిగ నిది వినుటన్;
గలిగెను నీభంగపాటుఁ, గడవ నదియున్;
జలియింప నింక; నేడి!
యులియింపు" మనంగ సంకు నూదెను బాజలన్. 125

గీ. కలఁగుభయమిటు తనకుఁ దాఁ దొలఁగఁ ద్రోసి;
గుణముసారింప విని, గుండెఁ గుదురుపరచి;
జమ్మికిఁబ్రదక్షిణముగ విజయు ననుజ్ఞఁ
బఱపి యరదము, నరిసేన కుఱుకఁ దోలె, 126

గీ. అచటఁ గురుసేనలోపల నంతకంత,
'నరుఁడు నరుఁ' డంచు నలుపులు విరియఁ జొచ్చెఁ;
గుంభసంభవుఁ డప్డు సంరంభ మెసఁగ
ఘనఘనాఘననిస్వనమున నిటనియె. 127

ఉ. ఆఁకటితోఁ గుహాంతరమునందుఁ దాఁగి, గజేంద్రయూథప్రా
కాకను గాంచి దూఁకు, మృగరాజమువోలె, నరణ్యవాస ఖి
న్నాకులబుద్ధి, రోషబడబానలుఁడక్కులనాల్యమాడఁగన్
వీఁకను దాఁకఁగా మసల, వీఁడె కిరీటియనుండు వచ్చెఁబో! 128

చ. మునుపటి పార్థుఁడే? సురపముఖ్యులొసంగిన గాండివాది సా
ధనములతోఁ గిరీటము, రథమ్ము, హయమ్ములఁ బొందె; నీశ్వరున్
రణమున నోర్చి, కైకొనె వరంబుగఁ బాశుపతాస్త్రరాజమున్;
మనకు నజేయుఁడీతఁ డనుమానము మానుఁడు; కర్ణ, మేమిఁకన్

చ. రవి యుదయించు కైవడి విరాజిలె మూర్ధమునన్ గిరీటు; మా
ఛవిగలకర్ణపూరయుగ చంచలతల్ కనుదమ్ములగ్గుటెు; బల్
చెవులు ఘటించె జ్యారవము శేషముగన్ దిగిభేంద్రరాజికిన్;
దివిభువి దిక్పరిమంబుఁ గొనుతీరున మ్రోఁగెను దేవదత్తమున్.

గీ. పడగపై నిక పీందుకర్పాటు మయారె!
పరఁగ బ్రహ్మాండభాండంబుఁ బటియుఁజేసె
భువనజవమునఁ బడినశ్వంబు లరె!
ధరణియదరఁగఁ బటాంచె నరదమూని. 131

క. అపశకునంబులతోఁ చెడు,
నిపుడు మనకు జయముమాట యేమో? మొదలే
నృపునెయ్యులైనను బురికిఁ గ
మపుఁ గోఁ బంపుట మనాపఁ దోఁచు హితమున్. 132

ఉ. కొంతబలంబు ముందునృపుఁ గూడి చనన్, గడుపుల్ పిఱుందనే
కొంతబలంబుతోఁ జనని; కూడికతో మన మెల్ల నిల్చియుం
తంతకుఁ గ్రీడినడ్డి దురమాడుద మానిలుసేనలోడ; న
య్యంతకు ఘూవరుండు పురినందుసుఖంబుగఁ జూత మాపయిన్,

క. అనఁ; గటకటఁ బడికర్ణుఁడు;
"వినఁ గూడనిమాట వినిచి వెఱపింతె నృపుకీఁ?
వినుతించుచు వందిగ న
ర్జునునిన్ గొండంతఁ జేసి చూపెద వౌరా! 134

గీ. తగునె హీనుసేగతిఁ జూఱ ధరణివిభుఁడు?
పార్థుఁ దేతెంచుమాత్రానఁ బాఱనేల?
వాఁడును రక్షకమాత్రుఁడు కాఁడె? తాఁక
గుండె లేకున్న మీరెల్లఁ బొండు పురికి! 135

క. భోజనదక్షిణ లందఁగ
భాజనులగువారుగాక బాపనవారల్
రాఁజనుదురె జవరములకు?
రా జెఱుఁగడుఁ మీ ధురంధరత్వమహిమముల్. 136

ఆ. మొదట నొప్పి వచ్చి, కదుపులఁ బట్టించి,
పార్థుఁ డన్నమాత్రిఁ బరువులిడరె?
విప్రబుద్ధిగాక వీరులబుద్ధితో
యుద్ధి? పొండు పోరులేల మీకు? 137

మ. నరుఁడొక్కఁడుగ నేల, దేవతలతో నాకేశుఁడే తాఁకినన్
వెఱవన్! డీకొనువాఁడ! గోగణము నే వీడన్; గనుం జెల్లఱున్
ధరణీనాథుఋణంబు దీర్ప కిటుయుద్ధంబన్న మీయుక్తులన్
బరువుల్ వెట్టఁగఁజాలఁ" బోరెదఁ గదున్ బాహాబలం బేర్పడన్

క. గాండివపాశుపతంబుల
చండిమ మెట్టిదియొ చూతు" జమదగ్నితనూ
జుం డిడినచాపవిద్యా
పాండిత్యం బుండ నొరునిఁ బాటింతునటే? 139

గీ. రాజుమన్ననఋణముఁ దీర్పంగఁ; బార్థ
కర్ణులన్ గన్యుఁ డెవ్వాఁడొ నిర్ణయింప
నేఁడు తఱియబ్బె, నిది విడనాడఁగలనె?
కాంచెడిని గాక, దివిభువి కన్ను వెట్టి." 140

క. అన, నశ్వత్థామ కదున్
గినుకన్ గొని "కోతలేటికిన్ గోయ? కులం
బునుబట్టి కూఁత" యనియెడు
జనవాక్యము నీదుపట్ల సార్థక మయ్యెన్. 141

గీ. గొల్లలను దోలి కదుపులఁ గొన్నయంత
నింతమగటిమియే! జూదమే రణంబు?..
శకునిపాచిక లిందున సాగునొక్కొ?
పోల రిమునులె యన, నీవు చాలఁగలవె? 142

తే. "గుణముగల్గిన శత్రునిఁగూడ బొగడఁ
దగును సుజనున కన్నంతఁ, దనయసదృశు
శిష్యుఁ డై త్రైలోక్యవీరు, సచ్ఛీలు, గురుఁడు
గణుతిఁగొనఁ రాదె? యది వీనుఁగనకుఁ జేదె? 143

క. భూనాథుఁడు దద్దగ నిను
బూనుట, నీయాటచెల్లెఁబో! కానియెడన్
మానితుల నవమతించినఁ
బోనిత్తురె నాల్కఁ గోసిపుచ్చక కడఁకన్? 144

ఆ. అనఁగఁ, గత్తి దూసి యనలంబు గన్నుల
దూఁకులాడుకినుక తొంగలింప.
"మాట లేటి కిట్లు దూఁకెదు, పోరాడఁ
జేతఁగాక? రమ్ము చూతుఁగాక!" 145

క. అని కర్ణుఁడు లేవఁ, గృపుఁడు
చని యడ్డము "కాలుద్రవ్వెదవు దేవ్యాను నీ
వని కనఁ, గాలము దేశముఁ
గనవలదె వివేకమున్న ఘనునకుఁ గర్ణా? 146

ఆ. కార్యగతులయందుఁ గందురు ప్రాజ్ఞులు
సమరమధమసాధనముగ, సర్వ
సిద్ధిపొందురీతినే సెదు పట్టుల,
మొఱకు నుఱుకులాట తెఱఁగునీదె! 147

ఉ. అర్జునుపేరు నెత్తెనవ; నగ్గిగ భగ్గనిమండు చీవ; యా
నిర్జరకోటికైన నని నిల్వఁడు వానికి; ఖేచరుండు మున్
దుర్జయుఁడై ప్రభున్ పఱచి తోకొనిపోయెడువాఁడు గల్గవో!
గర్జనతర్జనంబులనె కార్యములన్ సమకూర్చుకొందువో ? 148

ఉ. తేజ మెలర్పఁగా నొకఁడె దిగ్విజయం బొనరించి, కీర్తినీ
రాజన మెత్తె కౌరవకులంబునకెల్లను; మీవయంత్రిమున్
ఓజనుగొట్టికృష్ణుఁ గొని; నోర్వకఁబైఁబడు రాజలోకమున్
ఆజిజయించె, నీవునప్పుఁ డచ్చటనుండవొ చచ్చినట్టుగన్, 149

క. గాంగేయుఁ డప్పుడనెఁ గ
ర్ణుంగని "యిటుతగునె బుధుల నొవ్వఁగనాడన్ ?
ఇంగితవేదు లగుటఁ గల
సంగతి వినిపించినారు, సమయం బగుటన్. 150

ఆ. అద నెఱింగిబుద్ధివిధ ముపదేశింత్రు;
తొడరుతఱినిఁ గత్తి దూయఁగంద్రు;
మహితులైనవారిమత మిది! యెఱుఁగవే"
పోల దవమతింపఁ బూజ్యమతుల! 151

గీ. తాతమన్నవగల యంగరాజ! నీకు
సమరపాటవవాక్యముల్ సరియె! కాని
మాన్యు లగువారి నిట్లవమానపఱచ
పెద్దతనమేమి కా దదిచెడ్డగుణము! 152

వ. అనంగన; గర్ణుని గౌరవేశ్వరుఁడు నెయ్యంబాడి వారించి, ద్రో
ణునిఁ బ్రార్థించి, కృపుని నుతించి, గురునూనుఁ జేడి "మీలోనమీ
రనుకూలింపక యున్న నెట్టులగుఁ గార్యంబుల్? ననుఁ గాంచియై
నను గోపంబును మాని, ముందుపనిపై నర దృష్టి సారింపుఁడీ! 153

క. అన "భీష్ముని పల్కులనే
చనెఁ గోపము; పనిని జేయవ జాల్ములమె, నృపా!"
అనుగురునకుఁ గురుపతి యను
"వినుఁ డొక్కవిచార మింత వివరింపఁదగున. 154

సీ. ప్రతిన మీరకు పదుమూఁడు వత్సరములు
గడవకుండఁ బయల్పడెఁ గత్తియనుట,
మునుపవలెఁ బాండవు లడవి మనవలయుట,
తెల్లమగుఁ గాదె సంధి యిత్తెఱఁగువడుట ! 155

క. వారలఁ గుర్తింపఁగదా!
కోర యిటకు మనముఁ గాక; కూడె నది యిటుల్
మీా రేల వాదులాడ! వి
చారము లిటులేల? యేల సమరముచింతల్? 156

క. అన భీష్ముఁడు "పాండవు లవ
థిని దాఁటెడివారె! యగ్ని తేజ ముడిగినన్
దినమణి వెలుఁగకె యున్నె.
మునుమిన్నేకంబునైన మాటిన దిశలున్ 157

గీ. అట్టులేదైనఁ, ద్రౌపది నగడుపఱచు
తఱిని నైతురె మిమ్మెల్ల! ధర్మపాశ
బద్ధులగుదురు కాదె యవ్వారు! మాట
దప్పనే మెట్టివశ్యనైన ధర్మజుండు? 158

గీ. అధికమాసంబులను జేర్చి యరయ నవధి
ముగిసె నిన్నటికే పదుమూఁడువత్స
రములు; కనుక నె పొడసూపె సమయ మెంచి
నిర్జితాఖిలవిద్విషుం డర్జునుండు! 159

గీ. హరునినోర్చినవాని నాహవమునందు
గెలుతు మనరాదు; సంధినిసలిపి రగుట
వారలకు వారిపా లిడవలయుఁగాదె?
కారణము లేక కయ్యంబు కర్జమగు నె?'' 160

క. అన, దరహాసితాననుఁడై
యను దుర్యోధనుఁడు:— భాగ మనుఁను స్వప్నం
బుననైనఁ దలఁపకుఁడి! యది
యనిమొననే నిర్ణయింపనగుఁగా! కనియెన్. 161

చ. అది మతమైనఁ బోరితమయా; వనిఁ దోలిన నిన్ను గాంచుటన్
మొదలిదియాటఁ గిన్క మినుముట్టెనదెబ్బోదుఁ గ్రీడి; కిన్క నీ
తొదగుట మేలు; మొగ్గరము నూనక ముందుగ నేనతోడ నీ
కదుపులతోఁ బురంబుఁజొరఁగాఁ జననొప్పని ద్రోణుఁడాడినన్

ఆ. కార్య మిప్డి యంచు గాంగేయుఁ డనియెను;
సమ్మతించి రద్ది సర్వజనులు;
నది యనిష్టమయ్యు విధిలేకపోవుట
నియ్యకొనిరి ఱేడు నినుసుతుండు. 163

సీ. బలములో నాల్గవ భాగంబుఁ గొని రాజు
మునుముట్టఁ బురితోవఁ గొనెడునట్లు,
అంతటి సైన్యంబు, లావులఁగొని ఱేని
పిఱుఁద నేకడుకొని యరుగునట్లు,
తెగువ మహారథాతిరథు లందందున
మొనగట్టి క్రీడితోఁ బెనఁగునట్లు,
గురుపుత్త్రుఁడును గృపుం డిరువంకలను గావ,
ద్రోణుండు తఱిఁగని దూఁకునట్లు,

గీ. శకునికర్ణవికర్ణదుశ్శాసనాది
యోధవర్యులు వ్యూహంబు లొడ్డి విజయుఁ
బఱచునట్లును, సైన్యాధిపతిగ భీష్ముఁ
డన్ని నడిపించె నొడలెల్ల కన్ను వెట్టి- 164

ఉ. అందఱితోడ నొక్కనరుఁ డాలము సల్పెదునంచుఁ గాంచ సం
క్రందనుఁ డంత సిద్ధసురగణ్యమునీంద్రనరేంద్రబృందముల్
స్యందనమందుఁ దోడుకొని సంభ్రమ మొప్పఁగ రాఁగ నెల్లరున్
బొందుగ మింటఁ బంతులుగఁ బొల్చిరి; నిల్చిరి తెప్పలార్పకే,

గీ వాసవున కంతదవ్వున నాసనమున,
బాండుభూపతి కూర్చుండిశియుండె; జేవ
వేశ్య లటనటఁ జామరాల్ వేయుచుండి;
వాద్యములు పూల పుటికల వరుసలుండె, 166

—అర్జునుడు గోవులను బురికి మరల్చుట—

శా. పోటుల్ వాఱఁగ దిగ్గజంబుల చెవుల్, పూరించుచున్ శంఖమున్;
ఘాటీన్ వాజులుఁ దూఁగుచున్ ధరను, దర్దన్ దూఁకులన్ బెట్టఁగన్;
ఆటోపించెడు కేతనాగ్రకపివీరారావముల్ గుండియల్
దూఁటన్ గౌరవసేనకున్; విజయుఁడున్ దోఁచెంచె దోర్వీర్యుఁడై

ఉ. అట్టుల వచ్చి దూరమున నాకురువాహిని లుంటఁగ్రిడియా
తట్టునఁ దేఱపాఱఁ గని, తానను నుత్తరుతోడ "నీమొనల్
గట్టివి కాని వట్టివి, యిలాపతికన్పడఁడౌట; గోవు లా
పట్టున సేనతోడఁ జనెడు; పార్థివుఁ డందున జాఱెనో కదా ? 168

ఆ ఆలతోడ భూమిపాలుతోడనె కాక
వట్టిబలములతోడఁ బనియె మనకు!
డాపలించి రథము నేపునఁ బఱపుము
మందయును నృపుండు నండె పోవుకు" 169

క. అన, సేనకు నెడమగుదా
తినఁ గొని యుత్తరుఁడు రథము రివ్వునఁ బఱపిం
చెను, శరుఁడయ్యెందఱ నటఁ
గనువిడి కలయుంగఁ గాంచి, కని తనపూతున్ 170

క. కుడిసైనికులు, మును వెన్కల
నడచెడి వారలను వినిచి, "నాగధ్వజుఁ డీ
కడ లేఁ; డాకదుపుల వెం
బడియెను; సవ్యేగనీక పనిబట్టవలెన్! 171

ఆ. చనునె యూనిరామిమంబైన సేనతోఁ
నగులువడఁగ? యిద్ది తడయకుండ
సరగ నడపు రథము చని భూమిపాలునిఁ
బొదవి, మొదటఁ గదుపుఁ బుచ్చవలయు!" 172

సీ. అనుచుఁ దేరువడిని నిమురడింపఁగఁ జేసి
యేగఁదొడఁగి దారి నింపిసుతుఁడు
గురుని భీష్ముఁ గృపుని గురుసుతుఁ గర్ణుని
చేతమందున భక్తి ప్రీతి పొదలఁ
బాదపద్మములంటు పదువున రెండును,
గర్ణయుగ్మంబుల కడన రెండు
గాఁగ బాణంబుల సాగించె వందన
భద్రగతులఁ దెల్పు భాతి; నంత

ఆ. వారలద్ది యెఱిఁగి కేఁచు నర్జును
మెచ్చుకొనుచు "వనులఁ జొచ్చి మజులఁ
బుట్టినట్టి" నంచు మోదంబు నొందుచు
దీవనలను నిడిరి భావ మలరి. 173

క. "సుగుణములపో్రి వితఁడు, ము
జ్జగముల నేలంగఁజాలుసత్యాఢ్యుఁడు; మూ
ర్తిగభీరుం; డతులైతకీ
ర్తి గడించినవాఁడు; నసమధీమంతుఁ డగుఁన్ 174

క. అని, కని "యీతఁడు నృపుదెసఁ
జనె; నొంటిగ వీనిఁదాఁకఁ జాలఁ డతఁడు; రు
దు్రినకును వే్రి గన, నితనిన్
మనుజులె మార్కొనుటకి తేనిమూ టేమొ కదో" 175

క. అని తమతమబలములతో
జనపతిరక్షణముఁ గోరి సరభసరీతిన్
జనఁజొచ్చిరి శస్త్రాస్త్రము
లనుఁగొని తెగియించి యసువులనె యొడ్డుగతిన్. 176

చ. అగరిపుసూనుఁ డల్లై రయ మార రథంబును సాగనిచ్చి, తీ
రుగనొక కో్రిశదూరమున రూక్షుపుసైన్యము లాలతోఁడఁ జో
వఁగఁ గని "గోవులన్ దగియవచ్చితి; మాదెససేన మమ్ము న
డ్డఁగఁ జనుదెంచెఁ; దేరును గడంకను రెంటికిమధ్య దోలుమా!

క. వచ్చెదు నీవీరవరుల
వ్రిచ్చెద నస్మద్భుజాబలం బేర్పడఁగన్
బుచ్చెదగోవులఁ; గురువిభుఁ
డెచ్చటికిఁ జేఁ జూఁడుఁకి జిక్కియేటిరు మమా! 178

ఆ. అనఁగ; నుత్తరుండు నరుఁడెంచు సేనకు
పశువులకును నడుమ ప్రాగ్దిశాము
ఖముగ రథముఁ బఱపెఁ; గనిసేనఁ గవ్వడి
కరితలఁబు నెత్తి సాఁకమునొత్తి.- 179

ఆ. నిలుఁడు నిలుఁడటంచు నిజనామమును వాఁడి
గర్జతోఁడ శరనికరముఁ బఱపె;
నంధకార మట్టె సంధింపఁ గురుసేన
గ్రుడ్డి దగుచుఁ గట్టి నడ్డకుండె. 180

క. అంధతయు, భయము రెండును
సంధించుట, దిక్కుఁ గనక సైన్యము నిలిచెన్
బంధింపఁబడినటుల; నరు
బంధురకరలాఘవప్రభావముచేతన్. 181

క. కదుపును బాదవిన సైన్యము
పదరఁగఁ బ్రాగ్దిశకుఁ దోలఁజేసి రథంబున్
అదలించిన నది పఱచెను ;
మొదవులు పురిదారిఁ బట్టమును కొనె నంతన్. 182

క. నరుశంఖారవమునుఁ గపి
వరుగర్జారవము, మౌర్వి పఱచెదురవమున్
అరదపురవమును, మింట న
మరు లార్చెదురవము మిన్నుమన్నులఁ దన్నెన్. 183

క. అమరగణము గురియించెను
సుమవృష్టిని; రంభ యాడె; సురమునిపాడెన్;
ఢమఢమదుందుభు లార్చెను
దమకంబున గొంతసేపు తాళలయగతిన్. 184

గీ. మరల కురుసేన కదుపుల దఱియకుండ
నడ్డముగఁ దేరువోనిచ్చి యర్జునుండు
విరటుగోపకులఁ బసుల వెంబడింపఁ
జీరి కనుచుండె నవి పురిఁజేరువఱకు. 185

క. కురుసేన లడ్డరాఁగా,
నుఱుమాడెను నడుమ నర్జునుఁడు; గోగణాప్రం
బిఱుఁదని చనిగోపాలురు
పురిఁ జేరిరి "మఱలఁ బుట్టువోందితి" మనుచున్. 186

క. అని వినిచిన వైశంపా
యను జనమేజయుఁడు గాంచి హాస్యముతోడన్
వినమితశిరుఁడై చెప్పం
గను వేఁడెను ముందునడుచుకతఁ గుతుకమునన్. 187

ఆ. మునిమనోబ్జభృంగ! ఘననీలరుచిరాంగ!
సదమలాంతరంగ! సాధుసంగ!
రాయదుర్గవాస! రవికోటిసంకాశ!
విబుధవృన్దిశేశ! వేంకటేశ!! 188

తృతీయాశ్వాసము సమాప్తము.

# అశ్వత్థ భారతము

## విరాటపర్వము - చతుర్థాశ్వాసము





క. శ్రీదయితా! త్రిదశార్చిత
పాదా! శ్రితవరద! ధర్మపథసంచరణా!
వేదవినోదన! దుర్జన
ఖేదన! శ్రీరాయదుర్గ వేంకటరమణా!! 1

క. అనెనిటు లాతని మేజయుఁ
గని వైశంపాయనుండు "కమపులఁ బురికొం
పి, నయుండు దవులఁ గురుపతిఁ
గని, తేరటుదోలఁ దెల్పెఁగా సారథికిన్. 2

చ. కని కురుసేన లయ్యది. యొకాయొకి నాలుగువేల్రథంబులన్
గొని చన; భీష్మకర్ణులునుగూడ నొకొక్కరు వేయివేయితో
జని తలదాఁటెఁ క్ష్మాపతిని సంధిలనీయక కిరీటి నడ్డుచున్
దనరినఁ నాసుయోధనుఁడుఁదమ్ములతో వెనుదన్ని నిల్చెనన్. 3

క. కని యది మోమునఁ జిఱునగు
వెనయఁగఁ గిరివంపుఁ జెన్ను శౌర్యుఁడు నపుడ
ర్జునుఁ డుత్తరు మొగమును గని
యను వీరావేశతన్మయాత్ముం డగుచున్ 4

సీ. విలసితకాంచనవేదికోన్నతపతా
కపరిభావిభవుండు కలశజుండు;
గగనచుంబితసింహాకలితకేతనుఁ డరి
దుర్జయుఁడు వాఁడె ద్రోణిసుతుఁడు!
ధగధగాయతకాంతిదర్పితవృషభధ్వ
జాఖ్యాతరథుఁడైన యతఁడె కృపుఁడు;
దివ్యకంబుపరిభాదీవ్యపతాకవి
హారంబు వాఁడె రాధాత్మజుండు;

గీ. విపులనవరత్నదీపితవీరభుజగ
కేతనరథుండె యగు కురుక్షితివిభుండు.
తతమహోన్నతతాళకేతనవిరాజ
మానరథమండితుఁడె భీష్ముఁడౌను తనయ! 5

క. గురుని వలఁగొనఁగ నరదముఁ
బరపుమ! యీఘనునివల్ల వలదు పరిభవ-!
బరయఁగ నీతఁడు కురుకుల
ధరేశసుతగురుఁడు; పూజ్యతముఁడగు నాకుఁ. 6

గీ. జగతి శస్త్రాస్త్రవిద్యాప్రశస్తి సిద్ధ
హస్తుఁ; డతులధనుశ్శాస్త్రనిస్తులుండు;
నాకుఁ గూర్చుగురుండు; తనంతఁ దాన
తాఁకినన్ గాని నే దాఁకఁ దగ దితనిని. 7

మ. గురుపుత్రుం డదురు శౌర్యాంచితుఁడు, సత్కోదండపాండిత్యసం
గరభీముండు; సుదాసుధాళికిని, నాఁకన్ రాని దోర్వీర్యుఁ డీ
శ్వరభూర్యంశభవుండు; నుద్ధతుఁడు, శశ్వత్కీర్తియా తండ్రికిన్
సరితూఁగంగలవాఁ డనుండుఁ గురుమాన్యశ్రేణిశ్రేష్ఠుండగున్. 8

క. శౌర్యస్థైర్యగభీరసు
వీర్యుఁడు, ద్రోణునకు నాటివీరుండు, కృపా
చార్యుఁడు, మత్పితృమిత్రుం
డార్యగుణాఢ్యుఁడు, మాకు మొదటియాచార్యుఁడగున్. 9

గీ. పూజ్యులౌవార లగుట నే ముందుఁ దొడరఁ
దగదు; వారలె తాఁకినతఱిని జూత;
మిప్పు డరదమ్ము నల్లన నేగనిమ్ము
టంచు ముంగిటఁ గనుచు ధాత్రాత్మజాతు— 10

శా. దుర్వారోగ్రభుజార్గళుండు, గదనోద్యోగప్రియుండున్, మహా
గర్వాటోపుఁడు, కౌరవాధిపతిసఖ్యప్రాప్తసంపద్విభా
సర్వస్వుం డలజామదగ్న్యకలితాస్త్రశ్రేష్ఠవిద్యాఘనుం
డూర్వస్ఫారుఁడు సూతనందనుఁడు కర్ణాభిఖ్యుఁ డాతండెసూ! 11

సీ. శౌర్యమున వీర్యమున నస్త్రశస్త్రమహిమ
మచ్చరించును నన్ గురుస్వామివిభుండు
తన్నెదురు నాఁకు జేయుకతమున; నీవు
తెలిసిన్ వేరికిన్ గానఁ డితఁ డెప్పుడు. 12

శా. ప్రజ్ఞావంతుఁడు; మేటివీరుఁడు, రణప్రావీణ్యుఁ డీతండు మా
విజ్ఞానంబుల తారతమ్యవిధమున్ వీక్షింపనౌ యుద్ధపున్
యజ్ఞంబందున ముందు; నిందు నద్దఁ జేయన్ ధర్మజుం డట్టునా
కాజ్ఞాపింపఁడు కానఁ గేవలము శాస్త్రప్రౌఢి చూపించెదన్. 13

క. కురుబలముఖ్యుల నిపుడే
బరిమార్చ, నొక్కొక్కరిఁ వధియింపఁగఁ జే
సిరిప్రతినను మామా, రవి
యరయుటఁ దప్పితిగ సలుపనగునే నాకున్? 14

క. ఈకర్ణుం డెపు డెట్టుల
పైకొమనో యేమొ? నీవు భయపడకుము, నే
వీఁకను జిచ్చపిడుగై
డీకొనియెద; రథము గడపు డీల్పడ కెలమిన్. 15

ఉ. విక్రమవీర్యధుర్యుఁడును వీరకులాఢ్యుఁడు ధీయుతుండు ని
ర్వక్రపరాక్రముండు, కురువర్యుఁ, డహంకృతిరూపు; మాదెసన్
వక్రసమగ్రబుద్ధి గలవాఁడు, దురాగ్రహుఁడన్నిటన్; రణ
ప్రక్రియ మాతుమాకయినఁ బందువయౌ నది నాకునుత్తరా! 16

ఆ. మత్పితామహుండు మహనీయతకీర్తి;
బుద్ధిసురగురుండు, భూరిబలుఁడు,
సాటిలేనిమేటి! జామదగ్న్యు నోర్చి
నట్టిదిట్ట! త్రిభువనైకధన్వి! 17

క. కౌరవులను మము సమగతి
నారయువాఁ డెప్పుడు నునికి యయ్యెడ నగుటన్
వారికి సహాయమగు; మదిఁ
గూరిమి మాయెడనఁ బెద్దగున్ దలపోయన్. 18

ఆ, అతనియెడకు నరుడ మరుగంగనీయకు;
కోప మూనెనేనిఁ గురుపతికిని
సేనలకును మనల జేరంగ నీయక
చెలఁగి యడ్డి మిగుల సిలుగు లొడ్డు! 19

క, అని యిట్లు వేఱువేఱుగఁ
గని, రిపుముఖ్యులను జూపి కవ్వడి సమరం
బున కుత్సహించుచున్ గను
గొనుచుండఁగఁ; గర్ణుఁ గాంచి గురుతనయుఁ డనెన్ 20

క, నీయాడినస్వస్తోత్రప
రాయణ వాక్యములు మఱతె! రాధేయ నరుం
డీయెడకె వచ్చెఁ, బెబ్బులి
న్యాయంబున దూఁకరాదె? యదనిది కాదే! 21

క. వలసిన నీసఖు శకుని
బిలిచి విచారింపుమింత; పృథ్వీపతి నీ
తలమోపెఁ గార్యఖడ్గపు
బలుమో; పది రిత్తపుచ్ఛవచ్చునె నీకు

ఆ. అనఁగఁ గినిసి యూతఁ; డసకింతు వే నన్ను?
నీకుఁబలెనె భీతి నాకుఁ గలదె?
నరుఁడు కాదు దేవవరుఁడైనఁ బోరెద
బంటుతనము చలము బలము మెఱయ!

ఆ. అనుమఁ గడఁగు కర్ణుఁ గనుఁగొని మునుమున్న
గురుఁడుఁ గృపుఁడు భీష్మ గురుసుతులును
గ్రీడి నడ్డ వరుగఁ, గౌరలునఁ గురుపతి
విగ్రహమున కేగె నుగ్రుఁ డగుచు.

సీ. కడుకొని దుశ్శాసనుఁడు, దుష్ప్రహుఁడు మున్మ
ఖుఁడు మొదలైనట్టి కురుకుమార
శతమును, సైంధవ శకుని ప్రభృతి బంధు
తతియు, బాహ్లీక సోమదత్త ముఖ్య
సామంత యూథంబు, సకలయోధాగ్రేస
రులును, బదాతులుఁ జెలఁగి వెలుఁగ
కరటి ఘటాఘోటకంబు లుష్ట్రింబులు
రథయూథ కేతన ప్రకర మలర.

సీ. సర్వసేనాసమూహ ముత్సాహ మూని
నడవఁ వడఁకెను ధర, ధూళి నభముఁ బన్ని
రవిని మాటెను; పటుతూర్యరవము దెసలఁ
గవిసె; వివిధాయుధంబు లుగ్రత రహించె. 25

గీ. గుణమునను లస్తకంబునఁ, గోటియుగళిఁ
నొప్పులుకఁ గ్రీడి భీషణక్రియను, రభస
గతిని, శేఁగినమాడ్కి నిశితశరాళిఁ
బగలి ముంచెను దిక్కులు దోఁపంగనీక. 26

సీ. గాండీవముమ్రోఁత రోదసిఁ గలఁప. రోస
మొలయఁ, దలమీఱుకాల్బలములను జెండి,
శవములను ద్రొక్కి కొనుచును సాగ రథము,
మూఁగిటిబలంబులను గవయంగవచ్చి— 27

గీ. తనదుదృష్టిని ముష్టిని నిలిచి వేయఁ
గాయములుఁ బడిపడునేనుగాఁగ దూఱు
శర మొకఁటికి; వరుసఁ బగఱను జమరు
కొనుచు, మొన మొన మునుముట్టఁ గూల్పఁ దొడఁగె. 28

క. లెక్కిడఁగరాక యోధులు
చొక్కునరా, వారి నగ్నిఁజొఱుమిడుతలుగన్
నొక్కట నరుఁడు శరాగ్నికిఁ
దక్కక నాహుతిగఁ జేసెఁ దద్దయు వేడ్కన్. 29

గీ. సేన లఱుముచు మఱిమట్టుఁబూని యస్త్ర
శస్త్రముల భువి దివిఁగప్ప; సవ్యసాచి
గాండివముచాలనమునఁ దీవ్రగతి నిగిడ్చి
యొంచెఁ జించెఁ గలంచె, మర్దించెఁ ద్రుంచె. 30

గీ. చక్కసాబాలుసేడునట్లు చదిమి, చీల్చి
తునుకులుగఁజేసి, ఛేదించి, తోలుఁజెక్కి,
నుసినుసిగ దంచి, తెగగోసి నుగ్గుసలిపి
రూపుమాపెను సేన నుబ్బూతలూఁపి. 31

క. ముందున్, వెనుకన్ మీఁదన్
గ్రిందను నెల్లెడలఁ దానె నిక్కడునటులన్
స్యందనమును బఱపించుచు
దందడిగాఁ దిరిగి శత్రుగతి నుఱుమాడెన్, 32

ఉ. దంతులనొంచి; యుష్ట్రతతిదంచి కలంచి; భటాళిద్రుంచిని
స్సంతతిఁజేసి, రథ్యములఁజంపి, రథంబుల నుగ్గునొట్టి; కే
రింతలసూతులన్ దునిమి. క్రీడి పతాకములన్ హరించి; సై
న్యాంతముఁజేసి, కాల్బలము నంతకుచెంతకుఁ జేర్చి వింతగన్. 33

గీ. సింహనాదంబు సల్పుచుఁ జించివగలు
గుండియలఁ గండుమీఱుచు, దండిమగలఁ
జెండికోలల; చండప్రచండధాటి
నిండియెల్లెడ నుండె నప్పాండవుండు. 34

శా. అంతం గూడి బలంబు లుగ్రగతిగా, నయ్యగ్రజుం జుట్టుచున్
సంతీవ్రారథసార్థజాలములఘంటాకింకిణుల్ మ్రోయఁగ; న
త్యంతంబుం శరశస్త్రజాలముల నేయన్; వేల్పు మైదీగ్నటుల్
కౌంతేయుం డొలువొంగి, గాండివము వేష్పన్ ధాటి మైత్రిపటిరన్.

క. ఎడయని నిజగుణగర్జన
పృథుమికి సభమునకు నేడి. పొరిబ్రీనోఁడం
బుడికించె; విష్ణుచక్రము
వడువున గాండివము తిరుగువాటెనఁగడఁకన్, 36

క. సవ్యాపసవ్యములఁ గనఁ
డవ్యయగతిఁ గార్ముకంబు సట్టె తిగియుటల్
దివ్యులును గుర్తిడనియుట
భవ్యముగాఁ బెఱపి. పరులు వాయివిడుసఁగన్. 37

క. దృక్కులు స్మృత్యంబులపై
నెక్కొల్పఁగఁ దవులునట్లు, నెఱి నరుశరముల్
తక్కక లక్ష్యముఁ జిక్కనఁ
జక్కన గుఱిఁ బాఱి చీల్చె శాత్రవవితతిన్. 38

గీ. సమము, విషమము, నిమ్నోన్నతము, సమీప
దూరముల తారతమ్యంపుఁ దీరు లేక
యవహితంబుగఁ గవ్వడిస్యందనంబు
సంగరస్థలిఁ బరఁగె నభంగరీతి, 39

సీ. వెలయుబలమెల్ల రెండుపాయలుగఁజొచ్చి;
యనల నాల్గుగ నడ్డముదవిలి దూఱి,
చాలచీలికలుగ మూలమూల కఱిగి;
వలయముగ సాగి చించె విష్వచ్ఛుఁ డలిగి. 40

క. సాగరమందలిమీనము
సాగెడునటు కౌరవేంద్రసైన్యమున మహా
వేగముగ నసునియరదం
బాఁగక విహరించె శత్రులలమటనొందన్, 41

ఆ. మణినికేతనములు, మకుటకుండలములుఁ,
గటకహారహీరపటలములును
బార్థబాణనిహతిఁ బడెఁ గౌరవులచేటు
కతన డుల్లు నుల్కాగములు బోలె. 42

సీ. పార్థశరంబుల వ్రాలిన కరులచే
నిబిడాఁబుదభ్రమై నేల తోఁచె;
చరణముల్ తెగి మొగ్గుతురగముల్, రౌతుల
నరుని శిగణుచొఱుం డనఁగఁ దోఁచెఁ;
బలుపులుఁ గాండ్లును, జగ్గాలుఁదెగి పాఱు
వాజుల దయఁ గ్రీడి వదలి పోచె;
దళితధ్వజాతపత్రములు గాలిని, సభ్ర
తలినాడునట్టుల చెలువుఁదోఁచెఁ;

గీ. పార్థుకట్టెదురన నొకబారిపడిన
వారి లెక్కసేయ నతనితోఁ బోర నేరు
వారు గల్గిన మఱియొకసారి తారి
తప్పినైనను గురుసేన ధన్యులెవరు. 43

చ. బలములనొంచినొంచి, గజవాజిసమూహముఁ జంపి చించికా
తులఁదెగవంచి, సారథులఁద్రుంచి, రథంబులనుగ్గుసేసి, చే
తులకసిదీఱ ధన్వులను ద్రోలె; మహారథులాదిగాఁగ స
ర్వులునిలతార్చిపాఱఁగ నరుం డని నాడెను ప్రత్యనీకమున్. 44

గీ. పార్థుశరతతి భూనభోభాగ మెల్ల
నిగుడుకీలలు పరతెంచి మిగుల నార్భ
టించి పొగ లెగయించి క్రిమ్మించి దెసల
నించి కాటుకచీఁకటి ముంచె భువిని. 45

క. నెత్తురు నేరుల భటాఘట
కృత్తాశ్వ, పతాక రథ కిరీటఘృణిమణుల్
మత్తగజకుంభగతముగు
ముత్తియములు వఱచె యుద్ధమున నలుగడలన్. 46

గీ. తెగినశస్త్రాస్త్రములుఁ; గడతెగినపాద
కరములుఁ; దలలు, మేనులు, గళనికరము,
నెమ్ముపేర్వులు గండలు, నిండునెత్తు
గుండముల నుడితిరుగుచు నుండె నిలక. 47

ఉ. ఎత్తిన విల్లు డింపకయ, యేడ్తెఱ శత్రుచమూసరస్సులో
మత్తగజంబటుల్ కలఁచి మార్తురఁ ద్రుంచెడు క్రీడిఁగాంచి పై
కెత్తినభీతిగుండెపడి "యీడదు పొద్దటుగ్రుంకఁగాని యీ
మత్తి" యటంచుఁ బర్వులిడ మేకొనియెన్ గురువీరసైన్యముల్. 48

క, బెదరువడిరి విద్యాధరు;
లదరిరి ఖేచరులు; నార్చి రాగంధర్వుల్!
వదరిరి సురలున్ దమదెస
నెదిపుట్టునో!యనుచుఁ గ్రీడి యెసకముఁగనుచున్,

క. "పూనుట, శరములమానుటఁ
గానము; పరమాణు వేనిఁ గనెదముగాదా!
మానవచక్షులె మన" వని,
పూనిక ననిమిషులు దివినిఁ బొగడిరి విజయున్. 50

గీ. అంత గుమిగూడి కౌరవుల్ సొంతబలము
నెల్లఁ గూరిచి మొత్తమై యింద్రసుతునిఁ
దాఁకరా, నాతఁ డాయెల్లదాయగమిని
గలయఁగని చేసి గాండీవక్వణ కమెలమి. 51

క! పదిగా, నూర్లుగ, వేలుగఁ,
బడపడి రెట్టించి, వానిఁ బదియంతలుగాఁ,
బదినూర్లంతలుగ శరస
ముదయక్రమగతిని నొంచెఁ బోఢి కరులన్, 52

క. తొలి సేసినయమ్ములకే
నిల రొక్కళ్ళు, లింక సేయు నీకేటికి? య
మ్ముల నొక్కగుఱికి మఱిమఱి
చలయింతని యస్త్రవితతి యర్జును వేఁడెన్. 53

సీ. సమయపక్షంబు లాజగజ్జాలములను
శమనుఁ డేత్తెఱఁ జదురెకుసరణి మొఱపి
యుగ్రభైరవనాట్యసముగ్రిఁ దనరఁ
బార్థుఁ డుఱుకాడి యుఱుకాడి పగఱఁ గూల్చె. 54

క. అవురా! శరమో, శరలా
ఘనమో, మేమెందు మున్న గనము, వినము, రా
ఘువ రావణ ఘోరరతిరా
హవ మిట్టిదె! యనుచు హనుమఁ డర్జును బొగడెన్.. 55

క. చిత్రాంగదాదివీరులు
చిత్రంబుగఁ బైఁబడంగఁ జెలఁగి నరుండా
శత్రువులఁ ద్రుంచె నొకతృటి
మాత్రంబున, సైన్యముల్ సమరమునఁ బఱవన్ 56

సీ. అద్ది వీక్షించి కర్ణుఁడు తద్దఁ గినిసి
కవిసి, యుత్తరుఁ బదివిశిఖముల నేసి,
రథముగుఱ్ఱాల నాఱుశరముల నడఁచి,
పఱపె నలుగుల నర కపివరులపైన. 5[illegible]

క. సింహపరాక్రముఁ డానర
సింహుఁడు గాండివము మీటి. చెచ్చెఱ దానిన్
సంహారణముఁజేసి, కడఁక
సింహార్భటిసలుపుచున్ విశిఖముల నేసెన్. 48

క. వీరాగ్రణి కర్ణుం డటు
వారించి చపల్ల బాణ వర్షముఁ గురిసెన్
ధారుణి, దివి, దెసలివియని
యేరికి గుఱుతింపరాఁక యొసక మెసంగన్, 59

క. తెంచున్ విల్లున్, శిఖతో
రాణించెడువీతహోత్రగానముఁ, గలనిలో
గానంబడెఁ గర్ణుఁడు; కురు
సేనలఁ దూర్యములమోగిసెఁ; జెలఁగిరి యోధుల్. 60

గీ. రవిసుతుఁడునిక్కుఁ, గురుజలరాశి యుక్కు;
నిక్కఁగాఁ బార్థుఁ డయ్యదియుక్కుఁ దక్కు;
నుక్కునిక్కుల, దక్కులఁ జిక్కి తూఁగు
టుయ్యెలట్టులఁ గురుసేన యయ్యె నంత. 61

గీ. సూర్యసుతుఁ గని సురపతిసూనుఁ డంత
సభలఁ బల్కెదు "నాసరిసమరవీరు
లేరు ధరణిని లే" రని యిప్పుడు చూప
వలదె బలిమిని! కర్ణ! పల్కులను ఫలమొ? 62

క. సురలు, నరులు. దివిషత్ప్రభులన్
బరికింతురె, చూపవలదె బాహాబలంబున్?
మఱి నుడివినట్టి జయపరుఁ
డరమా? మాటలకుఁ బోటుతనమున్ గలదే? 63

చ. అనఁ, "అభిమదావనం బనకదూషణాహతిఁ గొన్న దశక్షితీశమానమున్
దునియఁగఁ గొట్టినట్టిబలధూర్వహా! పోరొనరించి యాకిరా
తుని పెను, మన్ననోఁకునటు తో సిన మేటివి! కార్యభంగమున్
గని కనుమూసికొన్న ఘనగాండివి" యంచని కర్ణుఁ డాడినన్. 64

ఆ. పార్థుఁ డనియె ధర్మపాశబద్ధుఁడ నౌట
దుస్ససేనుదుడుకు, దుస్సహంపు
నీదునవ్వు చెల్లె నిజముగనచ్చోటఁ!
జెల్లఁగలదె యట్టిచెయ్వు లిచట? 65

క. అన, ధర్మహానిభీతిన్
వెనుదీసితొ? తప్పు నన్ను నెత్తిని బెట్టన్
గనియిట్లు జాఱఁగఁ జూచెదె?
కనఁబఱచెదె నేఁడు నీదుఘనభుజబలమున్? 66

ఆ. సంధి నడప నీరె సరిభాగమంచుఁ జే
గాన నడవిఁ బడితి వంతె, బలము
చలముఁ గలదె నీకు? సంశయ మగు మాకు!
వాదు లేల? చూపరాదె యిపుడు. 67

క. అని, కౌనివాలమ్ముల బో
రనఁ గురిసినఁ, దుండరించి రౌద్రుండై య
ర్జునుఁ డంతగాండివము చా
పమును గావించి శతముల్ బఱపించెన్. 68

క. దేవాసురసంగ్రామము
తేవన్ జృంభించె రణము; డీల్పడఁబోకే,
చేవన్ జెడకే, విడకే
భావించి వచింపరాక పరఁగి రి రువురున్. 69

క. తేరుల, వారువముల, రథ
సారథులను, డెక్కెములను, శరసముదయమున్
గారించుచు, వారించుచు,
మీఱుచు నొక రొకరి, వారు మెలఁగిరి కలనన్. 70

క. పాఱన్ దేరులు నభమున,
జేరన్ ధారుణికి నవ్వి! చెంగున నలుగుల్
దూఱన్ దనువుల! నెత్తురు
కాఱన్, బాఱన్ దొలంగఁగన రే పోరన్, 71

క. అర్జునుఁ డతికుపితుండై
దుర్జయుఁడౌ కర్ణుశరముఁ దుంచించి వెసన్
జర్జన్యునిగతి. మృగపతి
గర్జనల్ సలిపి వేసెఁ గర్ణుఁడు నలుగన్. 72

సీ. అనివిన్చి "యదె కను మాతని; నిడుదక
రములు, బంధురకంధరంబు వాని;
వెడదకన్ను లురమ్ము వెలయుచీరుని; నరు
గాశ్వరథంబున నలరువాని;
సకలకురుకుమారచాపశిక్షాచార్యు,
సంగ్రామదుర్జయు, సాంగవేది;
నీతివిశారదు, నిర్మలు, బుధవర్యు
ద్రోణు, దివ్యాస్త్రధురీణు, మహాన్యు;
తే. సుతునికంటెను నాకు గూర్చును మనమునఁ
బూజ్యు గురువర్యు మార్కొనఁబూనవలసె;
రాజధర్మంబు కడు దుర్భరంబు; రథము
నడుగని మ్మాతనిదెస కేడ్తుఁ గుమార! 7

క. విని యతఁ డది మది దిటవును
గని, యరదముఁ దోలె ద్రోణుకట్టెదుటికి; నా
ఘనుఁడు ధనుర్ధరుఁ డది కని
చను దేరఁగ నెదురు; నరుఁడు సాచి కరంబుల్, 79

క. గురునకు వందన మొనరించి
"పరిభవ మొందితిమి, యడవిఁ బడితి, మిడుమలఁ
గరఁగితిమి; వచ్చితిమి తఱిఁ;
గరుణింపు! విపన్ను లేము; కనలకుఁ డీరల్, 80

గీ. వెఱఁతు మున్నేఁచు మీరలు వేయఁగాని;
యనిన నరుఁడయి ద్రోణుండు సునిసితంపు
టలుఁగులను మీఁటె; నవి తునియలుగఁ ద్రుంచఁ
జేయ, ద్రోణుఁడు వేయింటి నేసె నడరి. 81

క. అవి యెల్లఁ దునిమి పార్థుఁడు
తవతవ గురునన్నిటన్ హుటాహుటి ముంచెన్;
దప్రదప్రుల వాని ద్రోణుఁడు
జవగతితోఁ జెండి, కప్పె సాయకవితతిన్. 82

క. గురుఁడో శిష్యుఁడో, యధికుం
డిరువురిలో నెవ్వ? రంచు నేర్పరుపఁగ రా,
కరుదొంది కనిరి విద్యా
ధర కిన్నర సురలు మిగులఁదన్మయు లగుచున్. 83

క. హరుఁడో యీగురుఁడో; యిం
కొరుఁడే నరుమార్గణంగ నోఁపఁగల ధను
ర్ధరుఁ! డంచుఁ గురుబలంబుల
మొఱసెఁ గలకలంబు నాల్గుమూలల నెందున్. 84

క. ఆతనిశరముల నీతం
డీతనివిశిఖముల నాతఁ డేర్చెఱఁ దఱుగున్;
ఆతఁ డితఁ డలుగు లేయుట,
ఘాతముసేయుటలుఁ గాంచఁ గాదెవ్వరికిన్. 85

సీ. వరుణదహనేంద్రవాయుదైవత్యములగు
శరముల గురుండు బరపిన, నరుఁడు వాని
దత్తదుచితంబులగు దైవతముల శరని
కరముఁ గురియించి నఱకు నక్కజముగాఁగ 86

క. ఎట్టెటుకడఁగిన గురుఁ డా
గుట్టెఱిఁగినయట్లు నరుఁడు గుఱిగొని కడఁకన్
అట్టె తొడరుచుఁ గొట్టినఁ
దట్టుకొనంలేక యతఁడు తల్లడపడియెన్. 87

ఆ. ఇంతప్రొద్దు పార్థునెదురుట ద్రోణుఁడే డె
బల్లిదుం డటంచుఁ బలుకనలసె
ననుచు వీరు లాడ; నంతలో ఖండించె
గురునిచేతివిల్లు నరుఁడు కోల. 88

క. అది కని యశ్వత్థామ భ
యదనారాచముల వైచె నర్జునునిపయిన్;
పదమదముఁజేసి నరుఁ డవి,
కదలించెను గురుతనూజుఁ గార్ముకవితతిన్, 89

క. గురునిన్ మించినవాఁ డని
గురుసుతు నగ్గింప సురలు, గురుబాణముల్
గురియించె నరుఁడు; వానిని
హరియించుచు గురుతనూజుఁ డమ్ములఁ జిమ్మెన్ 90

ఆ. అంత వాలుఁగోల లస్త్రసుతుఁడును నేసె
నవ్వి యవ్వి మెఱిసి యభ్రవీథిఁ
దాఁకి సోఁకి పోఁకి నూఁకయి, నుగ్గయి
ధాత్రిఁ దేలి తూలి నేలఁ గలసె, 91

క. నరుఁడంత శరద్వయమున
గురుసుతుచాపంబుఁ దేరు గుఱ్ఱంబుల భీ
కరముగఁ దుంచి విశిఖతతి
నెఱి పినఁ గృపుఁ డడ్డె నరుని; నిలిచెఁ బోరన్. 92

చ. ఇరువురు హస్తలాఘవము లేర్పడ మండుదవాగ్నులట్లు భీ
కరముఖులై మహోగ్రతర కాండములన్ దివి భూమియున్ దిశల్
మెఱయఁగ నించి పోరఁగను, మేదిని బొంగరమట్లు లాడె; సా
గరములు ఘూర్ణిలెన్, గులనగంబులు మ్రొగ్గి వడఁ[illegible]గన్. 93

ఆ. నిస్తులాస్త్రశస్త్రనిచయంబులను వాలు
డాలుఁ గేల నూని చాలతెవ్వ
పొడిచి, యడచి, యొడిసి, కడుకొని పోరిరి
విడక, తడవుకొనక, నడఁకు వడక. 94

క. ఇటు లేపుసూపి; రంత భృ
కుటి నటియింపంగ గడుసుకోలలఁ బార్థుం
డదె కృపుని నొంప, నాతం
డెఱుఁగతోఁపక యొదిగె; భీష్ముఁ డిదికని యెదిరెన్. 95

గీ. సేన, సేనానులును, నృపుఁజేరి భీష్ము
నండనిల్చిరి; సంకులాహవము జరిగె;
నెదురుపడువారి నెల్లఱఁ జదిమి నరుఁడు
నేరుగ సురనదీసూనుఁ జేరఁబోయె. 96

క. పెడబొబ్బ లిడుచు భీష్ముఁడు
కడుకొని సారథినిఁ గపినిఁ గార్ముకతతిచే
నడచినఁ; సారథి నొగఁబడె;
సుడివడి కపివీరుఁ డఱవఁజొచ్చెన్ బెలుచన్. 97

క. ఉత్తరుఁ దేఱిచి నొగ నిడి;
యుత్తలపడ కంచుఁ గపిని నోదార్చి, మో
మెత్తి కని, నిజపితామహు
మొత్తెను విశిఖముల నరుఁడు ముసిముసినగుచున్. 98

క. హరత్రిపురాసురరణమో,
హరినరకాసురులరణమొ, యసురసురల సం
గరమో? రఘునాయకదశ
శిరులరణమొ? యిదియనంగఁ జెలఁగిరి వారల్. 99

క. కుప్పించుఁ గోలల మేనుల;
నొప్పించు; మఱిఁ దేఱిపోరి నుగ్గాడుచు; లో
మెచ్చుచు నొండొరు, హెచ్చుచు;
విచ్చుచుఁ వచ్చుచును వారు వెలసిరి వీరుల్. 100

ఆ. అలసి సొలసితైన నని దొలఁగను; నాటు
నమ్మితైనఁ బెఱుక నమ్మనీను;
తొఁగగు నెత్తైనఁ దుమువంగ నెంచక
పెనఁగిరిసప్ప రెంత పేర్మిమగలో? 101

క. ఎంతకు నని తెగకుండిన
గాంతేయుం డలిగి ఘోరకార్ముక మొంటిన్
శాంతనవునెసను నాటిన
యంతన నొగ నూఁతగొనుచు నాతండొరిగెన్, 102

చ. అది కని క్రీడి సారథికి నవ్వల నూఁపి రథంబుఁ దోలునా,
నదలిచె నాతఁ డశ్వముల; నాకురువీరులు చూచుచుండఁ దే
రది చనె రాజరాజుకడ; కర్జునుఁ డంతటవిల్లు విరాటుచున్
గదిసినఁ; గర్ణుఁగాంచి గురునందనుఁ డాడెను క్రీడిఁ జూపుచున్.

ఆ. ఏమిసేయువాఁర మిందఱుఁగల్గియు
నీవు తక్క లేసి? నిఁదర్జుండు
రాజునుఱుకఁ బాతె రాధాసుతా! చూడు
మనిన; "మేలమాడె దట్టె?" యనుచు. 104

ఆ. రవిసుతుండు తాఁకెఁ; బరిముఖులుఁ దాఁకిరి;
తొలివాఁడఁగట్టె "తొలుమరద"
మనిన నుత్తరుండు ననునిడు విడుబోటు
గనని రణము నాకుఁ గాదు వశము. 105

చ. అన, నగి పార్థుఁ డాడెను భయంపడ నేటికి నేమగల్గ? దీ
తెనుసమరంబు; తేఁడదొ, నిరీక్షణఁ జేసెదు నెట్టుఁ గన్నృపా!
అనుజులఁ గూడి యుండెఁ గను, మా యభిమాన ధనుండు; వానికిన్
మన నిశితాస్త్రశస్త్రములమాధురిఁ జూపక మానవచ్చునే? 106

చ. అనఁ, జనదోలెఁ దేరు; నరుఁ డక్షమువచ్చినవారినెల్ల నే
పున నొరగంగ నేసి కురుపుంగవు పక్షము నాట నంబకం
బును దగవిూటి నెత్తురులు బుగ్గలువార్పఁగ; రాజు గుద్దఁడై
తను తెలుపాఱ, నెన్నుదురుగాడఁగ దూఁటెశరమ్ముఁ గట్టికిన్.

గీ. లెక్కసేయక దానిని గ్రిసిమరల
మార్గణము లేసె; నవి హతమార్చి రాజు
మరల నేయఁగఁ బార్థుండు పరిహరించె!
గుప్పి రిపువుకు మఱి నలుగులను మిగుల. 108

క. నరుఁ డంతట నాకురువ
యరదంబును దున్రింప, మఱొక టతఁ డెక్కి యుకే
యరవరలుగాఁగ పోరిన!
నరుఁ డాతని కార్ముకమును నడుమ ని దునిమెన్. 109

మ. మఱి యొంటిన్ గాని రాజు పోవఁ గని భీష్మద్రోణకర్ణాదు లా
తొర కంఠై నిలువంగఁ బోవఁ గని పార్థుం డంతఁ దీవ్రంబుగాఁ
బఱపెన్ గ్రూరతరాస్త్రముల్ మిగులఁగా, వారెల్లరున్ గాలుభీ
కరనృత్యం బివియుంచు నోపరయు కాఁకన్ బాఱి రివ్వాఁగతిన్. 110

క. కర్ణి సైంధవప్రవేఁపును, గర్ణభుజము
కడఁక నా దుస్ససేనుని పెడతలయును
మాని దుర్యోధనుని మణిమకుట మ్మట్టి
కొట్టి వారలు పరువులువెట్ట నగుచు. 111

క. అదికాంచి రాజు యోధుల
“కిదితగునా, భంగపాటు నొందక పఱవన్?
యెదిరినిఁ జంపుటొ, చచ్చుటొ
గదవిధి! వెనుదిరుగుఁడింకఁ గలఁగకుఁ” డనినన్. 112

ఆ. సమయ మరసి యరుల సమయింపఁగావలె;
నదను గానియెడల నడఁగ వలయు;
మానధనుఁడ! రమ్ము మా వెంటఁ; బోడియాఁ
బాఱిన భీతివేళఁ బనుచు! మఱుఁగు! 113

క. అనుచును యోధులు పనువిడ
జనపతియును బోయె; సవ్యసాచి కనుచు, బారి
హ్మాణులట్ల క్షితిరియుఁడు నీ
వును బాఱుటె! రాజరాజ! పోలునె కలనన్. 114

ఉ. ఎందుకుపర్వ! నీతలనెఱేమి తెగెన్? గురురాజ! ముందిఁకన్?
గ్రిందౌకఁ దట్టి కాచినది కాదె! తలంపిక మార్చుకొందువో!
ఘాంచెటుసేతువో! జయముఁబొందఁగ యీ విజయున్ జయింపఁగా
సందిది! లేవు పాచికలు, సొబలుమాయలు సాగిరా పెట్టు 115

క. కోఁతలనఁగాతుని రమ్మను;
భ్రాతను బిలు. వలువ లొలుచు పని నేర్పఁదినిన్;
నీతల భీముని కని నా
చేతులఁ దప్పింపఁగఁ బఱచెదవే? యనినన్. 116

ఆ. మాటపడఁగలేనిమాని దుర్యోధనుఁ
డలుగు లట్టి విజయుపలుకు లలుకఁ
గలుగఁజేయ, నోర్వఁగాలేక క్రిమ్మరెఁ
బ్రభునితోడు సనిరి ప్రముఖు లెల్ల. 117

—అర్జునుఁడు సమ్మోహనాస్త్రముచేఁ గౌరవులను మూర్ఛఁ గెడిపి పురికమరలుట.—

గీ. నలుగడల ముట్టుసేనల నరుఁడు గాంచి
యన్నదమ్ములపరితినల నెన్ని, రిపుల
జంపఁ దఱి యిది కాదు, భంగింప కుడిగి
పోవగా, దని మది నొక్కపూన్కి నూని. 118

క. సూతుని, రథరథ్యంబుల
ఖ్యాతిగఁ దాఁ గాచికొనుచు, గాండీవమునం
దాతతిసమ్మోహనశర
మాతం డెక్కించి మీటె నరిపటుభాటిన్.

క. ఎక్కుడఁగల నక్కడనే
చొక్కిపడిమె, నిదురవోవు చొప్పునఁ దిట్టిలోఁ
నక్కురుబలములుఁ బతితోఁ;
నక్కొంతేయుండు చూపి యది యుత్తరుతోన్. 120

ఉ. చీరలు లేకకుండమునుపే మనయుత్తరకోర్కెఁ దీర్పఁగన్
చీరలవస్త్రముల్, నగలు వేసని యూడిచి తెమ్ము పొమ్మనన్;
జేరకు భీష్ము! మూర్ఛయతనిన్ స్పృశియింపదు లేచియుండునా
ధీరుఁ డటన్న నుత్తరుఁడు తెచ్చి యనన్నియుఁ జేర్చెఁ దేరునన్. 121

ఆ. నరుఁడు రథము నంత నడుపంగఁ జెప్పంగ;
నేటిపట్టి లేచి యెలమి నతని
దాఁకరాఁగ, భీష్ముతినువ్వన పలుగుల
నించి, తేరుఁదోలిపించె నతఁడు. 122

క. అంతట మేల్కొని కురుభూ
కాంతుఁడు దెస లరసి, యల్కఁగని తాఁకఁగ న
క్కొంతేయుఁ గనిన; భీష్ముఁడు
చెంతకుఁగొనిఁ యతనిఁ;బలికెఁ జిఱున వ్వొలుకన్. 123

ఆ. కాన వేల, యింత గాఁ బడ్డపాటును?
క్రీడి మనల మూర్ఛఁగెడిపి యొడిసి
పిడికిలించియుండి కడవాల్రముల; నట్టి
కడఁగకుండె నిండుకార్యమునకు! 124

మ. తెనయంతేజను;దాఁకరాఁడు మము; నేతత్పార్థుసమ్మోహమో
హనబాణాహతి విస్మృతిన్ గనిన బాహాభాగ్యముల్ నమ్మి పో
జను నేయాతనిపై మఱిన్ మతియు; వత్సా! సాహసంబిద్ది! యో
జన లేకుండినబుద్ధి !! యల్లియగుచోఁ జూవౌట సిద్ధంబుపో.! 125

ఆ. అరయుకొఱకె, మాత్స్యావులఁ జెఱఁగొంటి;
వలసి తింక నేల నరునిఁ జెనఁక?
నాలతోడ నాతఁ డిరిగెడుగా, కింకఁ
జల మిఁకేల పురికిఁ జనక! కొడుక!! 126

క. అని యోదారిచి పరిముఖులఁ
గని యఱాఱడఁ బలికి, యేగఁగాఁ జేసి నదీ
తనయుఁడు సేనలఁ గూరిచి
కొనిచన, నదికాంచి యింద్రికొమరుఁ డలరుచున్. 127

ఆ. సఱకు వొత్తి యూఁది జ్యాటంకృతి నొనర్చి
కొంతిదవ్వు తఱిమికొనుచుఁ బోయి
యలుగులన్ బ్రణామ మందించి గురుభీష్ము
లకుఁ; విదిల్చె రాజు మకుటమణుల. 128

క. బిరుదులుగల గొడుగులు, బం
గరుసిడెములు వైచికొని మొగం బెత్తి సారం
బరుదారఁ "బోయి వచ్చెద!
మఱవకుఁ!!" డని చెప్పి రథము మరలిచి పురికిన్. 129

గీ. వత్స! మాతలితండ్రులు బందుగులును
దల్లఁకుచుందురు నినుగాంచఁ దలఁచి; త్వరగ
రథము వోనిమ్ము టన్న వైరాటి నరునిఁ
బొగడుచును వాయుగతిఁ దేరుఁ బోవఁ దోలె. 130

గీ. దారి రాజమ్మిభూజమ్ముఁ దరిసి, రథము
డిగి, మొదటియటు శాఖఁ గట్టించి చాప
శరములఁ; గిరీటశంఖధ్వజాదికములఁ
డొలఁగిచనఁ జేసి; తొలివేసములవరించె, 131

సీ; రథికుఁ డయ్యెను సారథి; రథికుఁ డయ్యె
సారథిగ; నుత్తరునిఁ గని సవ్యసాచి
విజయమందినదీవ్రుగ వెల్లడింపు!
మనిన నాశ్చర్యమును లజ్జయును భయంబు- 132

గీ. కలుగ వైరాటి "యిది యేటికార్య?" మనిన
"నదియె ప్రకృతము తగు" నన నర్జునుండు;
నీవనుపు నేను గాదందునే మహాత్మ!
యద్ది నాకు శిరోధార్య మగు నిజంబు! 133

గీ. అనుచు నుత్తరుఁ డనఁ; దశమియందు ముందు
బయలుపడనగుసత్య; మిప్పటి కిదెంతె;
అంపు గొల్లలఁ బురి నీజయంబుఁ జాట
ననుచు నరుఁ డన, నుత్తరుఁ డటులె యనుచు, 134

క. పఱపెను గొల్లల; వారలు
పురికేగిరి వార్త దెలుప ముందుగ; నటుపై
నరదము నడచెను; నటఁ బురి
విరటుఁడు తనవిజయవార్త వినుచునగరిఁ. 135

గీ. ఉత్తరుం డేడ? యనిన నావృత్త మెల్ల
వినుచుఁ దనవారు దిగులొంది విన్నఁబోయి
"భీష్మముఖధన్వు లేడ? యీపిన్నఁ డేడ;
యెడ లెఱుఁగఁడె? కందు నే కొడుకు మొగము? 136

గీ. పేడిసారథి; రథికుఁ డీపిన్నవాఁడు
గురుఁడుఁ భీష్ముఁడు గర్ణుఁడు గురుకొమరుఁడుఁ
గృపజయద్రథముఖుల వీఁ డెదురువాఁడె?
నరుఁడొ, హరుఁడొ కనంగ నుత్తరసుతుండు. 137

క. అని విరటుఁడు యోజనలో
మునిఁగెను, గోపకులు వచ్చి మ్రొక్కిడి జయం
బు నృపాలక! జయ" మన, నా
జనపతి యే మనిన, వారు "జయజయ" యనుచున్, 138

చ. అరదముఁ దోలఁగాఁ గొని బృహన్నల; నేఁడ్తె అమీఁటి పోరియు
త్తరయువరాజు భీష్మముఖదర్పితయోధవరాఢ్యమైన యా
కురుబలముల్ జయించి, మనగోగణముల్ చెఱఁబాపి తెచ్చె; యీ
పురికడ నుండె నాఁ దెలుపఁ బుచ్చిన, వచ్చితి మంచు మ్రొక్కినన్,

గీ. మనసులో నూరి మీఁఱి కన్గొనల జాఱి
గండములఁ బాఱ మోదాశ్రుకణము లలరి;
మోము విరిదమ్మి కాఁ; మెయి పులకరింప
గోపకుల మత్స్యుఁ డది మ్రిచ్చి మ్రిచ్చి యడిగె. 140

క. పేటను పేషులవిధుఁ
జాటింపఁగ మోఁగ భేరి సామశ్రిపతిపైఁ;
ఘోటక, గజ, పుణ్యస్త్రీ
కోటుల నెస రంపవలయుఁ గొమరుని కోడ్కొన. 141

సీ. మహితతూర్యంబులును గంధమాల్యములును
గొనుచు నుత్తర కన్యకాజనముతోడ
నేగవలె; విప్రబుధబంధు లెల్ల సచివు
లెలమిఁ జని సుతుఁ దోడి తేవలయు ననిన" 142

క. తెలిపి యిటు మంత్రులకు, వార్త తెచ్చినట్టి
వారి కిప్పించి భూషణాంబరనికరముఁ;
గాంచి కంకుని నెత్తి మొక్కఁటిని నిప్పు
డాడుదము మేలి యన్న, నాతఁ డాయధిపుఁ జూచి. 143

క. నీవు సుమహాశంబున ను
న్నావిప్రు; డాడంగనగునె నాకి" కన, నగి యా
భూవిభుఁ డాసైరంధ్రిని,
"సీనది తె" మ్మన్న నామె యిడె నది మొదటన్. 144

ఆ. అంత శమనపుత్రుఁ డనియె నామాత్స్యుతో
క్షితిని, సనుజతతిని, సతిని సైత
మొడ్డి యాడి యోటునొందె ధర్మసుతుండు;
జూద మేమి మేలు చూడు! మనిన. 145

— విరాటుఁడు ధర్మజునిఫాలమును సారెతోఁగొట్టుట. —

చ. అదియటులుండె, విప్రవర, యారసితే మనయుత్తరుండహా!
కదిసిన ద్రోణభీష్మముఖకౌరవసేన నడంచి తెచ్చె మా
కదుపుల; నెంతవిక్రమమొ! కంటిమె. వింటిమె యిట్టిపేరు; నిం
కెదిరెదురుండు? నంచన మహీశునిఁ గాంచి యుధిష్ఠిరుం డనున్.

సీ. కుంభభవముఖులైనట్టి కురుబలమును
గెలిచె నుత్తరుఁ డన నీకఁ బలుకనేమి?
భువినిమాత్రంబెకాదు పో, దివినినైన
నింతకంటెను భూవర! వింతకలదె? 148

క. అన; విని విరటుఁడు కంకునిఁ
గనియసె, "యటులయిన నిద్ది కలయే? మనగో
గణ మిటు వచ్చుట కల్లయె?"
యనఁగా, నాశమనపుత్రుఁ డనె నాతనితో. 148

సీ. "కల్లగా దదికలగాదు; కదుపు పురినిఁ
జేరుట నిజంబు; కౌరవసేన విఱిగి
పాఱుట నిజంబు; నీకుమారు చేత
నైనపని యిద్దికా, దన, ననియెతేఁడు.— 149

సీ. "అయిన దమయంతఁ బాఱిరే యరులుఁ గరుణ
వదలిరె పసులఁ? జేఁదప్పి కదుపు పురికి
వచ్చెనే కంక? యేమనవచ్చు నిన్ను?"
నన, గనలుగొంటుతో ధర్మతనయుఁ డనియె. 150

సీ. "వదలరవ్వారు; చేదప్పి పసులురావు;
అనిమొనల నాబృహన్నల యుండ నన్నుఁ
గురుబలమెకాదు సురదైత్యకోటినేనిఁ
దఱుముపసిపాపఁడైన; నుత్తరుఁడెయేల!" 151

క. అనఁ, గనిరూక్షేక్షణములఁ,
గనమేసారథుల, నిట్టికథలుంగలవే?
వినలేవో సుతుప్రతాపం?
బనయుఁడవో? యసూయగలవో యధిపులమెడలన్! 152

ఆ. అనిన, నగుచుఁ గంకుఁడనె "బృహన్నల రిపు
రాజిఁ గాంచి రేఁగి, రణముఁ గోరి
యుత్తరునకు సారథ్యవృత్తి నియోగించి,
యరులఁ దఱిమె రక్షకుఁడయి నిజంబు!" 153

క. అని యంతఁబోక, "చారుల
ననుపుము చాటింపఁగా బృహన్నలజయ" మం
చన వైచెఁగినిసి పతి సా
రెను ధర్మజునుదుట నెత్తురేఁగి తొనంకన్. 154

గీ. చట్టనన్ వచ్చి ద్రోవది యుట్టునెత్తు
రట్టె తనచీరచెఱఁగునఁ బట్టి, యుల్ల
వ్రేటుకన్నొత్తెఁ; గని జేఁడు వెఱఁగు నొంది
"యేమిది" యనంగఁ; గృష్ణ యానృపతి కనియె. 155

క. ఉత్తమవంశభవుఁడు, సద్
వృత్తుం డగు నితని రుధిర మెన్నికణంబుల్
పాత్తునొ ధర దుర్భిక్షము
మొత్తం బన్నేండ్లు కలుగు భూవర! వింటే!!

సీ. ఇల కొలుఁకనీక నెత్తురు నిలిపితి నిటు;
పూతభూసురరక్తనిపాత మొట్లుఁ
గీడు కావున, నీకొకకీడు ప్రబ్బి
నొల్ల కేనిట్లు సల్పితి నుర్విపాల!

క. అన; విరటుఁడు భయభక్తుల
వినతుండయి ధర్మసుతుని వేఁడఁగ; నతఁడున్
"నిను శేఁగించి తి నేనే!
నను వేఁడఁగ నేల" నంచు నగి వారించెన్.

ఆ. అంత భటుఁడు వచ్చి "యాబృహన్నల తోడ
నుండె నుత్తరప్రభుండు ద్వార
మందు జేనియాజ్ఞకై వేఁచి; జనసమూ
హమును గలదు బలిసి యనిన; నృపుఁడు.

క. తనయు, బృహన్నల నిద్దరఁ
బనుపు మిటుకుఁ; దక్కవారి బసలకుఁ జనని"
మ్మన, నరు నుత్తరు లోనికిఁ
బనిచెఁ; గడమవారి దూత బసలకు ననిచెన్.

గీ. నరుఁడు తనగాయమును గన, విరటు నెట్లు
చేరునో? యంచు మది నింత చింత జేసి
శమనపుత్త్రుఁడు తలచీర జార్చి, దాని
మఱుఁగు పఱచెను, వచ్చి రుత్తరుఁడు, నరుఁడు. 161

క. వచ్చిన నందనుఁ గౌఁగిటఁ
గ్రుచ్చుచు మూర్కొని శిరమ్ము ఱొమ్ము నిమురుచుం
హెచ్చినతమిని ముదశ్రులు
పుచ్చుచు, నిలువారఁ గనుచు భూవరుఁ డంతన్, 162

గీ. పరశురాముని గెల్చిన బాహుబలుని;
ధరణి నేకైకధన్వి నీ గురునిఁ; గర్ణుఁ;
గృపుని, గురుసుతుఁ; గురుపతిన్ గెలిచి తౌర!
కన్నకడుపులు ధన్యతఁ గనెను మన్న! 163

గీ. అని ప్రశంసింప నొల్లక యాసుతుండు
"కన వె నాభుజబలమును గన్న తండ్రి!
వలవ దీభ్రమ, యాబృహన్నలకరమ్ము
దండ, నరు చేరి పాశుపతమ్ము దండ!" 164

గీ. అనిన; విరటుఁడు నవ్వుచు "నద్ది సరియ!
సారథి ప్రశంస రథికుఁడు సలుపదగును,
రథికునంతటి మేటిసారథియె వలయు;
రథికి వలె నవ్యసాచిత్వపథకుశలత! 165

క. రథివట్ట్యేఁడ వగుదువు! సా
రథి యీతం డట్టివాఁడు! రణములరదె య
త్యధికంబుగఁ? గురువీరుల
కథ పఱుగుల పథ మదెట్లు కాకుండు నిఁకన్?

క. అన; వినవొల్లక తనయుఁడు
జనక! బృహన్నలను నీవ సంభావింపన్
జను! నన, గరచాలనవుం
ఘనతన్ సారథికి సలిపె క్ష్మాపతి యంతన్.

గీ. ఉత్తరుఁడు, నరుఁడు దవ్వుల బత్తి మీఱ
మ్రొక్కి దీవించెఁ గంకుండు; భూపునాజ్ఞఁ
గొని చనిరి వార లిర్వురుఁ, గొంతవడికి
క్ష్మావిభుం డేగె; నామీఁదఁ గంకుఁ డరిగె.

సీ. నరుఁ డంతఁ గాంచి యుత్తర కిచ్చె రణభూమిఁ
దెచ్చిన బొమ్మపాత్రికలఁ; బిదపఁ
పాంచాలితోఁ గూడఁ బాండవులెల్ల రా
నిసి ధర్మసుతుఁడున్న నిలయమందు
గోప్యంబుగా గోష్ఠిఁ గొనియుండఁ, బార్థుండు
ధర్మనందను ఫాలతలమునందు
గాయంబుఁ గని "యేమికం దది!" యననాతఁ
డామాత్స్యునకుఁ దన కైనవాద,

సీ. మదికతన సారెచే నతఁ డడచుటయును
నిలుపఁ దన నెత్తుర్ సోఁకంగనీక ద్రుపద
తనయ చీర చెఱంగునఁ దార్చుటాది
వినుచ భీముం డుదగ్రుఁడై కనలి లేచె. 169

సీ. నటుఁడు కనునిప్పు లార్చుచు "విరటుద్రుంతు
ననుచు ఘూర్ణిల్లెఁ, గవలుఁ బెన్గినుకఁ గొనిరి;
ద్రుపదపుత్రిక యెదిసేయుఁ దోఁపకుండె,
శాంతి శాంతి యటంచని శమనజుండు. 170

చ. తనయునిఁ జుల్కనాడ వినితండ్రిసహించునె? క్షాత్రముండదే?
మననిజరూపముల్ గనమి. మన్ననసేయమిలేని దోసమే?
మనమిట హాయిగాఁ గడపమా, యొకయబ్దీ మిదెల్లఁగానకా
తనికొకకీడు సల్ప, సడి తాఁకదె? శాంతము నూననొప్పదే? 171

క. కాని పరీక్షింపందగుఁ
గాన మనము తేఁపు వేగుకడ నృపుపీక్ష
బూని యధిష్ఠించి, మనలఁ
గాంచఁబఱచి యతనిరీక్షిఁ గందు మనంగన్. 172

గీ. అంద ఱదివిని 'యిదిలెస్స' యతఁడుమిమ్ము
క్షమనువేడిన మే; లటుకాక గద్దె
నెక్కి తని, కినిసినఁ బనిఁజక్కఁజేతు
మని చనిరి వారివారిగృహములకడకు 173

క. అని వినిచిన వైశంపా
యను గనిజనమేజయుండు హర్షముతోడన్
వినమితశిరుఁడై చెప్పం
గను వేఁడెను ముందునడచు కత కుతుకమునన్. 174

ఆ. మునిమనోబ్జభృంగ! ఘననీలరుచిరాంగ!
సదమలాంతరంగ! సాధుసంగ!
రాయదుర్గవాస! రవికోటిసంకాశ!
విబుధహృన్నివేశ! వేంకటేశ! ! 17

చతుర్థాశ్వాసము సమాప్తము.



# అశ్వత్థ భారతము

## విరాటపర్వము — పంచమాశ్వాసము.





క. శ్రీదయితా! త్రిదశార్చిత
పాదా! శ్రితవరద! ధర్మపథసంచరణా!
వేదవినోదన! దుర్జన
భేదన! శ్రీ రాయదుర్గ వేంకటరమణా!

క. అని నిటులాజన మేజయుఁ
గని వైశంపాయనుండు కౌంతేయులటుల్
సని, తమతమగృహముల రా
త్రిని నిదురించిరి సుఖోన్నతిని; నాపిదపన్.

క. నిసిఁ గడపి, వేగ మేల్కొని
సనిస్నానాదికముఁదీర్చి, సముచితగతివ
స్త్రసుగంధమణివిభూష
ప్రసవంబులఁ దాల్చిపత్నిభాత్రుసహితుఁడై.

సీ. మత్స్యవల్లభు వరసభామండపమున
కేగి, సింహాసనంబుఁ దానెక్కఁ బట్టి
మహిషితో ధర్మజుఁడు; పానమూని, యిందు
పట్టి కవ లిరు పక్కల జలిసి కొలువ. 4
గీ. నిరటుఁడుఁగ గొల్వుదీర నత్సుతోడ
నచటి కేతెంచి కని విస్మయంబునొంది
కంక! యిదియేమి యీరాచగద్దె నెక్కె?
తిప్పుడు నను గాంచియును లేవ వెంతమదమొ? 5
క. సైరంధ్రి యిట్టి దగునే?
వీ రిటుఁ దమపనుల మాని విచ్చేయుట కే
కారణమో? యనియన; నరుఁ
డా తేనినిఁ గాంచి మందహాసవదనుఁడై. 6
ఉ. ఆసతి దండయాత్రగ దిశావళి సల్పెను; రాజమూర్ధ స
న్మాన కిరీటముల్ నడచునవ్వుపుదిక్పాల సల్పె వీటికిఁ,
దానసచేతనధ్వజవితానము సల్పె ధరిత్రి నర్థులఁ;
మానితకీర్తిచంద్రికల నల్దిశలఁ దెలిపూతఁ బూసె నూ! 7
క. పరము మగు రాజసూయా
ధ్వరవర్తి! దిగంతకీర్తి! వరసత్యదయా
పరమూర్తి! ధర్మదీక్షా
పరతఁ సమవర్తి! చక్రవర్తి! ధరిత్రిఁ. 8

గీ. అమరసింహాసనంబునకైనఁ జాలు
శక్తియుక్తుఁడు, పాండుభూజానివంశ
శరధిపూర్ణశశాంకుఁ; డజాతరిపుఁడు
తగఁడె నీచిఱుగద్దె కీధర్మసుతుఁడు? 9

క. అన, విస్మయమందుచు నా
జనపతి ద్రోవదియె యీమె? సహజన్ములె యీ
మనుజపతి కీరు? భీమా
ర్జును లెవరో? జంటలెవరొ? చూపింగ వలెఁగా, 10

క. అని సంశయించు జనపతిఁ
గనుచున్ శార్దూలసింహగజసంహతితోఁ
బెనఁగిన. మల్లురఁగొని విఱి
చిన వానిని భీముఁ డితఁడె క్షితితలనాథా! 11

క. దామగ్రంథి యనంబడు
నామంబునఁ, దురగరక్షణక్రియఁ గొనుచున్
నీమందిరమున నుండిన
భీమబలుఁడు నకులుఁ డితఁడె వింటె నృపాలా! 12

క. ఘనమతి! తంత్రీపాలుం
డన నీగోపకులకెల్ల నగ్రేసరుఁడై
నిను మెప్పించిన ధీరునిఁ
గనుమదె సహదేవు, మాద్రికడగొట్టుసుతున్, 13

క. నీరాణికడ మెలంగిన
సైరంధ్రి యిమె యగ్నిజాత; క్ష్మావర! ద్రుపదో
ర్వీరమణుని సుత, యీసతిఁ
గోరుట మరణించెఁ గీచకుఁడు పవనజుచే. 14

క. ఆనిప లికి దేవవిభునం
దనుఁ డూరకయున్న, వాయుతనయుం డంతన్
గనుఁగొని విరటునిఁ, బార్థునిఁ
దన కేలిడి చూపు చిట్లు తెలకొనెఁ బలుకన్. 15

ఉ. ఖాండవమున్ దహించెఁ; గడఁకన్ దనుజావళిఁ గూల్చె; నెక్కొనా
ఖండలుగద్దెపై; మృడుని కార్ముకమున్ గొనెఁ గయ్యపూడి; యు
ద్దండత గాజఁ దెచ్చె సురతండముఁ దోలి; బృహన్నలాఖ్యతోఁ
పండుఁడు నా నిటన్ మెలఁగఁ జాలిన పార్థుఁ డితండెయంచనన్.

క. పొంగు మెయి నుత్తరుం డా
ముంగడ కరుదెంచి వెన్క ముం దరసెడి తం
డ్రింగనుచుఁ జూపి నరు, రణ
రంగమునం దితఁడె నన్ను రక్షించె నృపా! 17

శా. సింగంబట్టులఁ దూఁకి శత్రువితతిన్ జెండాడె; భీష్మాదులున్!
భంగంబొందిరి; రాజరాజుఁ బఱచెన్ బ్రాణాశ; సంగ్రామభూ
రంగంబందు రథప్రచోదనక్రియారంభుండనై యున్న నా
యంగంబుల్ వడఁకొందెఁ బార్థసమరవ్యాపారభారంబునన్. 18

క. సామాన్యసైన్య మనుకొని
దీమసమునఁ బోయి చూచి దిగులునఁ బాఱవం
గా మేకొనున స్వేడక
యీమహితుఁడు పట్టి గడవ నిడె నరదంబుల్.

గీ. తలఁపఁగా, నింద్రిమకుటంబు తలనుబొలిచె;
గాండివముఁదాల్చె; శంఖము, కపిపతాక
రథము లేతేరఁ గయిసేసి, రవిసహస్ర
తేజముఖమండలుం డయి యాజి కడరె,

క. సంకురవముఁ, బార్థుధను
ష్టంకారము; హనుమఘనపటాటోపంపుల్
హుంకారముఁ; దేరుజవపు
ఝంకారము చెవుడు దశదిశలకుల్ గూర్చెల్.

గీ. ఇద్ది ప్రకటింపవల దని యీతఁ డాజ్ఞ
నిడుట, నీకింతవఱ. కెఱిగింపనైతి;
వారె యిటు బయల్వడుట నేఁ బలుక వలసె;
నేల యిఁక శంక? యితని సేవింపు! మనిన.

గీ. ధర్మజునిపాదయుగళి నొాచలను మమ్మప
మాత్స్యుఁ దమిఁ గౌఁగిలించె నర్జునుఁడు, విరటుఁ
డలరి భీమ కిరీటిఁ గవలను గౌఁగి
లించి; ధర్మజుఁ గని దోయిలించి నిలిచె.

గీ. నరుఁ డనియెఁ దుస్తరంప్రతిజ్ఞాతవిధినిఁ
గడపితిమి వత్సరంబు త్వద్గృహవాస
గుప్తిఁ; విందులయట్లు లేకుండు లేక;
వసుమతీశ్వర! యుపకారభరము మీఱె, 24

క. అన, నతఁ డనె; నన్యుఁడనే!
వని కేళి రచుట వినుట వనఁటఁ గంటేఁ!
కనుకజప్పుడీజ నేఁ డిటు
కనుగొంటిని; పెద్దకలిమిఁ గంటిఁ మంటిఁ. 25

చ. ధరణి సమస్తముఁ గానుచు ధర్మజుఁ డేలుత! నేను బుత్రులుఁ
బరఁగ నమాత్యులుఁ సఖులు బంధులు నిల్చి తదాజ్ఞ నెప్పుడున్
శిరమునఁ దాల్చి కొల్చెదము సిద్ధము! కౌరవుతోడియుద్ధమే
జరిగినఁ బ్రాణమొడ్డి యని సల్పెద మంచన; నుత్తరుం డనుఁ.

క. మా రాజ్యమనెదు, శత్రులఁ
జేరవె మేనులును మనదుత్కీర్తి; నిన్న నేగాఁ
బాటించి రిపుల, నవి కొని
వీరలు దయ మనకు బిక్షవెట్టిరి కాదే! 27

క, ఇచ్చినవారల కవె మఱి
నిచ్చుట, కైకొనుట తగని. దిరువుర; కగుటన్
మెచ్చుగ మన యుత్తరనే
యిచ్చిన మనచుట్టరికము హెచ్చుగును గదే! 28

గీ. అనఁ, దనయు మెచ్చి జనకుండు పని చెేఁ దగిన
జనుల; వారు సుదేష్ణకు వినిచి సర్వ,
ముత్తర నలంకృతగఁ జేసి, చిత్రజాతు
మత్తగజమనఁ దోడ్తేర మగువ లటకు, 29

గీ. జలదపంక్తిని వెల్గు వర్జన్యలక్ష్మి
గతిని వచ్చిన నుత్తరఁగదిసి తెచ్చి,
యమతనూజుసమక్షమునందు నిల్పి
చేతులు మొగిడ్చి విరటుఁడు చేసిప్రణతి. 30

క. ఈముద్దియఁ గ్రీడికిఁగొను;
మామదిఁ గల కాంక్షయిద్ది! మావారలతో
నేమమున నిన్ను గొల్చుచు
నామనికికి సార్థకత నొనరఁ గూర్పింతుర్. 31

గీ. అనిన, ధర్మజుఁ డాపార్థుఁ గనియె; నరుఁడు
గురుఁడుగా నాటపాటలఁ గఱపినాఁడఁ!
గనుక ధర్మముగాదది; కోడలిగను
గొనుదవిూ మెను, నాఁమదికుతుక మదియు! 32

క, హరి మేనల్లుఁడు, విక్రమ
గరిమఁ ద్రివిక్రముఁడు; శీలకరుణాగుణభా
సురుఁ; డురు తేజుఁడు; వరసుం
దరుఁ డభిమన్యుండు నీదు తనయుఁ గొనుతన్! 33

గీ. అను, నిరతుఁ జేష్టి నా భాగ్య మంచు నలరె,
"నరుఁడు తగనాఁడె!" యని యుధిష్ఠిరుఁడు పల్కె,
నగుచు భీముఁడుఁ గవలుఁ గృష్ణయును మేలు
మేలనిరి. మ్రోఁగె సభఁ గరతాళరవము. 34

గీ. ధర్మజాదుల కంత నుత్తరకుమారి
చేతదండప్రణామంబుఁ జేయఁజేసి.
చెలిమిఁ బిలిచి యుత్తరుఁడు పంపెఁ జెలులతోడ,
నంతిపురమున కా కాంత యరిగె నంత. 35

గీ. సమయ మగుటను ముగియించి సభను సర్వు
లరిగి, యంతఃపురంబున నా సుదేష్ణ
భక్తి నొనరింపఁ బాదాభివందనంబుఁ,
గడఁగి యామెను ద్రోవది కౌఁగిలించె, 36

— ఉత్తరాభిమన్యుల వివాహము. —

సీ. పిదప ధర్మజుఁడును విరటుండు మౌహూర్తి
కులచేత శుభలగ్న మలవరించి,
పాంచాల యదుముఖ బాంధవ వితతికి
లగ్నపత్రికలఁ గాలరులచేతఁ
బంపి, మోదితులయి వార లన్యోన్యబ
హూకృతులయి యొప్పుచుండి, రచట
రారాజు భీష్మనిర్ణయము నొల్లక, ధర్మ
జుండు మిథ్యావిముఖుం డటంచుఁ

గీ. దూత నంపిన, నవ్వాఁ డజాతశత్రు
దరిసి, విషయంబు వివరింప "నపుఁడు బయలు
వడిన మునునాఁటి కజ్ఞాతవత్సరంపు
టవధి ముగిసె; నటని చెప్పియని చెవాని. 37

ఉ. సమ్మతి ధర్మపుత్రుఁ డనుజన్ములతోఁ జని, పూజసల్పి యా
జమ్మికి; దాఁచియున్న శరశస్త్రములన్ గ్రహియించి తెచ్చి వా
సమ్మగ నందె యొక్కెడను సాదరతన్ గొని మాత్స్యుడుత్సుకం
బిమ్మగఁ గూర్ప లగ్నము నిరీక్షణసేయుచు నుండె నెమ్మదిన్.

గీ. అదె. యుపప్లావ్య మనఁబడు నట్టి వీడు;
విరటు పార్థనపై నందు విడిసి ధర్మ
నందనుండు సతీభ్రాతృబృందసహితుఁ
డగుచు నందుండె లగ్న కార్యములఁ గనుచు. 39

సీ. బలదేవ, సాత్యకి. ప్రద్యుమ్న కృతవర్మ,
లక్రూరుడింద్రసేనాది యాద
వులఁ గూడి వాసుదేవుఁడు సుభద్రాభిమ
న్యులతోడ నాత్మబంధువులు బలియ;
గజరథాశ్వాందోళికాదులపై, విప్ర
సఖ, సతీసచివపరిశస్తుఁ డగుచు,
వచ్చెను, ద్రుపదుఁడు బలగంబులను గూడి
వచ్చె. నెదురేగి తెచ్చి వారిఁ

గీ. పాండవులు మత్స్యవిభుఁడును బరమప్రీతి
విడిదులనుడించి; రంతటఁ గడమనున్న
వియ్యురును, నెయ్యురును వచ్చి విడిసిరటఁ బ
త్స్వరబహూకరణముసంభ్రమము నెసఁగ. 40

గీ. ఇటు లుభయపార్శ్వసంబద్ధు లిష్టబంధు
వర్గ మెల్లను నిజవైభవములవచ్చెఁ;
బురము బహువిధశృంగారముల వెలింగి
కమలములతోడి సరసినాఁగఁ దురహించె. 41

క. వైవాహికవర వేదిక
దేవసభాంగణమువోలె దీపించెను; భూ
దేవ, సతీబాంధవ్యుఁడై
యావిరటుఁడు వచ్చి వేది నధివసియించెన్. 42

క. సాలంకృతయగు నుత్తర
హాళిన్ గొని తెచ్చి నిల్పి రా వేదిక; నా
వేళన్ ధర్మసుతుఁడు గో
పాలుండు స్వకీయులైనబంధులతోడన్ 43

చ. మత్తగజంబుపైన, నభిమన్యు నలంకృతు నిల్పి, మంగళా
యత్తపదార్థముల్ గొని బుధాశిషముల్ శుభతూర్యముల్ దిశల్
మొత్తఁగ; వందిమాగధజయధ్వను లెక్కుడఁగ వచ్చి, తద్వరున్
మెత్తనడించి వేదికకు మేకొని తెచ్చిరి, నిల్పి రందున్, 44

సీ. ఏకాంతత లేక నిజపురోహితుఁడు మంత్ర
తంత్రములఁ దీర్చ వేదిపైఁ దత్పరులయి
మాతృదంపతు లపుడు సమయసముచిత
కార్యకర్మకలాపముల్ కడపిరంత. 45

క. భృంగారుగాంగసలిలము
లం గడిగి వరుని పదజలజముల, విరటుం
డంగనతో దానవిధా
నాంగముగా ధారవోసె నల్లునకు సుతన్. 46

క. హాలిహారితధర్మజమా
త్స్యులు లలిఁ దెరవట్టి రావధూవరులకు, దో
యిలిముత్తెముల సతులు సే
సలు నొండొరుమూర్ధములను జల్లించి రొగిన్. 47

క. మాంగల్యముఁ గట్టించిరి
మంగళతూర్యములు పెలుఁగ మంత్రము లెసఁగన్.
మంగళహారతు లెత్తి శు
భాంగనలు సలిపిరి నర్తనాలాపనలన్.

క. తెర నెత్తిరి హరివిరటులు;
అరసి వధూవరులు గనుల నైశ్వర్యముగా
మురిసిరి. యొండొరు మాల్యము
లౌసి, విరిసి, పందిరులను బెట్టన్ దోడఁగెన్. 49

క. కలపులచూడ్కులుఁ; గలగల
పులచూడ్కులు; తేలు వాలు బుడిబుడిచూడ్కుల్;
వలపుల, సిగ్గుల చూడ్కులుఁ
జెలఁగఁ గనిరి, తమిఁ దనువులఁ జెఱుచెమట లిడన్. 50

గీ. వధువుతోఁగూడి వారిచి వరుఁడు; హోమ
కార్యమున్ దీర్చె సతికరగ్రహణవిధిని;
దనర సుత కల్లునకు మణిసగితభూష
ణాంబరగజాదులను మాత్స్యుఁ డరణ మొసఁగె, 51

క. నరముఖపాండవులను, హరి
హరిముఖయాదవవితతిని, నాద్రుపదోర్వీ
వరుని, దక్కినబంధుల
విరటుండు బహూకరించె వివిధక్రియలన్. 52

క. తనిసిరి దక్షిణవరభో
జనదానవిధానములను బ్రాహ్మణులు గడున్;
జనములుఁ, బరిజనములు, ముని
జనములు. జనపతులుఁ బొగడసాగిరి పెండ్లిన్. 53

క. అని వినిచిన వైశంపా
యను గనిజనమేజయుండు హర్షముతోడన్
వినమితశిరుఁడై చెప్పం
గను వేఁడెను ముందునడచు కత కుతుకమునన్. 54

ఆ. మునిమనోబ్జభృంగ! ఘననీలరుచిరాంగ!
[illegible]! సాధుసంగ!
రాయదుర్గవాస! రవికోటిసంకాశ!
విబుధహృన్నివేశ! వేంకటేశ! ! 55

విరాటపర్వము సమాప్తము.

ఈ కవిగారి ఇతరగ్రంథములు.

| | | |
|---|---|---|
| 1 | దండక రామాయణము | 4-8-0 |
| 2 | అనుభవామృతము | 3-0-0 |
| 3 | అశ్వత్థవేశత్రిశతి | 1-0-0 |
| 4 | గీతాదండకము | |
| 5 | గీతాసారపంచకము | |
| 6 | ఉత్తరగీతాదండకమహామోదు సంఖ్య | 0-4-0 |
| 7 | హరిగోవిందశతకము | 1-0-0 |
| 8 | హితము | 0-8-0 |
| 9 | భావగీతెగళు [కన్నడము] | 0-4-0 |



—ముద్రణలో—

1 సోమేశ్వరశతకము. 2 హరిభక్తిసారము.

ప్రాప్తిస్థానము:- "కవిరాజ" అశ్వత్థరావు కలుగోడు (P. o.)
రాయదుర్గం తా॥ అనంతపురం జిల్లా

ఈ గ్రంథము రాయదుర్గం శ్రీ జడేసిద్ధేశ్వర ప్రింటింగ్ ప్రెస్సునందు ముద్రింపబడెను. తా॥ 13-6-59.